# ఆదర్శజీవులు

రచన

ఆంతొనీనా కొప్తాయెవా

తెనుగు

అట్లూరి పిచ్చేశ్వరరావు

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ.

# IVAN IVANOVICH



ANTONINA KOPTAYEVA

*Translated by:*

A. PITCHESWARA RAO

VISALAANDHRA PUBLISHING HOUSE,

VIJAYAWADA.



# 1

క్రమక్రమంగా తీరం దూరం ఔతోంది. నీటిఅంచున మిట్టపల్లాల కొండలు.

"ఇప్పుడుగాని ఆ తీరం అందమూ, కొండల అందమూ సరిగ్గా అర్థంకావడంలేదు: అనుకుంటూ ఎవరికో వీడ్కోలు చెబుతూన్నట్టు చేయూపింది ఓల్గా; కాని దూరాన కొండలు తప్ప మరింకేమీ కన్పించడం లేదు; ఓడరేవులో భవనాలు కన్పడ్డం మానేసే చాలాసేపైంది.

ఇంకాస్సేపటికి ఒడ్డుకెళ్ళి కొట్టుకొంటూన్న అలల నురుగు గూడ కన్పించడం మానేసింది; పచ్చని పచ్చిక కప్పుకున్న చిన్నచిన్న కొండలుగూడ వెనకున్న పెద్దపెద్దకొండల్లో కలిసిపోయినై. సముద్రంలో లేచే అలల్లోకి తీరమంతా మునిగిపోతోందా అనిపించింది.

వెనక్కి తిరిగి, ఓడ ముందుకి చూచింది ఓల్గా. ఈ గాలి చల్లగా తాకింది బుగ్గల్ని కొరుక్కు తినబోతున్నట్టు. సముద్రంమీద ఏడురోజులు చెయ్యాలి ప్రయాణం!

"ఈ ఓడ ప్రయాణంనాకు పడుతుందో, జబ్బుచేస్తుందో" అనుకున్నది ఓల్గా తనలోతాను నవ్వుకుంటూ. "ఇదివరకు బాగానే చేశానుమరి ఓడప్రయాణం. చెప్పలేం; ఎనిమిదేళ్ళయ్యిందాయె. నాన్నా, పిల్లలూ కన్నీరు విడిచారు సాగనంపుతూ; నిజమేమరి. నేల అంచులు చూసేందుకని బయల్దేరానాయె."

ఓల్గాకి ప్రయాణమంటే ప్రాణం. కొత్తచోటుల్ని కొత్తకొత్తమనుషుల్ని చూస్తే అదొక వింత ఆనందం.

ఉదయం ప్రారంభమయ్యే స్థలం యిది. తన మాతృభూమిలో ఒక చివరినుంచింకొకచివరికి ప్రయాణం చేసేందుకు ఎనిమిదిగంటలు తీసుకుంటుంది వెలుగు. చేతిగడియారంవంక చూచింది. ఉదయం ఐదుగంటలు. పశ్చిమ సరిహద్దుల్లో చీకటి పడుతోందన్న మాట. ఆ సరిహద్దుల కవతలివైపున తీవ్రంగా చెలరేగుతోంది యుద్ధం. మేనెలలో, హిట్లర్ సైన్యాలు డెన్మార్క్‌ని ఆక్రమించుకుని హాలెండ్‌లో ప్రవేశించినై; దక్షిణాన లక్జెంబర్గ్ దాటి బెల్జియం చేరుకున్నై. విమానాల యుద్ధం మరీ భయంకరంగా వుంది. దాడులు చేసే విమానాలరొద, బాంబులుపడ్డతర్వాత పొగమయంగా కన్పించే బీభత్స దృశ్యాలు ...'వీటికీ, డచ్ చిత్రకారుల కుంచెలు చిత్రించిన డచ్ జీవిత సుందరరూపానికీ పోలికెక్కడ?' అనుకున్నది ఓల్గా. దర వెర్‌హారెన్ కవితలో ప్రత్యక్షమయ్యే పారిశ్రామిక బెల్జియం దేశాన్ని గుర్తుకు తెచ్చుకుంది.

అలాగే, దూరంగా యెక్కడికో చూస్తూ "యుద్ధం!" అనిఅనుకున్నది బిగ్గరగా.

ఇంతవరకూ పెన్సిల్ గీతలా కనబడుతున్న తీరంగూడా సముద్రంలో కలిసిపోయింది. ఇంక మమ్మల్ని బంధించే సంకెళ్లేమున్నయ్యన్నట్టు అలలు మిన్నుముట్టుతున్నై. ఈ సముద్రాన్ని దాటాలి; ఎంతత్వరగాదాటితే, అంతమంచిది!

మధ్యాహ్నానికి గాలివిసురుకూడా బాగా యెక్కువైంది. ఓడ పైభాగంలోకెళ్ళి, అక్కడినుంచి సెలూన్‌లోకి వెళ్ళాలంటేనే గగనమైపోయింది. తలుపుదగ్గర తావ్‌రోవ్ అనే ఎంజినీరెదురయ్యాడు. అతన్ని చూడడం యిది మూడోసారి. మొదట ప్రిమోర్స్కలోని యేజన్సీ దగ్గర; తర్వాత ఓడ యెక్కబోయేముందు నావలో. చూచి పరిచయం వున్నట్టుగా తల ఆడించింది ఓల్గా.

"ఇంతవరకు మనం యెప్పుడూ కలుసుకోలేదనుకుంటాను" అన్నాడతను నెత్తిమీద టోపీతీస్తూ; తలంతా జుట్టు వొత్తుగా మెరసి పోతోంది.

"కలుసుకోకేం, కలుసుకున్నాం" అన్నది ఎత్తిపొడుస్తూన్నట్టు. అంతకు పూర్వం తనదారిన తాను పోదామనుకున్నదల్లా, చేయిగూడా అందించిందతనికి, "నాపేరు అగ్లానోవా — ఓల్గాపావ్‌లోవ్నా" అంటూ.

ఇద్దరూ కలిసెళ్ళి, కిటికీ ప్రక్కనేవున్న టేబుల్‌దగ్గర కూర్చున్నారు. అలలు మరీ ఉవ్వెత్తుగ లేస్తున్నై. ఓల్గా కూర్చున్నచోటికి, అలలతోపాటు లేచి, ఓడ గవాలున క్రిందికి పడడం గూడ కన్పిస్తోంది. చూస్తూంటే యేమంత బాగాలేదు.

ఇంకా ఓడ ఊపుకీ, దొర్లుడుకీ ఓల్గా అలవాటు పడలేదేమో; లేచి, కిటికీవైపుకి వీపు తిప్పి కూర్చుంది.

చేతనైన జాగ్రత్త పడుతున్నా కొద్దిగా," అన్నది, కోటుతీసి పక్క కుర్చీమీద వేస్తూ.

"కావలసినంత సూర్యరశ్మిని పట్టుకొచ్చారు వస్తూవస్తూ" అన్నాడు తావ్‌రోవ్, ఆవిడ చేతుల కపిలవర్ణంచూచి అప్రయత్నంగానే.

"ఇదంతా సూర్యరశ్మి ప్రభావం అనుకుంటున్నారేమిటి? కాదు" అన్నది ఓల్గా. చేతిగడియారంగొలుసు సర్దుకుంటూ; "మా తాతగారు మాంచి బలమైన జిప్సీ; నల్లని వెండ్రుకలూ ఆయనానూ. మామ్మామ్మవి చక్కని నీలి రంగు కన్నులు, తెల్లని జుట్టూనూ; ఆవిడ జుత్తెప్పుడు తెల్లబడిందో యెవరికీ తెలియదు కూడాను. ఇక వారి సంతతి అంతా నల్లనిజుత్తూ, నీలికన్నులూ నేనొక్కదాన్ని తప్ప బుట్టాను.."

"ఐతే మీజాతివారికేమంటే ఇష్టమన్నమాట" అన్నాడు తావ్‌రోవ్, హాస్యంగా.

"ఎవరి యిష్టప్రకారంవాళ్ళు, టీచర్లున్నారు. గాయకులున్నారు. ఎంజినీర్లున్నారు. మానాన్నగారు కెమిస్ట్రీప్రొఫెసర్. ఆయనకి రసాయనిక శాస్త్రం అంటే అమితమైన యిష్టం. ఆయన చెప్పినట్లు యింకెవ్వరూ చెప్పలేరు ఆశాస్త్ర పాఠం. ఇంతెందుకు దానిపేరంటేనే గిట్టదు నాకు. ఆయన చెబుతూంటే మాత్రం చెవులు కోసుకుంటాను. అలా అని యింటిదగ్గరా యేమీ చిరాగ్గా వుండరు; కాకపోతే కాస్త పరాకు. మా అమ్మచనిపోయి చాలాకాలమైంది; ఐనా మళ్ళీ

పెళ్ళిచేసుకోలేదు." అంటూ నాన్నగారిని గురించి నవ్వుతూ మాట్లాడుతూన్నదల్లా, వున్నట్టుండి, ఒక్కసారి యేదో దీర్ఘా లోచనలో పడిపోయింది ఓల్గా.

"మరి మీరు ? మీరేంజేస్తారు ?" అనడిగాడు తావ్‌రోవ్ మెల్లగా.

"నేనా ?"అంటూ కనుబొమలు ముడిచింది ఓల్గా ; కాని తావ్‌రోవ్ ముహంమీది కౌతూహలం చూచి, "ప్రస్తుతం యేమీ చెయ్యడంలేదు" అన్నది; "అంతే నాకిష్టం లేకపోవడం మూలాన్న కాదు; నాకు సరిపడిందేమిటో నాకే అర్థంకాక." తనంటే తనకే విసుగుపుడుతోంది. ఐనా యీ రహస్యాలన్నీ యితనితో చెప్పడందేనికి ? క్రింది పెదవి కొరుక్కుంది. ఏదే మైనా ప్రారంభించింది ముగించాలిగదా! ఏమైనా సలహాగూడా యిస్తాడేమో. "చాలా ప్రయత్నాలు చేశాను. ముందు మెషీన్‌బిల్డింగ్ (యంత్రాగారం)లో చేరాను ; అది పూర్తిచెయ్య లేదు. తర్వాత ఎకౌంటెన్సీ (జమాఖర్చులు) శాఖలోచేరాను. మళ్ళీ మావారి సలహా ప్రకారం మెడిసిన్ (వైద్యం) చదివాను. అదీ మధ్యలోనే ఆపేశాను. శారీర శాస్త్రం అంటేనే గిట్టేది కాదు నాకు. తర్వాత ఇంగ్లీషు చదవడం ప్రారంభించాను ; అదీ పూర్తిచెయ్యలేదు" అన్నది.

అని ఆగిపోయింది. మాట్లాడ్డం మానేసి గాలికొకసా రిటూ, ఒకసారటూ లేచిపడుతున్న కిటికీ తెరలవంక చూస్తూ కూర్చుంది.

"బహుశా, మీరింతవరకూ మీకేది యిష్టమో తేల్చుకుని వుండరన్నమాట" అన్నాడు తావ్‌రోవ్ మెల్లగా, "అదీ కార

ణం. లేకపోతే యిన్ని ప్రయత్నాలూ, యిన్ని పొరపాటులూ జరగవు. అందుకనే చేసిందంతా వృధాఐంది."

"నిజమే వృధాయే అయ్యింది" అన్నది ఓల్గా నిరాశగా "ఎవరైనా యేం చేస్తున్నారని అడిగితే తలతీసేసినట్టుంటుంది."

సరిగ్గా అదే సమయానికి టేబుల్‌మీదున్న గ్లాసులూ, ప్లేట్లూ వొరిగి ఓల్గా వొడిలో పడినంత పనైంది. వెయిటర్ పరుగెత్తుకుంటూ వచ్చాడు సాయం చేసేందుకు.

"తుపానొస్తున్నట్టుందే. వెళ్దాంపదండి. వెళ్లిచూద్దాం రండి. నేనెప్పుడూ సముద్రంమీద తుపాను చూళ్ళేదు" అనఎది ఓల్గా.

"ఓహ్హో, మీకిలాంటివంటే హుషారన్నమాట" అంటూ నవ్వాడతను.

"ఆఁ, కాదు కాదు, నేనసల్తొత్తి పిరికిదాన్ని. ఐనా యిది చూడాలనిపిస్తోంది."

ఇద్దరూ కలసి డెక్ (ఓడ పైభాగం) మీది కెళ్ళారు. గాలి బాగా జోరుగావుంది: నిటారుగా నిలబడడమే కష్టంగా వుంది. ఎటుచూచినా అలలు పెచ్చుమీరిపోతున్నై. పర్వతాల్లా లేచి విరుచుకు పడుతున్నై. గాలి వూపుకి నీటితుంపరలు వర్షంలా పైకి లేచి కిందికి పడుతున్నై. సముద్రం అంతా నురుగు కట్టి మిన్నును ముద్దుపెట్టుకో బోతున్నట్టు ఎగిరెగిరి పడుతోంది.

"ఏం తుపా నేం తుపాను!" అన్నాడు తావ్‌రోవ్, ఓల్గా చెవి దగ్గర నోరుపెట్టి, "యింకా మహా వుధృతంగా వుండుం టుంది దూరాన యిక్కడిలా వుందిగాని."

"దీన్నేనా నావికులు నైన్త్‌వేవ్ (నవమ కెరటం)అనేది?" అనడిగింది ఓల్గా తావ్‌రోవ్ పట్టునుంచి భుజం సడలించుకుని, ప్రక్కనున్న ఉక్కుతీగ పట్టుకుంటూ.

"ఊఁ. యిదేమరి. ఇంతెత్తున వస్తూంటే" అన్నాడు, ఓల్గా తనపట్టునుంచి తప్పించుకున్నది గమనించనట్టు. "ఇదిగో యిదీ!" అంటూ, మొఖంమీద ఫెడీల్మని కొట్టబోయిన కెరటాన్ని తప్పించుకున్నాడు. ఇంతలోకే యింకో కెరటం లేచి కాళ్ళదగ్గర పడింది. "ఇక లాభంలేదు; పోదాం పదండి, తడిసి ముద్దయి పోతాం."

"ఏం ఫర్వాలేదు. తడిస్తే తడుద్దాం. గోరువెచ్చగాఫుంది ఆకురాలు కాలంలో ఐతే కష్టమేనేమో గాని. గడ్డకట్టుకు పోతాం. ఇప్పుడు తెలుస్తోంది నాకు పల్లెకారుల పనంటే యేమిటో. అంత చిన్నచిన్న పడవలమీద యెట్లా వెళ్తారో యిలాంటి పెద్దపెద్ద కెరటాల సముద్రంలోకి!" అంటూ ముహం మీదపడే కురుల్ని ఒకచేత్తో వెనక్కి నెట్టింది.

"ఒకసారి ఓల్గా పల్లెకారులు సముద్రంలోకి ప్రయాణం కావడం చూశాను. ఎండకి యిసుక మండిపోతోంది ఆవాళ. పల్లెపేటంతా కట్టకట్టుకు వొచ్చినట్లుంది వాళ్ళని సాగనంపడానికి. వాళ్ళందరి ముఖాల్లోనూ యేదో బాధ, పరితాపం, ఆదుర్దా. ఇప్పుడదంతా అర్థమౌతోంది నాకు. ఆ కెరటాలు చూడండి! ఏదో పిచ్చి అంధశక్తి—దాని కెదురీదే మనిషి!"

"నిజమే! చాలాకష్టం"అని అంగీకరించాడు తావ్‌రోవ్. "సముద్రంతో తలపడాలంటే కాకలుతీరిన వాళ్ళయి వుండాలి."

# 2

తెల్లవారి నట్టుంది. సగం తెరచిన ద్వారంలోంచి ధవళ కాంతి జాలువారుతోంది. గోడల్లోకి బిగించిన మంచాల దగ్గర కొచ్చేప్పటికి మసక మసగ్గా వుందా వెలుతురు. ఇదివరకటి లాగానే యింకా వూగిసలాడుతూనేవుంది ఓడ.

ప్రక్కమీద ఒకవైపు కొరిగి గదంతా కలయజూచింది ఓల్గా. ఎవళ్లూ లేవాలనుకుంటున్నట్టు లేదు. తనకీ ఏమంత యిష్టంగా లేదు. తిరిగి తలగడమీద తల ఆన్చింది. ప్రయాణీకుల్లో యెక్కువమంది గత మూడు రోజుల్నుంచీ మంచాల్నే అంటిపెట్టుకు నున్నారు. కాని ఓల్గా మాత్రం మధ్యమధ్య లేచి అప్పుడప్పుడూ పచార్లు చేస్తూంది. అది చూచి తావ్‌రోవ్ గూడా పొగిడాడు ఒకటి రెండుసార్లు. అతను పండుకునేది ఈ గదిలో కాదు. కాని ఓల్గాలాగానే అతనూ సెలూన్‌లోనే భోంచేస్తున్నాడు. ఈ ఓడలో సెలూనే భోజనాలగది.

"మంచి హుషారైనవాడు" అనుకున్నది ఓల్గా; అతని ముఖమూ, ఆ మనసు విప్పి మాట్లాడడమూ తలచుకుని, ఇంతలోనే ఆవిడ ఆలోచనలన్నీ మళ్లీ తన భర్తవైపుకు మళ్లాయి, త్వరలోనే కలుసుకోబోతోంది అతన్ని. ఛాజ్మా బంగారు గనుల్లో సర్జెన్ (శస్త్రవైద్యుడు) గా పనిచేస్తున్నాడాయన రెండేళ్లనుంచి. తానూ, తనచిన్ని కూతురూ మాస్కోలోనే వుండిపోయారు తన తండ్రితోపాటు. మాస్కోలో ఇంగ్లీషు కోర్సు తీసుకుంది తాను. క్రిందటి వేసవి సెలవుల్లో భర్త మాస్కోకు వచ్చాడు. ఈ సంవత్సరం గూడా వస్తానని చెప్పాడు. కాని పరిస్థితులు కలిసిరాలేదు.

అందర్నీ శాశ్వతంగా విడచిపెట్టి వెళ్లిపోయింది తన చిన్ని. "ఆ వార్తవిని యెంత బాధపడ్డారో" అనుకున్నది ఓల్గా. "అసలు మేమిద్దరమూ ఆయన్తోపాటే వెళ్లిపోవలసింది. అందరమూ ఒకచోటే వుండవలసింది." ఆ విషయం తలచుకుంటే చాలు గుండె బరువెక్కుతుంది. కళ్లనీళ్లు తిరుగుతై. "ఇక వారి నెప్పుడూ వదలి వుండగూడదు." అని నిశ్చయం చేసుకుంది కళ్లనీళ్లు తుడుచుకుంటూ. "నేనేమీ పొడిచెయ్యక పోతే మానె, కనీసం వారికి దగ్గరగావుండి, వారు పడే శ్రమలో పాలుపంచుకుంటే అంతేచాలు" అనుకుంది.

ఇంతలో జనం అంతా మేల్కొన్నట్లైంది. పక్కల్లో అందరూ కదులుతున్నారు, దగ్గుతున్నారు, మెల్లమెల్లగా మాట్లాడుకుంటున్నారు. ఓడ యింకా ఊగిసలాడుతూనే వుంది. మరీ ఒక్కోసారి పెద్ద కెరటం వచ్చి కొట్టినప్పుడు, ఓడంతా వణకిపోయినట్లై పోతోంది; తర్వాత నెమ్మదిగా నిట్టూర్చి మళ్లీ పైకి లేవబోతుంది, ఇంతలోనే యింకో పెద్ద కెరటంవచ్చి మళ్లీకొడుతుంది. ప్రతిసారీ ఓడ పైభాగంలో నీళ్లు పడుతూనేవున్నై.

ప్రక్కనే పండుకున్న ఒకతను సముద్రపు జబ్బుతో ఊఁ అరుస్తున్నాడు. "అసలు చేరుకుంటామా, సముద్రం యిట్లాగే వుంటే!" అనుకుంది ఓల్గా.

ఆ ఆలోచనతో శీతలం కమ్ముబోతున్నట్లైంది, అంత నిరుత్సాహం కలిగింది. వెంటనే లేచి దుస్తులు మార్చుకుంది. గబగబా నిచ్చెనమెట్లెక్కింది. ఓడ పైకిలేచి కిందికి పడుతూండడం మూలాన, నిచ్చెన మెట్లమీద కాలూనడమే కష్టమైపోయింది. ఎలా గోలా, డెక్ మీదికి వెళ్లిపోవాలి!

సముద్రం యింకా తెల్లగానేవుంది. అంతా సాగర మధనం లాగుంది.

"ఇదన్నమాట ప్రకృతి ప్రళయరూపం అంటే" అనుకున్నది ఓల్గా, ప్రక్కనే ఉక్కుతీగని పట్టుకుని, వచ్చిపడే కెరటాల్నీ, ఓడ పొగగొట్టాన్ని తాకుతూ పరుగెత్తే మేఘాల గుంపును చూస్తూ.

ఒక వైపున డెక్‌మీద నీరు ధారాప్రవాహంగా వుంటూనే వుంది, ఐనా నావికులు యెవరిపనులు వారు చేసుకుంటూనే వున్నారు. ఓల్గా ప్రక్కనుంచి వెళ్లినతను యీల గూడా వేస్తున్నాడు. బహుశా వీళ్లందరూ కాకలు తీరినవాళ్లే ఐవుంటారు, లేకుంటే యింత భయంకరమైన తుపానన్నా భయంలేకుండా యెందుకుంటారు? ఓల్గాకూ్కడా ధైర్యం వచ్చింది. అక్కడినుంచి పై డెక్‌మీదికి బయల్దేరింది.

గాలి ఝుమ్మని వీచింది. ఊపిరి పీల్చడమే కష్టమై పోయింది. ఐనా పళ్లు బిగబట్టి, అలాగే ముందుకెళ్లింది ఓల్గా. వయసులోవున్నది, బలమైన మనిషి. ఈ గాలికే లొంగి పోతుందా!

"ఆగండాగండి. లేకుంటే సముద్రంలోకి పడిపోతారు! ఆగండి నేనొస్తున్నా." అని వినిపించింది పరిచయమైన కంఠం.

పై డెక్‌మీదికెళ్లే నిచ్చెన స్తంభాన్ని పట్టుకుని, అలాగే నిలబడి తలెత్తి చూస్తే, తావ్‌రోవ్ కన్పించాడు.

"ఏం ఫర్వాలేదు. నేనేం యీకనిగాదు గాలికెటుబడితే అటు కొట్టుకుపోవడానికి. నాకేం ఫర్వాలేదు." అన్నది.

ఇద్దరూ కలిసి ఉదయం ఫలహారానికి వెళ్లారు. ఫల హారం తీసుకోవడం ఐపోయింతర్వాత "మీకు చదరంగం ఆడ డం వచ్చునా ?" అనడిగాడు తావ్‌రోవ్.

"ఓడ యిలా వూగిసలాడుతూంటే యెట్లా ఆడగల మండి" అని యెదురు ప్రశ్న వేసింది ఓల్గా. కెరటాలు చింది నీరు టేబుల్ మీదగూడా పడుతూంది.

"సముద్రంలో ఆడేందుకు ప్రత్యేకమైన చదరంగం వుంది. చదరంగం మీద కొయ్యముక్కలుంటాయి నిలువుగా. ఆడే బొమ్మలికి మధ్యలో గాడి వుంటుంది. ఈగాళ్లకి ఆకొయ్య ముక్కలు సరిగ్గా సరిపోతాయి."

మొదటి ఆటలో తావ్‌రోవ్ అంతగా దృష్టి కేంద్రీకరించ లేక పోయాడు. ఓల్గాయే గెలిచింది. అదిచూచి రెండోసారి జాగ్రత్తగా ఆడాడు; ఐనా యీ సారి గెలుపూ ఓల్గాదే.

"ఎవరు నేర్పారు మీకింతబాగా ఆడడం ?" అనడిగాడు ఆశ్చర్యంగా.

"మావారే," అని చెప్పింది ఓల్గా. "అవతలి ఆటగాడు సమర్థుడైతే గెలవడం చాలా కష్టం. ఏజబ్బు ఎప్పుడు ఎలా పరి ణామం చెందుతుందో తెలుసుకుని, దానికి తగిన శస్త్ర చికిత్స చెయ్యడం యెంత కష్టమో యీ ఆట ఆడడమూ అంతే కష్టం అనే వారాయన. నాకు శస్త్ర చికిత్సనా్నా, వైద్యం అనా్నా అంతగా గిట్టదు; నెత్తురు చూస్తే చాలు కళ్లుతిరుగుతై నాకు. ఐనా ఆ క్లిష్టసమస్యల్ని పరిష్కరించడం యెట్లాగో తెలుసు కోవాలని యీ ఆట నేర్చుకున్నాను."

# 3

"ఐతే మీభర్త సర్జన్ అన్నమాట" అన్నాడు తావ్‌రోవ్ ఆలోచించుకుంటూన్నట్టు. రెండురోజుల తర్వాత మళ్లీ డెక్‌మీద కూర్చుని మాట్లాడు కుంటున్నప్పుడు "ఆయన్ని గురించి నేనూ విన్నట్టే వుంది. అర్జానోవ్. ఔను. ఔనౌను. విన్నాను. వైద్యశాస్త్రంలోకల్లా శస్త్రచికిత్స గొప్పది. అదంటే యిష్టం వున్నవాళ్లు యెంతమంచైనా చేయగల్దురు."

"ఒక ప్రత్యేక రంగంలో పనిచెయ్యాలంటే, ఆరంగం అంటే ప్రత్యేకమైన యిష్టం అంటూ వుండాలనా మీవుద్దేశం?"

తావ్‌రోవ్ నవ్వాడు.

"నిజమే మరి. నా వుద్దేశం అదే. మరి మీరు మెషిన్ బిల్డింగ్ ఇన్‌స్టిట్యూట్ యెందుకొదిలినట్టు? బహుశా మీకు విసుగెత్తి వుంటుందనుకుంటా. విసుగెత్తించే విషయం కూడాను అది. కాని, మీరామాటే మెకానికల్ ఎంజినీర్‌తో అనిచూడండి! చచ్చినా వొప్పుకోడు. అనేక పనులు నేర్చుకోవచ్చు మనం. కాని ప్రయోజనం యేముంది? మీకు యిష్టమూ కుతూహలమూ ఆసక్తీ లేనప్పుడవి నేర్చుకున్నందు వల్ల మంచేమి జరగదు. మీరు యితరుల్ని మోసగించవచ్చు; మిమ్మల్ని మీరే మోసగించుకోవచ్చు గూడా. కాని మీ వృత్తిని మాత్రం మోసగించడం సాధ్యంకాదు. అదీకాక మీరావృత్తిని యెన్నుకునేదియే ఒక్క ఘంటకోసమో కాదుగదా; ఈరోజుచేస్తే చాలు సరిపోతుందని కాదుగదా. జీవితం అంతాచేయవలసిన పని. బ్రతికినంత కాలం కలిసిమెలసి వుండాలి ఆ పనితో; మీరు ప్రేమించే వ్యక్తితోలాగా. అంతే కాదు; ఒక విధంగా యిదిథ

ప్రేమకంటేగూడ ముఖ్యమైంది. ప్రేమకోసం త్యాగం చేసిన వారిలో మహామహులు చాలాకొద్దిమంది. కాని తాముకావా లనుకున్న పనికోసం, తమకిష్టమూ. ఆసక్తి వున్నపని కోసం సర్వస్వం త్యాగం చేసిన వారందరూ ప్రపంచంలో మహామహు లైన వ్యక్తులే." అంటూ, ఆగి. "ఐనా మీరు మెషీన్ బిల్డింగ్ లోకెందుకెళ్లారు?" అనడిగాడతను, స్నేహంగా.

ఆ ప్రశ్న వింటే చుర్రుమంది ఓల్గాకి; కాని కనుకొలకు ల్లోంచి తీవ్రంగా ఒక్కచూపు మాత్రం విసిరి, అంతటితో వూరు కుంది.

"ఏముంది; సెకండరీ స్కూలైపోగానే యేదో వొకటి చెయ్యాలిగదా మరి. అందుకని అందులోకెళ్లాను."

"మెషీన్ బిల్డింగ్ అంటే యేమిటోగూడా తెలుసుకోన కుండానేనా? అర్థం చేసుకోకుండానేనా? అంతకు పూర్వం యెప్పుడైనా యంత్రాగారాల్లో పనికెళ్ళి చూశారా? ఎప్పు డైనా యంత్రాలు నిర్మించే వాళ్ళతో మాట్లాడారా?"

అడ్డంగా తలూపింది ఓల్గా.

"భలే, బాగుంది, చాలాబాగుంది. ఐనా, విసుగు పుట్టిస్తుందని చెబుతున్నారా? విసుగు పుడుతుందంటే, పుట్టదూ మరి? నిజమే మరి. ఉన్నత గణిత శాస్త్రములో, లాగారిదమ్ ఫార్ములాల్లాంటివి అధ్యయనం చేయ్యాలంటే విసుగే. ఎందు కనంటే పైశాస్త్రాలన్నీ యే యంత్రాల్ని తయారు చేసేందుకు ఉపయోగిస్తాయో ఆ యంత్రాల్ని గురించి, మానవ జీవితం లోకి ఒక నవీన మధుర గేయంలా, ఒక అపూర్వమైన కానుకలా ప్రవేశించే యంత్రాల్ని గురించి, తెలుసుకోకుండా ఆశాస్త్రాల్ని అధ్యయనం చెయ్యడం అంటే విసుగెందుకు కలగదు? మన

దేశంలో యంత్రనిర్మాణం అంటే పోషణజాన్ని నిర్మించడం అన్నమాట. మీరేమో ' యేదో వకటి చెయ్యాలిగదా మరి ' అనంటారు!"

"మీరు చాలా అసహ్యంగా కూడా మాట్లాడగలరు" అన్నది ఓల్గా ప్రశాంతంగా.

"ఇందులో అసహ్యం యేవుంది? మీరన్నమాటల్ని గాదు నేనాక్షేపించుతూంది. చిన్నతనంలో పొరపాటు చేశారంటే నేనూ అర్థం చేసుకోగలను. బహుశా మీరు వివిధ విషయాల్ని గురించి ఆలోచించవలసినంతగా ఆలోచించి వుండరు; ఆచి, తూచి, చూచివుండరు. సరే. ఎకాంమెస్సీ యెందుకు తీసుకున్నారు? అదంత మనమోహనంగా వుంటుందని ఎందుకనుకున్నారు మీరు? ఆలెఖ్ఖన ఒక్కొక్కడూ పది పది శాఖల్లో ప్రవేశం సంపాయించొచ్చు. గాని జరిగే మంచేముంటుంది?" అంటూ ఓల్గా ముఖంవంక చూశాడు తావ్రోవ్. చాలా బాధపడుతూన్నట్లుంది. కాస్త తమాయించుకుని, మనసువిప్పి మాట్లాడాడు. "కావాలంటే నేనూ మిమ్మల్ని అభినందిస్తూ మాట్లాడగలను. మీరు చాలా గొప్పవారనీ, అందువల్లనే సామాన్యులెంతోమంది యెగబడి నేర్చుకునే విషయాలు మీకు విసుగెత్తించాయనీ, మీకు సంతృప్తిని కలిగించలేక పోయాయనీ, ఎన్నో అనగలను. రెండు ఇన్స్టిట్యూట్లలో ప్రవేశించి, వాటిని కాదని నిరాకరించడం అంటే మాటలా! అదే చాలు. మిమ్మల్ని పొగడి ఉబ్బేసేందుకు. కాని మీకొక ప్రత్యేకతవుంది. శక్తిసామర్థ్యాలున్నై. మీచదరంగం ఆటే నిదర్శనం అందుకు. అంచేత మీతో నిష్కపటంగా, మనసువిప్పి మాట్లాడ గలను."

"నిష్కపటంగా, వున్నదున్నట్టు చెప్పాలంటే, అసలు సంగతివేరు. నేను వ్యక్తిగత కారణాల మూలంగా వదిలాను మెషీన్ బిల్డింగ్ ఇన్‌స్టిట్యూట్‌ని. సరే, దాని మంచిచెడ్డలూ, విసుగెత్తించే శాఖ ఔనా కాదా అంటే—బహుశా తర్వాత నాలో నేను ఆలోచించుకుంటున్నప్పుడు నాకు నేను చెప్పుకున్న సమాధానం అనుకుంటానది." అన్నది ఓల్గా. అని "సరే, నా సంగతొదిలి పెట్టండి. మీపనంటే మీకు పూర్తిగా యిష్టమేనా మరి ?" అనడిగింది.

"ఓ. తప్పకుండాను. అంటే లోహశోధకుడిగా నేను గొప్ప వాణ్ణనికాదు, కాని పనంటే మట్టుకు నాకు పూర్తిగా యిష్టమే. మాస్కో ఇన్‌స్టిట్యూట్‌లో చదువుకున్నాన్నేను. మీకు తెలుసా? కాలుఝస్కాయా కూడలి దగ్గరుందా భవనం". అంటూ తన విద్యార్థిదశ గుర్తుకొచ్చి, తదేకాలోచనలో పడిపోయాడు తావ్‌రోవ్. "మాస్కో అంటే నాకు తగని యిష్టం. ఇప్పటికీ ఆ ఇన్‌స్టిట్యూటంటే చచ్చేంత ప్రేమ. బాల్యదశకంటే విద్యార్థి దశే మనిషి జీవితంలో గొప్ప దనుకుంటాన్నేను—అంటే విద్యార్థి తన విద్యని కొనసాగించితే సంగతి చెబుతున్నా. నావృత్తిని నేను చచ్చినా మార్చుకోను; ప్రపంచంలో యింతకంటే గొప్పదంటూ దేన్ని పట్టుకొచ్చినా సరే. అంటే, నేను నాపనిలో అంతగొప్ప నిపుణుణ్ణనికాదు నేను చెప్పేది. మీ కిదివరకే చెప్పాగా. యిది రెండోసారి నేను 'ఛాజ్మా'కు రావడం. మొదట ఖోలోద్‌నికాన్‌లో పనిచేశాను. తర్వాత మళ్లీ నన్ను మాస్కోకి పిలిచారు. అక్కడే ఆఫీసు పని. ఒక సంవత్సరం చేశాను. తిరిగి ఉత్పత్తిలో కెళ్ళ అనుమతిచ్చారు."

"మరి మాస్కో అంటే చాలా ప్రేమ అని కోస్తా రెందుకు?"

"దూరంగావుండే ప్రేమిస్తాను. నా పనలాంటిది. ఎక్కడ బంగారంవుంటే అక్కడి కెళ్లాలి. ఊరల్స్‌లోవుంటే ఊరల్స్, సైబీరియాలోవుంటే సైబీరియా. ఐనా, దూర ఉత్తర ప్రాంతంలో ఒక విశేషాకర్షణవుంది—మీరా ఆకర్షణ నుంచి తప్పించుకోలేరు....మళ్లీమళ్లీ రావాలని బుద్ధిపుడుతుంది."

"ఓహో! అదా సంగతి ఎవరబ్బా అంత ఆకర్షణీయంగా వుంది" అని నవ్వింది ఓల్గా.

తావ్‌రోవ్ సిగ్గుపడ్డాడు. తేరుకుని "లేదు లేదు. అక్క డెవరున్నారు?" అన్నాడు.

డెక్‌కు అంటగట్టిన దూలాలమీద అలాగే మాట్లాడుతూ కూర్చున్నారు. వాళ్ళకుపైనా కిందా గూడా యెండలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు చాలమంది, గ్రామంలో రైతులందరూ చేరి కూర్చున్నట్టు. వాతావరణంలో హుషారు రావడంవల్ల అందరూ హుషారుగా వున్నారు. పనేమీ లేదేమో పేకాడుతూకూర్చున్నారు కొందరు. కొందరు కోరస్ (సమిష్టి గానం) ప్రారంభించారు. ఎవరో వొకరు వాద్యం వాయిస్తు న్నారు. సముద్రం అంతా ప్రశాంతంగా మెరిసి పోతోంది ఎండలో. సముద్రపు కొంగలు అదేపనిగా ఎగురుతున్నై, గాలిలో రెపరెపలాడే తెరచాపలికి మల్లే. మధ్యమధ్య దీవుల ప్రక్కగా పడిపోతోంది ఓడ.

"మరి మీరు? మీకు మాత్రం ఆనందంగాలేదూ ఛాజ్మా వెళ్తున్నామని" అనడిగాడు తావ్‌రోవ్ కాస్సేపాగి.

"లేకేం, చాలా ఆనందంగా వుంది.", అన్నది ఓల్గా, హుషారుగా. "కాని నా ఆనందానికి కారణం ఉత్తరప్రాంతం మట్టుకు కాదు. నేను ప్రేమించే వ్యక్తివున్నాడక్కడ; అందు కూ నా ఆనందం. మీరుచెప్పినట్టు ఉత్తర ప్రాంతంఅంత ఆకర్ష ణీయమైనదే ఐతే, నాకక్కడ రెండు ఆకర్షణలున్నట్లౌతుంది." అంటూ నవ్వింది, కనుచూపుమేర దూరంలో నీరూ నింగీ ఏక మౌతున్నవైపు చూస్తూ. కిందకీ పైకీ పడుతూలేస్తూ వున్నది. సముద్రమా? ఆకాశమా? అవి రెండూ ఊపిరి బీలుస్తూన్నట్లే వున్నై; ఆఉచ్ఛ్వాస నిశ్వాసాలకి ఓడ అటూయిటూ వొరుగుతూ ముందుకు సాగుతోంది మెల్లమెల్లగా.

"నేనెక్కువకాలం గడిపింది దక్షిణాన. చిన్నప్పుడు నేనంటే అందరికీ అతిగారాం. అందరికంటే చిన్నదాన్నికదూ, అందుకని. నా అక్కలుగూడా నన్ను కాలు కింద మోపనిచ్చే వారుకాదు. కావలసినంతమంది బంధువులు. అందరూ బాగా వున్నవాళ్ళు." అంటూ అనందంగా ఒకచిన్న నవ్వు నవ్వింది ఓల్గా. ఐనా ఆగారాం నన్నంతగా చెడగొట్టలేదు అదృష్ట వశాత్తూ. ఆబ్లూమోవ్ (గొంచారోవ్ రచించిన నవలలో ఒక అతిసోమరిపోతు పాత్ర) లాగా తయారయ్యేందు కవసరమైన అవకాశాలన్నీ వుండేవప్పుడు."

"ఇప్పుడుమాత్రం కాలేదనేదేముందిలే" అనేద్దామను కున్నాడు తావ్రోవ్. ఆవిడవంక చూస్తూ, అకుటుంబం ఆవి డకు చేసిన అపకారాన్ని గురించి ఊహించుకోవడం ప్రారంభిం చాడు. "బహుశ అంచేతనేనేమో యే విషయాన్నీ యీావిడ తరచిచూడలేక పోతోంది" అనుకున్నాడు తనలోతాను.

ఓల్గా ముద్దొస్తుంది. కాని అందుకు కారణం ఆవిడ రూపురేఖలు కాదు. ఆవిడ పక్కనలా కూర్చుంటే, అదే మిటో, ఆవిడతో చిరకాల పరిచయం వున్నట్టనిపిస్తుంది. ఇత రులకి నొప్పికలగకుండా హాస్యమాడ గలదు. అలాగే, ఆవిడ ప్రక్కన కూర్చుని ప్రయాణీకుల్ని గురించి ఆవిడ ఊహాగానాన్ని వింటూ వుండాలనిపించిందతనికి .

"అదుగో, ఆముసలాయన జమాఖర్చుల మనిషే. సందే హంలేదు. పిసినారి. బాగా తలతిక్కమనిషి గూడాను" అన్నది, పేకాట చూస్తూ. ఏవేవో సైగలు చేస్తున్న బట్టతలా యన్ను చూస్తూ, అతను వేసుకున్న బూట్లు మిలమిల మెరుస్తున్నై; సూట్ పాతదే కాని, చక్కగా యిస్త్రీచేసింది; టై గూడా కొట్టొచ్చినట్టు కనబడుతోంది వేస్ట్ కోట్ మీదుగా.

"బహుశా ఆయన సప్లై మనిషేమో"

"కాదు, కాదు. వాళ్ళింకాస్త హుషారుగా వుంటారు. రంగూ యింతకంటె మెరుగ్గా వుంటుంది."

"అన్నట్టు మరి మీరా ఎకౌంటెన్సీ తీసుకునేప్పుడు వున్నరంగు చెడిపోతుందేమోనని భయపడలా ?" అనడిగాడు తావ్రోవ్ వ్యంగ్యంగానే ఐనా దురుద్దేశం యేమీలేనట్టు.

ఇంతలోనే ఒక యువకుడు వాళ్ళముందునుంచి నడిచి వెళ్ళాడు. ఆనడకలో ఆత్మ విశ్వాసమూ వుంది, లెక్కలేని తనమూ వుంది. "అతనెవరనుకుంటున్నారు మీరు ? బాగా బలంగా వున్నాడుకదూ? ఆ కళ్ళు చూశారా! బూడిదరంగుగా చికిలించినట్టు; అప్పుడే ఆ కను కొలకుల దగ్గర ముడుతలు; ఎప్పుడూ ఆరుబయట తిరిగే మనిషిలాగా" అన్నది ఓల్గా.

"భూగర్భ శాస్త్రజ్ఞుడేమో"

"కాదుభూగర్భ శాస్త్రజ్ఞుడెప్పుడూ సముద్రం కేసి అలా చూడడు. చేపలబోటు డ్రైవరనుకుంటున్నా నేను. ఆవచ్చే కెరటాల్ని చూస్తూ కన్నులార్చడంగూడా లేదు; గమనించలా మీరు!"

"ఓ అంతేననుకుంటా." అన్నాడు తావ్‌రోవ్ ఆ యువకుడు చేపలబోటు చక్రందగ్గర నుంచునుంటె చూస్తూన్నట్టు.

"ఆ మాకింటోష్ (నీరుపడినా ఋంకని గుడ్డతో చేసిన దుస్తు) లో వున్నాయన రిటైరై పోయిన మఠాధికారి లాగా వున్నాడు, చూశారా ఆ జిడ్డుమొహం; కనులుమాత్రం లోపలికి గుచ్చిగుచ్చి చూస్తున్నట్లున్నై."

"పొరపాటు. ఆయనెవరో సాహిత్యాచార్యుడు. నేనూ ఆయన ఒకేసారొచ్చాం ఓడలోకి. నాపక్కమంచమే ఆయన్ది."

"ఐతే అతనొట్టి మోసగాడై వుండాలి. ఎందుకూ, ఒళ్ళంతా పులుముకున్నట్టు కన్పిస్తోందా మోసం; కాని మానవుడు నీతిసూత్రాల్ని గురించి బహుచక్కగా ఉపన్యసించ గలుగుతాడనేది నేనూ ఊహించుకోగలను."

తావ్‌రోవ్ నవ్వాడు.

"మీరనేది నిజమేనేమో. నాకూ ఆయనకీ అప్పుడే ఒక చిన్నవాగ్వివాదం గూడా జరిగింది. సోవియెట్ సాహిత్యాన్ని చులకనచేస్తాడు; ఎప్పుడూ ప్రాచీనగ్రంథాల్ని పొగుడుతూంటాడు. అయనీ వుత్తరప్రాంతానికి బయల్దేరడాని క్కారణం డబ్బేనేమో అనిపిస్తోంది చూడగా చూడగా."

"మీకూ చలిగానే వుందా ?" అనడిగింది ఓల్గా, నెమ్మ దిగా; "ఎండ కాస్తూనేవ్వుంది మరి. వాతావరణం మారి పోయింది. సముద్రపు రంగూ మారిపోయింది."

లేచి, డెక్‌మీది మనుష్యుల్ని తప్పించుకుంటూ ఓడ కొఁక ప్రక్కకెళ్లింది ఓల్గా. ఆవిడ వెంటే తావ్‌రోవ్‌గూడా వెళ్లాడు. ఇద్దరూ వంగి, సముద్రంలోకి చూశారు.

ఓడతో పందెంవేసి, సొరమీనులు రెండు ముందుకు పరు గెత్తినై, టార్పెడోల్లాగా.

"అవి చాలా ప్రమాదమైన చేపలు. పిల్లలు పుట్టగానే బయల్దేర్తాయి వేటకి" అన్నాడు తావ్‌రోవ్.

"ఇవ్వాళ రేడియో విన్నారా ?" అనడిగింది ఓల్గా. నార్విక్ దగ్గర జెర్మన్ సైన్యాన్ని బ్రిటిష్ నావికాదళం ముట్ట డించింది. యుద్ధనావల్లోంచి ఫైరింగ్ జరుగుతోంది. జెర్మన్లూ బాగా నిలబడే పోరాడుతున్నారు. పరాయి దేశాల్లో బాగానే చేస్తారు యుద్ధం వాళ్లు. తమ మీదికి దాడెత్తినవాళ్లూ, తమని రక్షించడాని కొచ్చినవాళ్లూ ఒకళ్లనొకళ్లు నాశనం చేసుకుం టూంటే నార్వేజియన్లకి బాగానే వుంటుందనుకుంటా."

"నార్వేలోవున్న ముడి ఇనుము కోసమేగదా ఇద్దరూ యుద్ధం చేసుకుంటున్నది" అన్నాడు తావ్‌రోవ్. "ఇద్దరూ స్వార్థపరులే. ఎవరి లాభంకోసం వాళ్లు అంతే. ఇందులో భక్షణాలేదు; రక్షణ అంతకంటే లేదు. అంతేగా ?"

"ఎవరి లాభంకోసం వాళ్లు" అన్నది ఓల్గాకూడా మళ్లీ: "ఇదివరకొక నార్వీజియన్ వుండేవాడు. అతనూ స్వలాభమే చూచుకున్నాడు. అతని పేరు పియెర్ గింట్. తన లాభం కోసం చూచుకోడం ప్రారంభించి, తనని తానే మరచి పోయాడు. ఇబ్సన్ నాటకం చదివారుగా మీరు ?"

"మీకేదంటే ఎక్కువిష్టం — సాహిత్యమా ? రాజకీయాలా ?"

ఉలిక్కిపడి తిరిగి చూచినట్టు చూసింది ఓల్గా. అతను గేలిచేస్తున్నాడనిపించింది. మొట్టమొదటిసారిగా, ఆవిడ బుగ్గ లెర్రబడడం చూశాడు తావ్‌రోవ్.

"మనదేశంలో, రాజకీయాలంటే అందరికీ యిష్టమే" అన్నది ఓల్గా. "పిల్లలుగూడా రాజకీయాలంటే చెవికోసు కుంటారు. మనలో అందరికీ, మన చిన్నచిన్న వ్యక్తిగత జీవితాలన్నీ సంఘ సమష్టి జీవితంమీద ఆధారపడి వున్నాయని తెలుసు. సరే, ఇంక రాజకీయాలు లేకుండా సంఘం వుండనే వుండదు."

"అక్షరాల నిజం." అంటూ చిరునవ్వు నవ్వాడు తావ్‌రోవ్; "బాగానేవుంది. మరి సాహిత్యం సంగతేమిటి ?"

"ఇంకాస్సేపుంటే యిద్దరమూ పోట్లాడుకోవల సొస్తుంది" అన్నది ఓల్గా; యీసారి నిజంగానే కోపం వచ్చింది. కుర్రాడిలా కోటుజేబుల్లో చేతులు పెట్టుకుని ముఖం తిప్పు కుంది.

"అహఁ, ఎందుకు పోట్లాడుకుంటాం" అన్నాడు తావ్‌రోవ్ వెంటనే. "ఇందులో కోపగించు కోవలసిందేముంది ?

మీకేదంటే యిష్టమో తెలుసుకోవాలని అడిగానే తప్ప, అంత కంటె యింకేమీలేదు."

కోపంగా బుసకొట్టినంత పనిచేసింది ఓల్గా.

"సాహిత్యంలో నాకేమంత పెద్ద ప్రవేశమంటూ లేదు. కాకపోతే సామాన్య పాఠకురాలి లాంటిదాన్ని. నాలుగు పంక్తుల పద్యంగూడా వ్రాసిన పాపాన పోలేదు యింతవరకూ. నాకా తెలివితేటలు లేవు—సంగీతమన్నా, చిత్ర పటాలన్నా, ఏదన్నా అంతే. ఐనా మీకింత పట్టెందుకూ నా అభిరుచేమిటో తెలుసుకోవాలని ?"

"ఎందుకా ? మీరింతకాలం వృథాచేశారు కాబట్టి. ఇప్పటికీ మీఅభిరుచిని గురించి మీరంతగా పట్టించుకుంటున్నట్టు కనిపించడంలేదు కాబట్టి. ఊరికే, చదువుకునేందుకూ, పని చేసేందుకూ హక్కున్నదనుకుని ప్రయోజనం యేమిటి ? ఆ హక్కుని మనం సద్వినియోగం చేసుకోగలగాలి. పెళ్లి చేసుకున్నారు కాబట్టి చదువు మానెయ్యాల నెక్కడుంది ? నేననే మాటలు కటువుగా తగిలితే, క్షమించండి. ఎందుకూ, పెళ్లి చేసుకున్న తర్వాతా, పిల్లలు కలిగింతర్వాతగూడా చదువు సాగించిన స్త్రీలని చాలామంది నెరుగుదును నేను."

చేయగలిగిందేమీ లేదన్నట్లు, భుజాలొకసారి కుంచించి వదలేసింది ఓల్గా, "ఏమనుకుని యేంలాభంలే?" అంటూ.

తన చిన్న చెల్లెల్ని కసరుకున్నట్లు, "అదేమంటే యికిది" అని విసురుకున్నాడతను. "మీ ఆడవాళ్లే అంత. పాత సాంప్రదాయాలకీ, అలవాట్లకీ యిట్టే లొంగిపోతారు ! పిసినారి బంగారాన్నంటి పెట్టుకున్నట్లు మీరు మీ సంసారాన్ని గుదిబండలాగా చేసుకుంటారు. పెదవి కదపకుండా మగ

వాడి చెప్పుచేతుల్లో వుండిపోతారు. తరతరాలనుంచీ వున్న సాంప్రదాయమేనాయె. ఓల్గా ముఖాన కత్తివేస్తే నెత్తురు చుక్క లేదు. తావ్‌రోవ్ అది గమనించాడు. ఐనా తన మాటల ధోరణిని ఆపుకోలేక పోయాడు. ఇకప్పుడు తిరోగమించడమంటూ లేదు. "మీకు తెలుసా, ఉజ్బెకిస్తాన్‌లో పరంజా (స్త్రీల ముసుగు) ని నిషేధిస్తూ చట్టమైంది యిప్పటికీ, యీ1940 లో."

"ఐతే? దానికీ నాకూ సంబంధం?"

"ఉజ్బెకిస్తాన్‌లో స్త్రీలు పురుషులతోపాటు కలిసిమెలిసి పని జెయ్యడం ప్రారంభించక పోతే, యింకాయెన్నేళ్ళు పట్టేదో యీ చట్టం అవడానికి."

# 4

ఇంక ఆవాళల్లా తావ్‌రోవ్ అంటే కోపంగానే వుంది ఓల్గాకి. సాధ్యమైనంతవరకు అతన్ని తప్పించుకు తిరిగింది. కాని మర్నాడుదయం, ముందు తానే పలకరించింది.

"ఆలోచించగా, ఆలోచించగా పంచదార పూసుకున్న పొగడ్తకంటే, కటువైనా సత్యమే వినడం మంచిదనిపిస్తోంది." అన్నది.

తావ్‌రోవ్ జవాబు చెప్పబోతూనే వున్నాడు; ఇంతలోకే యెవరో పెద్దకేక వేశారు. చూస్తే, సముద్రమూ నీలి ఆకాశమూ కలిసేచోట, ఓడ ప్రక్కనున్న దుంగలమీదుగానూ పీపాలమీదుగానూ తెల్లని మంచుగుట్టలు కనిపించినై మధ్య మధ్య నల్లనిమచ్చల్తో.

"మంచు!" అన్నది ఓల్గా వణకుతూన్న కంఠంతో.
"మంచూ, సీల్ జంతువులూ! భలే, భలే!"

ఇంకాస్సేపటికి ఓడవెళ్లి మంచుగడ్డలకి కొట్టుకుంద, ధామ్మని. కుడినుంచీ, ఎడమ నుంచీ ఒకటే మంచుదిబ్బలు, ఓడకి తగిలి ముక్కలు చెక్కలై పోతున్నై.

మంచుదిబ్బలు ఓడకెదురుగా కొట్టుకొస్తున్నై.

"అవి తమదారినబడి వస్తున్నట్టున్నై. ఇంకా ఓడేమి కదుల్తుంది?" అన్నది ఓల్గా ఆశ్చర్యంగా వాటి వంకచూస్తూ.

"మరికొంతకాలం అంతే" అన్నాడు తావ్రోవ్; "మనమేమీ చెయ్యలేం—ఇక్కడ సముద్రమే అంత. ఉత్తర ప్రాంతంలో శీతకాలమంతా నీళ్ళు గడ్డకట్టుకునే వుంటై. అందులో కొంత పగిలి, ప్రవాహవేగానపడి దక్షిణానికి పోతున్న దన్నమాట. ఈ ప్రయాణంలో కొంత పగిలి, కొంత కరిగి, కొంత పలచనైంది మనకోసమని. లేకుంటే యింకా ప్రమాదంగా వుండేవివి. ఇప్పుడూ ఎక్కువ కష్టం యేమీలేదు. మనం ప్రయాణం ముక్కుకు సూటిగా చెయ్యలేం యిక. దారిని మార్చాలి, పటువాలుగా—యిప్పటికే ఆ తుఫాను మూలాన సగం ఆలస్యమైంది."

ఓడ దారి మార్చింది. ఐనా అన్నివైపులా మంచుగడ్డలు తగులుతూనే వున్నై. ఒక్కోసారి; సముద్రం అంతా గడ్డ కట్టుకుపోయిందా అనిపిస్తోంది. పైన చేతికి తగులుతూన్నట్టున్న నీలి ఆకాశం, క్రింద తెల్లని మంచు. పగళ్ళు మామూలుంకటే




ప్రకాశవంతంగా వున్నై. రాత్రిళ్ళుగూడా [illegible] చీకటిగా వుండడం లేదు. ఏదో కొత్తప్రపంచంలో ప్ర[illegible] ఓల్గాకి. ఎక్కడ చూచినా సీల్ జంతువులు. వీటిని [illegible] ఇవాన్ ఇవానోవిచ్ చేతులికి యెక్కడలేని దురదపుట్టుకొచ్చేది; వెంటనే తుపాకి తీశేవాడు. అసలైన వేటగాడికన్ని జంతువులొక్కసారి కనిపించితే హుషారేమంత వుండదని ఆవిడకి తెలియదు. భర్త సంగతి జ్ఞప్తికొచ్చేటప్పటికి ఓల్గా ముఖం మారిపోయింది. అనేక బహుమానాలు తీసుకెళ్తోంది తను; ఈ మధ్య ఒక్కొక్కటీ పాకింగ్ వూడదీసి జూచి, అవి తన భర్తకెలా నచ్చుతాయోనని వూహాగానంలో మునిగితేలుతోంది.

ఆవిడ కనబడనప్పుడు తావ్‌రోవ్‌కేమీ తోచడం లేదు. ఏం చెయ్యాలో తెలియక ఓడంతటా వూరికే తిరిగేస్తున్నాడు. ఏమీ పనిలేక పోవడం మూలానా, సోమరితనంవల్లా మరిపాలుపోవడంలేదేమో ననుకున్నాడు మొదట్లో. చదవాలని పుస్తకాలు బయటికి తీశాడు. అది మంచి నవలైనా ఒకటిగానేవుంది; ఈ మధ్యే అచ్చైన బంగారపు గనుల్ని గురించిన పుస్తకమైనా ఒకటిగానే వుంది. చదవబుద్ధి పుట్టడంలేదు.

ఒకనాడు, చాలా ప్రొద్దెక్కి లేచాడు. డెక్‌మీద కొత్త శబ్దం వినవచ్చినట్లైంది. తొందరగా దుస్తులు మార్చుకుని వెళ్ళి చూచాడు. కొయ్యముక్కలు రంపాల్తో కోస్తున్నారు.

"నూనె ఐపోయిందన్నమాట. ఔను మరి, ఎందుకైపోదు ? ఇప్పటికే ఐదురోజులుపైగా ఆలస్యమైపోయె" అనుకున్నాడు.

ఇంతలోనే ఆ కార్మికుల్లో ఓల్గాకు [illegible] కనిపించాడు [illegible] స్వెట్టర్ చేతులు పైకి మడిచి, యంత్ర[illegible] మీద

తెలుగు విశ్వవిద్యాలయము గ్రంథాలయము

చూచిన కుర్రవాడితో కలిసి రంపం పడుతోంది. తలకు రుమాలు చుట్టుకుంది కురులు ముహంమీద పడకుండా. బాగా అనుభవం లేద్దేమో రంపం గట్టిగా పట్టుకుని, వొళ్లంతా వూపుతూ గబ గబాకోస్తోంది.

తావ్‌రోవ్‌నిచూచి, "వచ్చి సాయంచెయ్యండి, ఓగోళ్ళు గిల్లుకునే పెద్దమనిషిగారూ!" అంటూ కేకేసింది.

ఇప్పుడావిడ లేచి నిలబడుంది, రంపం వేళ్ళాడేసి, ఒక చిన్న రుమాలుతో ముహం తుడుచుకుంటోంది. ఇంకో కొత్త దుంగని తోస్తున్నారావిడ దగ్గరికి.

ఇంకా ఎటుచూచినా మంచుముక్కలు కనబడుతూనే వున్నై. సీల్ జంతువులు నీళ్లమీద తేలుతున్నై, కదలకుండా.

"అవిగూడా ఆమంచుతోపాటు గడ్డకట్టుకు పోయి నట్టున్నై" అన్నది ఓల్గా, వంగి వాటివంకచూస్తూ; "ఒక్కోసారి ఈ సీల్ జంతువులూ, యీ మంచుగడ్డలూ మన ఓడ యెదెత్తే అటు కొట్టుకొస్తున్నాయేమో ననిపిస్తుంది. లేకుంటే యిన్నిజంతువు లెక్కణ్ణుంచి పుట్టుకొచ్చినట్టు? వాటికీ యీ రంపం శబ్దం వినసొంపుగా వుందేమో!"

"అందుకు సందేహమా!" అన్నాడు తావ్‌రోవ్ నవ్వుతూ.

"ఏదో విదేశంనుంచి వచ్చిన ప్రయాణీకుడిలా, అటూ యిటూ తిరక్కపోతే, వచ్చి కాస్త సాయం చేయగూడదూ? అంది; యీ కొత్తపని నేర్చుకోవడంలో వున్న ఆనందం యింతింతకాదని ఆవిడ ప్రతి కదలికా చెప్పక చెబుతోంది.

"మీరు పనిచెయ్యడం చూడ్డమే ఎక్కువానందంగా వుంది నాకు."

"ఓహో, ఐతే నా అభిరుచిని గురించి కనిపెట్టేశారన్న మాట" అంటూ మెరిసే కళ్ళతో నవ్వేసింది ఓల్గా.

"మాటల్తో దెబ్బకొట్టడం బాగా తెలుసు మీకు." అన్నాడతను, బిగదీసుకు పోతున్నట్టు.

ఓల్గా నవ్వింది.

"ఇట్లా నత్తనడక నడుస్తూంటే మాటలు గాక యింకే ముంటాయి — ఎగిరిపోవాలని అనుకుంటూంటే వున్నకొద్దీ ఆలస్యమై పోతూండే. ఈ దుంగల్తో యిల్లు కట్టడం మాటట్లా వుంచి, యిక్కడ రంపాల్తో కోసి వంట చెరకుగా మార్చాలి సొచ్చె! విడ్డూరం కాదూ మరి? అన్నట్టు నాతో పనిచేసే ఆయన చేపలబోటు నడిపే ఆయనకాదు, భూగర్భ శాస్త్రజ్ఞుడూ కాదు" అంటూ రంపమెత్తి, కొత్తగా దొర్లించిన దుంగ వంక చూచి, "ఈ కొయ్యదుంగలుగూడా ఐపోతే యిక ఒడ్డు కెళ్ళే మార్గమేమిటి?" అన్నది.

"ఏముంది. దగ్గర్లో వున్న యే ఓడరేవునుంచో ఓడొకటి రావాలి; మననిలాగి తీసికెళ్ళాలి."

# 5

ఒకనాడందరికీ దూరాన లెక్కలేనన్ని జలస్తంభాలు లేచి నిలబడినట్లు కన్పించింది మసకమసగ్గా. ఎంతసేపు చూచినా అవి కదిలినట్టే లేవు. ఇంతలో యెవరో "ఒడ్డు!" అని కేకేశారు.

తీరానఉన్న కొండపగుళ్ళలో పేరుకుపోయిన మంచే అలా జలస్తంభాలుగా కన్పించిందని తర్వాతగాని తెలియ

లేదు. తీరం కళ్ళబడిన తర్వాతగాని ప్రయాణీకులకు అర్థం కాలేదు ఓడెంత నెమ్మదిగా నడుస్తూందీని.

ఓల్గా మరీ తొందర పడిపోతుంది. ఇకేమీ "ఆలస్యం కాదులే. గ్లుబొకోయే దగ్గరికి వచ్చేసినట్టే మనం." అన్నాడు తావ్‌రోవ్; "ఇంకాస్సేపట్లో అఖాతంలో కెళ్ళి లంగరేశేస్తాం; అఖాతమంతా గడ్డకట్టుకునుందట; అందుకని యిప్పుడే నావల్ని పంపేందు కవకాశం లేదని రేడియోవార్త వచ్చింది.

"ఆమాట ముందే యెందుకు చెప్పలా వాళ్ళు ?"

"అఖాతం కలదీస్తుందను కున్నారు వాళ్ళు. ఇంతలో వాతావరణం మళ్ళీ మారిపోయింది. సరే, రండి, చదరంగం చివరాటొకటి ఆడుకుందాం. ఈ రాత్రికిక చేరుకున్నట్టే."

"అమ్మయ్య బ్రతికామన్న మాట!" అన్నది ఓల్గా, తావ్‌రోవ్‌తోపాటు బయల్దేరుతూ.

సెలూన్ అంతా ప్రశాంతంగా ఉంది. అందరూ డెక్ మీదికి చేరి, తీరంవంక చూస్తున్నారు. నాల్గురోజుల్నుంచీ చెడి పోయున్న రేడియో బాగుపడినట్టుంది; వార్తాలహరి విన వస్తోంది.

*మాగినాట్ లైన్ దగ్గర నవమ ఫ్రెంచి సైన్యాదళం పరాజయం పొందింది.*

'మంచె త్తే' అంటూ గొణిగాడు తావ్‌రోవ్. చదరంగం మాట మరచిపోయి.

రేడియో చెబుతోంది : "*అసలు పోరాటం ఎమియెన్స్ పట్ణం మీదికి పాకుతోంది. కలే పట్ణణం ముట్టడించబడింది......బెల్జియన్ సైన్యమంతా లొంగిపోవడంతో, జెర్మన్ సేనలు పూర్తిగా డంకర్క్ వైపుకు పురోగమించేందుకు అవకాశం చిక్కింది........*"

"సరేగాని, న్యాయంగా ఆలోచిస్తే ఫ్రాన్స్‌లో ఐదు మిలియన్లపైగా వున్నారే సైనికులు. వాళ్ళందరూ ఒక దళం తర్వాతొకదళం అలా లొంగిపోవడం యెందుకు?" అంది రేడియో మైక్‌వంక చూస్తూ ఓల్గా. "అందులోనూ అంత తొందరగానా! జెర్మన్ల దగ్గరున్న ఆయుధాలు మంచివే అనుకుందాం, గొప్పవే అనుకుందాం, వాళ్ళేదో అకుంఠిత దీక్షతోనే యుద్ధం చేస్తున్నారనుకుందాం. ఐతేమాత్రం, ఫ్రెంచివాళ్ళు కాస్త నిలబడి పోరాడొచ్చునుగదా? అదేమీకన్పించదే. వాళ్ళ వాళ్ళ నాయకులు వాళ్ళని అమ్మేసేస్తున్నారేమోనని అనుమానం వేస్తోంది నాకు."

"అంతే ననుకుంటా. వినండి."

*'సర్వ సైన్యాధిపతి వెయ్‌గాండ్ యింతవరకు బలమైన ఎదురు దాడి ప్రారంభించనే లేదు."*

"ఎందుకని ప్రారంభించలేదంటారు; కావలసినంతమంది సైనికులున్నారతని దగ్గర." అంటూ మళ్ళీ కాస్సేపు రేడియో వార్తలు విన్నాడు తావ్‌రోవ్. గభాల్నొక చిరునవ్వునవ్వి "సాహిత్యంలో దీనికి సాపత్యాలేమీ లేవూ?" అన్నాడు.

రాత్రి పొద్దుపోయేప్పటికి, ఓడ నెలాగైతే, గ్లావ్‌కోయే అఖాతంలోకి చేర్చారు. జబ్బుపడ్డజంతువులాగుంది ఓడ; ఓడ వేసిన కూతగూడా అలాగే బొంగురు బొంగురుగా ప్రతిధ్వనించింది చుట్టూవున్న కొండల్ని తాకి. ఎదురు చూచిచూచి అలసిపోయిన ప్రయాణీకులంతా నిద్రపోయారు. ఓల్గాలాగానే,

వాళ్లూ ఓడకూత వినసేలేదు. తనభర్తనిగురించి కలలుకంటోంది ఓల్గా. ఆ మంచుగడ్డలమీదినుంచి తనదగ్గరకి రావాలని ప్రయత్నిస్తున్నాడు భర్త. అతను అడుగువేసి తీసినచోటల్లా, చిమ్ము గొట్టంలా స్వచ్ఛమైన నీరు పైకి చిమ్ముతోంది.

వచ్చి, కౌగిలిలో పొదువుకుంటూ "ఎంత అలసిపోయావని!" అన్నాడు.

ఆనందంతో మెరసిపోతున్నై అతని గోధుమరంగు కనులు. నల్లని జుత్తు నిగనిగ లాడుతోంది. ఆయనే. సాక్షాత్తూ తనభర్తే! ఇంకా ఆనందం పట్టలేక పోయింది ఓల్గా; మెలకువ వచ్చేసింది.

ఓడ కదలడంలేదు; లంగరేశారు.

"ఇంకా సముద్రంలోనే వున్నట్టా?" అనుకుందావిడ.

గబగబా దుస్తులు సరిజేసుకుని డెక్‌మీది కెళ్ళింది. చూస్తే ఎగిరి గంతేయాలని పించింది. మంచుదిబ్బలు దాటి, దూరంగా తీరాన వందలకొద్దీ లైట్లు వెలుగుతున్నై. చుక్కలు లేక పాలిపోయిన ఆకాశంకింద ఆ వెలుతురదో వింతగావుంది. తొందరగా తీరానికి వెళ్ళిపోతే; వెళ్ళి పక్కనేవున్న బజారున నడిచి, ఒక యింట్లోకి ప్రవేశించి, తలుపు మూసేసుకుని నిబ్బరంగా నేలమీద నిలబడితే!

"ఎలాగైతేం, చేరుకున్నా మన్నమాట" అనుకుంది ఓల్గా, అఖాతం చివర నిటారుగా నిలబడ్డ కొండల శిఖరాలు చూస్తూ. నగ్నశిలలు, తుపానుతాకిడికి తట్టుకుని నిలబడిన చెట్లొకటీ అరా, అక్కడక్కడా, 'నాగరికత చేసేచప్పుడుతో కలతచెందిన ఉత్తరప్రాంతం రాత్రి.

"గ్లుబోకోయే చేరుకున్నాం!" అనుకున్నదిక భర్తదగ్గర కెళ్ళడమే తరువాయి ఐపోయినట్టుగా.

"అంతగా ఈఓడ ఒడ్డుదాకా వెళ్ళలేకపోతే, మేమే వెళ్లొచ్చు యీమంచుగడ్డలమీద అడుగులేసుకుంటూ" అన్నది బిగ్గరగానే, ఓడప్రక్క కెళ్లి,కిందికిచూస్తూ.

నీళ్లమీద పేరుకున్న మంచంతా చిల్లులు చిల్లులుగా వుంది. ఆ చిల్లుల్లోంచి సీల్ జంతువులు ముట్లు పైకిపెట్టి ఆడుతున్నై. ఒక్కోచోటా జంతువులు గుంపులు గుంపులుగానే పడివున్నై.

"మనమేమీ నడవనవసరంలేదు. మంచు పగలగొట్టి దారిచేసే యంత్రాన్ని పంపిస్తున్నారు." అన్నాడు తావ్రోవ్ దగ్గరకొచ్చి, ఆవిడ భుజంమీదికి వంగి.

ఓల్గా వులిక్కిపడింది, "యేమిటీ యింత భయపెట్టారు!" అంటూ; "ఎవర్నీ యిట్లా జడిపించగూడదు."

"నేనేం జడిపించాను, ఊరికే యిటు వచ్చాను, సరే. ఎట్లాగైతేనేం, చేరుకున్నాం" అన్నాడు సాలోచనగా.

# 6

స్నానమదీచేసి భర్తవుండే చోటికెళ్లేందుకు కారెప్పుడు బయల్దేరుతుందో కనుక్కుంది ఓల్గా. ఇంతలోకే ఫోనొచ్చిందని చెబితే ఫోన్ దగ్గర కెళ్లింది. ఫోనులో పిలిచింది తావ్రోవ్.

"మీరెళ్లి పోయారేమో ననుకున్నా. ఇక్కడంతా అతి త్వరగా జరిగిపోతుంది— మాస్కోలో లాగానే. బయటికెళ్లోక

సారి సముద్రాన్ని చూద్దాం? చూచిచూచి విసుగుపుట్టిందా? గ్లుబొకోయేలో వొడ్డునుంచి చూస్తే అదో విచిత్రంగా వుంటుంది సముద్రం. ఓడరేవులో నడుద్దాం కాస్సేపు," అన్నాడు.

పట్టణం యింత మారుమూలనున్నా, ఓడరేవులోనే సీల్ జంతువులు తిరుగుతూన్నా, ఆధునిక సౌకర్యాలన్నీ వున్నై యిక్కడ. అన్ని సౌకర్యాలూవున్న హోటేలుంది; ఆటో బస్ సర్వీసుంది.

ఓడరేవు ప్రక్కనున్న కొండల్ని దాటితే ఉకాంఛాన్ పట్టణం. ఆపట్టణంలో రాతితో కట్టిన భవనాలు కూడా వున్నై చాలా. ఆరంతస్థుల మేడలున్నై. ఆస్ఫాల్ట్ వేసిన రోడ్లున్నై. రోడ్లకి రెండుప్రక్కలా జనం కిక్కిరిసి నడచే కాలిదారులున్నై. కొత్తగా వచ్చినవాళ్ళు ఆ ఫాక్టరీలూ, ఆ థియేటర్లూ, ఆ పూలవనాలూచూచి సమ్మోహితులు కావలసిందే. గతకొద్ది సంవత్సరాల్లోనూ యిలాంటి చక్కని పట్టణా లనేకం వెలసినై. వీటికి తోడు సుందర పర్వతపంక్తులు. ఈపర్వత శిఖరాలకి మేనెలలో గూడా మంచుకిరీటాలు. కనుల విందుగా నేలకితాకే కొమ్మల్తో వృక్షాలు. ఇవన్నీ చూస్తూ చూస్తూ నడిచెళ్లేటప్పటికి ఓల్గా కాలస్యం ఐంది. తావ్రోవ్ కాస్సే పెదురుచూడవల సొచ్చింది.

సూర్యుడు బాగానే కన్పిస్తున్నాడు. ఐనా చలి చలిగానే వుంది.

"విచిత్రమే" అంటూ ఆలోచనలోపడింది ఓల్గా, బస్సులో కిటికీ ప్రక్కనే వున్న సీటులో కూర్చుంటూ "ఆ వృక్షాల్ని చూస్తూంటే చిన్ననాటి సంగతులు గుర్తుకొస్తున్నై, చిన్నప్పుడు చూచిన దృశ్యాలు గుర్తుకొస్తున్నై — చూశానా?

కన్నానా? బహుశ యేదో కథలో చదివుంటానేమో?— కొయ్యతో కట్టిన యిల్లు. రైలుకంపార్ట్ మెంట్ లాగా ప్రక్కకు త్రోస్తే కదిలే తలుపులు, బూడిదరంగు ఆకాశంలో నల్లగా మెరిసే మెరపుల్లాంటి కొమ్మలున్న వృక్షాలు. ఆ యింట్లోవుండే మనుష్యులుగూడా బాగాపొడుగైనవాళ్ళు, అందమైనవాళ్ళు. చైనావాళ్ళలా పసుపుపచ్చనివాళ్ళు. బహుశా ఆ మనుష్యుల్ని గురించి తర్వాత్తర్వాత ఊహించుకునుంటాను. అదేమిటో ఆ యిల్లూ, మనుష్యులూ-గూడా నేను చూచినవాళ్లేననిపిస్తుంది. అలాంటివాళ్ళు యిక్కడ కనిపిస్తారేమో."

"మీస్వప్నాలు సుందరాతిసుందరంగా వుంటాయి, ఓల్గా పాల్గోవ్నా!" అన్నాడు తావ్ రోవ్.

నున్నని రోడ్డుమీద చరచరా పాకిపోతోంది బస్. కుటీరాలూ, భవనాలూ, పార్కులూ దాటిపోతోంది. కొండ మీదికెక్కింతర్వాత చూస్తే క్రింద అఖాతం పరచుకునుంది.

"ఆపర్వతాల మధ్య పరచుకున్న చక్కనిమైదానంలా గుంది కదూ?" అన్నది ఓల్గా.

ఇంకొక ఓడ వచ్చింది. మంచుగడ్డల్లో ఆ రెండు ఓడలూ చేసినదార్లు రోడ్లలాగావున్నై. ఓడలు రెండు నల్లని కోటల్లా వున్నై. మంచంతా ఒడ్డుకు కొట్టుకొచ్చేసినట్లుంది తెట్టులాగా. ఆ మంచుతెట్టవతల సముద్రం మెరసిపోతోంది. కెరటాలు లేచి పడుతున్నై వణకిపోతూ. దృశ్యం మనోహరంగా వుంది; కాని యేదో పరాయితనం, అర్థంకాని వైముఖ్యం ఆ దృశ్యంలో మిళితమయ్యాయనిపించింది ఓల్గాకి.

తావ్‌రోవ్ మంచువైపు కేస్తున్నాడు అడుగులు. ఓల్గా అతని వెనకే నడుస్తోంది. బీచ్‌లో గులకరాళ్లన్నీ అప్పుడే యెండిపోయినై గాలికి. సముద్రపుకొంగలు, ఒక రెక్క ముడిచి, యింకో రెక్క చాచి, చెక్కర్లు కొడుతూ ఆరుబయలు సముద్రాని కెగిరిపోతున్నై.

ఒక కర్రపుల్ల తీసుకుని అక్కడక్కడా ఇసుక తవ్వడం ప్రారంభించింది ఓల్గా. చచ్చిన పరిగలూ, శైవలమూ బయట పడుతున్నై.

"సముద్రతీరంలో అప్పుడప్పుడూ ఎర్రటి కొంగలూ, తెల్లటిఆటర్లూ (చేపల్నితినే నీటిజంతువులు) గూడ కన్పిస్తాయి" అంటూ వెనక్కి తిరిగి చూశాడు తావ్‌రోవ్. ఓల్గా అతనన్న మాటలు విన్నట్లులేదు; ఇంకా ఆపుల్లతో యిసుక కుల్లగిస్తూనే వుంది.

"ఓల్గా పావ్‌లోవ్నా...." అన్నాడు బిగ్గరగా. ఆవిడ చాలా ప్రశాంతంగావుంది. ముఖం చూడముచ్చటగా వుంది. క్షణకాలం రెప్పవేయకుండా చూచిందతన్ని. అలా ఆవిడ చూస్తుంటే అతని సర్వశక్తులూ తోడి పారేసినట్లుంది; నోట్లో నుంచి మాట పెగల్లేదతనికి.

"కొంగలు ఎర్రగా వున్నట్టే వుంటాయి కాని, వాటి అసలురంగదికాదు; యెండపడడం మూలాన అలావున్నట్టు కన్పిస్తాయి" అన్నదావిడ.

"యెండపడడం మూలానా అలా కన్పిస్తాయనుకోండి" అంటూ అతి అణుకువగా ఆవిడ ముఖంలోకి చూస్తూ "కొన్ని యెర్రకొంగలు గూడా వుంటాయ్" అన్నాడతను.

మంచు గుట్టలమీది కెక్కేందుకని వేసిన బల్లచెక్క లెక్కారు యిద్దరూ. అప్పుడే సముద్రంలోంచి బయిటికి తీసిన చేపలవల ప్రక్కనే పడుంది యింకా తడితడిగా, ఒకమంచు గుంటలో. దాని ప్రక్కనే రకరకాల చేపలు యెండపడి తళుగు తళుక్కుమంటున్నై. ఫ్లౌండర్ చేపలు మరీ బల్లచెక్కలా వున్నై; కళ్ళు రెండూ పైనే వున్నై; వాటికి.

"వాతావరణాన్నిబట్టి రంగులు మారుస్తాయట యీ చేపలు" అన్నది ఓల్గా కాలిబూటుతో ఒకచేపని వెల్లకిలాతోస్తూ. "నేనీ చేపల్నిచూచి చాలా కాలమైంది. క్రిందవైపు నున్నగా, తెల్లగా వుంటుంది అలలు చేసిపెట్టిన పతకంలాగా. అబ్బబ్బ ఎన్నిజంతువులుంటై యీ సముద్రంలో—రకరకాల ఆకారాలు. కొన్ని మరీ అసహ్యంగా వుంటై చూడ్డానికి. ఎందుకనో గాని యీసముద్రం ప్రభావం మహాచెడ్డగా కనిపిస్తుందా జంతువుల మీద. ఐనా అందులో మాత్రం వింతేముందిలే" అంటూ తావ్ రోవ్ కేసి తలెత్తి చూచింది. "ఎన్నివేల సంవత్సరాలనుంచో ఆనీటి బరువుమోస్తున్నాయవి. కాని, నదుల్లో చేపలు చూశారా యెంత బావుంటాయో, చక్కగా."

"నిజవేఁ, వింతేమీ లేదు, కాని యెందుకనో మీమాటలు వింటూంటే నాకేమీ తోచడంలేదు."

"ఏఁ, మళ్లీ నా అభిరుచిని గురించి ఆలోచనలో పడ్డారా ?"

"ఉఁ" అన్నాడు తావ్రోవ్. కాని యింకా అనవలచుకున్నవనలేక పోయాడు. మిమ్మల్ని చూట్టమే ఒక ముచ్చట; మీతో మాట్లాడ్డమే ఒక మహానందం, మీకలలు వింటూంటే మైమరపోస్తుంది. అంతేకాదు, యికమనం విడిపోతామే అంటూ

నా సొద వెళ్ళబొయ్యే దలచుకున్న వాణ్ణి ఒక్క క్షణకాలంలో ఒక్కచూపుచూచి ఆపేశారు; చాలామంచి పనిచేశారు!" అందామనుకున్నాడు కాని అనలేదు.

# 7

హోటేల్ గదిలోకెళ్ళి, బూట్లుతీసి, మేజోళ్ళకాళ్ళకి రగ్గుకప్పి, వెళ్ళి కిటికీ తలుపు తెరచింది ఓల్గా. గాలి చలిగా వుంది ఐనా అలాగే కిటికీమీదికి జారగిలబడి కూర్చుని, బయటికి చూచింది. భవనాలూ, భవనాలవతల నదీ, నదికావలి ఒడ్డునున్న పెద్దరోడ్డూ - అన్నీ కన్పిస్తున్నై. దేవదారు చెట్లడివి వేపుకు పోయి మాయమై పోయిందారోడ్డు. ఒడ్డుకు కొట్టుకొచ్చిన మంచు యింకా మెరుస్తూనే వుంది తెల్లగా. రోడ్డుమీద కార్లెళ్ళినప్పుడల్లా ఉంగరాలుంగరాలుగా పైకి లేస్తోంది దుమ్ము. సముద్రతీరం ప్రక్కనే బడి, శీతకాలం వెళ్ళిపోతోంది. ఇంటిదగ్గర వసంతం అప్పుడే వాడిపోవడం ప్రారంభించింది కాని యిక్కడ, యీ చీకటి కొండలమధ్య, బూరుగు చెట్లలో దాక్కున్నట్లుంది వసంతం. ఇంతలో సముద్రపుగాలి వచ్చింది నునువెచ్చగా; ఓల్గా చెంపల్ని తాకి, జుత్తును చిందరపందర చేసింది. గాలికి లేచిన జుత్తుమీద యెండపడి మెరసిపోయింది. అలసిపోయి సొలసిపోయినట్టు అలాగే మెదలకుండా కదలకుండా కూర్చుండిపోయింది ఓల్గా. ఆవిడ కన్నుల్లో అదేదో మెత్తని కాంతి ప్రతిఫలించింది, పెదవులమీద చిరునవ్వు దోబూచులాడింది. దేవదారుచెట్ల అడవిలో తాను కలుసుకోబోయే వ్యక్తిని గురించి తీయగా వూహించుకుంటూందావిడ.

ఇంతలో తలుపు తట్టిన చప్పుడు. స్లిప్పర్స్ వేసుకువెళ్ళి తలుపుతీసింది.

చూస్తే హాల్లో ఒక పురుషుడూ ఒక స్త్రీ నిలబడు న్నారు.

"డాక్టర్ అర్జానోవ్‌గారి భార్యేనా మీరు?" అనడిగా డతను. అతని గొంతు ఖంగుమంది కంచులా. లోపలకి రమ్మన మని ఆహ్వానించకముందే, గదిలోకొచ్చి, చేయి చాచాడు, కరస్పర్శకోసం. "నాపేరు లొగునోవ్. అక్టోబర్ గనుల్లో ఎంజినీర్ని. ఈవిడ పావారొమనోవ్నా. మా హెడ్ ఎకౌంటెంట్ భార్య. మేం ఇవాన్ ఇవానొవిచ్ గారి దగ్గర్నుంచి వచ్చాం. మీకోసం దారులు చూస్తున్నానని, ఆదుర్దాగా వుందనీ చెప్ప మని చెప్పారాయన. మిమ్మల్ని మాతోపాటే తీసికెళ్ళడం మంచిదని మేమనుకున్నాం".

"ఎట్టాగైతేః మిమ్మల్ని కలుసుకున్నాం! హాయిగావుంది నాకు" అంటూ పావా గూడా కరస్పర్శ చేసింది ఆపాద మస్తకం ఒకేసారి చూచేస్తూ. మెడకి కట్టుకున్న రుమాలు తీసి విదలించింది తెల్లని మెడ కనిపించేట్టు; నెత్తిమీద టోపీ తీసేశి, ఒక్కసారి కురులు గూడా విదలించుకుంది బాదంరంగు జుత్తు కనిపించేట్టూ, తన అందమంతా ఒక్కసారే చూపించాలని సత మతమై పోతూన్నట్టూనూ. పావా అందమైనదే గూడాను. సొట్టలు పడే గుండ్రని గులాబిరంగు బుగ్గలు నిజంగానే ముద్దొ స్తాయి. మనిషి గూడా సువ్వలాగుంటుంది. ఆకర్షణీయంగానే వుంటుంది. కాకపోతే పెదవులకి రంగు కాస్తెక్కువ పూసుకుంది; అసలు చుబుకానికి తోడు యింకొక చిరు చుబుకం తోడైంది; అంతేలోటు.

"నిజంగానే చాలా సంతోషంగా వుందండీ నాకు" అన్నది పావా, కళ్ళు తిప్పుతూ; "ఇక్కడ కాస్త నాగరికత వున్నవాళ్ళే కన్పించరు. నిజం; మాట్లాడదామన్నా దొరకరు. మీరు డాన్స్ చెయ్యగలరా? భలే ప్రశ్నడిగానే. మిమ్మల్ని చూస్తేనే తెలుస్తుంది చెయ్యగలరని! మీజుత్తు రంగు కూడా బాగుంది. వేసవికాలంలో ఆరంగు యింకా బాగుంటుంది, కాదూ?"

"నా జుత్తు రంగు అన్ని కాల్లాలోనూ అలాగే వుంటుంది" అంటూ, లొగునోవ్ వైపుకు తిప్పుకుందితల, ఓల్గా.

టేబుల్ దగ్గర కూర్చుని, దాని మీదున్న పూలరెమ్మ అటూయిటూ తిప్పుతున్నాడతను. స్త్రీల ఆకర్షణ అతని మీదే మీ పనిచెయ్యదనీ, తనతోపాటొచ్చి నావిడమాటలంటే విసుక్కుంటాడనీ కన్పిస్తూనే వుంది.

"ఐతే, నాకోసం చూస్తున్నారన్నమాట ఇవాన్ ఇవానొవిచ్?"

"ఔనండీ. ఈమధ్య మరీ బలహీనపడి పోయారు. ఎప్పుడూ ఒకటే రంధి—పని, పని అంటూ! వచ్చి కాస్సేపేదైనా వినోదంగా కాలం వెళ్ళబుచ్చండీ అంటూన్నేను. నలుగురితో తిరగడం అంటే అంతయిష్టం వుండదాయనకి. ఎప్పుడూ సీరియెస్‌గా వుంటారు. నేనన్నానని యేమీ అనుకోబోకండి. అలా వుంటే మీకూ కష్టమేననుకుంటా; మీరూ వయసులో వున్నారా" అంటూ పావాయే చెప్పుకొచ్చింది.

"ఎక్కడేం మాట్లాడాలో గూడా తెలియనట్టుందే. అసలు తెలియనన్నా తెలియక పోవాలి; లేకపోతే బాగా గారాంగా పెరిగి చెడిపోయన్నా వుండాలి" అనుకుంది ఓల్గా. పైకి మాత్రం

"లేదే, బాగా హుషారుగా వుండే మనిషేనే, నలుగుర్తోనూ ముచ్చటలాడడం అంటే బాగా యిష్టం వారికి" అన్నది.

"ఐతే, మా యింటి దగ్గర సిగ్గుపడ్డారేమో" అని వెంటనే వొప్పేసుకుంది పావా.

"నలుగురితో తిరగడం బాగా యిష్టం వారికి" అన్నాడు లొగునోవ్, ఓల్గాతో మటుకే మాట్లాడుతున్నట్టు. "బంగారం లాంటి మనసు. ఎక్కడెక్కణ్ణుంచో వస్తారు జనం ఆయన్ని చూసి, ఆయన్తో మాట్లాడి పోదామని, దూరాభారాలు గూడా లెక్కచెయ్యకుండా." ఆ డాక్టరుగార్ని గురించిన ఆలోచనల మూలానో, మరి ఆ మాటలు విన్న తర్వాత ఓల్గా ముఖంలో కన్పించిన కృతజ్ఞతా భావంవల్లనో చెప్పలేం కాని మొత్తం మీద ఒక చిరునవ్వు నవ్వి, "మాతోపాటు రమ్మనమని ఆహ్వానించడాని కొచ్చాం మేం. రేపు దయమే బయల్దేరుతున్నాం రెండు కారుల్లో. మీరుగూడా వస్తారా మరి? బస్సుకంటె తొందరగా వెళ్ళిపోవొచ్చు కారుల్లో ఐతే" అన్నాడు.

"ఓ. తప్పకుండాను. మీతోనే వస్తా. కాని డాక్టర్ కి ఫోన్ మాత్రం చెయ్యకండి. ఏవార్తా లేకుండా వూడి పడాలనుంది ఆయనముందు!"

# 8

మర్నాడు పొద్దున్నే పెందలకాడే లొగునోవ్ వచ్చి తలుపుకొట్టాడు. బయట రెండుకార్లున్నాయి. అందుట్లో ఒకదాంట్లో పావా వెనకసీట్లో కూర్చునుంది. డ్రైవర్ పక్కనే ముందుసీట్లో ఆవిడభర్త కూర్చునున్నాడు. ఆవిడ

లాగానే గులాబీపువ్వులా వున్నాడు. మిలిటరీకట్ సూటు, పెద్దతోలుబెల్టు. ఆబెల్టుకొక సంచీ, ఒకఫ్లాస్కూ, అన్నీఅప్పుడే కొన్నట్టుగా వున్నై సరికొత్తగా. వాటితోపాటు అప్పుడే గీసిన గడ్డం. నిండుపెదవులమీద కొద్దిగా కన్పించుతూన్న మీసం- అతనూ అలాగే వున్నాడు.

ఆహ్వానించేందుకతను తడబడుతూ కారుదిగి రాబోతుంటే, "ఇలాంటి ఎకాంటెంట్ నిదివరకెప్పుడూ చూడలేదే! సైనికుడి వేషం వేసుకుని గంతులేయబోయే కుర్రాడిలాగున్నాడు" అనుకుంది ఓల్గా.

"మీరొచ్చేది మా కారులోనే" అంది పావా, బుగ్గలన్నీ సొట్టపడేట్టు మాట్లాడుతూ. "వీలుంటే సామానుగూడ మా కారులోనే వేసుకుంటాం. లేకపోతే సామాను స్కొరొబొగతోవ్ కారులోవేసి, లొగునోవ్‌ని మాకారులో ఎక్కించుకుంటాం; ఊరికే వెనకసీట్లో కూర్చుంటే ఆయనకీ యేమీ తోచదు. నికనోర్ పెట్రోవిచ్! లొగునోవ్ మాకారులోవస్తే మీకేమీ అభ్యంతరము లేదుకదూ? నికనోర్ మాజిల్లాపార్టీ సెక్రెటరీ" అని చెబుతూ అతనుకూర్చున్న కారువేపుకు నెట్టింది ఓల్గాని; ఈవిడేనండీ మా డాక్టర్‌గారి భార్య" అని పరిచయంగూడా చేసేసింది.

కారు కిటికీలోంచి చేయి బయటకి చాపి కరస్పర్శ చేశాడు కార్యదర్శి. ఆయనకి నలభై కి తక్కువలేకుండా వుంటుంది వయసు. గోధుమరంగు కనులు కొద్దిగా ఎర్రబడినట్టున్నై గుండ్రంగా. ఆకన్నుల్తో ఆయన రెప్పవేయకుండా ప్రశాంతంగా చూస్తూంటే ఎందుకనోగాని ఓల్గాకి చెమట పట్టినంత పనైంది.

అతనటు తిరిగి డ్రైవర్‌తో మాట్లాడడం ప్రారంభించ గానే, "ఎందుకనబ్బా! కారుగూడా దిగకుండా కరస్పర్శ చేశాడు?" అని విస్తుపోయింది ఓల్గా.

ఇకా సంగతిని గురించి ఆలోచించే అవకాశంగూడా లేకపోయింది. పావావచ్చి తొందరపెట్టి కారులో కూర్చో బెట్టింది. ఒకచోటే హడావిడి. ఓల్గాకి లోగునోవ్‌కీమధ్య కూర్చుంది తాను. పొట్లాలు, పాకేజ్‌లూ కారునిండా యెక్కడబడితే అక్కడ పడేసింది. కారుకదిలేదాకా సర్దుతూనేవుందవి అక్కడ విక్కడా; యిక్కడి వక్కడా.

"ఇకాపు పావా, కూర్చున్నచోటే కూర్చో, యీ ప్రయాణంలో యింకా మధ్యలో సీట్లుమార్చడం యెందుకులే" అన్నాడు ప్రొఖిన్. అతని ముఖం అద్దంలో కనిపించింది పావాకి; కోపం వచ్చినట్టుంది.

"ఐతే, యెల్లుండికి చేరుకుంటామా మనం?" అనడిగింది లోగునోవ్‌ని.

"చేరుకోవాలిమరి. లెనిన్‌గ్రాడ్ పెద్దరోడ్డులాగా యీ రోడ్డుబాగానేవుందికదా. ఎనిమిదేళ్లక్రితం యిక్కడ చిన్నకాలి దారి వుండేది. అంతా బురదమయం. గుర్రాలుతప్ప యింకేమి వెళ్ళాలన్నా కష్టంగా వుండేది. దగ్గరదగ్గర నెలరోజులు పట్టేది ప్రయాణం."

ఇంతలో పావా అందుకుంది. "చెబితే నమ్మరుగాని, యింత వెనకబడిన ప్రాంతమా? సోవియట్ ప్రభుత్వం యెన్ని చేసిందెన్ని చేసింది! ఎంతచక్కని భవనాలు, ఎంతగొప్ప సంస్కృతీ కార్యక్రమం?" అంటూ, వెంటనే "అయ్యో, భలే

పనిజరిగిందండీ, చూశారా కామిల్లాకి టోపీ కొనడం మర్చి పోయాం" అనిగూడా అనేసింది.

"వెళ్ళి కొనుక్కురారాదూ యిప్పుడు?" అని నవ్వాడు.

"మీకేఁ మీరలాగే నవ్వుతారు. అసలు పిల్లలంటే లెక్కుంది గనకనా మీకు?" అంటూ చీవాట్లు పెట్టింది.

అతనికీ కోపం వచ్చినట్లుంది. "పర్స్‌లో యింకా_స్త చిల్లర మిగిలిపోయి నప్పుడుగదా నీకైనా ఆపిల్లలు గుర్తు కొచ్చేది?"

"ఎప్పుడూయిలాగే అర్థంలేకుండా మాట్లాడతారాయన మీరేమీ అనుకోకండి" అని, ఓల్గాతో "ఐనా మగవాళ్లకేం తెలుస్తుందండీ పిల్లల విషయం?" అన్నది.

ఓల్గా మాట్లాడలేదు; తన చిన్నిని గురించి ఆలోచించు కుంటూంది. ఊలుతో కట్టిన ఆ చిన్నిచిన్ని జెడలు, కిండర్ గార్డెన్‌లో హుషారుగా అటూయిటూ తిరిగేతీరు, చూపించితే చాలు అందుకుపోయే తెలివితేటలూ....చివరికంతా విషాద మయం.

దేవదారుచెట్ల అడవిలో పడిపోతున్నై కార్లు. గాలి కాస్త నునువెచ్చగావుంది. పచ్చనిచెట్లు, అక్కడక్కడా యింకా మంచు కనిపిస్తూంది. ఒక్కచోట రోడ్డుప్రక్కన చాపంత కదుములు కట్టుంది; నిటారు చెట్లచివర ముద్దలు ముద్దలుగా పేరుకునుంది.

ఇంకాస్సేపటికి, అలసిపోయిందేమో, కునుకు తీస్తోంది పావా. ప్ర్యాఖిన్‌గూడా సీటుమీద తలజేరేసి నిద్రపోతున్నాడు ఎర్రటి పెదవులదోరకంగా బిగించి. చూస్తే నవ్వొస్తోంది. మాటల కడుతగిలే వాళ్లెవరూ లేకపోవడం చూచి, లొగునోవ్

ఆ శీతాకాలపు మంచునిగురించీ మంచు తుపానుల్ని గురించీ చెప్పడం ప్రారంభించాడు ఓల్గాకి. ఒక్కోసారి ఆ తుపాను మూలంగా రోడ్లుగూడా మూతపడిపోతాయి. చెట్లకి చెట్లు వేళ్లతోసహా లేచి దూరంగాపడి మంచులో కూరుకుపోతాయి. మళ్లీ వేసవి వొచ్చేవరకూ వాటిని కదిలించడం యింకెవరి తరమూ కాదు.

"ఎందుకూ? ఆ పెద్ద పర్వతాలదగ్గరకెళ్తే మీకే తెలుస్తుంది" అన్నాడు, నిద్రపోతూన్న పావా జారి తనమీద పడితే, పట్టుకుని దూరంగా సరిగా కూర్చోబెడుతూ. "ప్రతి సంవత్సరమూ ఆ పర్వతాల పాదాలదగ్గర పెద్దపెద్ద మంచు కొండ లేర్పడుతాయి. భూగర్భం జల బయటికొచ్చే మార్గం పూడిపోతే అలాంటి వేర్పడతై. నదుల్లోనూ అంతే, కాకపోతే నదిలో నీరు గడ్డకట్టుకునేప్పటికి నీరంతా బాగా అటూ యిటూ సర్దుకుంటుంది. అలాంటప్పుడు నదుల్లో వరదలొస్తే "నది ఉడికిపోతోంది" అంటారిక్కడివాళ్లు. క్రిందటేడు అలాంటి వరదల్లోనే చిక్కుకుపోయారు ఇవాన్ ఇవానొవిచ్, ఒక రోగిని చూచేందుకు దుప్పిబండిమీద వెళ్తూ. మీకు పత్రికలో వ్రాయాలా ఆ సంగతి? ఆయనా, ఆయన్తో పాటున్న మనిషీ యిద్దరూ గడ్డకట్టుకుని చనిపోయినంత పనైంది. మంచి చలికాలం."

"ఆ దుప్పి యేమైంది?"

"ఎట్లాగో కష్టంమీద ఒడ్డుకు చేరుకుంది. సామానూ సంచులూ బండీ వరదపాలై పోయినై. అదేమిటి? అలా ఐపోయారు? అరే! నాకు తెలిస్తే అసలీ సంగతే యెత్తేవాణ్ణికాదే!"

# 9

బక్క పలాచటి యకూత్‌జాతి పిల్ల గెంతుతూ ఒక చిన్న గుంటదూకి కంచెదగ్గర కొచ్చింది.

"నేను టీ తాగొస్తాను. ఇదిగో మీ పార," అంటూ ఇవాన్ ఇవానొవిచ్‌ని కేకేసింది.

"నువ్వు చాలా మంచిపిల్లవి, వార్యా! సరే వెళ్ళి టీ తీసుకురమ్మా" అంటూ కంచెదగ్గరకొచ్చి పార అందుకున్నాడు ఇవాన్ ఇవానొవిచ్.

పనిచేసుకునేప్పుడు వేసుకునే దుస్తుల్లో వున్నాడు. మధ్యవయస్సు. చక్కని తల; నల్లని జుత్తు పదుపంది ముళ్లలా నిక్కబొడుచుకునుంది. విశాలమైన వక్షస్థలం. ధృఢ విశ్వాసాన్ని సూచించే నోరు. మనసు విప్పి, వుదారంగా నవ్వ గలిగే గోధుమరంగు కనులు. పార తీసుకుని అప్పుడే కంచె వేసిన చోటికి సాగి వెళ్లాడు. వార్యా పరుగెత్తుకుంటూ వెళ్లి పోయింది యింటివైపుకి; ఆ పరుగుకి జడ లటూ యిటూ గెంతిసై ఆయమ్మాయితోపాటు.

"ఇక చూద్దాంగా, ఎవరిపని ముందు పూర్తౌతుందో. డెనిస్ అంతానొవిచ్ ! యిక మీరు బాగా నడుంవంచి పని చెయ్యాలి మరి. మీరెంత ఆశ్వికదళంలో పనిచేసిన ఫెల్డ్ షెర్ (శిక్షణపొందిన నర్స్‌కంటే ఉన్నతమైన డిగ్రీలున్న వైద్యుడు, డాక్టర్ కంటె క్రింది తరగతివాడు) లైనా మీకున్న శక్తియుక్తులన్నీ వుపయోగిస్తేనేగాని యీపోటీకి ఆగలేరు. నేలమీద పనంటే యేమిటో చెబుతాగా మీకు !" అంటూ ఒక వైపునుంచి పారతో చెక్కడం ప్రారంభించాడు ఇవాన్.

"ఇక మాకు మీ ముల్లంగీ అవీయేమీ అవసరంలేదు ! నాకూ, ఓల్గాకీగూడా సరిపడ మేమే పండించుకోగలం; ఏమనుకున్నారో, యీకమీవన్నీ తినేస్తున్నామని ఎవరూ అనేందుక్కూడా అవకాశ మివ్వను."

ప్రక్కని పనిచేస్తూన్న మనిషి నవ్వుతూ తనపని తాను చేసుకుపోతున్నాడు. టోపీలోంచి బయటికి కొచ్చిన రాగి జుత్తు ఎగిరెగిరి పడుతోంది. బాగా బలంగా వున్నాడు. వయసు నలభయ్యేరుదాకా వుంటుంది. పెద్దనోరు. వెడల్పాటి ముక్కు, చిన్నపిల్లల్లా నిర్మలమైన నీలిరంగు కళ్లు.

"అట్లా యెందుకు నవ్వుతూన్నట్టు? మీరు చేసేది పనేనా ? ఆ మంటి పెళ్లలెందుకూ అలా పోగుబెడతారు ? భోజనానికని పళ్లెంలో రొట్టెముక్కలు పేరుస్తున్నట్టుంది ! ఆ పెళ్లల్ని చితగొట్టరేం ?" అన్నాడు ఇవాన్ మళ్లీ.

"సరే, మీరు చెప్పినట్టే చేస్తాలెండి" అని పెళ్లలు చితగ్గొట్టడం మొదలెట్టాడు డెనిస్. "ఐనా యిప్పుడివి చితగ్గొట్టడం అనవసరం. రెట్టింపుపని. ఎందుకూ, వర్షం కురిస్తే వాటంతటికవే కరిగిపోతై. ఇంకొక మడిగూడా పూర్తిచేస్తేనే గాని పనైనట్టుగాదు. ఐనా యీ అడవిలో వుండడం యేమిటి? వేటకి వీలుగావుంది కాబట్టిగాని లేకపోతే యెప్పుడో వెళ్లిపోయేవాణ్ణి ఇక్కణ్ణుంచి. దీన్ని నేలన్నా తప్పే. ఏమి వాతావరణం, ఏమినేల ? బంగాళాదుంపలూ, ముల్లంగీ తప్ప యింకేమీ పెరగనుగూడా పెరగవుగదా. మా రాష్ట్రం వుందే, క్యూబాన్, దాన్ని చెప్పాలి. ఏం వనాలనుకున్నారు! ఏం తోటలనుకున్నారు ! ఎక్కడ చూచినా పపుల్ తోటలే. ఇక పూలసంగతి చెప్పే అవసరం లేదు. నేను మాయింటికి

దగ్గరా, హాస్పిటల్లోనూగూడా పెంచేవాణ్ణి పూలమొక్కలు....
........" అంటూ పని ఆపేసి, నిలబడి, పారమీగ మోచే యాన్ని, అరచేతిమీద గడ్డం ఆన్చి, మధురస్మృతులు నెమరు వేసుకోవడం ప్రారంభించాడు డెనిస్.

"చాల్లేయిక. మీ పూలూ మీరూనూ. పనిచెయ్యండి. ఎందుకూ వూరికే కోతలు కోస్తారు. ఇందాక నేను పనసు పోయిన పారతో పనిచేస్తూంటే వచ్చి సలహాలిచ్చారే అదే పనిగా. ఇప్పుడేమైనై ఆ తెలివితేటలు. ఊరికే అర్థంలేకుండా యెప్పుడో అది చేశాను యిదిచేశాను అంటూ చెప్పుకొస్తా రెందుకు ?"

"నిజంగానే, ఇదేం వాతావరణం, యేంకధ!" అంటూ మళ్లీ పని ప్రారంభించాడు డెనిస్. "పగవాళ్లుగూడా వుండ కూడదు బాబూ యిక్కడ. ఒక్కమంచి పక్షిగూడ కనబడ దాయె. కోకిల మాటట్లావుంచి. కాకి కనిపించటం గూడా గగనమేనాయె. ఇన్నిరోజులికి నిన్న కనబడిందొక కాకి. ఎన్ననుకుని యేంలాభం. ఇదంతా ఎలీనా చేసిన పొరపాటు. పెళ్లయిపోగానే చెప్పాను యిక్కడెందుకు కుర్స్కాన్లో యింటికెళ్లిపోదామని వింటేనా? ఈచేపలూ, యీపర్వతాలూ వొదిలి రాలేనంటుంది; అక్కడికి కుర్స్కాన్లో పర్వతాలూ, చేపలూ లేనట్టు." ఆకోపం యీకోపం కలిపి పారతో దుమ్ము రేగొట్టడం మొదలెట్టాడు.

"ఇప్పుడు మాత్రం యేంముంచుకపోయింది? వెళ్ళ రాదూ?" అన్నాడు ఇవాన్ ఉడికిలిస్తూ.

"ఇప్పుడా? ఆఁ. యింకా యిప్పుడేం వెళ్తాలే. ఈ సైబీ రియాలో కూరుకుపోతిని. నలుగురు పిల్లలు, సైబీరియాలో

పుట్టిపెరిగిన భార్య. ఇంకెట్లా కదుల్తాను? నాలుగు ఇనప గొలుసుల్తో నాలుగుసార్లు చెట్టుకక్కట్టేసినట్టయిపోతే? యింకా యిప్పుడింకెక్కడికి కెళ్తాను?"

"ఇప్పుడు మీరన్న మాటలన్నీ ఎలీనాతో చెబుతాలే ఆగండి, అప్పుడు తెలుస్తుంది మీపని!"

"చెప్పుకోండి. నాకేం నాసంగతిదివరకి తెలియందు గనకనా——మొండిపట్టు ఉక్రేనియన్ని. బుర్రలేదని అంటూనే వుంటుందిగా నిజంగానే బుర్రలేదేమోలే; లేకుంటే ఆవిడ కెందుకు లొంగిపోతాను; యిక్కడ నాజీవితమంతా యిట్ల వృధా యెందుకు చేసుకుంటుంటాను? కాని యింకొక గమ్మత్తు చెప్పనా: మూడేళ్ళ క్రితం ఒకసారి క్యూబాన్ కెళ్ళా. మా వాళ్లున్నారుగా; చూద్దామని వెళ్లాలే సెలవుల్లో. మీరు నమ్ము తారో నమ్మరోగాని సెలవులు పూర్తికాకముందే తిరిగొచ్చేశా. ఆగలేకపోయానంటే నమ్మండి ఈ సైబీరియా నొదిలి. అప్పుడు ఎలీనా నేనూమార్తైగా గనుల్లో పనిచేస్తుండేవాళ్ళం. ఏపుల్ పళ్లు పక్వానికొస్తై యింకా నాలుగురోజులాగమని మావాళ్లు చాలా బలవంతం చేశారు. నేనాగితేనా! సైబీరియా వెళ్ళి పోవాలిబాబూ, యికిక్కడ వుండలేనని చెప్పేశాను. మాసైబీ రియాలో పేద్దపేద్ద పర్వతాలున్నై; యింతింత చేపలున్నై అనిగూడా చెప్పాను" అంటూ డెనిస్ మళ్లీ పనాపి సౌంజ్ఞ చేసి చేతుల్తోచూపాడు; "అప్పుడువాళ్లూరుకున్నారా. ఇక్కడా వున్నై కొండలు, యిక్కడా వున్నై చేపలు"అన్నారు. మాంసం కూర మీరొండినట్టు మేమూ వండుతాం అని కూరగూడా వండి పెట్టారు పాపం! ఎంత శ్రమ పడితేనేం, ఎలీనా వండినట్టు వండడం వాళ్ల తరమా! అబ్బాయ్ మీ కొండలేరు, మా పర్వ

తాలేరు. మీ చేపలు మీచేపలే, మా చేపలు మాచేపలే. కాబట్టి లాభంలేదు. మా సైబీరియాకి నేను వెళ్లిపోవలసిందేఅని మూటా ముల్లీ కట్టుకుని వచ్చేశా. చివరికి కోస్ట్రక్‌నే అనిపించా!" అంటూ ఒక దీర్ఘ నిశ్వాసం వదిలాడు డెనిస్.

# 10

వార్యా వెంటనే వచ్చేసింది, గుడ్డలుగూడా మార్చుకోని. ఈ దుస్తుల్లో యింకా చిన్నదిలాగా వుంది. యింకా ఆకర్షణీయంగా వుంది. బూడిదరంగు బ్లౌజ్, పెద్ద బెల్టు, సాదా బూట్లు.

"వార్యా! మేం యిద్దరం పొగ తాగేదాకా కాస్త పని చెయ్యమ్మా!" అన్నాడు డెనిస్.

"యింట్లో కబుర్లేమిటి? ఈ పూటకి ఎలీనా యేం చేస్తాం దేమిటి?"

ఇవాన్ ఇవానొవిచ్ వంక దొంగ చూపులు చూస్తూ, "మీరనుకున్న దానికంటే యెక్కువే చేస్తోందలే. ఊహించడం గూడా మీవల్లగాదు" అన్నది వార్యా మృదువుగా; "వంటంతా పూర్తైపోయింది. రొొట్టె పొయ్యిమీద పెట్టి హాస్పిటల్ కెళ్లింది. ప్రసవం కావలసిన కేసు గడ్డు కేసొకటి వచ్చిందట."

"ఏం? కబురు చేశారా?"

"కబురు చెయ్యరూ మరి" అంటూ మళ్లీ ఒకసారి చూచింది ఇవాన్ వంక అందులో యేదో ప్రాముఖ్యం వున్నట్టు.

"మరి పొయ్యిమీద రొొట్టె?"

"పొయ్యిమీదే వుంది."

"ఈ పాటికి మాడి మసై వుంటుంది"

" అహాఁ హాఁ అదేమీ జరగదు. అదే గొప్పమరి. కొత్త వంట మనిషిని సంపాయించింది ఎలీనా. "

"కొత్తవంట మనిషా ?"

"మరేమనుకున్నారు ? కారులో దిగించా మనిషి. తెలుసా ! రాగానే పని ప్రారంభించింది. అటు కాగుతూన్న పాలు చూడాలి; యిటు పొయ్యిమీద రొట్టెనీ, నటాషానీ చూడాలి. ఇంతకీ వచ్చింది మీభార్యాండీ, ఇవానొవిచ్ గారూ!" అని మెల్లగా ముగించింది వార్యా.

నమ్మలేక పోయినట్టు "నిజంగానేనా, వార్యా !" అని కేకేశాడు ఇవాన్; నవ్వి కడుతూ కడుతూన్న సిగరేట్ కాగితం దూరంగా పారేసి, కిందపడిపోతున్న పొగాకువంక చూడను గూడా చూడకుండా కంచెదూకి యిళ్ళవైపుకి పరుగెత్తాడు.

తనకేమీ పట్టనట్టు పారపుచ్చుకున్నాడు డెనిస్; కాని పని సాగలేదు. పనాపి,

"ఎట్లావుంటుంది ? బావుంటుందా ?" అనడిగాడు.

"బాగానే వుంటుంది ? రష్యన్లలో బాగా అందమైన దానికిందే జమ. మా యకూత్ జాతిలో ఆలాంటివాళ్ళు దివిటీ పట్టుకు వెదికినా కన్పించరు. నటాషా జుత్తులాగానే ఆవిడదీ వెండి జుత్తు. ఆకుపచ్చని కళ్లు."

"కళ్లాకు పచ్చగా వుంటాయా ? హుఁ బావుంటాయా ఆకుపచ్చ కళ్లు ?"

సమాధానం చెప్పడం వార్యా కేమంత యిష్టంగా లేదు ముందు. కాస్సేపాగి,

"ఇవానొవిచ్‌కి ఆ కన్నులంటే ప్రాణం గదా, అంటే అందమైన వన్నమాటేగా" అంది, నిర్ణయం చేసేసినట్టు.

ఇవాన్ వెళ్లి తలుపు తెరచాడోలేదో, ఓల్గా గూడా వచ్చేసింది. డీ కొట్టినంత పనైంది. చేతుల్లోకి తీసుకుని ముద్దు పెట్టుకున్నాడు; అట్లాగే గదిలో కెత్తు కెళ్లాడు.

ముహం రెండు చేతుల్తోనూ పొదివి పట్టుకుని, ప్రేమగా, మెరిసే ఆవిడ కన్నుల్లోకి చూస్తూ "వచ్చేశావా ఓల్గా! నువ్వేనా వచ్చేసింది" అంటూ ముద్దుల వర్షం కురిపించాడు. ఆ వుత్సాహంలో ఓల్గాకి కూడా ఊపిరాడలేదు. ఇవాన్ భుజాలూ చేతులూ నిమిరింది. "ఇదేమిటీ, నీ బుగ్గమీది మురికేమిటీ!" అంటూ ఆశ్చర్యంగా అడిగి, మళ్లీ అంతలోనే, "ఓహో, నేను చేసిన మురికేనా! ఏమీ అనుకోకు, యిప్పటిదాకా, ఆ డెనిస్ తో కలిసి తోటలో పనిచేస్తున్నాను. ఆ మట్టిమురికే నీకూ అంటించా. ఓల్గా! నిజంగానే యెంత సంతోషంగా వుందని నాకు" అన్నాడు ఇవాన్, మళ్లీ ఒకసారి గట్టిగా హృదయానికి హత్తుకుని హుషారుగా నవ్వుతూ.

ఇప్పటిదాకా బొమ్మల్తో ఆడుకుంటున్న చిన్నపిల్ల నటాషా వాళ్ళ వైపుకు తిరిగి వింతగా చూస్తోంది, ఇద్దరు పెద్దవాళ్ళలా పగలబడి నవ్వుతూ ముద్దుపెట్టుకోవడం.

ఆ చిన్నపిల్ల అమాయకపు చూపులూ, కనులూ చూచేప్పటికి దుఃఖం ముంచుకొచ్చింది ఓల్గాకి; పెదవులు బిగబట్టుకుని, కళ్లనీళ్లు బెట్టుకుంటూ, భర్త వక్షంమీద దాచుకుంది ముహం.

ఇవాన్‌కి కూడా దుఃఖం ఆగలేదు. "ఊరుకోమరి, యెందుకలా యిదౌతావు, మనం చేయగలిగిందేం వుంది చెప్పు. చూడు నటాషా కూడా ఏడవబోతోంది. ఆఁ. ఏడుస్తోంది కూడాను !"

"ఇదేమిటి? ఎవరేడ్పిస్తున్నారమ్మా నా బంగారు తల్లిని" అంటూ ఒకావిడొచ్చింది గుమ్మంలోకి అప్పుడే.

వచ్చినావిడ మంచి ఆరోగ్యమైన మనిషి. అంతచలిలోనూ పల్చటి దుస్తులేసుకునున్నా, హుషారుగానే వుంది. ఆవిడముందు కన్నీరు కార్చటం దుర్లభమైపోయింది. వచ్చీ రావటమే నటాషాని తీసుకుని బుజ్జగించింద. పాపాతో ఆ చిన్నపిల్లన్నమాటలు చెప్పి ఓల్గాకీ, ఇవాన్‌కీ నవ్వు తెప్పించింది గూడాను.

"అందులో నటాషా యిదివరకెప్పుడూ ఆ గుంటనక్క తోలుకోటు చూడను గూడా లేదా. పట్టణం నుంచి పాపా కొనుక్కొచ్చిన ఆ తోలుకోటు చూచి ఒకటే యెగబడటం! గుంటనక్కనీ చూచింది కాదాయె. అందులో ఆ కోటుకి నక్క తలా, తోకా గూడా అట్లాగే వున్నై. అందుకని, పాపా దగ్గరకెళ్లి 'దాన్ని కిందికి దించూ" అని ఒకటే గోల. కింద పెట్టింతర్వాత, దాని కాళ్లూ తలా చూచి, యిదెందుకు పరుగెత్తదని ఒకటే రభస. ఈ జంతువు నావిడట్లా భుజాల మీదేసుకుని తిరుగుతుందేమిటా అనుకుంటూ మన నటాషా ఆలోచన! వదిలిపెట్టందే దాన్ని. 'అమ్మాయ్! అది కరుస్తుంది కూడాను' అని భయపెట్టిం తర్వాతగాని వదల్లేదు."

"ఎందుకూ, ఆ చిన్నపిల్లనలా భయపెట్టడం?" అన్నాడు ఇవాన్. యిప్పటికైనా పశ్చాత్తాప పడమని నవ్వుతూ చెబుతున్నట్టు.

"ఏం ఫర్వాలేదు, కిండర్ గార్టెన్ ధర్మమా అంటూ పిల్లలంత తేలిగా జడుసుకోవడం మానేశారు!" అన్నది డెనిస్ భార్య, ధన్యవాదాలర్పిస్తున్నట్టు.

వంటింట్లో పని చకచకా సాగింది, ఆవిడటూ యిటూ తిరుగుతూంటే; పని ఆవిడ చేస్తోందో, లేక పని దానంతటదే సాగిపోతుందో తెలియడంలేదు; అంత నైపుణ్యం వుందావిడ చేతుల్లో; అలాంటిది ఆవిడ హస్తవాసి.

ఒక్కక్షణంగూడా ఆగకుండా తనపని తాను చేసుకుంటూనే, మాటలు చెప్పడం ప్రారంభించింది.

"మగపిల్లాడు పుట్టాడు. బాగా దుండుముక్కలాగా వున్నాడు. తల్లిగర్భాన పుట్టినట్టు పుట్టాడు. మంత్రసానీ పెద్ద అనుభవం వున్నదికాదు; అందుకని కంగారు పడిపోయింది. ఇరవయ్యేళ్ళ అనుభవం వున్నదాన్ని నేనే గాభరాపడి పోయాను. కుర్రాడు చనిపోతాడేమోనని గూడా భయపడ్డాను. ఎంతోసేపు కష్టపడింతర్వాత, ఎట్లాగైతే, చిట్టచివరికి ఊపిరి పీల్చాడు. ఇక తరవాత తారస్థాయిలో యెత్తుకున్నాడు యేడుపు. 'ఇక కరువుదీరా యేడున్ను బాబూ, నాకింటిదగ్గర చచ్చినంత పనుంది' అనుకుని బయల్దేరి వచ్చేశా."

"భోజనం మట్టుకు వాళ్ళింట్లో చేస్తాను. ఇంటికి భాగంలోనేమో వుంటాను" అని చెప్పాడు, ఓల్గాతో వరండా మెట్లెక్కుతూ. ఇద్దరూ సూట్ కేసులూ అవీ తీసుకుని వాళ్ళుండే భాగంవేపుకి నడుస్తున్నారు. "డెనిస్, అతనిభార్య ఎలీనా — యిద్దరూ చాలామంచివాళ్ళు. నువ్వుగూడా తొందరగానే

స్నేహం చేసుకుంటావు వాళ్ళతో. ఇంకొక పడుచుపిల్ల గూడా వుంటోంది వాళ్ళతో పాటు; పేరు వార్యా."

భోజనాల గదిలో టేబుల్ మీద, సూట్ కేస్ పెడుతూ "పడుచుపిల్లా ?" అనడిగింది ఓల్గా. మళ్ళీ ఒకసారి భర్తని కౌగలించుకుని, రొమ్ముమీద తలాన్చి, "ఎవరూ ? నేనొచ్చానని మీకు కబురు తెచ్చినమ్మాయేనా ?" అనడిగింది.

"ఆఁ, ఆ అమ్మాయే. చికిత్సకోసమని వచ్చింది జబ్బు పడి. నేనే చికిత్స చేశాను. ఆపరేషన్ చెయ్యవలసొచ్చింది. అప్పట్నుంచీ యిక్కడే వుండిపోయింది. ఇప్పుడు నర్స్ కోర్స్ చదువుతోంది; హాస్పిటల్లో పని నేర్చుకుంటోంది. మొట్ట మొదట్లో చాలా సిగ్గుసిగ్గుగా వుండేది; ఇప్పుడు ఫర్వాలేదు. చక్కగా వుంటుంది ముద్దొస్తూ."

"మీరు ప్రేమించడం లేదుగదా దాన్ని ?"

"ఆఛాన్స్ నా దాకా రానిస్తారా ఇక్కడి కుర్రాళ్ళు ? ఎప్పుడూ ఆవిడ వెనకే పడి తిరుగుతుంటారు."

"మీరు ప్రేమించడాని కభ్యంతరం అదే నన్నమాట. ఇంకే కారణమూ లేదన్నమాట ?" అంటూ బాధపడుతున్నట్టు, దూరంగా జరిగి కూర్చుంది ఓల్గా.

బిగ్గరగా నవ్వుతూ, దగ్గరకెళ్ళి, కౌగలించుకుని, "ఆ అసలు కారణం యేమిటో నీకే బాగా తెలుసు కదూ?" అంటూ ముద్దెటుకున్నాడు ఇవాన్.

# 11

భోజనానికంతా సిద్ధంగా వుంది. శుభ్రంగా కాళ్లూ

చేతులూ కడుక్కుని, ఎంబ్రాయిడరీ చేసిన ఉక్రేనియన్ బ్లౌజ్ వేసుకున్నాడు డెనిస్. ప్రక్కవాళ్ళు తలుపుతీసిన చప్పుడు వినబడుతుందేమోనని కనీసం నాలుగైదు సార్లైనా వెళ్ళొచ్చాడు వరండాలోకి. ఇంట్లో తెరలూ అవీ అన్నీ సర్ది, పెద్ద పిల్లలిద్దరూ వాలీబాల్‌ని బాగుచేసుకుంటూంటే వాళ్ళకి సాయం చేస్తోంది వార్యా. ఇంకా, ఇవాన్ ఇవానొవిచ్, ఆయన భార్యారాలేదు.

"వెళ్ళి పిలుచుకునొస్తాను వాళ్ళని" అన్నాడు డెనిస్ చివరికి.

"భలేపని!" అంది ఎలీనా కృత్రిమకోపం నటిస్తూ, "పిలిచికెళ్ళడానికొచ్చారు గదాని సంతోషిస్తారు గూడాను వాళ్లు!"

"ఏంచేద్దాం మరి? ఆలస్యమైపోవడంలా? అన్నీ ఆరిపోతుంటేను"

"చల్లబడితే, మళ్ళీ వేడిచేద్దాం. మీకు మరీ ఆకలేస్తోంటే ఒక సాండ్విచ్ చేసుకుతిని, ఒక గ్లాసుడేమున్నా తాగండి. బొత్తిగా పాపం! మరీ అలిసిపోయారు గూడాను?"

"నిజంగానే అలసి పోయాను. ఏం, అలవలేదంటావా?" అన్నాడు చిన్నపిల్లాడిలా కోపంతో యెగిరెగిరి పడుతూ.

"ప్రొద్దుట్నుంచీ పనిజేశాం నేనూ ఇవాన్ కలిసి, మాటలనుకున్నావేంటి!"

"పొద్దుట్నుంచీనా! బాగానే వుంది. ఒకళ్ళనొకళ్లు చూడాలని యేడాదినుంచీ యెదురు చూశారు వాళ్ళిద్దరూ; ఆమాట మరచిపోయారా మీరు? అందులోనూ ఆలస్యం

చేస్తూంది మరెవరూ కాదు; ఇవాన్ ఇవానొవిచ్! అంటే తగినంత కారణం వున్నదన్నమాటే."

"నువ్వు చెప్పేది నిజమేలే" అన్నాడు డెనిస్, చిరునవ్వుతో. "క్యూబాన్‌నుంచి ఒచ్చానే నేను. ఆరోజులు గుర్తున్నయ్యా నీకు!"

"చాల్లే ఇకాగండి" అంటూ వొడిలో వున్న పిల్ల తల దువ్వడం ప్రారంభించింది ఎలీనా. ఆపిల్ల అచ్చురాలా తల్లి పోలికే; ఆ కనుల్నూ అవీ అంతా.

"ఇదిగో మీరు తిరిగొచ్చినందుకు ఫలితం!" అంటూ నటాషాని ప్రేమగా యెగరేసి పట్టుకుని ముద్దుపెట్టుకుంది ఎలీనా. "మా బంగారు తల్లే!"

నటాషా జుత్తుపొంకులు తీసి, రిబ్బన్‌తో కట్టి, "ఐనా మనం మరీ పల్లెటూరివాళ్లం ఐపోయాం." అనన్నది నవ్వుతూ; "చూడండి, మన పిల్లలికి కాస్త మంచిపేరు పెట్టుకోవడం గూడా చేతగాకపోయె మనకి. ఏంపేర్లు యేంకధ! నటాషా, మైఖేల్, పావెల్, బోరిస్.... అన్నీ పాతపేర్లే. గొప్పగొప్పవాళ్లైతే, అలిక్ అనో, మిలోరిక్ అనో పెట్టుకునేవారు పేర్లు. ఎందుకూ, ఆ ప్ర్యాఖిన్‌గారి భార్యను చూడండి— పిల్లలిద్దరికీ లాండెలీ అనీ, కామిల్లా అనీ పెట్టింది! పంచదార చిలక ల్లాంటి పేర్లు! బావుండలా! తన పేరూ మార్చుకుంది పావా అని, యేదో విదేశస్థుల పేరుకి మల్లే. వీలైతే యింటిపేరు గూడా మార్చేసేదే, భర్త వొప్పుకోలేదు గాని."

"హెల్లో!" అంటూ లోపలికొచ్చాడు లొగునోవ్, పెద్ద పాకేజొకటి చేత్తో పట్టుకుని. "బావున్నారా?"

"రండి, రండి, లోపలికి రండి" అంటూ ఆహ్వానించింది ఎలీనా.

తెచ్చిన పాకేజ్ వంటింటి బల్లమీద పెట్టి, "నా కసలు పని వంటింట్లో వుంది" అన్నాడు లోగునోవ్.

గది నాలుగు పలకలుగా వుంది. పెద్దగది. ఒక వైపున వంటగది, కోట్ రాక్ వున్నవైపు హాలు. మూడోది పెద్ద పిల్లలిద్దరికీ పడకగది. తెల్ల ఆయిల్ క్లాత్ పరచిన పెద్ద టేబులున్నదేమో భోజనాల గది. డెనిస్, ఎలీనాల పడకగదిలోకొక ద్వారమూ, వార్యాగదిలో కింకొక ద్వారమూ.

"మాకు డ్రాయింగ్ రూమ్ వుంటే అందులోకే ఆహ్వానించేదాన్ని మిమ్మల్ని" అంది ఎలీనా; "కానేలాభం, డ్రాయింగ్ రూమ్ లేదు! ఈ గదినే రెండుగా చెయ్యొచ్చు, అంత పెద్దదికూడాను గాని నాకిష్టంలేదు. మరీ అరలు అరలు చెయ్యడం యిష్టంలేదు నాకు. సరేగాని, అదేమిటి పట్టుకొచ్చారు? డబ్బు లెక్కువగా వున్నాయేమిటి? మాయింట్లో యెలాగూ భోజనం పెట్టేదిలేదు మీకు; ఎందుకనవసరంగా డబ్బు ఖర్చుపెట్టుకుంటారు. ఇప్పటికే తీరక పిచ్చెక్కిపోతోంది."

"మా పిచ్చిది భలే పిచ్చిదిలే...." అంటూ యింకేదో అనబోయాడు డెనిస్, యింతలో లోగునోవ్ అడ్డుతగిలి, ప్రాధేయపడుతున్నట్టు.

"మీరు చాలా మంచివారు; కాస్త మనసు మార్చుకోరూ నాకోసం" అన్నాడు.

"చచ్చినా మార్చుకోను, ఆరు నూరైనా సరే నూరారైనా సరే. మీరెళ్లి యేదన్నా హోటల్లో పెట్టడం మంచిది బస."

"ఎన్ని చెప్పినా హోటలోటలే, యిల్లు యిల్లే" అన్నాడు డెనిస్, "అందులోనూ నీ చేతివంటంటే స్వర్గానికి బెత్తెడు"

"ఇక చాల్లే ఆ పండా పొగడ్తలు. ఇంతెడు సంసారం వుంది చాలకా? యింట్లోనే హోటలు పెట్టేట్టున్నారు మీరు! యేం వొద్దులే బాబు! మనమే యేహోటలుకన్నా వెళ్లి భోంచేస్తే సగం పని తగ్గుతుందని చూస్తున్నా. అవతల వుద్యోగం; యిక్కడీ వంటపని. నాకు సాగదు బాబు!"

"సరేలే, అసలాయన తెచ్చినవి చూశావా?—చేపలు, వెన్న, నిమ్మకాయలు...."

"దయ దలిచాడ్లే మహా(. ఎన్ని తెచ్చినా సరే, యిక్కడ భోజనం పెట్టడం మట్టుకు కుదరదు. కాదు గూడంటే, యెప్పుడన్నా వీలున్నప్పుడు ఆదివారంనాడు మట్టుకి.... అంతే, ఆపైన నావల్లగాదు."

"ఆదివారమైనా సరే. అంతేచాలు. అదే మహాద్భాగ్యం అనుకుంటా."

"ఆదివారంగూడా హాస్పిటల్లో నాకు పనిలేక పోతేను."

"ఆ మాట వేరే చెప్పాలా? మిగతా రోజుల్లోనేమో వార్యా చేసిపెడుతుంది."

సరేనన్నట్టు పగలబడి నవ్వింది ఎలీనా.

"చెయ్యదూ మరి! ఐనా చెయ్యకేం జేస్తుందితే!"

"నాకంత బాగా చేతగాదు వంటచెయ్యడం" అన్నది వార్యా, లొగునోవ్ వంక యిష్టంగా చూస్తూ. వాలీబాల్

తోలు కవరుకు పడ్డ చిల్లిని కుడుతోంది అప్పటిదాకా. ఇంకా పెద్దసూది చేతిలోనే వుంది. యాంత్రికంగా దారం ముడేశ, "యిక్కడున్నవాళ్లం అందరం వూరికే సాయం చెయ్యగల వాళ్లమే గాని స్వంతంగా వంటచెయ్యడం చేతగాదు. హోటలు మంచిదే కాని యింట్లోవంటే బాగుంటుంది అంతకంటే. ఎన్ని చెప్పినా, నేర్చుకోవడమే...."

"నిజంగానేనా ? మా తల్లేం ?" అంటూ అడ్డు తగిలింది ఎలీనా, "వంటచేయడం వచ్చింతర్వాత, చేసుకున్న మొగుడు దూరుకుంటాడూ, ఎప్పుడూ ఆ వంటింట్లోనే పాతేసుకు నుండ మంటాడు."

"నాభర్తలా చెయ్యడులే" అంటూ ఛటుక్కున తలెత్తి అదోతరహాగా చూచింది వార్యా, ఎలీనావంక. "నేనసలు పెళ్లే చేసుకోను !.... చూడండి" అంటూ ఆ పెద్ద సూదితీసి, వేలికి గుచ్చుకుంది. రక్తం వస్తూంటే ఆనందంగా చూచి, వేలు నోట్లో పెట్టుకుని, "చూశారా, నాకేమీ నొప్పిలేదు !" అని గిరుక్కున తిరిగి, గదిలోకి పరుగెత్తుకు పోయింది.

"పిచ్చిపిల్ల !" అన్నది ఎలీనా, నిర్ఘాంతపోయి. "ఎందు కొచ్చిందీ అంత బాధ ?"

తన కుటుంబములో వున్నవాళ్ల మనసులన్నీ అరచెయ్యి లాగా చదవగలదు ఎలీనా; మనస్తత్వాలు బాగా తెలుసు కున్న మనిషి. వార్యాని తన కుటుంబంలో మనిషిలాగానే చూచింది. అంతులేని ప్రేమ ఆ యమ్మాయంటే. కాని, యింతవరకిలా ప్రవర్తించడం యెప్పుడూ చూడలేదు. ఇదే మొదలు. ఏమీ అర్థం కాలేదు. ఏంచెయ్యాలో తోచక, పెళ్లి

కాస్పేపు వార్యా గది తలుపుదగ్గర నిలబడింది. కాని ఆవిడ గూడా స్త్రీయే కాబట్టి, యిలాంటి సమయాల్లో కాస్పేపూరు కోవడమే మంచిదనిపించింది. మెల్లగా తలుపు మూసేసి యివతలి కొచ్చేసింది.

లొగునోవ్ వైపుకు తిరిగి, "అందులో యేముందిలే, ఈ మధ్య పనిగూడా యెక్కువైనట్లుంది. అన్ని పనులూ తానే చేస్తానని బయల్దేరుతుంది. దీనికితోడు పరీక్షలకోసమని బాగా పొద్దుపోయేదాకా చదువుతోంది. అందుకని చిరాకెక్కువైనట్టుంది" అంది ఎలీనా.

# 12

"వస్తున్నారొస్తున్నారు వాళ్లు" అంటూ గబగబా లేచి, వంటింట్లోనుంచి పదార్థాలన్నీ బయటికి భోజనాల బల్లదగ్గరికి జేరేశాడు డెనిస్.

"అప్పుడే అందరూ వచ్చేశారే" అంటూ గదిలోపలి కడుగుబెట్టాడు ఓల్గా వెనకనే ఇవాన్; "సరే,తోటపనెట్లావుంది."

"ఇప్పుడేగా ప్రారంభించింది. పిల్లలిద్దరూ పాతతోటలో తవ్వుతున్నారు. మొక్కలు వేడితేనే పోయేదనుకుంటా. ఐనా యింకా చల్లగానే వుందిలే" అంటూ అతిథుల్నందరినీ పడక గది వేపుకు తీసుకెళ్లాడు డెనిస్ మొక్కలు చూపేందుకు.

పెద్దగదిలో, కిటికీల మీదగూడా మొక్కలున్నై కాని, పడకగదిలో యింకా యెక్కువ రకాలున్నై.

కాగితాల్తో చేసిన కప్పుల్లో వున్నై ఆ నారుమొక్కలు. "వంటింట్లో అంటే కాస్పేపు వేడిగానూ, కాస్పేపు చల్లగానూ

తోలు కవరుకు పడ్డ చిల్లిని కుడుతోంది అప్పటిదాకా. ఇంకా పెద్దసూది చేతిలోనే వుంది. యాంత్రికంగా దారం ముడేసి, "యిక్కడున్నవాళ్లం అందరం వూరికే సాయం చెయ్యాల వాళ్లమే గాని స్వంతంగా వంటచెయ్యడం చేతగాదు. హోటలు మంచిదే కాని యింట్లోవంటే బాగుంటుంది అంతకంటే. ఎన్ని చెప్పినా, నేర్చుకోవడమే...."

"నిజంగానేనా ? మా తల్లేం ?" అంటూ అడ్డు తగిలింది ఎలీనా, "వంటచేయడం వచ్చింతర్వాత, చేసుకున్న మొగుడు దూరుకుంటాడూ, ఎప్పుడూ ఆ వంటింట్లోనే పాతేసుకు నుండ మంటాడు."

"నాభర్తలా చెయ్యడులే" అంటూ ఛటుక్కున తలెత్తి అదోతరహాగా చూచింది వార్యా, ఎలీనావంక. "నేనసలు పెళ్లే చేసుకోను !.... చూడండి" అంటూ ఆ పెద్ద సూదితీసి, వేలికి గుచ్చుకుంది. రక్తం వస్తూంటే ఆనందంగా చూచి, వేలు నోట్లో పెట్టుకుని, "చూశారా, నాకేమీ నొప్పిలేదు !" అని గిరుక్కున తిరిగి, గదిలోకి పరుగెత్తుకు పోయింది.

"పిచ్చిపిల్ల !" అన్నది ఎలీనా, నిర్ఘాంతపోయి. "ఎందు కొచ్చిందీ అంత బాధ ?"

తన కుటుంబములో వున్నవాళ్ల మనసులన్నీ అరచెయ్యిలాగా చదవగలదు ఎలీనా; మనస్తత్వాలు బాగా తెలుసుకున్న మనిషి. వార్యాని తన కుటుంబంలో మనిషిలాగానే చూచింది. అంతులేని ప్రేమ ఆ యమ్మాయంటే. కాని, యింతవరకిలా ప్రవర్తించడం యెప్పుడూ చూడలేదు. ఇదే మొదలు. ఏమీ అర్థం కాలేదు. ఏంచెయ్యాలో తోచక, పెళ్లి

కాస్సేపు వార్యా గది తలుపుదగ్గర నిలబడింది. కాని ఆవిడ గూడా స్త్రీయే కాబట్టి. యిలాంటి సమయాల్లో కాస్సేపూరుకోవడమే మంచిదనిపించింది. మెల్లగా తలుపు మూసేసి యువతిలి కొచ్చేసింది.

లొగునోవ్ వైపుకు తిరిగి, "అందులో యేముందిలే, ఈ మధ్య పనిగూడా యెక్కువైనట్లుంది. అన్ని పనులూ తానే చేస్తానని బయల్దేరుతుంది. దీనికితోడు పరీక్షలకోసమని బాగా పొద్దుపోయేదాకా చదువుతోంది. అందుకని చిరాకెక్కువైనట్టుంది" అంది ఎలీనా.

# 12

"వస్తున్నారొస్తున్నారు వాళ్లు" అంటూ గబగబా లేచి, వంటింట్లోనుంచి పదార్థాలన్నీ బయటికి భోజనాల బల్లదగ్గరికి చేరేశాడు డెనిస్.

"అప్పుడే అందరూ వచ్చేశారే" అంటూ గదిలోపలి కడుగుబెట్టాడు ఓల్గా వెనకనే ఇవాన్; "సరే,తోటపనెట్లావుంది."

"ఇప్పుడేగా ప్రారంభించింది. పిల్లలిద్దరూ పాతతోటలో తవ్వుతున్నారు. మొక్కలు పెడితేనే పోయేదనుకుంటా. ఐనా యింకా చల్లగానే వుందిలే" అంటూ అతిథుల్నందరినీ పడక గది వేపుకు తీసుకెళ్లాడు డెనిస్ మొక్కలు చూపేందుకు.

పెద్దగదిలో, కిటికీల మీదగూడా మొక్కలున్నై కాని, పడకగదిలో యింకా యెక్కువ రకాలున్నై.

కాగితాల్తో చేసిన కప్పుల్లో వున్నై ఆ నారు మొక్కలు. "వంటింట్లో అంటే కాస్సేపు వేడిగానూ, కాస్సేపు చల్లగానూ

వుంటుంది కాని యిక్కడెప్పుడూ సమానంగానే వుంటుంది ఉష్ణోగ్రత" అన్నాడు అక్కడొక ఎండిన ఆకునీ, యిక్కడొక కుళ్ళిన ఆకునీ యేరిపారేస్తూనూ, కప్పులో మట్టిని కుదిలిస్తూనూ. "ఈసారి చాలా మంచి గుమ్మడిని పెంచుతాను, చూద్దురుగానిగా."

"ఊఁ, పెంచారులే మూలాష్ట" అంటూ వేళాకోళం చేసింది వంటింట్లోనుంచే ఎలీనా. "గుమ్మడికాయలిక్కడ పెరగకేఁ! ఊరికే మీపిచ్చిగాని. కిటికీలన్నీ అల్లిపారేస్తిరి బద్దల్తోనూ, తాళ్ళతోనూ లోపలికి వెలుతురు గూడారానీకుండా. మరీ యింత చోద్యం యెక్కడా చూసెరగం."

అందరూ వెళ్ళి భోజనాల దగ్గర కూర్చున్నారు.

"కావలసినంత బంగాళాదుంప, ముల్లంగీ పెరుగుతుందిక్కడ. కానీ అవేమీ పనికిరావట యీాయనకి. గుమ్మడి పెంచుతారట గుమ్మడి. చచ్చినా పెరగదిక్కడ."

"అది పెరుగుతుందా, దానితాత పెరుగుతుందా! ముందు లోతుగా గొయ్యితీసి అందులో ఒక పలికెడు యెరువు పోస్తాను దానిమీదింకొక పలికెడు మట్టిపోస్తాను. ప్రతి మొక్కకీ రెండు తీగలకంటే యెక్కువ పెరగనివ్వను. ప్రతితీగకీ రెండు పువ్వుల కంటే యెక్కువ వుండనివ్వను. నీళ్ళలో యెరువు కలిపి పోస్తాను........"

"ఇకచాల్లే వూరుకోండి మీమాటలూ మీరూనూ" అని ఓల్గా వంక చూచింది ఎలీనా; "ఎరువట ఎరువు; భోజనాలు చేసేప్పుడేనా ఆమాటలన్నీ."

"ఎరువంటే తప్పేముంది! ఆ యెరువు లేకపోతే యింతింత అందమైన మంచిమంచి పూలే వుండేవిగావు. ఎవరో కవన్నట్టు..."

"ఆ కవిగూడా యెవడో మీలాంటి వాడే ఐవుంటాడు!"

అందరూ పగలబడి నవ్వారు. అందరికంటే ఎక్కువగా నవ్వింది ఓల్గా, డెనిస్ అంటేనూ, అతని భార్య ఎలీనా అంటేనూ అప్పుడే ఆవిడకెంతో యిష్టమేర్పడి పోయింది. అచ్చంగా వాళ్ళ నాన్నలా వుండే పిల్లలూ, నటాషా, ఆ పెద్దగదీ, ఎత్తుగా వున్న ఆ కిటికీలూ, కిటికీల నిండా మొక్కలూ...ఏది చూచినా యిష్టంగానే వుంది. పరాయి యిల్లనే బెరుకు గూడా లేకుండా పోయింది.

"యేదీ, వార్యా యేమైపోయింది ?"

"వంట్లో బాగున్నట్టులేదు" అన్నాడు లొగునోవ్ నెమ్మదిగా.

"బాగాకేం? దివ్యంగావుంది" అంటూ వచ్చేసింది వార్యా.

భోజనాల బల్లదగ్గర కొచ్చి, ఓల్గావంక చూస్తూ చిన్నపిల్లలా బిడియం బిడియంగా నవ్వుతూ నిలబడింది. చిన్నపిల్లలా నవ్వెందనడానికి యేది కారణమో యిదమిద్ధంగా చెప్పడం కష్టమే; ఆ నిండు పెదవులూ కావచ్చు, కల్లబొల్లు తెరగని ఆ చూపులూ కావచ్చు. మత్తెక్కించే అందమే యీ అమ్మాయిది అని మళ్ళీ ఒకసారనుకుంది ఓల్గా— ఆ నున్నని బుగ్గలూ, ఆ బుగ్గలమీదున్న ప్రకృతి సిద్ధమైన లేగులాబిరంగూ, బాదం కాయ ఆకారంలో నల్లగా మెరిసిపోయే కనులూ, ఆ కనుల పైన ఎక్కుపెట్టిన విల్లులావున్న కనుబొమ్మలూ, కనుల మెరపుని కప్పివేయని విశాలమైన కనురెప్పలూ, ఆ యౌవ్వ

నమూ.... వీటన్నిటికంటే మించి ఓల్గాని సమ్మోహితంచేసిందం కొకటుంది. వార్యా ముఖంచూస్తే చాలు. చాలా మంచి తెలివితేటలున్నాయనీ, జీవితమంటే అపరిమితమైన ఆప్యాయతున్న వ్యక్తనీ-యిట్టే తెలిసిపోతుంది.

"ఈ అమ్మాయే షూ పెద్దమ్మాయి" అంటూ పరిచయంచేసి, తాను కాస్త జరిగి, తనకూ, లొగునోవ్‌కూ మధ్య స్థలం చేసింది ఎలీనా.

వార్యా కథ యిదివరకే విన్నప్పటికీ, ఎలీనా మాటలు వింటుంటే నిజమేనేమో ననిపించింది ఓల్గాకి, అంత సహజంగా అన్నదావిడ ఆ మాటలు.

"మా అబ్బాయి, రెండో వాడు దేశంలో* చదువు కుంటున్నాడు" అన్నది ఎలీనా మళ్లీ.

"ఏమని వ్రాశాడేమిటి బోరిస్ ?" అనడిగాడు లొగునోవ్.

బోరిస్ ! అనగానే విశాల సముద్రమూ, ఆ చల్లని గాలీ, బోరిస్ తావ్‌రోవ్‌తో కలిసి మాట్లాడుకున్న మాటలూ- అన్నీ ఒక్కసారి గుర్తుకొచ్చినై ఓల్గాకి. పక్కకు తిరిగింది ఇవాన్‌ని చూద్దామని. కళ్లతో నవ్వుతూ, చేతుల్తో సైగలు చేస్తూ మాట్లాడుతున్నాడు డెనిస్‌తో. ఆ చేతులు బాగా బలమైన చేతులు; వెడల్పాటి అరచేయి; ఎప్పుడూ యే వస్తువూ జారి క్రింద పడేందుకు వీల్లేదు ఆ చేతుల్లోంచి.

---

* రష్యాలోవున్న యూరపియన్ ప్రాంతాన్ని అదేదో దూరానున్న ముఖ్య ప్రాంతమైనట్టూ, 'యకూతియా' ప్రాంతం ఒక ద్వీపం ఐనట్టూ అంటారు ఆ ప్రాంతంవాళ్లు.

"భలేమనిపి !" అనుకుంది ఓల్గా ఆనందంతో. చేయి చాచింది అతని చేయితాకి, గోముగా నొక్కుదామని.

"ఏమిటి ఓల్గా !" అన్నాడావిడవైపుకు తిరిగి.

"ఆఁ, యేమీలేదు" అందినవ్వుతూ. "ఈ ప్రయాణంలో ఒకతను కలిశాడు నాకు. ఇప్పుడెందుకో గుర్తుకొచ్చింది. ఎప్పుడు చీవాట్లేసేవాడు నన్ను. సరే, దాని క్కారణం వుం దనుకోండి. ఇప్పుడు మిమ్మల్ని చూస్తూంటే, మిమ్మల్ని విమర్శిం చడం అతని తరమయ్యేదా అనిపించింది నాకు. అంతే అంత కంటె యేమీలేదు."

ఆవేళరాత్రి ఇవాన్, ఓల్గా యిద్దరూకలసి ప్రొద్దుపోయే దాకా మాట్లాడుకున్నారు. ఇక్కడ తన జీవితంయెలా వుందో చెప్పాడు ఇవాన్. తర్వాత "ఇందాకేమిటీ అన్నావ్. ఆ దారిలో కనబడ్డవాళ్ళు యెందుకూ నిన్ను చీవాట్లు పెట్టింది?" అనడిగాడు.

"కనబడ్డవాళ్ళు గాదు. ఒక్కతనే. బోరిస్ తావ్రోవ్ అనీ, ఎంజినీరు. పని చెయ్యని వాళ్ళంటే మంటనుకుంటాను ఆయనకి. అబ్బ! ఎన్నన్నాడనుకున్నారు."

"ఏమన్నాడేమిటి?"

"నేనొట్టి లోఫర్‌నట, సోమరిపోతునట. వృథాగా బోలెడు డబ్బు ఖర్చయిందట నాకోసం. నేనివ్వాళ యెందుకూ పనికిరాకుండా పోవడానికి కారణం నేనేనట. అక్కడిదాకా యెందుకు? ఈమధ్యనే ముసుగొదిలిన ఆ మహమ్మదీయ స్త్రీలతో పోల్చాడు నన్ను. నేను వాళ్ళకంటె గూడా కనా కష్టమైన

దాన్నన్నాడు. దాని క్కారణం వాళ్ళకులేని అవకాశాలు నాకున్నా నేను వాటిని వినియోగించుకోలేదని.

"పిచ్చిదాన!" అన్నాడు ఇవాన్ భార్యతల నిమురుతూ; "నువ్వలాంటి మాటలు పట్టించుకోగూడదు. కొంత మంది ఆలోచించకుండా అనేస్తారు మాటలు. అందర్నీ ఒక రూళ్లబద్దతో కొలుస్తారు. కొంతమంది ఆ బద్దకు అతీతులుగా వుంటారని తెలియదు వాళ్లకి."

"నాకలా అతీతంగా వుంటంఅంటే యిష్టంలేదు" అంది ఓల్గా, భర్త భుజాలు గట్టిగా పట్టుకుని ప్రేమగా అతని ముఖం లోకి చూస్తూ; "అదీగాక—గమ్మత్తు—అతనలా చీవాట్లు పెడ్తూంటేనే బాగుందినాకు. నేనూ మనిషినే, అందరిలాంటి దాన్ని అనిపించింది. ఇప్పుడు మీరిలా ఓదారుస్తుంటే యేం బాగాలేదు నాకు.... నేనేమంత చిన్నపిల్లనా అనిపిస్తూంది."

"ఐతే, యిక నిన్నెప్పుడూ ఓదార్చనులే" అన్నాడు ఇవాన్ కోపంగా మళ్లీ అంతలోనే ఆవిణ్ణి చేతుల్తో పైకెత్తి గదంతా తిప్పాడు అదేపనిగా ఆవిడ ముఖంలోకి చూస్తూ, తన్నొదిలిపెట్టి ఆముఖం యెక్కడికైనా మాయమై పోతుందేమోనని భయపడుతూన్నట్టు. ఇవాన్‌తోపాటు ఓల్గాకూడా మైమరచి ఆనందించింది. ప్రేమరుచి తెలిసినవాళ్లకి తప్ప తెలియని మాటలేమేమో ఆడుకున్నారు చాలాసేపు. ఎన్నిరోజులెన్నిరోజులు! ఎన్నిరోజు లెదురుచూచింది యీ రోజుకోసం, ఈ వ్యక్తికోసం, ఇప్పుడున్నట్టు యీ గదిలో, యిలా, యితని చేతుల్లో వుండిపోవాలని. తాను దూరంగావున్న కాలంలో ఆయన్లో కలిగిన మార్పులుగూడా పట్టించుకో లేదావిడ. ఆ మార్పులన్నీ సహజంగానే భావించుకుంది. కొన్నికొన్ని పోలి

కలు. ఆవిడ వూహించుకున్నట్టుగా లేవు. ఐనా ఆ ప్రేమ తగ్గ లేదు. ఎంత మారినాసరే, లక్షమందిలో నిలబడినాసరే, తన భర్తను తాను గుర్తించి చేయిపట్టుకు నివతలికి తీసుకురాగలదు.

"ఎన్నాళ్లకి కలుసుకున్నాం!" అంటూ తన్మయత్వంతో, కనులు మూసుకుని, అలాగే నిద్రపోయింది కాస్సేపైన తర్వాత.

# 13

మర్నాడుదయం, యింకా కనులు తెరవకముందే, తెలిసిపోయింది ఓల్గాకి, భర్త పక్కలో లేడని; అప్పుడే పనిమీ దెళ్లిపోతూంటారా? ఇంట్లోనే ఏపనైనా చేసుకుంటున్నా రేమోనని చెవులు రిక్కించుకుని వింది; లేదు, ఆసూచన్లేమీ లేవు.

"ఆయన్ని కలుసుకోవాలని అర్ధ భూప్రదక్షిణం చేసి నేనొస్తే, కనీసం య్యీ మొట్టమొదటి రోజు వృదయమైనా నాతో గడిపేందుకు తీరిక చేసుకోలేక పోయారన్నమాట!" అనుకున్నది బాధపడుతూ; "నేనొచ్చానన్నైనా నాలుగు రోజులు సెలవు తీసుకోవచ్చునే?"

తెల్లగౌను వేసుకుని,ఆపరేషన్ టేబుల్ దగ్గర, పైకెంతో ప్రశాంతంగా, మానసిక శక్తులన్నీ కేంద్రీకరించి ఆపరేషన్ చేస్తున్న భర్తని కళ్లకుకట్టినట్టు వూహించుకుంది. ఒక్క నవ్వు నవ్వుకుంది. ఆయనెప్పుడూ అంతే. పెళ్లైన దగ్గర్నుంచీ యింతే. ఎన్ని పిక్నిక్కులకి, ఎన్ని సమిష్టి భోజనాలకి గైరుహాజ

రయ్యాడో లెక్కలేదు; థియేటర్ టికెట్లెన్ని వృథా ఐపో యినయ్యో అసలే లెక్కలేదు.

పక్కమీదినుంచి లేచి కూర్చుంది ఓల్గా. ఎదురుగా టేబిల్ మీదొక చిన్న ఉత్తరం వుండి, యిదివరకటిలాగానే.

"ప్రియమైన ఓల్గా!

"నీతో యింటిదగ్గరే వుండిపోవాలని యెంతనుకున్నా వుండలేక పోయాను. కబురొచ్చింది—చాలా పెద్ద ఆపరేషన్ అర్జెంటుగా చెయ్యాల్సొచ్చింది."

ఆ ఉత్తరం తీసుకుని అరచేతుల్తో నొక్కుతూ, "అర్జెంటట పెద్ద ఆపరేషనట" అంటూ గొణుక్కుంది తనలోతాను. "ఎప్పుడూ అదే కారణం. నన్ను లేపనుగూడా లేపలేదు. ప్రయాణం బడలికతో పండుకున్నానేమో, చప్పుడుగూడా వినిపించలేదు. ఐనా ఎక్కడ చప్పుడౌతుందోనని మునిగాళ్ల మీద నడిచుంటారు."

ఆ నడక వూహించుకుంటూ మళ్లీ ఒకసారి నవ్వుకుంది. ఇంతలో ఎరిగినవాళ్లెవరో హాలులో నడచిన చప్పుడైంది.

"ఇంకా లేవలేదా ?" అంటోంది పావా హాల్లోనుంచి. "ఏమినిద్రమ్మా! లేవండిక లేవండి. ఎట్లాగూ గదిలో కొచ్చేస్తున్నాలే నేను."

కకేషియెన్ కేప్ లాగా, ఒక తెల్లని అంగోరా శాలువా భుజాలమీద కప్పుకునొచ్చింది గదిలోకి.

"ఉషాసుందరి ప్రేయసీ, గులాబిపూవా" అంటూ మధ్యలోనే ఆపి, వ్యాఖ్యానం ప్రారంభించింది. "ఇదొక గీతం. ఒక మెకానిక్ వ్రాశాడు. ఆయన పేరు ఇగోర్ కొరొబిత్సిన్.

కవిత్వం బాగానే వ్రాస్తాడుకాని, అదొకరకం పక్షి, రాత్రుళ్లు నిద్రపోకుండా వుంటానికెప్పుడూ యేవో కారణాలు వెదుకుతూనే వుంటాడు. మిల్లులో పని గూడా బాగానే చేస్తాడు; అతనంటె అక్కడి వాళ్లందరికీ గౌరవం కూడాను. కాని ప్రతి మనిషీ ఆవిరి యంత్రం కనిపెట్టడమంటే మాటలా ? అట్లాఐతే గుట్టలు గుట్టలై పొయ్యేవి గాదూ యీపాటికి ? ఇంతకీ నేను చెప్పేదేమిటో అర్థమయ్యిందా ?"

"లేదు, అర్థంకాలేదు" అంది ఓల్గా దుస్తులు తీసుకుంటూ.

"అంటే—ఉన్నత స్థితి కెళ్లాలనే కోరిక గూడా,....వుదాహరణకి అసూయ లాగా, చెడ్డదేననుకుంటా. కాదూ ?"

"అదేంపోలిక ! ఒకటి ఉత్తర ధృవమైతే, రెండోది దక్షిణ ధృవం" అంది ఓల్గా పైకి. లోలోపల మాత్రం "తెలియకపోతే వూరుకోగూడదూ ఎందుకొచ్చిన బెడద, ఎందుకొచ్చిన సిద్ధాంతీకరణ !" అనుకుంది.

"మరీ అర్థంలేని వాగుడు వాగుతానని విసుక్కోకబాకండి" అంది పావా నవ్వుతూనూ; "బహుశా నాకామాత్రం తెలివి తేటలు గూడా లేవనుకుంటా" (అన్నది మళ్ళీ ఓల్గా బుర్రలో మాటలు చదివేస్తున్నట్టు. ఓల్గా విస్తుపోయింది.) "అంతగా చదువుకున్న దానినీ కాదు. ఒక్కోసారి నేను మాట్లాడుతుంటే, మావారు సిగ్గుతో చచ్చిపోతారు తలవంచుకుని ! కాని యేంచెయ్యను. నేనూ తెలివితేటలు గలదాన్నే అని నిరూపించేందుకు ప్రయత్నించడం సహజమే; కాదూ ?"

పావా మాటలు విన్నతర్వాత యింకేమీ అనలేకపోయింది ఓల్గా "ప్రథమ పరిచయంలోనే యిలా మాట్లాడగలరా మీరు ?" అని మాత్రం అనగలిగింది.

"అలవాటైపోయిందనుకుంటా" అన్నది పావా నిట్టూరుస్తూ. తర్వాత యిద్దరూ కలిసి నవ్వుకున్నారు.

"పెళ్ళికాక పూర్వం బాగా అందగా వుండేదాన్ని" అంటూ మళ్ళీ ప్రారంభించింది పావా, ఓల్గా మేజోళ్ళు తొడుక్కుంటూంటే చూస్తూ; "పిల్లలు పుడితె ఆ అందం అంతా యేమైపోతుందో మీకూ తెలుసుగా! ఘోరం! అందులో యిప్పుడు గర్భస్రావం చేయించుకోడానికి వీల్లేదట. చట్టంగూడా వొచ్చింది." (గుప్పెట ముడిచి బల్లమీద గుద్దుతూ కోపంగా) "మళ్ళీ చక్కగా ఆరోగ్యంగా వుండాలంటారు! ఏడాది కొక పిల్లనికంటూ తల్లిని ఆరోగ్యంగానూ అందంగానూ వుండమంటే? ఎట్లా సాధ్యం? జీవితంలో, పసిపిల్లలకంటే కోరుకునే దింకేముంటుంది స్త్రీలకి, అంటే నేనూ వొప్పుకుంటాను· మావారూ అదే అంటారు యెప్పుడూనూ." మాటల ధోరణి ఆపి, ఓల్గా తెచ్చిన సెంటు సీసాలు తెరిచి కాస్సేపు వాసన చూచి, మళ్ళీ అందుకుంది. "ఇప్పటికే బోలెడు వయసొచ్చేసిందినాకు. ఇకిప్పుడైనా జాగ్రత్త పడకపోతే యెట్లా? ముప్పయ్యొచ్చేప్పటికి యికపయీలసి బడమంటే మట్టుకు నావల్లకాదు" అని మళ్ళీ మాటల ధోరణి ఆపి, వెళ్ళి కుర్చీలో కూలబడింది, అందులో ఓల్గా టోపీ వున్నదని గూడా చూడకుండా.

ఓల్గాలేచి పక్కమీద తలగడలు సర్దుతూంటే, పావా వెక్కి వెక్కి ఏడుస్తున్నదనిపించింది. ఏంచెయ్యాలో తోచలేదు ఓల్గాకి. చేతిలో దిండు చేతితో పట్టుకుని అలాగే పక్కమీద కూర్చుంది దిగ్భ్రాంతితో.

ఇంకోక్షణం వుంటే యింకేం చేస్తుందో తెలియదాయె. కర్రబొమ్మలా నడిచొచ్చి, ఓల్గా ప్రక్కనే కూలబడింది

పావా. "నన్నిక మీరే రక్షించాలి. మీరు తప్ప యింకెవ్వరూ యేమీ చెయ్యలేరు. నేను గర్భస్రావం చేయించుకోకపోతే బ్రదకలేను. మీరు డాక్టర్ ఇవాన్‌తో చెప్పండి. మీరంటే ఆయనకి ప్రాణం; మీరన్నమాట కాదనలేరు. మీ చేతులు పట్టుకు ప్రార్థిస్తున్నా. కాదనకాకండి. నేనిదివరకే అడిగాను డాక్టర్ని; ఒప్పుకోలేదు. ఎంతచెప్పినా వినలేదు. మా వారితో గూడా చెప్పాను లేకపోతే చచ్చిపోనన్నా పోతాగాని, గర్భ స్రావంమట్టుకు చేయించ వఒసిందేనని. మావారు చాలా మంచివారు—కాని ఆయనకెలా చెప్పగలను యీ పుట్టబోయే బిడ్డ మీబిడ్డ కాదని."

ఓల్గా భయభ్రాంత ఐపోయిందని కనిపెట్టింది పావా; లేచి వెళ్ళి కిటికీకి పట్టిన మంచుచార తుడిచేసింది.

మరీ ఆశ్చర్యపోయింది ఓల్గా.

"ఒకవైపున యింతహుషారూ, యింతనిష్కాపట్యమూ, యిలా మనసువిప్పి మాట్లాడ్డమూ!" అనుకుంది.

పావా తనసంగతి మరచి పోలేదు. "గ్లుబోకోయేకి నేను వెళ్లిందే అందుకు. అక్కడ సర్జన్‌ని అడుగుదామని వెళ్లాను. ఆయన జబ్బు పడ్డాడట. ఇక ఇవాన్ ఇవానొవిచ్ తప్ప గత్యంతరములేదు."

"ఆయన మాత్రం యేంచెయ్యగలరు? చట్టాన్ని కాదని ధిక్కరించరు గదా?"

"మీరుగూడా అలా అంటే యెట్లా చెప్పండి." అంటూంటే పావా కళ్లవెంట నీరు బొటబొటా కారినై. "ఎట్లాగోట్లా చట్టానికి కనుమరుగు కావాలి. నాపరిస్థితంటే సానుభూతి కలగడంలేదా మీకు? నేనిప్పుడేం చెయ్యడానికైనా

సిద్ధమే; ఏ అడ్డమైన పాడుమందేసు కోడానికీ వెనుదియ్యాను. నాకూ కుటుంబం వుంది—జబ్బుతో మంచాన పడినతల్లి; ఇద్దరు పిల్లలు. నాకు సహాయం చెయ్యానని ఎలా అనగలరు ఆయన? ఎప్పుడైనా ముందుముందు మావారి అవసరంగూడా రావచ్చు. మీవారికి. మావారికి బాగా పెద్దపెద్ద వాళ్ళతో పరిచయం వుంది. ఎప్పటి కే అవసరం వస్తుందో యెవరు చెప్పగలరు? ఏమంటారు?"

ఓల్గా ఆలోచనలో పడింది. నిజంగానే పాపం! పావా పరిస్థితి పగవాళ్ళకుక్కూడా వద్దు.

"సరేలే, చూద్దాంలే" అంది సందేహం సందేహంగానే "వారితో మాట్లాడ్తాను, కాని ఒప్పుకుంటారని మట్టుకు నాకే మీ నమ్మకం లేదు."

# 14

కమెనుష్కానది వైపుకు రెండు పలకలుగా వంగింది లోయ. నదీ తీరాన్నంటుకునున్న పలకమీద బూరుగుతోట లెక్కువ. దీన్నే సెటిల్మెంట్ పార్క్ అంటారు. కొద్ది కుటీరాలుగూడా వున్నై. వాటిచుట్టూ కంచె. పై పలకమీద అసలు వూరుంది. ఇంకాపైన పెద్దపెద్ద చేకు తోటలూ అవీ వున్నై. మరీపైన పర్వతశిఖరాలు; అదంతా భూగర్భశాస్త్రజ్ఞులికీ, అడవి పందులికీ ఆటపట్టు.

కిటికీ తలుపులు తెరచి, ప్రకృతిని పరికిస్తోంది ఓల్గా. ఉత్తర ప్రాంతంలో విచ్చలవిడిగా తిరిగిన ప్రాచీన జంతువులిప్పు డెక్కడా కన్పించవు; అలాగే కొంతకాలానికి పర్వతాలు

గూడా మాయమై పోతాయేమో ననుకుంది. ఆకులూ కొమ్మలూగూడా ఎండిపోయిన మోడుచెట్లలాగున్నై ఈ పర్వతాలు. ఇక్కడెట్లా లేదన్నా యింకొక రెండు సంవత్సరాలుండక తప్పదు తాను. ఈ గనులకోసమని వచ్చిన వాళ్ళ యిళ్లులేకపోతే యిదంతా ఒక యెడారిలా గుండేది; సందేహం లేదు.

ఈతోటల్లొక పద్ధతి ప్రకారం పెంచేప్పటికి తాతలు దిగొచ్చారు! ఈ బంగారుగనుల దగ్గర యేపంటా పండించడం సాధ్యం కాదనుకున్నారు మొదట్లో. ఈ ప్రాంతంలో యేమీ పెరగవను కున్నారు. నిజానికి నేలా అలాగేవుంది గట్టిగా; కాని మంచి సారవంతమైన నేల. లేకుంటే యిన్నిరకాల చెట్లు యింత సమృద్ధిగా యెలా పెరుగుతై. ఈ పర్వతప్రాంతం ఆ పచ్చదనమే లేకపోతే, యింత రమణీయంగా యెట్లావుంటుంది.

"నిజంగానే చక్కని ప్రకృతి" అనుకున్నది ఓల్గా బిగ్గరగా. మళ్లీ ఒకసారి డస్టర్ తీసుకుని కిటికీ కమ్ములమీదా, కుర్చీలమీదా, మారు మూలల్లోవున్న దుమ్ము దులుపుతూ గది గదికీ తిరిగింది.

ఇప్పుడా యిల్లంతా కళకళ లాడుతోంది. ఇంట్లోవున్న ఫర్నిచ రేమంత గొప్పది కాకపోయినా, అది తీర్చిదిద్దిన తీరు ఆకర్షణీయంగావుంది. భోజనాలగదిలో బల్లమీద మరకన్న మాటలేని శుభ్రమైన దుప్పటి. శుభ్రంగా తుడిచిపెట్టిన రంగు రంగుల పూలకుండీలు. ఓల్గా తల్లి తయారుచేసిచ్చిన కిటికీ తెరలు నేల దాకా జీరాడుతున్నై అందంగా. ప్రయాణం కాబోయే ముందు పిలిచి, ఓల్గా తండ్రి తన కిష్టమైన వస్తువు లెన్నో యిచ్చాడు కూతురుకి.

"ఆ చలి దేశాని కెళ్ళిం తర్వాత, ఈ వస్తువులన్నీ నీకు నీ యింటినీ, నీ బాల్యాన్నీ గుర్తుకు తెస్తూ వుంటాయమ్మా. కాదనకు. తీసుకెళ్ళు." అన్నాడు తండ్రి.

తండ్రి ఆప్యాయాన్ని తలచుకుని, ఓల్గా కళ్ళు చెమ్మగిల్లినై. దైనందిన అవసరాల్ని పట్టించుకోని మనిషి, తన ప్రయాణం వచ్చేప్పటికి అంత శ్రద్ధ కలగజేసుకోవడం మాటలు కాదుమరి. అక్కడినుంచి తీసుకొచ్చిన వస్తువుల్తో అలంకరించిం తర్వాత యీ గది రూపే మారి పోయింది.

మాస్కోలో తమయిల్లు అంత అందంగా వుండేందుక్కారణం తనతల్లి. ఆవిడచేతులు చేయలేని పనంటూ వుండేది కాదు. కుటుంబాన్నంతా కళ్ళల్లో పెట్టుకు కాపాడుతూ పెంచింది. ఇక నాన్నగారి సంగతి చెప్పే పనేలేదు. అమ్మ జీవితమంతా నాన్నకే అంకితం చేసింది. ఏం లాభం! తాను పెద్దది కాకపూర్వమే, అందర్నీ వదలిపెట్టి శాశ్వతంగా కన్నుమూసింది తల్లి.

తండ్రి మరీ పరాకు మనిషి. చిన్న పిల్లలకంటే అన్యాయం. ఎప్పుడూ ఎవరో వొకరు అజమాయిషీగా చూడాలి ఆయన పనులన్నీ. తల్లి చనిపోయిం తర్వాత, కొంతకాలం వాళ్ళత్త చూచింది యిల్లంతా. తర్వాత ఒక్కరొక్కరుగా ఓల్గా అక్కలు చూచారు.

ఇంట్లో తన అవసరం వుందీ అని తెలుసుకున్న స్త్రీ, ఆబాధ్యతలు తీసుకునేందు కెప్పుడూ జంకదు; వెనుకాడదు. బిడ్డ బ్రతికున్నంతకాలం అసంతృప్తి అన్నమాట ఎరుగదు ఓల్గా ఇప్పుడున్నట్టే యీనాడా రేవేరు. ఇవ్వాళ మట్టు కివ్వాళ—రోజు

గడవడమే కష్టంగా వుంది. ఏమీ తోచక భర్త లైబ్రరీ అంతా పడక గదిలోకి మారిస్తే బాగుంటుందనుకుంది.

సహాయం చెయ్యడానికి హాస్పిటల్లో పని మనుష్యుల్ని పిలుద్దామని బయటికెళ్లింది. ఇంతలోనే, ఆలోచనలోపడి, వరాండాలోనే నిలబడి పోయింది.

"నేను మెషీన్ బిల్డింగ్ ఇన్స్టిట్యూట్ వదలకుండా వుంటేనే బాగుండేది" అనుకుంది కోపంగా; "అందులోనూ అందరికంటే బాగానే చదువుతూంటిని. మరీ పిరికి దాన్నై పోయాను—ఇవతల చంటిబిడ్డ; అవతలా చదువూ సాగవేమోనని భయపడిపోయాను. ఇవాన్‌గూడా మాట్లాడకుండా వూరుకున్నాడు మంచిదేనన్నట్టు. మాకంటే తక్కువవకాశాలున్న వాళ్లు, పిల్లలు కలిగింతర్వాతగూడా చదువుసాగించారు. చాలా గొప్ప తప్పిదం జరిగిపోయింది."

ఇవాన్‌తో మాట్లాడతాను లెమ్మని పావాకు చేసిన వాగ్దానాన్ని తలచుకుని మరింత చుర్రుమన్నది. ఈగర్భస్రావం చెయ్యడాని కాయన అంగీకరించడని తెలుసు. తన ఉద్దేశం గూడా ఆయన ఒప్పుకోగూడదనే ఐనా తనెందుకు వాగ్దానం చేసినట్టు?

వెళ్ళిపోయేముందు ఇంకొక వాగ్దానం గూడా చేయించుకెళ్ళింది పావా. ఇవ్వాళ సాయంత్రం భర్తతో కలిసి తప్పకుండా వాళ్ళింటికి వస్తామని అనిపించుకుని మరీ వెళ్ళింది. అంటే భర్త యింటికి రాగానే ఆ విషయం ప్రస్తావించాలన్న మాట తను; కానీ అంత అవసరమా అని

"ఆయన్తో ఆ సంగతి ప్రస్తావించేదీలేదు; మేమిద్దరమూ కలిసి వాళ్ళింటికి వెళ్ళేదీ లేదు." అని నిర్ణయం చేసేసు

తెలుగు విశ్వవిద్యాల
గ్రంథాలయం
91441

కుంది ఓల్గా. ఇంతలోనే, ఇవాన్ కన్పించాడు దూరంగా; గబగబా పరుగెత్తుకెళ్ళింది యెదురుగా, ఆయన్ని కలుసుకునేందుకు.

తోటలోపడి, కాలిదారిని గబగబా నడిచొస్తున్నాడు ఇవాన్. దూరాన్నుంచిగూడా కన్పిస్తూంది అతని నవ్వుముఖం. ఇద్దరూ కలుసుకున్న తర్వాత; ఒక్క క్షణంసేపు ఎవరూ మాటాడలేదు. ఒకర్నొకరు చూసుకుంటూ అలాగే నిలబడి పోయారు.

"ముందెవరు నడుద్దాం?" అనడిగింది ఓల్గా.

"నువ్వేముందు; అలా ఐతే నాకనుమరుగు కాకుండా వుంటావు."

"వద్దులెండి. మీరే ముందు నడవండి నన్ను లాక్కుపోతూ" అని, ప్రక్కకి తప్పుకుని ఇవాన్ చేయి పట్టుకుంది.

అలా నడుస్తూంటే నడవడానికిబ్బందిగానే వుంది కాని, హుషారుగా వుంది. ఇద్దరూ కలిసి నవ్వుకున్నారు. అప్పుడే వరండాలోకొచ్చి చూచిన ఎలీనా గూడా నవ్వింది.

"నీళ్లు తెచ్చే మనిషి ఎగ్గొట్టాడు. అందుకని నేనే తెచ్చుకుంటున్నా" అన్నది ఎలీనా.

"నేను వస్తానాగండి" అంటూ ఆవిడ చేతిలో ఖాళీ కడవ లాక్కుంది ఓల్గా; "నాకు వంటచేతరాదు, యెప్పుడూ ఎవరో వొకరుండేవారు చెయ్యడానికి; అందుకని అలవాటు చేసుకోవలసిన అవసరం కలగలా. ఐనా చిన్నచిన్న పనులు, పైపై పనులూ అన్నీ చెయ్యగలను."

ఇవాన్, ఓల్గా యిద్దరూ కలిసి మెట్లు దిగి, నదివైపు కెళ్లారు. గనుల్లో వాడుకునేందుకు వీలుగా, నదిలో అక్కడక్కడా గుంటలు పెట్టారు. ఈ చివరినుంచాచివరకొక వంతెన గూడావేశారు. అక్కడే ఒకతోట వుంది. ఇద్దరూ ఆతోటలోంచి వెళ్తూంటే పైనుంచి బంగారు రంగాకుల వానకురిసింది. ఇంతలో నుయ్యొచ్చింది. దుంగల్తో కట్టారానూతిని. నిర్మలమైన నీరు. పైనుంచి నీలాకాశం తనరూపు చూసుకుంటోంది. నూతిచుట్టూ బూరుగుచెట్ల పందిరి. బూరుగాకుల్నుంచీ, తడినేల నుంచీ కమ్మని వాసనేస్తోంది.

కడవ లోపలి కొదలి, గమ్మత్తుగా ఒక చిన్న ఊపుతో కడవనింపింది ఓల్గా.

"ఇకొదులు. పైకి లాగడం నావంతు" అన్నాడు ఇవాన్.

ఓల్గా ఒప్పుకోలేదు. "చాల్లెండి. ఇవ్వాళ్టికి సరిపడా పని యిదివరకే చేసేశారు మీరు. సరేగాని, మీకు సిగ్గువెయ్యడం లేదండీ, యింతకాలానికి యింతదూరంనుంచి మీ ఆవిడొస్తే, ఒక్కసారన్నా, క్షణంసేపైనా యింటికి రాకుండా పగలల్లా హాస్పిటల్లోనే పనిచేసుకుంటూ వున్నారు !"

ఆ మాటలన్నతీరుచూస్తే ఇవాన్‌కీ ఆనందం కలిగింది. "చాలాగడ్డు ఆపరేషన్ మరి; తప్పలేదు".

"తర్వాత ?"

"తర్వాతింకొక రోగికి నెత్తు రెక్కించ వలసొచ్చింది. తర్వాత మళ్ళీ యింకొక ఆపరేషన్. ఇదిచాలా పెద్ద జిల్లా కదూ; చేతికిమించిన పనుంటుంది యెప్పుడూ. ఒక్కోసారి

ప్రక్కజిల్లాల నుంచి గూడా వస్తారు. అందులోనూ నేను జనరల్ సర్జెన్ని. నాగొడవకేంగాని, పగలంతా యేం జేస్తూ కూర్చున్నా ?"

"గదంతా సర్దాను — అక్కడి వీక్కడికీ, యిక్కడి వక్కడికీ. మీబల్లసర్దటం మాత్రం నావల్ల కాలేదు; అంతాగజిబిజి."

ఇద్దరూ కలిసి తోడుపట్టుకుని, కడవలో నీళ్ళు చిందించుకుంటూ యింటిముఖం పట్టారు.

అక్కడి కెళ్ళేప్పటికి మొత్తం కుటుంబం అంతా గుమికూడుంది.

"గొరోద్కి ఆట ఆడుకుందామా?" అనడిగాడు డెనిస్. "అందరూ ఆటస్థలంలో కొచ్చేశారు."

రావాలనే వుంది కాని, ఇదిగో యీ భార్యారత్నాన్ని పొద్దుట్నుంచి చూళ్ళేదు. ఇదిపరకటిలాగా యెప్పుడుబడితే అప్పుడు యెక్కడికిబడితే అక్కడికి రావడానికి వీలుండదిక."

"దానికేం ?" అంది ఓల్గా; "నాకూ ఆటలంటే యిష్టమే చూడాలనే వుంటుంది. గొరోద్కి అంటే ఆడలేను గాని, వాలీబాల్, టెన్నిస్ ఐతే నేనూ ఆడతాను. కాని—ఇవాళ్ళ రాత్రికి మీయింటి కొస్తాం అని పాషాకి మాటిచ్చాను."

"ఓహో, ఆవిణ్ణి చెప్పిచెప్పాలి డాన్సింగ్ మాస్టే" అంది ఎలీనా నవ్వి "వాళ్ళ పార్టీలకి వెళ్ళేవాళ్ళు యెవరి భోజనం వాళ్ళే పట్టుకెళ్ళాలి. తను మాత్రం వూరికే వాగుతూ వుంటుంది తప్పయింకేమీ పనిచెయ్యదు. మాటల్లో మట్టుకావిడతో యింకెవ్వరూ పోటీ చెయ్యలేరు. ఎప్పుడూ యేదో ఒకటి అంటూనే వుంటుంది వసపోసినపిట్ట. ఇక నాటకాల గొడవకి

అంతే వుండదు. ఇంతవరకూ క్లబ్బులో వేసిన నాటకం అంటూ ఒక్కటీ లేదు కాని, అన్నిట్లోనూ ఆవిడ నటించినట్టే లెక్క !"

"వెళ్ళడం నాకూ యిష్టంలేదు కాని, వెళ్ళక తప్పదను కుంటా" అంది ఓల్గా.

"నిజమే. వెళ్లక తప్పదులే" అంది ఎలీనా ; "అందరం ఒక్కచోటవుండి పనిచెయ్యవలసిన వాళ్లం ; వెళ్ళవలసిందే."

# 15

"పాపం, చాలా యిబ్బందిలో పడిపోయిందండీ. జాలిగా లేదూ మీకూ ?" అనడిగింది ఓల్గా, భర్త ముఖం పరీక్షగా చూస్తూ.

టేబుల్ దగ్గర కూర్చున్నాడు ఇవాన్, చేతులు రెండూ ముందుంచుకుని, కిటికీలోంచి బయటికి చూస్తూ. ఆ సంభాషణే మంత యిష్టంగా వున్నట్టులేదు.

"అది చాలా ఛండాలప్పని" అన్నాడు చివరికి. "అ లాంటి వాటిల్లో జోక్యం కలగజేసుకోవడం యిష్టంలేదు నాకు. ఆవిడ రహస్యం చెప్పేశేసే అని నువ్వేమీ బాధపడనవసరం లేదు. ఈ సంగతి నాకిది వరకే తెలుసు. ఒకళ్ళ సంగతింకొక ళ్లకి తెలియకుండా వుండదు యిక్కడ. పావా చాలా బాధపడి పోతోందనుకుంటున్నావేమో ; లేదది. అలాంటి వాళ్లన్నీ తేలిగ్గానే తీసుకుంటారు."

"లేదండీ. బాగా బాధపడి పోతోంది, పాపం" అంది ఓల్గా, పావా మాటలు గుర్తుకుతెచ్చుకుంటూ; "చేసిందానికి

చాలా పశ్చాత్తాప పడుతోంది. చచ్చిపోదామని పిస్తోందంటోంది."

"ఆఁ, అన్నీ పోసుకోలు కబుర్లు."

"అదేపనిగా పడ్చింది గూడాను" అంది ఓల్గా, యింకా యేమని నచ్చజెప్పాలో తెలియక.

"కొంతమంది స్త్రీలంతే. పళ్ల తరబడి అలవాటైంతర్వాత, పిలిస్తే పలుకుతై వాళ్లకికన్నీళ్లు" అన్నాడు ఇవాన్; "అలాంటి వన్నీ నెత్తిమీద పెట్టుకోకు నువ్వు. అంతగా ంవాలంటే మావాళ్లల్లో గూసేవ్ అని డాక్టరున్నాడు; ఆయన్తో మాట్లాడుకోమను."

పావా యిల్లొక చిన్న కుటీరంలా గుంటుంది. ఇంటి ప్రిహరీ దగ్గర్నుంచి వరండాదాకా యిసుకనేల; కారుచక్రాల గుర్తులున్నై, మిగతాదంతా పచ్చిక కప్పివుంది. ఇంటివెనక చెట్లమాటున గరాజ్ (కారుపెట్టుకునేచోటు) వుంది. అంతా చాలా పరిశుభ్రంగా వుంది ప్ర్యాఖిన్ లాగానే.

వరండాలోనే ఎదురైంది పావా.

"వచ్చేశారన్నమాట; మీకోసమే ఎదురుచూస్తున్నా" అంటూ అందంగా తలతిప్పుతూ యింట్లోకి దారి తీసింది యీ కొమ్మమీది నుండా కొమ్మమీదికి యెగిరే సీతాకోక చిలుకలా. కన్నీటి చారికగాని, విచారంగావున్న గుర్తుగాని, పశ్చాత్తాప చిహ్నంగాని ఏమీలేదు. బాగా హుషారుగా వుంది.

"మన గొప్ప డాక్టర్ ఇవాన్ ఇవానొవిచ్ గారి భార్య" అంటూ పరిచయం చేసింది భోజనాలగదిలో కూర్చునున్న మగ వాళ్ళకి. జిల్లా పార్టీ కమిటీ కార్యదర్శి స్కొరొబొగాతోవ్

గూడా అక్కడేవున్నాడు. బయటున్నప్పుడు యింట్లోనూ అదో రకంగా బిగదీసుకుక్కూర్చున్న మనిషిలా గున్నాడు ప్ర్యాఖిన్.

మగవాళ్ళందరూ లేచి నిలబడ్డారు గౌరవ సూచకంగా. అందులో ముగ్గురు ముందుకొచ్చి ఓల్గా చేతిని ముద్దుపెట్టుకున్నారు.

"నాపేరు ఇగోర్ కొరోబిత్సిన్" అనన్నాడు అందులో ఒకతను.

చాలా మంచి మెకానిక్ అని విన్న దితన్ని గురించే అని జ్ఞప్తికొచ్చి, పరీక్షగా చూసిందతన్ని ఓల్గా. ఇద్దరమూ కలిసి ఇన్‌స్టిట్యూట్‌లో చదువుకోలేదుగదా అనుకుంది. గారాం యెక్కువై చెడిపోయిన పుత్రుడిలాగున్నాడు— బక్కగా ఎండిపోయిన రొమ్మూ అతనూను; నల్లగా అమాయికంగా వున్న కళ్లు, చిన్ననోరు, పాలిపోయిన మొఖం. మంచి మెకానిక్కనే కంటే, ఎవరూ గుర్తించని కవంటేనే కుదురుతుందా ఆకారానికి.

"రండి, మా బిడ్డని చూపిస్తా" అని చేయిపట్టుకుని యింకో గదిలోకి లాక్కెళ్ళింది ఓల్గాని, పావా.

అదొక పడకగది. ఎర్రదీపాలు, నికిల్ మంచాలు, గుట్టలు గుట్టలుగా తలగడలు, అల్లిన కిటికీ తెరలు, గదిలో కెళ్లగానే, గిరుక్కున తిరిగి, "ఏమైంది?" అన్నది వూపిరాడనట్టు.

"ఆయనంటున్నారూ ...." అంటూ నిస్సహాయంగా చూచింది పావా నుదురుపైపుకి ఓల్గా.

"ఎందుకు బాధిస్తారు నన్ను. చెప్పేసెయ్యండి ఏమన్నారో!"

"అసంభవం అన్నారు."

నీరుగారిపోయింది పావా, నిలుచున్నది నిలుచున్నట్టే. కళ్లెంట ఏకధారగా వస్తున్నై నీళ్ళు. ఎవరో కొట్టబోతుంటే తప్పించుకుంటున్నట్టు ఒకచేయెత్తి ముఖాని కడ్డు పెట్టుకుంది. తడిసినబుగ్గ నిమురుకుంటూ ముహంమీద పడే జుత్తు వెనక్కి నెట్టుకుని, తల వంచేసుకుంది.

"ఇకేం చెయ్యను!" అంది యేడుపుమూలాన పెగలని కంఠంతో.

"పాపం చాలా బాధపడి పోతోంది" అనుకుంది ఓల్గా "వలలో చిక్కుకున్న చక్కని చిన్న జంతువు లాగా."

ఏదో ఒకటి చెప్పి ఓదార్చాలనుకుంది. ఏమనాలో ఆలోచించుకోవడం పూర్తికాకముందే, పావా ఏడ్వాపేసింది. ఒక రుమాలు తీసుకుని కన్నీరు తుడుచుకుంది. అద్దం ముందుకెళ్ళి పౌడరేసుకుంది.

బిడ్డని చూడకుండానే ఇద్దరూ మళ్ళీ భోజనాల గదిలో కొచ్చేశారు. వచ్చీరావడంతోనే "డాన్స్ చెయ్యాలనిపిస్తోంది నాకు; కానివ్వండి, సంగీతం" అంది పావా. విక్టోరిలా వెయ్యి ఇగోర్ హోపక్ డాన్స్ చేద్దాం."

అని గది మధ్యలో డాన్స్ ప్రారంభించింది, వలయాలు చుడుతూ. కళ్లు మెరసిపోతున్నై, పెదవులు చిరునవ్వులు వెదజల్లుతున్నై; చేతులు అలల్లా కదలిపోతున్నై; మధ్యమధ్య హుషారు కేకలు. బహిర్ప్రపంచాన్నే మరచి పోయినట్టుంది; ఓల్గా ఇదివరకెప్పుడూ చూచెరగని అడుగు తేస్తోంది. అంతా డాన్స్ మయం — ఆవిడ భుజాలు, చేతులు, ఉంగరాలు తిరిగిన జుత్తు, మెడలోఉన్న మాల....

"ఏమి మనిషి, ఏమి డాన్సు" అని విస్తుపోయింది ఓల్గా; "ఆబాధల బరువంతా ఏమైపోయినట్టు ?"

కూర్చున్నచోటునుంచి లేచింది ఓల్గా. తలుపు ప్రక్క నెవరో నిలబడున్నారు. ముసలావిడ, నల్లని దుస్తులు భుజాల మీదొక నల్లనిరుమాలు. ఆవిడ పోలిక లచ్చంగా పావాలాగానే వున్నై. ముసలిదై పోయిన పావాయే అక్కడ నిలబడున్న దనిపించింది.

"సిగ్గుంటేగా, సిగ్గన్నా లేదు" అంటూ గొణుగుతోందా ముసలి. తలూపుతూనూ, నిట్టూరుస్తూనూ; కళ్ళు మాత్రం సంతోషిస్తున్నట్టే మెరుస్తున్నై.

"నీ వయసులో నువ్వింతకంటే తక్కువ చేసినట్టు" అనుకుంది ఓల్గా, మళ్ళీ పావావైపుకు తిరుగుతూ.

సోఫామీద కూర్చునున్నాడు ఇవాన్, కనుబొమలు ముడిచి, ఎగిరెగిరి వలయాలు తిరుగుతూన్న గౌనువంక చూస్తూ. "అంతతప్పు చేసినమనిషింత తేలిగ్గా అదంతా మరిచి పోయి యింతహుషారుగా డాన్సెలా చేస్తుందా అని ఆశ్చర్య పోతున్నారేమో" అనుకుంది ఓల్గా, ఇవాన్ని చూస్తూ.

స్కొరొబొగతోవ్ గూడా ఇవాన్ప్రక్కనే వున్నాడు కూర్చుని. అతను చాలా శ్రద్ధగానే చూస్తున్నాడా డాన్స్. కాకపోతే తనగొప్ప తనాన్ని మరచిపోలేని ఒకగొప్ప వ్యక్తిలా చూస్తున్నాడు. అసలే పెద్దమొహం; దానికితోడు బట్టతల; ఇంకా పొడుగైపోయినట్టుంది. "ఐతే, డాన్స్ చెయ్యాలనుందన్నమాట నీకు. చెయ్యి బాగాచెయ్యి నష్టంయేమీ లేదులే. లాభమూ లేదనుకో" అంటున్నట్టుందతని ముఖం.

స్కొరొబొగతోవ్ త్రాగడు, పేకాట ఆడడు, ఆడ వాళ్ళని పట్టించుకోడు; అంచేత చాలా పవిత్రుణ్ణని, గొప్ప వాణ్ణని అతనిఉద్దేశం. ఎవరైనా ఆ గొప్పతనాన్ని గురించి మాటాడినా, 'నేనంత గొప్పవాణ్ణయినప్పుడు అనకేం జేస్తారులే' అన్నట్టు వింటాడు. ఆజిల్లాకతను మంచిసేవచేశాడని ఆజిల్లా వాళ్ళందరూ అంగీకరిస్తారు. అందుకుగాను ఆతనికి ఎర్రజెండా పతకం (ఆర్డర్ ఆఫ్ రెడ్ బానర్) గూడా వచ్చింది. అంతమాత్రాన అతనంటే ప్రేమూలేదు, ఇష్టమూ లేదు. ఇవాన్ ఇవానొవిచ్ గూడా అతనంటే పెద్దయిష్టంగా వుండడు.

"ఏంబాగా విసుగ్గా వుందా ?" అన్నట్టు చూచింది ఓల్గా, భర్తవంక.

కనుబొమలొకసారి ఎగరేసి, చూపు తిప్పేసుకున్నాడు ఇవాన్ ఇవానొవిచ్.

# 16

ప్రతిరోజూ పెందలకాడే లేచి, కాఫీ అది చెయ్యడం అలవాటు చేసుకుంది ఓల్గా. ఒక్కొనాడు కొద్దిగా ఫలహారం గూడా చేసేది. ఇదివరకెప్పుడూ చేసెరగంది కావడం వల్ల ఏమి చేసినా గొప్పగానే వుంది.

ఉదయం ఫలహారం చేసే సమయం అంటే మహానందంగా వుందావిడకి.

"అప్పుడే వెళ్ళిపోవాలా ఆఫీసుకి, ఇవ్వాళ్టి కింటిదగ్గరుండి పోగూడదూ !" అనేది ఇవాన్ హాస్పిటల్ కి బయల్దేరుతుంటే.

"నువ్వుగూడా యేదో వొక పనిచేసుకోవాలి" అన్నాడొకసారి.

"ఏంపని చెయ్యను. ఏమైనా చేతనైతేనా ?"

"ఇంగ్లీషు నేర్పరాదూ?"

"ఆ కోర్సు పూర్తిచెయ్యలేదుగా. ఎవరన్నా నేర్పితే, నేనే నేర్చుకోవాలింకా."

ఆవిడలా విచారపడుతూంటే ప్రేమగా చూసేవాడు ఇవాన్; ఓల్గా కోర్సెందుకని పూర్తి చెయ్యలేదో ఇవాన్‌కి తెలుసు.

"సరే, కొంతకాలం యేమీ చెయ్యకుండా వుంటేనే మంచిది" అన్నాడు గోముగా; "విశ్రాంతి తీసుకో. నీకు సెలవిచ్చాననని సంతోషిస్తాను. కాకపోతే ఎలాగోలా కష్టపడి ఒక బిడ్డని కను యీ లోపుగా.... రోజల్లా యేమీ చెయ్యకుండా కూర్చోవాలంటే కష్టమే అనుకో.... విసుగ్గా వుంటుంది కూడాను..."

"అర్థంలేదు" అంది ఓల్గా తీవ్రంగా; "విసుగు మాటట్లా వుంచి చచ్చేంత సిగ్గుగావుంది నాకు. పగలల్లా మీరిక్కడ లేకపోవడంవల్ల కంటే, ఏమీ పని చెయ్యకుండా సోమరిపోతులాగా కూర్చోవడం మూలానే ఎక్కువ బాధగావుంది నాకు. ఎంతసేపూ యిల్లు కడగడం, కూరగాయలు తరగడం—ఇదేనా నేను చెయ్యవలసిన పనీనీ, చెయ్యతగిన పనీనీ ? మీకూ, నాకూ వున్న భేదం చూడండి. విశ్రాంతి తీసుకోమంటారు మీరు. ఏం చేశాను గనక, ఏం కష్టపడి పోయాను గనుక తీసుకోను విశ్రాంతి ? ఇక్కడకొచ్చి, మీరు నిర్మించినవన్నీ చూచి ఆశ్చర్యపోయాను నేను. ఎన్నిళ్లు, ఎన్ని ఫ్యాక్టరీలు, ఎన్ని చక్కనిరోడ్లు;

ఒక కొత్త పట్టణమే కట్టేశారు అడవిలో! అంతా చెప్పాడు లొగునోవ్ నాకు—కళ్లాగా చూశాను. అంతా చూడచక్కగా వుంది; ఐనా అసూయగావుంది నాకు; ఇంత చక్కని నిర్మాణంలో నా పాత్రేమీ లేదే అని. నావంతుపని నేనూ చెయ్యాలనుంది. అందుకు మీరు తోడ్పడాలి. నేను మీకెలా ప్రయోగపడగలనో చెప్పండి." రెండు చేతుల్తోనూ భర్త భుజం గట్టిగా పట్టుకుని ఆపేసింది.

హాస్పిటల్ దగ్గరగానేవుంది. తానందులో సర్జన్. ఆ కొత్త ఇన్స్టిట్యూషన్కి తలలాంటివాడు. తన ఆలోచనలన్నీ దాన్నిగురించే. ప్రక్కనే నిలబడున్న యీస్త్రీ, తన భార్య, నిలవేసి అడుగుతోంది సమాధానం చెప్పమని. ఇలా ప్రశ్న వాణ్ణున్నట్టు సరైన సమాధానం చెప్పమంటే ఎలా సాధ్యం? కాని ఆవిడంటే అంతులేని ప్రేమ.

ఆవిడవంక క్షణంసేపు దయగా చూచి నవ్వుతూ, "ఎప్పుడూ యేదో వొక కొత్త ఉత్సాహంలోపడి కొట్టుకుపోతుంటావు. ఓల్గా! నువ్వు" అన్నాడు; "నీశక్తియుక్తుల్నిలా చెల్లాచెదరు చెయ్యడం మంచిదికాదు. ఇంగ్లీషు కోర్స్ మొదలెట్టావుగదా, పూర్తి చెయ్యి; కావాలంటే పోస్ట్ద్వారా కరెస్పాండెన్స్ చదువు చదువు. ప్రస్తుతానికి పని కావాలంటే నాదగ్గరసైన్సు వ్యాసం వొకటి ఇంగ్లీషులో వుంది; అనువాదం చెయ్యడం నాకు చేతగాదు; నువ్వుచేసిపెట్టు. సరేనా?"

యకూత్ జాతి కుర్రాడు పండుకునున్న మంచం ప్రక్కనే నిలబడున్నాడు ఇవాన్ ఇవానోవిచ్. ఆ కుర్రాడికి ఆపరేషన్ చేసిందాయనే.

ఆకుర్రాడి పేరు యూరీ. ఒక స్కూలు టీచరు కొడుకు. వయసైదున్నరకంటే ఎక్కువుండదు. కాని అతనిదంతా పెద్ద వాళ్ళ తరహా; చూపూ, మాటా—అంతా. ఒక్కోసారి యింత చిన్నవాడింతింత పెద్దమాటలెలా అనగలడని ఆశ్చర్యపోయే వాడు డాక్టర్ ఇవాన్.

కుర్రవాడి చేయి చేతిలోకి తీసుకుని, "ఎలావుందిప్పుడు యూరీ!" అనడిగాడు.

"మెరుగే" అన్నాడు కుర్రాడు నెమ్మదిగా. రష్యన్ భాష బాగా మాట్లాడగలడతను. "ఇప్పుడు వేళ్లుగూడా బాగానే కదపగలుగుతున్నా."

"మంచిదే!" అంటూ మంచం ప్రక్కనే వున్న స్టూలు మీద కూర్చున్నాడు ఇవాన్. డ్యూటీ మీదున్న డెనిస్ వంక చూస్తూ కుర్రాడు కప్పుకున్న దుప్పటి తీసి చూశాడు. "ఫర్వా లేదు" అంటూ కుర్రవాడి కాళ్లు మడిచీ, చాచీ, పైకిలేపీ చూచాడు.

"చాలా తొందరగానే కోలుకుంటున్నావు" అని, డెనిస్ వైపుకి తిరిగి, "తొడకీలెలావుంది?" అనడిగాడు.

"సర్వాలేదు. ఇప్పుడిప్పుడే కొద్దికొద్దిగా పని చేస్తోంది. కాలివ్రేళ్లు మట్టుకెప్పుడూ ఆడిస్తూనే వుంటాడు. అలా ఆడించడం మంచిదని చెప్పాను. యూరీ సామాన్యుడు కాదండోయ్ రాయిలాంటివాడు." అన్నాడు డెనిస్.

"తొందరగానే లేచి కూర్చోనిస్తాం నిన్ను" అని ధైర్యం చెప్పాడు డాక్టర్ ఇవాన్. ఆ కుర్రాణ్ణి చూస్తూంటే తన కూతురు గుర్తుకొచ్చిందాయనకి. తనకూతురు జబ్బువేరు;

జ్వరం. ఐనా, జబ్బుతో మంచంమీద పండుకునున్నప్పుడు తన కూతురు ముఖమూ యిట్లాగే వుండేది. జబ్బుగావున్న పిల్లలు చాలా త్వరగా బలహీనపడి పోతారు. తొందరగా పెద్దవాళ్లై పోయినట్టు కనిపిస్తారు. అందులోనూ యితను మంచమెక్కి మూడేళ్లయ్యింది.

"కాలుసాచి చూడుబాబూ" అన్నాడు ఇవాన్. కాలు సాచడం అంటే యీ దశలో చాలాబాధ. ఐనా యూరీ ప్రయత్నం చేశాడు డాక్టర్ సూచన ప్రకారం. అప్పుడా కుర్రాణ్ణి చూస్తే అంతులేని సానుభూతి కలిగింది.

యూరీ నుదుటిమీదా, పై పెదవిమీదా చెమట పట్టింది చిన్నచిన్న బిందువులుగా; కన్నులు బాధగా ముకుళించినై కాలుకదిపేందుకవన్నీ తమ శాయశక్తులాసాయపడుతూన్నట్టు.

"నేను చెప్పలా రాయిలాంటివాడని" అన్నాడు డెనిస్. ఇంతలోనే నాడీవ్యాధి నిపుణుడు (న్యూరాలజిస్ట్) వాలెరియెన్ వాలెంతినోవిచ్ గూడా వచ్చాడు. ఆయనకూడా ఈ ఆపరేషన్ ఫలితాన్ని చాలా శ్రద్ధగా గమనిస్తున్నాడు.

సన్నని బంగారు తీగచుట్టిన కళ్ళజోడు పెట్టుకున్నాడు వాలెంతినోవిచ్. బట్టతల అక్కడక్కడ నాలుగు వెంట్రుకలున్నై తలమీద, బంగారు తీగల్లాగ. పిల్లలంటే ఆయన కపరిమితమైన ప్రేమ. పిల్లలుగూడా ఆయనంటే బాగాచనువుగానే వుంటారు.

"చూశారా, కాలెలా సాచానో" అన్నాడు గర్వంగా, యూరీ, చుట్టూ నిలబడ్డ డాక్టర్లనిచూచి. వాళ్లూ బాగా సంతోషించారు ప్రయత్న ఫలితం చూచి.

"నీకిక మంచి వ్యాయామంగూడా యిస్తా" అన్నాడు ఇవాన్. "ఆ వ్యాయామం యెలా చెయ్యాలో డెనిస్ చెబుతారు నీకు. కప్పలాగా విదలించాలి కాళ్లు. తర్వాత పాకడం."

"నిజంగానా ?" అన్నాడు యూరీ ఎప్పుడెప్పు డంటున్నట్లు.

ప్రక్కమీద పండుకుని పండుకుని విసుగెత్తి పోయిం. అతనికి. ఇలాచేస్తే కొద్దికాలంలో నడవగలుగుతావని చెబితే చాలు, ఏది చెయ్యడానికైనా సిద్ధమే అతను. మరీ ఒక సంవత్సరంనుంచి ప్లాస్టర్ పెట్టి పడుకో బెట్టారు; శరీరంలో క్రింది భాగాన్ని కదలించేందుకూడా వీల్లేదు.

ఇవాన్ ఇవానొవిచ్ రాక పూర్వం హాస్పిటల్ అధికారిగావున్న గూసేవ్, యూరీని పరీక్షచేసి వెన్ను క్షయ అని చెప్పాడు. ఇతరుల సలహా తీసుకునేందుకుగూడా నిరాకరించాడు. కాని, పరిస్థితి ప్రమాదకరంగా పరిణమించిం తర్వాత సలహా తీసుకోక తప్పలేదు. అప్పుడు ఇవాన్, వాలెంతినొవిచ్ కలిసి పరీక్షచేశారు.

నెలా, నెలన్నరరోజులు పరీక్ష చేసిం తర్వాత రోగిని ఆపరేషన్ బల్లమీది కెక్కించారు. వెన్నుపూసమీద బుడుపొకటుంది మాదలాగా. ఆపరేట్ చేసి దాన్ని తీసేశాడు డాక్టర్ ఇవాన్. క్షయచిహ్నాలే కన్పించలేదు.

"చాలా చురుకైన కుర్రాడు" అన్నాడు వాలెంతినో, వార్డులోంచి బయటికెళ్ళేప్పుడు; "మన ప్రయత్నాలు వృథా కాలేదు. ఫర్వాలేదు, యింకొంత కాలంవుంటే తప్పకుండా లేచి తిరగ్గలడు."

# 17

ఇవాన్ ఇవానొవిచ్ నటాషాతో ఆడుకుంటున్నాడు. "దానితో ఆడితే చాలదు; నలుగురైదుగురు పిల్లల్ని కనండి మీరే" అన్నది ఎలీనా, ఆ ఆటలు చూచి నవ్వుతూ.

ఒకోక్కసారి హాస్పిటల్‌నుంచి అలసిపోయి వచ్చేవాడు ఇవాన్ ఏదో ఆలోచిస్తున్నట్లు పరాకుగా వుండేవాడు. గడ్డు ఆపరేషనేదో చేసి వచ్చాడనీ, యింకా దాన్నిగురించే ఆలోచిస్తున్నాడనీ వెంటనే తెలిసిపోయేది ఓల్గాకీ, యితరులకీగూడా. కాని సర్వసాధారణంగా, యింటికొచ్చేప్పటికి హుషారుగానే వుండేవాడు. ఓల్గాతో పరాచికాలాడేవాడు. డెనిస్ పిల్లల్తో ఆటలాడుతూ యింటికప్పెగర గొట్టేసేవాడు.

ఇవ్వాళా బాగా హుషారుగా వున్నాడు.

చిన్నిచిన్ని చేతుల్తో పిడికిళ్లు బిగించి కొడుతోంది నటాషా; జుట్టు పీకుతోంది. పైకెగరేసి వీపుమీదుగా జారవిడిచి, మళ్లీ ముందుకు లాక్కుంటూంటే పగలబడి నవ్వుతోంది; భయంతో వుక్కిరిబిక్కిరై పోతూంది.

"ఎందుకట్లా ఆచిన్నపిల్లని భయపెడ్తారు?" అంటూ కూకలేసింది ఓల్గా; "పిల్లికి చెలగాటమూ, ఎలక్కి ప్రాణసంకటమూనూ."

"నటాషా కిష్టమే. సరేలే. ఇకదిగమ్మా" అని క్రిందికి దింపేసి "ఇకచాల్లేమ్మా, పో అమ్మదగ్గరకి" అన్నాడు ఇవాన్. కాని ఆ పిల్ల వాళ్ళమ్మదగ్గరికి పరుగెత్తలేదు; అలాగే కాళ్లు కావిలించుకుని నిలబడింది. "చూశావా? నేచెబితే నమ్మలేదు గదూ? పిల్లలకీ ఆటలంటే మహా యిష్టం. అందులో నటాషా

బాగా గడుసుది. ఏ విమానమో నడుపుతుంది పెద్దదైతే!' అన్నాడు ఇవాన్ తాషే గెలిచినందుకు సంతృప్తిగా.

పిల్లల్తో ఆడుకునేప్పుడాయన ఆనందం చూచి, "నిజమే, మాకూ ఒక బిడ్డవుంటే బాగుంటుంది. గతాన్ని మరచిపోవొచ్చు" అనుకుంది ఓల్గా.

"మీరుగూడా అరడజనుకి తక్కువ లేకుండా పిల్లల్ని కనాలి" అన్నది ఎలీనా, ఓల్గా ఆలోచనలు పసికట్టిందానికి మల్లే "అప్పుడుగాని యిల్లు కళకళలాడదు."

అప్పుడప్పుడూ పేకాటకి గూడా కూర్చునేవాడు ఇవాన్. తల్లి ఎలీనా వొడిలో కూర్చుని చూస్తూండేది నటాషా. ఆట తెలిసిగాదు; వాళ్ళమ్మా, డాక్టరూ పోట్లాడుకుంటూంటే చూడాలని. పేకాటకంటే, పేకాటలో చేసే మోసమంటే ఎక్కువ సరదా ఇవాన్‌కి. అందుకని ఆట పూర్తయ్యేలోపుగా ఎందుకో వొకందుకు పేచీవస్తూనే వుంటుంది; పోట్లాట జరుగుతూనూ వుంటుంది.

"ఇకమీతో ఆడలేం బాబూ!" అంటూ లేచి నుంచునేది ఎలీనా, చాపకింద దాచిన ముక్కలు తీసి చూపిస్తూ; "ఆటల్లో గూడా యింత మోసమా చిన్నపిల్లలికి మల్లే!"

"అరరె, నాకు తెలియనే తెలియదే, ఎట్లా వెళ్ళినయబ్బా యివి చాపకిందికి!" అంటూ అమాయకంగా అనేవాడు ఇవాన్. కాని ఆయన కన్నుల్లో చిలిపితనం కనిపిస్తూనే వుండేది.

డెనిస్ గూడా పేకాటకి వాళ్ళతోపాటు కూర్చుంటే యిక చెప్పేపనేలేదు. కనుబొమలాడించో, అపులించో, చిటికెలువేసో చెప్పేసేవాడు ఇవాన్, ముక్కలెలా పడిందీ. అదే

మంటే "ఐనా పేకాటలో మంచితనం యేమిటి! ఆటేమోస పాలైతే" అనేవాడు.

ఎలీనాకి కోపం వచ్చేది. "ఇంతపచ్చిమోసం నాజన్మలో చూళ్ళేదు. ఇకమీతో చచ్చినా ఆడను" అంటూ లేచేది.

మరీ పగలబడి నవ్వేవాడు ఇవాన్.

"మోసంలేకపోతే యింకా యీ ఆటలో రజ్జేముం టుందీ!" అనేవాడు.

# 18

ప్రతిరోజూ, ఇవాన్ ఇవానొవిచ్ ని హాస్పిటల్ కి పంపిం తర్వాత, ఇంగ్లీషు చదవడం ప్రారంభించింది ఓల్గా. చాలాసేపు చదువుతూనే కూర్చునేది. తర్వాతొక డిక్షనరీ పట్టుకుని, ఇవాన్ యిచ్చిన వ్యాసం అనువాదం చేసేది. కాని అనిశ్శబ్దంగా వున్న యింట్లో పనిచేసుకోవాలంటే చాలా కష్టంగావుంది. మనిషన్న మాట కన్పించందే. ఈమధ్య యింకొక అనుమానం గూడా కలిగింది. ఇవాన్ ఆవ్యాసం అనువాదం చెయ్యమని చెప్పింది తన కుబుసుపోకగా వుంటుందనేనేమోననీ, అవసరం వుండి కాదేమోననీ.

"అక్కడికి నన్నుద్ధరించినట్టు!" అనుకుంది కోపంగా. అంతటితో ఆపనంటే యిష్టంగూడా లేకుండా పోయింది. ఐనా ఆ అనవసరపదాలకోసం డిక్షనరీ అంతా తిరగేస్తూ కూర్చోవడ మేమిటి?

ఒకనాడూరికే అలా గనుల ప్రక్కన తిరిగొద్దామని బయల్దేరింది. చక్కగా యెండకాస్తోంది. ఇంతలోకే యేదో

మెషీన్‌చేసే చప్పుడు వినిపించింది. చూస్తే డ్రెడ్జరు. (నీళ్ళున్న చోట మట్టితవ్వి లోతుచేసే యంత్రం.) ఆవిరి నావలాగావుంది. పెద్దపెద్ద బకెట్లు మట్టినింపుకుని మురుకులైన నీళ్ళలోంచి పైకెగబాకుతున్నై. రాట్నాన్ని చుట్టొచ్చే దారంలాగా ఒక పెద్ద ఇనుప గొలుసు పడవ కడుపులోకాబకెట్లు లాక్కుని మళ్ళీ నీళ్ళలోకి కొదులు తూంది. ఎప్పుడైనా చెత్తాచెదారం, మొక్కలూ అవీవస్తే ఒక పొడుగాటి గడ పట్టుకుని అవన్నీతీసేస్తున్నాడొక పనిమనిషి.

ఈ యంత్రాన్ని చూడబుద్ధయ్యింది ఓల్గాకి. అలాగే చూస్తూ నిలబడిపోయింది. లోయకటువైపున కళ్లుతిరిగేట్టున్న కొండలు. ఇంకాస్త క్రింద మనుషులుండేందుకు వీల్లేని చిట్టడవులు. ఈ అడవిలోక మేమిటి? ఈ అధునాతన యంత్రమెక్కడ? నీటిమీద తేలుతున్న ఫాక్టరీ లాగుంది. ఇంతపెద్ద యంత్రాన్నిక్కడికెలా తేగలిగారో !

"మెషీన్ బిల్డింగ్ ఇన్‌స్టిట్యూట్ వదలకపోయినా బాగుండేది; మంచి మెకానికల్ ఎంజినీర్‌నన్నా అయ్యేదాన్ని" అనుకుంది ఓల్గా డ్రెడ్జర్‌ని చూస్తూ. "కనీసం ఇగోర్ అంత సామర్థ్యమన్నా ఉండేదేనాకు. నావృత్తి చెడగొట్టుకున్నాను. నాచదువు చెడగొట్టుకున్నాను. నాబిడ్డను పోగొట్టుకున్నాను. ఈ ఇంగ్లీషు నేర్చుకోవడం యెప్పటికి పూర్తౌతుందో తెలియదు. కాలమూ పరుగెత్తుకు పోతూంది; ఎగిరిపోతూంది!"

డ్రెడ్జర్ డెక్‌మీదినుంచి క్రిందికి వేసిన కొయ్యబల్ల దగ్గరికెళ్ళింది ఓల్గా. అక్కడ పనిచేస్తూన్న ఒక స్త్రీని, ఇక్కడ మీరేం

చేస్తున్నారో చూపుతారూ నాకు; తెలుసుకోవాలనుంది" అన డిగింది.

ఓల్గా తిరిగి యింటికొచ్చేప్పటికి మధ్యాహ్నమైంది. అలసి పోయి, ఆలోచనల్లో మునిగితేలుతూ వచ్చింది. అప్పుడే ఎలీనా గూడా పనిలోంచి వచ్చింది. ఆవిడ వంట చేస్తూంటే వంట చెరకూ, నీళ్ళు అవీ అందించి సాయం చేసింది ఓల్గా. తర్వాత యింటికెళ్లింది.

"ఇంకొక రోజై పోయిందన్నమాట" అనుకుంది వరండా యెక్కుతూ. చేతివేలికి పేడుగుచ్చుకున్నట్టుంది, నోట్లో పెట్టుకు చీకుతోంది. లోపలికెళ్ళి కుట్టుపనిముట్ల బుట్ట టేబిల్ మీద బోర్లించి, సూదికోసం వెదుక్కుంటూ మళ్ళీ అనుకుంది "ఇంకో రోజు ముగిసిపోయింది" అని.

అదేసమయానికి పావా వచ్చింది లోపలికి, "ఏంజేస్తు న్నారూ" అంటూ.

"చేతిలో పేడుదిగితేనూ..........."

"ప్రథమ చికిత్సా!" అంటూ టేబుల్ మీదున్న సోగు చూసి, "చాలా మంచిలేసండీ, నేనెంత వెదకినా దొరకలే దలాంటిది" అంది.

"మీకంత బాగావుంటే తీసుకోండి."

"అబ్బెబ్బే! మీకూ కావాలిగా?"

"కావాలే అనుకోండి. ఐనా ఫర్వాలేదు, తీసుకోండి" అని కాస్సేపు మాట్లాడకుండా వూరుకుంది ఓల్గా. ఉన్నట్టుండి, కోపంగా "ఇంటిదగ్గరుంటే యికిలాంటి చిన్న చిన్న విషయాలే

గాపట్టించుకునేది. అంతకంటే యింకేముంటుంది. కదూ?"
అనడిగింది.

"నేనెప్పుడూ యింటిదగ్గరుంటేగా" అంది పావా సద్భావంగానే. లేసు తీసుకొని, రొమ్ముదగ్గర పెట్టుకొని "బ్లౌజుపైన యిలా అల్లితే బాగుంటుంది కదూ. మేంవేసే కొత్త నాటకంలో ఉపయోగించుకోవచ్చు గూడాను. ఇప్పుడప్పుడే కొత్తది కుట్టించన్లెండి. చూడండి యెట్లా లావెక్కిపోతున్నానో! అసలు దీనికంతటికీ కారణం ఆ ఇవాన్ ఇవానొవిచ్! ఎన్ని చెప్పినా చెవికెక్కించుకోడు" అన్నది.

ఓల్గా నవ్వింది.

"ఇవాన్ ఇవానోవిచ్ ఏంచేశారు?"

"ఆయన నాకా సాయంచేస్తే యీ బెడద లేకుండా పోయేదిగా. గూసేవ్‌కి మల్లే బెదిరే మనిషన్నా కాదు" అని అద్దం దగ్గరకెళ్ళి పౌడరద్దుకుంది; "కడుపుతూన్నా నాఅందమేమీ చెడలేదు కదూ? ఊరికే కాస్త గుండ్రమైనట్టున్నా. ఐనా యిక అమాయకపు ఆడపిల్లల పాత్రలు ధరించడానికి వీలుండదు. మాసమాజానికి యిబ్బందే; మీరు తీసుకోగూడదు నాబదులు!"

"నేనెప్పుడూ రంగు పూసుకున్నదాన్నైనా కాదు."

"దానికేం. కోరికంటూ వుంటే అదేవచ్చేస్తుంది. ఐనా ఇవాన్ ఇవానోవిచ్ ఒప్పుకోరేమోలే. అన్నట్టు మీకు తెలుసా యివ్వాళేం జరిగిందో?" అనడిగింది, లేసు జాగ్రత్తగా మడతపెట్టి చేతిసంచిలో దాచుకుంటూ. "మీరింకా వినలేదేమిటీ? చాలా ప్రమాదమైన సంగతి."

ఓల్గా గుండె కొట్టుకుంది.

"ఏమిటీ? ఏమైంది?"

"ఏముందీ, గొప్పనేరం జరిగిపోయింది. నాలుగు నెల్ల గర్భమున్నావిడకి, కడుపులో బల్ల పెరిగిందనుకుని ఆపరేషన్ చేశాడు."

"నిజంగా!" అంటూ అరచినంత పనిచేసింది ఓల్గా.

"అక్షరాలా!" అన్నది పావా తానేదో విజయం సాధించినట్టు; "బోన్లే. అన్నీ తనకే తెలుసునను కుంటాడు. అలాంటి వాళ్లిలాగే చేస్తారు. సరిగ్గా పరీక్షగూడా చెయ్యడు. గూసేవ్ యీసారసలొదిలిపెట్టడు ఆయన్ని."

# 19

గూసేవ్ ఇప్పుడు ఇవాన్ ఇవానోవిచ్‌కి ఎసిస్టెంట్‌గా వుంటున్నాడు. ప్ర్యాఖిన్ ఇంట్లో, వచ్చినతర్వాత రెండో రోజున, కలుసుకుందతన్ని ఓల్గా. ఎందుకోగాని, చెఖోవ్ కథ లోని మఫ్లర్ మనిషి గుర్తుకొచ్చాడావిడకి యితన్ని చూస్తూంటే. పొడుగ్గా వుంటాడు. కొద్దిగా గూని. పొడుగాటి ముక్కు. వేళ్లు పొడుగ్గా, సన్నగా గాలంలాగా వుంటై. కొత్త మనిషి కనబడితే, వాసన చూస్తూన్నట్టుంటాడు.

"అతనూ నేనూ యేమంత బాగా వుండం" అన్నాడు ఇవాన్, ఓల్గా కతనితో ప్రథమ పరిచయమైన తర్వాత; "బాగా అనుభవంవున్న డాక్టరే. కాని అతి జాగ్రత్త—ఏంచేస్తే ఏమౌ తుందోనని భయం. చొరవచెయ్యలేడు. సర్జెన్సు అలా వుంటే

గడవదు. అంత జాగ్రత్తగానూ, భయంగానూ వుంటే చివరికి డాక్టర్లకిగూడా గడవదు."

"మీతో పనిచేసే వారందరితోనూ బాగా వుండాలిగదా మరి మీరు!" అన్నది ఓల్గా సర్దుకోవాలని చెబుతూ.

ఇవాన్ గిలగిలలాడాడు.

"సాయం చెయ్యడు, సలహా యివ్వడు సరిగదా ప్రతి దాంట్లోనూ వచ్చి వేలుపెడుతాడు; అలాంటి మనిషితో పొత్తు కలపడం యెట్లా? ఎందుకూ, మేమేదైనా నాడీశస్త్ర చికిత్సని గురించి చర్చించడం ప్రారంభిస్తే చాలు, అతనికా కేసుతో సంబంధం లేకపోయినా సరే, కడుపునొప్పొచ్చేస్తుంది. అంత గాభరా."

ఈసారి గూసెవ్ పూర్తిగా దిగ్భ్రాంతిలో పడిపోయాడు. పలుకన్న మాటలేదు, ఆపరేషన్ టేబుల్ ప్రక్కన అలాగే నుంచున్నాడు మాటా పలుకూ లేకుండా. కావాలనుకుంటే లతుసేపని; ఈ ఆపరేషన్ కతను సలహా యివ్వలేదు, సాయమూ చెయ్యలేదు, ఏదో ఛాన్సుగా వచ్చాడు అక్కడికి.

ఇవాన్ ఇవానొవిచ్ సంగతి వేరు. పొత్తికడుపు తెరిచి, గర్భాశయాన్ని చూడగానే తెలిసింది యిది కడుపులో బల్లకాదు, గర్భమేనని. వెంటనే సిగ్గుపడిపోయాడు; ఎవరో యీడ్చి చెంప మీద కొట్టినట్లయ్యింది.

ఆ తొందరలో చేతిలో శస్త్రం అక్కడ పడేసి, గుమ్మం వైపుకు నడిచాడు ముందు. పక్కవాళ్లతోగూడా ఏమీ

అనలేదు. సామాన్యంగా కోపం వచ్చినప్పుడు చేసినట్టు అదేపనిగా తిట్టుకున్నాడు గొణుక్కుంటూ. కాని గుమ్మందగ్గరికి వెళ్లీ వెళ్లకముందే తన్నుతాను సంబాళించుకున్నాడు. ఆపరేషన్ టేబుల్ దగ్గరకెళ్లి, మళ్లీ కుట్టెయ్యడం మొదలెట్టాడు.

శస్త్ర చికిత్సలో సిద్ధహస్తుడు. అన్నీ అనుకున్నట్టే చేస్తున్నాడు గాని, లోపల పీకుడు పోలేదు. తానే స్వంతంగా జాగ్రత్తగా పరీక్ష చెయ్యవలసింది; పరీక్షచేసిన డాక్టర్ మాట తీసుకుని ఆపరేషన్ చేశాడు.

కుట్టటం పూర్తై పోయింతర్వాత ప్రక్కగదిలో కెళ్లాడు. ముసుగూ, టోపీ, రబ్బరు గ్లోవ్స్ (చేతి మేజోళ్లు) అన్నీ తీసి పారేసి, గబగబ నడవలోంచి చకచకా వెళ్లిపోయాడు తన గదివైపుకి. దారిలోవున్న రోగులందరూ గాభరా పడిపోయి ఎవరి మంచాల మీదికి వారెళ్లి పడుకున్నారు. గది గుమ్మంలో ఒక నర్సెదురైంది బేసిన్‌నిండా చెత్త నింపుకుని. పుండుమీద కారం రాసినట్లైంది. హాస్పిటల్ నియమాలు సరిగ్గా పాటించ నట్టు కన్పిస్తే, కోపం మరీ యెక్కువౌతుందిలాంటప్పుడు.

"ఆ బేసి నక్కడపెట్టు" అన్నాడు కోపంగా, "పెట్ట మని చెప్పగానే పెట్టెయ్యి! ఆపని నువ్వు చేసేదికాదు; మిగతా పని వాళ్లేమయ్యారు?"

మిగతా పని వాళ్ళనగానే, యిందాక తాను ఆపరేట్ చేసిన పనిమనిషి గుర్తుకొచ్చింది; బాధతో గిరుక్కున వెనక్కి తిరిగాడు.

జూన్ నెల. చక్కని యెండ. ఇంతమంచి రోజున అంత పొరపాటు పనిచేశాడు, తననితానే క్షమించుకోలేకపోయాడు. పరీక్షచేసే డాక్టర్ పొరపాటభిప్రాయపడ్డాడు కడుపులో బల్లని.

గ్యానోకలాజిస్ట్ (స్త్రీలకి సంబంధించిన జబ్బుల్ని పరీక్షచేసే వ్యక్తి)తో పరీక్ష చేయించుకోనని మకురుపట్టు పట్టిం దావిడ. అందులోనూ అందరికీ తెలిసిన మనిషి; వెన్న నోట్లో పెట్టినా మ్రింగలేని దానిలాగా వుండేది అమాయికంగా. అలాంటిది గర్భవతి ఔతుందని ఎవరూహించుకో గలరు ?

"భలే మనిషే !" అనుకున్నాడు పోలీక్లినిక్‌కి వెళ్ళే మెట్లెక్కుతూ; "నాకళ్ళే కప్పేసింది !"

తన ఆఫీసులోకి వెళ్ళి దభాలున వేసేసుకున్నాడు తలుపులు. (అదృష్టవశాత్తూ అప్పు డెవరూవచ్చి చూచే సమయం కాదు.) కాలికి స్టూల్ అడ్డంవస్తే లాగొక తన్ను తన్నాడు ; వెళ్ళి తనడెస్క్ దగ్గర కూర్చున్నాడు.

"భలే మనిషిలే !" అనుకున్నాడు కోపంగా మళ్లీ; భలే కన్య !"

ఆపని మనిషి రూపం కళ్ళకక్కట్టినట్లు కన్పించింది; అభమూ శుభమూ తెలియని ముఖం; పొడుగాటి చేతులు; ఎప్పుడూ తనపనేమో, తనేమో అన్నట్టుండేది. హాస్పిటల్ వుద్యోగులంతా మంచిదననుకునేవారు. బాగా శ్రమపడేది. పని గూడా చకచకా చేసేశేది. గడ్డుపనులన్నీ ఆవిడకే అప్పజెప్పే వాడు తను. చాలా నమ్మకమైన మనిషనుకున్నాడు. ఉండుండి యీపని చేసి కూర్చుంది; ఇప్పు డందరికీ తలవంపులే.

"ఛీఛీ బుద్ధిలేకపోతే సరి ! ఒకవైపున కడుపుతెచ్చుకుని, కడుపులో బల్లయినట్టు ఎందుకు నటించింది ? మిగతా వాళ్ళే మైనా అనుకుంటారేమోనని భయపడిందా అంటే ఏమనుకుంటారు? చేతనైన సాయం జేసేవారు. ఇంతపచ్చి మోసం చెయ్యడమెందుకు ?" "సరేలే, నీకు తగినశాస్తే జరిగిందిలే! "

అనుకున్నాడు తనను తానే వుద్దేశించి. "ఇక ముందిలాంటి పొరపాటు చచ్చినా చెయ్యవు; ఇకనైనా జాగ్రత్తగా వుంటావు."

జిల్లాపార్టీకమిటీ ఆఫీసుకు రావలసిందని పిలుపొచ్చింది. ఆవేళ మధ్యాహ్నం. టోపీ, కోటూ తీసుకుని హాస్పిటల్ బయటి కొచ్చాడు. గుమ్మందగ్గర ఓల్గా యెదురైంది.

పేమగా చూచిందతని వంక; కంగారుపడి పోయినట్టు కన్పిస్తూనేవుంది.

"మిమ్మల్ని కలుసుకుందామనే వచ్చాను; ఇంటికేనా?"

"కాదు. జిల్లాకమిటీ ఆఫీసుకి" అన్నాడు మందకొడిగా ఆవిడకళ్ళు తప్పించుకుంటూ.

"నేనూ రానా?" అనడిగింది చేయిపుచ్చుకుని.

"సరే, రా!" అన్నాడు. చాలా బాధపడి పోతున్నాడని ఆయన ముఖమే చెబుతోంది.

"ఏం ఫర్వాలేదు, విచారపడకండి" అన్నది ప్రేమగా చేయినొక్కుతూ.

గుండె అట్టడుగునించి నిశ్వసించినట్టు నిట్టూర్చాడు ఇవాన్.

"నిజమే ననుకో. కాని గొప్ప తప్పిదం జరిగిపోయింది. క్షమించరాని అపరాధం. అంతకంటే బాధ కలిగించే విషయం యింకొకటుంది. నన్నలా యెలా మోస పుచ్చిందా అని? అంత ధైర్యమా! అంత తెలివి తక్కువగా ఆపరేషన్‌కి సిద్ధం కావడమా!"

జిల్లా కమిటీ నుంచి పిలుపిప్పుడే ఎందుకొచ్చిందో అర్థం కావడంలేదు. బహుశా జిల్లాపార్టీ కార్యదర్శి తాననవలసిన రెండు ముక్కలూ అనేద్దామను కున్నాడేమో. ఏదేమైనా అసలు విషయం తెలియకుండా వూరికే వూహాగానాలు చేయడం అనవసరం అనుకుంటూ ప్రవేశించాడు జిల్లా కమిటీ ఆఫీసులోకి.

హాస్పిటల్ దుర్ఘటనని గురించి జిల్లాపార్టీ కార్యదర్శికి వార్త వచ్చేసింది. ఐనా, చాలా ఆప్యాయంగా ఆహ్వానించాడు సర్జెన్ని.

"నాలు గనడాని కీనాటికి అవకాశం దొరికిందిగదా అని ఆనందిస్తున్నాడేమో" అనుకున్నాడు ఇవాన్.

"మీ వైద్య శిక్షణ తరగతుల్ని గురించి మాట్లాడదామను కున్నాను" అన్నాడు కార్యదర్శి, నెమ్మదిగానే, గౌరవ నీయంగా. ఎప్పుడూ ఉన్నతోద్యోగిలాగా మాట్లాడే మనిషి ఇవ్వాళిలా నెమ్మదిగా మాట్లాడడం వింతగానేవుంది. "మీరూ, లొగునోవూ అనుసరించే పద్ధతేమీ బాగుండలేదు. జిల్లాపార్టీ పద్ధతికి మీపద్ధతి పూర్తిగా వ్యతిరేకంగా వుంది."

"మీ వుద్దేశ మేమిటో అర్థంకావడంలేదు" అన్నాడు ఇవాన్, కార్యదర్శి తీవ్రదృష్టిని తప్పించుకోలేక, "మీరనే దేమిటో విపులంగా చెప్పండి."

"అదే. మీరు రాజకీయ విషయాల్ని గురించిగూడా ఉపన్యాసా లిస్తున్నారుగదూ. పోనీ మీ విద్యార్థులికి మట్టుకే నేమో ననుకుంటే అదీకాదు, మొత్తం జనానికే యిస్తున్నారు. మీ క్లాసు గదులొదిలిపెట్టి, క్లబ్ ఆడిటోరియంలోనే పెడుతున్నారు సభలు. మీరుపన్యసించే విషయాల్ని గురించిగాని,

ఎప్పుడు, ఎక్కడ ఎలా సభలు పెడుతున్నారనిగాని, జిల్లా కమిటీకి తెలియజెప్పకుండానే, జిల్లా కమిటీ అనుమతి తీసుకోకుండానే అన్నీ మీ యిష్టం వొచ్చినట్టు చేసేస్తున్నారు."

"ఈ వుపన్యాసా లిచ్చేందుకు లొగునోవ్‌ని నియమించింది జిల్లా కమిటీయేగదా. అందుచేత...."—అందుచేత అనే మాటని నొక్కి మరీ అన్నాడు ఇవాన్— "అందుచేత ఆయన దేన్నిగురించి వుపన్యసింస్తోందీ జిల్లాకమిటీకి తెలుసుననే అభిప్రాయపడ్డాను నేను. అదీగాక ఆయన ఉపన్యాసాలు బాగా కూడా వుంటున్నై. విద్యార్థులవంటే చెవికోసుకుంటారు. అప్పుడప్పుడూ క్లబ్ ఆడిటోరియమ్‌లోగూడా వుపన్యాసాలు పెడుతూన్నమాట వాస్తవమే. లేకుంటే చాలామంది ప్రజలు తిరిగిపోవలసి వస్తుంది. క్లాసు గదులు చాలా చిన్నవి. వచ్చిన వాళ్లందరూ వాటిల్లో పట్టరు."

"మీరలాంటి పనులు చెయ్యగూడదు" అన్నాడు కార్యదర్శి పల్చటి పెదవులు బిగిస్తూ, "మీరిద్దరూ పార్టీ సభ్యులు; కాగా కార్యదర్శిగా యిరకాటంలో పెడుతున్నారు నన్ను. నేను పార్కులో ఆరుబయట రంగస్థలంలో ఉపన్యాసాలిస్తుంటే, మీరదే విషయాన్నిగురించి క్లబ్బులో వుపన్యాసాలు పెడుతున్నారు."

ఇవాన్ ఇవానోవిచ్ మారు మాటాడలేదు. బదులు చెప్పేందుకు మాత్రం యేముంది? కార్యదర్శలా కంగారు పడుతున్నాడంటే, యెందుకు పడడు; జనం కార్యదర్శి ఉపన్యాసాల కంటే లొగునోవ్ వుపన్యాసాలకే యెక్కువగా హాజరౌతున్నారు. అంచేత. యేమనగలడు తను మాత్రం.

ఇవాన్ యేమీ మాట్లాడక పోయేటప్పటికి, కార్యదర్శి కాస్త కుదటబడ్డాడు. మెత్తబడినట్టుగూడా కన్పించాడు. ఒళ్లొ మీదినుంచొక కాగితం బయటికి తీశాడు.

"మీమీదొక ఫిర్యాదొచ్చింది. సర్జికల్ వార్డులో నర్సుగా పనిచేసిన బెల్లోవా పంపిన ఫిర్యాదు. ఆవిణ్ణి డిస్మిస్ చేసినందుకు అభ్యంతరం తెలుపుతోంది." అన్నాడు.

ఇవాన్ ఇవానోవిచ్‌కి కోపం వచ్చింది; నిటారుగా కూర్చుని "ఆవిడెన్ని ఫిర్యాదులు చేసినా ప్రయోజనం వుండదు!" అన్నాడు.

"జిల్లా కమిటీ కార్యదర్శి మాట్లాడితే వుంటుందిగదా ప్రయోజనం. అర్హులు కానివారిని గురించి నేనూ పట్టుబట్టను. ఒక్క మాటమట్టుకు నిజం, ఆవిడ చాలా యిబ్బందుల్లో వుంది. ఆవిడింటికెళ్లి, ఆ వ్యవహారాలన్నీ స్వయంగా తెలుసుకున్నాను నేను."

"అంత యిబ్బందుల్లో వుంటే, ఉద్యోగం అంటే అంత నిర్లక్ష్యంగా యెందుకుంటుంది?

"పార్టీ సభ్యురాలు గూడాను; పార్టీపని బాగా చేస్తుంది."

"ఆవిడదగ్గర పార్టీ సభ్యత్వం కార్డు లేదే" అన్నాడు సర్జెన్ వెంటనే.

"ఆవిడెక్కిన పడవ మునిగిపోయినప్పుడు సామానుతో బాటూ కాగితాలన్నీ పోయినై."

"మీకు గట్టిగా తెలుసా?

కార్యదర్శి మొఖం కందగడ్డయ్యింది.

"మీకీ అపనమ్మకా లెప్పట్నుంచి ? పరీక్షచేసిన డాక్టర్ మాట నమ్మేముందు రాలేదేఁ యిలాంటి సందేహం."

ఇవాన్ ఉలిక్కిపడ్డాడు. ఈ సమయంలో కార్యదర్శి యిలా మాటాడి గాయపరుస్తాడా ?

"నేనొక తప్పుచేశాను. నా అజాగ్రత్తని నేనే క్షమించుకోలేక పోతున్నాను; అంతేగాని యేవో కుంటిసాకులు చెప్పాలంటే మాత్రం నావల్లకాదు."

"చెప్పిమాత్రం ఏమిలాభం! అది అజాగ్రత్తగా కాదు! ఒక గొప్ప నేరం!"

"నేను కాదనను. కాని ఆ గొంతలా పెట్టి నన్నేదో చేస్తానన్నట్టు మాటాడవలసిన అవసరం యేమీ లేదు. ఆ వుపన్యాసాలు పెట్టి మీపథకాని కడ్డొచ్చామా ? అంటే, ఔను; వచ్చాం. ఆ బాధ్యత తెలియని నర్స్‌ని డిస్మిస్ చేశామా అంటే చేశాం. ఆవిడ తన పనిచేసేది కాదు; అలాంటప్పు డూరుకుంటే యింకొంతమంది తయారౌతా రలాంటివాళ్లు. అలాంటావిణ్ణి డిస్మిస్ చెయ్యడంలో తప్పేమీ లేదు; న్యాయమే. నేను న్యాయమనుకున్నపని చెయ్యడానికి వెనకాడను ఎప్పుడూ."

"అంటే పార్టీనిగూడా ధిక్కరిస్తారన్నమాట మీరు" అన్నాడు కార్యదర్శి, కవ్వించి బెదరిస్తున్నట్టు.

"పార్టీని కాదు ధిక్కరించేది; మీపాటిఁకాలోచనల్ని. మీరొక జిల్లాకమిటీ కార్యదర్శి మాత్రమే; మహాసముద్రంలో ఒక చిన్న నీటిబొట్టుతో సమానం మీరు. ఒక చిన్న నలుసుతో సమానం!"

"నేనా? నేనొక చిన్న నీటిబొట్టునా?! నలుసునా?"

"ఔనంతే. మహా విస్తృతమైన పార్టీతో పోల్చి చూసి నప్పుడంతే మరి."

# 20

"కార్యదర్శేమన్నారు?" అనడిగింది, ఆందోళనపడుతూ బయట కూర్చునున్న ఓల్గా.

ఇవాన్ మొహం అంతా ఎర్రబడింది; కళ్ళు నిప్పులు కక్కుతున్నై; పెదవులు కంపించి పోతున్నై. ఓల్గాకి భయ మేసింది.

"ఏమన్నారు?" అని మళ్ళీ అడిగింది, చకాచకా నడుస్తూన్న అతని చెయ్యి పట్టుకుని, నడక వేగం తగ్గిస్తూ, "తొందరపడి మీరేమీ మాటలు తూలలేదుగదా?"

నడుస్తున్న వాడల్లా నిలబడి "తూలాననుకుంటా" అన్నాడు నిట్టూరుస్తూ. "చాలామాటలన్నాను" అన్నాడు నవ్వుతెప్పించుకుని; "మహాఃబుసలు కొడుతున్నాడతను!"

"అంటే—అంత ప్రమాదమైంది కాదన్నమాట--హాస్పిటల్ విషయం? అంటే—మీరేమీ భయపడ్డంలేదన్నమాట?"

"భయమెందుకు? అంతగా ఐతే ఖైదులో పెట్టేస్తారు!" అని నవ్వాడు; కానీ నవ్వులో పశ్చాత్తాపం గూడావుంది. "ఐనా, అదేమీకాదు. నేను కార్యదర్శితో మాటకి మాటన్నది నేనుచేసింది న్యాయమైనదని కాదు. హాస్పిటల్లో నేనుచేసింది నూటికి నూరుపాళ్లూ తప్పే. కాని, నువ్వుచేసిన తప్పుని అవకాశంగా తీసుకుని, నిన్ను తనగుప్పెట్లో పెట్టుకుని, తనిష్టం వచ్చినట్టు నిన్నాడించాలని చూస్తే—అదిచాలా దుస్సహం. అందుకూ నేనెదురు తిరిగింది."

"అట్లాచెయ్యాలని చూశాడా అతను ?" అనడిగింది ఓల్గా, అదరిపోయి.

"ఉఁ. అదేమరి. ఐనా, నువ్వేమీ విచారపడకు. గాభరా పడకు. నేను మంచిదనుకున్న తర్వాత, నన్నెవరూ తప్పించ లేరు నారుజు మార్గంనించి. ఒక్క తప్పుచేశాను కాబట్టి భయ పడిపోయి, యింకో తప్పుగూడా చేసేస్తాననుకుంటే—అదిచాలా పొరపాటు."

"ఫర్వాలేదు, పలుకున్న మనిషే," అనుకుంది ఓల్గా. అంత విచారంలోనూ ఒక చిరునవ్వు నవ్వుకుంది. పైకి బిగ్గరగా "ఐనా మీరులాంటి ఎడారిలోకి వచ్చేందుకు పడ్డారండీ!" అన్నది.

"ఎందుకా? అవసరం కాబట్టి, మంచిది కాబట్టి. అసలు నావుద్దేశం ప్రకారం ప్రతీ స్పెషలిస్టూ, కొంతకాలం యిలాంటి దూరప్రాంతాల్లో పనిజెయ్యడమే మంచిది. అనుభవం తక్కు వగా వున్నప్పుడే కాదు; బాగా అనుభవం వచ్చింతర్వాత గూడాను. ఇలా రాష్ట్రాల్లో పనిచేస్తే అనుభవం వొకటికి రెం డింతలౌతుంది. ఈ అనుభవాన్ని పెద్దపెద్ద నగరాల్లో తర్వాత ఉపయోగించవచ్చును. శాస్త్రీయ పరిశోధనలకి, న్యాయంగా చెప్పాలంటే, నగరాల్లోనే ఎక్కువ సౌకర్యాలుంటై; ఐనా రాష్ట్రాలకి గూడా న్యాయం జరగాలిగదా. ఇక్కడ కొంత కాలం పనిచేసి, తర్వాత మాస్కోలో చోటుచూపించమని దర ఖాస్తు పంపుతాను."

"తర్వాత?"

"ఉన్నత శాస్త్రీయ పట్టాపొందింతర్వాత, ఏదోవొక పరిశోధనా విభాగంలో పని ప్రారంభిస్తాను."

"అదైపోయింతర్వాత ?"

"తర్వాతింకొకటి. జీవితం ఎప్పటి కప్పుడు పురోగమిస్తూనే వుంటుంది. అంతెందుకు, యింకొక ఐదు సంవత్సరాల్లో యీ ఉకంఛాన్ పట్టణంలోనే ఒక మెడికల్ ఇన్‌స్టిట్యూట్ స్థాపించబడవచ్చును."

"ఐతే, మళ్ళీ యిక్కడికొస్తారన్న మాట పనిజెయ్యడానికి?"

"తప్పకుండాను" అన్నాడు ఇవాన్, నట్లుగూడా కొట్టకుండా; "ఇంకొంతకాలం, యిలాగే, యీవుత్తర ప్రాంతంలో వున్నావంటె నీకే తెలుస్తుంది. నీలో భాగమైపోతుంది యీ ప్రాంతం. మనం యెక్కడున్నా. జీవితం ఆకర్షణీయంగానే వుంటుంది. ఎంత కష్టమో, అంత ఆకర్షణ. డెనిస్‌ని చూశావు గదూ. యిక్కడ గుమ్మడి పాదులేసి పెంచుతున్నాడు. కాయలెప్పుడొస్తాయా అని కాచుక్కూర్చున్నాడు. నువ్వు లక్షచెప్పు; వినడు. ఆఁ. అన్నట్టు, ఇవ్వాళ వాటికి నీళ్ళుపోయడం మనవంతు. తోటపని చెయ్యడమంటె చాలా యిష్టంనాకు. నల్లగా తేమగా, మెత్తగావున్న మట్టి వేళ్ళ సందుల్లోంచి జారుతూంటె, పచ్చని మొక్కలు చిన్నచిన్నవి మొలకలెత్తుతూంటే, ఎంత హాయిగా వుంటుందని! ఎక్కడోగాని చదివాను 'నిశ్శబ్దపు ప్రేలుడుతో సూర్యునివైపుకు సాగే బఠాణీ' అని. 'నిశ్శబ్దపు ప్రేలుడు'! చక్కగా వుందికదూ?" అంటూ, వ్యాఖ్యానం చేస్తూ ఐదేళ్ళూ కలిపి, ఒక్కసారిగా మళ్లీ విడదీసేశాడు ఇవాన్. "ప్రేలుడు! అంటే భూమి ఎడమై దారినిస్తుందన్నమాట. అప్పుడు బఠాణీ మొక్కలు పైకొస్తాయి. 'నిశ్శబ్దపు ప్రేలుడుతో సూర్యునివైపుకు సాగే బఠాణీ!' బావుంది; చాలాబాగుంది!" అంటూ సంతృప్తిగా నవ్వాడు ఇవాన్ ఇవానొవిచ్.

ఆయన వుత్సాహం, తెలియకుండానే, ఓల్గాకిగూడా యెక్కిపోయింది. ఎంత మంచిపనిషి ! చాలా మంచిమనిషి!!" అనుకుంది ఓల్గా. "ఒకవైపున పొరపాటుగా ఆపదలో చిక్కుకున్నావు. ఐనా యేమీ తెలియని పసిపిల్లడిలా వుత్సాహంతో వురకలేస్తుంటివి !"

"ఏమిటీ, పనొదిలిపెట్టి షికారుకి బయల్దేరారు ?" అన్నాడు ప్ర్యాఖిన్, హాస్యానికి.

"పనేముంది ? పనిగంటలై పోయినయ్. ఇది భోజన సమయం" అన్నాడు ఇవాన్.

"సరే; వెళ్లి, సుష్టుగా భోంచెయ్యండి. ఈ పూటికి మాకు భోజనం లేదు. మా శాఖాధికారొస్తున్నా డివ్వాళ; మా మిల్లుకి డైరెక్టర్ గూడా ఆయనే, యువకుడు; ఎంజినీరూ తావ్రోవ్, బోరిస్ ఆంద్రె యెవిచ్."

"భలేవార్త !" అన్నది ఓల్గా హుషారుగా, "నాతో పాటు స్టీమర్ లో వచ్చాడని చెప్పలా మీకు ? గుర్తుందా. ఆయనే అయ్యుంటాడు."

ప్ర్యాఖిన్ వెళ్లిపోయింతర్వాత, మళ్లీ అందుకుంది ఓల్గా, "నన్నెంత విమర్శించాడని ఆ తావ్రోవ్ ! ఐనా నాకేమీ కోపంలేదు. అతనన్నది నిజమే."

"తప్పులొప్పు కున్నావూ అంటే, బాగుపడిపోయావన్న మాటే" అంటూ నవ్వాడు ఇవాన్.

ఆవేళ సాయంత్రం 'గోరోద్కి' ఆట. ఆట బాగుంటుందని అందరికీ తెలుసు. జనం గుంపులు గుంపులుగా వచ్చారు. ఆటస్థలం అంతా క్రిక్కిరిసి పోయింది. డెనిస్ టీము ప్రత్యర్థుల దుమ్ము తేపేస్తోంది. ఇవాన్ గూడా డెనిస్ టీములో

వాడే. కోటు తీసేశాడు, చొక్కా చేతులు వెనక్కి మడిచాడు. మనసంతా ఆటమీదే కేంద్రీకరించాడుతున్నాడు.

తిప్పి, తిప్పి, విసరేశాడు గదని. వెళ్లి సరిగ్గా కర్ర ముక్కల పోగుమీద పడింది. ఆ పోగునే అంటారు 'గొరోద్కి' అని. ముక్కల్లో చాలాభాగం ఎగిరి సరిహద్దులమీద పడ్డై. ఎదిరి టీమువాళ్ల ముఖాలు వాడిపోయినై. ఇవాన్ ఎగిరి గంతేశాడు.

కాని, డెనిస్ విసిరినగద ఆపోగు కివతలే నేలని తాకి, కుప్పమీదుగా గెంతి, అవతల పడింది. దుమ్ముమట్టుకు లేచింది! ఇవాన్‌కి కోపం వొచ్చింది.

"అదేంవాటయ్యా, వెళ్లి యింట్లో పడుకోరాదూ ఆట చేతగాకపోతే" అంటూ కేకలేశాడు.

ఆట పోయిందేఅన్న ఆ బాధా, ఆకోపమూ చూస్తే నవ్వొచ్చింది ఓల్గాకి; అప్పుడే వాలీబాల్ ఆట ముగించుకుని అక్కడి కొచ్చిందావిడ;

అదే సమయానికి ఎలీనాగూడ వచ్చింది, నటాషా నెత్తు కుని. "అబ్బ, మరీ పసిపిల్లలై పోతున్నారు వీళ్లు. వీళ్లకంటే నాబిడ్డలు మెరుగు. ఎందుకూ అలా గొంతులు చించుకుం టారు. నాకీ ఆటచేతనై తేనా, ఇవాన్ ఇవానొవిచ్‌కి బుద్ధొచ్చే టట్టాడేదాన్ని; పేకాటలో ఆయనచేసే మోసానికి బదులు తీర్చుకునేదాన్ని."

"ఈ ఆటలో ఆయనన్నోడించడం మీరనుకున్నంత తేలి కేమీ కాదులే!" అంది ఓల్గా. నటాషా చేతులు పట్టుకుని, బుగ్గలు నొక్కుతూ, "ముద్దొస్తోంది మీ అమ్మాయి. లాగి వొక్కటి చరవాలని పిస్తోంది చూస్తూంటే" అంది.

"ఏమనుకున్నారు మరి ?" అంది ఎలీనా, మొరటుగా, "అప్పుడే ఒక స్నేహితుణ్ణిగూడా చూసుకుంది ! నిజంగానే ! యూరీ అని ఒకబ్బాయున్నాడులే హాస్పిటల్లో. చూశారా, పేరెత్తగానే, ఎలా నిక్కబొడుచుకుని వింటోందో చెవులు ? వీళ్లనాన్న ఆ యబ్బాయితో కలిసి వ్యాయామం చేస్తుంటారు. ఇంటి కొచ్చింతర్వాతగూడా యెప్పుడూ అతన్నిగురించే మాట్లాడుతుంటారు. ఆ యబ్బాయీ అంతే. తొందరగా తేరుకుని బయటపడాలనుకుంటాడు. చెప్పిందానికి రెట్టింపు చేస్తాడు వ్యాయామం. ఇకతన్నిగురించి అదేపనిగా విందేమో, నటాషా వొకటే గోల, వెళ్లతన్ని చూడాలని. చివరకి తీసికెళ్లి పరిచయం చేశాం దీనికి ఆ అబ్బాయికీనీ."

"ఆ అమ్మాయి—అదే, ఇవాన్ ఆపరేషన్ చేశాడే—ఎలా వుంది ?"

"ఆవిడా ?" అంది ఎలీనా, చిరాగ్గా, "బాగానేవుంది. మళ్లీ కుట్టేశారుగా. బిడ్డని కంటుందిలే. ఇవ్వాళగూడా, వచ్చే ముందే వెళ్లి చూసొచ్చా. అనదలచుకున్న మాటలు నాలుగూ అనొద్దామనెళ్లా. తీరా వెళ్లింతర్వాత అనలేకపోయా. బాగుపడనీ; తర్వాతే అందాంలే అనుకు నూరుకున్నా. ఐనా అంత అమాయికంగా వున్నట్లు నటించేవాళ్ల నసలు నమ్మగూడదు."

ఓల్గా యేమీ అనలేదు. తానూ అమాయికమైన దాని లాగా వుంటుందంటారు అందరూ. ఇంతలో, బోరిస్ తావ్రోవ్ వొచ్చేదా మర్నాడేనని గుర్తుకొచ్చింది. "అంతా విచిత్రంగావుంది. ఈ జిల్లాలో యిన్ని గనులున్నయ్యే, ఈ గనికే యెందుకు రావాలాయన? అంతా అనుకోకుండా జరిగి

పోతోంది!" అనుకుంది; అనుకుని యెందుకో కొద్దిగా భయపడింది గూడాను.

"అంత నెత్తిమీద కెందుకు తెచ్చుకుందో అర్థంగాదు;" అంది ఎలీనా మళ్లీ, "అందులోనూ సర్జెన్ ఇవాన్‌ని అట్లా మోసగించడం యెందుకో, నాకూ బోలెడు అనుభవముందా అలాంటి విషయాల్లో; నేనూ కడుపులో బల్లే అనుకున్నాను, నా తెలివి తెల్లార. అంటే వొకటుంది. చాలకాలంనుంచి యెరుగుదుమా ఆవిణ్ణి, అభమూ శుభమూ తెలియందిలే అనుకున్నాం. ఆ ఆలోచనేరాలేదసలు. కడుపొస్తే ఎవరేమంటారు? ఆవిడా మనిషే. కానట్లా అబద్ధం యెందుకాడిందీ అని. అందుకే నాకోపం. అంతే ఎందుకూ, నేనొక కుంటమ్మాయి నెరుగుదును; పుటకతోనే పోయిందొక చెయ్యి. అందులో దిక్కులేనిది. వికలాంగుల షాపులో పనిచేసేది. పెళ్ళిచేసుకోడాని కెవరూ ముందుకు రాలేదు. ఒకనాడు ప్రసూతిశాలకొచ్చింది. నేనే మంత్రసానిని. ఒకాడపిల్ల పుట్టింది — అంతా నాబిడ్డ నటాషాలానే వుంది. పనిమనుషు లందరూ చుట్టూ మూగారు. యీఅమ్మ యీపిల్ల నేంచేసు కుంటుందని గుసగుస లాడారు. కాని ఆపిల్లని రొమ్ముకుహత్తుకుని ఆతల్లిపడినఆనందం చచ్చినా మరచిపోలేను నేను. మాతృ హృదయమంటే యిదీ అనుకున్నాను నేను." అని ఒక్కక్షణం ఆగి మళ్ళీ అందుకుంది ఎలీనా. "ఇంకో ఐదు సంవత్సరాలకి మళ్ళీ బిడ్డని కన్నదను కుంటావిడ; యీసారి మగపిల్లడు. నేనూ ఆగలేక వాళ్ళింటి కెళ్ళా చూసొద్దామని; ఆకుర్రాడికొక ఆటబొమ్మ గూడా కొనుక్కునెళ్ళా. అప్పటికి ఆమొదటి ఆడపిల్ల బాగా పెద్దదైంది. చూడ చక్కగావుంది. ఉయ్యాల్లో తమ్ముణ్ణి పడుకోబెట్టి

వూపుతోంది. గదిలో పెద్దసామానేమీ లేదుగాని పరిశుభ్రంగా వుంది అద్దానికిమల్లే. నాకాశ్చర్యం వేసింది. "ఏమమ్మా, యీ పిల్లల్ని కనాలంటే భయం వెయ్యలానీకు?" అనడిగా తల్లిని. 'ఇదివరకంటే నేనొక కుంటిదాని కింద జమ. ఇప్పుడు వేరు. ఇప్పు డిద్దరు పిల్లల తల్లిని' అన్నది గర్వంగా నావంక చూచి నవ్వుతూ. నేనికేమీ మాట్లాడలేక పోయా. ఇప్పుడావిడా, ఆపిల్లలూ సుఖంగా వున్నారు. ఆవిడచేసింది తప్పని యెవరన గలరు; ఏమంటారు?"

# 21

వైద్య శిక్షణతరగతులు ప్రారంభించాక సంవత్సరంన్నర ఐంది. అంతకు పూర్వం ఇవాన్ ఇవానొవిచ్, ఒజెరోవ్ (స్తారొ బొగతోవ్‌కి పూర్వం జిల్లాపార్టీ కార్యదర్శి) యిద్దరూ కలసి దూరప్రాంతాలకి గూడా వెళ్లారు. ఊరికే రోగులికి మందులిచ్చి నంత మాత్రాన ప్రయోజనం లేదనీ. ఆరోగ్యాన్ని గురించీ, ఆరోగ్య విధుల్ని గురించీ ప్రజలకి తెలియజెప్పడం అవసరమనీ గుర్తించారప్పుడు. ఇవాన్ రోగుల్ని చూస్తూంటే, ఒజెరోవ్ వెళ్ళి సహకార సంస్థల అధ్యక్షుల్నీ, సోవియెట్ల ప్రతినిధుల్నీ, స్థానిక కమ్యూనిస్టుల్నీ కలిసికొని మాట్లాడేవాడు. ఈ వెంక్సు, యకూత్ తెగలనుంచి యువకుల్నేరి, వారికి ఆరోగ్యశాస్త్రంలో తర్ఫీదివ్వడం మంచిదన్న సూచన్ని అందరూ అంగీకరించారు. ఈ సూచనని ప్రాంతీయాధికారులు పూర్తిగా అంగీకరించక ముందే, వార్త నాలుగు మూలలికీ పాకిపోయింది. వివిధ

ప్రాంతాల్నుంచీ, కామెనెన్స్కలోవున్న హాస్పిటల్ దగ్గరికి యువకులు రావడం మొదలెట్టారు ఉత్సాహంగా.

వచ్చీ రావడంతోనే దరఖాస్తుదారు లందరూ సర్జెన్ ఇవాన్‌ని కలుసుకునేవారు. తర్వాతాయన సూచన ప్రకారం జిల్లా కార్యదర్శినీ వాళ్ళనీ కలుసుకునేవారు. వచ్చేప్పుడు యకూత్లు పెరుగు, బార్లీ రొట్టెలూ, మంచుదుప్పి మాంసమూ పట్టుకొచ్చేవారు బహుమానంగా; ఈవెంక్స్ తెగ వాళ్లేమో ఎండుచేపలూ అవీ పట్టుకొచ్చేవారు. వాళ్ళందరికీ తనింట్లోనే బసలేర్పరచేవాడు ఇవాన్. తీరిక వున్నప్పుడల్లా, వాళ్ళతో మాట్లాడుతూ, ప్రశ్నలేస్తూ, పరిశీలిస్తూ, శిక్షణ తరగతులకు తగిన వాళ్ల నెన్నుకుంటూ వుండేవాడు. కావలసింది ముప్ఫై మందైతే, యాభై మందికి పైనే వచ్చారు. వచ్చిన వాళ్ళల్లా యేదోవొక బహుమానం తెచ్చారు. ఆ బహుమానాలివ్వక పోతే యెన్నిక కామేమోనని భయపడినట్టు. తీరా ఆబహు మానాలు స్వీకరించక పోయేప్పటికి కోపంగూడా వచ్చింది కొద్దిమందికి. వైద్యశిక్షణకి పనికిరాని వాళ్ళందరికీ గనుల్లో పనులు చూపించాడు ఒజెరోవ్. కొంతకాలం అయ్యేప్పటి కందరూ ఎవరిపనులువారు సంతృప్తిగా చేసుకోవడం ప్రారం భించారు. ఎన్నికైన విద్యార్థినుల్లో వార్యాగూడా వుంది.

ఒజెరోవ్ సంగతొచ్చినప్పుడల్లా "చాలా మంచివాడు. ఎవరితో యెలా ప్రవర్తించాలో బాగా తెలుసాయనకి. ఎప్పు డైనా కోపం వచ్చినా ఈస్కొరొబొగతొవ్ లాగా మట్టుకు చేసేవాడు కాదు. వీళ్ళిద్దరికీ పోలికేలేదు. జనాన్నూరికే బెది

"అదేమిటట్లా అంటారు ?" అంది వార్యా చిరుకోపంతో, "మీకు తెలుసుకాబట్టి మీ కట్లాగే అనిపిస్తుంది. ఆ స్త్రీలలా పాడడంలో అర్థంవుంది. వాళ్ళెంత ఆనందించారో మీకెలా తెలుస్తుంది. చుట్టుప్రక్కల గ్రామాల వాళ్ళందరూ వెళ్లి చూస్తారు ఆ యిద్దర్నీ. వాళ్ళ కన్నులు బాగైనయ్యాని తెలుసుకుంటారు. వాళ్ళు పాడేపాట వింటారు. ఇళ్ళకెళ్లింతర్వాత గుర్తున్నట్టుగా మార్పులూ కూర్పులూ చేసి వాళ్లు పాడుకుంటారాపాట; పాడుకుని ఆనందిస్తారు. కామూ ?"

"ఎందుకూ?" అన్నాడుఇవాన్. వెంటనే వార్యాముహం చూచి, తానలా అనడం తప్పని తెలుసు కుని, "నిజమే, వాళ్ళలా పాట కట్టడం చాలా మంచిది. ఆపాట పాడుకోవడమూ మంచిదే !" అన్నాడు.

# 22

"పదిహేను సంవత్సరాల క్రితంవరకూ గూడా, అసాధ్యమనుకున్న అనేక జబ్బుల్ని యిప్పుడు నయంచేయగల అవకాశాలు యేర్పడుతున్నై ఈనాడీశస్త్రచికిత్స వచ్చినందువల్ల" అన్నాడు ఇవాన్, యింట్లో అటూయిటూ పచారుచేస్తూ, ఆగి, ఓల్గావంక చూస్తూ. ఆయన మనసే యిక్కడున్నట్టులేదు; లేకుంటే ఓల్గా యేమంత కుతూహలంగా వినడంలేదని తెలుసుకోగలిగేవాడే. "అదీగాక ఉపరిభాగ నాడుల్నీ, కేంద్ర నాడుల్నీ గూడా ఆపరేషన్ చేసే విధానాలు వచ్చేసినై కాబట్టి ఇక మన శరీరాంతర్గతాంగాలకి సంబంధించిన శాకానాడుల్ని గురించి గూడా తెలుసుకునే అవకాశాలేర్పడినై" అన్నాడు ఉత్సాహంగా. ఈ మధ్యనే విజయవంతంగా తానుచేసిన ఒక

ఆపరేషన్ సంగతి గుర్తుకొచ్చి, చిరునవ్వు నవ్వాడు. "ఎన్ని కొత్త విషయాలని! ఎన్నెన్ని కొత్త విషయాలు కనిపెడుతున్నామో ఆలోచించుకుంటూంటే ఆశ్చర్యం వేస్తూంది. ఉదాహరణకి గాంగ్రీన్ (కుళ్లుకురుపు వ్యాధి) నే తీసుకుందాం. అంత ప్రమాదమైన జబ్బింటూ లేదు; కార్చిచ్చులాంటిది. కాలి బొటన వ్రేళ్ళ రంగుమారిన మరుక్షణమే తొడలదాకా తెగ గొయ్యాలిసొస్తుంది. ఇలాంటి సందర్భాల్లో పనికి వస్తుందీ నాడీ శస్త్రవైద్యం. నేనేం జేస్తానంటే, వెంటనే, వెన్నెముక ప్రక్క నేవుండే సానుభూతి నాడిలోంచొక ముక్క తీసేస్తా; దాంతో పాటు రెండనవసర నాడీకేంద్రాల్ని తొలగించేస్తా. ఆపరేషన్ టేబుల్ మీదనుంచి రోగినింకా కదలించకముందే, తిరిగతని కాలు సజీవంకా ప్రారంభమౌతుంది కొన్ని కేసుల్లో. మర్నాటికే రోగి కాలు రంగు యథాతథాని కొచ్చేస్తుంది; నీలిరంగుపోతుంది. మాడిపోయిన కురుపుమీద పొట్టురాలిపోయినట్టు పోతుంది జబ్బు. ఇలాగే ఈ ఆపరేషన్నవల్ల అనేక దీర్ఘవ్యాధుల్ని నయంజెయ్యవచ్చు. చెయ్యవలసిందీ నేర్చుకోవలసిందీ యింకా చాలావుంటే వుండొచ్చును గాక. ఐనా యీనాడీ శస్త్రవైద్యాన్ని గురించి ఆలోచించినప్పుడల్లా అయ్యో, యీవైద్య విధానాన్ని గురించి నేను పరిశ్రమించిందీ స్వల్పమే, నేను కనిపెట్టిందీ కొద్దేఅని బాధకలుగుతుంది. ఇలాంటప్పుడు నాకు మాస్కోలో లెబొరెటరీ (ప్రయోగశాల) లూ, సర్వసాధనాలూ గుర్తుకొస్తై."

"ఇక్కడ మాత్రం మీరుతక్కువేంజేస్తున్నారు?" అనడిగింది ఓల్గా, "యిది చాలదూ?"

"తక్కువేమీ చెయ్యడంలేదు. నిజవేఁ, కాని యిదంతా సాధారణమైన శస్త్రచికిత్సేగా. ఐనా యిందులోగూడా ఒక సుగుణం వుంది. ఏం జరిగినా నీకళ్ళముందే జరిగినట్టుంటుంది. కాని యింతకంటే యెక్కువ తెలివితేటలుపయోగించి, యింకా విషమమైనా జబ్బులకి చికిత్స చెయ్యాలని అనిపిస్తోంది నాకు; నిజం చెప్పాలంటే, పొయ్యిమీద కూర్చున్నట్టుందనుకో." ఈ ధోరణిలో మాట్లాడుతూనే ఓల్గా వంకచూశాడు ఇవాన్. ఆవిడేంకేదో ఆలోచిస్తున్నట్టుగా వుంది తలపైకెత్తి. "ఏమిటీ, ఓల్గా! అంత తీవ్రంగా ఆలోచిస్తున్నావ్?"

"నలభై యేళ్ళు దాటిన వయస్సువాళ్ళమేధస్సిక పెరగదని చెప్పింది ఒకావిడ; చాలా 'ఆధునికం' ఐనమనిషే....అదే ఆలోచిస్తున్నా."

"సరేలే, ఆవిడ సిద్ధాంతాలుగూడా, మన పావా సిద్ధాంతాల్లాగానే అయ్యుంటాయిలే 'ఆధునికం'!"

"బహుశా ఆ వయసువరకూ ఏమీ పనిసాధించలేని వాళ్ళని గురించేమో ఆవిడ చెప్పింది. ఐనా మిమ్మల్ని చూస్తున్నకొద్దీ, ఇరవయ్యోనిమిదేళ్లున్న నాకంటే, ముప్ఫయ్యారేళ్లున్న మీరే యెక్కువ వుత్సాహంగా వున్నారే కొత్తవిషయాల్ని కనుక్కునేందుకు, అని ఆశ్చర్యం వేస్తోంది."

"దానిక్కారణం యేమీలేదు. తుప్పు పట్టేందుకేమీ అవకాశం యివ్వను నేను నా మెదడుకి. ఎప్పుడూ యేదో ఒక పనిచేస్తూండాలి. పనిచేస్తే కొంతశక్తి ఖర్చయ్యేమాట నిజమే కాని, ఆ అనుభవం వల్ల శక్తికి మించిన జ్ఞానం కలుగుతుంది. నేనుబాగా పనిలో మునిగున్నప్పుడు, నా సర్వశక్తులూ పని చేస్తాయి; అంటే నిజంగా, సంపూర్ణంగా జీవిస్తున్నానన్నమాట.

నా కాపనిలేకపోతే, నేనిక చచ్చినవాడితోనే సమానం; నా జీవితంలో సగం భాగం కోసేసినట్టే. యికప్పుడు నేనుమానవ్పుడిగా మనలేను. ఐనా అదంతా అనవసరం యిప్పుడు. ఇప్పుడు ద్విగుణీకృతానందంలో వున్నాను. రెండుచేతులనిండా పనీ, సువ్వూ వుండగా నాకేంలోటు!"

"అందుకు నాకూ సంతోషంగానేవుంది. సరేగాని, నా సంగతేమిటి మరి? నాకేంవుంది భవిష్యత్తులో."

పక్కనేవున్న పుస్తకాల పొత్తివంకచూస్తూ, "యేదీ, చదువు పూర్తి కాలేదుగదా!" అన్నాడు అభ్యంతరం చెబుతూ ఇవాన్.

"చదువింకా పూర్తికాలేదు మరి!" అంది ఓల్గా దీనంగా నవ్వుకుంటూ, "ఇది నాలుగోసారి నేను చదవడం ప్రారంభించి. ఇన్‌స్టిట్యూట్‌లో మూడేళ్లు చదివి మానేశాను. మళ్ళీ మొదలు. ఎక్కడున్నావు గొంగళీ అంటే వేసినచోటే అన్నట్లు. మీరేమన్నా అనండి, నేనుచేస్తూన్నది మంచిదని నాకే అనిపించడం లేదు."

"అంటే యింకో కొత్త విషయం మీదికి మళ్లిందనా నీ బుద్ధి?" అనడిగాడు ఇవాన్ నవ్వుతూ.

ఆప్రశ్నడిగిన తీరుచూస్తే చుర్రుమంది ఓల్గాకి. "ఏమిటీ, మరీ పసిపిల్లతో మాట్లాడినట్టు మాట్లాడతారు నాతో? మనం మాట్లాడుకునేది ఏ ఆట వస్తువుని గురించో కాదు గదా! జీవిత సమస్యని గురించి. ఉదాహరణకి, మీరంటే మీకనువైన విషయాన్ని మీ జీవిత ధ్యేయంగా గ్రహించగలిగారు; అదృష్టవంతులు. మీ యంత తెలివితేటలూ, గ్రహింపూ లేకపోయినా నేను గూడా నావల్లనైనంత మట్టుకు నాకు తగిన పనేదో,

చిన్నదైనా, చేపట్టాలిగదా; అట్లా నాకు తగిన ఆనందాన్ని నేనూ పొందగలగాలి గదా."

"ఔను. ఎవరు కాదన్నారు?" అన్నాడు ఇవాన్ సీరియెస్‌గా.

"ఎవరు కాదన్నారు? ఎవరూ కాదనలేదు. కాని, నాకు సాయంజేసిన వాళ్లు మాత్రం యెవరున్నారు? వైద్య కళాశాలలో ఒకేడు యెందుకు వృథాచేసినట్లు నేను? తర్వాత ఎకౌంటెన్సీ యెందుకు తీసుకున్నట్లు? ఊరికే యేది కాలికి తగిలితే అది పుచ్చుకున్నట్లయ్యింది నాపని. నిజమే, ఎవరైనా యేపనైనా చెయ్యొచ్చు. కాని కుతూహలమూ, ఆసక్తి లేక పోయిం తర్వాత నేర్చుకునేం ప్రయోజనం?" ఇంతలోనే తావ్‌రోవ్ అన్న మాటలు చిలకలాపలుకుతున్నానని అనిపించింది. ఓల్గాకి; ఐనా ఆగలేదు. "మన్ని మనం మోసగించుకుని లాభంలేదు; జీవిత మంతటికీ సంబంధించిన సమస్య ఇది."

"అంటే, యింతకీ నాదన్నమాట తప్పు. నీకు తగిన పనిని నీకు తెలియజెప్పి సాయం చెయ్యలేదన్నమాట నేను; అంతేగా?" అనడిగాడు ఇవాన్, ఆవిడ సూటి మాటల పోటుతో బాధపడుతూ.

"అంతే. అదిగాదండీ, మీరూ మీపనిలోమునిగున్నారని నాకూ తెలుసు. అందుకనే మీరు అమ్మాయి పుట్టిం తర్వాత నేను చదువు మానేస్తుంటే పట్టనట్టూరుకున్నారు. ఐనా, 'నువ్వా వైద్య కళాశాలలోనే చదువు' అని మీరెందుకని బలవంతం చెయ్యలేదు?"

"చదవాలని లేదు గదా నీకు."

"నిజమే కాని అప్పుడు నావయస్సు మాత్రమెంత? ఇరవై. జీవితం యింకా చాలా వుందిముందు. ఇప్పటికైనా మించిపోయింది లేదు, యేది కావాలంటే అది యిప్పుడు ప్రారంభించినా ముంచుకుపోయేది లేదులే అనుకున్నా అప్పుడు. మీరు నాకంటే పెద్దవారు; ఎక్కువ అనుభవం వున్నవారు. ఐనా స్నేహితుడిలా నాతో మాట్లాడేందుకుగాని, సలహా యిచ్చేందుకుగాని, వివరించేందుకుగాని మీకు తీరికా లేక పోయింది; ధ్యాసా లేక పోయింది. అదే మీచెల్లెలైతే మీరు జోక్యం కలిగించుకునేవారా, కాదా? హాస్పిటల్లో పనిలో ఎవరైనా వెనక బడితే వాళ్ళకి సాయంజెయ్యరూ మీరు? ఇంటిదగ్గర వాళ్ళకి సాయంజేసే వాళ్ళెవరుంటారు?"

# 23

వ్రాస్తూన్నదాపేసి పెన్సిలవతల పెట్టింది ఓల్గా: ఇంగ్లీషు వ్యాసంలో తనకు తెలియని పదాలపట్టిక వ్రాసుకుంటూన్న పుస్తకం మూసేసింది. అనువాదం సాగుతూనేవుంది. కాని, యింతవరకూ పనెలా సాగుతోందని అడిగిన పాపాన పోలేదు ఇవాన్.

"ఎట్లాగోట్లా నా సోమరితనాన్ని పోగొట్టాలనే వుద్దేశంతోనే నన్నీ అనువాదం చెయ్యమని చెప్పినా, కనీసం, అడపాదడపా ఐనా, అడగొచ్చునుగదా యెంతవరకొచ్చిందని; ఉవిధంగానైనా అనువాదమంటే నాకుండే ఆసక్తిని పెంపొందింప జెయ్యొచ్చునుకదా" అనుకుంది ఓల్గా, "నిజానికి వ్యాసం అనువాదం చెయ్యకపోయినా ఆయనపనికేమీ అంతరాయం

కలగదు. ఈ వ్యాసకర్తగూడా యెంతసేపూ సొంతశాకా వూదుకోవడమే తప్ప, కొత్త విషయా లేమంత చెబుతున్నట్టూ కన్పించదు. వైద్యశాస్త్రాన్ని గురించి నాకు మరీ యింత స్వల్పంగా తెలియడమూ బాధాకరంగానేవుంది. ఐనా యిం దులో యేదో పొరపాటున్నట్టు నాకే తోస్తోంది. ఏమయ్యుం టుందది?" క్రింది పెదవి నొక్కుకుంటూ, అదే విషయంమీద ధ్యానం కేంద్రీకరించాలని చూచింది; కాని యెందుకనో, ప్లాటన్ లొగునోవ్ బొమ్మ కన్పిస్తోంది కళ్ళముందు. ఆగోధుమ వర్ణం మొహమూ, ఆ పొడుగాటి చేతులూ, విషయాన్ని వివరిస్తూ ఆయనచేతులు కదిపే విధమూ–అదేగుర్తు కొస్తోంది. ఈమధ్య ఆయన పెట్టిన ప్రతి రాజకీయ చర్చకీ హాజరౌతూనే వుంది ఓల్గా.

పగటికలలోనుంచి బైటపడుతున్నట్టు "ఐనా, యిప్పుడు నాకు లొగునోవ్‌ని గురించెందుకు రావాలి ఆలోచనలు ?" అని బిగ్గరగానే అంది. ఆయన రూపాన్ని తలుచుకున్న కొద్దీ విద్యార్థిదశలో తన కార్యక్రమమూ తర్వాత తన వొడుదుడుకు చదువూ గుర్తు కొచ్చినై. "కాని ఒకానొకప్పుడు నేనూ బాగా చదివాను; మంచి శక్తిసామర్థ్యాలున్న విద్యార్థినినేనని పేరుగూడా సంపాదించుకున్నాను."

ఒకసారి క్లాసులో లెక్కలు చేసుకుంటూంటే, లెక్కల మాష్టారొచ్చి, ఓల్గా ఫాలాన్ని తాకుతూ, "ఈ ఎరిస్టాటిల్ బుర్రలో యేమున్నదో ?'' అనంది. "ఏమీలేదు !" అంది ఓల్గా నవ్వుతూ, ఆ పొగడ్త కేమని బదులు చెప్పాలో తెలియక తిక మక పడి.

"ఏమీలేదు !" అనుకుంది ఓల్గా యిప్పుడుకూడా, "ఐనా యీ ఇంగ్లీషు శాస్త్రవేత్త చెప్పేది నిజం కాదని అనిపిస్తోంది నాకు. మానవుడి మెదడు వొత్తినరాల పుట్టలికి కేంద్రమైనట్టూ, వాటితోనే శారీరక విధులన్నీ కడతేరుతున్నట్టూ చెబుతున్నాడు; అంతే తప్ప యీ మెదడు కాలోచనాశక్తి వుందని గాని, ఇది చాలా విచిత్రమైన మేళవింపనిగాని అతనికి తోచినట్టే కన్పించదు. సోవియెట్ శాస్త్రజ్ఞు లతనిలాగే ఆలోచించరే." ఇదే విషయాన్ని గురించి ఇవాన్ అన్నమాటలు గూడా గుర్తుకొచ్చినై. "ఈ వ్యాసాన్ని మూలని పారేస్తే ఆయనకొచ్చే నష్టమేమీ లేదు; కాని నన్నుగూడా మూలనే పారేస్తే ఎట్లా ! అప్పుడూ, పిల్ల పెరగ్గానే వెళ్లి వైద్య కళాశాలలో చేరమనీ యిలాగే చెప్పాడు, యిందులో పెద్ద ఆలోచించ వలసిందేముందిలే అన్నట్టు. అప్పుడా పట్టణంలో యింకొక ఇన్‌స్టిట్యూటూ లేదు. వైద్యవిద్యని నేర్చుకోడానికి అర్హురాలనౌనా కాదా అని మా యిద్దరిలో యెవరమూ ఆలోచించనుగూడా ఆలోచించలేదు."

ఓల్గా ఆలోచనల్లో మునిగితేలింది.

తానుకూడా ఒక వృత్తి నెందుకు నేర్చుకోలేదు ? తన కిష్టమైన పనెందుకని ప్రారంభించలేదు ?

గతంలో అంటే వేరు. తరతరాలనుంచీ వచ్చిన సాంప్రదాయాల ఫలితంగా, స్వతంత్రంగా జీవితాన్నెదుర్కోవాలంటే స్త్రీలలో ఒక విధమైన భయమూ బెదురూ వుండేది; సంకుచిత కుటుంబవలయంలో గానుగెద్దుల్లా బానిసలుగా వుండేవారు. కానిప్పుడు లక్షలకొద్దీ సోవియెట్ స్త్రీలా సాంప్రదాయాన్ని ఛేదించుకుని బయటపడ్డారే, తానెందుకలా చేయలేక పోయింది;

వాళ్ళందరికంటే తానింత వెనకబడి వుండటానికి కారణం యేమిటి ?

పిల్లలతల్లి కాగానే ఆ ఇన్‌స్టిట్యూట్ వదిలేసింది; అదీ తాను చేసిన మొట్టమొదటి పొరపాటు.

తన జీవితాన్నొక విశాల ప్రాతిపదికమీద ప్రారంభించింది. కాని తన బిడ్డంటే వున్న ప్రేమతో, ఆ బిడ్డే స్వర్గమనుకున్నది. తన భర్తా తన స్నేహితులు కలిసి నివశిస్తూన్న బహి ప్రపంచాన్నంతా పూర్తిగా మరచిపోయింది; మిగతా దేశమంతా కలిసి కట్టుగా జీవిస్తూన్న జీవితానికి, కావాలని తాను దూరమైంది. కాని ఇవాన్ యెందు కూరుకున్నాడు అప్పుడు? అంత తెలివితేటలున్నవాడు గదా, తన్నెందుకు హెచ్చరించ లేదు. మిగతా సోవియెట్ మహిళలలాగానే తానుగూడా విశాల సమిష్టి జీవితంలో పాల్గొనందుకు విచారించేరోజు తప్పక వస్తుందనే భావం ఆయన కెందుకు కలగలేదు ? తన వ్యక్తిగత స్వార్థంలో పడిపోతే పశ్చాత్తాపపడి వూపిరాడని పరిస్థితేర్పడుతుందనే విషయం ఆయనకు తోచివుండాల్సిందేగదా ?

ఓల్గా సిగ్గుపడింది. బయట్నుంచి ఎవరో వచ్చి ముందుకు తొయ్యలేదని ఎందుకనుకోవాలి తను ? తమ సమస్యల్ని తాము పరిష్కరించుకున్న స్త్రీ లెంతమంది లేరు గనుక ?

కాని, తన ప్రస్తుత పరిస్థితికి బాధ్యతంతా తనదే ననుకోవడంగూడా కష్టమే ననిపించింది ఓల్గాకి. ఇంకో సాకు వెదుక్కుంది.

“ఐతే, యింకా యీ కుటుంబజీవితం వుండి లాభమేముంది ? నేను పొరపాటే చేశాననుకుందాం; దారితప్పి వెనక

జడిపోయానే అనుకుందాం. ఇది గమనించి, నాకు తెలియ జెప్పి, సలహా యివ్వవలసిన వారిలో ప్రప్రథము లెవరు ?"

టేబుల్ మీదనుంచి పుస్తకాలు తీసి, ఇవాన్ టైప్ రైటర్ యథాస్థానంలో వుంచింది. ఆయన కాగితాలన్నీ తీసి సరిగా సర్దింది.

"తన కన్సిస్టెంటుగా వుండాలని ఆయననుకోవడమూ సరేనేమో" అనుకున్నది మళ్లీ బిగ్గరగా, "అదీ బాగానే వుం డేది, నా ఆసక్తీ, కుతూహలమూగూడా అదే అయ్యుంటే."

ఆవిడ బిడ్డ బ్రదికున్నంత కాలమూ, భర్త నింత తీవ్రంగా యెప్పుడూ విమర్శించలేదు. బిడ్డ బ్రదికున్నంత కాలమూ తన జీవిత సర్వస్వం అంతా ఆ బిడ్డే ననుకుంది. బిడ్డ పడిన జబ్బూ, అంతిమ దినమూ జ్ఞప్తి కొచ్చినై. ఎన్ని రాత్రులు, ఎన్ని పవళ్లు గడిపింది కంటిమీద కునుకులేకుండా, బాధపడుతూ !

ఇంట్లోనుంచి బయటపడింది ఓల్గా. లోయలో గాలి హాయిగా వీస్తోంది. సూర్యాస్తమయం కాబోతోందేమో, యెటు చూచినా గులాబిరంగు వెలుగు ముంచెత్తుతోంది; దూరాన కొండల హద్దులు మసకబారుతునై.

ఎలీనా యింటికి పరుగెత్తుకెళ్లింది ఓల్గా. అక్కడా గది నిండానూ అదే గులాబిరంగు వెలుగు. కిటికీల్లో మొక్కలన్నీ తీసి తోటలో నాటారు; కిటికీలన్నీ బార్లా తెరచునై. ఎలీనా గూడా అప్పుడే వచ్చినట్టుంది; బాతుల యీకలు తీస్తోంది. ఆవిడ వళ్లంతా బాతు యీకల మయంగా వుంది.

"నాక్కబురు చెయ్యలేదేమండీ ?" అంది ఓల్గా, నిష్ఠూరంగా.

తనుగూడా వొంకెమీదనుంచొక గుడ్డ తీసుకుని, నడుంకి కట్టుకుని, ఒక పెద్ద బాతుని ముందుకు లాక్కుని యీకలు పీకడం ప్రారంభించింది.

"మంచి బాతులు, కాదూ ?" అన్నాడు ఇవాన్ గదిలో కడుగుపెడుతూ; డెనిస్‌గూడా వచ్చాడాయన వెనకాలే. ఇద్దరూ కలిసి, చీకటితోనే వెళ్లారు బయటికి బాతుల వేటకని.

"మంచి బాతులు. పెంపుడు బాతుల్లాగా బాగా బరువుగా వున్నై." అంది ఎలీనా, ఒక బాతుని లేపిపట్టుకుని బరువు చూస్తూ.

"ఇదిగో యిదొక బాతు పిల్ల" అన్నది ఓల్గా.

"అది అడవి బాతు" అని చెప్పాడు ఇవాన్. గదిలో పేకముక్కలు దాచినచోటు కెళ్తూ "నేనెవరిని ? ఎలీనా !" అనడిగాడు.

"దేవతలు !" అన్నది ఎలీనా, వేపుడు వళ్లెంతీస్తూ.

"అదికాదు; ఈ పేకముక్కలు చూచి చెప్పు."

"కళావరు రాజు."

"కళావరే ! యింకేముంది ? అందులోను రాజు ! ఐతే మీకేం కావాలో కోరుకోండి యీ రాజుగార్ని."

"నాకేమీ అవసరం లేదులెండి యిప్పుడు" అన్నది ఎలీనా, "ఒక బేసిన్‌డు నీళ్లు తెచ్చిపెడితే అదే పదివేలు !"

# 24

ఓల్గా వచ్చిన మొట్టమొదటి రోజున వెళ్లినట్టుగానే ఓల్గా, ఇవాన్ లిద్దరూ కలిసి బావిదగ్గర కెళ్లారు.

నూతిచుట్టూ కట్టిన కర్రల్నానుకుని నూతిమీదికి వంగింది ఓల్గా. కురులు భుజంమీదుగా ఆవిడ ముహంమీద పడి గాలికి రెపరెపలాడుతున్నై. నీళ్లు ముంచి పైకి లాగింది. వంగుని వున్నదల్లా ఒక్కసారి లేచి నిలబడింది. ఆ అదుటికి బకెట్ చెయ్యిజారి పోయింది. దభాలున నూతిలో పడిపోయింది. నీళ్లుచింది ఆవిడమీదగూడా పడినై.

ఆ శబ్దం విని వెనక్కి తిరిగాడు ఇవాన్. "ఏమిటది ఓల్గా?" అనడిగాడు.

"ఏమిలేదు. బొక్కెన జారిపడింది" అంది ఓల్గా నవ్వుతూ, చిందపడిన నీళ్లు తుడుచుకుంటూ.

నూతొడ్డున కూర్చుని, కొక్కెంతో బకెట్టుకోసం వెదుకుతోంది. ఎర్రటి ఆకాశం, ఆ ఆకాశాన్ని కప్పే చెట్లకొమ్మలూ నీడలు చూచుకుంటున్నై నూతిలో; నూతిగట్టు ప్రక్కన మాత్రం, ఒక తెల్లని గౌనూ, చక్కని జుత్తూ, నగ్నహస్తమూ వణకిపోతూ ప్రతిఫలిస్తున్నై.

"చిన్నప్పుడొకసారిలాగే చేపలు పట్టా ఒక చిన్న గుంటలో" అన్నది ఓల్గా మధుర స్మృతులు నెమరువేసుకుంటూ. "ఇవ్వాళ్టిలాగానే ఆవాళా నునువెచ్చగావుంది. కాళ్లకి చెప్పులేసుకోకుండానే బయటికి పరుగెత్తా; చినుకులు పడుతున్నై. ఆ గుంటల్లో గెంతుకుంటూ, నీళ్లు చిందించుకుంటూ వెళ్తూంటే యెంత హుషారుగా వుందని! ఇంటి కొచ్చిం

తర్వాత పిర్రలు బద్దలగొట్టారు; అదే మొదలు నేను దెబ్బలు తిన డం. గుక్కపట్టి యేడ్చేశా. నొప్పెత్తిగాదు; ఆటంతా పాడై పోయిందే అని. చిన్నతనం కాదూ?"

సాయంకాలపు చప్పుడులు వింటూ, అలాగే నిశ్శబ్దంగా వుండిపోయింది ఓల్గా.

"ఆరోగ్యమూ, వయసూ, ప్రేమా వుంటే యింకా అంతకంటే ఆన దమంటూ యేముంటుంది!" అనుకుంది.

"బొక్కెన దొరికిందా?" అనడిగాడు ఇవాన్, "నేనొచ్చి సాయం చెయ్యనా?"

"వద్దులెండి, నేనే తీస్తాను" అంది ఓల్గా. అన్నదేకాని కూర్చున్నది కూర్చున్నట్టే వుంది. చెయ్యి కదల్పలేదు. త న ఆలోచనల్లో తానుంది.

"మీరంటే యెంత ప్రేమనుకున్నారు నాకు" అన్నది వున్నట్టుండి, భర్త వైపుకు కనులు తిప్పి, "మన కింకొక బిడ్డ కలిగితే—అరడజను మందైనాసరే, నాకేమీ అభ్యంతరం లేదు!– అంతకంటే మించిన ఆనందం వుండదు మనకి; పరి పూర్ణానందం!"

ఆవిడ హృదయం పిలుపు విన్నట్లైంది ఇవాన్‌కి. వెళ్లి ఆవిడ ప్రక్కనే కూర్చున్నాడు. ఆవిడ ముహంలో అదో అపూర్వ తేజం, యింతవరకు తానెప్పుడూ కనియెరగనిది, భాసిస్తోంది.

"ఈ ప్రపంచం అంతా గాలించినా, నీలాంటివాళ్లు దొరకరు నాకు" అన్నాడు.

"ఎట్లా దొరుకుతారు మరి!" అన్నది ఓల్గా, పరిహాసంగా. ఇంతలో పొదల మాటునుంచి ఎవరో వస్తున్నట్లనిపించింది; ఎడంగా జరిగి కూర్చుంది.

ఈ సారి కొక్కెం యిలా అనగానే బొక్కెన తగిలింది. ఓల్గా లేచి నిలబడింది బొక్కెన పైకి లాగేందుకు.

"మనం తెలివిగలవాళ్లం; కదూ?" అంటూ వేళాకోళం ఆడుతూ ఇవాన్‌కూడా లేచి నిలబడ్డాడు బొక్కెన పైకి లాగేందుకు సాయంచేస్తూ.

వెనక్కి తిరగ్గానే, వీళ్లని చూచాక మనిషి నడక వేగం తగ్గించాడు.

"హెల్లో," అన్నది ఓల్గా, "ఈయనే బోరిస్ తావ్‌రోవ్."

"ఓహో, మీరేనా, చాలా సంతోషం; మిమ్మల్ని గురించి చాలా విన్నాను" అన్నాడు ఇవాన్.

"నిజంగానేనా?" అన్నాడు తావ్‌రోవ్; ఓల్గావంక చూచీ చూడనట్టున్నాడు. "చాలా అందంగా వుందీ ప్రాంతం" అంటూ చేయి చాచాడు కరస్పర్శకోసం, "నేను మిమ్మల్ని గురించి చాలా విన్నాను యీ పక్క జిల్లాలో పనిచేసేప్పుడు. సరే, మీ భార్య దారిలో కలిసినప్పుడింకా యెక్కువే చెప్పారు." అని ఓల్గావైపుకు తిరిగాడు. కాని తన ప్రవర్తనలో యేదో దూరం దూరంగా వుంటున్న భావం కన్పించింది.

చాలా సద్భావంగా చూశాడతనివంక ఇవాన్.

"ఇవ్వాళ మేం బాతుకూర చేసుకుంటున్నాం. వెదికితే కోగ్నాక్ సారాగూడా దొరుకుతుంది. మీరుగూడా రండి, బాగుంటుంది!" అన్నాడు.

# 25

ఇకనుంచి ప్రతిరోజూ యింట్లోపని తానే చెయ్యాలని నిశ్చయించుకుంది ఓల్గా.

"ఇక వంటగూడా నేనే చేస్తాను" అని చెప్పింది భర్తతో, "యింకా ఎలీనామీదే ఆధారపడడం యేంబావుంటుంది; ఇంటా బయటాగూడా బండెడు పనాయె ఆవిడకి. ఐనా, వంట చెయ్యడం యేమంత కష్టంకాదు; నేనూ చెయ్యగలను."

"మనం భోజనాలు రెస్టోరెంట్‌లో చేస్తేనే మెరుగేమో" అన్నాడు ఇవాన్.

ఓల్గా వొప్పుకోలేదు.

మర్నాడు ప్రొద్దున్నే పావా వచ్చింది. పావా వచ్చేటప్పటికి పనిచేసుకుంటోంది ఓల్గా. వంటిల్లంతా శుభ్రంగావుంది మెరుస్తూ; స్టొవ్‌లో నిప్పు భగభగ మంటోంది, వంట బల్లనిండా వంట సామాను పేర్చివుంది. తలకొక రుమాలు కట్టుకుని, వంటల పుస్తకం అదేపనిగా చదివేస్తోంది ఓల్గా.

"ఏమిటిదంతా ?" అంది పావా, చుట్టూ కలయజూస్తూ; ఏదో ప్రయోగశాలలో కొచ్చినట్టుంది. "బంధువు లొస్తున్నారా యెవరైనా ?"

"లేదు, లేదు. ఇకనుంచీ నా పని నేనే చేసుకుందామని."

పావాకి నవ్వొచ్చింది.

"చాల్లెండి, సంతోషించి పోయాం !" అంది, "డజనో అరడజనో పిల్లలుంటే ఆదారి వేరు, మీరన్నదాని కర్థం వుండేది

కాని యిప్పుడెందుకు ! యిట్లా పగలల్లా వంటింట్లో వుండాల్సిన అవసరం యేముందీ మీకు ? ఈ పాతకాల పద్ధతులు మానె య్యండి."

"పగలల్లా యిక్కడే వుంటానని యెవరన్నారు ? తీరుబడున్నప్పుడు చేస్తే చాలు యీపని. ఇవాన్‌కి తీపంటే బాగా యిష్టం; చేసి పెడదామనుకుంటున్నా. అందులో తప్పేముంది ?"

"ఎట్లా చెయ్యాలో తెలుసా అసలు మీకు ? మగవాళ్ల గొడవ యెంత తక్కువ పట్టించుకుంటే అంత మంచిది."

కావలసిన వస్తువు లేరుకోవడంతోనే సరిపోయింది ఓల్గాకి; పావాకి జవాబు చెప్పాలన్నమాట మరచిపోయింది ఆ గొడవలో పడి. "పంచదార, పిండి, వెన్న...."

పులుసు తయారై పోయింది; మాంసం వేగుతోంది. ఎలీనా నేర్పిన పాఠాలు వూరికే పోలేదు.

ఓల్గా వుత్సాహం చూచి పావాగూడా సహాయం చేసింది, "మీరు చేసే తీపెప్పుడు తిందామా అని నోరూరు తోంది" అంటూ.

రోజులు తిరిగిపోతున్నై. ఒక వారం ఐంతర్వాత, "నేనిక వంటపరీక్ష పాసైనట్టే అప్పుడప్పుడు పులుసులో కాస్త వుప్పెక్కువౌతుంది; యెప్పుడోగాని మాంసం వేపుడు మాడిపోవడం లేదు; మొత్తంమీద ఫర్వాలేదు" అంది ఓల్గా.

"పరీక్ష పాసైంది మీరుగాదు; ఇవాన్ ఇవానోవిచ్

పాసయ్యారు" అన్నాడు లొగునోవ్, ఒకనాటి సాయంత్రం పనినుంచి తిరిగొచ్చింతర్వాత; ఆయన్తోపాటు తావ్‌రోవ్‌గూడా వచ్చాడు.

"య్యేం, నేను మీకుచేసిపెట్టలేననా మీ వుద్దేశం. ఈ పూటిక్కడే భోంచెయ్యండి, మీకే తెలుస్తుంది." అన్నది ధైర్యంగా.

జుత్తంతా బాగాతలకంటుకునేట్టు నున్నగా దువ్వి మెడ మీద ముడేసుకుంది ఓల్గా; మెడ మృదువుగా చూడ ముచ్చట గావుంది. ఆవిడ వేసే ప్రతి అడుగూ, ప్రతి కదిలికా "నేనేం చేస్తాను, దేవుడంత అందంగా పుట్టిస్తే నాదాతప్పు?" అంటున్నట్టుంది.

ఆవిడలా పనిచేసుకుంటుంటే, లొగునోవ్ ఆనందంగా చూశాడు, ఇవాన్ ప్రేమగా ఆర్ద్రంగా చూశాడు; తావ్‌రోవ్ వుదాసీనంగా వున్నాడు. ఓల్గా వచ్చి ప్రొద్దుపోయిందని చెప్పే దాకా, ముగ్గురూ టేబుల్‌చుట్టూ కూర్చుని ఓ చర్చించుకుం టున్నారు, ఉత్పత్తి క్రమశిక్షణా యెలా అభివృద్ధి చెయ్యాలి అని.

"ఐతే యికమీరీ యింటికి అంకితం కాదలచుకున్నారన్న మాట?" అని అడిగాడు లొగునోవ్; తెల్లని టేబుల్‌క్లాత్‌మీద పాత్రలు సర్దుతున్న ఓల్గాని చూస్తూ.

"పూర్తిగాకాదు. వీలున్నప్పుడల్లా చేద్దామని ప్రారంభించాను. ఇప్పుడు చూస్తే అదే సర్వస్వం ఐ కూర్చుంది. ఇకిప్పుడు చదువుకునేందుకు గూడా తీరిక చేసుకోవడం గగనమై పోతోంది. ఐనా, విచిత్రం! చాలాహాయిగా వుందినాకు. మరీ

బజారు కెళ్ళి బేరాలుచేసి పట్టుకురావడం అంటే, భలేగా వుం టుంది."

"అసలీ చెడుగు కంతా కారణం మగవాళ్లు" అనుకున్నాడు లొగునోవ్, ఇవాన్‌వంక అసంతృప్తిగా చూస్తూ. కాని తనకోసం, వార్యా గూడా యింత ప్రేమతోనూ పనులు చెయ్యడం ప్రారంభిస్తే తాను మాత్రం సంతోషించడూ? "ఎందుకు సంతోషించను; బాగానే సంతోషిస్తా" అనుకున్నాడు, "మగవాళ్లమే అంత; మా మంచికోసం, మా ఆనందంకోసం, మా స్వార్థసుఖంకోసం ఒక్కోసారి మేము ప్రేమించే స్త్రీలనే సర్వనాశనం చేస్తాం."

"ఎందుకిలా వంటింట్లో వృథాపుచ్చుతావ్ అనన్నా ఓల్గాతో; వింటేనా?" అన్నాడు ఇవాన్, లొగునోవ్ ఆలోచనలకి సమాధానం చెబుతూన్నట్టు "ఇక ఆదివారంనాడు మాత్రం ఆ ఆటలు సాగనివ్వడంలేదు."

"ఐతే. ఆదివారంనాడు పస్తులుంటున్నారా?" అన్నాడు లొగునోవ్ చిలిపిగా.

"వెళ్తే రెస్టారెంట్ కెళ్తాం; లేకపోతే యింటిదగ్గరే యేదో వొకటి వెచ్చజేసుకుని తింటాం."

"నేనొచ్చిందే అందుకు. మిమ్మల్ని వంటింట్లోంచి బయటికి లాగాలనే వచ్చా యివ్వాళ" అన్నాడు ఓల్గాతో, లొగునోవ్, "ఇకీపనింతటితో కట్టిపెట్టండి. స్త్రీలెంత యిష్టంగా, తమంతట తామే యింట్లోపడి కొట్టుకోవడానికిష్టపడ్డా; సామాన్యంగా యెవ్వరూ సంతోషించరు. మేమిక్కడ విదేశీ భాషల అధ్యయనానికని ఒక కార్యక్రమం ఏర్పాటు చేశాం. అందరూ

పెద్దవాళ్లు; కావాలని నేర్చుకునేవాళ్ళు. జెర్మన్ భాష బాగా తెలుసు కాబట్టి ఆ భాష నేర్పుతానన్నాడు సెర్గుతోవ్. ఇంగ్లీషు నేర్పేవాళ్లెవళ్లూ దొరకలేదు యింత వరకూ. ఇక్కడ స్కూళ్లో వున్న ఇంగ్లీషు టీచరేమో నాకేమంత బాగారావంటోంది. అదీగాక మేమేమీ జీతమూ నాతమూ యివ్వడంలేదు. మీరొప్పుకుంటారా ఇంగ్లీషు నేర్పడానికి? ఏమీలేదు; సంఘసేవనుకోండి. అలవాటులేకపోతే నేర్చుకున్న భాషలు పూరికే మరిచిపోతాం గూడాను. ఇట్లాచేస్తే మీకూ మంచిది."

ఇవాన్‌వంక చూచింది ఓల్గా; మొన్నా సంభాషణ జరిగింతర్వాత, ఈయనేవెళ్ళి లొగునోవ్ కాసూచన చెయ్యలేదు గదా?

"సరే," అంది ఓల్గా, "కాదనేందుకు నాకేం హక్కుంది. మీవుద్దేశం ఏమిటండీ, బోరిస్?"

ఇంతవరకూ మెదలకుండా కూర్చున్నాడు బోరిస్ తావ్రోవ్. ఓల్గా మాటలు విని యిష్టమయ్యీ కానట్టు నవ్వాడు.

"నావుద్దేశం మీకనేకసార్లు చెప్పాను, కావాలంటే, యింకొకసారి గూడా చెబుతాను. కాని మీకాసలవాలు నచ్చవనుకుంటాను." అన్నాడు.

"'నావుద్దేశం!' 'కావాలంటే!' 'మీకునచ్చవనుకుంటాను!'—యేమిటీ యిది?" అంటూ వెక్కిరించాడు లొగునోవ్, "నేనేమో వలంటీర్‌ని చేర్చుకోడానికి రావడంయేమిటీ, మీరేమో యీమాటలనడం యేమిటి! బాగానేవుంది!"

"పావాతో సహా మీరందరూ వ్యతిరేకమే నాకు!" అన్నది ఓల్గా విచారంగా, "మీరందరూ తెలివి తేటలుగలవాళ్లే నాకంటే."

## 26

విదేశీ భాషల సంఘం మొట్టమొదటి సమావేశం విఫల మైంది. ఇంటికొచ్చింతర్వాత కాస్సేపటి దాకా ఓల్గాచాలా నిస్పృహగా వుంది.

"ఈసారి చేసేపని చాలా జాగ్రత్తగా చెయ్యాలి" అనుకుంది ఓల్గా, పొయ్యి వెలిగిస్తూ. పొయ్యిలో కర్రలు భగభగా మండుతున్నై. రెండుచేతులూ చాచి చలికాచుకుంటున్నట్టు కూర్చుంది, ఆనందిస్తూ.

పిల్లలకీ, ముసలివాళ్లకీ చలిమంట కాగడమంటే యిష్టం. పాడు జబ్బులు లేకుండావుంటే యెంత బాగుండిపోను యీ ప్రపంచం! ఇంకో నాలుగు రోజులుంటే లేనాకి యేడేళ్లు నిండేవి.

చిన్నప్పుడు వేలెడంత వుండేది లేనా; సొంత బుద్ధిలేదు; స్వంతంగా ఏపనీ చెయ్యలేని పసిపిల్ల; ఐనా ఆ బిడ్డకోసం యెంత ప్రేమకురిపించింది తను, ఎంతబాధపడింది. లేనా పుట్టకముందు ఎంతగానో ఆలోచించింది ఓల్గా, మాతృహృదయం అంటే యేమిటో వూహించుకుందామని; సాధ్యం కాలేదు. కాని, తర్వాత? ఎక్కడికెళ్లినా, యేం జేస్తున్నా దృష్టంతా యింటి మీదనే; ఆలోచనలన్నీ లేనాగురించే ఎప్పుడూ యేదో అశాంతి.

"ఐనా చాలాహాయిగా వుండేదప్పుడు" అనుకుంది ఓల్గా. ఒకసారి లేనాని ఊయల్లో పండుకోబెట్టి వూపుతూ నిద్రబుచ్చుతోందితను; అప్పుడా పసిగుడ్డు కళ్లుతెరిచినోట్లోవున్న పీకతీసి తల్లినోటికి అందించబోయింది; "అమ్మా! నువ్వుగూడా నిద్రపో" అంటున్నట్టు.

పొయ్యిమీద వంటపూర్తయ్యింది. ఇక వొకటే ప్రతీక్ష. నిమిషాలు గంటలైనై; ఐనా భర్త అంతూ పంతూలేడు. హాస్పిటల్‌కి ఫోనుచేసింది. మాంచి పనిలో వున్నాడని జవాబొచ్చింది. కాస్సే పాపనీ యీపనీ చేసుకుంది, ఇంకా స్సేపు చదువుకుంది, ఏమీ తోచక యింటి ఖర్చులెక్కలు సరిచూసుకుంది; ఇంకా రాలేదు భర్త. మళ్లీ ఫోన్‌చేసింది.

చూచి చూచి విసుగెత్తింది; లేచిహాస్పిటల్‌కి ప్రయాణమైంది.

డాక్టర్లు వేసుకునే తెల్లగౌనూ, తెల్లటోపీ యిచ్చారు ఓల్గాకి.

"వంటింటికి తగిన దిరీసే" అనుకుందవి వేసుకుం తర్వాత అద్దంలో చూచుకుంటూ, "అసలైన సిసలైన వంట మనిషిని!"

గబగబా నడవలోగుండా నడిచెళ్ళింది. చాలా పెద్ద హాస్పిటలు. ఇక్కడికి ఓల్గా రావడానికిదే ప్రథమంగాదు. స్నానాల గదులూ, ఎక్స్‌రే గదులూ యిదివరకే చూచింది. ముందుముందు మట్టి స్నానాలకిగూడా అవకాశాలేర్పరుస్తామని చెప్పాడు ఇవాన్. ఇవాన్‌కి తగిన హాస్పిటలే యిది, సందేహంలేదు.

సరాసరి ఇవాన్ ఆఫీసుకే వెళ్లింది ఓల్గా. లేడు. డాక్టర్ల గదులూ, ఆపరేషన్ గదులూ అన్నీ చూచింది. లేడు.

"ఇంటికి రావడానికూడా వీల్లేక పోయిందాయనకి" అన్నాడు డెనిస్ ఎదురుపడి, "ఇవ్వాళొక చిన్న ప్రమాదం జరిగింది. యూరీ మంచంమీదనుండి కిందికి పడిపోయాడు. అసలే పెళుసు బొమికలతనివి; కాలిరిగి పోయింది. అతనికి చికిత్స చేస్తున్నాడు ఇవాన్. అయిద్దర్లో యెవరికీ మనసు

మనసులో లేదు—మేమూ అంతే ననుకోండి. వాళ్లిద్దరూ ఆగది లో కూర్చునున్నారు."

ఓల్గానిగూడా వెంటబెట్టుకుని ఆ వార్డు దగ్గర కెళ్ళాడు డెనిస్. తలుపు సందులోంచి చూస్తూ ఓల్గాకిసైగచేశాడు వచ్చి చూడమని. అడుగులో అడుగేసుకుంటూ చప్పుడుగాకుండా వెళ్లి చూచింది. గుమ్మంవైపుకి వీపుపెట్టి కూర్చునున్నాడు ఇవాన్; కుర్రవాడు సరిగ్గా కన్పించడంలేదు. ఇద్దరూమాట్లాడు కుంటున్నారు.

"అదేమిటి బాబూ, యింకా పూర్తిగా నడవడమైనా లేదు; అప్పుడే కాలిరగ్గొట్టుకున్నావ్?"

"నేనూరికే కదిలాను....కదిలాను...."

"పక్కమీదేనా?"

"ఊఁ"

"ఊఁ, తర్వాత?"

ఇంకొద్దిగా ముందుకొంగి చూసింది ఓల్గా. తలగడమీద కుర్రాడి తల కన్పిస్తోంది. వెడల్పాటి మొగం, చట్టిముక్కు.

"కదిలాను .... ఇంకా స్త కదిలి .... అంతే. కాలిరిగి పోయింది."

"భలేవాడివేనువ్వు, నొవ్వకుండాఅబద్ధాలాడేస్తున్నావ్." అంటూ నవ్వాడు ఇవాన్. సరే, నీతోపాటు యింకా అప్పు డెవ్వరో వుండే వుంటారు నీ పక్కనే. సరే. ఇప్పుడదంతా యెందుకులే చెప్పడం యిష్టం లేదుగా నీకిప్పుడు. బలవంతం యెందుకులే."

ఒక క్షణం యిద్దరూ మౌనంగా వున్నారు.

"మళ్ళీ చాలాకాలం యిట్లాగే మంచంమీదే వుండా ల్సొస్తుందా నేను?" అన్నాడు యూరీ.

"రెండు మూడు వారాలు పట్టొచ్చుమరి."

"అమ్మో. రెండు మూడు వారాలే."

"ఏం పర్వాలేదు. తొందరగానే నయమౌతుంది. ఎక్క ణ్ణుంచో చాలా దూరంనుంచి బయల్దేరా వనుకో యింటికని. ఒక యేడాదల్లా నడుస్తూనే వున్నావనుకో యింటికెళ్దామని. ఇల్లు కనిపించింది. వాకిలి దగ్గరగ్గూడా వచ్చేశావ్; ఇకాగలేక పోయావ్, తొందరగా వెళ్ళిపోవాలని పరుగెత్తావ్, ఎదురు దెబ్బ తగిలి కింద పడిపోయావ్. ఇల్లు కన్పిస్తూనే వుంది, యిం కొక పదడుగులేస్తే యింట్లోకెళ్ళిపోయేవాడివి. కాని కదల్లేవు. ఇదీ అంతే. గుమ్మందగ్గరున్నావ్. కాని యింట్లోకెళ్ళలేవు."

"నిజమే, వూరికే తొందర పడిపోయా."

నెమ్మదిగా అక్కడినుంచి వెనక్కి తిరిగింది ఓల్గా. అసూ యలాంటి భావమేదో ఆవిణ్ణా వహించింది. "ఇదే ఆయన కిల్లు" అనుకుంది, "ఎవరో పరాయి బిడ్డని సాకేందుకు కావలసినంత తీరికుంది; స్వంత భార్యని గురించి ఆలోచించడానికి క్కూడా అవ కాశం వుండదు. వంటింట్లో పడి యెముకలిరగ్గొట్టుకున్నా అంతే. కళ్లు కాయలు కాచేట్టు దారులు చూస్తూ కూర్చున్నా అంతే; లెక్కలేదు. ఫోను గూడా చెయ్యలేదు. రాత్రికి రాత్రీ అంతే. ఎవరికో జబ్బు చేసిందని అర్ధరాత్రనగా లేచెళ్లారు; ఇంతవరకూ యిల్లేమైందో నన్న ధ్యాసగూడా లేదు."

"ఇకా అబ్బాయికేమీ పర్వాలేదు, గండం గడిచినట్టే" అన్నాడు డెనిస్, ఓల్గా వెనకవెనకే నడుస్తూ, "గనిలో పనిజేసే

మనిషికొకతనికి మెదడు ఆపరేషన్ చేశాం మొన్న. అంతా సవ్యంగా వున్నట్టే వుండి, ఉంపరేచరెక్కిపోయింది. అందుకనే సర్జెన్ ఇవాన్ మమ్మల్నెప్పుడూ హెచ్చరిస్తూ వుంటారు; నాపని ఆపరేషన్ చెయ్యడం మట్టుకే. యిక తర్వాత శ్రద్ధగా వుండవలసిందంతా మీరేనని. మేమూ మా శాయశక్తులా చేస్తూనే వుంటాం. ఆయన కెప్పుడూ ఒకటే చింత అటురోగుల్ని గురించీ యిటుమమ్మల్ని గురించీ నీ. ఏదైనా క్రింద మీదైతే సమాధానం చెప్పుకోవలసింది సర్జెన్. ఎప్పుడూ ఒకటే ఆందోళన ఆయనకి పాపం! 'నేనా ఆపరేషన్ సరిగ్గా చేశానా? యేమీ పొరపాటు చెయ్యలేదు గద? ఏమీ మరిచిపోలేదు గద?' అని ఒకటే ఆందోళన."

"అదంతా బాగానే వుంది కానండీ" అంటూ గిరుక్కున తిరిగి, "ఇకాయన్ని గురించి ఆందోళన పడే దెవరండీ మరి? పాఠాలు, చికిత్సలు! వీటికిక తెంపూ తెరపీ అంటూలేదా? ఇవ్వాళ మట్టుకివ్వాళ యింతవరకూ భోజనం చెయ్యలేదు; అదేమన్నా తెలుసా మీకు? ఇట్లా యెంతకాలం వుండగలరాయన మాత్రం?" అన్నది ఓల్గా కోపంగా.

"నిజవేఁ ననుకోండి. కాని ఇవ్వాళంటే ఎమర్జెన్సీ కేసు. ఆలస్యం చెయ్యడానికి వీల్లేదు; ఆయన లేకుండా, ఆ పని కాదు. ఎందుకూ నేనెళ్లి పిలుచుకొస్తాగా యిప్పుడాయన్ని. ఇంకొక నర్సున్నది లెండి. బంగారంలాంటి నర్స్. ఆ విడిప్పుడింకొక వార్డులో వుంది. ఆ వార్డులో వాళ్ళని మరీ కంటికి రెప్పలా కాపాడాలి; మరీ పసిపిల్లలవతు వాళ్లు"

# 27

నాటకరంగానికవసరమైన తెరలు గీయమని కోరింది పావా. ఓల్గా కూర్చుని గీస్తోంది. "వంకరగా వున్నట్టుంది" అన్నాడు తావ్‌రోవ్ అది చూచి.

"నాకు చేతనైనట్టు గీస్తున్నా" అంది ఓల్గా.

"మెషీన్ బిల్డింగ్ ఇన్‌స్టిట్యూట్‌లో డ్రాయింగ్ నేర్చుకోలేదా ?"

కోపంగా చూచింది ఓల్గా. తావ్‌రోవేమీ దురుద్దేశంగా అడిగినట్టు లేదా ప్రశ్న; ఎప్పటిలా అమాయికంగా నవ్వుతూన్నై అతని నీలికనులు. ఏమీ అనకుండా, ఒక్క నిట్టూర్పు మట్టుకు విడిచి, మళ్ళీ తనపని ప్రారంభించింది ఓల్గా.

ఓల్గా కూర్చున్న కుర్చీ చేతిమీదనే బరువుమోపి, "కావాలనుకుంటే, ఎప్పుడో డ్రాఫ్ట్సుమన్ (నమూనా బొమ్మలు గీసే మనిషి) అయ్యేది ఓల్గా" అన్నది పావా.

తప్పొచ్చిన గీత రబ్బరుతో తుడిచేస్తూ "కావాలనుకుంటేనా ?" అంది ఓల్గా, "నా దస్తూరీ చూడలేదల్లేవుంది మీరు అక్షరాలక్షరాలకి మల్లేవుండవు; దెయ్యాల్లాగుంటై. ఇంకా డ్రాయింగేమి చేతనౌతుంది నాకు ?"

"మీదొక విచిత్ర స్వభావం; కాస్సేపు గూడా వూరికే కూర్చోరు. మీకేం కావాలో, ఏంచెయ్యాలో మీకే తెలియదు" అన్నది పావా, ఓల్గానొక్కసారి కౌగలించుకుని వదలేసి; తావ్‌రోవ్ వంక చిలిపిగా చూచింది వెంటనే.

ఈ యువకుణ్ణీ, ఎంజినీరునీ చూస్తే పావాకి చాలా యిష్టం. ఆడవాళ్ళని సంతోష పెడుతూ మాట్లాడ్డంలాంటి వత

నికి తెలియవు నిజమే; ముద్దుపెట్టుకోమని చేయిచాస్తే సిగ్గుతో తలవంచుకుంటాడు. ఐతేనేం, బాగా చదువుకున్నవాడు. తన పనిని గురించిగాని, సిద్ధాంతాల్ని గురించిగాని మాట్లాడేప్పు డెంతో ఆత్మ విశ్వాసంతో మాట్లాడతాడు. ఏ విషయాన్ని గురించైనా చక్కగా మాట్లాడగలడు. అందరిలాంటి వాడు కాదు. మిగతా వాళ్ళకంటె మెరుగైనవాళ్ళ నెప్పుడూ తన చుట్టూ అట్టే పెట్టుకోవడమంటే పావాకి సరదా.

"వీళ్ళిద్దరికీ యింత బాగా స్నేహమెట్లా ఐంది?" అని ప్రశ్నించుకున్నాడు తావ్‌రోవ్, పావానీ, ఓల్గానీ చూస్తూ, "ఒకావిడేమో మరీ తేలికరకం మనిషి. సరుకులేని మనిషి- రెండో ఆవిడేమో.... తెలివి తేటలున్నది; ఆకర్షించే స్వభావం. ఎలా కలిసింది వీళ్ళకీ స్నేహం?"

తావ్‌రోవ్ చేతుల్లో చదరంగం బల్ల చూచి, "ఎప్పుడూ చదరంగమేనా? పాడుచదరంగం! నాకోపం వస్తే తీసపతల పారేస్తా" అన్నది పావా.

"పర్వాలేదు, ఒక్కాటంటే వొక్కాటాడదాం" అంది ఓల్గా, పావా వద్దన్నా వినిపించుకోకుండా.

అన్నదన్నమాటే కాని ఆట ఆడలేదు.

"ఇవ్వాళెందుకనో నాకేమీ బాగాలేదు." అంది, చేతికైన పెన్సిల్ గుర్తులు కాగితంతో తుడుచుకుంటూ, "ఇవ్వా ళేమీ చెయ్యాలనిపించడంలేదు. ఇంటి కెళ్ళిపోతా."

మెట్లుదిగి, గేటుదాటి అలాగే యింటికెళ్లి పోయింది. తావ్‌రోవ్ చూస్తూ కూర్చున్నాడు. ఎప్పుడూ తనని పంపించడాని కింటిదాకా రానిచ్చేదికాదతన్ని.

"నేనూ వెళ్లాలి" అన్నాడతను తర్వాత, "లోగునోవ్ నాకోసం చూస్తుంటాడు గనిదగ్గర."

ఎప్పుడూ తన పనిలోనే మునిగితేలుతూ ఇవాన్ ఇవానొవిచ్ తన సంగతేమీ పట్టించుకోవడం లేదని బాధ ఓల్గాకి.

క్రమక్రమంగా ఆ పొరపాటు ఆపరేషన్ సంగతి పాతబడి పోయింది. హాస్పిటల్ కీమధ్య కొత్తకొత్త పరికరాలొచ్చినై. అవి తెప్పించేందుకు ఇవాన్ ఇవానొవిచ్ చాలా శ్రమపడ్డాడు. వాటికేంగాని, కన్ను వైద్యంలో నిపుణుడైన డాక్టర్ గూడా వచ్చాడు హాస్పిటల్ కి కొత్తగా. ఇవాన్ ఆనందానికి మేరలేదు.

"మెదడుకు సంబంధించిన జబ్బులూ అవీ తెలుసుకోవడాని కీనిపుణులు చాలా అవసరం" అని చెప్పాడు ఓల్గాతో ఆ కొత్త డాక్టర్ని పరిచయం జేస్తూ. "ఈయన పేరు ఇవాన్ సెర్యోదొవిచ్ షిరొకోవ్. చూశావ్ మా పేర్లు రెండూ ఒక విధంగానే ప్రారంభమౌతై. అంతకంటే విశేషం యేమిటంటే, వైద్యాన్నిగురించి మా యిద్దరి అభిప్రాయాలు దాదాపు ఒకే తీరుగా వున్నై."

కొత్తగావచ్చిన కన్ను వైద్యుడు ఆరోగ్యంగా, దిట్టంగా వున్నాడు. మధ్యవయసు. తలెగ దువ్వితాడెప్పుడూ.

"నిజంగానే యీ న్యూరో సర్జరీ అంటే మా కిద్దరికీ చాలా యిష్టం." అన్నాడు షిరొకోవ్, ఓల్గాతో కరస్పర్శ

చేస్తూ, "నిలోవిచ్ బుర్దెంకో* రుజువు చేసినట్టు యీ నరాల జబ్బుల్నేక కోణాల్లోంచి చూస్తేగాని అర్థంకావు. అంటే అన్ని శాఖల్లోనూ నిపుణులుంటేగాని రోగనిర్ధారణ చెయ్యడం కష్టం. ఇంతకీ మీరు మా కనుకూలమా? వ్యతిరేకమా?"

"అనుకూలమూ కాదు, వ్యతిరేకమూ కాదు". అన్నాడు ఇవాన్, "కొంతకాలం వైద్యం చదివి, మధ్యలో వదిలేసి పారిపోయొచ్చింది."

"వొట్టిది. నేనేం పారిపోయి రాలేదు. నా కందులో ఆసక్తిలేదు కాబట్టి వదిలేశాను. అంతే."

"ఆసక్తి లేకపోవడ మేమిటి?" అన్నాడు పిరొకోవ్, "వైద్యశాస్త్రం అంటే చాలా విస్తృతమైన శాస్త్రం; ఎలాంటి వ్యక్తైనా యేదో వొక శాఖలో ఆసక్తి కలగడాని కవకాశం వుంటుంది. ధైర్యమూ, మనోబలమూ వుండి, మంచి కన్నులూ, చెబితే వినే చేతులూ వుంటే సర్జెన్ కావచ్చు. శ్రమపడి పరిశీలనచేసే శక్తి, అతి స్వల్ప విషయాల్నిగూడా అతి శ్రద్ధగా ఆలోచించి నిర్ణయాలు చెయ్యగల ఓర్పూ వుంటే మనస్తత్వశాస్త్రం తీసుకోవచ్చు. అదీ యిదీగాక అందమైన శరీరమంటేనూ, రూపమంటేనూ ఆసక్తివుండే కవి హృదయ మైతే శారీరకశాస్త్రం చదివి ఆటలపోటీల నిపుణుల్ని తయారు చెయ్యవచ్చును. లేదూ మానవ సహజమైన జాలీ, సానుభూతీ, కరుణవుంటే పిల్లలవైద్యం ప్రత్యేకంగా నేర్చుకోవచ్చును. ఏది చెయ్యాలనుకున్నా వీలే వైద్యశాస్త్రంలో. నీ సోదర మాన

---

* బుర్దెంకో, నికొలాయ్ నిలొవిచ్ (1878 — 1946) గొప్ప సోవియెట్ సర్జెన్. సైన్సు ఎకాడెమీలో సభ్యుడు. స్టాలిన్ బహుమానం పొందాడు. న్యూరో సర్జరీలో నిపుణుడు.

వ్వుల కెప్పుడు చూచినా యెక్కడ తటస్థపడినా, సాయం జేసేందు కవకాశం వుంటూనే వుంటుంది. ఇంకా యిట్లా యెంతసేపు చెప్పినా తరగని విషయం యిది. ఇక శాస్త్రీయ పరిశోధన సంగతి చెప్పనక్కరే లేదు."

"మరి మీ ప్రత్యేక శాఖ ?"

"నాదా ? మా శాఖని గురించి కీర్తించగల కవి యింత వరకు పుట్టలేదు మరి ! 'సర్వేంద్రియాణాం నయనం ప్రధానం.' కనులు చూస్తే చాలు, హృదయం తెలిసిపోతుంది. కంటిపాపంటే యేమిటో తెలుసా మీకు ? కన్నుమధ్య నల్లగా యెప్పుడూ శ్వాస తీసుకుంటున్నట్టు కదుల్లాడుతుంటుందే, అది. ఒక ప్రత్యేక పరికరం వుంది; దాంతో, కిటికీలోంచి చూచినట్టు చూడగలను కంటిపాపలోంచి నేను."

"ఏమిటీ మీరు చూచేది ?"

"లోపలున్న భాగమంతా ఎర్రగా నున్నగా వుంటుంది. మధ్యలో కనబడీ కనబడనట్టొక వుంగరంలా వుంటుంది; అది కంటినరం బొటిమ. ఈ బొటిమ సరిగ్గా కంటిగుడ్డు నానుకుని వుంటుంది. కంటి నరాల్లో ఆపరేషనేమీ చెయ్యకుండానే కనబడేదీ బొటిమ వొక్కటే. ఈ కంటినరం అంతా సన్నసన్నని పొరలమయం; అంతా మెదడులా వుంటుంది. అంచేత మెదడులో యేది చెడిపోయినా యీ కంటినరాలద్వారా తెలుసుకో వచ్చు ఒక్కోసారి. మెదడు వుపరితలంలో వొత్తిడెక్కువైనప్పు డీసంగతి యింకా ప్రస్ఫుటంగా తెలుస్తుంది; అప్పుడు ఈ కంటినరం కీసరబాసరై పోతుంది, దాని అసలు స్వరూపం పోతుంది."

"ఓహో. అప్పుడా బొటిమరూపే మారిపోతుందన్న మాట" అన్నది ఓల్గా, యేదో కొత్త విషయం అర్థం చేసుకు నేందుకు తహతహలాడు తున్నట్టు.

"ఆఁ. అది తెలుసుకోగానే, ఆ విషయం న్యూరో సర్జెన్‌కి చెప్పడం నాబాధ్యత" అన్నాడు పిరొకోవ్.

ఇవాన్ ఇవానొవిచ్ ఈ సంభాషణంతా చిరునవ్వు నవ్వుతూ వింటున్నాడు. పిరొకోవ్ ఆయనవైపుకు తిరిగి, "మీ ఆవిడ కసలీ విషయాలే తెలియవన్నట్టు చెప్పారు మీరు; ఆవిడకంతా బాగానే అర్థమయ్యిందే!" అన్నాడు.

# 28

గనులఆఫీసులో వున్న టైపిస్ట్ కీమధ్యచాలా రోజుల్నుంచి తలనొప్పిగా వుంటోంది. వుండుండి చూపుగూడా సరిగా కని పించడం మానేసింది; మతిగూడా తిన్నగా వుండడం లేదు.

"నేనొకనాడు స్కూలునుంచి వచ్చి, అమ్మా రొట్టిపట్టు కొస్తాను డబ్బులిమ్మని అడిగాను. నామాట వినిపించుకున్నట్టై కనిపించలేదు. సంతకి పట్టికెళ్ళే సంచీ ఏదోగూడా గుర్తులేనట్టు మాట్లాడింది" అంటూచెప్పుకొచ్చింది ఆ టైపిస్ట్ కూతురు, తల్లిని హాస్పిటల్ కి వెంటబెట్టుకొచ్చి. టైపిస్టుగూడా చాలాబల హీనంగా వుంది; మధ్యావయసుంటుంది. కూతురుపేరు ల్యూబా, పదేళ్ళుంటై. వచ్చి డాక్టరాఫీసులో కూర్చుని ఏడ్వడం ప్రారంభించింది ల్యూబా. "నేనేం మాట్లాడినా జవాబు చెప్పదు అమ్మ. ఎప్పుడూ కళ్ళట్లా అప్పజెప్పి చూస్తూ వుంటుంది. 'ఏమి టమ్మా, అట్లా వున్నావ్? నన్నేడిపించడానికా?' అనడిగా.

నన్నుగూడా గుర్తుపట్టలేక పోయింది. ఏమన్నా మాట్లాడినా అంతా తల్ల క్రిందులుగా మాట్లాడుతుంది; నాకేమీ అర్థమే కాదు. 'యెంతబాగా వుందా సంగీతం!' అంది అమ్మ రేడియోవంక చూస్తూ. రేడియో ఆడటంలేదు, మూసేశుంది. కూర్చున్న దల్లా గభాల్న లేచినిలబడి 'ఆబల్లకిందా కుక్కేం జేస్తాంది?' అనడిగింది. బల్లకింద చూస్తే కుక్కా లేదు, యేమీలేదు."

హాస్పిటల్లో ప్రవేశ పెట్టుకున్నారు ఆవిణ్ణి. పరిశీలన చేశారు. పరీక్షలు చేశారు. చివరికి, మెదడులో బుడుపు కట్టిం దనే నిర్ణయానికొచ్చారు.

ఆపరేషన్ చెయ్యడానికి ముందు రోగనిర్ణయ పట్టికంతా క్షుణ్ణంగా చూశాడు ఇవాన్; రోగినిగురించి ఇతరడాక్టర్లు చెప్పిం దంతా మననంచేసుకున్నాడు. ఆపరేషన్ ఏ విధంగా చేస్తే బావుంటుందని, ప్రతీ చిన్న అంశమూ జాగ్రత్తగా ఆలోచిం చాడు.

ఆపరేషన్ టేబుల్ దగ్గరకెళ్లేప్పటికి, అరోగి కూతురు ల్యూబా, ఉరల్స్‌లో వుండేరోగి ముసలితల్లీ గుర్తుకొచ్చారు సర్జెన్ ఇవాన్‌కి. తనశస్త్రవైద్య నైపుణ్యంమీద ఆధారపడి వున్నై ఆమూడు ప్రాణాలూ. ఆపరేషన్ బల్లదగ్గరాయనకి సాయంజేసేది గూసేవ్. తలలో ఆపరేషన్ చెయ్యవలసిన భాగంలోవున్న జుత్తంతా గొరిగి, అయోడిన్ పూశారు. చుట్టూస్టెరిలైజ్ చేసిన ఆపరేషన్ పరికరాలూ, తుండ్లూవున్నై. చేతులికి పసుపు పచ్చని రబ్బరు గ్లోవ్స్ తొడుక్కుని ఆపరేషన్ చేయవలసిన భాగమంతా నిమిరి చూశాడు. ప్రక్కనేనిలబడ్డ వార్యావైపుకి చేయిచాచాడు. నొవొకైన్ సిరింజ్ అందిం చింది. ఆపరేషన్ ప్రారంభమైంది. సర్జెన్ కింకే ఆలోచనా

లేదు; వుండేందుకవకాశం లేదు. ఆపరేషన్ చెయ్యడానికెంత కాలం పట్టినా, రెండు గంటలుకానీ, మూడు గంటలుకానీ, పదెనిమిది గంటలుకానీ, అలాగే తను చెయ్యవలసినపనిమీదే కేంద్రీకరించాలి. నిలబడి ఆపరేట్ చెయ్యడం ప్రారంభించాడు. ఎడమచేతికికుడిచేయిసాయమైతే,కుడిచేతికియెడంచెయ్యి సాయం. రెండుచేతులూ ఒకవైపున ఇంజెక్షన్ చెయ్యడం? మరోవైపున చర్మభాగాన్నికొయ్యడం. ఎంతోఅనుభవంవుంటేనేగాని సాధ్యం కానిపని. అందులో మెదడు ఆపరేట్ చెయ్యడమంటే మాటలు గాదు; ఏ కడుపో, ఏ గుండెనో ఆపరేట్ చేసినట్టుకాదు; ఈపద్ధతే వేరు. అక్కడంటే—కడుపులోనూ, హృదయంలోనూ ఐతే—ఆప రేషన్‌చేసేభాగం కావలసినంతవిశాలంగా వుంటుంది. పెట్టెగంటు కొన్ని సెంటీమీటర్లటూ యిటూ ఐనా ఫర్వాలేదు; కాని ఇక్కడ మెదడులో, అలాకాదు, ముందు గుర్రప్పునాడంలా పెద్దబెజ్జమే పెట్టినా, మెదడు దగ్గరకెళ్ళింతర్వాత చాలాతక్కువ చోటుంది పరికరాలు కదపడానికి. అతిసున్నిత పరికరాన్ని చొప్పించడా నికి గూడా యెంతో నైపుణ్యం వుండాలి. లోపల చీకటిని ఛేదించడానికి బయటి వెలుతురు సూటిగా కాకుండా, వంచి, ప్రతిఫలింపజెయ్యాలి. తీరా చూచింతర్వాత, తీసివేయవలసిన బుడుపు ఆ సున్నిత పరికరం వెళ్ళిన దారికంటే యెన్నోరెట్లు పెద్దదై వుండొచ్చు. ఇకప్పుడు దానినక్కడే చిన్నచిన్న ముక్క లుగాతరిగి, ఒక్కొక్క ముక్కే నెమ్మదిగా, నిపుణంగా, అతి జాగ్రత్తగా బయటికి లాగాలి ఏ వొక్కముక్కా మిగిలి పోకుండా.

మెదడు పైభాగాన బుడుపన్నదెక్కడా కన్పించడం లేదు.

"అనుకున్నంతా ఐందన్నమాట." అనుకున్నాడు ఇవాన్. "ఈ బుడుపు మెదడుపైనలేదు. మెదడు లోపలిదన్నమాట!"

నెమ్మదిగా మెదడు పొరచించీ, మెదడు లోపలికి ప్రవేశించింది పరికరం. అంత భారీ మనిషి వేళ్లు అంత సున్నితంగా కదుళ్ళాడాయని చెబితే నమ్మడం కష్టం, చూస్తేనే తప్ప. శరీరమంతా కదలకుండా మెదలకుండా స్థాణువులా నిలబడుంది. ఐనా చేతులూ, చేతివ్రేళ్లూ ఆశరీరంతో తమకేమీ సంబంధం లేనట్టు, తమదంతా ఒక ప్రత్యేక ప్రపంచంఅన్నట్టు తమపని తాము చేసుకుపోయినై. మధ్యమధ్య యెప్పుడో ఒకసారి తలటుకదిపో, పెదవిటు ఆడించో ప్రక్కనున్నవాళ్ళని పురమాయించేవాడు, కళ్లుమాత్రం నిశ్చలంగా మెదడువైపుకే తిరిగుండేవి.

వెండి క్లిప్పుల్తో ఆ రక్తనాళాన్ని అతి సున్నితంగా అదిమిపట్టడం; సర్జెన్కత్తి ఒక్కొక్క మిల్లీమీటరే ముందుకు నడవడం! ఆపరేషన్ ప్రారంభమై అప్పుడే రెండుగంటలై పోయింది. ఇంతలో గూసేవ్ యేదో పొరపాటు చేశాడు; అప్పుడతను ఎలెక్ట్రిక్ పంపు నడుపు తున్నాడు ప్రక్కనేనిలబడి. గాయంలోంచి నెత్తు రుబికొస్తోందిబయటికి. డాక్టర్లూ, నర్సులూ గాభరా పడిపోయారు.

వెంటనే చేతులొదిలిపెట్టేశాడు గూసేవ్.

"ఈ పరిస్థితుల్లో యీ ఆపరేషన్ చెయ్యడం సాధ్యం కాదని మొదటేచెప్పాన్నేను" అంటూ బుసగొట్టాడు కోపంగా.

"చాల్లే, అవతలికెళ్ళండి" అన్నాడు ఇవాన్. అంతే. వార్యా, సెర్గుతోవ్ల సాయంతో ఆ రక్తస్రావం ఆపేశాడు.

కొద్ది క్షణాల్లో నెత్తురుకారే రక్తనాళాన్ని కనుక్కొని మూతి బిగించేశారు క్లిప్పుతో. ఎలెక్ట్రిక్ పంపుతో కారిన నెత్తురంతా తీసేసి శుభ్రం చేశారు. ఇంకా లోతుకెళ్లిందీ సర్జన్ కత్తి దారి చేసుకుంటూ.

"ఆఁ, తగిలింది, తగిలింది, బుడుపుతగిలిందీ, ఇదుగో!" అన్నాడు ఇవాన్. బ్రిదికాం అన్నట్టు ఒక్కసారి భుజాలు విదలించుకున్నాడు ప్రప్రథమంగా. "కాని బాగాచెడి పోయింది!" అన్నాడు విచారంగా, "బాగాకుళ్ళింది!"

అంటూనే, బొడిపి ముక్కొకటితీసి వార్యా కందించాడు. ఏరక్తనాళాల్లో పుట్టిందో చూచి చెప్పమనండి. అంతా నెత్తురుమయంగావుంది. అరెరే. మళ్ళీ నెత్తురొస్తోంది."

నిజంగానే గాయంనుంచి మళ్ళీ రక్తం కారుతోంది. ఈసారి యిందాకటి కంటే యెక్కువకారుతోంది.

"పంపు! ఎలెక్ట్రిక్ పంపు! లైటేదీ?" అని అరిచాడు ఇవాన్.

"కరెంటాగి పోయింది" అన్నాడు ప్రక్కనే నిలబడున్న యకూత్ యువకుడు, నికిటా బర్త్సెవ్. "లైట్లారిపోయినై."

"లైట్లారిపోవడమేమిటి?" అంటూ తలపైకెత్తిచూచాడు ఇవాన్. హుఁ అంటూ తలూపుకున్నాడు ముందుకీ వెనక్కీ. "ఏడిశినట్టేవుంది. కబురు చెయ్యండి. ఉఁ వెంటనే కబురు చెయ్యండి ఎలెక్ట్రిషియన్‌కి. పనాగిపోయింది. ఊఁ."

"ఏదీ పెరాక్సైడిలాయివ్వు" అని గద్దించాడు వార్యాని. దాంతో చెయ్యగలిగిందంతా చేశాడు.

ఇంతలో పిరొకోవ్ పరుగెత్తు కొచ్చాడు "యేమిటి?" అంటూ.

"షార్ట్‌సర్క్యూటై లైట్లారి పోయినై. ఇంకో ఐదు నిమిషాలు పడుతుంది రావడానికి" అన్నా రక్కడున్న వాళ్లు.

"ఐదు నిమిషాలా! ఐదు శతాబ్దాలా!" అంటూ అరవ బోయి, పక్కనేవున్న రోగినిచూచి, స్వరం చిన్నదిచేసేశాడు ఇవాన్.

"ఐదు నిమిషాల్లో యేమున్నా ఐపోవొచ్చు."

సెర్గుతోవ్ ముఖం నల్లబడింది భయంతో.

"మెదడు బిరుసెక్కుతోంది. ఉబ్బుతున్న దనుకుంటా" అన్నాడు.

"కనబడుతూనే వుంది." అన్నాడు ఇవాన్, "ఏమీ, యింకా లైట్ రాలేదే?"

సరిగ్గా అప్పుడే లైట్లుగూడా వెలిగినై. ఎలెక్ట్రిక్ పంప్ పనిచెయ్యడం ప్రారంభించింది. కాని యింతలో రోగికి మూర్ఛొచ్చింది రెండునిమిషాలపాటు.

"ఒకొంద గ్రాముల గ్లూకో జెక్కించండి" అన్నాడు ఇవాన్. "ఈ రక్తస్రావాన్ని వెంటనే ఆపెయ్యాలి మనం."

ఎట్లాగైతే, నెత్తురంతా పంప్ చేసి శుభ్రించేశారు. కాని మెదడుబ్బడంతో, బుడుపుదగ్గరికెళ్ళేదారి ముడుచుకుపోయింది; కత్తి వెళ్ళేందుకు వీల్లేకుండా పోయింది.

"నెత్తు రొత్తిడెంత?"

"రెండువందలు. స్పృహతప్పి పోయింది."

"మూసెయ్యండి! బొమికకప్పు తీసెయ్యండి. ఇంకా ఆకుంది."

ఇవాన్ ఇవానొవిచ్ తొందరతొందరగా కుట్టెయ్యడం మొదలెట్టాడు. నాలుగైదు కుట్లుగూడా వెయ్యలేదు, మళ్లీ మూర్ఛొచ్చింది రోగికి. ఆమూర్ఛ వదిలేప్పటికి నెత్తురొత్తిడి పూర్తిగా పడిపోయింది యాష్కైకి. నాడిగూడా ఆడుతున్నట్టు లేదు. శ్వాసగూడా సవ్యంగాలేదు.

"కర్పూరం! బొగ్గుపులుసుగాలి! ఆమ్లజని!" అని కేకేశాడు ఇవాన్. ఇదుగో, సెర్గుతోవ్! నువ్వు కుడుతూండు. రోగి సంగతి నేను చూసుకుంటాను." అంటూ బల్లకి రెండోవైపు కెళ్ళాడు. భయంతో గుండెదడదడ లాడింది. వెళ్ళి వంగి నెత్తురొత్తిడిచూచి, ఇంకా రోగి అంటే ఆసక్తేమీ లేనట్టు, ఆశేమీ లేనట్టు,గ్లోవ్స్ తీసి దూరంగా విసరేసి ఆపరేషన్ గదిలోంచి బయటి కెళ్ళిపోయాడు తలొంచుకుని. గదిలో వాళ్ళందరూ జాలిగా చూస్తూ నిలబడి పోయారు.

# 29

ఆపరేషన్‌చేసి తీసిన బుడుపులో కొంతభాగం పరీక్షచేసి ఆ పరీక్షాఫలితాలు చూచి, "ఆ క్లైపిస్టైలాగూ చనిపోయేదే, అందులోనూ ఆ బుడుపు కుళ్లి పాకిపోయేదిబాగా" అన్నాడు గూసేవ్.

గూసేవ్ యీసారి ఇవాన్ ఇవానోవిచ్‌తో తలపడలేదు; అతనికా ఆత్మస్థైర్యం లేకపోయింది.

ఈసారి స్కొరొబొగతోవ్ తన అధికారం చూపించా లని నిశ్చయం చేసుకున్నాడు. స్థానిక ట్రేడ్ యూనియన్ అధ్యక్షుడు డెనిస్ మాత్రం వ్యతిరేకించాడు. కాని అతన్ని లక్ష్యపెట్టే దెవరు ?

జిల్లా కార్యదర్శి సర్జెన్ ఇవాన్ కి కబురుచేశాడు. ఇవాన్ జిల్లాపార్టీ ఆఫీసు కెళ్ళాడు. "ఇక ముందెప్పుడూ యిలాంటి ఆపరేషన్లు చెయ్యడానికి వీల్లేదు" అన్నాడు కార్యదర్శి స్కొరొ బొగతోవ్; "గూసేవ్ చెప్పింది నిజమే; ఇక్కడలాంటి ప్రయో గాలు చెయ్యగూడదు."

కోపం అణచుకోలేక పోయాడు ఇవాన్.

"మీ అభిప్రాయంతో నే నేకీభవించలేక పోతున్నాను" అన్నాడు, "నాకు న్యూరోసర్జెరీలోవున్న అనుభవంతో చూస్తే చనిపోయిన కేసులు చాలా తక్కువ; ఈ కేసు దారివేరు; మెదడు వాచి పుబ్బిపోవడం జరిగింది. మీరిలా మాపనిలో జోక్యం చేసుకునేట్టయితే ప్రాంతీయపార్టీ కమిటీకి అప్పీలు చేసుకుంటాం మేం."

"ఎవరా 'మేం'?"

"సెర్గుతోవ్; పిరొకోవ్, ట్రేడ్ యూనియన్ అధ్యక్షుడు డెనిస్, నేను. మాఆపరేషన్లతో యెంతమంది బాగుపడిందీ, ఆ పట్టికలన్నీవున్నై మాదగ్గర, మీకేమన్నా అనుమానం వుంటే."

ఆవేళ సాయంత్రమల్లా న్యూరోసర్జెరీ గురించిన వ్యాసా లకోసం ఈమధ్యొచ్చిన వైద్యపత్రికలన్నీ తిరగేశాడు ఇవాన్. మెదడు వాపుకు సంబంధించిన వ్యాసాలన్నీ పదేపదేచదివాడు.

ప అవకాశాన్నీ, ఏస్వల్ప విషయాన్నీ తాను యేమరలేదని తెలుసుకున్నాడవి చదివిం తర్వాత. మాస్కో న్యూరో సర్జికల్ క్లినిక్‌లో తానుపనిజేసేప్పటి విషయాలన్నీ నెమరుకు తెచ్చుకున్నాడు. నికొలాయ్ బుర్దెంకో ఇలాంటి పరిస్థితుల్లో యేంచేసుండేవాడని ప్రశ్నించుకున్నాడు.

"మెదడువాపు నాపగలమనిషి న్యూరోసర్జరీకి కిరీటం పెట్టని రాజౌతాడు." అనన్నాడొకసారి బుర్దెంకో. నిజంగానే ఈనాడదిచాల గొప్పగడ్డుసమస్య. ఇలాంటిగడ్డుసమస్య లెన్నో పరిష్కరించారు సర్జన్లిదివర కనేకసార్లు. రక్తస్రావం, అంటుజాడ్యాలు, మత్తుమందులు, రోగక్రిములు,................ఇలాగే యింకెన్నో!

చివరికి తానుచేసిన పొరపాటు యేమీలేదనీ, తానేమీ అశ్రద్ధచేయలేదనీ నిర్ణయానికి కొచ్చాడు ఇవాన్. కాని యేదో జరిగింది తలవని తలంపుగా: ఆవిడ చనిపోయింది.

"ఇక ముందింకా స్త జాగ్రత్త పడండి" అన్నది ఓల్గా. ఈకేసిలా ఐనందుకావిడకీ విచారంగానే వుంది.

అటూ యిటూ అంగలేసుకుంటూ తిరుగుతూ ఆలోచించుకుంటున్నవాడల్లా ఒక్కసారాగి పోయాడు ఆమాటలు విని. ఒక్క సెకను సేపు ఓల్గావంక మిర్రిమిర్రి చూశాడు.

"నువ్వుగూడా అదేమాట? నీకేంతెలుసని?" అన్నాడు వచ్చేకోపం అణచుకుంటూ. "నువ్వూ, నీస్నేహితురాలు ఆపాచా కలిసియింట్లో అంట్లుతోముకోవడం మంచిది; మీకు తెలియని విషయాల్ని గురించి తెలియనట్టు దూరంగా వుండండి. తెలిసిందా?"

ఓల్గా నిండార్పులయ్యింది. "అంట్లుతోముకోవడంతప్ప గత్యంతరంలేదా నాకు?" అనడిగింది, దుఃఖం దిగమింగుతూ.

"ఇంకా గత్యంతరం యేముంది? రొట్టెల పెనాలూ, కూరలదాకలూ బ్రహ్మాండమైన పని! చాలదూ?"

ఇక వినలేకపోయింది ఓల్గా: కళ్ళంటనీళ్ళు బలబల కారిపోయినై.

ఒకక్షణంపాటు ఇవాన్‌కేమీ తోచలేదు. నెత్తిమీద పిడుగుపడ్డట్టు చూస్తూనిలబడ్డాడు. తర్వాత సిగ్గుతో తలవంచుకున్నాడు.

"క్షమించు ఓల్గా, నన్నుక్షమించు. నాగొడవలో నేనున్నాను. కోపంలో వళ్ళుతెలవలేదు. నువ్వెదురు పడేటప్పటికి నాకోపం అంతా నీమీద వెళ్ళగక్కాను. క్షమించు...."

ఈఘటన రాత్రింబగళ్ళు వెన్నంటుతూనేవుంది ఓల్గాని.

"చీదరించుకుని కుక్కపిల్లని తన్నినట్టు తన్నాడు నన్ను" అనుకుంది ఓల్గా, "నిజంగాగూడా అంతేగా! ఆయన్తో పోల్చిచూసుకుంటే నే నెన్నోవంతో?"

వర్షం యింకా పడడంలేదు. ఆకాశమంతా మబ్బులు మబ్బులుగా వుంది. గాలిమట్టుకు బాగా వీస్తోంది. గాలికి కొట్టుకుపోయే మేఘాలనీడలు రోడ్డుమీదా, చెట్లమీదా పడి తెరమీద బొమ్మల్లా కదలిపోతున్నై. నూతివైపుకి అడ్డదారిని బడివస్తున్న తావ్‌రోవ్‌కి ఓల్గా కన్పించింది. గాలికెగిరి పోబోతున్న దుస్తులూ, జుత్తూచేతుల్తో ఆపుకుంటూ దూరానున్న యిళ్ళవంకా, లోయవంకా చూస్తోంది ఓల్గా నిలబడి.

అడుగుల చప్పుడువిని తలతిప్పి చూచింది. తావ్‌రోవ్ కన్పించాడు. ఐనా ఆవిడ ముఖం కళవళికల్లో మార్పేమీ రాలేదు.

"ఎలావుంది సముద్రం యివ్వాళ?" అన్నాడు హాస్యం గా దగ్గరకొచ్చి.

"పైకెక్కడా యేమంత ప్రశాంతంగాలేదు గాని, లోపల్లోపల మట్టుకు తుకతుకలాడి పోతుంది."

"ఏం? ఏంజరిగింది?"

"ఏముందిలే, ఏమీలేదు చెప్పడానికి" అంది ఓల్గా ఒక చిన్ననవ్వునవ్వి, "టీ కప్పులో తుఫాను అంతే. నిజంగానే యేమీలేదు" అంటూ దగ్గరగావున్న రాతిమీద కూర్చుంది; కూర్చున్నది కూర్చున్నట్టే వంచిన కనులు లేపకుండా ఆలోచన లో పడిపోయింది.

అలాగే ఓపిగ్గా చూస్తూ నుంచున్నాడు తావ్‌రోవ్.

"కూర్చోండి," అన్నది అతన్నప్పుడే చూచినట్లు, "కూర్చోండి. పోనీ కాస్సేపుమీరే నా అతిధులనుకోండి. లేదూ నేనే మీ అతిధిననుకున్నా యిబ్బందిలేదు. ఈపర్వతాలన్నీ మీ సామ్రాజ్యం కిందే లెక్కగదా. మా ప్రాంతం అంతా, హాస్పిటలు వైపు కొండలన్నీ ఎక్కితిరిగాన్నేను. ఇక్కడ దృశ్యం చాలా మనోహరంగా వుంటుంది. ఎప్పుడూ యిక్కడికే రావాలని పిస్తుంది. ఒకక్షణం తీరిక దొరికినాసరే, పరుగెత్తుకొస్తా యిక్కడికి. వచ్చి యీ అందం త్రాగుతూ కూర్చుంటా. నాకు పర్వతాలెక్కడమంటే బాగా సరదా; భూమ్యాకాశాలమధ్య తేలిపోతున్నట్టుంటుంది. ఎంతచూచినాతనివితీరదు. కాని అప్పుడప్పుడూ భయం భయంగా గూడా వుంటుంది."

"పొదల మాటున అడవి పందులు కన్పించినప్పుడు కదూ!" అన్నాడు తావ్‌రోవ్ మృదువుగా.

"ఓ అలాంటి వాటికి నేనేమీ బెదరను. ఒకటి రెండుసార్లసలేమీ లేకుండానే వూహించుకున్నాను. ఒక్కసారిమాత్రం నిజంగా చూశాను అడవిపందిని. అదృష్టవశాత్తూ చాలా దూరంగావుంది, నా వెంట పడాలనే వుద్దేశమూ కలగలేదు దానికి. ఈషికారు లివ్వవలసినంత ఆనందాన్నివ్వక పోవడానికి కారణం అదికాదు."

"మరేమిటి ?"

రహస్య సందేహంతోనో, అపనమ్మకంతోనో గాని కాస్సేపాగింది ఓల్గా.

"తగిన పనిజెయ్యడం లేదని గుర్తించడమనేది చాలా బాధాకరం" అంది చివరికి.

"అలా యెందుకనుకోవాలి మీరు? అద్యతన భావిలోనే మీరు పాక శాస్త్రంలో డిగ్రీ పొందబోతున్నారని విన్నానే నేను!"

శరీరంలోవున్న ప్రతీనెత్తురుబొట్టూ ముహంలోకి పరుగెత్తినట్లయింది ఓల్గాకి; కనురెప్పలుగూడా వణకిపోయినై. తల తిప్పేసుకుంది; తా నమాయికంగా అన్న ఆ సూటిపోటి మాటలు ఆవిణ్ణెంత వేధించాయో తావ్‌రోవ్‌కి తెలియలేదు.

"ఏమీ పనిలేక చేస్తూన్న పనదని నాకూ తెలుసు" అన్నది ఓల్గా, వాళ్ళిద్దరి మధ్యా నిలబడ్డ మూడోవ్యక్తితో మాట్లాడుతున్నట్లు; "సరైన వృత్తి చేపట్టలేదని నేనెంత పశ్చాత్తాపపడుతున్నానో మీకు తెలియదు. గతంలో నేనెంత పొర

పాటు చేశానో యిప్పుడిప్పుడే అర్థమౌతోంది సూటిగానూ, సరిగ్గానూ. డాక్టర్నో, భూగర్భశాస్త్రజ్ఞానినో, మెకానికల్ ఎంజినీర్నో కావలసింది-యేంలాభం? చివరికిలా యెందుకూ పనికిరానిదాన్నై పోయాను."

"అదేమిటి, అప్పుడే మీజీవితం అంతా గడిచిపోయినట్టు మాట్లాడ్తారు?" అన్నాడు తావ్‌రోవ్, "ఇప్పుడు మాత్రం మించుకుపోయిందేముంది? మీకా ఆసక్తి వుండాలేగాని. కొత్త కొత్త ప్రాంతాల కెళ్ళడమంటే యిష్టంమీకు. ప్రతివిషయాన్నీ చక్కగా పరిశీలించగలరు. చూచినదాన్ని ఆకర్షణీయంగా వర్ణించి చెప్పగలశక్తివుంది. ఆయావిషయాల ప్రాముఖ్యాన్నీ, ప్రాశస్త్యాన్నీ యిట్టే పసిగట్టగల సామర్థ్యంవుంది. మీ మాటలు వింటూ ఎన్నిసార్లు తన్మయం అయ్యానో నాకే తెలియదు! ఇంకంతకంటే యేం కావాలి మీకు? యేదో అజ్ఞాత శక్తుంది మీలో; మిమ్మల్నదే పనిగా కలచివేస్తోందది. అందుకనే మీకీ యింటిపనులంటే అంత అసంతృప్తి. ఎందుకూ, పోనీ మీరు పత్రికలకి పంపరాదూ యేమైనా వ్రాసి. ప్రయత్నించండి, చిన్న చిన్న వ్యాసాలు వ్రాసి చూడండి."

"యేమిటి, విలేకరిలాగానా?"

"ఎందుకు చెయ్యగూడదు?" అన్నాడు ఆవిడకి తన సూచన తేలిగ్గాకనిపించిందనుకుని. "నవలలు వ్రాయాలనుంటే పోనీ అపనే చెయ్యండి" అన్నాడు కొద్దిగా యెద్దేవగా.

"ఆ ఆలోచనే తోచలేదు! ఇక్కడి కొచ్చిం తర్వాత యీదృశ్యాలూ, యిక్కడ జరిగే పనీ అదీ చూసిం తర్వాత, నిజంగానే. ఇవన్నీ యెందుకు వర్ణించి వ్రాయగూడదూ, యితరుల కందరికీ తెలియజేస్తే యెంత బావుండునూ అనిపించింది.

ఎవరూ ఆపని చెయ్యకపోవడం సిగ్గుచేటనిగూడా అనిపించింది. కాని, ఆ పని నేనే చెయ్యడమూ—ఆ ఆలోచనొస్తేనే భయంగా వుంది."

"మీరొక పుస్తకం రాయండని గాదు నేనంటున్నది" అన్నాడు తావ్‌రోవ్ మనస్ఫూర్తిగానే, "కాని, కావాలను కుంటే మాత్రంమీరుచాలా మంచివిలేకరులు మట్టుకు కాగల రనేనానమ్మకం. అదీ తేలికపనేమీగాదు. కష్టమైనపని; అవసర మైనపని, లక్షలాదిజనం చదువుకుంటూరాపత్రికలు. ఇంగ్లీషు చదవండి, ఇంగ్లీషునేర్పండి, వంటచేసిపెట్టండి, యేమైనా చెయ్యండి. కాని పత్రికలకి రాయడంమట్టుకు మానకండి. అనేకమందితో పరిచయం యేర్పడుతుంది; మీపనికొక ప్రయో జనమూ, ఆదర్శమూ అంటూ యేర్పడతా యప్పుడు."

"మీరూరికే పరిహాసం చేస్తున్నారు" అన్నది ఓల్గా; కాని ఆవిషయాన్ని గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నట్టేవుంది ఆవిడ ముహం చూస్తుంటే.

"పరిహాసం యెందుకు చేస్తాను.. మీభయం యేమిటో తెలుసనుకుంటూనాకు. మీరందులో సఫలం గాకపోతే అందరికీ తెలిసిపోతుందే అని—మీ భయం. అట్లా అనుకుంటే ముందు స్థానిక పత్రికలకి రాయబోకండి; ప్రాంతీయ పత్రికలకే వ్రాయండి. మారుపేరు పెట్టుకోండి. కావాలంటే మొట్ట మొదటి వ్యాసానికి నేనే సూచనలిస్తాను. నేను ఉకంచన్‌లో ఉన్నప్పుడక్కడ సంపాదకుడితో మాట్లాడాను. కొత్తగనుల్లో ప్రయోగించే కొత్త కొత్త పద్ధతుల్ని గురించి తెలుసుకోవాలను కుంటున్నారు వాళ్లు. మన గనుల్ని గురించి వ్రాయండి."

"నాకాపద్ధతులు లేవో తెలిస్తేగా."

"నా వెంటరండి. గనుల్లోకెళ్దాం. ఇవ్వాళొస్తాననిగూడా చెప్పాను లొగునోవ్‌తో. మా యిద్దరికి పనిగూడా వుందక్కడ. మీరంటే, వూరికే కుతూహలం కొద్దీచూచేందుకొచ్చానని చెప్పొచ్చు."

# 30

తీరావెళ్తే గనుల ఆఫీసులో లొగునోవ్ లేడు. ఒకగంట సేపక్కడ తావ్‌రోవ్ కోసమని కూర్చుని, రాకపోయేప్పటికి దగ్గర్లోనేవున్న నిర్మాణస్థలానికెళ్లాడట; అక్కడున్న ఫోర్మన్ చెప్పాడు.

"గాలీ వెల్తురూ యింకా యెక్కువగా రావడానికీ, బయటికెళ్ళడానికీ కొద్దిగా నరుకుడవసరమైతేనూ అదిచేస్తున్నాం యిప్పుడు" అన్నాడు ఫోర్మన్, "ఈ రెండు భాగాలూ కలిపెయ్యాలని గూడాచూస్తున్నాం. ముడిలోహమంతా వొక సారే పంపెయ్యడానికి వీలౌతుందప్పుడు. మీరాసంగతి లొగు నోవ్‌తో మాట్లాడండి. మా ముడి లోహం అంతా పంపించేది మీమిల్లుకే గాబట్టి మీరూ మేమూ కలిసి. మీకెంతవసరమో, మేమెంత పంపగలమో అన్నీ ఒకసారి మాట్లాడేసుకోవడం మంచిది."

"సరే" అన్నాడు తావ్‌రోవ్ శ్రద్ధగా విని, "ఒకేసారి రెండు గనులూ పనిచెయ్యడం కష్టమే. ముఖద్వారాలెంతెంత దూరం వుంటాయి?"

"షుమారొక్కొక్కటి 500 మీటర్లు*ంటై."

---

* మీటరంటే షుమారు 3అ. 3అం.

ఫోర్మన్ పేరు ప్యోతర్ మార్తైమియనోవ్; గనిలో పార్టీ కార్యదర్శి కూడాను. గడ్డం వుండడం మూలాన కార్మిక యువకులంతా అతన్ని 'తాత! తాత!' అంటూంటారు. ప్యోతర్ గూడా ఆ మారుపేరుకేమీ అభ్యంతరం చెప్పలేదు. పోనీ అంత తాతలాగా కనబడితే తాతనే పిలుచుకోనీ అని వూరుకున్నాడు; అదీగాక 'తాత!' అనేప్పటికి కొంత గౌరవంగూడా యిచ్చేసినట్టేగదా! ఐనా అప్పుడప్పుడూ అతననే మాటలూ, చేసే పరిహాసమూ, అప్పుడా కన్నుల్లో కదిలే మెరుపూ, యువతా చూస్తే ఆ యువకులకే అనుమానం కలిగేది 'యీాయన కీ తాత! అనే పేరు యేమంత కుదరడంలేదే, మనకంటే యువకుడిలాగా కనబడుతున్నాడే' అని. ఎప్పుడూ, యెవరితోనో వొకరితో, యేదో వొక విషయాన్ని గురించి మాట్లాడుతూనే వుంటాడు ఫోర్మన్ ప్యోతర్—యేంచేస్తే యీాదళం యింకా యెక్కువ వుత్పత్తి చెయ్యగలుగుతుంది; డ్రిల్లింగ్ చేసే పరికరాల్లో యింకేయేలోహాలుపయోగిస్తే పని తొందరగా జరుగుతుంది; భారతజాతీయ కాంగ్రెసు బ్రిటిష్‌వారి ముందు పెట్టిన డిమాండ్లని గాంధీజీ యెందుకెదిరించాడు; ఫ్రెంచి ప్రతినిధులూ, హిట్లరూ కలిసియెలా రాజీ పడ్డారు....ఇలాగే యింకెన్ని విషయాలో మాట్లాడేవాడు. దీనికి తోడు స్వకుటుంబ విషయాలుగూడావచ్చి చర్చించేవారతనితో కార్మికులు. తన ఆఫీసులో కూర్చుని తావ్‌రోవ్‌తో మాట్లాడుతున్నప్పుడు గూడా ఐదారుగురు కార్మికులు వచ్చేళ్లారు. అలా వచ్చినవాళ్లతో చక్కగా మాట్లాడి, ఒక్కనిమిషం గూడా వాళ్లననవసరంగా నిలబెట్టకుండా, అడిగింది చెప్పి పంపించేడు ఫోర్మన్. ఇదంతా చూస్తూంటే ఓల్గాకి ఫోర్మన్ అంటే మంచి గౌరవం కుదిరింది.

ఇంతలోనే తావ్‌రోవ్ "ఓల్గా షావ్‌లోవ్నాకి కాస్త గనీ, కార్మికుల్నీ చూపించుతారా. ఇంతవరకెప్పుడూ గని చూచెర గరు ఆవిడ. నేనెళ్ళి లొగునోవ్‌తో మాట్లాడొచ్చేలోపుగా మీరీపని కాస్తాపూర్తి చేస్తే...." అన్నాడు. ఓల్గా కృతజ్ఞతో చూచింది.

అక్కడేవున్న అరుణ పతాకాన్ని చూపుతూ, "యీ యేడీ బహుమానం పొందాం మేం" అన్నాడు ప్యోతర్, "ఇప్పుడొకేసారి నాలుగైదు మెషీన్లని పనిచేయించాలనే ప్రద్యమం ప్రారంభించాం. అంటే ఒకేమనిషి నాలుగైదు మెషీన్లు నడుపుతాడన్నమాట; అట్లాగే ఒకమనిషి వొకవైపున డ్రిల్లింగ్, రెండోవైపున పేల్చుడూ చెయ్యాలన్నమాట."

"ఐతేమరి, చాలామంది కార్మికులు మిగిలిపోతారుగదా, వాళ్ళనేంజేస్తారు?" అనడిగింది ఓల్గా, ఆఫీసులోనుంచి బయటి కొస్తూ. తనదుస్తులమీదేసుకున్న కాన్వాస్ కోటుబెల్ట్ బిగించుకుంది. ఆ డ్రెస్సు కొత్తగావేసుకున్నట్టే లేదావిడకి; రోజూ వేసుకుంటున్నట్టేవుంది.

ఆ ప్రశ్న విని, కనుబొమలుపైకెత్తాడు ఫోర్మన్ ఆశ్చర్యంగా.

"మిగిలిపోతారా? ఎందుకూ, వాళ్లూ గనిలోనే వుంటారు. రెండుగనులు కలిపి పనిజెయ్యాలనుకుంటున్నాంగా, వీళ్ళందరూ అవసరమే. అదిగాక, కొత్త కొత్త అడ్డదారులెయ్యాలి."

"చాలామంది కార్మికులు పనిజేస్తారా యిక్కడ?" అనడిగింది ఓల్గా, గనిలోపలికి తీసికెళ్లే పంజరంకోసం ఆగినప్పుడు.

ముందు? వున్నవి రెండు చేతులేనాయె. ఏమీలేదు. టెక్నిక్‌లో సుళువు కనిపెట్టాడు; దానికితోడు మనోనిబ్బరం. అంటే మనిషి మారిపోయాడన్నమాట; కొత్త మనిషైనాడన్నమాట! పత్రికల్లో యితన్ని గురించిదివరకే పడినట్టుంది. ఇంకా నేను రాయడానికేముంది?" అనుకుంది తావ్‌రో విచ్చిన సలహా గుర్తుకొచ్చి, "నేనింకేమి రాయగల్ను?"

# 31

ఓల్గాని ఫోర్మన్ కప్పగించి లొగునోవ్‌కోసం బయల్దేరాడు తావ్‌రోవ్. గనుల సర్వేయరూ, లొగునోవూ కలిసి మాట్లాడుకుంటున్నా రొక దొంతి దగ్గర రాతిమీద కూర్చుని. ఇద్దరూ స్కూలు పిల్లల్లా దొంగతనంగా సిగరెట్లు కాల్చుకుంటున్నారు, లొగునోవ్ ప్రవేశపెట్ట దలచుకున్న కొత్తపద్ధతిని పరిశీలిస్తూ.

"మా వృత్తి సమావేశం ముగిసింది" అన్నాడు లొగునోవ్, తావ్‌రోవ్ వంకొక పక్క చూపు విసిరి; ఎంతసేపు చూస్తూ కూర్చుంటామనుకున్నారు మీకోసం?"

''మధ్యలో పని తగిలింది!"

ఆ పనేమిటోతలచుకుని చిరునవ్వు నవ్వుకున్నాడు తావ్‌రోవ్.

వాళ్లతోపాటు తనూ రాతిమీద చతికిలబడ్డాడు; గనుల సర్వేయర్ చేసిన మార్పులూ కూర్పులూ చెబుతూంటే వింటూ. వింటున్నాడన్న మాటేకాని అతని మనసక్కడ లేదు. హృదయ మేదో కాంతి వెల్లువలో తేలిపోతున్నట్లుంది. చేయ

వలసిన పనిమీద లగ్నం కాకుండా, మనసు ఓల్గామీదికే పరు గెత్తుతోంది. అవిడ చూపూ, మాటలూ....అవేగుర్తు కొస్తున్నై పదేపదే. వాళ్లిద్దరూ అనేమాటల్ని వినకుండా, యేదో పరమా నందభరిత సమాధిలో కెళ్లిపోతోంది మనసు; ఓల్గానీ, జీవి తాన్నీ, గాఢంగా ప్రేమించుకుంటూ.

"ఏమిటివ్వాళ యిట్లావున్నారు? ఈలోకంలోనే వున్నట్టు లేరు?" అని లొగునోవ్ అనడం వినిపించింది.

"ఉః, యేమిటీ" అంటూ వులిక్కిపడ్డాడు తావ్‌రోవ్. అంత ముఖ్యమైన విషయాన్ని చర్చిస్తుంటే పరధ్యానంగా వున్నందుకు సిగ్గుపడి పోయాడు.

"ఇదిగో యిక్కడా మనం పనిప్రారంభించేది'' అన్నాడు లొగునోవ్, చేయి చాచి చూపుతూ. ఆచేయి చాచేతీరులోనే తెలుస్తోందా మనిషి గుణం. అనుకున్నది చేసేమనిషి. ఋజు స్వభావం వున్నమనిషి. లొగునోవ్‌ని గురించి ఓల్గా కూడా అదే చెప్పింది. 'చక్కని స్నేహితుడు, జాలిగుండె మనిషి, ఐనా మంచి నిబ్బరమూ, ఋజుస్వభావమూ వున్నమనిషి.''

"ఓల్గా చెప్పినమాట నిజమే" అనుకున్నాడు తావ్‌రోవ్ లొగునోవ్ వంకచూస్తూ. లొగునోవ్ చెప్పే మాటలమీదకంటే అతని కంఠస్వరం మీదనే లగ్నమైవుంది తావ్‌రోవ్ దృష్టి. "ఇప్పుడు నామనసులో మెదిలిన భావాల్ని చెబితే యేమం టాడో? దూషిస్తాడో? హర్షిస్తాడో?" అనుకున్నాడు.

ఈపాటికి ఓల్గా కింది గనుల్లో కెళ్ళుంటుందనే సంగతి గుర్తు కొచ్చింది. ఇంతవరకెప్పుడూ భూగర్భంలోకి వెళ్లలే దావిడ. మంచిపనే చేశాడుతను! ఒక స్త్రీని వెంటబెటుకొచ్చి,

గనిముఖం దగ్గర, ముక్కూ-మొహం తెలియని మనిషికప్పగించి వచ్చాడు. భూమి పైభాగంనుంచి కనీసం మూడువందల మీటర్లన్నా లోతుకెళ్ళాలి. ఎంతభయపడి పోతూందో పాపం. తానేమో యిక్కడ హాయిగా సూర్యరశ్మిలో కూర్చున్నాడు.

తావ్‌రోవ్ కలవర పడిపోయాడు.

"గనిలోకి దిగుదాం, పదండి!" అన్నాడు.

తీద్దామా, వొద్దా అనుకుంటూనే కాన్వాసుకోటు జేబులోకి చేయిపోనిచ్చింది ఓల్గా; అందులో తావ్‌రోవ్ యిచ్చిన కాగితమూ, పెన్సిలూవున్నై. నాలుగు డ్రిల్స్‌తోనూ ఒకేసారి పనిజేసినతని పేరేనా అడిగి వ్రాసుకుందా మనుకుంది.

అడిగి నోట్సు తీసుకునేందుకు ధైర్యం చాలలేదు. మరీ అర్థంకానప్పుడు మాత్రం ఫోర్మన్‌ని నాలుగైదు ప్రశ్నలేసింది. చుట్టూ డ్రిల్ చేసే ధ్వని, బిగ్గరగా అరవాల్సొచ్చింది. అసలు ఫోర్మన్ వెంటబడి అలా తిరిగేప్పటికే ఆవిడ పనంతా ఐపోయినట్లయింది. నేలమీద పరచిన చెక్కలమీద జారిపడినంత పనైంది; పోటీపెట్టిన కర్రలు నెత్తికి తగిలి బొప్పెలుగూడా కట్టినై; నిటారుగా నిలబెట్టిన నిచ్చెనల్మీదెక్కేప్పటికి సగం ప్రాణం కొట్టుకుపోయింది. కొత్తగావచ్చిన వాళ్లకి మేంచేసే పనింత కష్టమైందని చెప్పడానికి చేస్తున్నాడేమో ఫోర్మన్ యిదంతా అనిగూడా అనిపించింది. కాని తర్వాత ఒక్కొక్క చోట నిలబడి ప్రతి విషయమూ విడమర్చి చెబ్తున్న ప్యోతర్‌సి చూచి, అతనికాగొడవలేదనీ, తనగనంతా చూపించాలనే ఉత్సాహంలో యిదంతా తనకింత కొత్తకొత్తగానూ కష్టం

గానూ వుండొచ్చుననే ఆలోచనే అతనికొచ్చివుండదనీ అనుకుంది ఓల్గా. అందులో మంచి వయసులో ఆరోగ్యంగావుంది; అలాంటప్పుడు తనకంటే ముందే ఆవిడ అలసిపోతుందని ఎలా అనుకుంటాడు ఫోర్మన్. అంతా చూపించెయ్యాలనే ప్రత్సాహంతో బాగా మారుమూలల్లోకి నీళ్ళోడికలు కడుతూన్న యిరుకు సందుల్లోకి గూడా తీసుకెళ్ళాడు.

అంతా ఐపోయి, గనిపైకెకొచ్చింతర్వాత చూసాడు ఫోర్మన్ ఆవిడవంక. గుడ్డలన్నీ మురికితో నల్లబడిపోయినై. ముహమంతా మురికి మరకలు, చెమటచారికలు. అప్పుడు తెలిసిందతనికి ఆవిడకెంత కష్టం కలిగిందీ.

"క్షమించాలినన్ను, చాలా కష్టపెట్టినట్టున్నాను" అన్నాడు ఫోర్మన్, "యేదో వొకటి రెండు డ్రిఫ్టులు చూపించి తీసుకొస్తే సరిపోయేదనుకుంటా."

"కాదు, కాదు. అట్లాఐతే నాకిప్పుడు తెలిసినన్ని విషయాలు తెలిసేవికాదు. మంచిపనే చేశారుమీరు. నేనూ రాద్దామనుకుంటున్నాను....అదే....యిక్కడ యీగనిలో పనిచేసే వారి ధైర్యోత్సాహాల్ని గురించి పత్రికలకి రాద్దామనుంది."

ఫోర్మన్ పలువరుస తెల్లగా మెరిసింది నల్లని గడ్డంలోంచి.

"తప్పకుండా రాయండి. మావాళ్ళు బాగా శ్రమపడుతున్నారా, కొంత ప్రచారంగూడావుంటే యింకా వుషారుగా వుంటుంది. అందరూ బంగారంలాంటివాళ్లు. కాని దయచేసి, నన్ను గురించి మాత్రం రాయకండి."

"యేం, ఎందుకని?"

"ఆఁ, యేమీలేదు," అంటూ భుజా లెగరేశాడు ఫోర్మన్, యెవరో వీపుమీద నుంచిం తిసుక పోసినట్టు; "ఇదివర కొకసా రిట్లాగే ఒకాయన నన్ను గురించి రాశాడు. అప్పటి కింకా డ్రిల్సు నడిపే మనిషినే నేను. చాలా గొప్పవాణ్ణనీ. నా యెర్రటి జుట్టూ, నీలికళ్లూ చాలా అందంగా వుంటాయనీ యేమిటేమిటో రాశాడు. తర్వాత, చాలాకాలందాకా ఆడిం చేవారు నన్ను నాతో పనిజేసేవాళ్ళు. నా కెఱ్ఱ జుట్టెక్కడిది, మీకూ కనబడుతూనే వుందిగా లేదని!"

"మరి మిగతావాళ్ళని గురిం చలాంటివిరాస్తే వూరు కుంటారా మీరు?"

"ఎందుకూరుకుంటాను. ఐనా మీరట్లా రాయరని తెలు సునాకు. మీరింకా బాగారాస్తారు; నాకు తెలుసు. అదికాదు; ఇందాకన్నది వూరికే అన్నాను. అసలు నాకు నన్నుగురించే చదువుకోవాలంటే యిష్టం వుండదు. మర్చిపోయాను. ఇందా కన్నానే ఉమ్మడి మురుగు కాలవని గురించి; అదికూడా రాయ బాకండి. ఇంకా దాన్ని గురించి అభిప్రాయ భేదాలున్నై."

తావ్‌రోవ్, లొగునోవ్, గనిసర్వేయరూ కలిసొచ్చారు ఫోర్మన్, ఓల్గాలు నిలుచునున్న చోటికి. ఓల్గానిచూస్తే ఆశ్చర్యం వేసింది తావ్‌రోవ్‌కి. ఆ కాన్వాస్ కోటూ, ఆగనిటోపీ; గుర్తించ డానికి వీల్లేకుండావుంది. మనిషి హుషారుగానే వుండడంచూచి సంతోషించాడు.

"మీకోసమని బయల్దేరేం మేం; మాకంటే ముందే వచ్చేశారు మీరు." అన్నాడు.

"మేం చూడందంటూ లేదు. అన్నీ చూసేశాం" అంది ఓల్గా, లొగునోవ్‌తో "గనులంటే యింత హుషారుగా వుంటుందని యెప్పుడూ అనుకోలేదు."

"ఐతే, మీ కిదంతా ఆనందంగానే వున్నదన్న మాట." అన్నాడు లొగునోవ్ సంతృప్తిగా.

"చాలా, చాలాబాగాఆనందించాను. మొట్టమొదటంతా యేదో కలలో చూచిన దివ్యభూమిలా వుంటుంది; రాళ్ళల్లో తొలిచిన ముఖద్వారాలూ, పెద్దపెద్ద దుంగల్తోకట్టిన దారులూ అవీనీ. చేతిలో లాంతరు పట్టుకుని, సగానికివంగి గబగబా నడుస్తాం; వున్నట్టుండి చీకటంతా మాయమౌతుంది, వెలుగుదారి కన్పిస్తుంది. నిటారుగా నిలబడి తలెత్తి పైకిచూస్తాం; పైన నీలిరంగు ఆకాశం; అక్కడక్కడా తాపడం చేసిన నక్షత్రాల మినుకు మినుకు. తీరాచూస్తే, అదాకాశంకాదు; మీటర్ల తరబడి పరుచుకున్న రాతి దొంతర. మనం వున్నది యెక్కడో భూగర్భంలో; బంగారపు గనిలో. ఇంతలో ఒక వెడల్పాటి మార్గం కన్పిస్తుంది. కావలసినన్ని కార్లక్కడ ముడిబంగారాన్ని పట్టుకుపోవడానికి. అంతా పెద్ద పారిశ్రామిక కేంద్రంలాగా, వ్యాపార కూడలిలాగా వుంటుంది. ఇంకా నడిస్తే గని కార్మికులు కన్పిస్తారు రాళ్లు తొలుస్తూ. గుండె దడదడలాడుతుంది యుద్ధరంగాన్ని సమీపిస్తున్నట్టు. మరతుపాకుల్లాగా ఘోష పెడుతూంటై యంత్రాలు. దూరాన యెక్కడో పేల్పుళ్ళ ధ్వనులు వెన్ను నీరు గారినట్లౌతుందా రణరంగాన్ని చూస్తే— జీవితాన్ని మరింతసుఖవంతంచేసే ఆ రణరంగాన్ని తలుచుకుంటేనే చాలు, వొళ్లు పులకరిస్తుంది."

"నిజమే" అన్నాడు లొగునోవ్; ఓల్గా వుత్సాహం చూస్తే అతనికీ నూతనోత్సాహం కలిగింది. "నవజీవన నిర్మాణాని కీబంగారం చాలా వుపకరిస్తుంది."

"ఈగని కార్మికులు! వాళ్ళ వుత్సాహం, వాళ్ళ ధైర్యం, వాళ్ల కన్నుల్లో కన్పించే కాంతి! ప్రతీ కార్మికుడి హృదయంలోనూ ఒక్కో సూర్యుడు వెలుగుతున్నాడనిపిస్తుంది," అంది ఓల్గా మళ్లీ.

ఆవిడ మాటలు వింటూంటే, ఆ ఆనందోద్రేకం చూస్తూంటే తావ్‌రోవ్ కంతులేని సంతోషం కలిగింది.

"నేననుకున్నది నైజే. విషయాల్ని చాలా సూక్ష్మంగా పరిశీలించగలదు; చక్కగా చెప్పగలదు." అనుకున్నాడు.

# 32

ఇంటి కొచ్చిం తర్వాత ఓల్గా దుస్తులు మార్చుకుని, తలదువ్వుకుని, డెస్క్ దగ్గర కూర్చుంది.

ఇవాన్ ఇవానొవిచ్ యింటికొచ్చి వెళ్ళినట్టున్నాడు; వంటింట్లో థెర్మాస్ లమీద మూతలు తీసినట్టు కనపడుతోంది. పాత్రలు కొన్ని ఖాళీగా పడున్నై, ఎంగిలిగా. అంటే వచ్చి, భోంచేసి, మళ్ళీ పాఠాలు చెప్పేందుకు వెళ్ళాడన్నమాట; సందేహంలేదు. ఇవ్వాళాయన యింటివగ్గర లేకపోవడమే మెరుగైందనుకుంది ఓల్గా. ఇలా అనుకోవడాని కిదే మొదలు. కూర్చుని, ఆలోచనలన్నీ తాపీగా నెమరువేసుకుని, తన భావాలన్నీ కాగితంమీద పెట్టాలనుకుంది. ఆ వ్రాసేది కథో, వ్యాసమో, పత్రిక్కిపంపే చిన్న వార్తో—యేమీ నిర్ధారణ చేసుకో

లేదు. తన భావాల్ని తరులకి తెలియ జెయ్యాలి; అంతే. చిన్నప్పుడు స్కూల్లో వ్రాయమన్న విషయాన్ని గురించి వ్రాసిన కాంపోజిషన్లు గుర్తుకొచ్చినై. తాను పెరిగి పెద్దదై సాహితీ ప్రపంచంలో కడుగు పెడుతుందని ఎవ్వరూ అనలేదప్పుడు. తర్వాతింత కాలం గడిచింది. ఒక్కసెకను సేపు ఓల్గాకి సందేహం కలిగింది మళ్ళీ; ఉత్సాహం చల్లార బోతున్నట్లనిపించింది. ఇంతలో ఫోర్మన్ అన్న మాటలు గుర్తుకొచ్చినై. మీరింకా బాగా రాస్తారు; నాకు తెలుసు. అన్నాడు. నిజమే. ఎందుకు రాయగూడదుతను ? వాళ్ళ మధ్య నివశిస్తోంది; వాళ్లు చేసే పని కళ్లారాచూస్తోంది. చూసింది వ్రాయలేదా ? తప్పకుండా వ్రాయగలనని గట్టిగా అనుకుని కలంతీసి సిరాబుడ్డిలో ముంచింది. మొట్టమొదటి పంక్తి వ్రాసేలోగా, ఆకలం చాలాసార్లు ఆరిపోయింది.

గనుల్లో చాలా చీకటిగా వుంటుందనీ, భయంకరంగా వుంటుందనీ అంటారు. అక్కడక్కడా చీకటిగా వుండే మాటా నిజమే; మధ్యమధ్య ఎత్తు తక్కువగా, నీళ్లూరుతూనూ వుంటై. (అనుకుంటూ తలక్కట్టిన బొబ్బలు తడిమి చూచుకుంది ఓల్గా.) కాని తానేమీ భయపడలేదు. మరీ వొంటరిగా ఆ భూగర్భంలో దారి తప్పి పోయినప్పుడేమన్నా భయంవేస్తే వెయ్యొచ్చు. కాని ఫోర్మన్ పక్కనున్నాడు. చుట్టూ కార్మికులు పని జేస్తున్నారు. అక్కడ జరిగే పని అంతరార్థం తెలుసుకోవాలంటే తెలియనివన్నీ వాళ్ళనడిగి తెలుసుకోవాలి; అంటే ధ్యాన్నం అంతా అటే వుండాలి. ఇకలాంటప్పుడు భయాన్ని గురించాలోచించే అవకాశం మాత్రం యేదీ !

ఈ ఆలోచనలన్నీ మసకమసకగా కలిగినై ఓల్గాకి. కాని ఆవిడ చూచిందంతా కళ్ళకక్కట్టినట్టు కన్పించింది. డ్రిఫ్ట్సులో వున్న విద్యుద్దీపాలు, బళ్ళల్లోకెత్తే తెల్లని ముడిబంగారం, దడదడలాడుతూ పనిజేసే యంత్రాలు, గనులరాతి ప్రదేశంలోకి చొచ్చుకు పోయే డ్రిల్ మెషీన్లూ, బెజ్జాల్లో పెట్టిన మందుకు నిప్పంటించే ఆ కార్మికుడూ....! అంతా యింకా చూస్తున్నట్టే వుంది.

వ్రాయడం ప్రారంభించింది ఓల్గా: పర్వత హృదయాల్లోకి ఛేదించుకుని చొచ్చుకు పోతున్నాడు మానవుడు, చిరకాలం నుంచక్కడ యెవరి కంటాబడకుండా దాగుకునున్న సంపదని సంపాదించేందుకు. ఈ సంపదని, ఈ బంగారాన్ని తవ్వి బయటికి తీస్తున్నది తన స్వార్థంకోసమనీ గాదు; తనకీ వుద్యోగమిచ్చిన యజమాని స్వార్థంకోసమూ కాదు; తనదేశం నాలుగు చెరగులా పూలవనాలు పెంపొందాలని, బాటలు వేయాలని, ప్రజలకందరికీ తిండీ, బట్టా, ఆనందమూ కలగాలని. నాలుగు డ్రిల్సుతోనూ ఒకేసారి పనిజేసే కార్మికుడికి తానెందుకలా సాహసించి చేస్తున్నాడో స్పష్టంగా తెలుసు: భవిష్యత్తులోకి మనం చేసే పురోగమనాన్నతను ద్విగుణీకృతం చేస్తున్నాడు. మందుప్రేల్చేందుకు నిప్పుటించబోయే ముందీ ఆలోచన అతనికెంతో వుత్తేజాన్నిస్తుందనడంలో సందేహంలేదు.

"అదిగో, అతనక్కడే నిలబడివున్నాడు ఫాలభాగాన పట్టిన స్వేదాన్ని తుడుచుకుంటూ, లెక్కపెట్టుకుంటున్నాడు:

"ఒకటి—రెండు—మూడు—"

"ఇంకో ప్రాంతంలో పనిచేస్తున్న కార్మికుడింకొక బెజ్జంలో మందు పెట్టి నిప్పంటించుతున్నాడు."

"రాత్రింబవళ్ళు జరుగుతున్నదిదే. నాలుగు షిఫ్టులేసుకుని పనిజేస్తున్నారు. రోజుకొక్కొక్క కార్మికుడూ ఆరు గంటలు పనిజేస్తాడు. ఔనుమరి, తామే భూగర్భాన్ని తొలుస్తున్నారో, ఆభూమి మీద వారు నివశించేందుకామాత్రం అవకాశం కలగ జెయ్యాలి; తప్పదు."

ఓల్గా వ్యాసం పూర్తి కావచ్చింది. ఇంతలో ఎవరో గదిలో ప్రవేశించినట్టు వినవచ్చింది; కాస్సేపట్లో ఇవాన్ ఇవానొవిచ్ చేయి ఓల్గా భుజాన్ని తాకింది. ఆశ్చర్యంతో ఉలిక్కిపడింది. ఒక్క క్షణం సేపు భర్త మొహంలోకి చూసింది మెరిసే కళ్ళతో. సుందరస్వప్నంలోంచి మేలుకొన్నట్లున్నై ఆవిడ కనులు. కూతురు చనిపోయింతర్వాత, ఓల్గా యింత యిదిగా వుండడం యింతవరకెప్పుడూ చూడలేదు.

"ఏంచేస్తున్నా ?" అనడిగాడు చెక్కిలి ముద్దాడి. "నేనింటాకింటి కొచ్చేప్పటికి ఎవ్వరూలేరు. ఎవరికీ వ్రాస్తున్నావ్ ?"

డెస్కుమీద చిందరవందరగా పడున్న కాగితాలు చదవబోయాడు ఇవాన్ ముందుకువంగి. బిడియపడి, వెంటనే రెండు చేతుల్తోనూ కప్పేసిందా కాగితాలు ఓల్గా. కాని ఆయన మొహం చూచి, మళ్లీ వెంటనే తీసేసింది చేతులు.

"మీరు నమ్మరుగాని——" అంటూ రెండు చేతుల్తోనూ ఆయన భుజాల్ని పెనవైచుకుని కనుల్లోకి చూస్తూ "నేను విలేఖరిని కాదలచుకున్నా; పత్రికలకి రాస్తున్నా" అంది.

కనుబొమ్మలు పైకెత్తాడు ఇవాన్ ఆశ్చర్యంగా.

"ఇదెప్పట్నుంచి !" అన్నాడు. ఇంతలో నుదుటిమీద బొప్పిచూచి, "ఇదేమిటి ? ఎవరుకొట్టారు ?" అనడిగాడు.

"నేనే కొట్టుకున్నాను."

"చూశావా, ఇంకా మొట్టమొదటి వ్యాసం పూర్తైనా కాలేదు; అప్పుడే దెబ్బలుగూడా కొట్టుకుంటున్నావ్" అన్నాడు ప్రేమగా గేలిచేస్తూ. బొప్పి కట్టినచోట ముద్దుపెట్టుకుని, "పత్రికలకి వ్రాయడం అంత తేలిక పననుకుంటున్నావా ?" అనడిగాడు.

ఓల్గాకి కోపం వచ్చింది "ఏమిటీ ? ఎప్పుడూ పసిపిల్లల్లా మాట్లాడ్తాడు నాతో ?" అనుకుంది. పైకి, "నేను తేలికపని కావాలనుకోవడం లేదుగదా" అంది.

ఆపిడ మాటలు వినిపించుకున్నట్టే లేదు ఇవాన్. "రచన లో ఆరితేరాలంటే, ఆ తెలివితేటలికి తోడు గట్టి శ్రమగూడా చెయ్యాలి. లేకుంటే అదొక బొహీమియన్ జీవితం ఐపో తుంది. ఇప్పటికీ మనలో బాగా పాతబడిపోయిన మనుషులూ వున్నారు; బూజుపట్టిన భావాలు వున్నై. గూసేవ్‌నే తీసుకో వుదాహరణకి— ప్రాంతీయ కమిటీకి వ్రాసే లేఖమీద సంతకం చెయ్యను పొమ్మన్నాడు; అట్లా సంతకం పెడ్తే మనందరం కలిసి జిల్లా కమిటీమీద ముఠా గట్టినట్టౌతుందన్నాడు."

"మళ్లీ ప్రారంభమైంది సొంత గొడవ; ఇకాగడు" అను కుంది ఓల్గా.

"రచయితని కావాలనిగాదు నా వుద్దేశం" అందావిడ, "యేదో వొకపని జెయ్యక తప్పదుగదా. ఆ పని నాకు తగిందే ననుకుంటే రాత్రింబవళ్లు చెయ్యమన్నా చేస్తాను."

"ఆఁ, అదీ పాయింటు—ఏది తగిందో తెలుసోకో గల గాలి." అన్నాడు ఇవాన్, "ఏదో సామాన్యపు పనైతే, తొంద

రగానే తెలుస్తుంది అది తగిన పనైందీ, కానిదీనీ. కాని యీ కళారంగాల్లో, మరీ యీ సాహితీరంగంలో, చేతనైనా కాక పోయినా కొట్టుమిట్టాడుతూ పడుండేవాళ్లు చాలా మంది న్నారు! వీటిల్లో యితరుల్నీ, నిన్ను నువ్వూగూడా మోసం చేసుకోవడం తేలిక. మనసువిప్పి మాటాడుతున్నాను నిర్మొహ మాటంగా నువ్వూరికే కోపగించుకోవనే వుద్దేశంతో. నే నిదంతా చెప్పేది నీ మంచికోసమే. ఓల్గా! సరే! ఏం వ్రాశావో చదువు, చూదాం."

ఆవిడ ప్రక్కనే కూర్చుని, టేబుల్ మీద చేతు లాన్చు కున్నాడు వినేందుకు సిద్ధంగా. అంత నిరుత్సాహంగా మాట్లా డింతర్వాత, తాను వ్రాసింది చదివి వినిపించడమంటే కష్టం గానే వుంది ఓల్గాకి. కాని ఆయనొక ఛాలెంజ్ విసిరాడు; తనిప్పుడు వెనక్కి జంకగూడదు. అదీగాక తమ రచనలు చదివి వినిపించాలనే కోరిక రచయితల్లో వుండడం చాలా సహజం; ఓల్గాకిగూడా, తనకి తెలియకుండానే, వుందా కోరిక.

"ఇంకా యీ వ్యాసం పూర్తికాలేదనుకోండి. ఇంకా సాఫుగూడా రాయలేదు" అంది గాని ముందువెనక లాడుతూ; చదవడం మొదలెట్టింది.

చాలా శ్రద్ధగా విన్నాడాయన. చదువుతూన్న కొద్దీ, నల్లబడడం ప్రారంభించిందాయన మొహం.

చదవడం పూర్తైపోయింది; వెంటనే ఆయన తన అభి ప్రాయం చెప్పలేదు. కనులు వాల్చి యేదో కాగితం పట్టుకు మడతలు పెడుతూ కూర్చుంది ఓల్గా, యేమీ తోచక. తన వ్యాసాన్ని గురించి అభిప్రాయం వినేందుకింత తహతహ వుం టుందని అనుకోలే దిదివరకు. ఆయనకా ఆవిణ్ణి బాధపెట్టడం

యిష్టంలేదు; మాట్లాడకుండా కూర్చున్నాడు. అందులోనూ యేదో వొక పనిచెయ్యాలని సతమతమౌతూంది ఓల్గా చాలా కాలంనుంచి; ఇప్పుడావిడ వ్రాసి తీసుకొచ్చినది బాగాలేదని చెప్పడం కష్టమే అనిపించింది ఇవాన్‌కి.

"ఫర్వాలేదు." అన్నాడు బలవంతాన తెచ్చిపెట్టుకున్న నవ్వుతో, "ఇంకా స్త అనుభవం సంపాదిస్తే గాడిలో పడతావు."

"అట్లా గాదు, నిజంచెప్పండి. నాకు మెరమెచ్చులేమీ చెప్పొద్దు."

మళ్లీ అనుకోకుండానే వెనకాడాడు తన నిజమైన వుద్దేశం చెప్పడానికి.

"ఫర్వాలేదు, ఓల్గా" అన్నాడు మళ్లీ.

కాస్సేపిద్దరూ మాట్లాడలేదు. చాలా ఇరకాటంగా వుందా నిశ్శబ్దం.

"ఏం ఫర్వాలేదు." అంటూ గొణిగాడు ఇవాన్. "నిజానికందులో మంచివిషయాలే వున్నై" అని సంతోషించాడు అటు పొగడకుండానూ యిటు తెగడకుండానూ అనగలిగినందుకు. కాని ఓల్గా మొహం చూస్తే సిగ్గేసిందాయనకి; అంత బాధాకరంగా వుంది.

భార్యకిదగ్గరగా జరిగి భుజాలు నిమిరాడు.

"ఏమీ అనుకోవద్దు, ఓల్గా. నాకావ్యాసం బావుండలేదు. విషయంమీదకంటే భాషమీ దెక్కువ మోజు పడ్డట్టుంది. 'మానవుడు పర్వత హృదయాల్లోకి ఛేదించుకుని చొచ్చుకు పోతున్నాడు' లాంటి వాక్యాలు యెవరంటారు? వ్యాస మంతా అంతే: జటిలమైన భాష; లేనిపోని వూహావర్ణన.

ఇలాంటిపనికి నువ్వు పనికొస్తావనుకోను; నేనుమట్టుకు నువ్వీ పనే చెయ్యడం మంచిదని సలహా యివ్వలేను."

# 33

మర్నాడుదయం మేల్కొనేప్పటికి మనసంతా బరువు బరువుగా వుంది ఓల్గాకి. ఆ ప్రప్రథమ వ్యాసం—బహుశా అదే చివరిదిగూడా ఔతుందేమో—వ్రాసినప్పుడు కలిగిన మధురానుభూతి లేదిప్పుడు. ఆ జ్ఞాపకమూ, పశ్చాత్తాపమూ మట్టుకు మిగిలినై. నిష్కపటంగా భర్త అన్నమాటలు గాయంమీద చల్లిన కారంలా వున్నై. ఇవి చాలవన్నట్టు గనిలో ఫోర్మన్‌తో చెప్పింది వ్యాసం వ్రాయబోతున్నానని; సిగ్గుచేటు.

"ఎట్లాగైతేనేం, రాశానుగదా అనుకుంది గోడవైపుకి తిరిగి కళ్లుమూసుకుంటూ; నిద్రవస్తుందనికాదు, నిద్రెలాగూ వచ్చేట్టులేదు. ఇవాన్ లేచి తిరుగుతున్నాడు గదిలో. ఆఫీసు కెళ్ళేందుకు సిద్ధమౌతున్నాడు. వెళ్ళిపోయేముందు వొచ్చి ముద్దుపెట్టుకున్నాడు ఎప్పటి లాగానే. ఐనా కళ్ళు తెరవలేదు ఓల్గా; నిద్రపోతున్నట్టు నటిస్తూ పడుకుందలాగే.

ఆవేళ వుదయమంతా అలాగేవుందిఓల్గా నిరుత్సాహంగా. భోజనాల సమయం దగ్గర పడేప్పటికి, బయటి కెళ్ళిపోదామనుకుంది. ఆ క్రిందటినాడు భర్తన్న మాటలు గుర్తుకొస్తే చాలు కారం పూసుకున్న ట్లౌతోంది. ఆవిడంత తొందరగా మరచిపోవడం కష్టం. ఆయనంటే వేరు; బోలెడు పనులుంటై; ఆ పనుల్లోబడితే అన్నీ మరచిపోతాడు. ఈసారి మళ్లీ ఆయనా సంగతెత్తితేనా, హాస్యంగానైనా సరే ఏమన్నా అంటేనా....

"చచ్చినా వూరుకోను; నావల్లిక కాదు" అనుకుంది ఓల్గా, భోజనాల బల్లమీద అన్నీ సర్దుతూ; "వచ్చి వొంటరిగానే తిననీ."

ఇవాన్ ఆఫీసుకెళ్ళి ఒకచీటీ వ్రాసిచ్చింది భోజనానికి తాను రాననీ తనకోసం యెదురు చూడవద్దనీనీ. ఇంటికెళ్లి తుపాను బూట్లేసుకుని గుమ్మందాకా వచ్చింది. మళ్లీ వెనక్కి తిరిగెళ్లి వ్రాసిన వ్యాసం తీసుకుని జాకెట్ జేబులో పెట్టుకుని బయల్దేరింది.

"ఇంకోకసారి చదివి, తర్వాత చింపెయ్యొచ్చులే" అనుకుంది దారిలో.

చల్లగా వీస్తోందిగాలి. చెట్లకొమ్మలటూ యిటూ కదుల్తున్నై ఆగాలికి. ఐనా ఉక్కబోస్తోంది. పైన ఆకాశంమీద దూది పింజల్లా తెల్లమబ్బులు తేలిపోతున్నై.

"తుపానొచ్చేట్టుందే" అనుకుంది ఓల్గా. "యుద్ధం ప్రారంభంకాక ముందున్న యుద్ధభూమిలా వుందాకాశం. కానీ ప్రాంతాల్లో తుపానంటూరాదు. నేను చూడలేదు మరి. మబ్బులెంత దట్టంగా పట్టినా తుపానురాదు; వస్తే వర్షం వొస్తుందంతే."

గాలిలో తేలిపోతున్నంత తేలిగ్గా యెక్కిళ్లింది కొండల మీదికి. బాగా యెత్తయిన ప్రదేశానికి చేరుకుంది. అంతా బిక్కుబిక్కు మంటోంది. ఎటుచూచినా అడవి. భూమి ఆకాశం కలిసేచోట పర్వతశిఖరాలు కన్పిస్తున్నాయెత్తుగా నీలిముసుగు కప్పుకుని. అడవిజంతువులు నడచేదారి తెల్లగా గీతగీసినట్టు కన్పిస్తోంది.

ఒక బల్లచెక్కలాంటి రాతిమీద కూర్చుంది ఓల్గా రెండు నిమిషాలపాటు నిశ్శబ్దంగా. గాలి చచ్చిపోయింది.

"నిజంగానే యెలా రాయాలో తెలియదనుకుంటా నాకు" అన్నది ఓల్గా ఆనిశ్శబ్దాన్ని చెదరగొడుతున్నట్టు. "సూక్తులుచెప్పి నట్టుందనడంలో గూడా సత్యంవుంది. ఎట్లా రాస్తే బావుంటుందో సలహా చెప్పడేఁ ఆయన."

జేబులోంచి కాగితాలకట్ట బయటికి తీసింది. వ్రాసిం దంతా బిగ్గరగా చదివింది. ఎంతో •వుల్లాసంగా వుందదలా చదువుతూంటే. ఈసారి యింకా బాగా కళ్లకు కట్టినట్టు రాయ గలనేమో ననిపించింది.

ఆకాగితాలలాగే చేత్తోపట్టుకొని నలిపేసింది పరాకుగా: నలుగుతూన్న శబ్దంవిని వులిక్కిపడింది. విరిగిన పావురం రెక్కల్లావున్నై ఆ నలిగిపోయిన కాగితాలు. ఈ ప్రయత్నం విఫలమైతే మాత్రమేఁ! ఇది ప్రథమ ప్రయత్నమేగా. చక్కగా కుదిరేవరకూ, శ్రమపడి రాస్తూవుంటేసరి. గనుల్లోకింకొక సారెళ్లి యింకో వ్యాసం రాస్తేసరి.

నలిగిన కాగితాలన్నీ మోకాలుమీదపెట్టి నిమిరి తిన్నగాచేసి, తీసిజేబులో పెట్టుకుంది మళ్ళీ. లేచి నిలబడింది. ఆకాశమూ, బంగారు సూర్యకాంతీ నీడలు చూసుకున్నై ఆవిడ కన్నుల్లో; వాటితోపాటు అపూర్వ మనోనిశ్చయంగూడా ప్రతిబింబించింది.

వర్షం వొచ్చేటప్పటికి పావాగారి యింటి దగ్గర దగ్గర కెళ్ళిపోయింది ఓల్గా. తుఫానీసారీరాలేదు. పర్వతాల మీదుగా పాకివచ్చి ఆకాశం అంతా కప్పేసినై తెల్లతెల్లటి మబ్బులు. కుండపోత పోసినట్టు వర్షం పడింది గబాగబా తెల్లతెల్లగా.

పరిసర ప్రాంతమంతా వాకచే ధ్వని; వర్షపుధ్వని. చుట్టు ప్రక్కలున్న వాళ్లంతా యేది దగ్గరుంటే దానికిందికి పరుగెత్తారు. ఓల్గా పావాగారింటికి పరుగెత్తింది. అప్పటికే దుస్తులు సగం తడిసినై; తల పూర్తిగా తడిసిపోయింది.

కాన్సేపింటి వరండాలో నిలబడింది మీదపడిన వర్షపునీరు విదిలించుకుంటూ. ఇంకా వర్షం దుమ్ము రేగ్గొడుతూనేవుంది.

ఇంతలో కిటికీతలుపు తెరుచుకుంది. పావా మాట్లాడుతోంది.

"అబ్బ, యేంగాలి! ఎందుకనోగాని యిక్కడెప్పుడూ గాలివానరాదు సాధారణంగా; బ్రతికిపోయాం. అదిగూడా వస్తే చచ్చిపోయేవాళ్లం. మెరుపులంటే తగని భయం నాకు. మీకు?"

"భయమెందుకూ?" అన్నాడు తావ్‌రోవ్, "కాకపోతే గనుల దగ్గరున్న విద్యుత్సరఫరా కేంద్రం యేమౌతుందోనని ఆందోళన మాత్రం పడతా"

"ఎప్పుడూ మీపని గొడవే మీకు!" అంది పావా పెద్దగా నిట్టూరుస్తూ.

"లేకపోతే. నీలాగే నన్నూ యీ యింట్లో తలుపులికీ, కిటికీలకీ తెరలు కట్టుకుని చీకట్లో, నాలుగ్గోడల మధ్యా, కూర్చోమంటావా? అదేం లాభం?"

"ఐతే మాత్రమేం? బయట తుపాను రేగుతూంటే, లోపల హుషారైన మనుషుల్తో కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ హాయిగా కాలం వెళ్ళబుచ్చొచ్చు" అన్నది పావా రెచ్చగొడుతున్నట్లు.

"ఎప్పుడూ మగవాళ్ళని రెచ్చగొడుతూండడమేలాగుంది యీావిడ పని!" అనుకుంది ఓల్గా, నవ్వుకుంటూ. ఇకక్కణ్ణుంచి బయల్దేరదా మనుకుంది.

"చీకటి మూలలు వెదికేరకం కాదు నేను" అన్నాడు తావ్‌రోవ్.

"హుషారుగా జవాబు చెప్పడంగూడా చేతగాదు మీకు" అంది పావా. అంటూనే కిటికీలోంచి బయటికి చూచింది. ఓల్గా కన్పించింది. "మీరెట్లా వచ్చా రిక్కడికి? రండి, రండి లోపలికి రండి!" అని పిలిచింది.

తనని గనిలోకి తీసుకెళ్ళిందీ, వ్యాసం వ్రాయమనీ చెప్పింది తావ్‌రోవ్. అతనిప్పుడీ యింట్లోవున్నాడు. తానింత వరకూ చేతులు కట్టు కూర్చోలేదనీ, చేతనైన పని చేసిందనీ తెలియాలతనికి. అందుకని, పావా ఆహ్వానించడమే తడవుగా లోపలి కెళ్ళింది ఓల్గా.

లోపలి కెళ్ళి 'హెలో' అంటూనే తనసంగతి చెప్పేసింది. "ఆ వ్యాసం వ్రాసేశాను. కాని యెంత ప్రయత్నించినా సరిగ్గా కుదరలేదు."

"సరిగ్గా కుదరలేదని యెందుకనుకుంటున్నారు" అనడిగాడు తావ్‌రోవ్. ఆవిడవంకే చూస్తూ.

"ఎందుకనా........" ఇవాన్ అభిప్రాయమని చెప్పడానికిష్టంలేక పోయింది. "ఏమో మరి, నాకలా అనిపించింది."

"ఏమిటీ వ్రాసింది, యెవరికీ?" అని ఆదుర్దాగాఅడిగింది పావా.

"పత్రికలకి, రాద్దామనుకున్నాగాని, అదేంకుదరలేదు."

ఓల్గా దగ్గర కాగితాలు తీసుకుని దూరంగా వెళ్ళాడు తావ్‌రోవ్ చదవడానికి.

"నాకు రచయితలంటే భలే అసూయ. ఏమీలేదు, వాళ్ల లాగా నేనూ రాయలేనే అని" అంది చిలక్కిమల్లే పావా. "వాళ్లిష్టం వచ్చినప్పుడు పనిజేస్తేచేస్తారు, లేకపోతేలేదు. వాళ్ల పనేవీలు, బోలెడు కీర్తి ప్రతిష్ఠలు! యిష్టంవొచ్చిన మారుపేరు పెట్టుకోవచ్చు."

ఇవన్నీ తనని గురించే అన్నట్టూ, తనవికృతాకారానికే సంబంధించినట్టూ అనుకుని బాధ పడింది ఓల్గా.

"ఎందు కొచ్చానా యిక్కడికి!" అనుకుంది.

చాకొలెట్ల పెట్టొకటితీసుకుని, వెళ్లిపక్కమీదకూర్చుంది. ఆ మంచం నిండా రంగురంగుల తలగడలున్నై. ఆతలగడలొక దాని మీదొకటి పేర్చి, "రండిటు, యిక్కడ కూర్చోండి" అంటూ ఆహ్వానించింది ఓల్గాని; "ఇట్లావచ్చి కిటికీలొంచి ఆ దృశ్యాన్ని చూడండి, యెంతబావుందో! ఈ కిటికీలకి పూసల దండల తెరలు కడదామను కుంటున్నా; ఎలా వుంటుందం టారు? బాగుంటాయి కదూ! రంగు రంగుల పూసలు. అవతలి దృశ్యమూ కన్పిస్తుంది; కిటికీలకి తెరలు కట్టినట్టూ వుంటుంది.

"నిజమే" అంది ఓల్గా పరధ్యానంగా, ఏమిటో వున్న ట్టుండి చల్లబడి పోయినట్టయినై చేతులు; "అదుగో సూర్యు డొచ్చాడు బయటికి. ఈ వర్షమూ, ఆ సూర్యుడూ. అందు కనే అంత మెరసిపోతున్నట్టుంది" అన్నది, పావాయేమన్నదో తెలియకుండానే.

"దీనికేం. బాగానే వుంది!" అన్నాడు తావ్‌రోవ్, యింతలో.

ఆడవాళ్లిద్దరూ ఒకేసారి, వులిక్కిపడ్డట్టు తిరిగి చూశా రతని వంక.

"ఆయన చెప్పింది నమ్మొచ్చు" అన్నది పావా, తన ధోరణిలోతాను, "స్త్రీల మెప్పుకోసమైనా సరే, చచ్చినా అబద్ధమాడడు. మనం యేమనుకుంటామో అనిగూడా అనుకోని మనిషి!"

"అహాఁ, అదికాదు." అంటూ అడ్డంవొచ్చాడు తావ్రోవ్.

"చూశారా ?" అంటూ లేచింది పావా." నేన్చెప్పలా. ఈయనా అంతా ఇవాన్ ఇవానొవిచ్ లాంటివాడే. ఒకసారొకటంటే, యెవరెంత గీపెట్టరిచినా వదలి పెట్టడు."

"నేను తప్పుమాటేమన్నాను ?" అన్నాడు తావ్రోవ్ "ఈ వ్యాసం నచ్చిందన్నాను; కాకపోతే వ్యాసం నిండా వ్యాసకర్త అభిప్రాయాలే యెక్కువగా వున్నై. పత్రికలకి వ్రాసే వార్తల్లో వ్యాఖ్యానం కంటే విషయం యెక్కువగా వుండడం మంచిది."

"విషయాలా? ఐతే, యింకా మీకా వ్యాసంలో నచ్చిందేముంది ?" అనడిగింది ఓల్గా.

"మీశైలి బాగుంది. చదవబుద్ధేస్తుంది. కాని, అంతకంటే మీరు గని దగ్గరన్నారే, ఆమాట లింకా బావున్నై; నిజంగానే. సూటిగా, హృదయానికి తాకేట్టున్నై. మీరు మాట్లాడినట్టే వ్రాస్తే బావుండేది. ఇంతవరకూ గనుల్లోకి దిగి చూడని వాళ్ళందరూ అది చదువుకుంటే సరిపోయేవి. ఈ ప్రయత్నంగూడా బాగానేవుంది; కాని దీనికింకా మెరుగులు పెట్టొచ్చు."

"ఎట్లా ?"

"ఇంకా యెక్కువ ఉదాహరణ లివ్వండి. మీ ఘా వాళ్ళి మీరు చిత్రించారే యిందులో, అలాగే ఆ ఉదాహరణలు గూడా మనసుకు తగిలేట్టు వ్రాయండి."

"కావాలంటే, యింకోకపర్యాయం వెళ్ళండి గనుల్లోకి ఫోర్మన్ని వెంటబెట్టుకుని. అవసరమైన అంకెలూ, కార్మికుల పేర్లూ అడిగి తెలుసుకోండి. మీరీ వ్యాసంలో పేర్కొన్నారే కార్మికుణ్ణి—అతని పేరు తెలుసుకోండి. మీరెవరి నుద్దేశించి వ్రాశారో అప్పుడే అర్థమైపోయిందినాకు. అతని జీవితం చాలా గమ్మత్తయింది. పుట్టింది అజెర్బైజాన్‌లో ఐనా, ఈవ్రుత్తర ప్రాంతమే తన నివాసం చేసేసుకున్నాడు. సైబీరియన్లతో గూడా పోటీపడి గెలుస్తున్నాడు ప్రతినెలానూ. కుటుంబంగూడా చాలా పెద్దది; వాళ్ళందరూ అలవాటు పడిపోయారీ ప్రాంతానికి. వెళ్లొకసారి వాళ్ళందర్నీ చూడడంగూడా మంచిదే. అతనితో వ్యక్తిగతంగా పరిచయంయేర్పరచుకుంటే, మీకు వ్రాయడం గూడా బాగా తేలికౌతుంది."

# 34

యాకోవ్‌ఫిర్సోవ్‌నిహాస్పిటల్‌కితీసుకొచ్చారుకొంతమంది యకూతీయులు. పరిస్థితి బాగా అధ్వాన్నంగా వుంది, వొళ్లంతా వుబ్బింది, ఎక్కడ చూచినా కమిలిపోయినట్టు నీలి రంగు బొబ్బలు. రక్తనాళాలు యెక్కడికక్కడ వుబ్బి పగిలి పోవడానికి సిద్ధంగా వున్నై. ఎప్పటికప్పుడు చేతులుమీదా ముఖంమీదా రొమ్ముమీదా కొత్తబొబ్బ లెక్కుతున్నై. మని

మిదివరకు దృఢకాయుడేమో, హాస్పిటల్లోవున్న చొక్కా లేపి సరిపోవడం లేదు.

"భీముడులాంటి మనిషి! ఎలాంటి మనిషెలా ఐపోయాడు" అనుకున్నాడు ఇవాన్ అతన్ని చూచి. పక్కమీద కూర్చుని, అలవాటు ప్రకారం మణికట్టుంది పుచ్చుకోబోయాడు నాడి చూచేందుకు. ఈ వ్యాధి వచ్చినవాళ్ల శరీరం జావలాగా జవజవ లాడిపోతుంది మెత్తగా. అక్కడికీ యెంత జాగ్రత్తగానో పట్టుకుని చూశాడు నాడి; ఐనా పట్టుకున్నంత లెక్కా ఇవాన్ వ్రేళ్లగుర్తులు గుంటలు పడినై రోగి చేతులమీద.

ఈ రోగమంత పాపిష్ఠిరోగం లేదు. 1920 నాటి సంగతులు గుర్తుకొచ్చినై ఇవాన్‌కి: అప్పుడు బంగారపు గనుల్లో కరువొచ్చింది. ఈ లవణరక్తవ్యాధి సోకని మనిషంటూ లేడప్పుడు. అదృష్టవశాత్తూ ఆ నరాలు కొరికే చలినుంచి బ్రదికి బయటపడ్డ వాళ్లంతా కాళ్లమీదా చేతులమీదా ప్రాకుతూ బయటి కొచ్చినట్లొచ్చారు, శీతకాలం గడిచిపోగానే. ఆ యేడు వసంతకాలంగూడా పెందలకాడే వచ్చింది. పర్వత శిఖరాలమీదా, పచ్చిక మైదానాల్లోనూ యెక్కడ చూచినా జనమే, ఆకలితో అల్లాడిపోయారు. అందిన కాయా కసరూ దుంపలూ తిని ఆకలి తీర్చుకున్నారు.

"ఆ రోజుల్లో రోడ్లు లేవు, యంత్రాలు లేవు. యీ తోటలు లేవు. ఈ ఛాజ్మా ప్రాంతం అంటేనే 'లవణరక్త దేశం' అని అనేవారందరూ. కాని ఇప్పుడు? అన్ని కాలాల్లోనూ కాయగూరలు పండుతున్నై యిప్పుడిక్కడ. ఆహారం కావలసినంత దొరుకుతోంది. ఐనా, వసంతకాలంలో, యీ

జబ్బింకా పాకుతూనే వుంది. మరీ దూరప్రాంతాల్లో వుండే గని కార్మికులికి బాగా తగులుతోంది వ్యాధి."

అలాగే ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు ఇవాన్, రోగి ముఖం చూస్తూ. ముఖంలోవున్న కన్నులుగాని, నెత్తురు చెమరుస్తున్న పెదవులుగాని కనిపించలేదప్పు డాయనికి. ఊరికే వుబ్బిపోయిన మొఖం, ఆ రోగిబాధ, మృత్యుద్వారం బయట పండుకున్నట్టున్న అతని కనులు. ఈ బాధకూ, ఈ వ్యాధికీ మందులేదు. ఇవాన్‌కి మనసంతా కలచినట్లైంది: ఎలాగోలా, చేతనైనంతవరకు చెయ్యాలి; రోగితరఫున నిలబడి యీ వ్యాధితో యుద్ధం చెయ్యాలి.

ప్రక్కనేవున్న బల్లమీద మంచి పుష్టిగల ఆహారం వుంది; బాగా పాలూ, నెయ్యీ, వేసి అప్పుడే కోసిన కాయగూరల్తో చేసిన వంటకం.

"అంతా బాగానేవుంది, కానేంలాభం? నాలుక కదిల్తే చాలు పళ్ల చిగుళ్లలోంచి రక్తం చిట్లి బయటికొచ్చేస్తుంది ఆగకుండా" అనుకున్నాడు ఇవాన్. ఇందాక రోగి కిలాగే ఒక రొట్టెముక్క యిచ్చారు. ఆ రొట్టెముక్కలాగే పడుంది; ఇంకా రోగి పళ్లగుర్తు లలాగే వున్నై దానిమీద. కొరకబోయాడు, ఇంతలో నెత్తురొచ్చేసింది చిగుళ్లు పగిలి. అంతే. ఇక తినలేకపోయాడు. "ఇంకిలా పాతపద్ధతిని పట్టుకు నేళ్లాడితే లాభంలేదు. కొత్తపద్ధతేదో కనిపెట్టాలి. రోగం వున్నప్పుడు మందూ వుండాలి."

లేచి ఫిర్సోవ్ చేతులమీదికీ, కాళ్లమీదికీ దుప్పటిలాగి కప్పి, వెనక్కి తిరిగాడు ఇవాన్; ఆయన వెనువెంటనే డాక్టర్లూ నర్సులూ అందరూ బారుతీరి నడచెళ్లారు బయటికి.

"ప్రాంతీయ కమిటీకి పంపిన వుత్తరానికి జవాబొచ్చిందా?" అనడిగాడు కన్ను డాక్టరు షిరోకోవ్, హాలులో కన్పించి.

"ఇంకా రాలేదు."

"మీరు గాభరా పడకండి. న్యాయం మనపక్షానే వుంది."

"అది సరే, హాస్పిటల్ ట్రేడ్ యూనియన్ కమిటీకొక వుత్తరం వచ్చిందివ్వాళ; అది చూడాలి మీరు." అన్నాడు డెనిస్, "పెత్రోవ్ వ్రాశాడు. కోర్సు పూర్తికావచ్చిందనీ, బాగా మంచిమార్కు లొస్తున్నాయనీ వ్రాశాడు."

"కణతలదగ్గర ఆపరేట్ చేశాం; అతనేనా?" అనడిగాడు ఇవాన్, ఆలోచనల్లోంచి బయటబడి, "ఐతే, చదువుతున్నాడన్నమాట!"

ఉత్సాహంగా చెప్పుకుపోయాడు డెనిస్: "డాక్టర్ ఇవాన్‌కి తన ధన్యవాదా లందజెయ్యమని వ్రాశాట్ట కమిటీకి. ఈ హాస్పిటల్ కొచ్చినప్పు డెట్లా వున్నాడో గుర్తుందా? చదవలేక పోయ్యేవాడు, వ్రాయలేక పొయ్యేవాడు."

"నాకూ బాగానే గుర్తుంది. ఆపరేషన్ చేశానూ అంటే పది సంవత్సరాలైనా మరిచిపోను రోగిని. చూడగానే గుర్తుగూడా పట్టేస్తాను. కాకపోతే అప్పుడప్పుడు పేర్లు గుర్తుకు రావు; పేర్లు మరచిపోతుంటా" అన్నాడు ఇవాన్.

"నిజమే. ఇవాన్ ఇవానొవిచ్‌కి జ్ఞాపకశక్తి బాగాయెక్కువే" అన్నాడు పక్కనేనిలబడున్న సెర్గుతోవ్; "బల్లమీదున్న థియేటరు టిక్కెట్లుమట్టుకు మరిచిపోతుంటారు. ఇవ్వాళవి అక్కడే పడున్నై. ఇట్లా మరిచిపోవడం యిది రెండోసారి."

"ఆc, థియేటర్ కెళ్లడానికి టైమేదీ? వెళ్లాలని ఆలోచిస్తే వుండదు. ఇంకా మరిచిపోవడమేముందీ!" అన్నాడు ఇవాన్. ఇంతలో స్కొరొబొగతోవ్ సంగతి గుర్తుకొచ్చింది. జిల్లా కార్యదర్శిమధ్య మరీ పెడసరంగా వుంటున్నాడు; ఎక్కడైనా కన్పించినా సరిగ్గా మాట్లాడ్డంలేదు.

"ఏదీ, ఆపెత్రోవ్ వ్రాసిన వుత్తరం యిట్లాయివ్వనాకు" అన్నాడు పిరొకోవ్, డెనిస్‌తో, "జవాబు నేనూ రాస్తాను వెళ్ళి ప్రాంతీయ కమిటీని కలుసుకోమని. వెళ్ళేప్పుడింకా మనం బాగుచేసిన వాళ్ళనింకొక పది మందిని వెంటబెట్టుకెళ్ళమని రాస్తాను. అప్పుడు బాగానే తెలుస్తుంది వాళ్లకి."

"అట్లాజరిగినా మంచిదే" అన్నాడు సెర్గుతోవ్ నవ్వుతూ. అంతలోనే గూసేవ్ సంగతి గుర్తుకొచ్చిందతనికి. "ఈ మధ్య మరీ అన్నిట్లోనూ వేలుబెడుతున్నాడు గూసేవ్. మళ్ళీ హాస్పిటల్‌కి ఆయనే వున్నతాధికారి ఔతాడని గాలికబురుగూడా పడింది. అదేనిజమైతే ఇక మానోట్లో మట్టిగొట్టినట్టే; మాలాంటి వాళ్లకవకాశం గూడా యివ్వడు నేర్చుకోడానికి."

మళ్లీ తనాలోచనల్లో తాను పడిపోయాడు ఇవాన్. వార్డుల్లో తిరుగుతూన్నప్పుడు గూడా ఆలోచనే. జిల్లా కార్యదర్శి గొడవ చాలదా అన్నట్టు, ఈ లవణ రక్తవ్యాధీ,........ ఓల్గా.

అసలింతకీ పత్రికలకి వ్రాయమని ప్రోత్సహించిందెవరో? మర్నాడొకసారి, వ్యాసం సంగతొచ్చి, "నువ్వొక్కళ్ళే, కలం మనిషివి!" అన్నాడు నవ్వుతూ. తోకత్రొక్కిన త్రాచులాగా లేచింది ఓల్గా. మీరొట్టి స్వార్థపరులంది, గర్వపోతులంది, ఏమేమో అంది. అనగూడని మాటలెన్నో అంది. ఈ మధ్య

భాండాగారం నుంచి పుస్తకాలు పట్టుకొస్తోందదే పనిగా; ఎప్పుడూ యేదో వొకటి చదువుతూనో, వ్రాస్తూనో కూర్చు నుంటుంది. ఖాళీగా వున్నప్పుడల్లా యెక్కడెక్కడికో వెళ్తో స్తూంది. గనుల్లోక్కూడా వెళ్ళిందని తెలిసింది. ఇప్పటికి రెండు సార్లెళ్ళింది. ఎప్పుడూ ఏ విషయమూ భర్తకి చెప్పకుండా దాచే మనిషికాదు; ఈ మధ్యెక్కడికెళ్ళినా చెప్పడం మట్టుకు మానేసింది. ప్రాంతీయ పత్రిక్కి నాలుగు వ్యాసాలు పంపానని ఈ మధ్యొకనాడు చెప్పేసింది.

"కనీసం యిదన్నా మనస్ఫూర్తిగాచేస్తే; యిదెంత కాలం వుంటుందోలే" అనుకున్నాడు ఇవాన్. ఆ మాటే అన్నాడొక నాడు ఓల్గాతో. మీద విరుచక పడింది ఓల్గా. "తన శక్తి సామర్థ్యాలకి నేనేదో అడ్డొచ్చినట్టు. శాస్త్రవ్రాయమను. ఎవళ్లొద్దన్నారు. దీనికింత రభసెందుకు యింట్లో. రేపసలు ఖగోళ శాస్త్రమంటే యింతకంటే యెక్కువ యిష్టమౌతుందేమో, ఎవరు చూశారు! ........ ఈ లవణ రక్తం వ్యాధి సంగతేదో తేలాలి............!"

"హాస్పిటల్ నియమం వుల్లంఘించినట్టుందే?" అనడిగాడు ఇవాన్ ఒకరోగిని. అతనొచ్చి రెండు వారాలౌతుంది; తలకు బాగా పెద్దగాయం తగిలింది.

"కొద్దిగానే నండీ" అంటూ వేలుచివర కణుపు చూపించాడు యెంత త్రాగిందీ చెబుతూ.

"అలాచేస్తే మీకే నష్టం" అన్నాడు ఇవాన్, కష్టంవేసి: "మీరెంత దొంగతనంగా త్రాగినా తెలుస్తూనే వుంటుందమాకు. మాకళ్లు కప్పలేరు. ఆపరేషనై పోగానే మా పనైపోయినట్టూ గాదు; మీరు కోలుకున్నట్టూగాదు. తర్వాతగూడా జాగ్రత్తగా

మేం చెప్పినట్టు చెయ్యాలి. ఏం, తొందరగా యింటికెళ్లాలని లేదా?"

చిన్నపిల్లలా సిగ్గుపడిపోయాడు రోగి.

అక్కణ్ణుంచి యింకో రోగిదగ్గరకెళ్ళాడు ఇవాన్. అతనికీ ఈ మధ్యనే ఆపరేషన్ చేశారు. తలంతా కట్లమయం.

సర్జెన్ ఇవాన్ ఆరోగితో మాట్లాడుతూండగా డెనిస్ వచ్చి న్యూరాలజిస్ట్ వాలెంటినొవిచ్ చెవిలో, యేమిటోగాని, రహస్యం చెప్పాడు.

"చాలు, చాలు" అన్నాడు వాలెంతినొవిచ్, అంతా రహస్యంగా డెనిస్‌తో. మనిషి బాగాసంతృప్తి పడినట్టున్నాడు.

ధన్యవాదాలు చెప్పి, కరస్పర్శచేశాడు డెనిస్ గట్టిగా, నొప్పికలిగేట్టుగా. "మొత్తం కమిటీ తరఫునే చెప్పాను మీకా ధన్యవాదాలు. ఇకిప్పుడు ల్యూబాని వాళ్ళమ్మమ్మ దగ్గరికి పంపించెయ్యొచ్చును. ఉరల్స్‌దాకా ఆ డబ్బెక్కువెక్కువ."

"ఈ లవణ రక్తవ్యాధొచ్చినప్పుడిక్కడి వాళ్ళిదివరకే నాటు మందులు వేసుకునేవారు?" అనడిగాడు విద్యార్థుల్ని.

"ఇదివరకీ గనుల్లో పనిజేసేవాళ్లేంమందులు వేసుకునేవారు?" అని అక్కడి కార్మికుల్ని అడిగాడు.

"పచ్చి లేడి కార్జం పనికొస్తుంది" అన్నారు ఈవెంక్స్ జాతీయులూ, యకూతీయులూనూ.

"వెల్లుల్లి, కాబేజి వూరగాయాగూడా పనిచేస్తాయి" అన్నారు యింకొందరు.

"సారాకి మించింది లేనేలేదు" అన్నారు అడివిలో వుండే వాళ్ళు; వాళ్ళ కీవ్యాధి చాలాతరచుగానే వస్తూంటుంది.

"దేవదారు ముళ్ళుడకపెట్టి కడితే బాగానే పనిచేస్తుంది. బెర్రీపళ్ళూ మంచివే" అన్నారు ముసలమ్మలు.

ఈ వ్యాధనలెలాంటప్పుడు వస్తోందీ అని ఆలోచించాడు ఇవాన్. సాధారణంగా ధృవప్రాంతాల్లో కెళ్ళేవాళ్ళకీ, జైళ్ళలో వున్నవాళ్ళకీ, దీర్ఘ సముద్రయానం చేసేవాళ్ళకీ, యుద్ధభీభత్సంతో పాడైన పట్టణాల్లో వాళ్ళకీ వస్తుందీ వ్యాధి.

న్యాయానికాయన యీ వ్యాధిని గురించి యింతగా తలపగలగొట్టుకోవాల్సిన అవసరంలేదు. ఆయనచేసే శస్త్రి చికిత్సకీ దీనికీ సంబంధం యేమీలేదు. ఐనా అదొక జబ్బు; తానొక డాక్టరు. ఉత్తరప్రాంతం యీ వ్యాధికి మారుపేరనేది పోగొట్టాలి తను. తాను ఉత్తరప్రాంతంలో వుండే డాక్టరు; ఆ మాత్రం పరిశోధన చెయ్యకపోతే యెలా? ప్రజలకామాత్రం మేలు చెయ్యలేకపోతే యెలా?

'లవణ రక్త వ్యాధి దేశం' అంటే అర్థంయేమిటి? ఓల్గా ప్రాంతంలో వాళ్ళకీ వస్తుంది యీ జబ్బు. కాని అక్కడొచ్చేది కరువొచ్చినప్పుడు; తినడానికి సరిపడా తిండి దొరకనప్పుడు. మరిక్కడ ప్రజలికి కావలసినంత ఆహారం దొరికినా వస్తుం దెందుకని?

గతం గుర్తుకుతెచ్చుకున్నాడు ఇవాన్. తనబాల్యమంతా ఒక రైల్వేకేంద్రంలో గడిచింది. ఎక్కడచూచినా బొగ్గుపొగ. విటమిన్లా? విటమిన్ల సంగతి గుర్తుకొచ్చి నవ్వుకున్నాడు ఇవాన్. చింపిరి జుట్టుతో పరుగెత్తేవాడు తను చిన్నప్పుడు రైల్వేస్టేషన్లోపడి. అందినంతమట్టుకు సిగరెట్టు పీకలూ, రొట్టె

ముక్కలూ యేరుకుని మళ్ళీ ఒకటే పరుగు. ఇంటికెళ్ళే అమ్మ ముద్దు పెట్టుకునేదికాదు; వెన్నపూసిన రొట్టె యిచ్చేదికాదు. ఇంట్లో వుంటేగా యివ్వడానికి. చేతికొచ్చినన్ని దెబ్బలు మట్టుకు కొట్టేది వీపుచిల్లేట్టు; ఖర్చులేనిపని. గంపెడు సంసారం ఎవళ్ళకీ పొట్టనిండా తిండుండేదికాదు. ఐనా యీ వ్యాధి యెవర్నీ సోకనన్నా లేదే; వాళ్ళు విటమిన్లనే మాటగూడా వినుండరు. పెద్దన్నయ్యని స్కూలుకు పంపడానికని గుడ్డలూ అవీ కుట్టించి, మొత్తం కుటుంబానికి కుటుంబం నెలరోజులు పస్తులుపడుకున్నారు. ఐనా పెద్దన్నయ్యకి చదువురాలేదు. తర్వాత తను పట్టుబట్టాడు చదువుకుంటానని. నాన్న కర్కోటకుడు; తాను చెప్పినమాట పిల్లలు వినవలసిందే తప్ప పిల్లల మొర చచ్చి గీపెట్టినా ఆలకించేవాడుగాదు. ఐనా ఇవాన్ మొండిపట్టు వదల్లేదు. నాన్నగూడ దిగొచ్చాడు. చదివించడాని కొప్పుకున్నాడు. ఇంతలో విప్లవం వొచ్చింది. ముందు కార్మికుల పాఠశాలకి, తర్వాత యూనివర్సిటీకి. ఒకవైపున చదువు: రెండోవైపున వుద్యోగం. మిగిలినడబ్బు యింటికి పంపేవాడు ఆపెద్ద సంసారానికి సాయంగా వుంటుందిగదా అని. రాత్రింబగళ్లు కష్టపడడమే పని; విటమిన్లని గురించి ఆలోచించేందుకు గూడా అవకాశంలేదు. ఐనా యీ జబ్బురాలేదు ఎందుకని? పరిశోధించాలి; తప్పదు.

# 35

ఒకనాటి మధ్యాహ్నం రోజుటికంటే పెందలకాడే వచ్చేశాడింటికి ఇవాన్. ఓల్గా డెస్కుదగ్గర కూర్చునుంది.

ఈసారావిడముందు కాగితాలేమీలేవు. (అవన్నీ అల్మైరాలో పెట్టి తాళంవేసేస్తోందీమధ్య) రెండు చేతుల్తోనూ తలపట్టుకుని కూర్చునుంది. భర్తగదిలోకొచ్చింతర్వాత గూడా తిరిగి చూడకుండా కూర్చుంది.

దగ్గరకెళ్ళి మృదువుగా తల నిమిరాడు. ఏదో జరిగింది మొత్తమ్మీద అనుకున్నాడు.

తలెత్తి చూచింది ఓల్గా; కళ్ళు నిండారుతైవున్నై.

"ఎందుకు ఓల్గా?" అనడిగాడు ఇవాన్, నెమ్మదిగానే. ఇంకేంనుంది, కన్నీరు కాలవలు గట్టింది.

"ఏంజరిగింది, ఏమిటీ చెప్పు" అంటూ ఆదుర్దా పడ్డాడు ఇవాన్.

"వాళ్ళది అచ్చెయ్యలేదు" అంది ఓల్గా కళ్ళనీళ్ళు మింగుతూ, "ఒక్కటంటే ఒక్కటి....ఆర్డీల్లర్ని గురించి వ్రాసింది....అదిగూడా అంతాతీసేశి....అంత పెద్ద వ్యాసం రాస్తే....నాలుగైదు పంక్తులు."

"నేను చెప్పలా?" అన్నాడు ఇవాన్. ఆవిడ నిస్పృహని చూచి చాలం బాధపడ్డాడు. "అదేదో పక్కపనిగా చూసుకోవాలిగాని పత్రికలకినేనూ వ్రాస్తాను....ఇక్కడ హాస్పిటల్ విషయాలు అవీనీ. వైద్య విషయాలమీద కరపత్రాలు గూడా వ్రాశాను. అంతమాత్రాన నేనొక పెద్ద రచయితనెలా ఔతాను? కావాలని అనుకోనూలేదు. ఎప్పుడో వొకసారి. యేదో వొకటి అందరూ వ్రాస్తూనే వుంటారు"

ఓల్గా కన్నీరు కార్చడం మానేసింది. లేచి మేకులా కూర్చుంది. అలాగే యేమీ మాట్లాడకుండా తీక్షణంగా చూడ్డం

ప్రారంభించింది ఇవాన్‌వంక. ఆచూపుచూసి, చెప్పేచెప్పేది మధ్యలోనే ఆపేశాడు.

"మళ్ళీ కోపం వచ్చిందా ?" అనడిగాడు విచారంగా.

"మీకర్థం గానప్పుడు నాకోపం యెందుకు?" అన్నది ఓల్గా కోపం దాస్తూ: "పత్రికలకి మీరూ రాస్తారు, ఇంకా చాలామందీ రాస్తారు. కాని మీరు రాసేదంతా మీకు యిష్టమైన పనిని గురించీ, మీక్కావలసిన విషయాల్ని గురించీ అని మరచిపోతున్నారు మీరు. అంచేత మీకీ వ్రాయడం పక్కపనైపోయింది. నాసంగతలా కాదే! నాకది పక్కపనేమీకాదు; అసలు పనేఅది. అదే నా వృత్తి. అదితప్పయింకేం వుందినాకు? మీరు మీ వృత్తులు చేసుకున్నట్లే నేను నావృత్తి చేసుకోవాలి కాబట్టి యేడుస్తున్నా నేను. ఐనా నేనీ వృత్తిని వదిలేదిలేదు. ఒకసారి కాదు; లక్షసార్లు తిరిగిరనీ నేను రాసింది; రాయడం మట్టుకు మాననునేను."

"అదేముంది, సహజమే;" అన్నాడు తావ్‌రోవ్, పావా యింట్లో కూర్చుని మాట్లాడుతున్నప్పుడు "మీరు చెప్పేది నిజమే. గమ్యం చేరేదాకా కష్టపడండి అంతే."

తావ్‌రోవ్, ఓల్గాని ప్రేమిస్తున్నాడని చెప్పేందుకు యే వొట్టు పడితే ఆవొట్టు పెట్టుకోడానికి సిద్ధంగావుంది పావా. ఒక స్త్రీ పేరు చెప్పగానే మగవాడి ముహం అలా మారిపోతూందంటే అదే అర్థం; యేమీ సందేహంలేదు. కాని యెంత ప్రయత్నించినా, యెంత జాగ్రత్తగా చూసినా, వాళ్ళిద్దరూ పొరపాటు పనులు చెయ్యడం కంటబడలేదు. అందరూ కలసి

ఓల్గా వ్యాసాలు చదివేవారు. ఇగోర్ కవిత్వం లాగానే ఓల్గా వ్యాసాలుగూడా ఆనందపెడుతూన్నై పావాని. యీవ్యాసాలింకా యితరులకిగూడా చదివి వినిపించాలని కలలుగన్నది గూడాను, అప్పుడైనా తనయిల్లు సాహిత్య సమావేశాలకి కేంద్రం ఔతుందేమోనని. తావ్రోవ్గా, ఓల్గా కూర్చుని సంగీతాన్ని గురించీ, రాజకీయాల్ని గురించీ, నాటకరంగాన్ని గురించీ చర్చించేవారు; చదరంగం ఆడేవారు. వాళ్ళిద్దరి వయసులూ తలచుకునీ, వాళ్ళ సాన్నిహిత్యాన్ని చూచీ, పావా అసూయగూడా పడింది కొన్నిసార్లు. కాని వూరికే వసపోసిన పిట్టలా మాట్లాడినంత మాత్రాన, ప్రక్క మగవాణ్ణిచూచి కేరింతలు కొట్టినంతమాత్రాన అలాంటి సాన్నిహిత్యం యేర్పడదు. నిన్ను ప్రేమించే మగవాణ్ణెప్పుడూ అలా దూరంగానే వుంచుతూ, స్నేహంచెడకుండా, గౌరవాభిమానాలు కాపాడుకుంటూ, సద్భావాన్ని పెంపొందించడం యెట్లా సాధ్యం? యిద్దరూ పడుచువాళ్ళయితే ఆసంగతి వేరు!

ఉదాహరణ కివ్వాళ, ఓల్గా అంత ఆందోళన పడుతూ వస్తే, అనుభవం వున్న స్నేహితుడిలాగా ఓదార్చాడు తావ్రోవ్.

"ఎక్కడచూచినాఅంతే; అందరూ అసూయరాయుళ్లు!" అంది పావా, ఓల్గా వ్యాసాలు తిరిగొచ్చాయని తెలిసింతర్వాత; "వాళ్ళు తిరస్కరించారని నువ్వేమీ బాధపడొద్దమ్మా. నేనే నీలాగా రాయగలిగితేనా, వాళ్ళొద్దన్నా ఆగేదాన్ని కాదు; నావొక్కదాని సంతోషం కోసమేననుకుని అలాగే రాస్తూ వుండేదాన్ని."

ఆమాటలు విన్న తర్వాత "చూశారా?" అన్నట్లు చూచింది ఓల్గా తావ్‌రోవ్‌ని. పావామాటలు పట్టించుకున్నట్టే లేడతను.

"వాళ్ళసూయా రాయుళ్లనీ పిళ్లసూయారాయుళ్లన్నం దువల్ల ప్రయోజనం యేముంది?" అన్నాడు. పావా పెంపుడు పిల్లిని నిమురుతూ, "సాధారణంగా పత్రికలవాళ్లు గూడా సామాన్యంగా వచ్చే వ్రాతల్లాంటివి కానివాటిని వేసుకునేందుకు వెనకాడతారు. అదీకాక, ఓల్గా పావ్‌లోవ్నాకి యింకా చెయ్యిబాగా తిరగలేదు. మీకు నాసలహా యేమిటో చెప్పనా?" అంటూ ఓల్గావైపుకి తిరిగాడు.

చాలా దగ్గరగానే కూర్చునుంది ఓల్గా; అతనామాటనగానే సూటిగా కళ్ళల్లోకి చూచింది. ఒక్కక్షణంపాటు గాభరా పడి పోయాడతను ఆచూపుచూచి. కాని ఎంతో నిష్కపటంగా ఆదుర్దాతో, నమ్మకం పుట్టిపడుతూన్నట్టే వుందాచూపు. ముందు పడిన గాభరా కప్పేసుకోవాలని, మళ్ళీ పిల్లిని దగ్గరకి చేరదీశాడు తావ్‌రోవ్.

"ఏమీలేదు. ఇంకా గట్టిగా ప్రయత్నించండి పదేపదే. గనిలోనూ, మిల్లులోనూ యింకా యెక్కువసేపుండి, విషయాలింకా జాగ్రత్తగా జీర్ణం చేసుకోండి" అన్నాడు.

"ఆత్మ సంతృప్తికి !" అంది ఓల్గా, చిన్నగానవ్వి, "నేనింకా ఓపిగ్గావుండాలి, నిజమే. ఇంకా వొకవైపున పూర్తిగా ప్రారంభించనుగూడా లేదు; నాగొప్పతనాన్ని గుర్తించలేదని బాధపడుతున్నాను. మెకానికల్ ఎంజినీర్‌ని కావాలంటే ఐదేళ్ళు చదవాలి, శ్రమపడాలి. పత్రికా రచనగూడా అంత కంటే తేలికైందేమీ గాదు. ఇంకా శ్రమపడాలి; పడతాను."

"శ్రమపడితే, తప్పకుండా సాధించి తీర్తారు" అన్నాడు తాప్‌రోవ్ ప్రోత్సాహంగా, "గత కొద్ది సంవత్సరాల్లోనూ పరిశ్రమల్లో ప్రవేశించిన యీ వుత్తరప్రాంతం మహిళల్ని గురించి ఒక వ్యాసం వ్రాయండి. మొదటిసారి సరిగ్గా కుదరకపోతే, మీకు సంతృప్తి కలిగేదాకా వ్రాస్తూనే వుండండి మార్పులు చేస్తూ: తర్వాత నాకు చూపించండి. ఛాజ్మాపట్టణంలో సంస్కృతిక అభివృద్ధిని గురించిగూడా వ్రాయొచ్చు యింకొక వ్యాసం."

# 36

"ఊరుకోమ్మా, వూరుకో, యేడవబాకు" అన్నాడు ఇవాన్, చిన్నపిల్ల చేయి తనచేతిలోకి తీసుకుని.

ఆ చిన్నపిల్ల ఆపరేషన్ బల్లమీద చనిపోయినావిడ కూతురు. ప్రయాణానికి సిద్ధమై వచ్చింది. తెల్లటి కాలరున్న చొక్కా వేసుకుంది; రెండు జడలేసుకుంది చక్కగా దువ్వుకుని. రెండు కళ్లంటా యింకా నీళ్లు కారుతూనే వున్నై. సంచీ పట్టుకున్న చెయ్యి పైకెత్తి తుడుచుకుంది కళ్లనీళ్లు. తడితడిగా వున్న కళ్లెత్తి, డాక్టర్ని చూచి, "మీరిచ్చిన డబ్బుకీ, మీరు చేసిన మంచికీ ధన్యవాదా లర్పిద్దామనొచ్చా...." అన్నది.

"ఫర్వాలేదు లేమ్మా. ఐనా ఆ డబ్బిచ్చింది నేనుకాదు; డెనిస్. నువ్వెవ్వరికీ ధన్యవాదాలు చెప్పవలసిన అవసరం లేదమ్మా. నీకు సహాయం చెయ్యడం మాధర్మం" అన్నాడు ఇవాన్.

మళ్లీ ల్యూబా కళ్లనిండా నీళ్లు తిరిగినై. "లేదండీ, మీతప్పేమీ లేదు....మీరు చెయ్యగలిగిందంతా చేశారు. అమ్మకి

తలనొప్పి బాధ యింతంత కాదు. తల నేలకేసి కొట్టుకునేది బాధ భరించలేక. ఏడవగూడదని నెత్తురొచ్చేట్టు కొరుక్కునేది పెదవులు బిగబట్టి. బ్రతికితే మాత్రం యేంసుఖం అనుభవించేది" అంది విచారంగా, మాటలెవరో పెద్దవాళ్లంటూంటే విని అర్థంచేసుకున్నట్టు.

క్రిందటేడు నదిలో మునిగి చనిపోయాడు తండ్రి; ఇకిప్పుడొక అనాధ ల్యూబా. నా అన్నవాళ్లెవళ్లూ లేరు యిక్కడ.

"ఏమిజీవితమో యేమిటో యీ సర్జెన్లది!" అన్నాడు డెనిస్, హాస్పిటల్ ట్రేడ్ యూనియన్ కమిటీ ఫైళ్లుతిరిగేస్తూ; "రోగులుపడే బాధలన్నీ భరించాలి; తర్వాతా రోగులబంధువులొస్తారు; వాళ్లనీ చూసీ చూడనట్టు వూరుకుంటానికి వీల్లేదు."

ఎలీనాగూడా అప్పుడే వచ్చింది భర్తతో పనుండి. "వాళ్లూరే వెళ్లేవాళ్లు దొరకడం అదృష్టమే. చాలా మంచిపిల్ల. నన్ను పెంచుకోమన్నా పెంచుకునేదాన్ని, అంతకంటేనా అని."

"మరామాట నాకు చెప్పలేదేం" అన్నాడు డెనిస్.

"చెప్పలేదేం? బాగానేవుంది వరస" అంది భర్తవంక ప్రేమగా చూస్తూ. "ఆ యమ్మాయినే అడిగా. నేనే కాదు; ఓల్గాకూడా అడిగింది; అందులో పిల్లలుగూడా లేరా వాళ్లకి; వాళ్లు పెంచుకుంటే బాగుండేది కూడాను."

"మరేం వన్నది ల్యూబా?"

"ఒప్పుకోలేదు; వాళ్లమ్మమ్మదగ్గిరికే వెళ్తానంది."

డెనిస్ కనులు చెమ్మగిల్లినై.

"పాపం. ఐనా, యేం ఫర్వాలేదు. ప్రభుత్వం పెన్షనిస్తుంది. ఎంతమంది పిల్లలు అనాధు లౌతున్నా రెంతమంది పిల్లలు! లెక్క లేదు—ఇంగ్లండ్‌లో, జెర్మనీలో.... ఆయుద్ధాలు తెచ్చిపెట్టే పెద్దమనుషులికి బుద్ధన్నా లేదు!"

"మన లేనాకీ ల్యూబాకీ కొద్దికొద్దిగా పోలికలు కలు స్తై." అన్నది ఓల్గా, ఇవాన్ ప్రక్కప్రక్కనే నడుస్తూ. "కాకపోతే బాగా పెద్దపిల్ల; పదేళ్లొచ్చినై. వయసుకు మించిన మాట లంటుంది. అంతే మరి, కష్టాలొస్తే పిల్లలుగూడా యిట్టే పెద్దాళ్లై పోయినట్టు కన్పిస్తారు."

అంతకు క్రితం పోట్లాడుకున్న సంగతి గుర్తుకొచ్చి, ఇవాన్ చూడకుండా అతనివంక చూచి పెదవి కొరుక్కుంది ఓల్గా.

అవిడన్న చివరిమాటలు వినలేదు ఇవాన్; మెకానిక్ ఇగోర్ వస్తూంటే అతనివంక చూస్తున్నాడు.

ఇగోర్ పొట్టి క్రౌజ రేసుకున్నాడు పెద్దపెద్ద చారల్ది; క్రేప్ బూట్లు, అల్లిక పనిచేసిన ఉక్రేనియన్ బ్లౌజ్; మెడకొక లేతెరుపు రిబ్బన్ కట్టుకున్నాడు.

ఆ రిబ్బన్ చూచి చిరునవ్వు నవ్వుకున్నాడు ఇవాన్.

"చాలా బావుందీ రోజు; హాయిగా వుంది!" అన్నాడు ఇగోర్ అల్ట్రామోడర్న్ టోపీ సర్దుకుంటూ, "కొండల్లోకి పిక్నిక్కెళ్తే బావుంటుందిగదూ, ఏమంటారు? యింకా నలుగుర్ని పిలుద్దాం. రేపెళ్దాం? పావాగూడా వస్తుంది తప్పకుండా."

కుదరదని చెప్పబోయినవాడే, ఓల్గాని చూచి, "యేం,
ఓల్గా! వెళ్దామా?" అన్నాడు ఇవాన్, హాస్యంగా.

"మీ యిష్టం"

"ఐతే, తప్పకుండా వెళ్దాం" అన్నాడు. వెళ్లిపోతూన్న ఇగోర్‌ని చూస్తే మళ్లీ నవ్వొచ్చింది. "ఓరి వాడి దుంపతెగ! ఏం మనిషేం మనిషి! ఆ దుస్తులేమిటి, ఆ కథేమిటి? మరీ అంత పగటివేషగాడి లాగానా! ఆ రిబ్బన్ చూస్తే నవ్వాపుకోలేక పోయాననుకో; అతని ముహంమీదే నవ్వేస్తాననిపించింది. టాల్‌స్టాయ్ వ్రాసిన 'అన్నా కరెనీనా' లో, లెవిన్ కలుసుకోడానికి కొస్తాడే,—థేమిటీ అతనిపేరు?,—అచ్చంగా అట్లాగే వున్నాడితను. లెవిన్ గెంటేశాడు కదూ అతన్ని?"

"అతనిపేరు వాసెంకా" అని గుర్తుచేసింది ఓల్గా. "కాని అతనికీ ఇగోర్‌కీ పోలికేముంది. వాసెంకా పొట్టిగా పందికిమల్లే వుండే మనిషి. రిబ్బన్లు టోపీమీద కట్టేవాడతను; ఇతనిలా మెళ్లో కాదు."

"అహాఁ, మెళ్లోనే వుండేవి రిబ్బన్లు అతనికీనీ" అన్నాడు ఇవాన్, "ఐనా, పోలిక రిబ్బన్లని బట్టిఅని కాదు నేనన్నేది; చూస్తావుండు, యెప్పుడో నేనూ యితన్ని గెంటేస్తానని చెప్పడానికి చెప్పా ఆపోలిక. ఈ మధ్య నువ్వంటే మరీ శ్రద్ధ చూపిస్తున్నట్టున్నాడులే."

ఇవాన్ మాటలు వింటే ఆశ్చర్యం వేసింది ఓల్గాకి.

"ఎవరన్నా అల్లాగే వుంటాడు ఇగోర్" అన్నది ఓల్గా. "మరీ అంతకోపగించుకోబాకండీ అతని మీద."

# 37

"అందరూ కాలినడకని బయల్దేరాల్సిందే" అంది పావా. "సైకిళ్ళూ గియ్‌కిళ్ళూ పనికిరావు. సైకిళ్లతో కొండలెట్లా యెక్కుతారు, రోడ్డంటెళ్ళి అందరికంటే ముందుచేరుకోవాలనుకుంటే తప్పా?"

"నడిచే వెళ్దాం; నడవాల్సిందే!" అన్నాడు ఇగోర్. "దిగండోయ్, దద్దమ్మర్లారా!" అందరికంటే ముందు తనేదిగి, సైకిల్ పక్కనేవున్న పాకలో పెట్టడానికని బయుల్దేరాడు.

"ఈ బంగారప్పు గనుల్దగ్గర అడివి పందులూ, కట్టెలు కొట్టేవాళ్లూ తప్ప యింకెవరూ వుండరనుకుంటారు -దూరానున్నవాళ్లు. ఇక్కడ రోడ్లున్నాయనీ, సైకిళ్లున్నయ్యనీ, స్ప్యారో సర్జెన్లున్నారనీ వాళ్ళకి తెలియదు పాపం" అన్నాడు తావ్‌రోవ్.

"నిజమేకాని లవణరక్తవ్యాధి యిక్కడింకా వున్నదనే మాట మనమూ మరచిపోగూడదు" అన్నాడు ఇవాన్, ఓల్గాని చూస్తూ. పావా అన్నమాటల్తో సగం నిరుత్సాహపడిపోయింది ఓల్గా.

మొట్టమొదటిసారి ఓల్గాని కలుసుకున్న రోజు గుర్తుకొచ్చింది ఇవాన్‌కి. పనినుంచి యింటికెళ్తున్నాడుతను. వీథికటూయిటూ వున్న చెట్లు పచ్చగా నవనవలాడుతున్నై. వర్షం కురిసి అప్పుడే వెలిసింది. చెట్లకింద చిన్న పిల్లలాడుకుంటూ

న్నారు. కిందున్న తడి ఇసుకంతా పిల్లల కాళ్ల గుర్తుల్తో కళకళలాడుతోంది. పచ్చి ఆకులమీదినించీ, పచ్చికమీదనుంచీ, వచ్చేగాలి పీలుస్తూ రోడ్డుదాటుతున్నాడు తను. సైకిల్ గంట మోగింది; వెనక్కి తిరిగి చూశాడు. ఒక పడుచుపిల్ల తొక్కుకొస్తోంది సైకిల్ అతితొందరగా. చేతులుగట్టిగాపట్టుకున్నై హాండిల్స్‌ని. పెడల్ చేస్తున్న కాళ్లుచూడ చక్కగా వున్నై చేతులికి మల్లేనే. తనని దాటెళ్తూ ప్రశాంతంగా చూశింది పక్కవాటుగా, తలతిప్పి. అలాతల తిప్పినప్పుడు, గాలిలో తేలిపోయినై కురులొక్కక్షణంసేపు; మళ్ళీ వెళ్ళి భుజంమీద పరచుకున్నై అందంగా.

ఆ దృశ్యం తలచుకునేప్పటికి, సంతృప్తిగా, సంతోషంగా చిరునవ్వొకటి చిందిందతని పెదవులమీద.

"పదండి!" అన్నాడు తావ్‌రోవ్‌తో. అంతా బయల్దేరారు, బుట్టలూ అవీ పట్టుకుని.

"వార్యాని పిలవలేదేం?" అనడిగాడు ఇవాన్, దూరంగా వెళ్తూన్న వార్యానీ లొగునోవ్‌ని చూచి. రమ్మని కేకేశాడు వాళ్ళిద్దర్నీ.

"ఇవ్వాళ చాలా పనుందిలెండి. రానులెండి" అన్నాడు లొగునోవ్.

"నిజంగానేనా?" అంది వార్యా. "రాత్రి రమ్మనడిగితే, రాన్లెమ్మన్నాను. క్రిందటి వారం అంతా తీరుబడేలేదు. బోలెడన్ని పనులు ఇంకా చెయ్యాల్సినవున్నై; ఇవ్వాళ చేద్దాంగదా అనుకున్నా; కాని, వెళ్తేనే బావుంటుందనిపిస్తోంది."

లొాగునోవ్ వంక బ్రితిమాలుతున్నట్టు చూచింది; "ఏమంటారు, రారూ?"

"ఇవ్వాళ వీలుండదు వార్యా. ఐనా అనుకున్నదాని మీద నిలబడవేఁనువ్వు? ఇవ్వాళ కాస్సేపు చదువుకుని, తర్వాత నాతో టెన్నిస్సాడతానని చెప్పావుగా" అన్నాడు లొాగునోవ్.

ఫర్వాలేదు లెద్దూఅన్నట్టు తలెగరేసి, వెళ్ళి పిక్నిక్కెళ్ళే వాళ్ళతో కలిసింది వార్యా.

"ఎప్పుడూ పనేనా? మరీ యీ మధ్యబాగా వొత్తిడిగా వుంది. చదవాలంటే మనస్సు కాస్త కుదటబడాలి. కొండల మీద యిప్పుడు చాలా బాగుంటుంది. చక్కటి గాలి. ఈ గాలికి దోమలూ, యీగలూ అంతులేకుండా పోయినై. అడివి పందులూ, అడివి మేకలూ, అడివి దుప్పులూ అన్నీ లోయనొదిలి కొండల మీదకెళ్ళిపోయినై."

తర్వాత అడ్డంగావున్న రాతిమీదనుంచి ఛెంగుమనిదూకి "లొాగునోవ్‌గూడా వస్తే బాగుండేది. చాలా మంచివాడు నాలొాగునోవ్; కదండీ?" అనడిగింది ఇవాన్‌ని.

"నిజమే. వస్తేనే బాగుండేది. సరేకాని 'నా లొాగునోవ్' అంటున్నావేమిటి? పెళ్లిచేసుకో దలుచుకున్నావా అతన్ని?"

"ఇంకా అనుకోలేదు. ఏమో, చేసుకోనుగూడా నేమో లెండి. ఐనా, అతను నన్ను ప్రేమిస్తున్నాడు; అది చాలు నా ఆనందానికి."

పగలబడి నవ్వాడు ఇవాన్.

"అంటే నువ్వూ ప్రేమిస్తున్నావన్నమాట అతన్ని!"

"నవ్వబోకండీ !" అంటూ బ్రతిమాలింది వార్యా; "మీ కంతా నవ్వులాటగా వుందేమో కాని, నిజంగానే నాకతనంటే చాలా యిష్టం" అంటూ దేవదారుచెట్టు కొమ్మొకటి విరిచి, ముళ్లు కొరికింది మునిపళ్లతో.

"వార్యా మరీ మేకపిల్ల ఐపోతోంది" అన్నాడు ఇవాన్, దారి కటుపక్కన నడుస్తున్న ఓల్గాతో, "ఏ చెట్టు కనపడ్డా సరే, రెమ్మ విరిచి నోట్లో పెట్టుకుంటుంది. ఎప్పుడూ యేదో వొక గడ్డి తింటూనే వుంటుంది !"

"నేను తిన్నట్టు మీరు తిని చూడండి. లవణరక్త వ్యాధి వచ్చినా ముట్టదు మిమ్మల్ని."

"వ్యాధి వచ్చినా ముట్టదు!" అన్నాడు ఇవాన్ గూడా మళ్లీ. అని వార్యాపారేసిన రెమ్మ తీసుకున్నాడు. "బలేచెట్లు! ఆజీవనశక్తి చూశావా!" అన్నాడు కాళ్లకిందబడి నలిగినా, మళ్లీ నిటారుగా నిలబడ్డముళ్లవంక పరిశీలనగాచూస్తూ; "ఇక్కడింకే చెట్టూ పెరగదా, యీ దేవదారు మట్టుకు లెక్కేనుమి టున్నట్టు పెరుగుతోంది. కాకపోతే పెద్దపెద్ద చెట్లు కన్పించ వనుకో ; ఎక్కడచూచినా యీపొదలే. కొండలమీదా యివే, నది వొడ్డునా యివే, చూశావాఓల్గా!" అంటూ ఆముళ్లు కొరి కాడు తనుగూడా; "రుచిగాగూడా వున్నై; నువ్వుగూడా చూడు" అన్నాడు ఓల్గాతో.

"నేనేమీ వార్యాని కాదులెండి" అన్నది ఓల్గా పట్టనట్టు.

"ఇదిగో, యిటుచూడు, ఉన్ని కోటులకిమల్లే వున్నై ఆపొదలు, చూశావా?" అన్నాడు, ఓల్గా యెత్తిపొడుపు గ్రహించక; "ఈ దేవదారు, వాతానికిగ్గూడా పని చేస్తుందట

లవణ రక్తవ్యాధి వున్నచోటనే యీపొద లింతింత వొత్తుగా యెందుకుండాలి ?"

"అదొక పెద్ద సమస్యే; పరిష్కరించండి" అంది ఓల్గా. ఇలాంటి సమస్య లనేకం లేపుతూనే వుంటాడు యెప్పుడూ; ఏదో వొకటి తేల్చుకునేదాకా యెట్లాగూ నిద్రపోడు.

"ఈ శీతోష్ణస్థితి కెదురు తిరిగి బ్రతుకుతున్నై యీ పొదలు. శీత కాలంలో థర్మామీటరు సున్నాకింద అరవై డిగ్రీలు చూపుతున్నా, పైనంతా మంచుగడ్డకట్టుకుని పేరుకుపోయినా యివిమట్టుకు పచ్చగా నవనవ లాడుతూనే వుంటై."

"అదుగో, అక్కడ బల్లపరుపుగా వుంది. అందరికంటే ముందు మనం వెళ్ళా లక్కడికి. పదండి తొందరగా" అంటూ సంభాషణ ఆపేసింది ఓల్గా.

"అందరికంటే ముందు నేవెళ్తా" అంది వార్యా.

"చూద్దాంగా" అన్నాడు ఇవాన్, ఓల్గా చెయ్యిపట్టుకుని.

మొత్తంమీద అందరూ వొకేసారి చేరుకున్నా రక్కడికి. బల్లచెక్కలావుంది ఆకాస్త ప్రదేశమూ. దేవదారు చెట్లు ముమ్మరంగా పెరిగున్నై. గాలి చక్కగా వీస్తోంది దేవదారు ముళ్ళలోంచి శబ్దంచేస్తూ.

"ఇదంతా యిలా తవ్వి తీసికెళ్ళగలిగితేనా గనుల్దగ్గరికి, యెంత బావుండును" అంది ఓల్గా, తన్మయంగా చూస్తూ, "చక్కని పార్కౌతుంది. ఈ పొదల్లో పడి తిరిగితే హాయిగా వుంటుంది. అంతా దక్షిణ ప్రాంతంలో వున్నట్టుంటుంది."

పావా రొప్పుతూ వచ్చింది అలసటతో. "ఇక్కడే ఆగి పోదాం" అంది. మనిషి లావెక్కుతున్నట్టుంది. "బ్రహ్మాండంగా

వుందిక్కడ; కాదూ ?" అంది మొహానికి పట్టిన చెమట తుడుచుకుంటూ "రోజూ యిట్లా వొ స్తే బావుంటుంది. కావల సినంత వ్యాయామం. వంటికి మంచిది; నాలాంటి దానికి మరీనీ."

ఆ మాటలు విని వెనక్కి తిరిగి చూశాడు ఇవాన్. చూలుతోవున్న ఇల్లాలు. మెరిసిపోతోంది. "యేదో వొక పని ప్రారంభించడం మంచిది; ఆ దొంద కరిగిపోవాలంటే" అనుకున్నాడు.

"భలే బ్రహ్మాండంగా వుందిలే, కాదూ ?" అనన్నది పావా మళ్లీ. తెచ్చిన వస్తువులు సర్దుతున్నారు అందరూ.

"మీ ఆయనేమిటీ చేస్తున్నారు" అనడిగింది పావా, ఓల్గాని. జేబులోంచి చాకు తీసి దేవదారు, కొమ్మలు చెక్కుతున్నాడు ఇవాన్.

"హాస్పటల్ కొచ్చేవాళ్లకి యీ దేవదారు ముళ్లతో చికిత్స చెయ్యాలను కుంటున్నారు."

# 38

"మీ పనెట్లా సాగుతోంది ?" అనడిగాడు తావ్రోవ్.

"బాగానే సాగుతోంది" అని చెప్పింది ఓల్గా. "ప్రతి రోజూ గనుల్లోకీ, మిల్లులోకీ వెళ్లొస్తున్నా. నోట్సు తీసు కుంటున్నా. ఇంటి కొచ్చింతర్వాత అవన్నీ నెమరేసుకునీ, తిరగేసుకునీ చూసుకుంటున్నా. కష్టంగానేవుంది. నేను రాసేది నాకే నచ్చడంలా; ఏమీ నచ్చడంలా. ఐనా రాయడం మాన

డం లేదు; రాస్తూనే వుంటున్నా. ఇంతవర కెవ్వరూ వుపయోగించని మాటలకోసం తడుముకుంటున్నా. కొత్తకొత్త విషయాలు చెప్పాలని తపనపడి పోతున్నా. ఐనా, యెందుకనో గాని, నావల్ల కావడం లేదు." ఒక నిమిషంపాటు ఆగింది మధ్యలో ఆలోచిస్తూ; "ఫర్వాలేదు, యిదివరకటికంటే మెరుగే ననుకుంటా యిప్పుడు. ఇదివరకటిలా అసలుసంగ తొదలిపెట్టి పక్కవిషయాలమీదికి పరుగెత్తడం లేదిప్పుడు. చెప్పదలచుకున్న విషయాన్నిగురించి సూటిగా వ్రాయడం అలవాటైనట్టే వుంది. కష్టంగానే వుంది గాని, ఐనా ఆ పనంటే యిష్టంగానే వుంది."

ఆప్యాయంగానూ, సానుభూతితోనూ చూశాడు తావ్రోవ్ ఆవిడవంక. చిట్టచివరి కావిడ కానస్తివున్న విషయాన్ని చెప్పగలిగినానుగదా అని నిజంగానే సంతోషించాడు.

"ఇది విన్నారా ?" అంటున్నాడు ఇగోర్ బిగ్గరగా, దగ్గర్లోనే యెక్కడో కూర్చుని, "ఎంత చక్కని భావమో చూడండి !"

"నా స్వప్నసుంద రొచ్చింది నావద్దకు
చీకటి పడుతూన్నపు డొచ్చింది
నన్ను ప్రేమించాలని
నేను ప్రేమించాలని
ఆకురాలే కాలమది; కాలంలానే వుంది నా ప్రేయసి,
ప్రశాంతంగా, మనసులు కలియలేదు;
మా మనసులుమాటాడలేదు;
అర్ధరాత్రి కటిక చీకటిలా
మెరసా యావిడ కనులు.

పెగలబోయిన దుఃఖం పెగలనీలేదు నా ప్రేయసి
కనులనీరు కన్నులలోనే కరిగిపోయింది..."

"వార్యా లాగానే నన్నమాట" అని ముగించాడు ఇగోర్; "వార్యా! నువ్వా 'నా స్వప్నసుందరి' వి"

"వార్యా అలాంటిది కానేకాదు" అన్నది పావ్లా, బల్లగుద్ది చెబుతూన్నట్టు "వార్యా ప్రశాంతంగా వుండనే వుండదు—హుషారుగా గెంతు తూంటుంది. నీ స్వప్నసుందరి మరీ మొద్దు రకం ఐవుంటుంది. అందుకనే మీ యిద్దరికీ కలపలేదు!"

అందరూ నవ్వారు.

అందరూ కలిసి మళ్ళీ బయల్దేరారు నడకకని కాలిదారిని బడి. కొండల కొసకి పాకెళ్ళిందా దారి. అడవి జంతువుల కాలిగిట్టలు వేసిన దారది. నడవడానికి హాయిగావుంది, ఆనందంగా వుంది, హుషారుగా వుంది, నెత్తిమీద చక్కని యెండ; చల్లనిగాలి; ఎటుచూచినా విశాల ప్రదేశం. మత్తెక్కినట్టుంది అందరికీ. కేరింతలు కొడుతున్నారు, పరుగెత్తుతున్నారు, ఒకళ్ళ నొకళ్ళు పెద్దగా పేరుపెట్టి పిలుచుకుంటున్నారు, పాటలు పాడుకుంటున్నారు, కూనిరాగాలు తీస్తున్నారు, కొండగుట్టలమీద చెదరి పడున్న రాళ్ళుతీసి వూపిరి బిగబట్టి ఓపినంత దూరం గిరాటు లేస్తున్నారు. అనుకోకుండా వచ్చి కలిసిన గూసేవ్ మాత్రం, ఎప్పటిలాగానే, నిండుకుండలా వున్నాడు. వులకడు, పలకడు. ఇన్నిన్నేళ్ళు నెత్తిమీద కొచ్చినా, యిట్లా మరీ పసిపిల్లలకంటేహీనంగా ఒక్కొక్కళ్ళూ చేసే అల్లరి చూస్తే చికాకేసిం దతనికి.

"అట్లాంటివాడు రావడం యెందుకూ ?" అంది వార్యా,
ఓల్గాతో "ఇంటిదగ్గరే కూర్చుని పేకాట ఆడుకో పోయాడూ.
ఎవరు రమ్మన్నారు ? పడబోయే పిడుగులాగా మన
వెంటెందుకూ రావడం ?"

ఓల్గాకూడా హుషారుగానే వుంది అందరితోబాటు.
చిన్న చిన్న ఉడుతలెంట పడింది పట్టుకోడానికి.

ఒక వుడతెల్లి చెట్టుపై కెక్కింది. "రండిరండి ! ఆ వుడ
తని పడగొడదాం" అంటూ కేకేసింది తావ్‌రోవ్‌ని.

ఇద్దరూ కలిసి ఆ చెట్టుని పట్టుకుని అదేపనిగా వూపారు.
ఎండుటాకులు గలగలా రాలినై యిద్దరిమీదా. ఓల్గా ముహం
మీదా, నెత్తిమీదా, భుజాలమీదా యెక్కడ చూచినా అవే.
విరగబడి నవ్వుతోంది ఓల్గా ఆ ఆనందంతో. ఆ నవ్వే ముహా
న్నంత దగ్గరగా యిదివర కెప్పుడూ చూడలేదు తావ్‌రోవ్.
అనుకోకుండానే ఒకరిచేతు లొకరి చేతుల్ని తాకినై. అంతే.
ఓల్గా కొయ్యబొమ్మలాగై పోయింది. వెంటనే చేతులు
లాక్కుంది, చిరచిర లాడుతున్నట్టు నుంచుంది.

"ఇకనా బుద్ధి తెచ్చుకో !" అని చెప్పుకున్నాడు
తావ్‌రోవ్, తనకు తానే. "స్నేహితుడిలాగా సలహా లిచ్చినంత
వరకు, సహాయం చేసినంతవరకు ఆవిడకేమీ అభ్యంతరం
వుండదు. నువ్వది చూచి ప్రేమనుకుని భ్రమపడ గూడదు.
ప్రేమించడం యిక మానేశెయ్ !"

చాలాబాధపడి పోయాడు తావ్‌రోవ్ ఆ ఘటన
మూలాన; మాట్లాడకపోతే మరీచిది కాదనుకున్నాడు.

"కోపగించుకో బోకండి !" అన్నాడు వెంటనే,
"క్షమించండి. నన్ను క్షమించండి. నాతప్పల్లా మిమ్మల్ని

ప్రేమించడమే; మనసారా ప్రేమించాను మిమ్మల్ని, యీ ప్రపంచంలో అన్నిటికంటే మిన్నగా. అదే నేను చేసిన తప్పిదం."

"మీరలా మాటాడగూడదు ! తప్పు." అంది ఓల్గా "మీరంటే నాకు చాలా గౌరవం వుంది. మీరు నాకు కావలసిన స్నేహితులు. మీరు చేస్తున్న మేలు ఎన్నటికీ మరవలేను నేను. ఇవాన్ ఇవానొవిచ్‌తో యెప్పుడూ నిష్కపటంగా వుండాలని నా వుద్దేశం....నా కోరిక."

తావ్‌రోవ్ నడిచెళ్ళి పోయాడు దూరంగా; దారిలో యెదురుదెబ్బ తగిలి పడిపోయినంత పనైంది; అలాగే తమాయించుకుని నడిచాడు.

తిరిగి చూస్తే, దూరంగా కన్పించింది ఓల్గా భర్త ప్రక్కనే నిలబడి; భార్యా భర్త లిద్దరూ ఒక గుట్టమీదెక్కి నుంచునున్నారు. "ఆయనన్నుంచి చావిణ్ణి లాక్కోవడం మాటలు కాదు; అంతకంటే కష్టం యింకేమీ వుండదు" అనుకున్నాడు తావ్‌రోవ్.

# 39

"బాగా విసుగెత్తి పోయిందా ?" అనడిగింది ఓల్గా భర్తని, దగ్గరకెళ్ళి భుజం తాకుతూ నిలబడి.

"అబ్బెబ్బే. యేంలేదు. పిక్నిక్కొచ్చాంగదాని సంతోషిస్తూంటే !" అన్నాడు ఇవాన్. ఓల్గా పడుతూన్న ఆనందం

చూచి మురిసిపోయాడు. అతినిగ్రహంగా తానంటే తన భార్య చూపుతూన్న ప్రేమ చూచి, ముగ్ధుడైపోయాడు. "ఈ దేవదారుతో మందు తయారు చెయ్యగలిగితే...."

"ఐతే, వార్యామాటలు నిజమే ననుకుంటున్నారా?"

"ఆవిడొక వూహ అందించింది నాకు. ఒక్కొక్కసారి సామాన్యజనం వేసుకునే మందులు గొప్పగొప్ప చికిత్సలకి దారి చూపడం గూడా కద్దు. సరేగాని, నువ్వేమిటీ చెప్పబోయింది?" అనడిగాడు, ఆవిడ పరధ్యానంగా వుండడంచూచి.

"నేనూ...." అని మధ్యలోనే ఆగిపోయింది ఓల్గా భయపడిన పిల్లలా భర్తకి మరీ దగ్గరగా వెళ్లి.

నిటారుగావున్న కొండగుట్టమీద నిలబడున్నారు ఇద్దరూ. చుట్టూ కొండలు. ఆకొండల వాలులో దేవదారు పొదలూ, యింకా కింద అడవులూ....

"చూడండి. ఆకొండల శిఖరాలెలా వున్నయ్యో ఆకు పచ్చగా....ఎంత..."

"ఊఁ....యెంత...యేమిటి ఓల్గా?"

"యేమీలేదు, యెంతెంత పెద్దపెద్ద కొండలు....అసలందుకు కాదండీ మిమ్మల్నిక్కడికి తీసుకొచ్చింది; మీతో వొంటరిగా వుండాలని...."

"నాకు అలాగే అనిపించింది, ఓల్గా" అన్నాడు ఇవాన్ యెంతో ఆనందంతో; "ఈమధ్య మరీ దూరంగా వుంటున్న

ట్టున్నావ్ ! నీతో వొంటరిగా కాస్సేపుండాలని నాకూ అని పించింది."

"ఎక్కడికెళ్లుంటాడు?" అంది పావా కోపంగా, "వూరికే అట్లా తనిష్టంవచ్చినట్టు పడిపోతే? మనం యిక్కడెంత గాభరా పడతాం యేమై పోయాడోనని. మంచీ మర్యాదా వుండనవసరంలా? తనకుషారుగా వుందని అందర్నీ వదిలి పెట్టెళ్లిపోతే సరి? మరీ అంత స్వార్థం పనికిరాదు."

"ఎందుకమ్మా, మరీ అంత కటువుగా మాట్లాడ్తావ్" అన్నాడు ఇవాన్, "అతనిష్టం వచ్చినట్టతన్ని ఆనందించనీ."

"బాగా సిగ్గుపడి పోయుంటాడు. అందుకనే అట్లా దూరంగా పారిపోయాడు" అనుకుంది ఓల్గా. తావ్రోవ్ స్నేహం చాలా అమూల్యమైందనుకుంది తాను; చివరికిలా ఐంది.

తానంటే అతనికున్న ఆశల్నెప్పుడో పసిగట్టవలసింది ఓల్గా. కాని అతను సూచించిన పనిలో తలమునకలవడంతో, ఆఆలోచనే తోచలేదు. అతనిచ్చే సలహాలూ, చేసేసహాయమ్మీ మెచ్చుకోనడంతోనే సరిపుచ్చుకుంది. తమ బాంధవ్యం యెంత నిస్వార్థమయమో వూహించుకుని మురిసిపోయింది. ఇంకొక ఆలోచనే కలగలేదు; ఇంకొక ఆలోచన్ని అసలు దరికి రానీ లేదు.

"ఆ బాంధవ్యం అట్లాగే కొనసాగలేదెందుకని?" అని భయపడుతూ భయపడుతూ ఆలోచించుకుంది: బహుశా నన్ను లా పొగడాలను కున్నాడేమో....

"విన్నారా? తుపాకి పేల్చినశబ్దం?" అనరిచింది వార్యా, "అదుగో, యింకోసారి పేలింది!"

"ఆఁ అదిగో. అక్కణ్ణుంచనుకుంటా" అన్నాడు ఇవాన్ దూరంగా చూపుతూ, "వేటాడుతున్నాడేమో. ఎట్లాగోట్లా మనం వెళ్ళేదారతనికి తెలియజేస్తే, వచ్చికలుసుకుంటాడు మనల్ని"

"ఓ నాస్వప్నసుందరీ! అంత వొంటరిగానా? ఏకాకిగా నిన్నొదలను. రా, నారెక్కకింద దాచుకుని కాపాడతా!" అన్నాడు ఇగోర్, వార్యా వైపుకు తిరిగి.

"నిన్నట్లా చెయ్యనివ్వకేఁ?" అంది పావా, "ఇక నాకు మిగిలేదెవరు? వార్యా ఆకాశంలో యెగిరే పక్షిలాంటిది; నువ్వు కాపాడక పోయినా ఫర్వాలేదు."

ఇగోర్ నవ్వాడు. పావా అన్నా, ఓల్గాఅన్నా, ఆమాట కొస్తే అతనికి పరిచయమైన యే అందమైన ఆడదన్నా ఆప్యాయమే అతనికి. ఎవరన్నా ఒకటే రకం ఆప్యాయం; యింకా ఫలానా అని నిరార్థణ చేసుకోలేక పోతున్నాడు. ముప్ఫయ్యేళ్ళొచ్చినై, ; బాధగానేవుంది యింతవరకెటూ తెగకపోవడమూ తెమలక పోవడమూనూ. స్వచ్ఛమైన నిజమైన ప్రేమ కావాలతనికి; అప్పుడుగాని ప్రేమ బాధలోని తీయదనం తెలిసిరాదు.

"బాధపడితేనేగాని, గొప్ప కవిత్వం రాయలేన్నేను." అన్నాడు, "ఆస్కార్ వైల్డదే అన్నాడు. 'కవి హృదయం బ్రద్దలుకావాలి; అప్పుడుగాని ఆ హృదయం అమర సంగీతం ఆలపించలేదు! అన్నాడు."

కాని, ఇగోర్ హృదయం యింకా ఆ అమర సంగీతాన్నాలాపించలేదు. తెల్లవార్లూ కంట్లోవొత్తి పెట్టుకుని, ముందు

నోటు పుస్తకం పెట్టుకుని కూర్చునేవాడు కవిత్వం వ్రాద్దామని. చివరికి, వ్రాసిందంతా చింపేసి, ప్రక్కమీదికి చేరేవాడు నిరుత్సాహంతో.

"కళ్ళట్లా ఎర్రబడినయ్యే?" అనడిగింది పావా, "కళ్ళకిందా నల్లటిచారలేమిటి? మళ్ళీ తెల్లవార్లూ నిద్రలేకుండా కూర్చున్నావా, కవిత్వం రాద్దామని? ఎందుకనవసరంగా అట్లా బాధపడ్తావ్?"

"సౌందర్యాన్నారాధిస్తాన్నేను; సృజనాత్మక రచన చెయ్యాలి నేను"

"సింగి నాదమూ, జీలకర్రానూ. పెళ్ళిచేస్తే సరి, ఆ పిచ్చిదానికదే కుదురుతుంది. ఇకప్పుడు నీకు ఆలోచించడానికి గ్గూడా తీరికుండదు."

"ఓహో! భార్యా, బిడ్డలూ, అంతా జంజాటం. నాకొద్దుబాబూ ఆ గొడవంతా! స్వచ్ఛమైన ప్రేమ వుంటేచాలు! యింకేమీ అవసరంలేదు. కవుల కీ రోజువారీ ఝంఝాటాలుండ గూడదు!"

"నువ్వు కవివి గాదుగదయ్యా! మెకానిక్ వి."

"నీకవేమీ అర్థం కావమ్మా తల్లీ. మెకానిక్ గూడా కవై పోవచ్చును; ఆలోచనలకు రెక్కలొచ్చి, నవ్యలోకాలకు దారి చూపగలిగితే! ఎప్పుడూ నామెకానిక్ పనే చేస్తూ కూర్చుంటే యిక బ్రదకవసరంలా."

ఒక నిమిషం ఆలోచించింది పావా.

"నన్ను చూడు. నేనే పనీచెయ్యను; ఐనా నాకు విసుగేమీ లేదే."

"నీ దారి వేరు."

"వేరా? సరే. నేను వేరే అనుకుందాం. ఇవాన్ ఇవానొవిచ్ మాటేమిటి? ఏమండీ! మీకు విసుగ్గా వుంటుందా?"

"నేనా? నాకా? విసుగంటే యెట్లావుంటుందో, యింకా తెలియదనుకుంటానాకు. ఏదిచూచినా కుతూహలమే నాకు."

"ఏమిటో ఆ కుతూహలం? కాస్త చెప్పండి. మీ చుట్టూ యెప్పుడూ వుండేది రోగులు; మూలుగుతూనూ, చచ్చి పోతూనూ."

"చనిపోయేవాళ్ళంతెక్కువగావుండరు. మూలిగేవాళ్లనీ చనిపోయే వాళ్ళనీ రక్షించి బాగుచేసి, మళ్ళీ యెప్పటికి మల్లే ఆనందంగా వుండేట్టు చెయ్యడం నాకర్యం. నాకు వృద్ధాప్యం వచ్చేటప్పటికి వేలకొద్దీ జనం జబ్బులు నయంచేస్తాను. అది చాలదూ నా ఒక్క జీవితమూ సఫలం కావడానికి?"

"అంటే. మీరు మీ జీవితంతో సంతృప్తి పడుతున్నా రన్నమాట?"

"సంతృప్తి పడిపోతే, యింకా నేను పురోగమించే దేముంటుంది నాతలకాయ. అప్పుడిక విసుగు పుట్టిందన్నా ఆశ్చర్యం వుండదు. తనకాసక్తి వున్న పనిజేసే మనిషెప్పుడూ సంతృప్తిగా వుండదు. ఎప్పటికప్పుడు పెరగాలని. ముందుకెళ్లాలని చూస్తుంటాడు. నాకు నాపనంటే బాగా యిష్టం. ఇప్పటికిప్పుడు యీ దేవదారు కొమ్మలన్నీ యింటికి పట్టుకెళ్దామంటే యెగిరి గంతేస్తా!" అన్నాడు నవ్వుతూ, ఓల్గాతో.

"ఏమంత తొందరేమీలేదు."

"నిజంగానే. రేపు సాయంత్రం నా పాఠాలు మానేశి, నీ దుస్తులేసుకుని, వంటింట్లోకెళ్ళి, దేవదారు టీ కాస్తా; ఈ ముళ్ళన్నీ చక్కగా తరిగి సెలాడ్ చేస్తా. ఇంకా రకరకాల కూరలొండి పెడతా. వెదికి వెదికి...."

ఇవానన్న చివరి మాటలు మట్టుకు విని, "ఆయనకోసం వెదకాలంటూరా నిజంగానే?" అనడిగింది పావా.

"ఎవర్ని ? తావ్‌రోవ్‌నా ? ఆఁ, ఈపాటికసలు యింటి కెళ్ళిపోయుంటాడు. నేనంటున్న దింకొక విషయం."

మనిషంటే అలా వుండాలి. చేసేపనంటే చచ్చిపోయ్యేంతాసక్తి వుండాలి ఆయనకున్నట్టు" అనుకుంది ఓల్గా, తలెత్తి భర్తని చూస్తూ.

ఎనిమిదేళ్ళ క్రితం కొత్తకొత్త పద్ధతులకోసం యెంత తహతహ లాడిపోయాడో గుర్తుకు తెచ్చుకుంది. పట్టు పట్టాడంటే చాలు. భల్లూకపు పట్టే. సర్జెన్ డిగ్రీ రాగానే, న్యూరో సర్జికల్ క్లినిక్‌లో చేరాడు; మళ్ళీ ప్రాథమికాంశాల దగ్గర్నుంచి అన్నీ నేర్చుకున్నాడు. మూడేళ్ళ తర్వాత అదే విషయాన్ని గురించి చక్కని పరిశీలనావ్యాసం వ్రాశాడు; అందరూ మెచ్చుకున్నారు. జెర్మన్ భాషలో ఇంకేదో భోగట్టా తెలుసుకోవాలని, తనపని కిబ్బందిలేకుండా, తీరిగ్గా వున్న సమయంలో ఆ భాష నేర్చుకున్నాడు. ఇప్పుడా భాషలో నిధి. తనశాఖలో గొప్పవాళ్ళెవరైనా సరే, పసిపిల్లడిలా మెచ్చుకుంటాడు. 'న్యూరోసర్జరీ' ! ఆ మాటే యెంతో గౌరవప్రదమైన దన్నట్టుగా వుచ్చరిస్తాడు.

ఆయనంటే యెంతో గౌరవం నాకు; చూసుకుని గర్వించదగిన వ్యక్తి !" అనుకుంది ఓల్గా, "అసలంత చెప్పుకో

దగ్గ సంబంధంలేకుండా పోయింది మా యిద్దరికీ; ఇప్పుడొచ్చిన చిక్కదే. నేను బాగా వెనకబడిపోయాను; ఆయన్నందుకోవాలని ప్రయత్నాలు పెడుతున్నాను. ఆయన ఎప్పుడైన ఒకసారి వెనక్కి తిరిగి చూచినా నాకేసి ఒక చిరునవ్వు విసిరేసి వూరుకుంటాడు; అంతేగాని ఆయన్తోపాటు నడవడానికి నేనెంత యాతన పడుతున్నానో గుర్తించడు."

"నీకు గుర్తుందో లేదో, ఒకసారి మనం ఎలోవాయ్ సరస్సు కెళ్ళాం చేపలు పట్టడానికి ?" అని చెప్పుకుపోతున్నాడు ఇవాన్, "అప్పుడు మీ అన్నయ్య గిల్లికజ్జా పెట్టుకున్నాడు నాతో ఒక చిన్న చేపకోసమని. నా దగ్గర్నుంచీ ఆ చేపనీ, యింకో బుట్ట యెరలూ యెత్తుకుపోయాడు. గుర్తుందా ?" అంటూ నవ్వుతున్నాడా విషయాలన్నీ గుర్తుకు తెచ్చుకుని. ఓల్గా మనసక్కడ లేదు; తన ఆలోచనల్లో తాను మునిగుంది. భర్త కంఠస్వరాన్ని బట్టీ, ఆ నవ్వు వినీ అనుకుంది ఆయనావాళ చాలా హుషారుగా వున్నాడని.

# 40

మర్నాడుదయం మిల్లుసైరన్ అదేపనిగా కూస్తూంటే, ఇకనిద్ర పట్టక లేచి కూర్చుంది ఓల్గా. నిద్రమత్తుగా అలాగే వింటూ, భర్తవంక చూచింది. ఆ సైరన్కూత ఆయన్నీ లేపింది. కళ్లు తెరచుకుని అలాగే పండుకునున్నాడు ఆయనాను.

"ఏమిటది ? అగ్ని ప్రమాదమా ?"

దూరంగా తుపాకి పేల్చిన చప్పుడుగూడా వినబడింది.

చెప్పులుగూడా వేసుకోకుండా, రాత్రి వేసుకున్న గౌను తోనే పక్కమీది నుంచి దూకి కిటికీ దగ్గర కెళ్ళింది ఓల్గా. కిటికీ తెరచింది. చల్లగా తగిలినై బయటి నుంచి గదిలో కొచ్చే మంచుతెరలు. రాత్రి తెల్లవార్లూ కురిసిన వర్షం ఆగిపోయింది; కాని యెక్కడ చూచినా మంచు దట్టంగా పట్టుంది. పర్వతాలుగాని, యిళ్లుగాని యేమీ కన్పించడంలేదు.

"యేమిటా గొడవ?" అని మళ్ళీ అడిగాడు ఇవాన్.

ఓల్గా జవాబేమీ చెప్పలేదు. ఇంతలో ఎలీనా కనిపించింది. కిటికీ బయటకి వంగి,

"సైరన్ కూస్తోందెందుకు? ఆతుపాకు లేమిటి?" అనడిగింది ఓల్గా.

చంకనున్న నటాషాని చెయ్యి మార్చుకుని, "తావ్‌రోవ్ కనపడ్డంలేదట. రాత్రసలు తిరిగిరాలేదట. ప్రొద్దున నటాషాని తీసుకెళ్ళేప్పుడువిన్నా ఆకూత. నిప్పంటుకుందేమో ఎక్కడన్నా అనూరుకున్నా. తిరిగి నటాషాను తీసుకొస్తూ దార్లో డ్రైవర్ కనబడితే అడిగా యేమిటి సంగతని. 'తావ్‌రోవ్, కొండల్లో తప్పిపోయాడు. వెదకడానికి వెళ్లారు' అని చెప్పాడు."

"ఏమిటటా?" అనడిగాడు ఇవాన్ మళ్లీ ఆదుర్దాగా, గబగబా బూట్లుబిగించుకుంటూ.

"ఆఁ, తావ్‌రోవ్ తప్పిపోయాడట." అంది ఓల్గా బిగ్గరగా, వెళ్ళిపోతున్న ఎలీనా వంకచూస్తూ. "రాత్రి రాలేదట. అందుకనీ...."

"బాగావేవుంది" అన్నాడు ఇవాన్. ఈ ప్రాంతానికి కొత్తవాడు గూడాను. ఎందుకెళ్ళిపోయాడో అట్లా యెవర్నీ జతతీసుకో కుండా!"

వెంటనే సమాధానం చెప్పలేదు ఓల్గా. అంతా తనతప్పే మోనని బాధపడింది. చివరికి "కాస్సేటూ యిటూ తిరిగి ఆయనే వస్తాడు" అంది.

ఓల్గా మరీ అట్లా పట్టనట్టుమాట్లాడ్డం నచ్చలేదు ఇవాన్‌కి. "అదేమన్నమాట. ఈప్రాంతంలో వూరికే అటూయిటూ తిరగడమంటే షికారనుకుంటున్నా వేమిటి? అదే మీకవి మిత్రుడు ఇగోరైతే, నువ్వూ షావా యీపాటికి బయల్దేరక పోయారూ వెదకడానికి!"

"కాదుమరీ!" అన్నది ఓల్గా వెటకారంగా.

ఈవేళ పగలల్లా, వ్రాద్దామని కూర్చుందేగాని కలం సాగలేదు. షెల్ఫ్‌లోంచి లైబ్రరీ పుస్తకాలన్నీ బయటికి తీసింది....బంగారపు గనుల్ని గురించీ, సైబీరియా, దూరప్రాచ్య దేశాల పర్యటనల్ని గురించీ వున్న పుస్తకాలన్నీనీ. కాని వ్రాతా సాగలేదు; చదువూ సాగలేదు. అలాగే కిటికీలోంచి శూన్యాన్నిచూస్తూ కూర్చుంది. సైరన్ కూత వింటే చాలు, పాడు ఆలోచనలన్నీ వస్తున్నై.

హాస్పిటల్‌నుండి ఇవాన్ వచ్చింతర్వాత కాస్త కుదుట బడింది ప్రాణం. భోజనాలయ్యాంతర్వాత, పాత్రలన్నీ కడిగింది. మళ్లీ నిప్పంటించి నీళ్ళుకాసింది.

ఆవేళ రాత్రంతా సైరెన్లు కూస్తూనేవున్నై. లేచీ లేవడంతోనే కిటికీదగ్గరికి పరుగెత్తింది ఓల్గా.

"వాతావరణం యెట్లావుంది" అనడిగాడు ఇవాన్, దుస్తులేసుకుంటూ.

"ఎప్పటికిమల్లేనేవుంది." అంది నిరుత్సాహంగా చేయి వూపుతూ.

ఇవాన్ హాస్పిటల్ కి వెళ్ళిపోయింతర్వాత, పావా వచ్చింది ఓల్గాని చూడ్డానికి.

"శుభవార్త పట్టుకొచ్చా మీకు" అంటూ వానకోటు జేబులో వెదకడం ప్రారంభించింది.

వెదికి వెదికొక పత్రిక బయటికి తీసింది. "మీరు పంపిన ఆరెండో వ్యాసం క్రిందటివారమే అచ్చయింది. మనం చూడలా." అంది వుత్సాహంగా. "ఒకోక్కసారి, తిరస్కరించిన వ్యాసాలుగూడా పై వాళ్ళెవళ్ల కంటన్నాబడితే అచ్చేస్తారట; మావారన్నారు. మీవ్యాసం బహుశా యేసంపాదకుడో చూసుంటాడు. మీరు ఆపేరుకాస్తా పూర్తిగా వ్రాస్తే యింకా బాగుండేది.''

పావా మాటలు పూర్తిగా వినకుండానే పత్రిక తిరగేశింది ఓల్గా. చేతులు వణకి పోయినై. ఆఁ, ఇదే తన వ్యాసం. తిప్పి పంపించినవాటిల్లో అదొకటి. ఆపిడ పెట్టిన శీర్షిక కూడా మార్చలేదు.

మాటలామరి. తాను స్వతంగా స్వహస్తాలతో వ్రాసిన వ్యాసం పేపర్లో పడింది!

పత్రిక చూస్తూనే కుర్చీలో కూలబడింది: చలి జ్వరం వచ్చినట్టు వణకి పోతోంది.

"ఒక గుక్క తాగు" అంది పావా గాభరాపడి; ఈ రుతువు మరీ పాడు రుతువు. నా టాన్సిల్స్ నన్నేడిపించుకు

తింటున్నై; బయటికెళ్తేచాలు, గొంతు పట్టేసినట్టుంటోంది. తాగు. ఒక గుక్క తాగడమే మంచిది!"

"అదేపోతుంది" అంది ఓల్గా.

తావ్రోవ్‌ని గురించి ఒకటేఆలోచన. ఎక్కడున్నాడో? అసలింకా బ్రదికే వున్నాడో లేదో? ఆప్రాంతం అంతా అడవి జంతువుల మయం; ఎటుచూచినా ప్రమాదం. ఈవ్యాసంపడిన సంగతి తెలిస్తే యెంత సంతోషించేవాడో! ఇవాన్‌కి ఫోన్ చెయ్యలేదు ఓల్గా. ఆయనకీవ్యాసం గొప్పేముంటుంది; యేదో చిన్నపనికింద లెక్క! కాని తనకో; ఇదొక అపూర్వ విషయం.

తర్వాత మనీఆర్డ రొచ్చిందని కబురొచ్చింది.

దుస్తు లేసుకుని పోస్టాఫీసు కెళ్ళింది. దారిలో కన్పించిన వాళ్ళందరూ యిదివరకటికంటే చాలా ఆప్యాయంగా పలకరించారు; ప్రాంతీయ పత్రికలో పడ్డ వ్యాసం తనదేనని తెలిసినట్టు. ఒ. ఎ. అని పొడతురాలున్న పేరు ఓల్గా అర్జానోవాయేనని వాళ్ళకి అర్ధమైనట్టూను.

డబ్బు ఆవిడపేరనే వచ్చింది సంపాదకవర్గంనుంచి. ఇంతవరకు జన్మలో ఒక్కకోపెక్‌గూడా కష్టపడి సంపాయించలేదు ఓల్గా. కాషియెర్ దగ్గర్నుంచి డబ్బు తీసుకుంటూంటే చేతులు వణికినై. ఆ కాషియెర్‌గూడా తానెరిగినావిడే; ఆవిణ్ణిచూసి నవ్వబోయింది ఓల్గా; యింతలోనే మళ్ళీ సైరన్‌కూత.

ఒక నిట్టూర్పు వదలి ఆకో ష్ఠనోట్లు జాగ్రత్తగా మడిచి చేతిసంచీలో పెట్టుకుంది. పోస్టాఫీసునుంచి బయటికెళ్ళింతర్వాత మళ్ళీ వొకసారి చూసుకుంది పెట్టినచోట వున్నవో లేవోనని ఇంతలో ఆవిడ కెక్కడలేని భయం వేసింది; పాఠకులికి నచ్చలేదేమో తన వ్యాసం.

అలాగే, నిలుచున్నచోటనే నిలబడి పోయింది ఓల్గా, తావ్‌రోవ్ వెళ్ళినదారివైపే చూస్తూ. దగ్గరగావున్న కొండలు గూడా కన్పించడంలేదు. గనిలోకెళ్ళకముందు తావ్‌రోవూ తానూ కలుసుకున్న కొండగూడా సరిగ్గా కన్పించడంలేదు మంచుమూలాన; ఇళ్లుమట్టు కక్కడక్కడా కన్పిస్తున్నై.

గనుల్లో పనిచేసేవాళ్లూ, వేటగాళ్లూ అందరూ వెదుకుతున్నారు కొండల్లోపడి. ప్రన్నిదుస్తు లేసుకుని, కావలసిన ఆహారం తీసుకుని బయల్దేరారు. అడవంతా గాలించేస్తున్నారు, పెద్ద పెద్ద కేకలుపెట్టి పిలుస్తూ. మంచు దట్టంగావుంది; వెదకవలసిన చోటు కాస్తాకూస్తాకాదు; దారితప్పిన మనిషి దొరకడం అంటే కష్టమే.

# 41

పిక్ని వచ్చినవాళ్లనొదిలి దూరంగావెళ్లాడన్నమాటే గాని, తావ్‌రోవ్ మనసేమీ స్థిమితంగాలేదు. చేతిలోవున్న తుపాకీతో చెకుముకి పిట్టొకటి చెట్టుమీదుంటే గురిచూచి కొట్టాడు. దెబ్బపిట్టకి తగిలింది. పిట్ట చచ్చిపోయింది. చచ్చిపోయిన పిట్ట వంక గూడాచూడకుండా, యింకా ముందు కెళ్లాడు కసాపిసావచ్చిక తొక్కుకుంటూ. తెలియకుండానే; కనుమూసి తెరచేలోపల, సాయంకాలమైపోయింది. ఇంతలో వానజల్లొచ్చింది. కిందనుంచి పైదాకా కొండలంతటా మంచుపొగ పట్టింది.

ఒక కొండ గుట్టెక్కి చూశాడు తావ్‌రోవ్. ఎటు చూచినా తెల్లపొగ, ఇంకేమీ కనబడ్డంలేదు. తుపాకి పేల్చాడు, కేకలేశాడు. జవాబులేదు. రాళ్లూ, పొదలూ కలిసి పందిర్లల్లిన

చోటు కెళ్లి పడుకున్నాడు. శారీరకంగానూ, మానసికంగానూ గూడా అలసిపోయున్నాడేమో, వెంటనే నిద్రపట్టింది. కింద తేమ; పైన చలి. మెలకువ వచ్చింది. వర్షం బాగా కురుస్తోంది. సిగరెట్లు కాల్చే అలవాటులేనందుకు విచారించాడు. ఇలా విచారించడానికతని జీవితంలో యిదే మొదటిసారి. చేతిలో అగ్గిపెట్టిస్తుంటే యీ రాళ్లగుట్టమధ్య చక్కని చలిమంట వేసుకునేవాడీపాటికి. ఇంటిసంగతీ, యింటి దగ్గరుండే వెచ్చదనమూ గుర్తుకొచ్చినై. ఇకక్కడ కూర్చోలేక పోయాడు. లేచి బయల్దేరాడు.

తెల్లవారుతోంది. కానింకా వెలుగు రావడంలేదు. మేఘాలు దట్టంగావున్నై. వర్షం ఆగిపోయింది. చెట్లూ,పొదలూ అన్నీ తడితడిగావున్నై. నడవడం ఆపలేదు తావ్‌రోవ్.

ఇంకొకరోజు. పగలల్లా గడచిపోయింది.

ఎటుచూచినా అరణ్యం. ఎవరైనా కనిపిస్తే బావుండు ననుకున్నాడు. ఓల్గా గుర్తుకొచ్చింది. ఒకసారిద్దరూ కూర్చుని చదరంగం ఆడుతున్నారు ఓడలో. పావొకటి కిందపడి పోయింది. వంగుని తియ్యబోయాడు. వంగున్నప్పుడు అతని బుగ్గలకి ఓల్గా గౌను తగిలింది. ఇప్పుడాసంగతి తలుచుకుంటే మనసంతా దేవినట్టుంది.

బాగా అలసిపోయాడు నడిచి, నడిచి. వాగొకటి కనబడింది. ఈవాగువెంటే పడెళ్తే కామెనుష్యాన్నదైనా కనబడుతుందిగదా. లేకుంటే ఛాఙ్మాయేకనబడుతుందని అనుకున్నాడు. వాగు పక్కపక్కనే నడిచాడు వాలుగా. దారినిండా పొదలు, గాలికి పడిపోయినచెట్లు. కాలుజారి కిందబడ్డాడు. చాలా సేపటి దాకా లేవలేదు.

"ఎందుకూ యిక్కడిట్లా పడుకోవడం? ఏడ్చినట్లేవుంది! లేచి తొందరగా యింటికెళ్తే అక్కడే తీసుకోవచ్చు కావలసి నంత విశ్రాంతి" అనుకున్నాడు. లేవబోయాడు. తీవ్రమైన నొప్పి. కళ్లుచీకట్లు గమ్మినై.

"కాలుగాని విరగలేదుగదా!" అనుకున్నాడు స్పృహ వచ్చింతర్వాత. అంతే అయ్యుంటుందని నిర్ణయించుకున్నాడు. "ఇకిక్కడిలాగే చనిపోతానా గాయపడిన మృగంలాగా? దిక్కు లేని చావేనా యిక నాగతి? ఇక్కడుంటే పక్కగావెళ్లేవాళ్ళ కూ్కాడా కనిపించే ఆస్కారంలేదు."

ఎట్లా పాకాడో తనకే తెలియదు. పాకి పాకి, చెట్టూ చేమాలేని బయలులోకొచ్చాడు. వళ్లుతెలియడంలేదు. ఆ వేడిలో అట్లాగే పాకాడు భుజానికున్న తుపాకితోసహా. ఇకి క్కడ పర్వాలేదు. ఆ దగ్గరున్న కొండలెక్కి చూచేవాళ్ళకి కనబడొచ్చు. ఇంకా మంచు దట్టంగానే వుంది. ఐనా, యికంత కంటే చెయ్యగలిగిందేమీ లేదు. అట్లాగే పండుకున్నాడు. స్పృహ వస్తూపోతూ వుంది. చీకటి పడింది. వర్షం కురుస్తోంది. మధ్యమధ్య మంచు పడుతోంది. జ్వరంతో పెదవులు పగిలి పోయినై.

ఒకసారి స్పృహవచ్చి, కళ్లుతెరచి చూశాడు. ఏదో ఆకారం తనవంక చూస్తున్నట్టుంది. కదిలాడు. ఏదోపెద్ద జం తువు పారిపోయినట్టు కనిపించింది స్పష్టంగా. మళ్లీ తిరిగొస్తుం దేమో. తుపాకికోసం తడిమి చూసుకుని, పొట్టమీద కొత్తి

గిలాడు అతికష్టంమీద. ఆ జంతువు పారిపోయిన వైపుకి గురి చూచి కొట్టాడు తుపాకి.

# 42

పావా పరుగెత్తుకొచ్చి చెప్పింది ఓల్గాతో. ఈవెన్‌జాతి వేటగాళ్ళకి కన్పించాడు తావ్‌రోవ్ కామెనుష్కాకి యాభై కిలోమీటర్ల దూరంలో. తావ్‌రోవ్ కాలిరిగిపోయింది. పరిస్థితి ప్రమాదంగా వుంది. ప్రస్తుతం హాస్పిటల్లో వున్నాడు.

"నేనెళ్లి చూడాలి" అంది ఓల్గా, పావాతో. "బ్రతికే ఆశలేదా?" అనడిగింది కన్నీరు కారుస్తూ, "చాలా మంచి మనిషి."

"ఛా, అవేం మాటలు. బ్రతక్కేం?" అన్నది పావా అన్నీ తెలుసుకునే వచ్చిందిక్కడికి; "చికిత్స చేసేది ఇవాన్ ఇవానొవిచ్. ఇంకా భయమెందుకు? ఐనా, మీరిప్పుడప్పుడే వెళ్ళగూడదు; నిజంగానే. అసలతనికింకా స్పృహ రాలేదు చలీ జ్వరం, వొళ్ళు తెలియకుండా పడుకునున్నాడు. మనం పిక్నిక్కెళ్ళిన మర్నాటినుంచీ వర్షమూ, మంచూనూ! అదీగాక, నువ్విప్పుడెళ్తే యెవళ్లిష్టం వొచ్చినట్టు వాళ్లనుకుంటారు. ఆపరేషన్ ఐపోగానే.... ...." ఆ మాట వినగానే భయంభయంగా చూచింది ఓల్గా. "ఆపరేషన్ చెయ్యాలి; తప్పదు మరి. కాలు మోకాలు కిందిరిగింది. ఫర్వాలేదు మళ్లీ వస్తుందంటున్నారు

అందరూ. కాస్సేపున్న తర్వాత నేను వస్తాన్లే; ఇద్దరం కలిసెళ్ళ్దాం. అప్పుడెవరూ యేమీ అనడానిక్కూడా వీలుండదు."

"ఇప్పుడెలా వుంది?" అనడిగింది వార్యా, మంచినీళ్ల గ్లాసుతీసి పక్కప్రక్కనేవున్న టేబుల్‌మీద పెడుతూ. తావ్‌రోవ్ తలక్రింద తలగడలు సరిగ్గా సర్దింది. "చూశారా, తలగడ మీదగూడా వొలికిన్నై నీళ్లు" అంది మాసిన గడ్డమూ, మెడా తువ్వాల్‌తో తుడుస్తూ. "మళ్లీ పసిపిల్లలికి మల్లేనే, గరిటెతో పెడుతున్నాం మీకు అన్నిటినీ!" అంటూ నవ్వింది. చేతులు ముడుచుకుని, వొళ్లో పెట్టుకుకూర్చుంది ప్రక్కనే, చూచేందుకొచ్చిన చుట్టంలా.

"మెరుగ్గానే వుందికాని, కాలింకా నొప్పెడుతూనే వుంది" అన్నాడు తావ్‌రోవ్, "పూర్తిగా నయమౌతుందా? మళ్లీ వస్తుందా కాలు?"

"తప్పకుండా వస్తుంది. మేంచెయ్యగలిగిందంతా చేశాం. బాగైం తర్వాత మీరు కుంటనుగూడా కుంటరని అంటున్నారు డాక్టర్ ఇవాన్."

"నిజం ?"

"నిజవే. మీరూరికే పాడాలోచనలు పెట్టుకోబాకండి. మీ ఆరోగ్యంగూడా బాగా గట్టిది; తొందరగానే కోలుకుంటారు. ఈ హాస్పిటల్లోనే ఒకచిన్న కుర్రాడున్నాడు: యూరీ. చాలా కాలమైంది హాస్పిటల్లోచేరి. ఆపరేషన్ చేశారు. మళ్లీ మంచంమీద నుంచి పడి, కాలిరగ్గొట్టుకున్నాడు. ఆ సంగతి విని యేడ్చానంటే నమ్మండి నేను; ఈ కుర్రాడి కీబాధలన్ని

యేమిటా అని. అతనికంటే యింకాస్త పెద్ద కుర్రాడు ధైర్యం వుంటే పక్కమీద నుంచి పర్మిషన్ లేకుండా లే' అని ఎక్కిరించాడట. పౌరుషంకోసం, నర్సు లేనప్పుడు చూచి, లేవ బోయాడట; ఆ పెద్ద కుర్రాడు సాయంగూడా పట్టాడట; లేచాడు; పడిపోయాడు. ఇదంతా జరిగిందని యిప్పటికీ వొప్పు కోడు యూరీ; ఆ పెద్ద కుర్రాడిమీదకేమన్నా వొస్తుందని భయం."

"మంచిదేలే" అన్నాడు తావ్‌రోవ్ నవ్వుతూ.

"భలేవారే" అంది వార్యా, అసమ్మతిగా; "చిన్నపిల్ల లెప్పుడూ అబద్ధం ఆడగూడదు!"

"పెద్దవాళ్ళు?"

వార్యా సిగ్గుపడింది.

"పెద్దవాళ్లూనూ."

"ఒకోక్కసారి అది అసాధ్యమైతే? నువ్వింకా చిన్నదా నివి, వార్యా! అందరూ నిజమే చెప్పాలనే మాట మంచిదే; కాని, కొన్నిసార్లలాంటి సత్యం చెప్పడం అనవసరమౌతుంది; వున్నదున్నట్టు మొహంమీద అనెయ్యడం ఒకోక్కసారి చాలా క్రూరం గూడాను. అంటే, మన రోజువారీ జీవితంలో అదంతా సాధ్యమూ కాదు, అవసరమూ కాదు అని మట్టుకే సుమా నా అభిప్రాయం"

వార్యా ఒప్పుకోలేదు.

"ఐనా సరే, అవతలి మనిషిని గురించి వున్నతాభి ప్రాయం వుంటే, అంత క్రూరంగా ప్రవర్తించనూలేము; ఆ అవసరమూ యేర్పడదు. నాకూ తెలుసుననుకోండి; ఒకోక్క

సారి నిజం చెప్పడమూ కష్టమే; వినడానికీ కఠోరంగా వుంటుంది. ఒకసారి, ఒకావిడ తన కూతుర్నింటిదగ్గర అట్టే పెట్టెళ్లింది. ఇంట్లో పనిమనిషి పనిచేసుకుంటోంది. "ఎందుకమ్మా, నువ్వింట్లో వున్నావ్ ?" అనడిగింది పనిమనిషి. 'నువ్వు దొంగతనం చేస్తావేమో చూస్తూ వుండమని చెప్పింది అమ్మ' అన్నది ఆచిన్నపిల్ల. పనిమనిషిక లబోదిబో మంది. చివరికా చిన్నపిల్లకి తన్నులు తగిలినై. తప్పెవరిదంటారు ? ఆ చిన్నపిల్లదా ? ముమ్మాటికీ కాదు. చిన్నపిల్ల నిజమే చెప్పింది. నమ్మని మనిషిని యింటికే రానీగూడదు; అంతే. అప్పుడీ చిక్కులన్నీ కలగనే కలగవు."

"హాఁ హాఁ. ఆ చిన్నపిల్లెవరో చెప్పనా ! ఓల్గా పావ్లోవ్నా. ఆవిడ నాకూ చెప్పిం దీకథ ఒక పర్యాయం. కాకపోతే నువ్వు చెప్పినదాంట్లో చిన్న పొరపాటొకటుంది వార్యా ! ఇంట్లో వదిలెళ్లింది వాళ్లమ్మ కాదు; వాళ్ల అత్తయ్య. ఓల్గా తల్లి చాలా మంచిది; ఆవిడ ఓల్గాకి బాగా చిన్నతనంలోనే చనిపోయింది."

"ఆఁ, వూరికే వుదాహరణకని చెప్పాను కాబట్టి, ఆ చిన్న మార్పు కావాలని నేనే చేశాననుకోండి" అన్నది వార్యా నత్తులుకొడుతూ.

"మీ ఆడవాళ్లంతా యింతే !" అని గోణిగాడు తావ్రోవ్, "యూరీ, నేను—ఇద్దరం మగవాళ్లం. మీకంటే మేమే మెరుగు; నిలకడైన వాళ్లం మీకంటే. ఇదుగో, ఈ డ్రాయర్లో కేకులూ, మిఠాయీ వున్నై; నాస్నేహితులు పట్టుకొచ్చినై. నా గౌరవచిహ్నంగా అవి పట్టుకెళ్లి యూరీ కివ్వు."

ఆ పాకెట్లన్నీ రెండు చేతులనిండా పేర్చుకుని, పడిపోకుండా గడ్డంతో అదిమిపెట్టి, చిన్నపిల్లల వార్డులో కెళ్లింది వార్యా.

డెనిస్ అక్కడే వున్నాడు, యూరీ చేస్తున్న వ్యాయామం చూస్తూ. చేస్తున్నపని ఆపకుండానే "ఎవరు పంపారివన్నీ" అనడిగాడు యూరీ, యకూత్ భాషలో.

"అన్నీ నీకనే పంపారు గాని, పిల్లలందరికీ పంచిపెట్టాలనుంది."

"ఊఁ, అట్లాగే" అన్నాడు యూరీ. తర్వాత రష్యన్ భాషలో, "డెనిస్ అంతోనొవిచ్‌కిగూడా కాసిని పెట్టాలి మరి" అన్నాడు.

డెనిస్ నవ్వాడు. "చూశావా, వార్యా! ఇట్లాగన్నా లంచం పెడితే తనకి వ్యాయామం యింకా బాగా నేర్పుతానని అనుకుంటూ యీ రెయెత్తంతా. ఆ తిండంతా మీరు కానివ్వండి, నాకొద్దులే, నేనంటే యింత ప్రేమ చూపిస్తున్నారు కాబట్టి, కాసిని దేవదారు నీళ్లు పట్టుకొచ్చిస్తాలే."

"తియ్యగా వుంటాయా ?"

"ఎట్లా వుంటేనేం ? అది మందు; లవణరక్త వ్యాధి రాకుండా వుంటుంది; బొమికలన్నీ గట్టిపడతై."

"సరేలే, కానివ్వండి. మందైతే తాగకేం జేస్తాం !"

"ఆనీళ్లు అందరికీ యిస్తున్నారా ?" అనడిగింది వార్యా, తెచ్చినవి ప్రతి పక్కదగ్గరికీ వెళ్లి పంచిపెడుతూ.

"డాక్టరుగా రివ్వమని చెప్పినవాళ్లందరికీ యిస్తాను."

"ఇదివర కొకసారి చెప్పానే, ఫిర్సోవ్ సంగతి, గుర్తుందా ?" అనడిగాడు ఇవాన్, ఓల్గాని. "ఆ లవణరక్త వ్యాధితో యిక బ్రదకడనుకున్నాం. ఒక్కవారం అంటే ఒక్క-వారం, సరిగ్గా చెప్పాలంటే ఎనిమిది రోజులు.... ఎనిమిది రోజుల్లో ! ఎందుకూ, నువ్వేరా, చూద్దూగాని. నేను నా కషాయాలన్నీ వుపయోగించా, లాభం లేకపోయింది. చివరికి దేవదారు కషాయం యిచ్చా, పనిజేసింది. నాకళ్లని నేనే నమ్మలేకపోయా; లేచి కూర్చుంటున్నాడుగూడాను అప్పుడే !"

"ఎవరు ? తావ్రోవేనా ?" అనడిగింది ఓల్గా, భర్త సూట్ కుడుతూ; ఇప్పుడావిడ ఆలోచనంతా తావ్రోవ్ మీదే.

"తావ్రోవ్ ? ఆయన లేచి కూర్చోడంలో ఆశ్చర్యం యేముంది ? నేన్చెప్పేది యాకోవ్ ఫిర్సోవ్‌ని గురించి ! ఇకా కషాయం మందుగానే వాడతా అందరికీనీ !"

ప్రక్కనే. బల్లమీదున్న దేవదారు కొమ్మతీసి, అదే పనిగా చూస్తూ నుంచున్నాడు దాన్ని మెచ్చుకుంటూ. ఆ గదంతా దేవదారు కొమ్మలమయంగా వుంది. వంటిల్లు మరీనీ; అసలు రంగుపోయి గదంతా దేవదారు రంగు. ఇళ్ల సూపరింటెండెంట్ వచ్చి, మళ్లీ రంగువేయిస్తానని చెప్పివెళ్లాడు.

"ముందు నేల పగుళ్లన్నీ మూసెయ్యాలి. ఒక యాభై కిలో గ్రాములన్నా (షుమారు రెండుంబాతిక పౌనులు) పడుతుంది అన్నాడతను."

ఎందుకో గాని, సందర్భం లేకపోయినా, ఆసంగతి చెప్పింది. ఓల్గా.

"అట్లాగే చెయ్యనీ" అన్నాడు ఇవాన్ ముందు; మళ్లీ అంతలోనే "యాభై య్యా? ఎందుకూ అంత?" అని యెగిరి పడ్డాడు, "మూడు గదులేగా వుంది? దాని కంతెందుకు? క్రిందటేడు హాస్పిటల్ కి రంగులేసేటప్పుడు చెప్పానే రంగు లెట్లా వెయ్యాలో. మర్చిపోయాడన్నమాట అప్పుడే." ఏదో గుర్తుకొచ్చినట్టు, కాస్సేపాగి, ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ, "మొత్తంమీద నువ్వుగూడా ప్రజలకి ప్రయోజనకరమైంది చేస్తున్నావంటే, చాలా సంతోషంగా వుంది, ఓల్గా! నా పుట్టిన రోజునాడులాగా నిజంగానే చాలా ఆనందంగా వుంది నాకు" అన్నాడు.

వెళ్తూ, వెళ్తూ ఓల్గాని ముద్దుపెట్టుకున్నాడు. లవణరక్త వ్యాధితో బాధపడుతున్న రోగుల్ని చూసేందుకొస్తావా నువ్వు గూడ? ప్రఖ్యాత రచయిత్రి ఒ. ఎ., కి ఆరోగుల్ని గురించి వ్రాయాలని బుద్ధిపుట్టినా పుట్టవచ్చు!" అన్నాడు.

"ఆవ్యాసం మీరే వ్రాయొచ్చు" అన్నది ఓల్గా, పట్టించుకోనట్టు. "రావటానికి, నేనూ వస్తాలెండి."

# 43

"నేను లేకుండా తావ్‌రోవ్ వెళ్లిచూడొద్దు" అని సలహా యిచ్చి నచ్చచెప్పింది పావా, ఓల్గాకి. తర్వాతటూ యిటూ అదే పనిగా తిరిగి గవదబిళ్లలు తెచ్చుకుంది. లోపలవెళ్లాలని ఓల్గా, బాగా తపన పడింది గాని వంటరిగా హాస్పిటల్ కెళ్లే

సాహసం చెయ్యలేక పోయింది. అదొకరకమైన బిడియం వేసిం దావిడకి ఒంటరిగా తావ్రోవ్ దగ్గరికి వెళ్ళాలంటే. అతన్ని హాస్పిటల్ కి తీసుకొచ్చిం దగ్గర్నుంచీ వున్నచోట వుండలేక పోతోంది; కాని పై పరిస్థితులేమీ గమనించ నట్టుండడంవల్ల పైకి మట్టుకు ప్రశాంతంగ వున్నట్టే కనిపిస్తోంది; కానది నిజంగాదు; ముఖం ముడుచుకుని తిరుగుతూంది.

"యేవిఁటి మరీ అట్లాయిదిగా వుంటున్నావ్?" అనడిగాడు ఇవాన్ ఒకరోజున విసుగ్గా, హాస్పిటల్ కెళ్ళే హడావిడిలో.

"యేమీలేదు" అంది ఓల్గా, అతని అసంతృప్తిని గమనించి; "మీరున్నప్పుడు యెగిరి గంతులేస్తేనేనేఁటి హుషారుగా వున్నట్టు?" అంటూ లేనిపోని హుషారు చూపెట్టింది.

ఎందుకొచ్చిన పోట్లాటలే మళ్ళీ అనుకున్నట్టూ, ఐనా చిరాకుగానే వున్నట్టూ చేయూపాడు ఇవాన్. దాంతో ఓల్గాకి మరీ అరికాలిమంట నెత్తికెక్కి నట్లయ్యింది.

"నేనంటే శ్రద్ధచూపింది మాత్రం యెప్పుడులే. నేనసలీ యింట్లో వున్నట్టే వుండదాయనకి; కుర్చీనో బల్లనో అనుకుంటాడు" అనుకుంది.

యాంత్రికంగా సూదీదారం తీసుకుంది;

"నన్నర్థంచేసుకుని, సానుభూతి చూపాలిగాని, నేనంటే యేదో పెద్ద దయున్నట్టు ప్రవర్తించడందేనికి? ఐనా అసలు నాకా తావ్రోవంటే అంత విశ్వాసమూ, నమ్మకమూ కలుగుతున్నై యెందుకనీ; పెద్దపరిచయంగూడా లేదాయె?" అనుకుంది. ఆ ఆలోచనొచ్చేటప్పటికి గుండె గుబేలుమంది; సూదీదారంతీసి దూరంగా పెట్టింది.

"ఛ యేమిటి అసంబద్ధపాలోచనలు!"

వరండాలోకొచ్చింది. తనకోసమే కాచుక్కూర్చున్నట్టు నునువెచ్చని గాలి తగిలింది. గాలికెగిరే దుస్తులు పట్టుకుని గెంతుతూ దిగింది మెట్లు; చుట్టూ కలయజూచింది. ప్రపంచ మంతా హాయిగావుంది. తలెత్తి పైకిచూచింది. నీలాకాశం ముక్క; చుట్టూ వుంగరంలా తెల్లటిమబ్బు; తనజన్మలో చూడ లేదంత నీలంరంగు ఆకాశాన్ని. తలవంచుకుని ముందుకు నడచింది, చుట్టూవున్న ప్రపంచాన్ని మరచిపోయి, తన ఆలో నల్లో తాను మునిగితేలుతూ, ఆనందంగా మందహాసం చేసు కుంటూ.

గాంగ్రీన్ రోగికి ఆపరేషన్ చెయ్యాలని నిశ్చయం చేసేసుకున్నాడు ఇవాన్ ఇవానొవిచ్; జిల్లాపార్టీకమిటీ కార్య దర్శి స్కొరొబొగతోవ్ యికిలాంటి ఆపరేషన్లు చెయ్యగూడ దని నిషేధించిన సంగతీ గుర్తుంది; ప్రాంతీయ పార్టీకమిటీ దగ్గరినుంచింకా జవాబు రాలేదనీ తెలుసు. ఐనా నిశ్చయిం చేసుకున్నాడు.

గూసేవ్ యెప్పటిలాగానే వచ్చి, 'అనుమతి తీసుకోవ డం మంచిది' అనీ, 'పరిస్థితులాలోచించారా!' అనీ, 'తేల్చు కున్న తర్వాత చెయ్యగూడదా' అని అన్నాడు. "ముందు రోగిని గురించి ఆలోచించడం మనధర్మం; తర్వాత ఆకాగితాల సంగతి" అన్నాడు ఇవాన్.

గూసేవ్ చెప్పినమాట ఇవాన్ యెప్పుడూ పాటించినట్టు కనబడదు కాని, గూసేవ్‌గూడా యేమంత పనికిమాలిన డాక్టర్

కాదు; కాని అతని తీరే అదోరకంగా వుంటుంది; యువతలి వాళ్ళకి చిరాకేసుకొస్తుంది అతను మాట్లాడుతుంటే. లేకుంటే గూసేవ్‌కున్న జాగ్రితలో యెంతోకొంత ఇవాన్‌కి అంటుకో వలసిందే. గూసేవలాంటి వింత మనిషికాబట్టే, అతనిచ్చే సల హాలు మంచివైనా వాటికి తగిన ఆదరం దొరకడంలేదు.

ఇంకొక సర్జెన్ వున్నాడు, సెర్గుతోవ్; యువకుడు. ఇవాన్ అతనికి సహాయం చేస్తాడు; స్వతంత్రంగా శస్త్రచికిత్సలు చెయ్యడానికి అవకాశం యిస్తాడు. గడ్డుకేసుల్ని గురించి, అత నితోబాటు కూర్చుని చర్చిస్తాడు. కష్టమైన ఆపరేషనంటే మట్టుకు తనేవెళ్ళి చెయ్యాలి.

"ఆపరేషన్ విఫలమైతే అది సర్జెన్‌కి అనుభవం లేకపోవ డంవల్ల జరిగిందని తప్పుకోవడం మంచిదికాదు" అని ఇవాన్ అభిప్రాయం.

"ఇవ్వాళ చేసే ఆపరేషన్ లాంటివి సర్వసాధారణమైనవి కాదు. అంచేత మీరందరూ అప్రమత్తులుగా వుండాలివ్వాళ." అన్నాడు ఇవాన్, ఆపరేషన్‌గదిలోకొచ్చి. చొక్కాచేతులు దండలదాకా మడిచి, చేతులు పైకెత్తుకునొచ్చాడు; చేతులు కడుక్కున్న తడిగూడా ఆరలేదప్పటికి. చుట్టూవున్న ఎసిస్టెం ట్లంతా తలలూపారు.

ఆపరేషన్ ముందు డాక్టర్లు వేసుకునే తెల్లటి ముసుగు కాళ్ళదాకా వ్రేలాడుతూంది, నుదుటిమీద రిఫ్లెక్టర్ (కాంతిని ప్రతిబింబింపచేసే సాధనం); అంత పెద్దగదిలోనూ, వున్నదాని కంటే యెక్కువెత్తూ,లావూ వున్నాడనిపించిందాయన్ని చూస్తే.

"రక్త ప్రసారం ఆగిపోవడంవల్ల వస్తూవుంటుందీ జబ్బు: అంటే రక్త నాళాలకి సంబంధించిన జబ్బన్నమాట. ధమనులకు సంబంధించినది కాబట్టి 'ఎండో ఆర్టెరైటిస్' అనిగూడ అంటారు దీన్ని," అంటూ నెమ్మదిగా చెబుతూ, వార్యా యిచ్చిన స్టెరైల్ గౌనువేసుకున్నాడు. "ఇదివరకీ జబ్బు వృద్ధాప్యంలో వస్తుందనుకునేవాళ్లం; కాని పసిపిల్లలకి గూడా రావడానికవకాశం వుందని యిప్పుడిప్పుడు పరిశోధనల్ని బట్టి తేలుతోంది."

"నరాలిదివరకే చచ్చిపోయినప్పుడు గూడా యీ పుండుని ఆపరేషన్ చేసి తీసెయ్యాలా?" అనడిగింది వార్యా, చేతి మేజోళ్లందిస్తూ.

"తీసెయ్యొద్దుమరి? ఈ ఆపరేషన్ చెయ్యడంతో యీ కుళ్లు మిగతా ప్రదేశాలకి పాకకుండా ఆపగలుగుతాం. బాగా వున్న నరానికి మళ్ళీ మంచిరంగుగూడా వస్తుంది. గజ్జల్దాకా నరికేకంటే, రోగి జీవితానికేహానీ లేకుండా మోకాలు క్రింది వరకూ నరకొచ్చును. ఒక్కోసారి సీలమండదాకాగానీ, లేకుంటే కాలి వ్రేళ్లు మట్టుకేగాని తీసెయ్యొచ్చు. అదే చేతులకి గూడా వ్యాపిస్తే జొమ్ముదగ్గర ఆపరేట్ చెయ్యొచ్చును. అలాంటాపరేషన్లు చెయ్యడం యిప్పుడిప్పుడే ప్రారంభిస్తున్నారు. కాని ఒకటిమట్టుకు నిజం; రోగి ఆరోగ్యానికవేమీ అడ్డురావు. మనిషన్న తర్వాత బ్రదికి సుఖపడాలి; కదూ? ఆలెగ్జీ!"

ఆలెగ్జీకి యిరవై మూడేళ్లుంటై; బాగా చిక్కిపోయున్నాడు; బాధతో సతమతమౌతున్నాడు. వచ్చి ఆపరేషన్ బల్ల మీదికెక్కాడు.

ప్రాంతీయ హాస్పిటల్లో డాక్టరు 'కాలుతీసెయ్యాలి' అని చెప్పాడు. అప్పుడు బాగాభయం వేసింది; అంతకంటే వెంటనే

చస్తేపోతుందనుకున్నాడు! గత యేడు నెల్లనుంచీ ఒకటేబాధ. రాత్రింబగళ్లట్లాగే పక్కమధ్యన కూర్చుని, కాలిని కౌగలించుకుని, చిన్న పిల్లల్నా పినట్టూపుతుండేవాడు.

కాలుతీసెయ్యడం తేలికే. కాని వొచ్చిన చిక్కేమిటంటే ఆ చిహ్నాలు రెండో కాల్లోగూడ కన్పిస్తున్నై. వున్నట్టుండి తెలిపోవడం, నొప్పితో కుంటవలసి రావడం; ఇక తర్వాతేం జరుగుతుందో బాగా తెలుసు అలెగ్జీకి: కాలు వాచిపోతుంది, వేళ్ళు నల్లబడిపోతై. అంటే తర్వాతిక కొద్దినెలల్లో ఆ రెండో కాలుగూడా తీసెయ్యాల్సొస్తుంది.

"మొట్టమొదటంతా చల్లగా యుగంలాగా వుండేది; తర్వాత మంట పుడుతోంది, ఒకటేమంట. ఇదివరకు నడుస్తున్నప్పుడుమట్టుకుండేదినెప్పి, ఇప్పుడు పక్కమీద పడుకున్నా తప్పడం లేదు" అని చెప్పేవాడతను రాత్రిళ్ళు నిద్రపట్టనప్పుడు కూర్చుని. ఇదివరకసలా కాలు అక్కడుందో లేదోగూడా గుర్తుండేది కాదు; ఇకిప్పుడు ఇరవై నాలుగు గంటలూ అదే ఆలోచన. జీవితం అంతా నరకంలాగా వుంది.

"పోతేపోయింది, తీసెయ్యండి కాలు; పీడొదుల్తుంది!" అన్నాడు.

ఇంతలోనే, ఖార్కోవ్లో బంగారపు గనుల్దగ్గిరొక సర్జెన్ వున్నాడనీ, ఈ జబ్బుకేదో కొత్త చికిత్స చేస్తాడనీ తెలిసిందతనికి.

# 44

రోగిని ఎడమవైపుకు తిప్పి; కాలు ఆపరేషన్ బల్లకి కడుతున్నారు ఎసిస్టెంట్లు; డాక్టర్ ఇవాన్ అదంతా చూస్తూ "యేం, అలెగీ! యెలావుంది?" అనడిగాడు.

"ఒకమాదిరిగా వుంది."

"ఒకమాదిరిగానా? ఏం?"

ఆపరేషన్ చేసేప్పుడు రోగి జెనరల్ పరిస్థితిని చూసే నికితా బుర్త్సెవ్ "భయంగా వుందల్లేవుంది" అన్నాడు. డయా థెర్మి సాధనం సీసపు ప్లేటు కడుతున్నాడు రోగి చేతికి.

"ఏంఫర్వాలేదు, మేం వున్నాంగా" అని ధైర్యం చెప్పాడు ఇవాన్, రేడియో సెట్టులాగావున్న ఒక చక్కని చిన్న పెట్టెవంక చూస్తూ. అదే ఆయ నుపయోగించబోయే ఎలెక్ట్రిక్ కత్తి.

"ఇప్పుడు గుండుసూదితో గుచ్చుతా నిన్ను; ఇప్పుడేం బాధ కలగదు. కాని, తర్వాత నొప్పెట్టినప్పుడు మాతో చెప్పు; మళ్లీ ఇంజెక్షన్ చేస్తాం" అన్నాడు ఇవాన్. ఈలోపుగా, ఆప రేషన్ చెయ్యవలసిన భాగాన్ని అయొడిన్‌తోనూ, ఆల్కహాల్ తోనూ కడిగేశాడు సెర్గుతోవ్. అయొడిన్ పూసినచోట వీపు మీద ఆకుపచ్చని గుర్తులు పెట్టాడు ఇవాన్; అక్కడ గాజ్, తువ్వాళ్లు గట్టిగా కట్టాలి. తర్వాత హైపోథెర్మిక్ సిరింజి తీసు కున్నాడు. సిరింజి నదివరకే నొవొకైన్‌తో నింపి యిచ్చింది వార్యా.

ఆకుపచ్చ గీతకి రెండోవైపునుంచి సిరింజి పెట్టాడు సెర్గుతోవ్. రెండు సూదుల దగ్గర్నుంచీ బయలేరే తెల్లటి చక్రాలు కలిసేదాకా చూచి, తర్వాతింకా పెద్ద సూదుల్తో ఇంజక్షన్ చేశారు. ఐదు నిమిషాలో ఆపరేషన్ కంతా సిద్ధమై పోయింది.

తల పైకెత్తకుండానే, చెయ్యి చాచాడు ఇవాన్; కత్తి అందించింది వార్యా. ఎప్పుడే దివ్వాలో వార్యాకి బాగా

తెలుసు; డాక్టరు ముహంమీద భావాన్నిబట్టీ, ఆ పెదవుల కదలికనిబట్టీ చేతులుచేసే సైగనిబట్టీ కావలసినపని వెంటనే చేసేస్తుంది. చుట్టుపక్కలున్న సర్జెన్లూ డాక్టర్లూ పరిహాసాలాడుకునేప్పుడు గూడా, దృష్టంతా రోగిమీదనే కేంద్రీకరించి చూస్తుంటుంది వార్యా, ఒక క్షణంగూడా యేమరకుండా.

వెన్నుమీదినుంచి పొత్తికడుపుదాకా ఒక్క చీరిక పెట్టేశాడు ఇవాన్ ప్రరుమని; "తప్పుకో!" అని కసురుకున్నాడు గుడ్డతో శుభ్రం చేస్తున్నతన్ని.

పక్షిముక్కుల్లావున్న మొండి క్లాంపు లందించింది వార్యా; సర్జెన్ అవి బిగిస్తుంటే క్లిక్‌మన్నై.

"కటెంట్ !"

నికితా బుర్‌సెవ్ మీట నొక్కాడు.

తెగిన రక్తనాళాల్ని మూసిన ఫోర్సెప్స్‌తో తాకి, డయాథెర్మీ సాధనానికి కలిపాడు ఇవాన్. పట్టుగుడ్డతో కట్టే బదులు, నాళాలు సీలుచేసినట్లయి పోయినై, చిన్నశబ్దం చేస్తూ. ఒకొక్క క్లాంపే తీసేశారు ఆపరేషన్‌కి అడ్డంరాకుండా. తర్వాత మళ్లీ యింకో చీరిక.

గాయం అంచులు కొక్కేలతో (హుక్స్) విడదీసి పట్టుకున్నాడొక ఎసిస్టెంట్.

"రిట్రాక్టర్ !"

అడక త్తెరలాగా పళ్లున్న పనిముట్టు నందించింది వార్యా.

గాయం అంచులచుట్టూ స్టెరిలైజ్ చేసిన గాజ్ పెట్టారు.

"ఇప్పుడు కాస్త బాధగా వుంటుంది, అలెగ్జీ!" అని చెప్పాడు ఉవాన్, రోగి ముఖానికి కట్టిన తెరలోపలికి చూచి, "చిరునవ్వు నవ్వుతూ భరించాలిసిందే; ఈ బాధెవరికైనా తప్పదు."

వెడల్పాటి మొండి కొక్కెం రెండోవైపునుంచి పెట్టి సెర్గుతోవ్ కప్పజెప్పాడు.

"అట్లాగే పట్టుకో. కదలబాకు. కదల్చొద్దు, నొక్కొద్దు, తుడుపు!"

రెండు శాతం నొవొకైన్‌లో ముంచిన తుడుపు (శ్వాబ్) పొడుగాటి పటకారుతో పట్టుకుని అందించింది వార్యా.

గాయంలోపల, సరిగ్గా వెన్నుదగ్గర కనబడింది నరం; ఆ నరం పట్టుకోవాలన్నమాట సర్జెన్.

"ఓర్పు పట్టు, అలెగ్జీ, ఓర్పు నాయనా; సాధ్యమైనంత వరకు అతి జాగ్రత్తగానే వుంటా నేను. ఇలాంటప్పుడే మన సరుకు తెలిసేది" అంటూనే, రోగి పెడబొబ్బలు పెడుతూన్నా వినిపించుకోకుండా ఆనరంవిడదీసి నొవొకైన్ ఇంజక్షన్ ఇచ్చాడు. "నాడి?" అనడిగాడు నికితాని.

"అరవై"

"కామ్ఫర్ ఇంజెక్షన్" అని, వార్యాతో "కొక్కెం" అన్నాడు.

తర్వాత మళ్లీ నరం పట్టుకున్నాడు.

"దారం!"

ఆనరం కిందకి జొత్నారు దారం. ఫోర్సెప్స్‌తో ఆదారం కొసలుపైకి లాగి ముడేసి, ఒక ప్రక్కకి నెట్టాడు ఇవాన్.

ఇంకో కొక్కెంతో ఇంకొక దారం. ఇకిప్పుడు నరం విడదీసి పైకి లేపడానికి వీలుగావుంది.

"నొవకైన్, మంచిసూది, బాగా పట్టుకుంటోందా? చూడు. ఎనేస్థేసియా బాగానే చేసిందనుకుంటా." అంటూ హైపర్ డెర్మిక్ సిరంజ్ వార్యా కిచ్చాడు. "తుడుపు. నరాని కొక క్లాంపు ఇదికాదు; తిన్నగావున్నదివ్వు. కత్తెర. ఆఁ" అంటూ గాంగ్లియా వావున్న తెల్లటి నరంముక్క ఫోర్సెప్స తో పట్టుకుని బయటికి తీశాడు. "యిదిదాయి" అన్నాడు వార్యాతో. "పెరాక్సైడ్ తుడుపు. ఊఁ, తొందరగా కింద పెట్టిన మడత తీసెయ్యి. రిట్రాక్టర్ అంతా పొడిగా వుండాలి. మూసెయ్యాలి!"

వంకరసూదికి దారం యెక్కించే వుంది. సూదిపట్టుకున్న పనిముట్టు క్లిక్‌మంది.

"లోపలికుట్లు మంచి గట్టిపట్టుతో వెయ్యాలి. అక్కడుండేవి చాలా ముఖ్యమైన కండరాలు" అన్నాడు, సెర్గ తోవ్‌తో. "వదులొదులుగా కట్టు. రెండోముడి అంతగట్టిగా వెయ్యనవసరంలా." ఒకముడి తనేసి చూపించాడతనికి. "చూశావా? వదులుగా వుంది. అట్లాగన్నమాట. మూడో కుట్టు చర్మంకిందున్న లావాటి నరానికేద్దాం. బాగా సన్నగా వుండాలి దారం; కుట్లు బాగా యెడం యెడంగా పడాలి. ఇదెంత తొందరగా మానుతుందో అంతిదిగా పుండుగూడా పడుతుంది. లోపలి పట్టుకుట్లు అలాగే వుండనిద్దాం.

ఆఖరుకుట్లు కుడుతూ "ఎలావుందిప్పుడు? అలెగ్జీ!" అనడిగాడు ఇవాన్.

"కాళ్లోకి రక్తం వస్తున్నట్టుంది. నొప్పేమీ లేదు."

"నేన్చెప్పలా. బాగా నొప్పేసిందా?" అని ఒకనిమిషం ఆగాడు ఇవాన్ రోగి నాడిని లెక్కపెడుతూ.

"మరి రెండో కాలెప్పుడు ఆపరేట్ చేస్తారు?" అనడిగాడు అలెగ్జీ, జబ్బు పాకుతుందనే వుద్దేశంతో.

"కొంతకాలం విశ్రాంతి తీసుకో. ఒక నెలరోజులాగి, తర్వాత చేద్దాం. ఈ సారింత భయపడవు కాదూ?"

అలెగ్జీ నవ్వాడు

"న్యాయానికి రెండోకాలేమంత నెప్పెట్టడం లేదు. ఇంకోకారునెల్లు చూద్దాం పోనీ."

అర్థం చేసుకున్నట్టు దయతో చూశాడు ఇవాన్ అతని వంక. "నీకేమంచిది; ఎక్కువ కాలం ఆపడం మంచిది కాదు" అన్నాడు.

# 45

ఓల్గా హాస్పిటల్ గుమ్మంలో కెళ్ళేప్పటికి మందుల వాసన గప్పున కొట్టింది. లోపల దారంతటా తివాసీలు పరిచున్నై. ఎదురుగుండా గోడకి పొడుగాటి ద్వారాలున్నై; కిటికీల ప్రక్కనే నవనవలాడుతూ గాలికి వూగిస లాడుతున్నై పూలమొక్కలు.

ఎక్కడో దూరంగా ఒక పెద్ద మూలుగు వినిపించింది; ఓల్గా కొయ్యబారిపోయింది. ఒక సెకనాగి, మళ్ళీ ముందు కేసింది అడుగులు. ఈ సారి చాలా దగ్గర్లోనే వినిపించిందింకొక మూలుగు. ఎవరో గుసగుస లాడుకుంటున్నారు నిశ్శబ్దంగా; నిట్టూర్పులు; బరువైన పదార్థమేదో, కిందబడితే ప్రమాద మన్నట్టు, చాలా జాగ్రత్తగా మోసుకెళ్ళే పదాల చప్పుడు.

పక్క గుమ్మంలోంచి వచ్చింది వార్యా. "ఇవాన్ ఇవా నొవిచ్ కోసమా?" అనడిగింది. "ఇప్పుడే ఆపరేషన్ పూర్తి చేసుకుని పోలీక్లినిక్ కెళ్ళారు, సలహాకోసమని కబురంపితే. కాస్సేపుంటేగాని రారు. కావాలంటే రిక్రియేషన్ గదిలోకి తీసుకెళ్తా రండి."

ఒక తలుపు తెరిచి బయల్దేరింది. వెనకే ఓల్గాగూడా వెళ్ళింది. వెనకనుంచి చూస్తూంటే చాలా అందంగా వుంది వార్యా. రెండుజడలూ మడిచి ముడిగా కట్టుకుంది టోపీకింద. ఒక చేత్తో బెల్టూ, గౌనుకాలరూ సర్దుకుంటోంది; రెండో చేతిలో ఒక ట్రేవుంది; ఆ ట్రేలో మందులూ, సిరింజీ వున్నై. వార్యా ప్రతికదలికా యెంతో ప్రశాంతంగా వుంది.

"ఇదేగది" అంటూ ఒక తలుపు చూపించి తప్పుకో బోయింది కాని, యింతలోనే యెరిగిన వాళ్ళ నెవర్నో చూసి నట్టు తనుగూడా గదిలో కడుగు పెట్టింది.

టేబుల్ ప్రక్కనే, చక్రాల బండిలో కూర్చునున్నాడు తావ్‌రోవ్. గుమ్మంవైపుకి సగం తిరిగి బాగావున్న మోకాలి మీద నోట్‌బుక్ పెట్టుకుని వ్రాసుకుంటున్నాడు. రెండోకాలు సాచివుంది పెద్ద పట్టీ కట్టి.

అతనికెదురుగుండా ఇంకొకతనుకూర్చున్నాడు. బహుశా మిల్లునుంచి వచ్చినట్టున్నాడు.

తావ్‌రోవ్‌ని పిలిచింది వార్యా. వ్రాయడం మానేశి, తలపైకెత్తి చూశాడు. ఎదురుగా ఓల్గా నిలబడుంది.

"హెలో" అంది దగ్గరకెళ్ళి, "యెంత గొడవపెట్టారు మమ్మల్ని! ఐనా ఆ తప్పిపోవడం యేమిటి?"

"ఆఁ, వూరికే నడుచుకుంటూ వెళ్ళిపోయాను" అన్నాడు బిడియపడుతూనే ఆవిడవంక ఆనందంగా చూస్తూ. "ఈ కొండల్లో మరీ అంత దారితెలియకుండా పోతుందనుకోలేదు. కాని తెలిగ్గానే తప్పాను దారి; మంచు దట్టంగా పట్టింది కదూ."

వాళ్ళిద్దర్నీ అలాగే చూస్తూ నిలబడింది వార్యా.

"అబ్బ మమ్మల్నెంతయాతన పెడుతున్నారనుకున్నారు యీాయన! మాదుంప తెంపేస్తున్నారు" అంది వార్యా, "పక్కకి కట్టెయ్యాలిలాంటి వాళ్ళని. కాస్త కోలుకున్నారో లేదో. అప్పుడే పని ప్రారంభించేశారు; మిల్లునుంచి మనుషుల్ని పిలిపించుకుని వొకటే సమాలోచనలు. మంచిది కాదని చెప్పినా, మా మాటంటే ఖాతరే లేదు."

"లేదు, లేదు వార్యా! మీరు చెప్పిందంతా తూచాలు తప్పకుండా పాటిస్తున్నా."

"అంతా ఒట్టిది. డాక్టరు చెప్పిన మాటొక్కటీ వినడం లేదు మీరు. ఈసారి ఇవాన్ ఇవానొవిచ్‌తో చెప్పేస్తాను; ఇక వార్డులోకి చూచేవాళ్ళని రానిస్తారేమో బహుశ."

అని కాస్సేపాగి, యింకేదో తొందరపని మీద వున్న ట్టెళ్ళి పోయింది వార్యా తొందరగా. కూర్చున్న కుర్చీమీద నుంచిలేచి, ఓల్గాని కూర్చోమన్నట్లు సైగజేశాడు తావ్‌రోవ్ కెదురుగా కూర్చున్నమనిషి. తావ్‌రోవ్‌తో యింకొక నాలుగు మాటలు మాట్లాడి, అతిజాగ్రత్తగా అడుగులో అడుగేసు కుంటూ వెళ్ళిపోయాడు బయటికి; వార్యా మాటలు పని జేశాయన్నమాట.

"చూచారా, యెంతనిరంకుశమో యిక్కడ" అని నవ్వాడు తావ్‌రోవ్. ఓల్గావైపుకు తిరిగి, "యేమిటి విశేషాలు? యేంజేస్తున్నారు?"

"పని చేస్తున్నాను. ఈ మధ్య నా వ్యాసం వొకటి అచ్చుయ్యింది. ఇవ్వాళింకొక పత్రికొచ్చింది. మీరింకా చదవ లేదా ?"

"చాలా సంతోషంగా ఉండుండాలి మీకు' కదూ ?" అనడిగాడు తావ్‌రోవ్.

పైజామాలేసుకుని అటు యిటూ తిరుగుతున్నారు రోగులు; టేబుల్ పక్కనే నిలబడి మాటాడు కుంటున్నారు. ఐనా యీ యిద్దరికీ వొంటరిగా వున్నట్టే వుంది; ఒకరినొకరర్థం చేసుకునేందుకు మాటలుగూడా అవసరం కాదనిపించింది యిద్దరికీనీ.

తనకొచ్చే సందేహాల్ని గురించీ, తను పనిచేసే పద్ధతిని గురించీ, పనంటే వున్న శ్రద్ధను గురించీ, చెప్పింది ఓల్గా.

"మొట్టమొదటి వ్యాసం అచ్చుయ్యినప్పుడు వచ్చినంత పనైందంటే నమ్మండి; ఎంత బాధ్యతెంత బాధ్యత!"

ఇప్పుడు బాగా సంతోషంగా వుంది ఓల్గా; తావ్‌రోవ్ తప్పిపోయింతర్వాత ఆవిడింత స్వేచ్ఛగా వూపిరి పీలుస్తోం దిప్పుడే సూటీపోటీ మాటలూ అవీ తగుల్తాయేమో యీ మొట్టమొదటిసారి కలయికలోనని భయపడింది; ఇప్పుడదేమీ లేదు.

ఒకనిమిషం యేదో ఆలోచించుకుని కనులు లేపిచూచింది; మెత్తగా, మృదువుగా మెరసిపోతున్నై ఆ కనులు. అతనూ చూశాడు అదేసమాయానికి. ఒక్కక్షణమాత్రం యిద్దరి చూపులు కలిశాయి. "యేమిటిలావుంది నాకు!" అని అరచినంత పనైంది ఓల్గాకి. తననుంచీగూడా తానింతవరకూ దాచు కుంటూవచ్చిన రహస్యాన్ని తావ్‌రోవ్‌కి చెప్పేసినట్లుంది ఆ ఒక్క క్షణంలోనే. లేచి వెళ్ళిపోదామనుకుంది; కాని కాళ్ళు చెప్పినమాట వినలేదు.

"నేనక్కడున్నంతసేపూ మిమ్మల్నే తలచుకుంటూ వున్నా" అన్నాడు తావ్‌రోవ్, అతిమెల్లగా, వినబడీ వినబడ కుండా.

# 46

"ఇక్కడే వున్నావన్నమాట; వార్యా చెప్పిందిలే" అంటూవచ్చాడు ఇవాన్ లోపలికి. "చాలాసేపైందా వచ్చి?" అనడిగి, జవాబు వినకుండానే, చెయ్యి పుచ్చుకుని, లవణ రక్తవ్యాధి రోగులున్న వార్డు వైపుకి తీసుకెళ్ళాడు. "ఆగు, నువ్వే చూస్తావుగా! దేవదారు మందిదివరకు నుంచీ వున్న దేగా అంటున్నారు చాలామంది; దానికొక్కటే సమాధానం

చెబుతున్నా నేను; జనం వుపయోగించే మందుల్ని గురించి ఆలోచించవలసినంత శ్రద్ధగా ఆలోచించడం లేదు మనం. అదీగాక వూరికే మందు తెలిస్తే చాలదు; అదెట్లా వుపయోగించాలో కూడా తెలియాలి."

భర్తచెప్పే మాటలు వింటున్నదే గాని, ఏమీ అర్థం కాలేదు ఓల్గాకి. ఇప్పుడు తనహృదయంలో జరుగుతున్న మార్పు యెంత ప్రాముఖ్యమైనదో యిద్దరికీనీ!

ఇద్దరూ కలిసొక పెద్దగదిలోకి ప్రవేశించారు. హాస్పిటల్ దుస్తుల్లో చాలామంది అటూయిటూ తిరుగుతున్నారు. ఇవాన్ ఇవానొవిచ్‌ని చూడగానే ఎవరి పక్కలమీదికి వాళ్ళు వెళ్ళిపోయారు గబగబా.

"ఒక్కవారం క్రితం యిందులో ఒక్కళ్ళకీ నడిచే ఓపికుండేది కాదు'' అన్నాడు ఇవాన్ ఒకమంచంవేపు కెళ్తూ. ఆ మంచం మీదొక ఆజానుబాహుడు కూర్చునున్నాడు మంచం పట్టీలు గట్టిగా పట్టుకుని.

"మెరుగ్గావుందా, ఫిర్సోవ్ ?"

"కాస్తమెరుగే." అన్నాడతను నవ్వుతూ.

"లేచినుంచో చూద్దాం" అన్నాడు ఇవాన్, ప్రేమగా.

లేచి నిలబడి చంకలక్రింద కర్రల నానృుకుని మంచాల మధ్యగా నడిచాడు ఫిర్సోవ్; యింకా కొద్దిగా కష్టంగానే వుంది నడవడం. శరీరంమీదింకా పూర్తిగా కంట్రోలు రాలేదు. ఎగిరెగిరి పడుతూ నడవడంగూడా బాగానే వున్నట్లుందతనికి.

"బావుంది, బావుంది" అంటూ ఉత్సాహపరిచాడు ఇవాన్, "ఏదీ చెయ్యిలేపి చూడొకసారి, కుడిచెయ్యి, యేదీ వెనక్కి వూపొకసారి."

"ఫిర్సోవంటే యేమిటనుకున్నారు? గొప్పవీరుడు!" అన్నాడు ఫిర్సోవ్ కెదురు మంచంమీదున్నతను, "చచ్చి బ్రతికాడనుకోవచ్చు. కాకపోతే ఆ పళ్లే పాపం...."

"నిజవేఁ" అన్నాడు ఫిర్సోవ్ గూడా నవ్వాపి, "తెల్లగా చక్కగా వుండేవి నాపళ్లు. ఈ పాడురోగంతో అవి కాస్తా పోయినై. ఇకిప్పుడు యుద్ధంలో కెళ్ళాలంటే తీసుకోరను కుంటా నన్ను."

"పళ్ళులేని ముసలాడివి. బోసినోటివాణ్ణి నిన్నెందుకు చేర్చుకుంటారు సైన్యంలో?" అంటూ నవ్వాడు ఎదురుగా వున్న రోగి.

ఫిర్సోవ్ వంక జాగ్రత్తగా చూచింది ఓల్గా. గమ్మత్తుగా వుందతని మొహం, లోపలికి తోసుకుపోయిన దవడలు: ముసలి వాళ్ళకి మల్లే లోపలి కొంగిపోయిన క్రింది పెదవీ. ఇప్పుడర్థ మైంది అతను నవ్వుతూంటే అంతవిచారంగా వున్నట్టు యెందు కనిపించిందీని.

"ఏదీ, చూద్దాం" అంటూ ఫిర్సోవ్ తలపట్టుకుని, నోరు తెరవమని చెప్పి, చూశాడు ఇవాన్.

ఓల్గా కళ్ళంట నీళ్ళు తిరిగినై. చేసేపనిచాలా ప్రముఖ మైందనీ, ప్రజలకి దానవసరం యెంతో వుందనీ తెలుసుకోవడం కంటే కావలసిందీ, సంతృప్తిపరచేదీ యింకేముంటుంది యెవరి కైనా? వైద్యాన్ని వృత్తిగా చేసుకోవాలని ఆవిడెప్పుడూ అనుకోలేదు, నిజమే; కాని ఆ వైద్యం వల్ల కలిగే ఫలితా లివిగో, కనులకట్టినట్టు కన్పిస్తున్నై. ఒకమనిషి చచ్చి బ్రది కాడు. ఇలాంటి వ్యక్తుల జీవితాలతో సంబంధం యేమీ లేనట్టూ వాళ్ళతో తనకు పట్టనట్టూ వుండగలదా తాను?

సాధ్యంకాదు, వుండలేదు. అంటే తన డాక్టరు భర్తనా పట్టినట్టుండడం సాధ్యం కాదన్న మాటే.

"ఐతే, నీకు కట్టుడుపళ్లు తెప్పిస్తాం" అని ధైర్యం చెప్పాడు ఇవాన్, ఫిరోస్వ్‌కి. "నీకేవంటే యిష్టమో చెప్పు. బంగారపువా, తెల్లటివా? నీయిష్టం. ఇక్కడే, యీహాస్పిటల్లోనే చేయిద్దాం నీ ఆదికి తగినట్టు."

మంచం పట్టీమీద కూర్చోబడ్డాడు ఫిరోస్వ్; మిగతా రోగులందరూ చంకలకిరింద కర్రలుపెట్టుకుని లేచారు.

"ఇదిగో. ఆకర్రలేకుండా నడువ్ నువ్వు" అనన్నాడు డాక్టరు యింకొకతనితో. మిగతవాళ్ళకంటె కాస్త మెరుగ్గా వున్నట్టున్నాడతను.

కర్రలు క్రింద పెట్టి జాగ్రత్తగా నడిచాడతను, సంతృప్తిగా.

"ఓహో, ఐతే యిక నీకూ కర్రలవసరం లేదన్నమాట; సరే, నువ్విక్కడి కొచ్చినప్పు డెట్లావున్నావో చెప్పు కాస్త" అన్నాడు ఇవాన్.

న్యాయానికారోగి చెప్పవలసిన అవసరమే లేదసలు; ఇవాన్‌కీ బాగాగుర్తే. కాని, ఓల్గా వింటుందిగదా అని వేశాడా ప్రశ్న.

"మొదట నన్ను స్ట్రెచర్ మీద తీసుకొచ్చారు. కాళ్ళూ, చేతులూ గూడ కదపలేక పోయేవాణ్ణి. ఇంటిదగ్గర ఆవిరి స్నానాలూ అవీ చేయించేవారు; లాభంలేక పోయింది."

"మొదట్లో యితనికి నమ్మకం కుదరలేదు" అంటూ చెప్పుకొచ్చాడు ఇవాన్, ఓల్గాతో "'దేవదారు కషాయం యేమిటి? పనిచెయ్యడ మేమిటి?' అని అనుమానం."

పావా చెప్పినమాట గుర్తుకొచ్చింది ఓల్గాకి. ఈ కషాయం మూలాన గుండె, మూత్రపిండాలూ దెబ్బతింటాయని చెప్పింది పావా.

"ఈవ్యాధంత కంటే ప్రమాదమైందిగదా!" అనుకుంది ఓల్గా. "మొత్తం శరీరమే నాశనమై పోతుంది. ఐనా, యేమీ తోచక అనుకునే మాటలుకాని ఒకజబ్బునే నయంజేస్తున్న మందును గురించి స్తనశల్య పరీక్ష జెయ్యడం యేమంత మంచిది కాదు." భర్తతో కలసి ఆనందించే బదులు, ఆయనచేసే పనులిలా సమర్థించడం యెందుకో అర్థం కాలేదు ఓల్గాకి.

# 47

"ఇక నేనిక్కడ వుండలేనండీ" అన్నాడు డాక్టర్ ఇవాన్ ఇవానొవిచ్, లొగునోవ్‌తో.

జిల్లా పార్టీ కమిటీ ఆఫీసు హాలులో కూర్చునున్నారు యిద్దరూ సిగరెట్లు తాగుతూ. అంతకుపూర్వమే జిల్లాకమిటీ కార్యదర్శి యిద్దర్నీ చడామడానాలుగని పంపించాడు. గనుల్లో కేంద్ర మురుగుపారుదల సౌకర్యం యేర్పరచా లన్నందుకు లొగునోవ్‌ని దుయ్యబట్టాడు; గనుల్లోవున్న యంత్రాల్ని పూర్తిగా సద్వినియోగం చెయ్యలేక పోతున్నారని యేమేమో అన్నాడు. ఇక ఇవాన్ పత్రికలో వ్రాసిన వ్యాసాన్ని గురించి దీర్ఘోపన్యాసం చేశాడు కార్యదర్శి; అలాంటివ్యాసాలు వ్రాయగూడదని హెచ్చరించాడు. ఇవాన్ వ్రాసింది లవణరక్తవ్యాధిని గురించి. అలాంటి వ్యాధుల్ని గురించి వ్రాస్తే జనం బెంబేలెత్తి పోతారనీ, గాభరాపడిపోతారనీ అన్నాడు కార్యదర్శి; ఇది

ప్రజా వ్యతిరేకులుచేసే పనిగాని, హాస్పిటల్లో వుండే డాక్టర్లు చేసేపని గాదని కోప్పడ్డాడు. ఈ జబ్బునుగురించిన వార్తల కేమీ ఆధారం లేదనీ, ఎవరో గిట్టనివాళ్లు పుట్టించే నీలి-వార్తలనీ తెలుసుకోమని హెచ్చరించాడు.

"నేనా వ్యాసం వ్రాసింది. ఆజబ్బుని నిరోధించేందుకు తీసుకోవలసిన జాగ్రత్తలూ, మందులుపయోగించే విధానమూ, నలుగురికీ తెలియ జెయ్యాలనే, యింకేమీ కాదు." అనిచెప్పాడు ఇవాన్. "కళ్ళముందు జరిగే విషయాల్నిగూడా చూడకుండా కళ్లు మూసుకున్న వాళ్లెవళ్ళూ బాగుపడలేదు" అని గూడా అన్నాడు. కానింతలో వ్యక్తిగత విషయాలు గుర్తుకొచ్చి, కాస్సేపు మాట్లాడకుండా వూరుకున్నాడు. ఓల్గా సంగతి గుర్తుకొచ్చింది. యేమిటా ఆ సంగతి అని ఆలోచించుకునేలోపుగానే కార్యదర్శి మళ్లీ అందుకున్నాడు.

"మీరు కమ్యూనిస్టులు. ఐనప్పుడు స్థానిక నాయకత్వాన్ని గౌరవించవలసిన బాధ్యతవుంది మీకు, డాక్టర్!" అన్నాడు రెప్పవెయ్యకుండా చూస్తూ. "కాని మీరు చేస్తున్నదేమిటి? ప్రజలందరూ మిమ్మల్నే పూజించాలని అనుకుంటున్నారు మీరు" అన్నాడు, యకూత్ జాతివారూ, ఇవెన్లూ డాక్టర్ ఇవానంటే చూపే గౌరవాదరాన్ని దృష్టిలో పెట్టుకుని యెద్దేవజేస్తూ. "జిల్లాపార్టీకమిటీ కార్యదర్శిని గాబట్టి మీకొక హెచ్చరిక చెయ్యదలుచుకున్నాను: మీప్రవర్తనేమీ బాగుండలేదు; అసలు విషయం బైటపడకా తప్పదు; అప్పుడు మీరందరు ఫలితా లనుభవించకా తప్పదు. పూజలు కావాలన్నంత మాత్రాన జరగవు; అందుకు తగినట్లు పనిచెయ్యాలి."

"నేను పనిజేస్తూనే వున్నానే" అన్నాడు ఇవాన్ కోపంగా, "నాశాయశక్తులా, నేచేయగలిగిందంతా చేస్తూనే వున్నా."

"అందరూ చేస్తున్నారు శాయశక్తులా" అంటూ అడ్డు తగిలాడు కార్యదర్శి. "అందులో గొప్పేముంది? అది మన ధర్మం; మనకర్తవ్యం. తనకిచేతనైనంతా చెయ్యవలసిందే ప్రతి మనిషీనీ. మీరు చేసే అనేక పొరపాట్లని క్షమించాం" అన్నాడు; బహుశా అంతకు క్రితం జరిగిన ఆపరేషన్‌నిగురించి ఆయన మాట్లాడుతున్న దని తెలుస్తూనేవుంది. "మీరెలాగూ చెప్పుకోదగ్గ స్పెషలిస్టులూ, నైపుణ్యం వున్నవారూ కాబట్టి యింకా అనేక విషయాలు చూసిచూడనట్టు పోతూనేవుంటాం. మీరు అలుసుచూచుకుని, మీచుట్టూ ఒక భక్త సమాజాన్ని యేర్పరచుకోవాలనుకుంటే మాత్రం చాలా పశ్చాత్తాప పడ వలసి వస్తుంది; మీకే నష్టం. అదీగాక........"

"ఇంతకీ నన్నేం చెయ్యమని అతని వుద్దేశం?" అను కున్నాడు ఇవాన్ జిల్లా ఆఫీసునుంచి బయటి కొస్తూ.

హాలులో లొగునోవ్ కన్పించాడు. లొగునోవంటే ఇవాన్‌కి బాగాయిష్టం. ఈవిషయాలన్నీ ఇతనితో వొకసారి చర్చిద్దాం అనుకున్నాడు.

ఇవాన్ బయటికి రాగానే, లొగునోవ్ లోపలికెళ్లాడు. అతనాఫీసునుంచి బయటపడేప్పటి కొక గంట పట్టింది. అప్పటి దాకా హాలులోనే కూర్చున్నాడు ఇవాన్.

"యింకా యిక్కడే వున్నారెందుకు?" అనడిగాడు లొగునోవ్.

"మీకోసమే చూస్తూ కూర్చున్నా. మీకూ్కడా తుపొ్పదిలేట్టు వుపన్యాసం యిచ్చాడా ?"

"యిచ్చాడనుకోండి; ఐనా లాభం ?" అన్నాడు లోగునోవ్; ఇంకా ఆ కోపం చల్లారినట్టు లేదు. "ఎవళ్లోవచ్చి నూరిపోసినట్టున్నారు. అసలాయనకీ వుత్పత్తి, సాంకేతిక విధానాల్ని గురించి యేమీ తెలిసినట్టు లేదు."

"బాగానే వుంది; తెలియాల్సిన అవసరం ? మరీ నిపుణులంతా యెందుకాయనకి ? వాళ్లమీద కాస్సేపు మొరిగితే చాలు, ఆయనకింకా పనేముంది గనక ?"

"నిజంగానే, ఆయన వుద్దేశం ప్రకారం కార్యదర్శంటేనే అంతయినట్టుంది." అన్నాడు లోగునోవ్ విసుగ్గా నవ్వుతూ, "ఊరికే వచ్చిన మనుషుల్ని నాలుగని పంపించడం. మొన్నీమధ్య వొకసారి, ఆయన్ని కలుసుకోవాల్సొచ్చి ఆఫీసులోకెళ్తే ఆఫీసంతా ఒకటే పొగ; కత్తిపెట్టి నరికితే తెగేటట్టుంది. 'ఏమిటండీ యిక్కడేం చేస్తున్నారు కూర్చుని ?' అన్నా. 'అబ్బ! యిక్కడ మేం చేసిన యుద్ధం మీరు చూస్తేనా! అంబోతుల కుమ్ములాట!' అన్నాడు."

"మరి ఆయనా ఆంబోతేగా" అన్నాడు ఇవాన్, "అదిగూడా సరైన ఆంబోతుకాదు!"

"యేం ? యెందుకని ?"

ఇద్దరూ వొకరినొకరు చూచుకున్నారు. ఇద్దరికీ స్కోరొబొగతోవ్ అశ్వాననమూ, రెప్పలారని ఆగుండ్రని కళ్లూ గుర్తుకొచ్చినై ఒకేసారి. ఇకిద్దరూ ఒకటే పగలబడి నవ్వడం. ఆఫీసుల్లో వున్న గుమాస్తాలందరూ వొక్కసారి తలుపులు తెరచి చూచారు యేమిటా యీవిడ్డూరమని.

అల్లరిచేసిన పిల్లకాయల్లా, గబగబా, తలుపులు తెరుచుకుని వెళ్ళిపోయారు యిద్దరూనూ.

# 48

వ్రాసింది కొట్టేసి, మళ్ళీ మొదలెట్టింది ఓల్గా. ఈసారి వ్యాసం బాగుండాలని ఆవిడ వుద్దేశం. ఊరికే కార్మికులు పోటీపడి పనిచేస్తున్నారని వ్రాస్తే చాలదు; అంకెలు వేసి చూపించినా చాలదు; ఒకసారటు చూచి వదిలేస్తారు పాఠకులు. ఆ వ్యాసం చూచి పాఠకుడు ఆగాలి; ఆలోచించాలి. ఆ ఫలితం సాధించడ మెలా ?

"ఓల్గా, ఒక కప్పు టీ తెచ్చి పెడతావ్ ?" అని కేకేశాడు ఇవాన్, తన గదిలోనుంచి.

"ఒక్క నిమిషం" అంది ఓల్గా లేవకుండానే.

"కొంతమంది కార్మికుల జీవిత విశేషాలు వ్రాస్తే యెట్లా వుంటుంది ? పాఠకుల కభిరుచి కలుగుతుంది నిజమే; కాని వార్తాపత్రిక్కి పంపేవార్తలలా వుండగూడదే మరి !"

"పనిలోవుంటే, ఆపనిచూసుకో; ఫర్వాలేదులే" అంటున్నాడు భర్త.

ఆయనే లేచెళ్ళి తెచ్చుకోవచ్చు టీ. కాకపోతే ఆ టీ ఆవిడ చేతుల్తో యిస్తే యింకా బావుంటుంది.

"నేనే తెచ్చుకుంటాలే" అన్నాడు గాని, అనుకోకుండానే కొంత కోపమూ, విసుగూకూడ ప్రతిధ్వనించినై ఆమాటల్లో.

"మీరు తెచ్చుకోవడ మెందుకూ? నేనే తెస్తానన్నగా. ఇంకొక నిమిషంలో" అంది ఓల్గా కోపంగానే.

వెంటనే లేచి వంటింట్లో కెళ్ళింది. కెటిల్ చల్లగావుంది. కెటిల్ తీసి పొయ్యిమీద పెట్టి, మళ్లీ తన ఆలోచనల్లో తాను పడిపోయింది.

"కార్మికుల జీవితాల్ని గురించీ, పనిని గురించీ వ్రాసింది. కొట్టేసెయ్యడం మంచిది; ఆసంగతి ఇక్కడందరికీ తెలుసు. కాబట్టి అదనవసరం. బంగారం బయటపడి నప్పటి దృశ్యాల్ని, ఉత్సాహాన్నీ వర్ణించాలి; అంకెలు ? ఆ అంకెలు యెక్కడ యెట్లా జొప్పిస్తే బాగుంటుంది?"

"ప్రాంతీయ కమిటీకి వ్రాసిన వుత్తరం నకలు పెట్టామే. కవరు? నీలిరంగుది. ఎక్కడుందది? కన్పించడం లేదే నాకు?" అని కేకేశాడు భర్త, అవతలి గదిలోంచి.

"మీ డెస్కులోనే పెట్టాను; కుడిచేతివైపు డ్రాయర్లో" అంది ఓల్గా గదిలోకొస్తూ.

వచ్చి కవరు వెదికి యిచ్చింది; టీ యిచ్చింది. తనదారిని తను వెళ్లిపోయింది. భర్తమాత్రం అక్కడే కూర్చుని యెప్పటి లాగా హుషారుగా తన కాగితాలు తిరగవేసుకుంటూ పని జేసుకుంటున్నాడు.

ప్రాంతీయ కమిటీకి వ్రాసిన లేఖనిగురించి ఓల్గాకూడా విన్నది. ఆ విషయం ఎలీనా చెప్పింది. హాస్పిటల్లో యేమి జరిగినా ఎలీనాకి తెలియవలసిందే. అక్కడనుంచి వచ్చే జవాబు కోసం మహా ఆదుర్దాగా యెదురు చూస్తోంది ఎలీనా; ఈసారి జిల్లా కమిటీ కార్యదర్శి తిక్క కాస్తా కుదురుతుందని ఆవిడ

ప్రదేశం. గూసేవ్‌ని హాస్పిటల్ అధికారిగా మళ్లీ వెయ్యరనే ఆవిడ దృఢవిశ్వాసం; చివరికి న్యాయమే జయించి తీరుతుందని నమ్మకం.

"మనం చేసేదంతా మంచిపనే" అన్నదావిడ "చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవ!" కాని ప్రతి పనికీ యింత ఆలస్యం యెందుకు? ముళ్ళమీద కూర్చున్నట్టుంది మరీనీ."

ఓర్పుగా వుండాలనీ, వుండడం అవసరం అనీ అనేకసార్లు నచ్చజెప్పుకుంది: "ఏది చెయ్యాలన్నా పూర్తిగా విచారణ జరపాలి. ఇంత పెద్ద ప్రాంతం; అనేక విషయాలుంటై. అన్నీ త్వరత్వరగా పరిష్కరించాలన్నా సాధ్యంకాని పనే!"

"ఇంత జరుగుతూన్నా, ఒక్కముక్కగూడా అనలేదు నాతో" అనుకుంది ఓల్గా. "నిజమే, నాకూ తెలుసు; ఆయన చాలా గొప్పగొప్ప పనులు చేస్తున్నారు; నేను చేస్తూన్నదంతా అతిస్వల్పమే దానితో పోల్చిచూస్తే. కాని, కనీసం అప్పుడప్పుడైనా అడకనుక్కోవచ్చుగదా నన్ను." భర్తంటే వైముఖ్యం యెక్కువౌతోందన్న విషయం ఓల్గాకీ తెలుసును. అందుకే అంత విచారం. "నేనుచేసే పనంటే కనీసం యెంతో కొంత శ్రద్ధ చూపించొచ్చునుగదా; ఆ మాత్రం చూపించితే, తర్వాత పదికప్పుల టీ యిమ్మన్న యిస్తానే; ఏ పని చెయ్యమంటే ఆపని చేసి పెడ్తానే, నోట్లోమాట నోట్లో వుండగానే; కాగితాలన్నీ యెక్కడివక్కడ సర్ది అమర్చి పెడతానే; మీరు నన్ను చెయ్యమనేదిగూడా యేమంత పెద్దపని గాదే." జారిపోయిన ఆనందాన్ని తిరిగి చిక్కబట్టుకోవాలనే తుణిక కాంతు వుప్పెనలా లేచిందావిడలో; వెళ్ళి భర్త భుజాలు కావిలించుకుంది.

"ఏమండోయ్, రచయిత్రిగారూ! ఏమిటీ కథ!" అన్నాడు ఇవాన్. మొహం ప్రక్కకు తిప్పి ఆవిడ చేతులు ముద్దుపెట్టుకున్నాడు. "మరీ ఏకాంతంగా వున్నట్టుందా? నావ్యాసంమీద జిల్లా కమిటీ కార్యదర్శి యెంత దుమారం లేపాడనుకున్నావ్! అతనన్న మాటలు విన్న తర్వాత యిక జన్మలో యెప్పుడూ యేమీ వ్రాయగూడదని నిర్ణయించుకోవలసిందే యెవరైనా సరే. వెళ్ళి లోగునోవ్‌తో మాట్లాడొస్తా. ఆయన సలహా లేందే తోచడంలేదు."

మళ్ళీ తనగొడవలో తాను పడిపోయాడు ఇవాన్; ఓల్గా హృదయం మళ్ళీ ముడుచుకు పోయింది.

# 49

స్టెఖనోవ్ ఉద్యమాన్ని గురించి జిల్లాపార్టీ ఆఫీసులో సమావేశం జరుగుతోంది. పార్టీసభ్యులూ, తదితరులూగూడా వచ్చారా సమావేశానికి. చర్చలు సాగి సాగి లోగునోవ్‌కి వ్యతిరేకధోరణిలో పడినై. ఊరికే పైపై నాయకత్వం వహించుతున్నాడనీ, డబ్బు మంచినీళ్లప్రాయంగా ఖర్చు పెట్టేశాడనీ, దీనికి అక్రమ వినియోగానికి భేదం ఆట్టేవుండదనీ.........యిదీ ఆచర్చల ధోరణి: జిల్లా కార్యదర్శి స్కొరొబొగతోవ్ మరీ తీవ్రంగా మాట్లాడాడు.

"ముఖ్యమైన నిర్మాణాలకోసమనీ, ఉత్పత్తి విధానాన్ని ఒక క్రమరూపంలో పెట్టాలనే లక్ష్యంతో మనకి చాలా పెద్ద పెద్ద మొత్తాలు పరిత్యేకించారు. ఐతే యీ ధనాన్ని తెలివితేటలుగా వుపయోగించుకో గలగాలి. మీరు ఖర్చుపెట్టే యీ

డబ్బు ప్రజల సొమ్మనే సంగతి మరచిపోగూడదు" అని ఒక సారి సమావేశం అంతా కలయ జూచాడు రెప్పవెయ్యకుండా. "మురుగు నీటినితోడే నాలుగు పంపులూ, సగం పైగా డ్రిల్సూ యెందుకొదలవలసొచ్చింది లోగునోవ్? వాటికి బదులన్నీ కొత్త వాటినే యెందుకు తీసుకురావలసొచ్చింది? పాత యంత్రాల ద్వారా వుత్పత్తి కుంటుపడుతుందనుకుంటే, కార్మికుల సామర్థ్యాన్ని పెంచాలి; అంతేగాని యంత్రాలకి యంత్రాల్ని మార్చెయ్యడం దేనికి? యీ పైకొత్త డ్రిల్లులా? యెంత ఖరీదో ఆలోచించండి! స్థానికంగా వున్న సౌకర్యాల్ని వినియోగించు కొనేందుకు లోగునోవ్ అసలు ప్రయత్నమే చెయ్యడం లేదు. పైపై మెరుగులకోసం తపన పడుతున్నాడు. కొత్తకొత్త విధానాలని పెంపొందించాలంటే లోగునోవ్ చేసే యీ పనులు పెద్ద అడ్డంకిగా తయారౌతై; అందులో సందేహం లేదు."

"ఇకేం చెప్పినా నచ్చదు!" అనుకున్నాడు లోగునోవ్ ఆ చర్చ ధోరణి విని. "మేంమాత్రం స్థానిక సౌకర్యాల్ని వినియోగించుకోందెక్కడ? చెడిపోయినవన్నీ బాగుచేస్తున్నాం; కొత్తకొత్త పనిముట్లు చేస్తున్నాం. ఇకవి దమ్మిడీకి గూడా పనికిరావనుకునే వరకూ, చెత్తాచెదారంలోకి విసరెయ్యడానికి కూడా పనికిరాకుండా పోయేంతవరకూ వుపయోగిస్తూనే వుంటిమి. ఐనా మా ఎకౌంటెంట్ యేమంటాడో వినాలి; డబ్బిచ్చిందిగూడా ఆయనే!"

కాని ఎకౌంటెంట్, ప్ర్యాఖిన్ గూడా తటస్థంగానే మాట్లాడాడు; జిల్లా కార్యదర్శితో పోట్లాటెందుకులే అనుకుని తప్పుకున్నట్టు స్పష్టంగా కనిపిస్తూనే వుంది.

తర్వాత ప్యోతర్ మార్త్రెమియనోవ్ యెక్కాడు వేదిక మీదికి. షిఫ్ట్‌ఫోర్మన్ అతను; గనుల్లో పార్టీ కార్యదర్శిగూడాను.

"కామేడ్స్, నేనుచెప్పేదేమంతలేదుకాని" అంటూ పట్కా సర్దుకొన్నాడు. "మనం రోజురోజుకూ, గంటగంటకూ అభివృద్ధిఔతున్నాం. మన అభివృద్ధిని మంద కొడిచేసేవాటినీ కుంటు పరిచేవాటినీ నిర్దాక్షిణ్యంగా పక్కకి నెట్టివేస్తున్నాం. ఔనా ? కాదా ?" అనడిగాడు ప్రేక్షకుల్నందర్నీ. "చూడండి, ప్రతీదీ మారిపోతోంది; సాంకేతిక సాధనసామగ్రి మారిపోతోంది; పనిచేసే పద్ధతులు మారిపోతున్నై; నాయకత్వంగూడా మారిపోతోంది. అసలు విషయం తెలిసినా తెలియకపోయినా, మనకి నమ్మకంవున్న మనిషనుకుంటే చాలు, తీసికెళ్ళి యే సంస్థకైనాసరే, అధికారిగా నియమించేవాళ్ళం యిదివరకు; యెందుకని? అప్పుడున్న నిపుణులు మన శత్రువులు కావడం వల్ల. కాని యిప్పుడు రోజులు మారినై. మన అధికారులు గూడా నిపుణులై వుండాలి అనేవిషయం గుర్తించాం మనం."

" అసలు విషయానికి రండి " అంటూ అడ్డు తగిలాడు స్కొరొబొగతోవ్, ప్యోతర్ వైపుకు తిరిగి.

"ఇక చెప్పబోయేదంతా అసలు విషయమే" అన్నాడు ప్యోతర్, నెమ్మదిగానే. "గత ఆరుమాసాల్నుంచీ మనగని ప్రతీ శాఖలోనూ ప్రథమ శ్రేణిలో నిలబడింది. అదిగూడా మన ఒక్క జిల్లాలో మట్టుకే కాదనేసంగతి మరచిపోగూడదు మీరు. మన పథకంగూడా గడువుకు ముందే పూర్తిచేశాం. ముడిపదార్థం విలువ నూటికెనిమిది వంతులు తగ్గించగలిగాం. మన డ్రిల్లర్లందరూ వొకేసారి యెక్కువ మిషన్లమీద పని జెయ్యడం నేర్చుకున్నారు; చేస్తున్నారు. ఇప్పుడు మనం సాధిం

చిన విజయాలన్నీ వూరికే కూర్చుని అనుకున్నంతమాత్రాన వూడి పడేవి కాదు. వాస్తవ విషయాలిలా వున్నప్పుడు, లొగునోవ్‌నలా దుయ్యబట్టడంలో అర్థం యేమిటో నాకేమీ తెలియడంలేదు. చూడగా చూడగా యిదంతా ఆయన సర్వ నాశనం చెయ్యాలనే వుద్దేశంతోనే చేశాడని చెబ్తూన్నట్టుంది!"

"ఔనౌను. ఈ ఘనకార్యాలు సాధించా మనుకుంటు న్నారు కాబట్టే మీతల తిరిగిపోయింది; అందుకనే సామాన్యాభి ప్రాయాన్నంత చులకనగా చూస్తున్నారు" అన్నాడు స్మోకరొ బొగతోవ్.

"ఈ సామాన్యాభిప్రాయం సంగతి యింకా బయటపడ వలసివుంది. ఇప్పుడు నేచెప్పేది నా స్వంతఅభిప్రాయంమాత్రమే ఐనా ప్రతివాళ్ళతోనూ నెత్తిమీద కూర్చుని మాట్లాడుతున్నట్టు మాట్లాడ్డం అలవాటై పోయింది జిల్లాకార్యదర్శికి. అది కూడని పని. ప్రజల్తో ఆవిధంగా ప్రవర్తించడం తప్పు. అలాచేస్తే మా అభివృద్ధి నరికట్టినట్టే, మా చేతులికి బేడీలు వేసినట్టే. ఎందు కనంటే యిప్పుడు తుణతుణాభివృద్ధి పొందుతున్నాం మేం."

ఇంతలో, స్మోకరొబొగతోవ్ లేచి, "పార్టీ సభ్యులు కాని వాళ్ళందరూ వెళ్ళిపోవడం మంచిది" అన్నాడు. అందరూ వెళ్ళిపోయిం తర్వాత "సరే, యిక కానివ్వండి. ఇంకా మీరు మాదృష్టికి తీసుకు రాదలచుకున్న విశేషా లేమిటి ?" అనడి గాడు అధికారి అతిశయం చూపిస్తూ.

"ఇంకొక చిన్నవిషయం మీరుగూడా జాగ్రత్తగా వినా లని మనవి. ఇంతపెద్ద సంస్థ నొక క్రమమైన పద్ధతిలో నడపా లన్నా, మాపనికి తగినప్రోత్సాహం యివ్వాలన్నా, పైనుంచి కిందివరకూ మనపార్టీ చైతన్యాన్ని కలిగించాలన్నా, మన

జిల్లా ప్రధాన కార్యదర్శికి యీ పుత్పత్తి విధానాన్ని గురించి తెలియడం చాలా అవసరం. అప్పుడుగాని యేయే పద్ధతులు యెందుకు అవలంబించాలో తెలియవాయనకి; అప్పుడుగాని సవ్యమైన సలహాలివ్వడం సాధ్యం కాదాయనకి. లేకుంటే ఆయన్నిచూచి అనుభవజ్ఞులైన కార్మికు లందరూ సిగ్గుపడాల్సొస్తుంది.''

సమావేశం అంతా నిశ్శబ్దంగా వుంది. స్కార్రోబోగ తోవ్ మొఖం ఎర్రబారింది. "యింతకి మీరనేదెవర్ని గురించి?" అనడిగాడు.

"మిమ్మల్ని గురించే; ఇంకెవర్ని గురించి? జిల్లాపార్టీ ప్రధాన కార్యదర్శులు కాబట్టి ప్రతీ విషయంలోనూ వేలెడుతున్నారు మీరు. మాపని సంగతి మీకసలేమీ తెలియదు; ఐనా పరిశ్రమల కార్యదర్శిని కాదంటున్నారు. ఉదాహరణకి మురుగు పారుదల సంగతే తీసుకోండి. పొదపు దృష్ట్యా చూచినా, కేంద్ర మురుగు పారుదల సౌకర్యమే మంచిది; నాలుగు పాతబడిపోయిన వాటికంటే యీ వొక కొత్త పద్ధతివల్లా బోలెడు పొదుపౌతుంది. ఒకటి: అన్ని అంతస్థులకీ వుపయోగిస్తుంది; రెండు: మెదిల్తే కదిల్తే బాగుచేయించవలసిన పనుండదు; మూడు: విద్యుచ్ఛక్తి ఖర్చు తగ్గుతుంది. పాత పంపులు యీ జిల్లాలోనే యితరచోట్ల వుపయోగించుకోవచ్చు. ఇంతపెద్ద కేంద్రంలో యెక్కడో వొకచోట యేదో వొకవిధంగా ప్రతిపనిముట్టునీ వుపయోగించుకోవచ్చు. కాకపోతే, యెలా వుపయోగించుకోవాలన్న సంగతి తెలియాలి; అంతే. పరిశ్రమలలోతుపాతులు తెలిసినవాళ్లూ, అనుభవం వున్నవాళ్లూ మట్టుకే, యీరోజుల్లో, జిల్లా కార్యదర్శి పదవులకి యెన్నికౌతున్నారు. వ్యవసాయంలో

నిపుణులు కోల్ఖోజ్ జిల్లాల కెన్ని కొతుకున్నారు. గనుల్లో అనుభవంవున్నవాళ్ళు గనులున్న జిల్లాలకెన్ని కొతుకున్నారు. మీరెక్కడున్నారు కాబట్టి మూ విషయాలు తెలుసుకోవడం మంచిది మీరు.''

సమావేశం ముగిసిం తర్వాత, జిల్లాపార్టీకమిటీ భవనం నుండీ బయటికెళ్తూ "బలేగా మాట్లాడాడు పే ప్యోతర్" అన్నాడు లొగునోవ్, డెనిస్‌తో.

నిజంచూ స్తే, లొగునోవ్ అంత వుత్సాహపడవలసిందేమీ లెదు. ప్యోతర్‌ని బలపరచినవాళ్ళ సంఖ్య తక్కువే. హాస్పిటల్ వ్యవహారాల్లో కార్యదర్శిని విమర్శించిన వాళ్ళు—లొగునోవ్, ఇవాన్, డెనిస్—మట్టుకు బలపరిచారు. పార్టీ అధికారవర్గంమీద దుమ్మెత్తిపోసి నందుకు ప్యోతర్ చీవాట్లు తిన్నాడు. గనుల్లో కొత్తవిభాగాన్ని తెరవాలని లొగునోవ్ చేసిన సూచన దుర్వ్యయానికి దారితీస్తుందని తీర్పుచెప్పారు ఆసూచనన్ని గురించి పైనుంచి యింతవరకేమీ యిదమిద్ధమని రానప్పటికినీ పని ముట్లు కనుకున్న దానికంటే యెక్కువ ఖర్చుపెట్టినందుకు లొగునోవ్ పెద్దవుపన్యాసం వినవలసొచ్చింది. ఈవిషయాన్ని 'పార్టీ బ్యూరో ముందు పెడతా' నని స్కొరొబొగతోవ్ బెదరించాడు గూడాను. ఇంతజరిగినా, లొగునోవ్ వుత్సాహంగానే వున్నాడు. సమావేశం కార్యక్రమమంతా నోట్సు తీసుకున్నారు; అదెలాగూ ప్రాంతీయ కమిటీకి పంపక తప్పదు. అప్పుడైనా స్కొరొబొగతోవ్ బండారం బయటబడక తప్పదు.

"అలాంటి మనిషి ప్రతివిషయాన్నీ కొసకంటా లాగిగాని వదలడు." అన్నాడు లొగునోవ్, డెనిస్‌తో. "ఇదే 'సూటి మార్గం' అంటాడు. ఆ మార్గం వెంటే నడుస్తాడు కళ్ళు

మూసుకుని; వెనక్కి తిరిగి ఆలోచించడు, కళ్ళు తెరిచి చూడడు, వెళ్ళి వెళ్ళి గోడకి కొట్టుకుంటాడు. అప్పుడు గాని బొప్పికట్టదు తల. స్థానిక సౌకర్యా లుపయోగించాలని అన్న తర్వాతిక మిగతా విషయాలు పట్టించుకోడాయన. అంటే యీపనిముట్లు పూర్తిగాఅరిగిపోయి యెందుకూ పనికిరాకుండాపొయ్యేదాకా అవే వుపయోగించాలంటాడు. ఇకప్పుడు, వాటిబదులు కొత్తవి వచ్చేవరకూ చేతులు ముడుచుక్కూర్చోవాలి. ఎందుకొచ్చిన బెడద? బ్రతికున్న రోజుల్లో గొప్ప వాళ్ళమని చెప్పుకుని ఎంత కాలం బ్రదగ్గలం! వెనకబడి పోతున్న మనిషియేదో వొకటి చెయ్యాలి నలుగురితోనూ కలిసి నడిచేందుకు. అట్లా చెయ్యడం చేతగాకపోతే పదవికి రాజీనామా యివ్వాలి. 'నేను తాగుడు తాగను, వ్యభిచారం చెయ్యను కాబట్టి చాలా గొప్పవాణ్ణి' అని వెన్ను చరుచుకుంటే లాభం యేముంది? అదెంతో పెద్ద సద్గుణ మైనట్టు చెప్పుకుని గర్వపడాల్సిన అవసరం యేమీలేదు కమ్యూనిస్టులు. ఆ సద్గుణం యేసామాన్య మనిషికైనా సాధించ గలిగిందే; ఇకదిగూడా చెయ్యలేకపోతే, మనిషై పుట్టెందుకు?"

# 50

"మీరిచ్చిన ఆసైన్స్వ్యాసం అనువాదం యెంతవర కొచ్చిందని అడగనే అడగరే?" అంది ఓల్గా.

"యేమిటదీ?" అన్నాడు ఇవాన్ పరాకుగా.

"మీకసలది కావాలా, వొద్దా?" అనడిగింది ఓల్గా లోపల చిరాగ్గావున్నా కనబడనీకుండా.

బాగా యెండగావుంది. ఇద్దరూ ఒక పెద్ద చెట్టునీడని బల్లమీద కూర్చున్నారు. నీడ బల్లకి వెనగ్గా పడుతోంది.

"అసలు జరిగిందేమిటంటే" అని మొదలెట్టాడు ఇవాన్, "ముందీ వ్యాసం బాగా వుందని చెప్పారు. తర్వాత యింకో వ్యాసం పంపించారు రష్యన్ భాషలోకి అనువదించి. రెండు వ్యాసాలూ సమీక్షించిన వాళ్ళు రెండో వ్యాసమే బాగా వుందని అన్నారు. అందుకని, నువ్వనువదించే వ్యాసం సంగతే మరిచిపోయాన్నేను. ఐనా యెట్లావుందో చూద్దాం, యిలాతే."

"మరా సంగతి చెప్పలేదేఁ నాకు" అంది ఓల్గా నిష్టూరంగా.

"నువ్వా అడగలేదుగా!" అన్నాడు ఇవాన్ ఆశ్చర్యంగా, "నీ కనుభవం కలుగుతుందిగదా అనుకున్నాను; తర్వాత యికా వ్యాసం అవసరం లేకపోయేప్పటి కసలా సంగతే మరిచి పోయాను."

"యెంత కష్టపడ్డా నెంతకష్టపడ్డాను అది అనువాదం చెయ్యడానికి!" అంటూ గొణిగింది ఓల్గా "యింతాచేసి పూర్తి చేస్తే దానివల్ల కించిత్తుగూడా లాభం లేకుండాపోయింది. అందులో అన్నీ సాంకేతిక విషయాలు; ప్రత్యేక పదాలు."

"అరెరే; ముందే నాతో చెబితే పోయేదే!" అన్నాడు ఇవాన్ పశ్చాత్తాప్పడుతూ, ఆవిడచేయి తనచేతిలోకి తీసుకుని.

చెయ్యి తీసేసుకుని, దూరంగా జరిగింది ఓల్గా. "నాపనంటే మీకేమాత్రం శ్రద్ధవుందో చూద్దా మనుకున్నాను. నా పైంగాని, నాజీవితంగాని యెలా గడిపినా మీకేమీ పట్టదని తెలిసొచ్చిందిప్పుడు. కుటుంబం అంతా సవ్యంగా నడుస్తున్నట్టు

కనబడితేచాలు పైకి; మీకింకేమీ అవసరంలేదు. మీరు సుఖంగా వుంటే అంతేచాలు మీకు; మిగతా సంగతులేమీ అవసరమే లేదుమీకు."

ఆమాటలు వింటూంటే చాలా కష్టం వేసింది ఇవాన్‌కి. "ఓల్గా! యెందుకొచ్చిన మాటలవన్నీ? ఆమాట లనడానికి సిగ్గన్నా వెయ్యడంలా? నిజంగానే నేను బ్రదుకుతూన్నది నా సుఖం కోసమనేనా నీవుద్దేశం?"

"మీకు మీపని తప్ప యింకొక ఆలోచనే వుండదు; అందరూ అట్లాగే మీపనంటేపడిచావాలని మీవుద్దేశం. నేనన్నా నా రచనలన్నా లెక్కేలేదు మీకు" అని యెత్తిపొడిచింది ఓల్గా; "మీ వుద్దేశాలూ, మీ అభిరుచులూ నామీద రుద్దాలనే మీరెప్పుడు ప్రయత్నించినా. అప్పుడు వైద్యకళాశాలలో కెళ్ళమనీ అలాగే బలవంత పెట్టారు; గుర్తుందా? 'మళ్ళీ ఆ మెషీన్ బిల్డింగ్ ఇన్‌స్టిట్యూట్' కెందుకులే? తర్వాత మళ్ళీ దేశంలో యేమూలకో పంపించేస్తారు నిన్ను అన్నారు. ఐతే యిక నేను మీకు తోకలాగా తిరుగుతుండా లన్నమాట; ఆపని మీరే యెందుకు చెయ్యగూడదు?"

"నువ్వే అన్నావుగదా ఆ ఇన్‌స్టిట్యూట్ నీకేమీ నచ్చలేదనీ, అక్కడ చదవాలంటే విసుగ్గా వుందనీనీ?"

"ఇన్‌స్టిట్యూట్ కెళ్ళడం మానేశింతర్వాత అన్నా నా మాట; మరేదో వొక వంకచెప్పుకోవాలి కాబట్టి."

"ఐతే, యిప్పుడదంతా తిరగతోడ్డం యెందుకు?" అన్నాడు ఇవాన్, బాగా విసుగెత్తి. "సరే యికిప్పుడు విలేకరివి కాదలుచుకున్నావు గదా; గతం తవ్వడమెందుకు మళ్ళీ?"

''యేమీలేదు; మీకు గుర్తుచేద్దామని. అప్పుడుగాని యిప్పుడుగాని నేనే మనుకున్నా మీకెంత లెక్కలేదో యింకొక సారి గుర్తుచేద్దామని.'' అంది ఓల్గా. అని ఒకనిమిషం ఆగింది. కాని కోపం యింకా అణగలేదు. "ఇదివరకనేక సార్లన్నాను మీతో యిదే విషయం. యిదంతా యెందుకసలు, మీకు నేనీ రచనలు కొనసాగించాలని యేకోశానున్నా, మీరు వ్రాసే వారేగాదు, మీరోగుల్ని గురించి ఆవ్యాసం; నన్నేరాయమని వుండేవారు. యేదీ, అసలా వుద్దేశం వుంటేగా!"

"ఒహో, అదా ఐతే ఆసంగతి చెప్పకుండా యింత రభస చేశావెందుకూ? మొదటే చెబితే, పోయేదిగా?"

"యింకెప్పుడూ అసలీ గొడవే యెత్తనులెండి; ఎందు కొచ్చిన బాధ. వూరికే మనసులు కష్టపెట్టుకోవడం యెందుకు లెండి."

వేసవికాలం వెళ్లిపోయింది. తనపనిలో తలమునకలౌతూ సెలవు సంగతి పట్టించుకోనేలేదు ఇవాన్. ఓల్గాగూడా గుర్తు చెయ్యలేదు. ఆవిడ సమస్యల్తో ఆవిడ సతమతమౌతోంది. తన వ్యక్తిగత జీవితాన్ని సాధ్యమైనంత స్వతంత్రంగా సరిదిద్దుకోవా లనుకుంటూ.

" వున్నకొద్దీ పాకశాస్త్రంలో ఆరితేరుతున్నావ్" అన్నాడొకనాడు ఇవాన్, ఆవిడచేసిన కొత్తవంటకం రుచి చూస్తూ; "ఇంతబాగా చేస్తావనుకోలేదు నేను."

ఆయన హాస్యమాడుతున్నాడో, నిజంగానే అంటూ న్నాడో అర్థంకాలేదు ఓల్గాకి.

"ఇంగ్లీషు పాఠాలూ బాగానే జరుగుతున్నై" అంది ఓల్గా. ఆమాటల్లో అదోకరమైన తీక్షణతగూడా వుంది.

మళ్లీ తనరచనల్ని గురించి మాట్లాడవలసి వస్తుందేమో భర్తతోనని భయపడింది ఓల్గా. ఎప్పుడు మాట్లాడినా యేదో చిన్నచిన్న విషయాల్ని గురించి మట్టుకే మాట్లాడుతోందీ మధ్య. ఆయనగూడా మనసిచ్చి మాట్లాడలేకపోతున్నాడు. వున్నకొద్ది యిద్దరిమధ్యా దూరం యెక్కువై పోతోంది. ఐనా ఓల్గాఅంటే ప్రేమే ఇవాన్‌కి. ఇంట్లో చిల్లరపనులుచేస్తూంటేనూ ఇంటి పనిని గురించి యితరులతో చర్చిస్తుంటేనూ ఆవిణ్ణిచూచి మురుసుకునేవాడు. పత్రికలకీ వాటికీ ఆవిడ వ్రాస్తున్నప్పుడు చూచి యింకాస్త యెక్కువగా సంతోషించేవాడు.

కాని మనిషి వస్తుత విషయాలు తెలిసినవాడు కావడం వల్ల మొత్తంమీద యిద్దరిమధ్యా యేదో అఘాతం యేర్పడు తోందని పసిగట్టగలిగాడు. మొట్టమొదటది స్పష్టాస్పష్టంగా వున్నా, పోనుపోను స్పష్టంగా కన్పించడం ప్రారంభించింది.

చాలా బాధేసింది; కష్టంకలిగింది.

"ఇంతకీ నేనేంచేస్తే నీకు బాగుంటుందో చెప్పరాదా?" అనడిగాడొకసారి ఓల్గాని, యేదో చిన్న పోట్లాట ముగిసిం తర్వాత.

"యేమీలేదు. నేనూ వొకవ్యక్తినేనని గుర్తిస్తేచాలు" అంది ఓల్గా తెల్లబోయి.

అప్పుడావిడ మొహం చూడగానే తెలిసింది ఇవాన్‌కి, పరిస్థితిబాగా విషమించిందనీ, చేయిదాటి పోయిందనీ. ఐనా లేని

పోని యీసూటీపోటీ మాటలేమిటనీ, యీ చెప్పి పొడుపు లెందుకనీ విసుగూ, కోపమూగూడ కలిగినై.

"నువ్వుగూడా నేను పడుతూన్నంత కష్టముగా పడితే, అవతలి మనిషేమనుకుంటాడో తెలిసొస్తుంది" అనకుండా వుండ లేకపోయాడు.

"నాజీవితంగూడా మీజీవితమంత అభిరుచి వున్నదీ ఐతే, నాఅనుభవాన్నీ చెప్పి పంచుకుందును."

"ఐతే యిప్పుడు నాకభిరుచి వున్న విషయాలవల్ల నీకేమీ ప్రయోజనం లేదన్నమాట?"

చాలాసేపు మాట్లాడకుండా కూర్చుంది ఓల్గా. ఇకా నిశ్శబ్దాన్ని యిద్దరూ భరించలేకపోయారు.

"నాకేం ప్రయోజనం? యేమీలేదు" అంది ఓల్గా.

అంతే తర్వాత మూడురోజుల వరకూ మాట్లాడుకో లేదు వాళ్ళిద్దరూ.

# 51

జేబులో వొకపెన్సిలూ, నోటుబుక్కూ పెట్టుకుని బయల్దేరింది ఓల్గా, యింటిదగ్గర్నుంచి. వరండాలోకొచ్చి చూస్తే చుట్టూ తెల్లని పర్వతపంక్తులు కన్పించినై రోజూలాగానే. కాని ఆకురాలు కాలం వచ్చేసిందప్పుడే.

"కొండ ప్రదేశం యెంత బావుంటుంది" అనుకుంది, చుట్టూవున్న చెట్టూచేమా చూచి.

నదికెగువగావున్న కొండ దిగింది నెమ్మదిగా. పాతనది దారినే నడవడం ప్రారంభించింది. ఇప్పుడాదారంతా యిసుక గుట్టలు. బంగారపు గనుల్లో పనిచేసేవాళ్ల జీవితాలింకొకసారి పరిశీలించాలని బయల్దేరింది యీదారివెంట. పుస్తకంతీసి చూసిందాంట్లో అవసర మనుకున్నదల్లా వ్రాసుకుంది. ఇకిప్పుడు పెన్సిలూ పుస్తకమూ పుచ్చుకుని యెక్కడబడితే అక్కడ వ్రాసుకోవడం అంటే బిడియంలేకుండా పోయింది. హైడ్రాలిక్ ఎంజిన్ (నీటితో నడిపే యంత్రం) నడిపే మెకానిక్ యింట్లో కెళ్లింది. యకూత్ పొలంలోకెళ్లి కాయగూరలు రుచిచూసింది. యకూత్ దర్జీకి సలహాలిచ్చింది. కనబడిన వాళ్లందరితోనూ కలిసి మాట్లాడింది; వాళ్ళూ సందేహించకుండా ఆవిడడిగిందాని కల్లా సమాధానాలు చెప్పారు.

మురుగు కాలవమీదేసిన కొయ్యబల్ల మీదనుంచి దాటుతూ, "నిన్న చేసినవంట వేడిచేసేస్తే సరి, యివ్వాళ్టికీ పని కొస్తుందదే" అనుకుంది. "ఇవాన్ చాలామంచివాడు, వంటెలా వున్నా యేమీ అనడు. ఐనా, నాపనంటే అంత మరీ పట్టించు కోనట్టుంటా డేమిటి ? ఎవరిదారిని వాళ్ళం అభివృద్ధి ఔతు న్నాం. ఇప్పటికే బాగా మార్పొచ్చేసింది; యిద్దరం కలిసి కూర్చుంటే మాట్లాడేందుక్కూడా యేమీకన్పించడం లేదిప్పుడు. ఇక నేవ్రాసేదంతా పావాకి చదివి వినిపించాలి సొస్తోంది; ఆవిడకీ యేమీ అర్థంకాదు, ఐనా వోపిగ్గా వింటోంది."

ఇదివరకు ఓల్గా కలుసుకున్న మనుషు లెవరో కొత్త మురుగుకాలువ తవ్వుతున్నారు పాతదాని ప్రక్కనే. వెళ్తూ వెళ్తూ పలకరించింది వాళ్ళని.

నాలుగడుగలేసిం తర్వాత, "డాక్టర్ ఇవాన్ భార్య" అని చెబుతున్నాడొక ముసలతను ప్రక్కనున్న వాళ్లతో.

"రచయిత్రి గూడాను" అంటున్నా డింకొక యువకుడు; "పత్రికలకి వ్రాస్తుంది."

ఇద్దరి మాటలూ విన్పించినై ఓల్గాకి. ఇద్దరూ గౌరవంగానే అన్నారా మాటలు. ఐనా, యెందుకో బిడియం వేసింది.

వెనక్కి తిరిగి, "నేను రచయిత్రిని కాదు" అంది వాళ్లతో, "పత్రికలకి వ్రాసేవాళ్లని విలేకరులంటారు; జర్నలిస్టు లంటారు; అంతే. రచయితలనరు!"

దారంతే ముందుకు నడుస్తూ మళ్లీ అవేమాటలు గుర్తుకు తెచ్చుకుంది. రచయిత్రలైన వాళ్లున్నారు. కాని తన కంత వున్న తాశయాలు లేవు. రచయిత కావలంటే అందుకొక ప్రత్యేక ప్రతిభ వుండాలి. "మంచి విలేకరినైతే అంతేచాలు నాకు" అనుకుంది తనలోతాను.

దూరంగా కొండమీద మిల్లు భవనాలు కన్పించినై. వాటిని చూస్తూంటే తావ్‌రోవ్ గుర్తుకొచ్చాడు. అవ్యక్తమైన కృతజ్ఞతాభావం పొంగుకొచ్చింది.

ఆవేళ హాస్పిటల్లో కలుసుకున్న తర్వాత మళ్లీ ఒక్కసారే వెళ్లింది తావ్‌రోవ్‌నిచూడ్డానికి. అప్పటికతన్ని యింటికి పంపించేశారు, ఒక నర్సుని తోడిచ్చి. తానూ, పావా యిద్దరూ కలిసెళ్లారు. అప్పటినుం చిప్పటిదాకా మళ్లీ వెళ్ళనేలేదు. పావామట్టు కెళ్లొస్తోంది రోజూ మహిళా సంఘం సభ్యుల్ని కొంతమందిని వెంటబెట్టుకుని. వెళ్లొచ్చినప్పుడల్లా విశేషా

లేమైనా వుంటే చెబుతూనేవుంది. ఎందుకనోగాని ఆ బ్రహ్మా చారి నివాసాని కెళ్ళగల ధైర్యం కలుగలేదు ఓల్గాకి.

"ఈ వ్యాసంగూడా ఆయనకి చూపించి సలహాలడిగితే బాగుండును! నేను వ్రాసిందంతా చదివి వినిపిస్తాను; ఆయన కూర్చుని వింటూ వుంటాడు," అంటూ వూహించుకుని పరమా నంద భరితురాలై పోయింది.

ఇంటిముఖం పట్టేప్పటికే సాయంత్రమై పోయింది. రాలి పోయిన ఆకుల మీదినుంచీ, ఎండిపోయిన గడ్డిమీదినుంచీ వస్తోంది చల్లగా మంచిగాలి. ఆ గాలి పీలుస్తూ గబగబ నడు స్తోంది ఓల్గా యింటికి. ఇవ్వాళ తను చేసిన పని సంతృప్తి కరం గానే వుంది; తానూ యిక సంఘాని కుపయోగపడే పని చేయగలుగుతోంది. భర్తకంటే ముందే వెళ్ళిపోవాలి యింటికి.

ఇవ్వాళ తాను కలుసుకుని మాట్లాడిన వాళ్లని తలచు కుంటే చాలు; ముచ్చటగావుంది. ఇప్పుడిప్పుడే అర్థమౌతోంది వాళ్ళంతా అంత ఆనందంగా యెందుకు పనిపాటలు చేసుకుం టూందీనీ. ఈ వుత్తర ప్రాంతం జనవాస యోగ్యంకాదు. ఐనా వీళ్ళంతా వచ్చారు. నెలవులు యేర్పరచుకున్నారు. ఈ నాటి కది వాళ్ళ జన్మభూమిలా తయారైంది. ఆ కాయ గూరలతోట వేసిన ముసలతను! మొట్టమొదట చాలా కష్ట పడ్డాడు; శ్రమ ఫలించింది. ఇప్పుడొచ్చిన వాళ్ళందరికీ చూపు తున్నాడు తన శ్రమఫలితం. అతనితో మాట్లాడుతూన్నంత సేపూ, తనలోనూ వుత్సాహం వురకలు వేసింది.

తన బూట్లూ, దుస్తులూ అన్నీ బురద కొట్టుకున్నై; నెత్తిజుత్తంతా చెరిగిపోయింది. జేబులోంచి అద్దంతీసి తల దువ్వుకుంది, కాలర్ సరిచేసుకుంది. ఇంతలోనే, సమీపంలో తావ్‌రోవ్ గొంతు వినిపించింది.

వెంటనే రోడ్డుమీంచి ప్రక్కకి తప్పుకుంది. అడ్డంవచ్చిన చెట్టుకొమ్మ క్రింది కొంచిచూచింది. రోడ్డు ప్రక్కనున్న కాలి దారం టొస్తున్నాడు తావ్‌రోవ్. తావ్‌రోవ్ ప్రక్కనే ఒక నర్సుగూడా వుంది. ఆ కాలిదారి కటూయిటూ చక్కని పూల మొక్కలు.

"ఈ చంకలకింద కర్రలు నువ్వు పుచ్చుకో. అవి లేకుండా నడుస్తాను కాస్సేపు" అంటున్నాడు నర్సుతో.

నిలబడిన చోటునుంచి కదలకుండా, పట్టుకున్న కొమ్మ వదలకుండా అలాగే నిలబడి చూచింది ఓల్గా ఆతురత్తో. కర్రలు నర్సుచేతికిచ్చి, నెమ్మది నెమ్మదిగా అడుగులేస్తున్నాడు; బరువా రెండోకాలిమీద గూడా మోపేందుకు భయపడుతున్నట్టు న్నాడు; ఆ రెండోకాలు కట్టూడదీసి గూడా యెంతో కాలం కాలేదు.

తావ్‌రోవ్ ముహం బాగానే కన్పిస్తోంది ఓల్గాకి. అప్పుడే నడవడం నేర్చుకున్న పసిపిల్లడి ముహంలా చిరునవ్వులు చిందు తున్నై. ప్రక్కనే తెల్లదుస్తులేసుకున్న నర్సు, కర్రలు చేత్తో పుచ్చుకుని అతనివంకే తదేకంగా చూస్తోంది యెప్పుడెటు వొరిగినా, పరుగెత్తుకెళ్లి పట్టుకునేందుకు సిద్ధంగా వున్నట్టు.

కాని అడుగులేస్తున్నకొద్దీ ఆత్మవిశ్వాసం హెచ్చుతున్న ట్లుందతనికి. పాదాలు గట్టిగా మోపుతున్నాడు. కుంటుతు

న్నట్టేలేదు. అతను ఓల్గాని చూడలేదు; నర్స్‌గూడా అతని నడకవైపే తదేకంగా చూస్తోంది. ఇకప్పుడు వాళ్లని పలకరించకపోవడమే మంచిదనుకుంది ఓల్గా. పలకరించాలన్నా నోటంట మాట పెగిలేట్టులేదు. వున్నచోట నుంచి కదిలి వెనక్కొచ్చేసింది. ఆవిడ పట్టుకుని వదలిన కొమ్మ మాత్రం అలాగే వూగిసలాడుతూ వుండి పోయింది తర్వాత చాలసేపటిదాకా.

# 52

"కుండ పగలగొట్టినట్టు మాట్లాడేరకం నేను" అంటూ గర్వంగా చెప్పుకునేవాడు స్కొరొబొగతోవ్.

అతని ఆత్మవిశ్వాసమూ, ఎర్రగా జ్యోతులికిమల్లే వుండే ఆ కళ్లు రెప్ప వెయ్యకుండా చూస్తూంటేనూ, కోపంవచ్చినపుడు నల్లబడే ఆ లావాటి మొఖమూ చూస్తేచాలు ఇవతలివాళ్లకి చిర్రెత్తడానికి.

ఇగోర్‌కి స్కొరొబొగతోవ్ అంటే భయమే; ఐనా, విద్యుత్కేంద్రానికి యింధనం యిస్తున్న పద్ధతి పొదుపుగా లేదని జిల్లాకార్యదర్శి అంటే ఇగోర్ వూరుకోలేదు; తానవలంబించుతూన్న పద్ధతి చాలా మంచిదని బల్లగుద్ది చెప్పాడు. సాంకేతిక అంచనాల సంగతి స్కొరొబొగతోవ్ కసలు తెలియదు; ఐనా అతను నదురూ బెదురూలేకుండా మాట్లాడేశాడు.

"నాపనల్లా మిమ్మల్ని పరీక్షించడం. పరిశోధనచేసే విద్యార్థిని అడ్డు ప్రశ్నలెయ్యడూ ప్రొఫెసర్? నాపనీ అంతే మీరుచేసిన పనిని సమర్థించుకోవాలి మీరు; నాకు నచ్చజెప్పాలి.

నాకా సాంకేతిక విషయాలతో సంబంధం యేమీలేదు; ఆ సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రయోగించే వ్యక్తుల్తోనే నాకు సంబంధం. ఆ వ్యక్తుల లోతుపాతులు కనుక్కోవడం చాలా అవసరం; నా కర్తవ్యం అదీ."

సాంకేతిక విషయాలకి సంబంధించినంతమట్టుకు పైచేయి ఇగోర్ దే; ఐనా జిల్లాకార్యదర్శి అట్లా మాట్లాడుతూంటే ఇక తని నోరు పెగలలేదు; భయంగూడా వేసింది.

అలాంటి మనఃస్థితిలో వెళ్లాడతను జిల్లా పార్టీఆఫీసుకి; తనుచేసిన పొరపాట్లేమైనా వున్నాయేమోనని మెదడంతా వొకసారి గాలించుకుని మరీ వెళ్లాడు.

స్క్వొరొబొగతోవ్ టెలిఫోన్‌లో మాట్లాడుతున్నాడు యెవరితోనో.

"ఔను. జిల్లాకార్యదర్శే మాట్లాడుతోంది. ఇంత కాలమైనా యింకా నాగొంతు గుర్తుతెలియడం లేదన్నమాట; ఊఁ................" అన్నాడు, ఇగోర్ వంకొక పక్కచూపు విసురుతూ.

ఉన్నకొద్దీ గొంతు పైకిలేస్తోంది.

ఇగోర్ కేమీ తోచలేదు. ఒకదారం లాగి వుండలు చుడుతూ, దూరంగా వున్న కిటికీదగ్గరకెళ్లాడు అడుగులో అడుగు వేసుకుంటూ, అతి మెల్లగా.

"ఆ పథకం గనక పూర్తిచెయ్యకపోతే మీదగ్గరున్న ఆ పార్టీకార్డుకూడా లాగేసుకుంటాను; వదిలిపోతుంది. మీదగ్గరికే కార్డూ వుండదని మాత్రం గుర్తుపెట్టుకోండి!" అంటూ బెదరించాడు జిల్లాకార్యదర్శి, ఫోనుకవతలి వైపునుంచి మాట్లాడు

తున్న మనిషిని. ఒకక్షణం ఆగి, "కాస్త ఆలోచించి మరీ చెయ్యాలి చేసేపని. వాళ్లు దగ్గర పెట్టుకోవడం మంచిది! పార్టీకి వ్యతిరేకంగా నడవడం అంటే మాటలుకాదు! జాగ్రత్త!"

ఇగోర్ పార్టీసభ్యుడు కాదు; ఐనా అతనిగుండె లటుకు లటుకు మంది. ఏమీతోచక, పై సర్దుకున్నాడు. ఆ టెలిఫోన్ సంభాషణ యెప్పుడు ముగుస్తుందా, యెప్పుడు తనపని పూర్తిచేసుకుని బయట పడుదామా అన్న ఆతురతగూడా లేదిప్పుడతనికి. కాని, ఇంతలో టెలిఫోన్ సంభాషణ ఆగిపోయింది; కాస్సేపింకా ధాము ధూములుచేసి, ఫోన్ దూరంగా నెట్టేశాడు కార్యదర్శి.

ఇగోర్ వంక రెప్పవెయ్యకుండా చూస్తూ, "ఇదిగో, యీ వొక్క ఫోనుంటే, అదిగూడా సరిగ్గా వుంచడం తెలియదు మీకు! అందరూ మెకానిక్కులే, అందరూ ఎంజినీర్లే, మొనగాళ్ళు బయల్దేరారు. రెండు రోజుల్నుంచీ యీ ఫోన్ చెడిపోతే, బాగుచేసే దిక్కులేదు" అన్నాడు.

"బాగుచెయ్యడానికి మనిషిని పంపిస్తానులెండి, వెంటనే."

"ఒకతను రావడమూ అయ్యింది, వెళ్లడమూ అయ్యింది" అన్నాడు స్కొరొబొగతోవ్. యేమీలాభం లేదులే అన్నట్టు చెయ్యి విసురుకున్నాడు. జేబు రుమాలుతీసి ముహం తుడుచుకున్నాడు.

కార్యదర్శి కూర్చున్న చోటికొస్తున్న ఇగోర్ వంక రెప్పవెయ్యకుండా చూశాడొక నిమిషం, పెదవులు బిగించి. ప్రక్కనేవున్న కుర్చీ వంక గడ్డం వూపాడు కూర్చోమన్నట్టు.

"మీరందరూ కలిసి యేమిటీ చేస్తున్నదక్కడ?" అనడి గాడు.

ఇగోర్ ఉలిక్కిపడ్డాడు.

"ఎక్కడ?"

"అక్కడే. మీరుండే చోటనే. మీరందరూకలిసి డాక్టర్ ఇవాన్ భార్యెంట పడుతున్నారటగా" అన్నాడు కార్యదర్శి మొరటుగా, మరీ యింత అర్థంచేసుకోడేమిటా అని విసు క్కుంటూ. "ఔన్లే, మేధావులుగదూ మీరంతా! ఎట్లాగోట్లా శ్రామికవర్గాని కంటిపెట్టుకునుంటే చాలనా మీ వుద్దేశం? చాలా గొప్పవారు కదూ! ఏం పనులూ, యేంకథా!"

"ఏమిటీ, ఏంచేస్తున్నామనీ?" అనుకున్నాడు ఇగోర్.

"ఇకలాంటి పిచ్చిపనులుచేస్తే నేనూరుకునేది లేదు" అన్నాడు కార్యదర్శి మళ్లీ.

"క్షమించాలి. నేనేంచేశానని! నాకరంకాలేదు."

"ఏమిటీ! ఇదంతా మీకు తెలియదని నేను నమ్మాలనేనా మీవుద్దేశం?"

"నిజమే. ఆఁ, అదికాదు, అసలు........" అంటూ ఏమనాలో తెలియక తికమక పడ్డాడు ఇగోర్, "అసలు నాకా ఓల్గా పావ్‌లోవ్నా అంటే చాలా గౌరవం."

"హుఁ" అన్నాడు స్కొరొబొగతోవ్, "ఆవిడ అంద మైనది, వయసులోవుంది; మీరూ! మీరుగూడా యువకులు, బ్రహ్మచారులు! ఈ డాక్టర్ ఇవాన్ యెత్తులు మనముందా సాగేది! హుఁ. తనభార్యంటే మీకందరికీ 'గౌరవం' వుంది గదాని యిటు శారీరకంగానూ, అటు నైతికంగానూ ఆ

డాక్టర్ చేస్తున్న పని.... మాకళ్ళుకప్పలేదు. సరే, ఆయన సంగతి తర్వాతాలోచిద్దాం; తగిన ప్రాయశ్చిత్తం చెయ్యకుండా వదలన్లే. ఇప్పుడసలు మీ సంగతేమిటో చెప్పండి; మీ ప్రవర్తన మాటేమిటి?"

"నా ప్రవర్తనా ?" అనడిగాడు ఇగోర్ కోపంగా; మరీ యింత మర్యాదలేకుండా వ్యక్తిగత విషయాలు కదుపుతా డేమిటా అని.

"కాస్త్రీవిషయం జాగ్రత్తగా ఆలోచించుకోవడం మంచిది మీరు. నైతిక సూత్రాల్ని చెడగొడుతున్నారు మీరు; తెలుసా ?" అంటూ గర్జించాడు స్కొరొబొగతోవ్, "ఏం మేధావులు !"

# 53

"నేనెందుకెళ్ళాలి ? వెళ్ళను !" అంది ఓల్గా కోపంగా, "నేనేం సూత్రాలు చెడగొట్టాను ? యెక్కడా వినలేదు యిలాంటి గొడవ !"

"రమ్మనమన్నాడు మరి"

"ఐతే యిక వెళ్ళి, నేనెలా ప్రవర్తించాలో ఆయన వుప న్యాసం యిస్తూంటే వినమంటూరా నన్ను ?" అనడిగింది.

ఇగోర్ యేమీ మాట్లాడలేక పోయాడు. నిజంగానే ఓల్గా అంటే అతనికి చాలా గౌరవం. మరీ చిన్నచోటు కాబట్టి యిక్కడ అందరూ అందర్నీ యెరుగుదురు; ఆవిడా, భర్తా యీ మధ్య యేమంత బాగుండడం లేదని, యిక్కడే, వాళ్లూ వీళ్లూ

అనుకుంటున్నారు. అసలీ గుసగుస లెందుకు ప్రారంభమైనయ్యో తెలియదు. ఓల్గా అలాంటి మనిషికాదు.

"స్కారొబొగతోవ్ దగ్గర మరీ అంత కుక్కిన పేనునై పోయానేమిటి ?" అని తనకితానే మందలించుకున్నాడు ఇగోర్, లోపల్లోపల. ఓల్గావంక కన్నెత్తి చూచే ధైర్యం లేక చూపులు ప్రక్కకి తిప్పుకున్నాడు.

"ఐనా నేనెళ్లి ఆయన కున్న సందేహాలు తీర్చాలని యెందుకూ మీకింత పట్టుదల ?" అని ఓల్గా అడిగేప్పటికి, వులిక్కిపడ్డాడు. ఐనా, జవాబు చెప్పలేదు.

"ఎందుకా ? ధైర్యంలేక ! మిమ్మల్నక్కడ నేను సమర్థించలేక పోయాను గనక. మీకూ తావ్‌రోవ్‌కూ వున్న స్నేహం సంగతి నాకు తెలుసు గనక; ఆ స్నేహం యెంత దూరం వెళ్ళిందో నాకు తెలియదు గనక. నా సందేహాలు నిరాధారాలైతే, అవి పోగొట్టేందుకు మీకవకాశం యివ్వడం మంచిదనుకున్నాను గనక" అనుకున్నాడు లోపల్లోపలే. పైకి మాత్రం యేమీ అనలేదు.

ఓల్గా చూచింది. దిగాలుగా వున్నాడు ఇగోర్. "సరే, వెళ్లాయన్ని కలుసుకుంటా లెండి" అంది.

"ఓహో ! మీరా !" అంటూ లేచాడు స్కారొబొగతోవ్ కుర్చీలోంచి. లేచి కరస్పర్శ కోసం చేయిచాచి, "బావున్నారా, ఓల్గా పావ్‌లోవ్నా !" అనడిగాడు.

ఓల్గా యేమీ సమాధానం చెప్పలేదు; ఆలోచించుకుంటోంది. స్కారొబొగతోవ్ యీలోపుగా ఆవిణ్ణి ఆ పాద

మస్తకం తేరిపారజూశాడు. తావ్‌రోవ్‌కీ ఆవిడకీ వున్న సంబంధాల్ని గురించి వార్తలు అతని చెవిదాకా పాకినై. ఇకివిలా కొనసాగిస్తే లాభంలేదనుకున్నాడు; అరికట్టాలనుకున్నాడు. వెంటనే పశ్చాత్తాప పడుతుందని అతనూ అనుకోలేదు కాని, వున్న విషయాలొప్పుకుంటుందనుకున్నాడు; సిగ్గు పడుతుందనుకున్నాడు; యికలాంటి సంబంధాలు తెగ తెంపులు చేసుకుంటానన్నా అనకపోతుందా అనుకున్నాడు.

ఓల్గా మొహంచూస్తే, అలాంటి సూచనలేమీలేవు సరికదా, సగర్వంగా, యేమిటీరభస అని విసుక్కుంటూన్నట్టుంది.

ఓల్గావంక చూస్తూ, తనకున్న అధికారాన్ని గురించి, బాధ్యతల్ని గురించీ, హక్కుల్ని గురించీ ఆలోచించుకుంటున్నాడు. స్కొరొబొగతోవ్. సాంఘికనైతిక సూత్రాలకి సంబంధించిన విషయమిది; యీ సూత్రాల్ని పాటించని వాళ్ళని స్త్రీలైనాసరే పురుషులైనాసరే నిలదీసి తగిన బుద్ధి జెప్పాలని నిర్ణయం చేసుకున్నాడు. ఓల్గా పద్ధతిచూస్తే అతని కింకా మండింది; అంచేత అనాలనుకున్నదానికంటె కటువుగానే, "మీరుండేచోట వ్యవహారం సంగతేమిటి?" అనడిగాడు.

"నాకు తెలిసినంతవరకు జరగరానివేమీ జరగడంలేదే" అంది ఓల్గా, ధైర్యంగా అతని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ.

"మరీ అమాయకుల్లా నటించబోకండి మరి."

"నేనేమీ నటించడంలేదు. ఐనా అలా మాట్లాడ్డానికధికారం యెవరిచ్చారు మీకు? మీరెవరో మీకు తెలిసే మాట్లాడు

తున్నారా? మీరు జిల్లాపార్టీకమిటీ కార్యదర్శి పదవిని నిర్వహిస్తు న్నారు; ఆసంగతి మర్చిపోకండి"

"మీకా విచారం యేమీ అవసరంలేదు. నేనేమీ మరిచి పోలేదు. మీరుమాట్లాడేపద్ధతిగూడా యేమీబాగుండలేదునాకు."

"మీరు మాట్లాడే పద్ధతి నాకూ బాగుండలేదు!" అంది ఓల్గా గట్టిగానే, గుండెగుబగుబ లాడుతున్నా లక్ష్యపెట్టకుండా. "చెప్పాలను కుందేమిటో చెప్పేశెయ్యండి."

"మీరు చెప్పాలనుకునే దేమిటో చెప్పండి!" అన్నాడు స్మోరొబొగతోవ్ కోపంగా, "మనదేశంలో యెవరిష్టంవచ్చిన వాళ్ళని వాళ్ళు వివాహం చేసుకోవచ్చు. భర్తయెవరో యెలాంటి వాడో వివాహానికి ముందే తెలుసు మీకు. వివాహం ఐంతర్వాత ప్రేమవుండాలి, నిష్కాపట్యం వుండాలి, పరస్పర గౌరవం వుండాలి, ఆదరం వుండాలి, అభిమానం వుండాలి. కాని మీరు చేస్తున్న దేమిటి? ఒక బాధ్యతగల పదవిని నిర్వహిస్తున్న మీభర్తకి తలవంపులు తెస్తున్నారు, అపేధంగా ఆయనపని కుంటుపడేందుకు సహాయం చేస్తోంది మీ ప్రవర్తన. మీరు పత్రికలకీ వాటికీ అదోయిదో యేదో రాస్తున్నారు. మీదీ బాధ్యతున్నపనే. అలాంటప్పుడు మీయింట్లో మీ యిష్టంవచ్చి నట్టు ప్రవర్తిస్తే? సిగ్గెయ్యడంలా? హాస్పిటల్లోనూ యిదే గొడవా! యింకా అంతకంటె యింకేంకావాలి? ఇది చాలదూ? మీ భర్తమనసు కష్టపెడితే అదంతటితో ఆగదు; మొత్తం సంఘానికే తగులుతుందాదెబ్బ. సరే, ఆ సంగతి ఆయన్తో వేరే మాట్లాడతాను! ఇప్పుడు మీసంగతి మాట్లాడ్దాం. మీ ప్రవర్తన చాలా చౌకబారుగా వుంది. చాలా చౌకబారుగా వుంది" అని యింకోసారి అన్నాడు స్మోరొబొగతోవ్, మొహా

మంతా కుంచించుకుని చీదరించుకుంటూ, "అదీ, యేదో క్షణిక బలహీనత కాదు. ఇవ్వాళ తావ్‌రోవ్ అయ్యాడు; రేపు, ఇగోర్; ఒకసారి...."

"ఇక చాలాగండి!" అంది ఓల్గా నెమ్మదిగానే; కాని ఆవిడముఖమూ, ఆ గొంతూ చూసి స్కొరబొగతోవే నిశ్చేష్టుడయ్యాడు. "అత్యుత్తమమైన ఆదర్శ సంబంధాన్ని గురించి యిష్టంవచ్చినట్టు వాగడం గూడా చౌకబారుతనమే. నాకింకో యితర వ్యక్తితో స్నేహం లేదని అనను నేను; వుంది. కాని ఆ వ్యక్తి నాజీవితంలో నేనెదుర్కొన్న ప్రధాన సమస్యని పరిష్కరించడానికి సాయం జేశాడు నాకు; నాకు తగిన పనిని ఎన్నుకోవడానికి ఎంతో సహాయం జేశాడు. ఇప్పుడు నా జీవితానికొక అర్థమూ ఆశయమూ ఏర్పడినై. ఇప్పుడిలాంటి విషయాన్ని గురించి మీరు, అందులోనూ మీరు మాట్లాడ్డం చాలా పొరపాటు; గొప్పతప్పు!"

"అసలావిణ్ణి పిలిపించవలసినంత అవసరం యేమొచ్చింది?" అని ఆశ్చర్యపోయాడు లొగునోవ్. ఇగోర్ వచ్చి కథంతా చెప్పాడతనితో. "స్కొరొబొగతోవ్ కష్టపడి పనిచేస్తాడు, నమ్మిగనపని చేసే మనిషి" అని అనుకున్నాడు తనలో తానే, "కాకపోతే యేదో కథలో అన్నట్టు ఎలుగుబంటి పట్టు; తాడు తెగేదాకా లాగుతాడు; ఇనుం విరిగేదాకా వంచుతాడు."

"కుటుంబం సంఘానికి పునాది కాబట్టి, కుటుంబ వ్యవహారాలు సంఘానికి సంబంధించినవే ననడంలో సందేహంలేదు"

అన్నాడు ఇగోర్‌తో, "కాని హృదయానికి సంబంధించిన అనుబంధాన్ని కాదనడానికి మనమెవర్ణం? అందులో పిల్లా పాపా యెవరూ లేరు. ఇద్దరూ బాగా వ్యక్తిత్వం వచ్చిన పెద్ద వాళ్లు. దాన్నిగురించాయనంత రభస చెయ్యడం దేనికి? అవసరమనుకుంటే ఇవాన్ ఇవానొవిచ్ మాట్లాడుకునేవాడు ఓల్గా పావ్‌లోవ్నాతో."

"అసలతను వొట్టికపటనాటకంగాడు" అన్నాడు ఇగోర్.

"ఎవరు?"

"స్కొరొబొగతోవ్."

"అలా అనడం యేమంత సబబనుకోను" అన్నాడు లొగునోవ్, మొహం చిట్లించి, "అనుకున్నదేదో అనేసే రకం...."

"ఐతే, పావాని గురించి మాట్లాడడే యెప్పుడూ?...." అని ప్రారంభించాడు ఇగోర్; అంతలోనే మళ్ళీ సర్దుకుని, "అంటే నేను పావానిగురించి తప్పుగా అనుకుంటున్నానని కాదు" అంటూ క్షమాపణ చెప్పాడు. "అవన్నీ వ్యక్తిగత విషయాలు. ఎవరిసంగతి వారు చూసుకుంటారు, ఏమంటారు?" అని, లొగునోవ్‌ని చూచి ఆగిపోయాడు మధ్యలోనే.

"కాదుకాదు, నేనొప్పుకోను. సాంఘిక ప్రవర్తనకి అంటకుండా దూరంగా వున్నంతవరకే అది వ్యక్తిగతం; కాని ఆ సరిహద్దులు దాటిందీ అంటే సంఘం జోక్యం తప్పదు."

ఇగోర్‌కి కష్టం వేసింది. ఆపుకోలేక, "ఐతే మీరూ స్కొరబొగతోవ్‌నే సమర్థిస్తున్నారన్నమాట" అన్నాడు.

"కాదు" అన్నాడు లోగునోవ్, "ఆయన ఆ జోక్యం కలగజేసుకునే పద్ధతితో. మాత్రం నేనేకీభవించను."

ఇద్దరూ ఎంజిన్ల దగ్గర నిలబడి మాటాడుకుంటున్నారు. సాయంకాలం షిఫ్టు ప్రారంభమైంది. అంతవరకూ పనిచేస్తున్న కార్మికులు వెళ్ళిపోయారు. తరవాత వొచ్చే కార్మికులొచ్చేశారు పనిలోకి. ఎవరిపనివాళ్ళు చేసుకుంటున్నారు. ముడి పదార్థాన్ని పట్టుకుపోయే బళ్ళచప్పుడు మాత్రం వినిపిస్తోంది మధ్యమధ్య.

"అసలట్లా మాట్లాడగూడదు" అన్నాడు లోగునోవ్, "ఆ పదవిని నిర్వహించే వ్యక్తికుండవలసిన తెలివితేటలుగాని, అర్థంచేసుకునే శక్తిగాని లేవు స్కొరొబొగతోవ్‌కి. అంతగా కావాలంటే — ఇవాన్‌తో గాని, తావ్‌రోవ్‌తో గాని, పోనీ యిద్దరితో గాని, పిలిపించుకుని స్నేహితులతో మాట్లాడినట్లు మాట్లాడొచ్చును. ఇద్దరూ పార్టీసభ్యులు గూడాను. అంతే గాని, వూరికే అలా నోరు పారేసుకో గూడదు."

"అదేమరి" అని వొప్పుకున్నాడు ఇగోర్. "అతన్తో మాట్లాడి బయటికొచ్చింతర్వాత ఓల్గాని చూశాను. మనిషూరికే వణికిపోతోంది. ఏడవలేదు; కోపంగానూ లేదు; కాని సగం చచ్చిపోయినట్టుంది. బాగా మొరటుగా మాట్లాడి వుంటాడు. ఐనా, నీతీ నియమం లేకుండా ప్రవర్తించే వాళ్ళపని బట్టాలి, వాళ్లెంత గుట్టుమట్టుగా చేస్తున్నా; వాళ్లూ సంఘానికి చీడ పురుగు లాంటివాళ్లు. అంతేగాని........"

"మరి స్కొరొబొగతోవ్‌తో అన్నారా ఆమాట?"

"యేదీ, చెప్పనిస్తేనా; మీకూ తెలుసుగా ఆమనిషి సంగతి."

"విద్యుత్కేంద్రం ఇంధనం సంగతి చెప్పేటప్పుడు బాగానే చెప్ప నిచ్చేడే మరిమిమ్మల్ని ?" అని గుర్తుచేశాడు లొగునోవ్.

"నిజమే గాని, ఆవిషయం లోతుపాతులన్నీ తెలుసు కాబట్టి మాట్లాడాను. ఈసంగతులు మరీ యేమీ తెలియవ నాకు."

"యీ పరిస్థితు లర్థం కావడం కష్టమే." అనుకున్నాడు లొగునోవ్, గనిలోంచి బయటికెళ్తూ. "మేం, సోవియట్ ప్రజలం, అందులోనూ పార్టీ సభ్యులం అదొక రకమైన మను షులమనీ, మాకు మానవీయమైనభావాలుండవనీ అనుకుంటారు కొందరు; లేకుంటే అసలు మాసంగతే మేము పట్టించుకోమనీ, ఎప్పుడూ త్యాగాలు త్యాగాలంటూ సమిష్టిప్రయోజనంకోసం బలై పోతుంటామనీ అనుకుంటారు. అందులో కొంత నిజంవున్న మాట నిజమే; బాగా కష్టపడి పనిజేస్తాం; అంత మాత్రాన మిగతావన్నీ వదలుకోం. మానవు లందరిలాగానే ప్రేమిస్తాం, సంతోషిస్తాం, ఆనందంగా బ్రతుకుతాం; అందులో మమ్మల్ని మించిన వాళ్లెవళ్ళూ లేరు. మాప్రక్కమనిషి మంచికంటే మేం కోరుకునే స్వార్థమూ యేమీలేదు."

# 54

"ఇక వెళ్లిరా నాయనా!" అన్నాడు ఇవాన్, యూరీని చేతుల్తో పైకెత్తి నవ్వుతూ; "ఇకేంభర్వాలేదు నీకు. కాస్త బలిశావుగూడాను. కాకపోతే యింకా కొంతకాలం ఆగాలి ఎత్తైన ప్రదేశా లెక్కాలన్నా, దిగాలన్నా. తొందరపడబోకు.

ఐనా జాగ్రత్తగా చూస్తుండమని మీ అమ్మకి చెబుతాడులే డెనిస్."

"నాకూ తెలుసు" అన్నాడు యూరీ; వున్నట్టుండి, రెండుచేతుల్తోనూ ఇవాన్ మెడ పెనవైచి గట్టిగా హత్తుకున్నాడు.

"ఏం? పడేస్తానేమోనని భయపడ్డావా?"

"లేదు" అన్నాడా కుర్రాడు. రెండు పెదవులూ ముద్దు పెట్టుకోబోతున్నట్టు పెట్టి ఇవాన్ ముఖంలో ముఖంపెట్టి "ఉం?" అనడిగాడు; మెరిసే కళ్లతో ఇవాన్ కళ్ళల్లోకి చూచి, "ఒక్కసారంటే ఒక్కసారి!" అన్నాడు.

ఇవాన్ సరే నన్నట్లు తల వూపాడు. తన భావాలెక్కడ వెల్లడై పోతాయోనని భయపడ్తున్నట్లు కళ్ళు రెండూ మూసుకున్నాడు. ఆకుర్రాడి పెదవులు రెండూ తన బుగ్గ నానుకుని ముద్దు పెట్టుకోగానే, యెక్కడలేని ఆనందంతో చిరునవ్వు నవ్వుకున్నాడు.

తనకంత మేలు చేసిన డాక్టరు భుజం పట్టుకుని నిమురుతూ, "అమ్మో, మీరు చాలా బలవంతులు....గుచ్చుకున్నవి గూడాను" అన్నాడు యూరీ.

"గడ్డం చేసుకుంటానిక్కూడా తీరికలేకపోయిందివ్వాళ" అనుకున్నాడు ఇవాన్. వొంటరిగా కూర్చుని ఆలోచించుకుంటూ, "పెళ్ళైన వాళ్ళిలా వుండగూడదు. ఎందుకనో యీ మధ్య అశ్రద్ధ మరీ యెక్కువైంది. ఇక్కడుండే రోగులు కొద్దిరోజులే వుంటారు; బాగావుంటే కొద్దివారాలుమట్టుకుంటారు.

ఐనా వాళ్లు వెళ్లిపోతూంటే. ఆత్మీయులెవరో వెళ్ళిపోతున్నంత బాధగావుంటుంది. ఉదాహరణకి యీ యూరీ—చిన్న వెధవ! సొంత బిడ్డలాగా చూచుకున్నాం; అతనూ అంతే; సొంత యింటిలో వున్నట్టున్నాడు.... 'ఒక్క సారంటే ఒక్కసారి'.... జన్మలో మరిచి పోగలమా అలాంటి మాట? మరి; ఆవిడా నేనూ నిండా ఎనిమిదేళ్లు కలిసున్నాం!"

"ఉత్తరం వొచ్చింది, వుత్తరం!" అంటూ పరుగెత్తు కొచ్చాడు కన్నుడాక్టరు.

"ఎక్కణ్ణుంచి?"

"ప్రాంతీయ కమిటీనుంచి. మనజాబుకి జవాబు."

"యేదీ?"

"డెనిస్ పట్టుకొస్తున్నాడు. యేమయ్యాడు? నా వెన కాలే వున్నాడనుకున్నానే" అంటూ మళ్లీ హాల్లోకెళ్లి చెయ్యూపాడు ఎవర్నో తొందరగా రమ్మని పిలుస్తున్నట్టు.

"వస్తున్నా" అంటూ మరుక్షణంలో వచ్చిపడ్డాడు డెనిస్ చేటంత మొహంతో.

"యేమనుంది?" అనడిగాడు ఇవాన్.

"నాకు తెలియదు. నేనుచూడలేదు. మీ పేరవచ్చింది."

"చూడకుండానేనా! మరెందుకింత సంతోషం?" అని చెయ్యి జాపాడు ఇవాన్.

"జవాబులో చెడేమీ వుండదనే నానమ్మకం. ప్రాంతీయ కమిటీనుంచి ఒకాయన తీసుకొచ్చాడు వుత్తరం. ఇద్దరొచ్చా రసలు ఆకమిటీనుంచి. జిల్లా ప్రత్యేకసమావేశం ఏర్పాటు

చెయ్యడాని కొచ్చారట. ప్రత్యేకసమావేశాలూరికే ఆషామాషీగా జరపరుగా?"

"జిల్లా సమావేశం?" అన్నాడు ఇవాన్, వుత్తరంచించి యేమనుందో చదివేందుకు భయపడుతూన్నట్టు.

"తొందరగా చించి చదవండి దయుంచి, అన్నాడు కన్నుడాక్టరు.

ఇంతలోకే న్యూరాలజిస్ట్ గూడా వచ్చాడు; గుమ్మంలో నుంచుని కళ్ళద్దాలు తీసి తుడుచుకుంటూ, "ఏమని వ్రాశారేవిఁటి?" అనడిగాడు.

అతనివెనకే సెర్గుతోవ్ వచ్చాడు. అతనివెనకే ఎలీనా, వార్యా, నికితా బుర్త్సేవ్.

వాళ్ళందరూ అలా రాకుండావుంటేనే బావుండేదేమో. ఎవరికి తెలుసు, ఆవుత్తరం చెడ్డవార్తనే మోసుకొచ్చిందేమో; తమపై అధికారి సర్జెన్ని కించపరచేవార్తే వున్నదేమో. కాని, ప్రాంతీయకమిటీకి విజ్ఞప్తి పంపడంలో వాళ్ళ పాత్రవుంది. అదికూడా యేదోనామకః సంతకంపెట్టిన తంతుకాదు. ఆ జవాబుకోసం అందరూ ఆతురతగానే ఎదురుచూశారు. అంచేత, మంచిజరిగినా చెడ్డజరిగినా అదొక్క ఇవాన్ ఇవానొవిచ్ కి సంబంధించిన విషయమేకాదు; అందరికి సంబంధించిందీనీ. అంచేతనే అందరూ యిక్కడీవిధంగా పోగవ్వడం మంచిది కాదేమోనన్న సంగతి, అంతమందిలోనూ వొక్కరికికూడా, తట్టలేదు.

ప్రాణాలన్నీ బిగబట్టుకుని చూస్తున్నారందరూ ఇవాన్ వంక. ఇవాన్ చేతులుగూడా వణకిపోయినై. అక్కరలేని

తొందరపడుతున్నాడు. ఆతొందరలో చించినకవరుగూడా జార విడిచాడు; కవరు కిందపడి గలగలమంది.

మొదటొకసారి పైనుంచి కిందిదాకా చదువుకున్నాడు ఇవాన్; తర్వాత ముహంలోకి కళొచ్చింది. ముడిచిన కనుబొమలు విడివడినై.

"అహ్హాఁ భలే!" అన్నాడు భళ్లున వచ్చిపడే నవ్వాపుకుంటూ.

"మనం అవసరం అనుకున్నదల్లా చేసేందుకు పూర్తి స్వాతంత్ర్యం యిచ్చారు మనకి— ఐతే ఫలితాల బాధ్యతగూడా మనదేనన్నమాట!"

# 55

"మనం హాయిగా బ్రితుకుతున్నాం; కష్టపడి పనిచేస్తున్నాం." అన్నాడు తెరెంతీ ప్యాతిఓలోస్, జిల్లా ప్రత్యేక సమావేశంలో. ప్యాతిఓలోస్ గూడా గనిలో పనిజేసే కార్మికుడే. యువకుడే ఐనా, స్తెఖనోవైట్ వుద్యమంలో అతని కొచ్చినపేరు ఆప్రాంతం బయటికిగూడా పాకింది. "కాని మనం యింతకంటేగూడా బాగా పనిచెయ్యగలం. ఐతే ఎందుకని చెయ్యలేక పోతున్నాం? జిల్లా కార్యదర్శి స్కొరొబొగతోవ్ తన ప్రారంభోపన్యాసంలో చెప్పారు; గని పని వారికీ ఆయనకీ మధ్య భేదాభిప్రాయాలున్నయ్యని, ఒకరి నొకరు సరిగా అర్థంచేసుకోవడంలేదని. ఔను అందువల్లనే సాగడంలేదుపని. జిల్లాకమిటీసభలోఅంటే ఆయన లొగునోవ్‌నీ మార్తెమియనోవ్‌నీ మాటాడకుండా చేశాడు! ఇక్కడట్లా

నానోరెవ్వరూ కట్టెయ్యరనే నానమ్మకం. మానోటికి తాళాలు వెయ్యడం యిక సాధ్యంకాదు; ఒకవైపున పనిపాడైపోతూంటే కళ్లారాచూస్తూ వూరుకోంమేం. ప్రాంతీయ కమిటీనుంచి వచ్చిన కామేడ్స్ వినాలేగాని బోలెడంతుంది చెప్పవలసింది. మనగని యింతవరకెప్పుడూ అన్ని విషయాల్లోనూ ముందంజ వేసింది; ఔనా, కాదా? ఔను. మాదారికెవ్వరూ అడ్డంరాకపోతే, యీపాటికి అర్ధ సంవత్సరం ప్రణాళికని యింకా చాలా ముందే పూర్తిచేసేసే వాళ్ళం!"

"అంటేయేమిటో ఖచ్చితంగా చెప్పండి!" అన్నాడు స్కొరొబొగతోవ్, యెప్పటిలాగానే. కాని గొంతులో యిది వరకటి మొరటు తనంలేదు; మొత్తంమీద మనిషి దిగాలుగా వున్నాడు.

అటు ప్రాంతీయకమిటీ ప్రతినిధులవైపూ యిటుజిల్లా ప్రజాసంస్థల ప్రతినిధులవైపూ కళ్లప్పగించిచూస్తూ కూర్చున్నాడు. జిల్లాలో పరిశ్రమలనుంచీ, సమిష్టివ్యవసాయ క్షేత్రాలనుంచీ, ప్రభుత్వ వ్యవసాయ రంగాలనుంచీ, సహకారమత్స్య పరిశ్రమలనుంచీ ప్రతినిధు లనేకమంది వచ్చారు. మాట్లాడిన ప్రతీవ్యక్తీ తనని గురించేదోవొక చెడుచెబుతూనే వచ్చాడు. నిజంగానే ఆశ్చర్యం వేసిందతనికి. ఇంతమంది, అసంతృప్తి వున్న జనం యెక్కడినుంచొచ్చారో తెలియడంలేదు. ఇది వరకక్కడక్కడా వొకడు, ఆ లొగునోవ్‌లాగా, మాట్లాడేవారు తనకు వ్యతిరేకంగా. ఇప్పుడు ఈజిల్లా ప్రత్యేక సమావేశంలో.... ఇంతమంది ప్రముఖ ప్రతినిధులున్నారు....తనంటే యింత అసంతృప్తా? జిల్లా కమిటీ ఆఫీసులోలాగానే కుర్చీలోంచిలేచి, బల్లమీదగుద్ది "మీరంతా పార్టీకి వ్యతిరేకంగా మాట్లాడు

శున్నారు!" అని అనాలనిపించింది చాలాసార్లు. కాని తమా యించుకున్నాడు. పార్టీయే తనకి వ్యతిరేకమౌతున్నట్టుంది యీసమావేశం ధోరణి చూస్తుంటే.

డాక్టర్ ఇవాన్ అన్నమాటలు గుర్తుకొచ్చినై; "యీ పార్టీతోపోల్చిచూస్తే నువ్వొక నలుసువి" అన్నాడు ఇవాన్ అప్పుడు. ఆమాటలు వింటూంటే మండుకొచ్చిందప్పుడు.

"నలుసు!" అనుకున్నాడు, హాలులో వున్న వాళ్ళందర్నీ యింకొకసారి చూచి. అందులో యేవొక్కరికీ తనంటే యిష్టంవున్నట్టులేదు. వాళ్లు ఒక్కొక్కళ్ళూచేసే ఆరోపణలు వింటూంటే భయం వేస్తోంది; వాళ్లమాటల తీరుచూస్తుంటే కోపం వస్తోంది. ఇప్పుడివ్వాళ యిక్కడ నిలబడి తనమంచి చెడ్డల్నిగురించి చెప్పేవాళ్ళందరి లోపాల్నీ చేతివేళ్ళమీద లెక్కించి చెప్పగలడుతాను.

"ఆ మా త్రెమియానోవ్ రోజుకొక గ్లాసుడు తాగు తాడు. ఇలాంటివాళ్ళసంగతి బాగా తెలుసు నాకు; ఇవ్వా ళ్ళొక గ్లాసు, రేపొక గ్లాసు, తర్వాత మనం కన్నుమూసి తెరిచే ప్పటికొక పెద్ద బానడు. లొగునోవ్ తాగడు, సిగరెట్లుకూడా కాల్చడు, కాని వూరికే పగటికలలు కంటూంటాడు; డబ్బు దగ్గరకొచ్చేప్పటి కసలు లెక్క తెయ్యడమే తెలియదు. ప్ర్యాఖిన్ ఎప్పుడూ పేకాడమంటే ఆడతాడు, పై వాళ్ళకెప్పుడూ జీ హుకుంలు కొట్టమంటే కొడతాడు. నేను నిప్పులో దూక మంటే దూకేవాడు; అలాంటి వాడిప్పుడు కన్నెత్తిగూడా చూడటంలేదు నావంక. ఇప్పుడర్థమౌతోం దతనిభార్య అంత శీతాకోక చిలుకలాగా యెందుకు తయారయ్యిందో. ఆ ప్రభుత్వ వ్యవసాయ రంగంనుంచి వచ్చిన ప్రతినిధి. అతనికి

రాజకీయాలు తెలియనే తెలియవు. అతని ప్రక్కనే కూర్చున్న తను, ఆడవాళ్ళు కనిపిస్తే చాలు ఐపుండడు. ఇకితని సంగతి చెప్పేపనేలేదు; శ్రామికవర్గానికీ అతని జన్మకీ యోజనాల దూరం."

ఇవెన్ సహకార సంస్థ అధ్యక్షుడు కన్పించాడు యింతలో. అతనూ తనవైపే చూస్తున్నాడు; పెద్దయిష్టంగా వున్న ట్లేమీలేదు ఆ చూపు.

"అతనూ నాపనై పోయిందనే అనుకుంటున్నట్టున్నాడు" అనుకున్నాడు స్కొరొబొగతోవ్, ఆ ప్రతినిధి జీవితాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ, "ఇదివరకొకసారి డబ్బు వ్యవహారంలో చిక్కుకున్న మనిషే; డబ్బు తినేశాడో, దుర్వ్యయం చేశాడో గుర్తుకు రావడంలేదు...."

చూడగా చూడగా సమావేశంలో కూర్చున్న వాళ్ళందరూ తనకింద దిగదుడుపుగానే కన్పించారతనికి; దాంతో కాస్త ధైర్యం చిక్కబట్టుకున్నాడు. తన మంచితనాన్ని హెచ్చుగా అంచనా వేసుకునే ప్రతిమనిషీ, ప్రక్క వాళ్ళ లోపాల్నీ అలాగే యెక్కువచేసి చూస్తాడనే సత్యాన్ని మరిచి పోయాడతను. వాళ్ళు తనకంటే తక్కువవాళ్లనే అతని వుద్దేశం యెప్పుడూను; ఇక వాళ్ల మంచెందుకు కన్పిస్తుంది! కాని, ఈ జిల్లా మొత్తంమీద జీవితాన్నంతా మార్చి వేసిందీ వాళ్ళే. అడవులుకొట్టి, కొండలు తొలిచి రోడ్లు వేసింది వాళ్ళు. పట్టణాలు కట్టింది వాళ్ళు. ఇదివరకెప్పుడూ కనీవినీ యెరగని ధాన్యాన్ని పండించింది వాళ్లు; కాయగూరలు కాయించింది వాళ్ళు. బంగారం, ఉన్ని, మత్స్య పరిశ్రమలు.... ఒకటేమిటి, ఈ ప్రాంతంలో జీవితం మూడు పూవులు ఆరు కాయలుగా

వర్ధిల్లుతూందంటే అందుకు కారణం వాళ్లు. ఈ వుత్తర ప్రాంతం అభివృద్ధి బాధ్యతని కేంద్ర కమ్యూనిస్టుపార్టీ కమిటీ అప్పగించింది వాళ్ళకి.

"ఇతనికీ యిష్టంలేదన్నమాట నేనంటే" అనుకున్నాడు స్కొరొబొగతోవ్, అప్పుడే వేదికెక్కి మాట్లాడుతున్న జిల్లా ఆర్థికవేత్తని చూచి; ఔను, గత ఆరు మాసాలనుంచి కలిసి పనిచేస్తున్నా రిద్దరూనూ; యీ ఆరుమాసాల్లోనూ అనేకసార్లు కుస్తీలుగూడా పట్టుకున్నారు. "వీపు చరిచి, 'నువ్వు మంచి వాడివి' అని అనక పోతే అందరూ యెదురు తిరుగుతారన్న మాట !" అనుకున్నాడు.

"మమ్మల్నే విషయంలోనూ చొరవ తీసుకుని పనిచెయ్య నివ్వడీ జిల్లా కార్యదర్శి" అన్నాడొక యకూత్ తర్వాత; అతను జిల్లా పశుక్షేత్రానికి డైరెక్టరు. "జిల్లా కమిటీకెళ్ళాలంటేనే భయం మాకు. అలా వుంటే లాభం? కామ్రేడ్ స్కొరొబొగతోవ్ మా క్షేత్రం చూచేందు కొచ్చాడొకసారి. అటూ యిటూ చూచి, మీరిక్కడ పైరు వెయ్యండని చెప్పాడు. అక్కడేస్తే ప్రయోజనంలేదనీ పదేపదే చెప్పిచూశాం: వినలేదు. ఆయన చెప్పినట్టు చెయ్యాల్సొచ్చింది; చేశాం. వేసవికాలంలో మంచు కరిగి మీద పడింది. నది పొంగింది. మా పైరంతా కొట్టుకు పోయింది; ఎంతనష్టం వచ్చిందో చెప్పడం కష్టం; ఇప్పుడు మాకు యెండు గడ్డి గూడా లేదు సరిపడా."

"యెవరు తప్పులు పట్టినా పనిచేసేవాణ్ణే; చెయ్యని వాడికి తప్పులేముంటాయ్ ?" అని వ్రాసుకున్నాడు స్కొరొబొగతోవ్; ఈ విషయం ముగింపు వుపన్యాసంలో వొక ముక్తాయింపు యివ్వడానికి బావుంటుందనుకున్నాడు.

తీరా ముగింపు వుపన్యాసం యిచ్చేప్పటికి, చాలా యాంత్రికంగా మాట్లాడాడు. ఎంతచెప్పినా యీ జనం చెవి కెక్కదు అని నిర్ధారణ చేసేసుకున్నాడు; అంచేత తన మీద చేసిన కొన్ని 'దాడులకు' మాత్రం సమాధానం చెప్పుకున్నాడు; అంతే.

అందరికంటె చివర ప్రాంతీయ కమిటీ ప్రతినిధి వుపన్యాసం. ఆయన లేచినిలబడ్డాడు వుపన్యాసం యిచ్చేందుకు. ఆ లేచే పద్ధతి అదీచూస్తే ఆశపుట్టింది స్కొరొబొగతోవ్‌కి. బాగా బలమైన మనిషి; నిండుకుండలావున్నాడు; గుచ్చిచూసే కళ్ళు; ముహం మీద పడుతూ ముగ్గు బుట్టలా తెల్లని జుత్తూ.

"ఫర్వాలేదు; కార్మిక వర్గంలో వాడే !" అనుకున్నాడు.

కాని ఆ క్షణిక భ్రమ మూలాన మరీ బాధపడవలసి వచ్చింది తర్వాత. ఆ ప్రతినిధి, నిజంగానే కార్మికుడే. మొట్ట మొదట కొంతమంది వుపన్యాసాలు సమీక్షించాడు. తర్వాత డొంకతిరుగుళ్ళేమీ లేకుండా, నిశితంగా, స్కొరొబొగతోవ్‌ని విమర్శించాడు. అతనవలంబించిన పద్ధతి నియంతృత్వ పద్ధతని దుయ్యబట్టాడు.

"ఈలాంటి నాయకత్వ విధానాలు పార్టీ పద్ధతికి వ్యతిరేకం. పార్టీకీ, ప్రజలకూ మధ్య వుండవలసిన సత్సంబంధాలకు వ్యతిరేకం. కామ్రేడ్ లెనిన్, స్టాలిన్‌లు మనకు నేర్పిందేమిటి? పరస్పర విశ్వాసం యీ సత్సంబంధాలకి పునాదిగా వుండాలని చెప్పారు. ప్రజలు చెప్పే విషయాలన్నీ ముందు శ్రద్ధగా వినాలని చెప్పారు. ఏ అభిప్రాయాల్ని వాళ్ళమీద బలవంతంగా రుద్దగూడదని చెప్పారు; నెమ్మదిగా వారికి నచ్చజెప్పాలని చెప్పారు. కాని స్కొరొబొగతోవ్ అలా చెయ్యలేదు.

తనిష్టం వచ్చినట్టు చేశాడు. జిల్లా కార్యదర్శికి అంతులేని అధికారం వున్నదనుకున్నాడు. బెదరించాడు, కేకలేశాడు, అవమానించాడు. తన అధికారాన్ని అందరూ గుర్తించాలని ఆజ్ఞాపించాడు. కాని ఆగుర్తింపు ఐచ్ఛికంగా జరగవలసిందనీ, ఆజ్ఞల మూలంగా వచ్చేది కాదనీ మరచిపోయాడు. అలాంటి నాయకత్వం మనలేదు. అందుకు ప్రస్తుత ఘటనలే చక్కని ఉదాహరణ. పార్టీ సభ్యుల రాజకీయ చైతన్యం, కార్మిక జనసామాన్యంలోనూ, తదితరవృత్తి జనుల్లోనూ, రైతు జనంలో వచ్చిన నూతన మానసిక పురోభివృద్ధీ చూచి, పార్టీ సభ్యులూ, మన లాంటి బాధ్యతలు గలవారూ యీ నూతన నాయకత్వం అవసరాన్ని, నాయకత్వం దృక్పథంలో రావలసిన మార్పుని గుర్తించాలి; అవలంబించాలి. స్కొరొబొగతోవ్ అనవసర ఆత్మ సంతృప్తితో తలక్రిందయ్యాడు; అన్నీ తనకే తెలుసుననుకున్నాడు; ప్రజలతో సంబంధం పెట్టుకోవడం మానేశాడు; ప్రజలకు దూరమయ్యాడు; పార్టీకి దూరమయ్యాడు. అంచేత ప్రాంతీయ కమిటీ అందు కవసరమైన చర్యలు తీసుకోక తప్పదనే నిర్ణయానికి వచ్చింది."

ఇక, తర్వాత స్కొరొబొగతోవ్ చెప్పేందు కేముంటుంది. అతని పటాటోపం అంతా బ్రద్దలై పోయింది; మనిషి క్రుంగిపోయాడు; కన్ను లిదివరకటిలా రెప్పవెయ్యకుండా చూడడం మానివేశినై.

"మాడిపోయాడు" అన్నాడు మాత్రెమియనోవ్, లొగునోవ్‌తో; వాడిపోయిన స్కొరొబొగతోవ్ ముఖంవంక చూస్తూ కూర్చున్నాడు లొగునోవ్ నిర్వికారంగా.

మా త్రైమియనోవ్ మట్టుకు చాలా బాగా సంతోషించాడు. ఇకీ జిల్లా కార్యదర్శి పదవికి రోజులు దగ్గర కొచ్చినై లే అనుకున్నాడు; అంతే జరిగింది. పార్టీ దృక్పథం ప్రకారం, అవసరమైన చర్యలన్నీ తీసుకోబడినై.

# 56

కారుదిగి, చుట్టూ కలయజూచాడు లొగునోవ్. పండబారి, బంగారురంగు ఆకులు గలగల మంటున్నై యెటు జూచినా. దూరంగా యకూత్ పేట; నదీతీరాన, అక్కడక్కడా, నల్లగావున్న గడ్డివాములు.

"పదండి, వెళ్దాం" అన్నాడు ప్రక్కనున్న వాళ్ళతో. చిన్న పెట్టె వొకటీ, కాగితం పొట్లం వొకటీ కారులోంచి తీసుకుని బయల్దేరాడు, కాలిదారినబడి. ఇప్పుడతను జిల్లా పార్టీ కమిటీ కార్యదర్శి; మొన్నటిదాకా గనుల్లో ఎంజినీరు. ఆపనికీ యీపనికీ పొంతనలేదు. జిల్లా కార్యదర్శి పదవీభారం యింతింత కాదు; ఒక్కసారే ఆ బాధ్యతలన్నీ వచ్చి నెత్తిన బడినై. అదృష్టవశాత్తూ, గనుల్లో ఎంజినీరుగా వున్నప్పుడుగూడా, అన్ని రంగాలలో పనిజేసే మనుషులతోనూ మాట్లాడడం, మంచీ చెడ్డా తెలుసుకోవడం అలవాటైంది. అదిప్పు డక్కరకు వచ్చింది. మహాసభల్లోనూ, పార్టీ సమావేశాల్లోనూ, జిల్లా పార్టీ కార్యనిర్వాహకవర్గ సమావేశాల్లోనూ అనేకమందిని కలుసుకునేవాడు. వ్యవసాయాన్ని గురించీ మత్స్య పరిశ్రమను గురించీ .... అడిగి తెలుసుకునేవాడు. వాళ్లు సాధించిన విజయాలు చూచి గర్వించే వాడు; పొందిన అపజయాలు చూచి విచారించేవాడు.

"మంచి మంచి వాళ్లందరూ వెళ్లిపోతూంటే చూస్తూ వూరుకున్నాడు ఆ కుప్రియెంకో" అని వాపోయాడొకసారి, యకూత్ ప్రభుత్వ క్షేత్రంలో మాజీ డైరక్టరుని గురించి మాట్లాడుతూ. "పరిస్థితులింకా విషమించకముందే, అతన్ని తీసివెయ్యడం మంచిది. అతని స్థానంలో ఆర్థికవేత్త, అమొసోవ్‌ని వెయ్యడం మంచిది."

లొగునోవ్ చెప్పిందే నిజమైంది; అమొసోవ్ వెళ్లి అక్కడి చిక్కు వ్యవహారాలన్నీ త్వరలోనే పరిష్కరించేశాడు.

ఇలాగే, అనేకసార్లు, జిల్లా వ్యవహారాల్లో మంచి శ్రద్ధ చూపినవాడే లొగునోవ్. ఐనా అదంతా వొకెత్తు; ఇప్పుడీ కార్యదర్శి పదవిని నిర్వహించడం వొకెత్తు.

"నాకేమీ అనుభవం లేదాయె. ఏవి అత్యవసరమైన పనులో, యేవి కావో యెలా నిర్ణయించగలను యీావళాన?" అనుకున్నాడు దారెంట నడుస్తూ.

ఎత్తుమీదినుంచి కిందికి దిగుతూ కాలుజారి ప్రక్కనున్న కొమ్మ పట్టుకున్నాడు; కొమ్మ ముల్లు గుచ్చుకుంది. చూస్తే రేగుచెట్టు. ఎటుచూచినా రేగుచెట్లే; విరగకాసివున్నై. పళ్ళు సిందూర వర్ణంగా వున్నై; సూర్యరశ్మిపడి మెరిసిపోతున్నై.

"ఎన్ని పళ్లెన్ని పళ్ళు" అనుకుంటూ ఒకకాయకోసి నోట్లో వేసుకున్నాడు.

"ఈపళ్లు బాగా రుచిగా కూడా వున్నై. ఆదేవదారు కంటే యివే మంచివేమో ఆరోగ్యానికి. పరిశోధించమని చెప్పాలి డాక్టర్ ఇవాన్‌తో. జిల్లా సోవియెట్ అధ్యక్షుడుతో గూడా మాట్లాడి, వీలైతే, యిక్కడే ఒక పరిశోధనకేంద్రాన్ని

యేర్పాటు చెయ్యమని చెప్పాలి." గ్రామ సోవియెట్ అధ్యక్షుడి మొఖం యెలా వుంటుందో వూహించుకోవాలని ప్రయత్నించాడు; గుర్తుకు రాలేదు. సమిష్టివ్యవసాయ క్షేత్రం అధ్యక్షుడూ గుర్తులేదు.

"ఈజిల్లాలోవున్న పార్టీ సభ్యులందర్నీ యెరుగును స్కొరొబొగతోవ్; ఇదిగో అతనిలో యీలోటుందని చెబితే చెప్పేవాడుగాక!" అనుకున్నాడు తనలో. ఈ వ్యక్తుల్నందర్నీ గురించీ తెలుసుకుందామని, వెంటవస్తున్న జిల్లా ఆర్థికవేత్త నడిగాడు; అతనుగూడ పార్టీసభ్యుడే. వ్యవసాయరంగం కార్యదర్శిని అడిగి చూశాడు.

సమిష్టి వ్యవసాయ క్షేత్రాన్ని గురించి స్థూలంగాచెప్పాడు జిల్లా ఆర్థికవేత్త. అధ్యక్షుణ్ణిగురించి అతనికీ యేమంత తెలియదు. గ్రామ సోవియెట్ అధ్యక్షుణ్ణి గురించి అసలే తెలియదు వాళ్ళిద్దరకీనీ.

"బాగానేవుంది!" అన్నాడులొగునోవ్ విసుగ్గా, "ఇక్కడొక పార్టీ బ్యూరోగూడా వుంది; అంటే పార్టీలో సభ్యులు బాగానే వున్నట్టు లెక్క. ఈపార్టీకి నాయకు డెవరు?"

"గుర్తులేదు" అన్నాడు కార్యదర్శి, నీళ్లునములుతూ.

"ఈ సమిష్టి వ్యవసాయక్షేత్రం యింతనాసిగా యెందుకుందో చెప్పనా యిప్పుడు" అన్నాడు లొగునోవ్. "ముఖ్యమైన పార్టీ నిర్మాణంతో సంబంధం పోగొట్టు కోవడమంత పొరపాటులేదు. నేను గనిలో పనిచేసేప్పుడు ఆగనుల్లో పనిజేసే వాళ్ళందర్నీ యెరుగుదును. మనం జిల్లా అంతా తిరుగుతాం. విషయాలెలా వున్నాయో చూస్తాం. ఇలాచేస్తే బావుం

టుందని విధానాలు నిర్ణయిస్తాం. కాని వాటి నమలుచేసే దెవరు? స్థానికంగావుండే పార్టీసభ్యులు. స్థానిక ప్రజల్లోకలిసి, వాళ్ళనిప్రోత్తేజపరచి ఆప్రాణాళికని విజయవంతం చేయవలసిందీ, చేసేదీవాళ్లు. అంచేత యీపార్టీసభ్యు లెవరైందీ ముందు మనం తెలుసుకోవడం చాలాఅవసరం."

లొగునోవ్ చిరునవ్వు నవ్వుకున్నాడు. ఇప్పుడు తనకున్న బలహీనతా అదే. తాను కలిసి పనిజెయ్యవలసిన వ్యక్తులెవరో తనకీ తెలియదు, ఇంతవరకు.

ఒక పెద్ద పశుక్షేత్రాన్ని చూచి, తర్వాత పొలాలూ, తోటలూ చూచేందుకు బయల్దేరారు. మెషీన్-ట్రాక్టర్ స్టేషన్‌నుంచి వచ్చిన ట్రాక్టర్లు రెండు, పెద్దరోడ్డు మీదనుంచి ప్రక్కకి తప్పుకుని, దున్నని పొలాల్లోంచి దారి వేసుకుంటూ పోయినై.

"పెద్ద రోడ్డు దగ్గరనుంచి యీ ట్రాక్టరు దారిని అడ్డ దారి వెయ్యాలనుకుంటున్నాం. ట్రాక్టర్ డ్రైవర్ గూడా సరిగ్గానే ఆలోచించాడు" అన్నాడు లొగునోవ్, గ్రామ సోవియెట్ అధ్యక్షుడితో.

తర్వాత వెళ్ళి, స్కూలూ, విక్రయశాలా, స్నానాల శాలా చూశారు. కాయగూరల తోటలువేస్తే కలిగే ప్రయోజనాన్ని గురించి చర్చించుకున్నారు. అక్కడున్న యకూత్ రైతులికి పందుల పెంపకాన్ని గురించి తెలియనే తెలియదు.

"ఈ శీతోష్ణస్థితిలో పందులు బ్రదుకుతాయా ?" అనడిగారు వాళ్లు. "పందులు బాగా కొవ్వి వుంటాయంటారు. వాటిమీదసలు బొచ్చుండదట."

పందుల్ని పెంచితే వచ్చేలాభం యేమిటో విడమరిచి చెప్పాడు లొగునోవ్. త్వరలోనే ఆ గ్రామానికి విద్యుచ్ఛక్తి గూడా వస్తుందని చెప్పాడు. అనేక ప్రశ్నలు వేశాడు తనంతట తానే. చివరికొక మంచి దుబాసీ దొరికింతర్వాత మొత్తం గ్రామాన్నంతా పిలిచి ఒక సభ పెట్టాడు. చెప్పదలుచుకున్నది చెప్పాడు. అందరూ శ్రద్ధగా విన్నారు. "ఇకనేను యకూత్ భాష నేర్చుకోవడం అవసరం. అందుకు వార్యా సహాయం తీసుకోవాలి" అని వ్రాసుకున్నాడు డైరీలో.

"మీ వుపన్యాసం బాగా నచ్చింది మా గ్రామస్థులికి" అని చెప్పింది ఆవూరి పంతులమ్మ. ఆవిడ, యూరీ తల్లి. బయలుదేరేప్పుడే చెప్పింది వార్యా, యూరీ తల్లిని తప్పక కలుసుకు రమ్మని. యూరీ తల్లి చక్కని పుస్తులేసుకునుంది; రష్యన్ భాష ధారాళంగా మాట్లాడింది.

ఆవిడ మాట్లాడుతూంటే, లొగునోవ్ సంతోషంగా విన్నాడు. అది చూచి, "ఇక్కడ మా బడిపిల్లలందరూ రష్యన్ భాష నేర్చుకోవాలని బాగా వుబలాట పడుతున్నారు" అందావిడ.

అందరూ కలిసి నడిచెళ్లారు ఆవిడయింటికి. యిట్లో ఒక ముసలావిడ వుంది. శుభ్రంగా శాటిన్ దుస్తు లేసుకునుంది. కాళ్ళకి అల్లిక పనిచేసిన రంగురంగుల స్లిప్పర్లు; నెత్తికొక తెల్లని రుమాలు. "ఈవిడే మా అమ్మ" అని పరిచయం చేసింది పంతులమ్మ. "డెబ్భయ్యేళ్లుంటై. రష్యన్ బాగా మాట్లాడలేదు. ఎన్నికథలు చెబుతుందనుకున్నారు? ఎన్నిరోజులు చెప్పినా తరగవవి. యూరీ కిక అదేపని; కథలు వింటూ కూర్చుంటాడిక అదేపనిగా."

యూరీ అక్కడే వున్నాడు, మంచం ప్రక్కన స్టూలు మీద కూర్చుని ఎవరా వచ్చిందని చూస్తున్నాడు. చూడగానే లొగునోవ్‌ని గుర్తించాడు. ఒక్కసారతని కళ్ళు చిరునవ్వు నవ్వినై.

లేచి, మంచం మీదున్న కంబళీకొస పట్టుకుని లొగునోవ్ వైపుకి నడిచాడు. ఇంకా బాగా నడవడం రాలేదు. కాళ్ళింకా పూర్తిగా చెప్పినమాట వినడంలేదు. ముఖం మీ దిప్పుడు యిందాకటి చిరునవ్వులేదు; కష్టపడి అడుగులేస్తున్నాడు ముందుకి. ఎంతో సానుభూతితో చూస్తున్నాడు లొగునోవ్, నడవడానికి యూరీ చేస్తున్న ప్రయత్నాన్ని. లొగునోవ్ వెళ్ళి పట్టుకున్నాడు కాని లేకపోతే పడిపోయే వాడే యూరీ.

"ఇప్పు డిప్పుడే నడుస్తున్నాడు. మాకళ్ళనిమేమే నమ్మ లేక పోతున్నాం!" అంది యూరీ తల్లి. కళ్ళనిండా ఆనందా శ్రువులు నింపుకుని.

# 57

ఉత్పత్తి సమావేశానికెళ్ళి యింటికి తిరిగొస్తున్నారు యిద్దరూనూ — ఓల్గా, డాక్టర్ ఇవాన్. దారిలో మళ్ళీ పోట్లాడుకున్నంత పనయ్యింది. లొగునోవ్ కన్పించకపోతే పోట్లాడుకునేవారే. నది బ్రిడ్జిమీదనుంచి డాక్టర్ని పిలిచాడు లొగునోవ్.

"బావున్నారా?" అనడిగాడు ఓల్గాని.

"బాగానే వున్నాను." అంది ఓల్గా, నిట్టూర్పొకటి

విడిచి. "బ్రహ్మాండంగావున్నా" అంది మళ్లీ పోట్లాడబోయిన కోపాన్ని అణచుకోలేక.

"మిమ్మల్నొదిలేట్టులేరు వాళ్లు" అన్నాడు లొగునోవ్, డాక్టర్ వైపుకుతిరిగి.

"అంటే? యెవరూ?"

"ఉఛఖన్ నుంచి కొంతమంది యాకూత్ లొచ్చారు. రెండువారాల పాటైనా సరే, మిమ్మల్ని పంపాలని పట్టుబట్టుతున్నారు. యాభై గుర్రాల్ని తెచ్చారు వెంటబెట్టుకుని. అన్నీ అడివి గుర్రాలే! ఇదివరకెవరైనా యేడాక్టరుకైనాయిచ్చారూ యింత పెద్ద బహుమానం! లేళ్లుగూడా వున్నై యింకా...."

"పిచ్చేమీ యెత్తలేదుగదా వాళ్ళకి!" అన్నాడు డాక్టర్ ఇవాన్. మొత్తంమీద బహుమానం మాటవిని సంతోషించాడనే చెప్పాలి.

తనకేమీ పట్టనట్టు మాట్లాడకుండా కూర్చుంది ఓల్గా.

"మీకీర్తి వ్యాపిస్తోంది" అన్నాడు లొగునోవ్, "మీరు బాగుచేశారే, గుర్తుందా? యిద్దరాడవాళ్ళు; గుడ్డివాళ్ళు, వాళ్లూరువెళ్లి పోయిం తర్వాత జనం తీర్థాని కొచ్చినట్టొచ్చారట వాళ్ళని చూడ్డానికి; మీరు చేసిందంతా చెవులారా విని, కళ్లారా చూడాలని; ఇక జనం అంతా పోగై ఒక ప్రతినిధి వర్గాన్ని యెన్నుకున్నారు మిమ్మల్ని పిలుచుకెళ్లడానికి."

"ఉఛఖన్ యెంతదూరం యిక్కడికి?"

"ఇక్కడికి షుమారు రారువందల కిలోమీట*ర్లుంటుంది. ఆ జిల్లాకది ముఖ్యపట్టణం కాబోతుంది, విద్యుచ్ఛక్తిగూడావుంది."

* 1.609 కిలోమీటర్లు ఒక మైలు

"ఆరువందల కిలోమీటర్లే! అక్కడి కెళ్ళడం యెలా?"

"ఎలాగో ఒకలా వెళ్ళాలి; తప్పదు."

"హుఁ" అన్నాడు ఇవాన్, చిరునవ్వుతో. వాన్యా చెప్పిన సంగతి గుర్తుకొచ్చింది కళ్ళుబాగు చేయించుకున్న స్త్రీ లిద్దరూ కట్టినపాట సంగతి. "విద్యుచ్ఛక్తిగూడా వుందిగదా; మంచిదే. విద్యుచ్ఛక్తితో నడిచే పరికరా లుపయోగించడం బాగా అలవాటైపోయింది నాకు. అటురోగికీ, యిటు సర్జెన్‌కీ గూడామంచిదే ఆపద్ధతి. అక్కడింకా యెవరైనా వున్నారామరి శాస్త్ర వైద్యంలో ప్రవేశం వున్నవాళ్ళూ, నాకు సాయంచెయ్య గలవాళ్ళూనూ? ఆపరేషన్ చేసేప్పుడింకా యెవరైనా వుండాలి గదా మరి."

"ఆమధ్య కొంతమంది డాక్టర్లెళ్ళారక్కడికి. ట్రెయినింగైన నర్సు వుందట. ఉఛఖన్‌లో హాస్పిటల్ పెట్టాలనిగూడా ప్రయత్నిస్తున్నారు."

"మరీమంచిది" అన్నాడు ఇవాన్ ఆలోచించుకుంటూ, "శీతకాలం దాకా ఆపగూడదూ నాప్రయాణం? అప్పుడు ప్రయాణంచెయ్యడం తేలిక; తొందరగాగూడా వెళ్ళిపోవొచ్చు."

"సరే, మీయిష్టం. మీరెప్పుడంటే అప్పుడే" అన్నాడు లొగునోవ్ సంతృప్తిగా. ఇవాన్ వెళ్ళనని అంటాడని అనుకోలేదుగాని యింత త్వరగా వొప్పుకోవడం మూలాన సగం భారం దించినట్లైంది. "ఇవ్వాళే ప్రతినిధి వర్గంతో చెప్పేద్దాం. ఆలస్యంగా బయల్దేరుతున్నారని వాళ్ళూ యేమీ అనుకోరు. ఇకా గుర్రాల, లేళ్ళ సంగతి....సరిపడా డబ్బు యిప్పించేస్తాను."

"వస్తానని చెప్పేశా" అన్నాడు ఇవాన్, డెనిస్ యింట్లోకి అడుగు పెడుతూ.

"నాకు తెలుసు. మాకు పొద్దునే తెలిసింది. అప్పుడే అనుకున్నా మీరు వొప్పుకుంటారని" అన్నాడు డెనిస్. దూరంగా మూలని కూర్చుని నటాషాతో ఆటలాడుతున్నాడు. వంట గదిలో హడావుడిగావుంది ఎలీనా. "నాకు తెలుసు" అన్నాడు మళ్ళీ డెనిస్, "అదిగో, ఎలీనాగూడా కొత్తపిండివంటచేస్తోంది మీ గౌరవార్థం."

"ఇప్పు డప్పుడే వెళ్ళిపోవడంలేదుగా నేను?"

"ఐనా ఫర్వాలేదు. మీరు వెళ్లేనాడు మళ్ళీ చేస్తాం; అందులో యేముంది?"

"ఎవరూ చేసేది, నువ్వూనూ నటాషానా?" అని అందుకుంది ఏలీనా, "ఇవ్వాళ పాడుచేసినపిండి చాల్లే. మీతో నా తలప్రాణం తోక కొస్తోంది."

"ఆతోక్కాంతే క్రిందికి పోనీక, చస్తాం" అంటూ లేచాడు డెనిస్. కూర్చుని కూతురుతో బొమ్మలాడ్డంమూలాన కాలు తిమ్మిరెక్కింది. ఆకాలు నిమురుకుంటూ లేచాడు. "మీ దేవదారు కషాయం బాగా పని జేస్తున్నట్లేనా?" అనడిగాడు ఇవాన్ దగ్గరకొచ్చి.

"బాగానే చేసింది" అన్నాడు ఇవాన్. అతని కళ్ళన్నీ ఓల్గామీదున్నై యిప్పుడు.

నెత్తికి కట్టుకున్న రుమాలుతీసి, జుత్తు వెనక్కిలాక్కుని ముడేసుకుంది ఓల్గా; యింకా పడుచుపిల్లలాగావుంది ఆముడేసుకుంటే వెళ్ళి ఎలీనాకి సాయంచేస్తోంది.

"మొత్తంమీదేదో వ్యతిరేకత పుట్టుకొచ్చింది" అను కున్నాడు ఇవాన్, ఆవిడవంక చూస్తూ. "ఆవిడ కట్టె మట్టు కుంది యిక్కడ; మనసిక్కడలేదు. ఎందుకని? 'నాపని! నాపని!' అంటుండెప్పుడూ. నిజమేనా? నిజమైతే యిదివరకెప్పుడూ అనేది కాదేం యిట్లా?" అనుకున్నాడు, బాధగా.

"దేవదారుకేం? బాగానే పనిజేస్తోంది" అన్నాడు పైకి, బిగ్గరగా "ఇంకో కొత్త సంగతుంది, విన్నావా? ఇవ్వాళ నా కొక వుత్తరం వచ్చింది. 'కామ్చాత్కా విశేషాలు' అని వొక పాతపుస్తకం వుందట; రెండు వందలేళ్లనాటిది. అదిప్పుడుబైట పడ్డది. లవణరక్త వ్యాధికి దేవదారు చాలా మంచి ఔషధమని వుంది అందులో. అప్పుడీ ప్రాంతానికొచ్చే నావికులు టీకి బదులు యీ దేవదారుఆకు కాచుకుని తాగేవారట గూడాను."

"ఐతే...." అని యింకేదో చెప్పబోయాడు డెనిస్.

"ఇంకా ఐతే యేముంది? దీన్ని గురించి రెండువందల సంవత్సరాలనాడే తెలుసుకున్నారన్నమాట. దేవదారు పని దేవదారు చేస్తోంది. ఇంకా మిగతా విటమిన్లుగూడా యీ ప్రజలకెలా అందజేయాలా అన్నదే సమస్య. వచ్చేయేటికి యిప్పుడున్న కాయగూరలతోట లింకా మూడు రెట్లన్నా ఔతాయి. కొత్తకాయగూరలు, కోళ్ల పెంపకం, పశుశాలలు, మత్స్యసహకార సంస్థలు యింకా యెక్కువ కావాలి. అందు కవసరమైన డబ్బుగూడా బాగానే కేటాయించారు. కొత్త మెషీన్-ట్రాక్టర్ స్టేషన్లుగూడా తెరుస్తున్నారు బీళ్లని సాగు చెయ్యడానికి."

"బాగుంది, చాలా బాగుంది!" అంటూ తలూపాడు డెనిస్. "నిజం చెప్పాలంటే, లొగునోవ్ వ్యవసాయం అంటే

యింత శ్రద్ధ చూపగలుగుతాడని కలలోగూడా అనుకోలేదు నేను. మొన్నటిదాకా గనుల్లో పని జేసేవాడు; వస్తుతహా పరిశ్రమలంటే యిష్టమున్న మనిషి. గనుల్నొదలాలంటే యిష్టపడలేదట గూడాను. కాని పార్టీ కవసరంగాబట్టి, వ్యవసాయం అన్నాగూడా వెనుదియ్యలేదు. ప్రజల కూరికే పంచదారా, టిన్నువస్తువులూ పెట్టి యెంతకాలంపోషిస్తాం; అందులో ఆపాడు వ్యాధొకటుండె. అప్పటి కప్పుడు కాసిన కాయగూరలూ, పాలూ వుండాలి సమృద్ధిగా."

"ఔనౌను!" అంటూ గొణిగాడు ఇవాన్. ఓల్గా పని జెయ్యడం చూస్తూనే వున్నాడు. నటాషా అక్కడే నేలమీద కూర్చుని పెద్దవాళ్ళని చూస్తూవుంది. బొమ్మొకటి చేత్తోపట్టుకుని, తల గమ్మత్తుగా ప్రక్కకొంచి చూస్తోంది, ఎవరైనా వచ్చి ఆడితే బాగుంటుందన్నట్టు. ఇంకెప్పుడైనా ఐతే, ఇవాన్. ఇవానొవిచ్ వెంటనే వెళ్లి యేదో వొకాట ఆడేవాడే ఆ అమ్మాయితో. ఇప్పుడతని మనసేమీ బావుండలేదు. ఏదిచేసినా నటనేనని యిట్టే తెలిసిపోతుంది అందరికీనీ.

"ఉకమ్యాన్‌లో అందరూ ఇవాన్ మందుపయోగించడమే కాదు; దానికి పేరుగూడా పెట్టేశారు ఇవాన్ మందని" అన్నాడు డెనిస్, తన పేరే ఇవానైనట్టు. ఇవాన్ మనసు మనసులో వున్నట్టులేదని గ్రహించాడు డెనిస్. రెండు వందలేళ్ళక్రితం యెవరేం చేశారో మనకెందుకు? అప్పుడు వాళ్లా మందు వెయ్యడంవల్ల యేం జరిగిందో తెలియదుగదా. ఇప్పుడనేకమంది బాగుపడుతున్నారు; మనంకళ్ళారా జూస్తున్నాం."

"ఔనౌను. నిజమే" అన్నాడు ఇవాన్, భార్యవంక చూస్తూ...

"బంగాళాదుంపలు బాగా ముక్కలుగా తరిగేస్తేసరి.... అదేపనిగా నాచేశెయ్యాలి ముక్కలు.... అంతా సవ్యంగా చెయ్యాలి....కొత్తవాళ్లని తీసుకొస్తారట....పాతవాళ్ళని పంపే స్తారట....ఎంతసహ్యాం...." అంటున్నాడు డెనిస్. అవతల వంటసామాను శబ్దాలు, ఇటీ డెనిస్ మాటలు. ఇవాన్ యీ ప్రపంచంలోనే వున్నట్టులేడు. డెనిస్ అంటున్నమాటలుగూడా అక్కడక్కడా, సందర్భశుద్ధి లేకుండా వినిపిస్తున్నై అప్పు డప్పుడూ.

"డెనిస్ యేమిటీమాట్లాడుతున్నాడు?" అనుకున్నాడు ఇవాన్. అనుకుని, తీరాచూస్తే, వంటింటి గుమ్మం తెరవెనక కనిపించింది డెనిస్‌వీపు. అక్కడ పాత్రల్తో కుస్తీపట్లు పడ్తు న్నాడు. ఒకటే ధమధమ.

"ఇకూరుకోండి బాబూ, ఆసామానంతా పగిలిపోతుంది మీరూరుకోకపోతే!" అంటోంది ఎలీనా.

మళ్లీ, బుర్రలో చెదురుగావున్న వూహాలన్నిటినీ కూడ దీసుకున్నాడు ఇవాన్. "ఒక్క క్షణంసేపుగూడా వూరికే వుండదావిడ...కొత్తవాళ్ళని తీసుకురావడం, పాతవాళ్లని పంపెయ్యడం. ఓహో, కార్మికుల సంగతై వుంటుంది....ఒక సారి దేవదారు కషాయాన్ని గురించి మాట్లాడ్తూంటే 'ఓహో అప్పుడే ప్రయోగం ప్రారంభించేశారన్నమాట' అంది ఓల్గా. అంతకు పూర్వం యెన్నిరోజుల్నుంచో మాట్లాడుతున్నాం; ఆవిడముందే మాట్లాడుకున్నాం.... బహుశా మామాటలు సరిగ్గా వినేదికాదేమో: నేనిప్పుడు డెనిస్‌మాటలు యెంతబాగా విన్నానుగనక! తాన్నూ అంతేనేమో. ఆవిడ మనసు మరెక్కడో వుండివుంటుంది. ఇప్పుడూఅంతే. ఇప్పుడిక్కడలేదు ఆవిడ మనసు.

పోనీ, తన రచనల్ని గురించి ఆలోచించుకుంటోందాంటే అదీ ఐనట్టు కనబడదు. ఇంకేమైవుంటుంది మరి?" ఈ సంగతులన్నీ ఆలోచించుకుంటూంటే, ఇవాన్‌కి చాలా కష్టంవేసింది. ఇంత లోకే వంటింట్లోంచి డెనిస్ వచ్చాడు. ఇవాన్ వంకచూచి నిర్ఘాంతపోయాడు; చేతిలోవున్న గరిటెజారి క్రిందపడింది.

"ఏఁ? వొంట్లో బావుండలేదా? అనడిగాడు దగ్గరకొచ్చి.

"ఆఁ ఏమీలేదు" అన్నాడు ఇవాన్, మనసు పదిల పరచుకుని; "డొక్కలోనో, వెన్నులోనోగాని కలుక్కు మన్న ట్టనిపించింది అంతే. ఇప్పుడేమీలేదు." అన్నాడు. డెనిస్ పద్ధతి చూస్తే యిప్పటికిప్పుడే పరీక్షచేసేసేట్టున్నాడు.

బలవంతంగా తనగదివేపుకు లాక్కెళ్లాడు డెనిస్ ఇవాన్ని. "రండి, రండి, మిమ్మల్నిప్పుడు పరీక్షచెయ్యాలి. ఏమీలేదేమిటి, యేమీలేదు. అద్దంలో చూసుకోండి ముఖం మీకే తెలుస్తుంది. ఎవరో శాస్త్రంచెప్పినట్టు చెప్పుల్లేని మాదిగ, పళ్లులేని పళ్ల డాక్టరు. నాకింతో అంతో తెలుసులెండి మందుల్ని గురించి భగవంతుడి పుణ్యమా అంటూ" ఇవాన్ తొడుక్కున్నకోటు తీసేశాడు; చొక్కా తీసేశాడు.

"ఉఁ, అలా బాగా వూపిరి పీల్చండి" అన్నాడు డెనిస్ వీపుమీద స్టెతస్కోపు పెడుతూ, "ఇంకొకసారి పీల్చండి గట్టిగా. ఉఁ వదలండి. ఇదేం వూపిరితిత్తులు బాబూ? కొలిమితిత్తులు!" మళ్ళీ ఇవాన్‌ని తనవేపుకు తిప్పుకున్నాడు. "ఏదీ, మీగుండెలా పనిజేస్తోందో చూద్దాం....ఇదా బాబూ గుండె? ఎవరంటారిది గుండని. ఆవిరిసుత్తిలాగావుంది తప్ప, గుండెకుమల్లేలేదు. ఉక్కులాగావుంది శరీరం, అందంగా నిగనిగ లాడుతూ!"

"అందంగానా?" అన్నాడు ఇవాన్, "ఇదేవినడం నేను నాజీవితంలో"

"నిజంగానండీ. ఊరికె అనడంగాదు. మీశరీరం చూస్తోంటే ఆసలలా కలుక్కుమని యెలా అందో అర్థంకావ డంలేదునాకు. బాగా అలసిపోయారేమో బహుశ. ఒకగ్లాసుడు ఓడ్కా పుచ్చుకోండి....మందులాగా....దానంతటకదే సర్దు కుంటుంది."

# 58

డెనిస్ అందించిన ఓడ్కా గ్లాసు పుచ్చుకుని భోజనాల బల్లవైపు చూశాడు ఇవాన్. బల్లమీద ఆవిర్లు తేలుతూవున్నై భోజన పదార్థాలన్నీ.

"ఉత్తమ స్త్రీ కన్నీటిలాగా పరిశుభ్రంగానూ, పవిత్రం గానూ వుంది" అన్నాడు డెనిస్ తనగ్లాసువంక చూసుకుంటూ.

"స్త్రీ కన్నీరులాగా అని యెందుకనాలి?" అంటూ అభ్యంతరం చెప్పాడు ఇవాన్, "ఓడ్కా పురుషులు తాగేది; పురుషుల్దే అను."

"సరే మీయిష్టం యింకా అవీయివీ కలిపినా, యింత బాగానూ వుంటుంది యీ ఓడ్కా. క్రిందటివారం ఒకావిడ ఓడ్కా షాపులోకెళ్లింది; అంతే. నుంచున్నది నుంచున్నట్టే పడిపోయింది కింద."

తల అడ్డంగా వూపింది ఎలీనా.

"వాసన చూసేప్పటికే తలకెక్కి పోయిందన్న మాట కైపు."

"పడిపోవడానికసలు కారణం వేరులే; మీఆడవాళ్ళ కొచ్చే వ్యవహారం దానికితోడు ఆవిడ కాళ్ళుగూడా మంచివి కాదు. ప్రిమోర్‌స్కలో చికిత్సగూడా చేశారట. ఓడ్కా-షాపులోపడి పోయింతర్వాత అసలిక నడవలేకపోయింది."

"మీరుచెప్పేదా మార్తైమియనోవ్‌గారి కూతుర్ని గురించా? నేనావిణ్ణి పరీక్షగూడా చేశాను" అన్నది ఎలీనా. "డాక్టర్ ఇవాన్! ఆవిణ్ణి గురించి మీతో చెప్పానుగూడా. రెండుకాళ్ళకీ పక్షవాతం వచ్చినట్టుంది. పొత్తికడుపు నరాలు గూడా అంతేలాగుంది. అందులోనూ యిదే మొదటి కడుపు. ప్రసవించడం కష్టమే అనుకుంటా."

"ఎన్నో మాసం?"

"ఎనిమిదనంటోంది. కాని ఆ లెక్క సరిగాదనుకుంటా. ప్రసవించే సమయం వచ్చేసిందనే అనుకుంటున్నా నేను."

"న్యూరాలజిస్ట్ పరీక్షించారా ఆవిణ్ణి?"

"ఇవ్వాళే" అన్నాడు డెనిస్, భార్యకి బదులు.

"లక్షణాల్ని బట్టి చూస్తే, రేపు నేనే స్వయంగా చూడడం మంచిదనుకుంటా" అన్నాడు ఇవాన్.

"మీకు గుర్తుందా? క్రిందటేడాక కేసొచ్చిందే ఖోలోడ్‌నికాన్ నుంచి. ఆ భూగర్భశాస్త్రజ్ఞుడి భార్య. గుర్తుందా?" అంది ఎలీనా.

"లేకేం? కుడివైపు వూపిరితిత్తుల్లో బోడిపి కట్టింది" అన్నాడు ఇవాన్, "ఆపరేషన్ చేసి తీసేశాం. ఎంత బోడిపెంత బోడిపి! నా గుప్పెటంతలావుంది."

"జానెను. మే నాలుగో తేదీన ఆపరేషన్ బల్లమీద పండుకోబెట్టాం; జూన్ పదహారు కల్లా ప్రసవించింది" అంది ఎలీనా ఉత్సాహంగా, "బిడ్డగూడా చాలా ఆరోగ్యంగా పుట్టాడు. ఆవిడ గూడా! పాపం, చెప్పినట్లల్లా వింది." ఇంతలో ఎవరో తలుపు తట్టారు. ఎలీనా సంభాషణ ఆగిపోయింది. ఇగోర్ వచ్చాడు లోపలికి.

అందరూ ఆశ్చర్యంగా చూశారు. సామాన్యంగా ఇగోరెప్పుడూ రాడు వాళ్ళింటికి.

"శనివారం సాయంత్రం, పావా వొకపార్టీ చేస్తోంది" అన్నాడతను, ఓల్గా వంక చూస్తూ. "మీతో చెప్పమని చెప్పింది వస్తారా మీరు ? అందరూ ఎవరి చందా వారు వేసుకోవలసిందే, ఎప్పటిలాగా."

ఓల్గా వంక అతనలా చూస్తూంటే, ఆ మూతి కుదింపులోనూ, ఆ నల్లకళ్ల మెరుపులోనూ యేదో తేలిక భావం వున్నట్టనిపించింది ఆవిడంటే.

భార్య వంక చూశాడు ఇవాన్. "ఇతను కాదు గదా?" అనుకున్నాడు. ఇంతవరకూ వున్న వొంటరితనం వున్నట్టులేదు యిప్పుడావిడముహంలో; ఇగోర్ అనే ప్రతిమాటా అతిశ్రద్ధగా వింటూన్నట్టుంది. "ఇంకేం, అతనే" అనుకున్నాడు ఇవాన్. దీర్ఘనిశ్వాసం వదిలాడు. పిడుగు పడ్డట్లయ్యిందతని మీద.

"మీరుగూడా వస్తారా?" అనడిగాడు ఇగోర్, ఇవాన్ని.

"రాను" అన్నాడు ఇవాన్ నెమ్మదిగా. కటువుగానే సమాధానం చెబుదామనుకున్నాడు గాని యెందుకనో ఆగిపోయాడు.

"అరే వస్తే బావుండేదే. బాగా హుషారుగా వుంటుంది పార్టీ"

"వీలుండదు. పనుంది నాకు. రావాలనుకుంటే ఓల్గా వస్తుంది; ఆవిడిష్టం."

పనివున్నదనీ ఓల్గాగూడా చెప్పవలసిందేనేమో కాని, ఆవిడ కా ఆలోచనలేదు. తాంవ్రోవిప్పుడు కోలుకున్నాడు కాబట్టి ఆ పార్టీకి తప్పకుండా హాజరౌతాడన్న ఆలోచన తప్ప యింకొకటి తోచనేలేదావిడకి.

"తప్పకుండా వస్తానని చెప్పండి పావాతో" అన్నది ఓల్గా, ఇగోర్ తో.

# 59

"ఆ చౌకబారు ఆడదాని ఆహ్వానాన్ని ఓల్గా అంగీకరించినందుకు చెప్పకోవాలి" అనుకున్నాడు ఇవాన్, హాస్పిటల్లో మంచంమీద పడుకున్న ఒక రోగినిచూస్తూ. ఆ రోగి వంక చూస్తున్నాడన్నమాటే గాని, మనసక్కడలేదు.

మంచంమీద పడుకునున్న దొక యువతి. ముహంలో భయం కన్పిస్తోంది. జుత్తులో కొంత భుజంమీద పడుంది. చక్కని నీలికనులు, మృదువైన శరీరం. ఆకర్షణీయమైన అందం.

తన ఆలోచన లవతలికి నెట్టి, "పేరు ?" అనడిగాడు ఇవాన్, మృదువుగా.

"మరియా....మరియా పెత్రోవ్నా."

"సరే, మరియా పెత్రోవ్నా నీబాధేమిటో చెప్పమ్మా."

"నా కాళ్లు........"

"పనిచెయ్యడంలేదు. అంతేనా ?" అని హాస్యమాడాడు. ఇవాన్. తర్వాత రోగిని పరీక్షించడం ప్రారంభించాడు. "ఏదీ, ఆకాలి బొటనవ్రేలు కదుపు. మళ్ళీ ఒకసారి. కుడికాలు లేపు పైకి; మోకాలొంచు. వంచలేవూ ? ఎడంకాలొంచగలవా పోనీ? అదీ వంచలేవు? ఆగు. నేనొంచి పెడ్తాను. ఆఁ ఇప్పుడు నీ అంతట నువ్వు సాచిచూడు. సాచనుగూడా లేవన్నమాట. ఆహాఁ. ఐతే నీ కాళ్లూ, పొత్తికడుపుగూడా బాగుండలేదన్నమాట. సరే ఎప్పట్నుంచీ నమ్మా యిది ?"

న్యూరాలజిస్ట్ వాలెంతీనొవిచ్ గూడా అక్కడే నిలబడి చూస్తున్నాడు, తాను పరీక్షచేసి, చెప్పింది నిజమౌనో కాదో తెలుసుకుందామని.

ఇవాన్ బాగా పరీక్ష చేశాడు రోగిని. ప్రశ్నలేశాడు. చివరికి, "ఈవిడ వెన్నెముకలో వున్నదేమో లోపం", అన్నాడు.

"నేనూ అదే అనుకున్నాను" అన్నాడు న్యూరాలజిస్ట్. "ప్రాథమిక లక్షణాలూ అదీ చూస్తే వెన్నుపూసలో యేదో బుడుపు కట్టినట్టుంది."

నిజమేనన్నట్టు తలూపాడు ఇవాన్. న్యూరాలజిస్ట్ వుద్దేశం యిదీ అని అంతకు పూర్వమే విన్నాడు. రోగుల్ని చాలా శ్రద్ధగానూ, సానుభూతితోనూ పరీక్షిస్తాడు వాలెంతీనొవిచ్. అంచేత అతి సూక్ష్మలక్షణాల్నిగూడా చాలా జాగ్రత్తగా కనిపెట్టగలడు. ఇదివర కనేకసార్లు రోగనిర్ణయాన్ని గురించి యిద్దరికీ భేదాభిప్రాయాలొచ్చినై. ఐనా, వాళ్లిద్దరి స్నేహమూ

ఆ చర్చలవల్ల పెంపొందిందేగాని తగ్గలేదు. ఈ పర్యాయం యిద్దరి నిర్ణయాలూ ఏకీభవించినై.

విషయాలన్నీ మరియామ్ముందే మాట్లాడారు డాక్టర్లిద్దరూ. ఇలాంటి కేసుల్లో ముందు రోగుల్దగ్గర్నుంచి వ్రాతపూర్వకంగా అనుమతి తీసుకుంటారు, ఆపరేషన్ చేయించుకునేందుకు యిష్టపడుతున్నామనీ, యీరోగ లక్షణాల్ని గురించి తెలియజెప్పారనీనీ. కాని ఈవిడ గర్భవతి. అంచేత, చికిత్స యింతకుముందే జరగవలసిందని చెప్పేటప్పుడు మాత్రం లాటిన్ భాషలో మాట్లాడాడు ఇవాన్.

"కాళ్లు కాస్త బాధపెట్టడం ప్రారంభించగానే, చేయవలసింది చికిత్స" అన్నాడు.

"చికిత్స చేశారు కాని, జబ్బుని సరిగ్గా అంచనా వెయ్యలేక పోయారు" అన్నాడు వాలెంతీనొవిచ్.

"అదేవిటి ? అద్దంలాగా కనిపిస్తూంటే. ముందు అరికాళ్లు మంటెత్తినై. తర్వాత ఎడమకాలు బొటనవ్రేలికొచ్చింది పక్షవాతం. అది క్రమంగా ఎడంకాలుకీ, పొత్తి కడుపుకీ పాకింది. తర్వాత కుడికాలికి. సరే. ముందు ఎక్స్‌రే తీయించండి. ఎక్స్‌రే తీయించి, వెన్ను ద్రవం పరీక్షిద్దాం. ఇకప్పుడే అనుమానమూ వుండదు."

అక్కడినుంచి ఆఫీసు కెళ్లాడు ఇవాన్. ఇదివరకెప్పుడూ వెళ్లగానే కూర్చుని, టేబుల్ మీద నర్స్ పెట్టిన టీ తాగేవాడు. ఇవ్వాళా టీ తాగబుద్ధెయ్యలేదు. ఆ టీ ముట్టుకోకుండా గదిలో యీ మూలనుంచా మూలకి తిరగడం ప్రారంభించాడు.

"మళ్లీ పావాగారింటి కెళ్ళింది ఓల్గా. తిరిగొచ్చింతర్వాత అసలిదివరకటి మనిషికి మళ్లేనేలేదు." అనుకున్నాడు.

అతని కన్నుల్లో యేదో నిశ్చయం ప్రతిబింబించింది. "సరే, కాని.. ఇక నేను చెయ్యగలిగిందేమీ లేదు."

"ఆరో వెన్నుపూసదగ్గర యెముక సరిగ్గా లేనట్టు కన బడుతోంది ఎక్స్‌రేలో" అన్నాడు సెర్గుతోవ్. గూసేవ్ పక్కనే కుర్చీలో కూర్చునున్నాడు. మనిషి చిరాకుగా వున్నాడు. "ఇదుగో చూడండి" అని స్విచ్ వేసి ఎక్స్‌రే పటాలు రెండు చూపించాడు సెర్గుతోవ్.

"నిజమే" అన్నాడు ఇవాన్, పటాలు పరీక్షగా చూచి.. ఆరో వెన్నుపూసదగ్గరుంది ఆ బొడిపి. అది వెన్నెముకని నొక్కుతోంది. రోగిని ఆపరేషన్‌కి సిద్ధం చెయ్యాలిక."

"రోగి ప్రసవించేదాకా యీ ఆపరేషన్ ఆపడం మంచి దని నా సలహా" అన్నాడు గూసేవ్. "ముందాభారం వది లించుకోనివ్వండావిణ్ణి."

"అసలావిడ ప్రసవించడమే కష్టం. కాబట్టి ఆపరేషన్ చేయడమే మంచిది. సీజరియన్ ఆపరేషన్ చెయ్యాలి" అన్నాడు ఇవాన్.

"ఎందుకు ? ఆపరేషన్ బల్లమీదుండగా ప్రసవం నొప్పు లొస్తే యేంజేస్తారు ? ఆపరేషన్ బల్లమీద యింకొక చావు తెచ్చిపెట్టుకోవడం యెందుకు ? ఇదివరకు జరిగింది చాలదా?"

"బాగా అనుభవంవున్న మంత్రసానినిగూడా వుంచు కుందాం దగ్గర, ఆపరేషన్ చేసేటప్పుడు."

గూసేవ్‌కి కోపం వచ్చింది. ముక్కెర్రబడింది. "మీరు చాలా గొప్పవారనీ, పెద్ద న్యూరోసర్జెననీ తెలుసునాకు.

జెనరల్ సర్జెన్‌గా నాకు చాలా అనుభవంవుంది. మిమ్మ ల్నిప్పుడే హెచ్చరిస్తున్నా. చెయ్యాదలచుకున్న ఆపరేషన్ సామాన్యమైంది కాదు. వెన్నెముకకి సంబంధించింది. కుట్లు వెయ్యగానే ప్రసవించితే ప్రమాదం వస్తుంది."

"అసలు ప్రమాదం అదికాదు" అన్నాడు ఇవాన్, "అదీగాక, జెనరల్ సర్జెన్‌గా నేనూ చాలాకాలం పని జేశా నన్న సంగతి మరిచిపోయినట్టున్నారు మీరు. ముందు ఆపరే షన్ ఐంతర్వాత, సహజ ప్రసవం జరగడం తేలిక. లేకుంటే రెండాపరేషన్లు చెయ్యాల్సి రావచ్చు. ఒకటి ప్రసవించడానికి, వెంటనే మరొకటి వెన్నెముకమీదా. మీరు చెప్పిన జాగ్రత్త లన్నీ మనసులో వుంచుకోవాల్సిందే; కాని ఆపరేషన్ మట్టుకు ఆపేందుకు వీల్లేదు, వెంటనే చేసెయ్యాలనే నావుద్దేశం."

"ఎందుకూ మరీ అన్ని హెచ్చరికలు చేస్తాడు? హెచ్చ రికలు చెయ్యడమంటేనే ఆనందంలాగుందతనికి!" అనుకున్నాడు ఇవాన్ హాస్పిటల్‌నుంచి బయటికెళ్తూ. "ఐనా మెచ్చుకోదగ్గ మెదడు! ఏసొరుగులో దానిసొరుగులో వుంచుతాడు. అతని పుణ్యమాఅని హాస్పిటల్లోగూడా ఎక్కడి వస్తువక్కడ జాగ్రత్త గా, శుభ్రంగా వుంటుంది. అంతవరకు బాగానేవుంది; కాని జబ్బుల్నిగూడా సొరుగుల్లో పెట్టాలంటే సాధ్యమా?" ఇంతలో ఓల్గాతో క్రిందటిసారి మాట్లాడిన సంగతి గుర్తుకొచ్చింది ఇవాన్‌కి. "ఆం అదీ రచయిత. గూసేవ్‌కూడా రచయితైతే బాగుండేది. పాత్రలన్నీ సామాన్యంగా నోట్లో నాలుకలేనివాళ్లు, మెత్తగా, హానిలేని భావాలు. అసంతృప్తి, వైవిధ్యమూలేని కథలు. చదివితే విసుగు పుట్టించే పుస్తకాలు. ఎవ్వరూ కన్నెత్తికూడా చూడని పుస్తకాలు."

ఈ ఆలోచనల్తో అటు యింటికెళ్లడానికి బదులు యిటు లైబ్రరీవైపు దారి పట్టాడు. తీరికదొరికి నప్పుడల్లా పుస్తకాలు చదవడం బాగా అలవాటు ఇవాన్‌కి. అందులోనూ కొత్త నవలలు. ఈమధ్యే వెలువడిన నవల చదివానని చెప్పుకుని గర్వ పడడం అంటే అదొక సరదా.

ఇవ్వాళ పోస్టులోవచ్చే సాహిత్యపత్రిక చూద్దామను కున్నాడు. ఆపత్రికచూస్తే సాహిత్యరంగంలో వచ్చేనూతన దశ యేదో తెలుసుకోవచ్చు. ఇంటికెళ్లి ఆవిషయాన్ని గురించి ఓల్గా తో మాట్లాడొచ్చు.

లైబ్రరీలోకి అడుగుపెట్టగానే పావాగొంతువినిపించింది. లైబ్రరీ హాలులో ఎడంచేతివైపునుంచి మాట్లాడుతోంది. హాలుకి మధ్యగా వొక తెరగట్టారు. ఆతెరకవతల వుంది. "ఏం ఫర్వాలేదు. అంతా నేను సరిచేసేస్తాగా! ఇంతవరకెప్పుడూ నేనే వుద్యోగమూ చెయ్యలేదనుకోండి. ఐనా యేంఫర్వాలేదు. క్లబ్బులు నడపడమంటే బాగా సరదా కూడాను నాకు. నా క్లబ్బుపేరు చెబితేచాలు జనం పరుగెత్తుకురారూ!" అంటోంది.

"రారూ మరి!" అనుకున్నాడు ఇవాన్, విసుగ్గా. "నువ్వు అచ్చంగా గూసేవ్ లాంటి దానివే. మెత్తటి పరుపులూ, రంగురంగులతెరలూ. ఇకంతే నీక్లబ్బంటే. అందులోనూ నిన్ను గురించి నీకున్న సదభిప్రాయం! కావాలంటే వుద్యోగం దొరకదని కాదుగాని నీకు. ఉద్యోగం తేలిగ్గా దొరికితే సరిపో యిందా? ఆ వుద్యోగం బాధ్యతలు నిర్వహించ గలగొద్దూ అంతతేలిగ్గానూ!"

లైబ్రిరీలో కూర్చుని, చదువుకుంటూ, నోట్స్ వ్రాసుకుంటోంది ఓల్గా. సిల్కుకోటు తొడుక్కునుంది. స్కూల్లో చదువుకునే పిల్లలా పెన్సిల్ గట్టిగా పట్టుకుని వ్రాస్తూంది అణిచణిచి. ఆవిడదస్తూరీని చూచి హాస్యమాడుతుండేవాడు ఇవాన్. ఫోర్త్‌ఫా(ర)మ్ చదువుకునే పిల్లలదస్తూరీలా వుండేవి ఆవిడవుత్తరాలు. ఐనా, వుత్తరాలకోసమే దారులు కాచుకు కూర్చునేవాడు ఇవాన్ ఆరెండేళ్లు. ఆ వుత్తరాలు చదువుకునీ ఎంతో ఆనందించేవాడు.

ప్రాంతీయ పత్రికలో యీమధ్య ఆవిడవ్రాసినవ్యాసాలు చదివాడు ఇవాన్. తన సామర్థ్యాన్నావిడ చాలా యెక్కువగానే అంచనా వేసుకుంటోందనీ, తనభర్త తన తెలివితేటల్నింకా గుర్తించనందుకు బాధపడుతోందనీ అనుకున్నాడు. లేకుంటే యింత తరచుగా కీచులాడుకోవలసిన అవసరం యేముంది?

తన భార్యిప్పుడలా కూర్చుని, ముందొక పెద్దపుస్తకాల దొంతర పెట్టుకుని శ్రమపడుతూండడం చూస్తే, సానుభూతి కలిగిందతనికి. ఆవిడ కభిరుచి అంటూ కలగాలేగాని, తర్వాత ఒక్కక్షణంగూడా వృధాపోనివ్వదు; కావాలనుకున్నది సాధించేవరకూ వూరుకోదు.

దగ్గరకెళ్ళి, భుజంమీద చెయ్యివేశాడు. ఉలిక్కిపడి తల లేపి చూచింది; కాని ఆకన్నుల్లో ఆప్యాయతేమీ లేదు. చూచి యేమనుకుంటాడోనన్న బిడియంతో, లేచి కాగితాలూ సర్దుకోలేదు. ఆయనేమనుకుంటే మాత్రం లెక్కేమి టన్నట్టుంటోందిప్పుడు. అందువల్ల ఇవాన్‌కి బాధ; భార్యలోవున్న మంచిని

తెలుసుకోడానికి ప్రయత్నించడం గూడా మానేశాడు ఆ బాధతో.

"గీకి పారేస్తున్నావేమిటి ?" అనడిగాడు హాస్యంగా.

"నోట్స్ తీసుకుంటున్నా" అన్నది ముక్తసరిగా. కొద్దిగా విసుక్కున్నట్టుగా గూడావుంది ముహం.

"మంచిదే, కానీ" అన్నాడు నిట్టూరుస్తూ. వెనక్కి తిరిగి లైబ్రేరియన్ బల్లదగ్గర కెళ్లాడు. అక్కడొక ముసలావిడ కూర్చుని కొత్త నవలేదో చదువుకుంటోంది.

"ఈ స్వల్ప స్వల్ప విషయాలే మనిషి బ్రదుకునంతా పాడుచేస్తై" అనుకున్నాడు పుస్తకాలు తిరిగేస్తూ. చదువుకునేందుకు తీసికెళ్లిన వాళ్లా పుస్తకాలు తీసుకొచ్చి, బల్లమీద పెట్టారు; ఇంకా ఆ పుస్తకాలు బీరువాల్లో కెక్కలేదు. "నేనేం చేశానని ? నేనావిడకేం అడ్డం వచ్చానని ?"

కొత్తగావచ్చిన పత్రికలేమీ లేవక్కడ; అప్పుడే పట్టు కెళ్ళిపోయారు.

ఇంతలోకే, ముసలావిడవచ్చి అమెరికన్ రచయిత పుస్తకమేదో లావాటిది పట్టుకొచ్చి యిచ్చింది, "అబ్బో, చాలా పెద్దపుస్తకం. నాకు జీర్ణం కావడం కష్టం" అన్నాడు.

తెలియని రచయితల పుస్తకాలుగూడా చదవడానికి తీరికలేదు; తీరా తీసుకుని చదివితే కాలం వృధాగా వృధా ఔతుంది. అందుకని నలుగురూ చదివి మెచ్చుకున్న పుస్తకాలు మట్టుకే చదవడం అలవాటు చేసుకున్నాడు.

చివరికొక పుస్తకం యేరుకుని వెనక్కి తిరిగెళ్తూ, ఓల్గా కూర్చునున్న చోట మళ్ళీ ఆగాడు. ఏదో వొక పుస్తకం

్గోంచి యెత్తి వ్రాసుకుంటోంది. వ్రాతొక సెకను సేపాపి, పక్కనే ఖాళీగావున్న కుర్చీవంక చూస్తూ తలూపింది కూర్చోమంటున్నట్టు. ఇష్టం లేకపోయినా, మెల్లగా కూర్చోబడ్డాడు; ఇవ్వాళావిడతో మాట్లాడాలనుంది మనసులో బాగా. భార్య మొహంవంక చూస్తూ కూర్చున్నాడు. అట్లా ఆలోచనలో పడి వ్రాసుకుంటూంటే అదొక వింత అందం తొణికిసలాడుతోంది ఆ మొహాన. ఈ మధ్య తనకావిడ బాగా దూరమైపోతోందన్న బాధ మరీ యెక్కువైంది ఆ అందమైన మొహం చూస్తూంటే. ఇప్పటికి మట్టుకిప్పుడు; పగలల్లా పనిజేసి అలసిపోయి ఆకలితో బయల్దేరాడు యింటికి. ఆవిడ! ఏమీ పట్టనట్టు కూర్చుని తనపని తను చేసుకుంటోంది; ఒక్క మాటంటే ఒక్కమాటగూడా అనలేదు సానుభూతి పూర్వకంగా.

"ఇంకా భోజనం కాలేదా?" అంది, అతని ఆలోచనల్ని పసిగట్టినట్టు.

"లేదు" అన్నాడు. సిగ్గుపడిపోయినంత పనైంది.

"ఐతే, నాకోసం కూర్చోడం యెందుకు? వెళ్ళండి. భోజనం సిద్ధంగానే వుంది యింట్లో. అప్పుడే చల్లబడుండదు కూడా. వేడి కాఫీ థెర్మాస్‌లో పోశొచ్చాను. లైబ్రరీ మూసెయ్యకముం దిదంతా పూర్తిచేసుకోవాలి నేను" అని అన్నది, భర్తమొహంలో అసంతృప్తిని గమనించి.

"ఇలా యెంత కాలం వుంటాం" అనడిగాడు ఇవాన్, "ఇదే. యిలా దూరం దూరంగా వుండడం,.... యిలా పట్టనట్టుండడం.... యెంతకాలమని.... యీ వుదాసీనత?"

"యెంతకాలమేముంది? మీరు నా సంగతి పట్టించుకునేదాకా యింతే." అంది ఓల్గా, తలబిరుసుగా.

"నీసంగతా ? అసలు ప్రశ్నసంగతేమిటో అర్థమైతేగా నాకు ?" అన్నాడు ఇవాన్ కోపంగానే, లేచి.

"మీరలా అంటారని నాకుముందుగానే తెలుసు" అంది ఓల్గా.

# 61

ఇవాన్ అడుగుల చప్పుడు వినిపించడం ఆగిపోయిం తర్వాతగూడా, చాలాసేపటిదాకా అలాగే కదలకుండా కూర్చునుంది ఓల్గా. మనసంతా చీకాకుగావుంది. లైబ్రరీ మూసేశేలోగా తన పని పూర్తిచేసుకోవాలన్న సంగతిగూడా మరచిపోయింది. ఇకింటికెళ్ళి పోదామని లేచి, పుస్తకాలన్నీ సర్దుకుంది. కాస్సేపాలోచించి, మళ్ళీ కూర్చుంది. ఎంత ప్రయత్నించినా చదివిందర్థం కాలేదు; మనసక్కడ వుంటేగా మరి.

ఇకలాంటప్పుడు చదవాలనుకోవడం వృథా. సిట్టూర్చింది ఓల్గా. పుస్తకాలిచ్చేసి, నెమ్మదిగా బయల్దేరింది లైబ్రరీ బయటికి.

"మరీ అంత విసుగ్గావుంటే, పని మానెయ్యడమే మంచిదిలే" అన్నట్టుందావిడ చూపు. కాని, బజారు గుమ్మందగ్గరకొచ్చేప్పటికి, తావ్‌రోవ్ యెదురయ్యాడు, యెవరో తరుము కొస్తున్నట్టు. ఆచుకోలేక పరుగెత్తిందతన్ని కలుసుకుందామని. ఇదంతా చూస్తూనేవుంది పావా కిటికీలోంచి. ఇద్దరూ ఒకరి చేతుల్లో కొకరు వొరిగిపోవడమే తరువాయి అనుకుంది పావా.

. ఆ ముగ్గురూ తప్ప యింకెవ్వరూ లేరు అక్కడ. ఒక

పెద్ద లాంపు మట్టుకు వేళ్లాడుతోంది పైన గుండ్రంగా చంద మామకి మల్లే. లైబ్రరీ భవనం అంతా నిశ్శబ్దంగా వుంది.

ఇద్దరూ ఒకరికొకరు యెదురుగా, యేమీ తోచనట్టు నిలబడిపోవడం చూస్తే పావాకి ఆశాభంగం కలిగింది.

"బుద్ధిలేకపోతే సరి!" అనుకుంది పావా, విసుగ్గా. "ఎందుకలా ఒకళ్ళొకళ్ళు బాధించుకోవడం? ఈ పళాన పరుగెత్తికెళ్లి ఒకళ్ళమీద కొకళ్ని తొయ్యాలనిపిస్తోంది నాకు. తీరా యింత కష్టపడి తోస్తే, తలలుమట్టుకు ఢీ కొట్టుకుని వూరుకునే రకం." ఇక వాళ్ళిద్దరూ, కరస్పర్శగూడా చేసుకోకుండా, నడిచొచ్చి హాలుమధ్య బల్లమీద కూర్చునేప్పటికి పావా తన కళ్ళని తానే నమ్మలేక పోయింది; దిగ్భ్రాంతి పడిపోయింది.

"ఏదో పూపొదరింట్లోకి వేసవికాలంలో చేరుకున్నట్టున్నారు యిద్దరూనూ" అనుకుంది. అనుకుని ప్రక్కకు తప్పుకుంది.

"కబురుచేశారా నాకోసం?" అనడిగాడు తావ్‌రోవ్, ఓల్గాని.

"లేదే. మిమ్మల్ని చూడాలని తహతహలాడి పోయిన మాట నిజమే కాని...." అని నిజం చెప్పేసింది ఓల్గా.

ఇంతవరకూ ఆవిడ తలలో మెదలిన ఆలోచనలన్నీ, తాత్కాలికంగా, మటుమాయమై పోయినై. తావ్‌రోవ్‌ని చూడగానే సంభ్రమాశ్చర్యాలు కలిగినై కాని, యిప్పుడా భావమూ లేదు ఆవిడ ముహంలో; వుత్తి సంతోషం మినహా యింకేమీ కన్పించడం లేదు.

తావ్‌రోవ్ వంక తిరిగి మాట్లాడేప్పుడు ప్రతి చూపు లోనూ వ్యక్తమౌతూనే వుంది ఆ సంతోషం.

"ఐనా, మీరంత తొందరగా నడవడం యెందుకు? ఇంకొంత కాలమన్నా జాగ్రత్తగా వుండకపోతే యెలా?" అన్నది మెత్తగా కూకలేస్తున్నట్టు, అతని నుదుటిమీద చెమట చూస్తూ.

"ఆలస్యమైతే మిమ్మల్ని కలుసుకోలేనేమోనని భయ పడి పోయా. మీరొచ్చి చాలాసేపైందనీ, నాకోసం కూర్చు న్నారనీ ఫోన్‌చేశారు. పావా చేసిందా ఫోన్" అని చెప్పాడు తావ్‌రోవ్. తెల్లని జేబురుమాలు బయటికి తీసి, చిన్నపిల్ల వాడిలా మడతలుపెట్టి, నుదురూ, గడ్డమూ తుడుచుకున్నాడు చెమట లేకుండా. "అసలే సహాయమూ లేకుండానే వచ్చా ననుకోబాకండి యింత దూరమూ" అన్నాడు సిగ్గుసిగ్గుగా ఓల్గావంక చూస్తూ. "చంకకింద కర్రలు పెట్టుకునే గబగబా గెంతుకుంటూ వచ్చాను. అవక్కడ బయటగోడ కానాచాను. ఇప్పటికీ తొందరగా నడవాలనుకున్నప్పుడు వుపయోగిస్తూనే వుంటానవి."

"మీరు నడవాలని ప్రయత్నించడం నేనూ చూశాను" అన్నది ఓల్గా మృదువుగా. "నవ్వుకుంటూ నేలవంక చూస్తూ నడిచారు మీరు. మీవెనకాలే ఒక నర్స్‌గూడా వుంది."

"మరి మాట్లాడలేదేం నాతో?"

"ఇకప్పుడు మాట్లాడితే మరీ బిడియ పడతారేమోనని వూరుకున్నా."

"మీరు వెళ్తూండడమూ చాలా సార్లు చూశాన్నేను. పిలుద్దామనుకునేవాణ్ణి. ఒకసారికాదు; అతుసార్లు. ఎందుకో

భయం వేసేది. వూరుకునేవాణ్ణి. కాలిరిగిన కుక్కలా చూస్తూ కూర్చున్నా. మొరగాలని పిస్తుంది, పోట్లాడాలని పిస్తుంది. విరిగిన కాలుచూసుకుని వూరుకుంటుంది."

ఇద్దరూ నవ్వుకున్నారు.

"మరి మీపని బాగా సాగుతోందా?" అనడిగాడు తావ్రోవ్, సస్నేహంగా, యథాప్రకారం; "ఛాజ్మానిగురించి వ్రాస్తామన్నారు; వ్రాశారామరి ?"

"ఇంకా పూర్తి కాలేదు. కనీసం వొకిరవై సార్లన్నా ప్రారంభించా. కాగితాలు ఖరాబుకావడం తప్ప, వ్రాసింతర్వాత చూసుకుంటే యేంబావున్నట్టుండడంలేదు. వుంటే యేదో ఆకాశన్నందుకుంటున్నట్టుంటుంద; లేకుంటే పాతాళంలోకెళ్ళిపోయినట్లుంటుంది. మొత్తంమీద అవీయివీ వ్రాసి పంపుతున్నా పత్రికలకి; వాళ్లూ అచ్చేస్తున్నారు. వ్రాసిందంతా వెయ్యడంలేదుకాని, యెంతో కొంత వేస్తున్నారు. సగానికి తక్కువగాకుండా. అదీమంచిదే, కాదూ? ఏమంటారు? న్యాయానికింతవరకు నేను నేర్చుకున్నది మాత్రం యేముంది ?"

"మంచికాక పోవడ మేమిటి? బ్రహ్మాండంగా వుంది!" అన్నాడు తావ్రోవ్. "నాకొక గొప్ప జర్నలిస్టు తెలుసు. ఆయన మొదట్లో వందలకొద్దీ వ్యాసాలు వ్రాసి పంపాడు. అన్నీ తిరిగొచ్చేయి. అతిశయోక్తిగా చెబుతున్నా ననుకుంటున్నారేమో; లేదు; అక్షరాలా నిజం. దగ్గరదగ్గర మూడువందల వ్యాసాలు చిత్తుకాగితాల బుట్టకి స్వాహా అయ్యాయి. పత్రికలకి వార్తలు పంపడం అంటే తేలికైన పననుకోలేదు మీరు; మంచిపని చేశారు. పెద్దపెద్ద వ్యాసాలు వ్రాయడాని కీఅనుభవం బాగా వుపకరిస్తుంది. మీ పెద్దవ్యాసాలింకా యేమంత

బావుండడంలేదు; ఒకసారి ఊకదంపుడు మాటలమయంగా వుంటే, యింకోసారి మరీ పైపై పటాటోపంగా వుంటున్నై. ఊహించి వ్రాయవద్దు యేదీకూడా; ముందేవిషయమైనాసరే, జాగ్రత్తగా పరిశీలించండి, లోతుపాతులు అర్థంచేసుకోండి. తర్వాత ప్రారంభించండి వ్రాయడం."

"నేనూ అదే ప్రయత్నం చేస్తున్నా. కాని గమ్మత్తేమిటంటే; ఎక్కువమందికేది బాగా వుంటుందో, యేదిఅవసరమో అదే వ్రాయాలని ప్రారంభిస్తా ముందు. అంతలోనే యేదో ఆవేశం వచ్చేస్తుంది. ఉత్సాహం వురకలేస్తుంది. ఇంకేముంది. యేమేమో వ్రాసి పారేస్తాను."

"ఏం ఫర్వాలేదు. దానివల్ల పెద్ద చెరుపేమీ లేదు" అన్నాడు తావ్‌రోవ్, "ఉత్సాహం మంచిదే. మిమ్మల్ని కదలించే విషయాలూ, మీమనసునాకట్టే విషయాలూ వ్రాయడమే మంచిది." మళ్లీ జేబురుమాలు తీసి ముహం తుడుచుకున్నాడు; ఇంకా బలహీనత పూర్తిగా పోయినట్టులేదు. "ఆ ఛాజ్మాని గురించిన వ్యాసం మట్టుకు మీరు........"

"ఏం చెయ్యాలో నాకూ తెలుసనుకోండి" అంటూ అడ్డువచ్చింది ఓల్గా. "మొత్తం ప్రాంతాన్నంతటినీ గురించి వ్యాసం వ్రాయాలంటే కష్టం. బంగారపు గనులూ, మత్స్యపరిశ్రమా, ప్రభుత్వ క్షేత్రాలూ, యింతచక్కని ప్రకృతి సంపదా....ఇదంతా ఒక వ్యాసంలో వ్రాయాలని చూస్తే సాధ్యం కాలేదు. ఏదో వొక పరిమితి పెట్టుకోవాలి."

"ఒకపని చెయ్యండైతే. ముఖ్యమైనవ్యక్తి నొకతన్ని తీసుకోండి. అతని ద్వారా మీరుచెప్పదలచుకున్నవన్నీ తెలియజేయండి" అని సలహా యిచ్చాడు తావ్‌రోవ్.

ఓల్గా ఆలోచించింది.

"నేనీమధ్యేక ఇవెన్ సమిష్టి క్షేత్రానికెళ్లాను. వాళ్ళన్ని పనులూ చేస్తారు. తోటల పెంపకం, పశువుల పెంపకం, దుప్పుల పెంపకం.........ముందు వాళ్ళు ఇవెంకులేనేమో ననుకున్నాను. కాదట. ఇది వేరే తెగట. ఇవెంకుల్నిది వరకు తుంగూలనేవారు....తూర్పు సైబీరియాల్లో తిరిగే అనాదిజాతు లన్నమాట. ఈ ఇవెన్లనేమో లమూత్‌లనేవారు. ఒఖోత్‌స్క్ నదిని లమూత్ సముద్రం అంటారు వీళ్ళు. ఆ క్షేత్రాన్ని తీసు కుని, దానికీ పరిశ్రమలకీ వున్న సంబంధాన్ని గురించి వ్రాస్తే...."

"అలాకాదు. ముందు మనజిల్లా కార్యనిర్వాహక వర్గం అధ్యక్షుణ్ణి కలుసుకోండి. ఆయన్ని గురించీ, ఆయన పనిని గురించీ వ్రాయండి. అప్పుడు జిల్లా మొత్తంమీద జరుగుతున్న పని చాలా వరకు ప్రతిబింబిస్తుంది. ఇప్పుడే సమిష్టి క్షేత్రాన్ని గురించి వ్రాస్తే, తర్వాత పరిశ్రమల్ని గురించి వ్రాసేప్పుడు మళ్లీ యిప్పుడొచ్చిన యిబ్బందే వస్తుంది."

"మీరు చెప్పేదీ నిజమే" అంది ఓల్గా.

"ఎందుకు! ఆ అధ్యక్షుణ్ణి కలుసుకునేదాకా ఆగండి. ఆయనంటే సామాన్యుడేమీ కాదు. ఇక్కడ జనం ఆయన్ని గురించి పాటలుకడతారు; కట్టుకథలు చెప్పుకుంటారు. ఇందాక మీరు చెప్పిన ఇవెన్ క్షేత్రం స్థాపించడానికి కృషిచేసినవారిలో ప్రముఖుడు."

"ఓహో, మీరంతా యేవేవో ఉన్నత విషయాలు చర్చిస్తున్నట్టుంది! చెడగొట్టానావచ్చి? ఏంమాట్టాడుతున్నారు?

భూగోళాన్ని గురించా?" అంటూ వచ్చింది పావా, ప్రక్క గదిలోంచి.

వచ్చి ఓల్గా తావ్‌రోవ్‌లకెదురుగా నిలబడింది. అంతా బుట్టబొమ్మ లాగుంది. మోకాళ్ళదాకా గౌను, లావు కన బడకుండా వుండేందుకు దానిమీదొక కోటు. ఎత్తుమడమల చెప్పులు, తిరగేసిన బేసిన్‌లాగా నెత్తిమీదొక టోపీ. ఇదీ మధ్యేవచ్చిన స్టైల్; కొత్త స్టైల్‌ని అనుకరించకుండా వుండడం కంటే చావడమే మెరుగనుకుంది పావా.

"మిమ్మల్నిద్దర్నీ చూస్తే బాగా ఓర్పున్నవాళ్ళకిగూడా విసుగు పుట్టుకొస్తుంది బాబూ?" అంది ఓల్గా, ప్రేమగానే; "నాకాళ్లు మరీ తీసుకపోతున్నై. అందులోనూ వృత్తిమనిషిని కాదాయే. చేసిందిచాల్లే యిక! మీకవకాశం యిచ్చాను మీరుపయోగించుకోలేదు. ఎంతచేస్తే యేంలాభం!"

# 62

ఇవాన్ ఇవానొవిచ్ ఆపరేషన్ గదిలోకి అడుగుపెట్టేప్పటికే రోగిని బల్లమీద పడుకోబెట్టి వుంచారు; పైన లైట్లు వెలిగిపోతున్నై.

సర్జెన్ అడుగులచప్పుడూ, గొంతూవిని రోగి బిర్రబిగుసుకున్నట్టయ్యింది; భయం. ఆపరేషన్‌కి అంగీకారం తెలిపే కాగితంమీద వెంటనే చేసేసింది సంతకం. యింకోదారి మాత్రం యేది? ఆపరేషన్‌కంటే, తనకడుపులోవున్న శిశువుని గురించి ఆవిడకావేదన ఎక్కువగావుంది. ఎంతకాలంనుంచో కలలు గంటోంది ఒక బిడ్డకావాలని. కడుపులో శిశువు కదలికనీ

తలచుకుని తలచుకుని మురిసిపోతుండేది. ఆ కదలికలొచ్చినప్పుడల్లా లోపలి శిశువు యింకా స్తపీలుగా పండుకునేందుకుగాను ఒకసారి భుజంతో కుమ్ముతున్నాడనీ యింకోసారి కాలుతో తన్నుతున్నాడని అనుకునేది. ఆపరేషన్ బల్లమీద పండుకుని గూడా ఆశిశువుని గురించే ఆలోచనలు; మెదలకుండా పండుకోమని గల్లంతు చెయ్యవద్దనీ చెబుతోంది మనసులోనే శిశువుతో. ఎప్పుడెలా కదులుతుందోనని భయపడుతోంది లోలోపల. తల్లీ, శిశువూ యిద్దరూ ఓర్పుగావుండాలి మరి.

తనపని తను పూర్తిచేశాడు డాక్టరు సెర్గుతోవ్. నొవొకెయ్న్ ఇంజెక్షన్లిచ్చాడు. రోగి వెన్నుమీద ఆ ఇంజెక్షన్లిచ్చిన భాగం కన్పిస్తూనేవుంది. ఇవాన్ ఇవానొవిచ్ వచ్చి, ఆపరేషన్ చెయ్యవలసిన భాగం యింకొకసారి ఎక్స్‌రేఫోటోతో పోల్చిచూశాడు. ఎక్స్‌రే పటం అక్కడే కిటికీకి వ్రేళ్లాడగట్టివుంది.

వార్యాకూడా అక్కడేవుంది. వేసుకున్న తెల్లముసుగు పైనుంచి చూస్తోంది నల్లటి కళ్లతో.

"మర్చిపోతారేమో.... హెక్సొనాల్ కావలసొస్తుంది" అన్నాడు ఇవాన్.

"సిద్ధంగానే వుంచాను" అంటూ, ఆపరేషన్ చెయ్యవలసిన భాగం మట్టుకు కనబడేట్టు దుప్పటి తొలగించింది.

బల్లకవతలి వైపునుంచి, రోగి దుప్పటితీసి నెత్తిమీదున్న గ్లిప్పులో పెట్టింది ఎలీనా, రోగి నెత్తురుపోత్తిడి చూశారు.

ఎవరి స్థానంలో వారున్నారు. అంతా సిద్ధంగావుంది. ఐనా ఆపరేషనంటే యేమిటో యిదిగానేవుంది ఇవాన్‌కి. ప్రమాదమైన ఆపరేషనని యిదివరకే తెలుసు. అంచేత యిప్పు

డతను ఆలోచించేది తన్ను గురించికాదు; రోగిని గురించి. ఈఆపరేషనువల్ల పరిస్థితులేమీ విషమించగూడదు. అదీ విచారం.

"చలిగావుంది" అంది మరియా తనచుట్టూ యెక్క డెవరు కదల్తున్నా తెలుస్తోందావిడకి. తనమీదెక్కడ యెవరేమీ చేసినా తెలుస్తోంది. దీనికితోడు లోపలి శిశువు. శిశువు కడుపులో లేకపోయినా భయపడే పరిస్థితి.

ఎలీనా ఇవాన్‌వంక చూచింది. "ఎడ్రినాలిన్ ఇంజక్ష నివ్వండి" అన్నాడు ఇవాన్ ఎలీనాతో. "ఏం భయపడకమ్మా సాధ్యమైనంత త్వరగానే పూర్తిచేసేస్తాంలే" అన్నాడు మరియాతో.

తిరుగుడు స్టూల్ మీద కూర్చున్నాడు ఇవాన్. ఒక స్కాల్పెల్, పెద్దకొక్కెం మొండిదొకటీ యిచ్చింది వార్యా. సెర్గుతోవ్ ప్రక్కనేవున్నాడు ఇంకొక కొక్కెం ఒక చేత్తోనూ ఎలెక్ట్రిక్ సక్షన్‌పంపు ట్యూబు యింకొకచేత్తోనూ పట్టుకుని. నికితా అక్కడేవున్నాడు రోగి పరిస్థితిచూస్తూ వుండేందుకు. అతను కరెంటు స్విచ్ వేశాడు. అతనిప్పుడు సర్జెన్ కసిస్టెంటన్నమాట. ఆపరేషన్ చూడ్డం అంటేనే భయపడిపోతాడతను ఒక్కొక్క సారి. ఐనా ఎప్పుడేవస్తువివ్వాలో అప్పుడా వస్తువు యిచ్చేస్తుంటాడు. తన సెలవురోజున సర్జెన్‌కన్నీ అతనిస్తూ వుంటాడే అని అసూయ వార్యాకి!...

వెన్నుపక్కనే నిలువుగా ఒకతిన్ననికోత. వెంటనే కొక్కేలతో పట్టెయ్యడం రెండంచులూనూ.

"కరెంట్!" అన్నాడు ఇవాన్.

"ఇక్కడంతా నరాలపుట్ట" అన్నాడు సెర్గుతోవ్‌తో, స్కాల్పెల్ పెడుతూ. "చూశావా ఎన్నెన్ని శాఖలో. అంటే

యీ బుడుపునాళాల్లో వుండాలన్నమాట. రక్తస్రావం జరుగుతుందేమో. జాగ్రత్తగా వుండాలి."

న్యూరాలజిస్ట్ గూడా వచ్చాడు ఆపరేషన్ బల్లదగ్గరికి. కన్ను డాక్టరూ వచ్చాడు. కన్ను డాక్టరు అవసరం యేమీ లేదు గాని ఆయనకీ న్యూరోసర్జరీ అంటే కుతూహలం వుంది. అందుకని వొచ్చాడు. ఈ యిద్దరూగూడా ముసుగులేసుకున్నారు. ఎలెక్ట్రిక్ కత్తితో చిన్నచిన్న గంట్లు పెడుతున్నాడు ఇవాన్. పొర లటూయిటూ తొలగించు తున్నాడు. వెన్నెముక కన్పిస్తోం దిప్పుడు.

"నొప్పి" అని గొణిగింది మరియా.

"నొవొకెయిన్" అన్నాడు ఇవాన్ వార్యాతో. "ఇంకొక్క నిమిషమమ్మా, మరియా! నీకెప్పుడు బాధగా వుంటే అప్పుడు చెప్పేశెయ్యి మాతో. భరించగలంగదా అని వూరుకోబోకు. ఇదివరకంటే రోగుల్ని ఆపరేషన్ బల్లకి కట్టేసేవారు బాధ కలిగినా గిలగిలలాడి కొట్టుకోకుండా. ఇప్పుడా అవసరం యేమీలేదు. నొప్పెత్తకుండా చెయ్యడానికి మంచిమంచి మందులొచ్చినై. స్మృతి తప్పించే మందులు, ఆపరేషన్ చేయవలసిన భాగం బండబారేట్టు చేసే మందులూనూ" అంటూనే వార్యా యిచ్చిన సిరింజ్ తీసుకుని రెండింజెక్షన్లు చేశాడు వెన్నెముకకి రెండువైపులా.

"ఒకొంద సంవత్సరాల క్రితం అసలిలాంటి ఆపరేషన్ చెయ్యడమే సాధ్యమని అనుకోలేదు" అన్నాడు న్యూరాలజిస్ట్.

"ఇరవయ్యేళ్ళ క్రితం మాత్రం అనుకున్నామా ?" అన్నాడు ఇవాన్, తన పని తను చేస్తూ.

ఆపరేషన్ సాగిపోతోంది.

ఎలెక్ట్రిక్ కత్తితో యింకొక కోత. బల్లకవతలి ప్రక్కన ఎలీనా గుండెల్లో గుండెలు లేవు; పైకిమాత్రం నిబ్బరంగా వున్నట్టు కన్పిస్తోంది. రోగి వాంతులు చేసుకుంటోంది. ఐనా ఆపరేషన్ ఆగలేదు.

"కత్తెర! కరెంట్! మైనం!"

# 63

మాత్రెమియనోవ్ కుటుంబం చాలా మంచి కుటుంబం. మరియా కాక, యింకా నలుగురు కొడుకు లున్నారతనికి. యెదిగొచ్చినవాళ్లు. భార్యగూడా చాలా మంచిది; పెద్ద పెద్ద కన్నులూ ఆవిడానూ; మంచి హుషారైన మనిషి.

"బొద్రైబోలో పుట్టి పెరిగింది" అని చెప్పుకునేవాడు భార్యనుగురించి, గర్వంగా; "బంగారపు గనుల్లో పుట్టి పెరిగింది!" అనేవాడు.

అతను పుట్టిందీ బొద్రైబోలోనే. వయసు పధ్నాలుగే ఐనా, అప్పుడు జరిగిన సమ్మెలో పాల్గొన్నాడు. పధ్నాలుగేళ్ల వాళ్లని గనుల్లో పనిజెయ్యనిచ్చేవారు కాదు. అందుకని యింకొక మూడేళ్లెక్కువేసి చెప్పి, చేరాడు. మనిషిగూడా బాగా దృఢంగా వుండేవాడు; అందుకని పదిహేడేళ్ళంటే తేలిగ్గానే నమ్మేశారు అధికారులు. సమ్మెదారులమీద కాల్పులు జరిగినై. ఆ కాల్పుల్లోనే చనిపోయాడతని తండ్రి; తండ్రిగూడా గనిలో కార్మికుడే. అప్పుడేడ్చాడు మాత్రెమియనోవ్ పధ్నాలు

గేళ్ళ కుర్రాడిలా వెక్కెక్కి. ఇకప్పట్నుంచీ అతని జీవితంలో పెద్ద మార్పొచ్చింది. కమ్యూనిస్ట్ పార్టీలో చేరాడు.

కుటుంబంలో అందరికీ మరియా అంటే అపరిమితమైన ప్రేమ. అలా అని, గారాంతో చెడిపోలేదు మరియా. చాలా జాగ్రత్తగా వుండేది చిన్నప్పుడుకూడా. అందుకని ఏడేళ్ళ స్కూళ్ళు పూర్తికాగానే పెద్ద చదువుకని పట్టణానికి పంపారు. ఆర్థిక శాస్త్రంలో డిప్లోమా తీసుకుంది. పెళ్ళి చేసుకుని నిండు నెలల్తో వచ్చింది యింటికి. తిరిగొచ్చింది కదాని సంతోషించ డానికి బదులు యీ పాడు జబ్బొకటి దాపురించింది.

"అందులోనూ యీ బుడుపు!" అన్నాడు మాత్రె మియనోవ్, జిల్లా కమ్యూనిస్ట్ కమిటీ ఆఫీసులో కూర్చుని. లొగునోవ్ అక్కడే వున్నాడు. "అదీ చాలనట్టు వెన్నెముక మీద. వాళ్ళమ్మకి మతిగూడా చెడినట్టుంది. ఎప్పుడూ ఆ డాక్టర్ల వెనకే పడి తిరుగుతుంది. అలా వెళ్ళి వాళ్ళని విసిగించగూడ దని చెబుతానేను; వినదు. నాకూ కోప్పడేందుకు నోరు రాదు. ఆడది. పిల్లల్ని కన్నది. ఈ ఆపరేష నెంత గడ్డు ఆపరేషనో తెలుసు. కూతురంటే యెంత ప్రేమో తెలుసునాకు. ఇంకే మనగలను? ఒకవైపున కుట్లు; రేపోమాపో ప్రసవించాలి. ఏమో; ఏమౌతుందో. ఐనా, ఆపరేషన్లోంచి బ్రతికి బైట పడింది. ప్రసవంగూడా సుఖంగానే జరగొచ్చు మరి. డాక్టర్ ఇవాన్ వున్నాడుగదా అని ధైర్యం........"

ఆపరేషన్ చేసిన మర్నాడు, గురువారం నాడు, వెన్నంతా పోట్లుపోట్లుగా వుందని ఏడ్చింది మరియా. శుక్రవారం నాటికి పోట్లు తగ్గిపోయినై. మనిషిగూడా తేరుకుంది. పోయిన కాళ్లు తిరిగి వచ్చినందుకందరూ సంతోషించారు. ఆ కాళ్లూ,

కాలి వ్రేళ్ళు కదపడం చూచి, గూసేవ్ గూడా సంతృప్తిపడ్డాడు. తనంతట తానే మోకాలుగూడా సాచేస్తోంది; కాకపోతే మో కాలు వంచడం మట్టుకు యింకా బాధకరంగానే వుంది. ఆప రేషన్ బాగా జరిగిందనడానికేమీ సందేహం లేదు.

"చూద్దాం; ఏమౌతుందో" అన్నాడు గూసేవ్.

"ప్రసవిస్తుంది. సందేహం లేదు" అన్నాడు ఇవాన్. అన్నాడేగాని, ముహంలో యింకా ఆందోళన లేకపోలేదు. అది చూశాడు గూసేవ్.

"గట్టిగా నమ్మకం వుందా మీకు?" అనడిగాడు.

"మరీఅంత రాచబాట అని అనను కాని, మరియా గూడా హృదయపూర్వకంగా బిడ్డ కావాలని ప్రయత్నిస్తే, ఆవిడకాబిడ్డ లభిస్తుంది. పొత్తికడుపు నరాలు కూడా బాగానే పని జేస్తున్నై యిపుడు" అన్నాడు ఇవాన్.

"మీరన్నది నిజం కావాలనే నావుద్దేశం." అని, "ఐనా సిజరియెన్ ఆపరేషన్ చేస్తేనే బాగుండేదేమో!" అన్నాడు నెమ్మదిగా.

శనివారంనాడు ప్రసవం నొప్పులు ప్రారంభం ఐనై. ఒక్క నిమిషం గూడా రోగిని వొంటరిగా వదలకూడదనే వుద్దే శంతో, ఎలీనాగూడా హాస్పిటల్లో, రోగిగదిలోనే వుంటోంది. ఆవేళ వుదయం నాలుగుగంటలకి, "ప్రతి పది పదిహేను నిమిషాలకీ సామాన్యమైన నొప్పులు" అని వ్రాసింది ఎలీనా, రోగికని ప్రత్యేకించిన పుస్తకంలో.

గత మూడునాలుగు రోజుల్నుంచీ, రోగిప్రక్కనే వుంటం మూలాన బాగా పాలిపోయింది ఎలీనా. ఈ రోగికి సంబంధించి

నంత వరకు ప్రధాన బాధ్యతంతా యిప్పుడావిడదే. ఇప్పుడే పొరపాటు జరిగినా, ఆలోపం తనదే ఔతుంది.

ఎందుకనో గాని, కాళ్ళసలు తిన్నగా వచ్చాయో, లేదో అన్న అనుమానం కలిగింది ఎలీనాకి వున్నట్టుండి. "ఏదమ్మా, కాస్తా కాళ్ళు కదిపి చూడు!" అంది మరియాతో.

మరియా కాళ్ళు కదిపింది చెప్పినట్టు; కాని యింతలోనే మళ్ళీ ప్రసవపు నొప్పులు.

ఇవాన్ గూడా తన అలవాటు మార్చుకుని, ప్రతిరోజూ, ముందు ప్రసవం గదులుచూచి గాని మిగతా హాస్పిటల్ గదులకి వెళ్ళడం లేదు.

ఎలీనా ఆ దుర్దాచూచి, "ఏం ఫర్వాలేదు. రోజురోజుకూ పరిస్థితి మెరుగౌతోంది" అని ధైర్యం చెప్పాడు.

కాని, రోగి దగ్గరే వుండేందుకు తీరిక వుండడం లేదు ఇవాన్‌కి. ఇవ్వాళింకొక ఊపిరితిత్తుల ఆపరేషన్ చెయ్యాల్సుంది. హాస్పిటలంతా తిరిగి చూడకుండానే, ఆపరేషన్ గదిలో కెళ్ళాలిసొచ్చింది.

ఇకిప్పుడు రోగిప్రక్కన ఎలీనా ఒక్కతే వుంది. ప్రసవం బల్లమీద పండుకో బెట్టారు రోగిని. "ప్రతి ఐదు, ఎనిమిది నిమిషాలకీ నొప్పులు" అని వ్రాసింది ఎలీనా, పుస్తకంలో.

"మరియా యెలావుందో తెలుసుకురమ్మన్నారావిడ భర్త" అంటూ వచ్చిందొక నర్స్.

"ప్రసవం ప్రారంభమైందని చెప్పు" అన్నది ఎలీనా, ముక్తసరిగా.

మళ్లీ పదహారు గంటలకి, "ప్రతి ఆరు నిమిషాలకి నొప్పులు" అని వ్రాసింది పుస్తకంలో. మళ్లీ ఇవాన్ వచ్చాడు. వెళ్ళాడు. ఇంకొక ఆపరేషన్ కేసు. ఇవ్వాళ్ళ పనే అలా వుంది. మరియా భర్త, తల్లీ మళ్లీ కబురు పంపారు ఎలావుందో తెలుసుకురమ్మని.

"ప్రసవిస్తోంది" అని చెప్పి పంపింది ఎలీనా.

నొప్పులు కాస్త తగ్గింతర్వాత "బిడ్డని కనగలనంటారా నేను ?" అనడిగింది మరియా.

"తప్పకుండానమ్మా" అంటూ మరియా ముహంవంక చూచింది ఎలీనా. మాతృమూర్తి చిహ్నాలప్పుడే వచ్చేశాయి; ఎంతో నిండుగా వుందా ముహం. "ఇదిగో, మళ్లీ వస్తోంది. ముక్కాలి కాస్త గట్టిగా."

పంధొమ్మిది గంటలకి, పుస్తకంలో ఇంకొక షంక్తి. "ప్రతి మూడు నాలుగు నిమిషాలకీ నొప్పులు."

శిశువును బయిటికి పంపేందుకు తల్లి పడే తాపత్రయం, అంత బాధలోనూ ముక్కడానికి చేసే ప్రయత్నమూ చూచి, ఆనందాశ్రువులు నిండిపోయాయి ఎలీనా కన్నుల్లో.

వొద్దనుకుంటూనే డాక్టర్ ఇవాన్‌కి కబురంపింది ఎలీనా. వచ్చి చూశాడు. "మనంగూడా కొద్దిగా సాయం చెయ్యాలను కుంటాను తల్లికి. ఏదీ, ఆఫోర్సెప్స్ యివ్వండి" అన్నాడు.

సరిగ్గా, ఇరవయ్యొకటో గంటని పుట్టింది శిశువు. చక్కని ఆరోగ్యమైన శిశువు. బొమ్మకి మల్లేవుంది బొద్దుగా" అన్నది ఎలీనా, మరియాతో, శిశువుని కడుగుతూ.

ఇవాన్‌గూడా చేతులు కడుక్కున్నాడు; శ్రమ ఫలించిందివ్వాళ. ఎన్ని ఆపరేషన్లివ్వాళ. అందులో పెద్దతైటారి

పోయింది యింకొక ఆపరేషన్ చేస్తున్నప్పుడు. ఆ తప్పంతా సెర్గుతోవ్‌దే.

"అతని జీతంలోంచి తీసేస్తే సరి!" అనుకున్నాడు ఇవాన్. "అతని జీతంలోంచీ, ఆ నర్స్ జీతంలోంచీ తీశెయ్యాలి. అప్పుడుగాని జాగ్రత్తగా వుండరు. ముందు పరీక్షచేసి చూసుకో గూడదూ, అశ్రద్ధ కాకపోతే.. వార్యా ఐతే అట్లా యెప్పుడూ ముందు పరీక్షచేసి చూసుకోకుండా వుండేదిగాదు. అంత ఖరీదు పెట్టి తెచ్చాం. అంతమంచి పనిముట్టు. అశ్రద్ధమూలాన పని జెయ్యకపోయె. సిగ్గుచేటు!"

ఆఫీసులో కెళ్లాడు. సిగరెట్ ముట్టించాడు. ఇంకా కోపం తగ్గలేదు. ఓల్గా సంగతి గుర్తుకొచ్చింది. పావా యింటికి పార్టీకని వెళ్ళింది. కోపం తగ్గింది కాని, ఒంటరితనం పోలేదు. ముసలితనం వచ్చేస్తుందనిపించింది. ముప్ఫయ్యారేళ్లు యిప్పుడు. దాదాపు నలభయ్యన్నమాట. క్రిందటి డిగ్రీ తీసుకుని నిండా ఐదేళ్లయ్యింది. ఆ డిగ్రీ తీసుకున్న రోజున ఓల్గా, తెల్లని గౌనులో ఎంతో హుషారుగా వుంది. వేసవికాలం. పూలు, సీనియెర్ డాక్టర్ల మెప్పులు. వైద్య ప్రపంచంలోనే పేరు తెచ్చుకున్నాడా రోజున. ఐదేళ్లు గడచినై. ఈ ఐదేళ్ళలోనూ తాను సాధించిందేమిటి?

డాక్టరుగా ప్రవేశించిన మొట్టమొదటి రోజుల్లో, ఒక రోగికి తాను చికిత్స చెయ్యలేక పోయాడు. చాలా విచారించాడు. అంతకు పూర్వం అలాంటి రోగుల్ని మాస్కోలోవున్న న్యూరో సర్జెరీ ఇన్‌స్టిట్యూట్‌కి పంపేవారు. ఐనా తనకా విజ్ఞానం లేకపోయిందే అని బాధ లోపల. ఇక న్యూరో సర్జెరీ చదవాలని నిశ్చయించుకున్నాడు. ఇప్పుడు తానే ఒక న్యూరో

సర్జెన్. ఐనా యీ విచారం యెందుకు? యీ వెలితేమిటి? యీ బాధ దేనికి? ఓల్గా మూలాన్నా? మరి తన పని మాటేమిటి? ఇంకా తన పనిలో తను నేర్చుకోవలసింది చాలా వుంది. జీవితమంతా ముందుకు పరుగెత్తుతూ పరుగెత్తాడు, ఊపిరి పీల్చుకునేందుకుగూడా ఆగకుండా. ఏదో వొక దారి కొచ్చాడు.........

"ఇక చెయ్యవలసిందేమిటి?" అని ప్రశ్నించుకున్నాడు. "ఇంకా కొన్ని డిగ్రీలు సంపాదిస్తాను. ఐనా యింకా తెలుసుకోవలసింది చాలా వుంటుంది......."

నెమ్మదిగా లేచి, ఆఫీసు బయట కొచ్చాడు. ఎవరో బిగ్గరగా మాట్లాడుతున్నారు. ఎలీనా కేకలేస్తోంది. అప్పుడక్కడ వుండే డాక్టరేదో సమాధానం చెబుతున్నది నీళ్లు నములుతూ.

"ఆపరేషన్ గదెంతో, మాగదీ అంతే; ముసుగులేకుండా లోపలి కెవ్వరూ రాగూడదు" అంటోంది ఎలీనా, "మా మాటెవ్వరూ లెక్కచేసినట్టే కనబడదు. బజార్లోనుంచి సరాసరొచ్చేస్తారు యీ గదీ వొక బజారే ఐనట్టు."

"ఆయనావిడ భర్త—అంత గడ్డు జబ్బాయె. పాపం యెంత ఆదుర్దాగా వుంటాడో చూడండి!" అంటున్నది డాక్టర్.

"గడ్డు జబ్బు కాబట్టే అలా రాగూడదు. ఏప్లూయోవస్తే యెవరూ బాధ్యులు?"

కారణం యేమీలేకుండానే, ఆ మాటలు వినవస్తూన్న వైపు కెళ్లాడు ఇవాన్. సర్జెన్ని చూచి మాటలాపేశారు యిద్దరూ. గదిలోపలి కెళ్లాడు.

మరియా పండుకునుంది. తలగడమీద తలవంచి బిడ్డ వంక చూస్తోంది, చిరునవ్వు నవ్వుకుంటూ. బిడ్డ పాలు త్రాగుతోంది. ఇదే మొదటిసారి తల్లి పిల్లకు పాలీయడం. ఆ ఆనందంలో వుంది తల్లి. ప్రక్కకొచ్చిన సర్జెన్నిగూడా చూచీ చూడనట్టు చూచి, మళ్లీ తన పిల్లవంక చూస్తోంది తల్లి, తన్మయంగా. కొత్త మనిషి గదిలో కొచ్చాడుగదా, అని దుప్పటి తీసి కప్పుకోనూగూడా లేదు.

దానికి కారణం యీ డాక్టరిదివరకే నగ్నస్థితిలో తన్ను చూశాడనికాదు. అట్లాగైతే పొద్దునతను వచ్చి పరీక్షించడం పూర్తి కాగానే దుప్పటి గడ్డంవరకూ లాక్కుని. కప్పుకుంది. బలహీనతవల్ల వూరుకున్నదా అంటే అదీకాదు. ఇప్పుడావిడకాబిడ్డే సర్వస్వమూనూ. అదే ప్రపంచం; ఆ ప్రపంచంలో తనకూ తన బిడ్డకూ తప్ప యింకొకరికి స్థానంలేదు. మృత్యుముఖానపడిన మనిషి బ్రదికి బయటపడింది. అంతేకాదు; శిశువును కన్నది. ఇంత పరమాద్భుతం జరిగిపోయిం తర్వాత, యింకా బహిర్ప్రపంచంలో యెందుకుంటుంది! తన ఆనందంలో తాను తల మున్కలౌతోంది.

అది చూచి ఇవాన్‌గూడా చాలా సంతోషించాడు. ఎలీనాని పిలిచి, "అప్పుడే పాలివ్వడాని కెందుకొప్పుకున్నారు?" అనడిగాడు నెమ్మదిగా.

ఆ మాతృ హృదయంలోంచి వెల్లివిరిసే చిరునవ్వు కిరణం వొకటొచ్చి అతనిలోనూ ప్రవేశించినట్లయ్యింది. అప్పటివరకూ అతన్ని వేధిస్తూన్న ఆలోచనల చీకటి పటాపంచలైంది. చిత్తరువు గీయడం పూర్తైంతర్వాత, దూరంగా నిలబడి చూసు

కుంటూ ఆనందించే చిత్రకారుడిలాగా వున్నాడు ఇవాన్. ఆ క్షణానికతని స్వంత విషయాలన్నీ మరిచిపోయాడు.

# 64

క్రిందటిసారి ఓల్గా, తావ్‌రోవ్‌లు కలుసుకున్నప్పటి నుండీ, ఇక వారిద్దరి మధ్యా సుస్పష్టమైన సంబంధం యేర్పడిందనే భావించాడు తావ్‌రోవ్. ప్రేమను గురించి ఒక్క మాటగూడా అనుకోనిమాట నిజమే. మన భావాల్నిలా అణచుకోవడం మంచిది కాదనీ, మన జీవితాల్నిలా నాశనం జేసుకోవడం తగదనీ ఓల్గాకిక నచ్చజెప్పవచ్చు ననుకున్నాడు. ఐనా ఆమూడోమనిషున్నాడు ఇద్దరిమధ్యా. ఎంత అసూయ వున్నా, ఇవాన్ అంటే గౌరవం లేకుండా పోలేదు తావ్‌రోవ్‌కి. అంతమాత్రాన ఓల్గా అంటే అతనికున్న ప్రేమా సడలలేదు. ఇదంతా చూస్తే, అతని బాధ్యత యింకాస్త యెక్కువైంది; కాస్త భయంభయంగా కూడా వుంది.

ఓల్గా!

ఆ రెండక్షరాలూ ఒక నిట్టూర్పు; నిద్రబోయే ముందూ, నిద్రలేవగానేనూ అనుకునే అక్షరాలవి.

మిల్లులో బాగా పనిలోవున్నప్పుడు మట్టుకు ఆలోచనొచ్చేది గాదు ఆవిణ్ణిగురించి. ముడిరాళ్లు ఒక యంత్రంలోంచి యింకొక యంత్రంలోకి ప్రయాణం చేస్తున్నై. పెద్ద పెద్ద రాళ్లుగూడా ఆ యంత్రాల్లో పడి ముక్కలు ముక్కలై చివరికి పిండై పోతాయి. మొట్టమొదటి మిల్లులో యీ రాళ్ళన్నీ వక్కల్లా పగిలి పడతాయి ఉక్కుపళ్ళ చక్రంకిందికి. అక్క

నుంచి యింకో రెండు మిల్లుల్లో కెళ్తాయి. తర్వాతొచ్చేది రెండో విభాగం. ఈ విభాగంలో మూడు బాల్మిల్లు లుంటాయి. ఒక్కో మిల్లుకీ ఒక్కొక్క కార్మికుడుంటాడు, ఏమిల్లు కామిల్లుకి ప్రత్యేకంగా ఎంజిన్; ప్రత్యేకమైన బెల్ట్. ఇంతవరకూ లొగునోవ్ పనిచేసిన గని వుత్పత్తిచేసే ముడిపదార్థం యీ మిల్లులికి సరిపోయేది కాదు. కానిప్పుడు ఆ గనుల్లో వుత్పత్తి బాగా పెరిగింది. ఉత్పత్తినంతా పరిశుద్ధం చెయ్యాలంటే యీ మిల్లుల శక్తిని పెంచవలసొస్తోంది.

శక్తిని పెంచకుండానే, భారం హెచ్చించవచ్చును కాని పది శాతంకంటే ఆ భారం యెక్కువైతే సరుకు గుణం దెబ్బ తింటుంది. అందుకని మిల్లుని పునర్నిర్మిస్తున్నారు.

ఇప్పవరకున్న ప్రధాన భవనం గోడల ప్రక్కనే కొత్త పునాదులు తవ్వుతున్నారు. "ఏదేమైనా యీపైపై పనంతా శీతకాలం వచ్చేప్పటికి పూర్తైపోవాలి" అనుకున్నాడు తావ్రోవ్. "ముందు కొయ్య చట్రాలు తొందరగా పూర్తి చేశెయ్యమని చెప్పాలి వడ్రంగుల్తో. యంత్రాలవి శీతకాలం లోనే బిగించొచ్చును. ఇంకో రెండు సిలిండర్లు పెంచితే సరిపోవచ్చును బహుశ. ఇంకొక బాల్మిల్లుంటే చాలు........"

చిట్టచివరి మిల్లుదగ్గర కెళ్ళి, ఆగి విన్నాడు తావ్రోవ్. ఈ మిల్లులోవున్న యంత్ర భాగాలు అరిగిపోయినై. అవి కొత్తవి తెప్పించి వెయ్యడానికి ఆలస్యమైంది. ఈ లోపుగా విద్యుచ్ఛక్తి యెక్కువ తినడం మొదలెట్టింది మిల్లు. జరగవలసినంత పనీ జరగలేదు; తయారైన బంగారమూ మంచిదికాదు. బంగారం గ్రాముVారీ ఖరీదూ పెరిగింది.

అక్కడినుంచి సెటియంత్రాలున్నచోటికి కెళ్లాడు. ఇందులో పది భాగాలున్నై. ప్రతి విభాగంలోకీ ముందొక ద్రవపదార్థాన్ని పంపుతారు. ఆ ద్రవంలో వొకొంత ముడి బంగారం, ఇతరవైవంతులు నీరు. ఈ ద్రవాని కొకరకమైన నూనె కలుపుతారు. ఓడ ప్రొపెలర్ లాగావున్న యంత్రం వొకటి కవ్వంలా తిరుగుతుంటా ద్రవంలో. ఆ కవ్వం చిలకరింపుతో నూనె బుడగలు లేస్తాయా ద్రవంలో. అక్కడినుంచి ప్రక్కనేవున్న గూడల్లో కెళ్తుంది ద్రవం. అక్కడ బంగారం తేరుకుంటుంది. తేరుకున్న బంగారం పేరుకున్న తర్వాత బట్టీల్లోకి పంపుతారు.

ఇంతలో, నీలికన్నుల, ఎర్రబుగ్గల అమ్మాయొచ్చింది తావ్‌రోవ్ దగ్గరికి. జుత్తు శిఖరంలా నడినెత్తిమీద ముడేశుంది. ప్రయోగశాల ఫలితాలు తీసుకొచ్చింది. ప్రతిరోజూ మామూలుగా జరిగే పనేయిది. రాగి, ఆర్సెనిక్‌లాంటి యితర లోహాలుంటె బట్టీ చెడిపోతుంది. అందుకని ముందే పరీక్ష చేస్తారు. ఆ పరీక్షా ఫలితాల్ని తీసుకొచ్చిందిప్పుడా అమ్మాయి. అంకెలన్నీ జాగ్రత్తగా చూశాడు తావ్‌రోవ్. స్త్రీ వ్రాసిన దానికి మళ్లేనే లేదు ఆ వ్రాత. ప్రక్కగా చూస్తే ఆవిడ చేయి కన్పించింది తెల్లగా. అందంగా వుంది. ఆకర్షణీయంగానే వుంది. మళ్ళీ ఆ లెక్కల పుస్తకం తీసికొని వెళ్ళిపోతుంటే చూశాడు. కాని ఎందుకనో మనసు కలగలేదు. ఓల్గా గుర్తుకొచ్చింది. అందమైన ఆకారం గుర్తుకొచ్చింది. వొత్తుగావుండి మెరిసిపోయే జుత్తు గుర్తుకొచ్చింది. ఆవిడ మాట్లాడే తీరు గుర్తుకొచ్చింది. మనసులో యేదో అవ్యక్తమైన బాధ కలిగింది. ఆవిడే కావాలి తనకి.

"బంగారం శాతం తగ్గిపోయినట్టుంది. ఇట్లా ఐతే లొగునోవ్ పూరుకోడు" అని అన్నాడు ఫోర్మన్ దగ్గరకెళ్ళి. "గెలుకుడు మిల్లుల్లో రెండో భాగంలో పని తగ్గించి మొదటి భాగంలో యెక్కువచేస్తే మంచిదనుకుంటాను. బాల్మిల్లులో గూడా వేగం హెచ్చించి, నిమిషానికొక ఇరవయ్యేడు చుట్లన్నా తిరిగేట్టు చెయ్యాలి. అప్పుడుగాని బంగారం శాతం హెచ్చదు బహుశా."

# 65

"ఎక్కడికెళ్తున్నారేమిటి ?" అనడిగాడు లొగునోవ్, డాక్టర్ ఇవాన్ని. అప్పుడే హాస్పిటల్‌నుంచి బయటికొచ్చాడు ఇవాన్.

"నేనా ?" ఓల్గా పావాయింట్లో పార్టీకెళ్ళిందని గుర్తు కొచ్చింది. సాయంత్రం అంతా యింకా అలాగేవుంది. ఇంటి కెళ్ళి, ఒంటరిగా కూర్చోవాలి. మనసులో భావాలన్నీ ముహంలో ప్రతిబింబించినై. "ఇంటికి" అన్నాడు నిట్టూరుస్తూ, "పనుంది చెయ్యాల్సింది."

"మీకు పనిజెయ్యడం తెలుసుగాని, కాలం హుషారుగా ఆటలాడుతూ గడపడం తెలియదనుకుంటా" అన్నాడు లొగునోవ్. "మీరెప్పుడూ పనితప్ప యింకేమీ చేస్తున్నట్టే కనిపించరు. అదేమంత మంచిదికాదు."

"లేదే. గొరోద్కి ఆట ఆడ్తాను"

"ఎప్పుడు, శీతాకాలంలోనా ?"

"వేట కెళ్తాను."

"ఎప్పుడో నూటికొకసారి వెళ్తారేమో. మీరూ, మీ భార్యా కలిసి యిద్దరికీ యిష్టమైన విధంగా హుషారుగా గడప గూడదగా కాస్సేపు ?"

"ఆవిడసంగతి ఆవిడ బాగానే చూసుకుంటుంది." అన్నాడు ఇవాన్, హాస్యాని కన్నట్లు; ఇంతలో ఆ మాటల వెనకున్న అర్థం చూచి, సిగ్గుపడిపోయి, వూరుకున్నాడు.

"మీకు పనిలేనప్పుడు ఆవిణ్ణలా వొదిలెయ్యడం యెందుకు. వివాహం ఐంతర్వాత భార్యాభర్త లిద్దరూ కలిసి గడపాలి తీరిక కాలమంతా."

"పెళ్ళికానివాళ్లు ?''

"పెళ్లి కాని యువకుడు, తన కిష్టమైన అమ్మాయితో గడుపుతాడు కాలం."

"నేను విన్నదదికాదు" అన్నాడు ఇవాన్ ముక్త సరిగా, "భార్యా భర్త లిద్దరూ యెవరిదారిని వారుంటే, వొకళ్లంటే వొకళ్లకి విసుగుపుట్టకుండా వుంటుందట."

"సరే. ఇవ్వాళ రాత్రికేంజేస్తారు మీరు ?"

"ఇందాక నేచెప్పేగా పనుంది చేసుకోవాలని. ఇవ్వాళ్టి అనుభవాల దృష్ట్యా కొన్ని నిర్ణయాలు చేసుకోవాలి."

"మీ థీసిస్ ప్రారంభించారా ?"

"లేదు. ఇంకా ప్రారంభించలేదు. ఊరికే లెక్కల్నిబట్టి పరిశోధన ప్రారంభించాలంటే ప్రారంభించొచ్చును. కాని అందుకీ హాస్పిటల్ లెక్కలు సరిపోవు. రోగుల్ని చూచి నిర్ణయాలు చెయ్యడం ప్రారంభిస్తే ఆ నిర్ణయాలు సరిగా వుండవు.

నేనొక పదిమంది రోగుల్ని చూచి ఒక నిర్ణయాని కొచ్చానను కోండి. ఇంకొకాయన యిరవై మందిని చూచి యింకొక నిర్ణయాని కొస్తాడు. మా యిద్దరి నిర్ణయాలూ ఒకేమాదిరిగా వుండవు. మాస్కో వెళ్ళి అక్కడ పరిశోధన సాగించాలని నేననుకునేది అందువల్లనే. అక్కడ వొక వైపున రోగుల్ని పరీక్షించొచ్చును. లెబొరేటరీలో ప్రయోగాలు చేసీ చూడొచ్చును. ఇక్కడా అవకాశం లేదే మరి."

"సరే. ఆ పరిశోధనలు చేసి థీసెస్ వ్రాసింతర్వాత యేంచేదామని? యూనివర్సిటీలో లెక్చరర్ గా చేరదామనా?"

"బహుశా. కాని అన్నిటికంటే, పడకమీదున్న రోగుల్ని చూచి పరిశోధన చెయ్యడమంటే బాగా యిష్టం నాకు. ఈ రోజుల్లో క్లినికల్ రీసెర్చ్ అవసరంగూడా వుంది. ఒక పరిశోధనని గురించి నలుగురికీ తెలియజెప్పాలంటే, ఒక్కో సమస్యని తీసుకుని, ఆ సమస్యని విశాల ప్రాతిపదికమీద పరిష్కరించగలిగి వుండాలి. నాకొక సైంటిఫిక్ డిగ్రీ వచ్చింది అంటే, ఆ ప్రత్యేక సమస్యకి సంబంధించినంతవరకు మంచి నిపుణుడినై వుండాలి నేను. ఆ సమస్యని పరిష్కరించడాని కెప్పటికప్పుడు నూతన మార్గాల్ని అన్వేషించుతూ వుండాలి. లేకపోతే నేనూ మిగతా వాళ్ళలాగానే వైద్యశాస్త్రాన్ని విస్తృతం చెయ్యలేని వాళ్ళలో ఒకడిగా జమౌతాను. నేను చెప్పేది అర్థమైందా మీకు? వైద్యశాస్త్రంలో ఏ విభాగమైనా సరే, తీసుకోండి. ఉదాహరణకి నేత్ర వైద్యం తీసుకోండి. ప్రతీ దేశంలోనూ వందల కొద్దీ వున్నారు నేత్రవైద్యులు. రోజిడిచి రోజు వుపన్యాసా లిస్తుంటారు. నేత్రవ్యాధులకి మందు లిస్తుంటారు. ఇంతలో, ఎవరో వొకమూలన యేదో కొత్త విషయం కనిపెడతారు;

ఆ నేత్రవైద్యంలో విప్లవం వచ్చినంత పనౌతుంది. మన సోవియెట్ నేత్రవైద్యుడు, వ్లాదిమిర్ పెత్రోవిచ్ ఫిలతోవ్, అలాంటివాడు. చెడిపోయిన కన్నుకు బదులు కొత్తకన్నును పెట్టి, దృష్టి తిరిగొచ్చేట్టు చెయ్యగలుగుతున్నాడు.

"ఔనౌను. నేనూ విన్నా నాయన్ని గురించి" అన్నాడు లొగునోవ్.

"చూశారా! ఆ వైద్యశాస్త్రంతో ఏమీ సంబంధం లేని మీరుగూడా విన్నారాయన పేరు. వైద్య శాస్త్రంలో అతి ప్రముఖ వ్యక్తుల్లో ఒకరు ఆయన. అలాంటి వ్యక్తి విలువని గురించి వూహించగలరా మీరు! ఆ పద్ధతి నవలంబించేందుకు అంతులేని ప్రయోగాలు చేశాడు. ఆ శస్త్ర చికిత్స చేసేందుకు జీవితంలో సగం భాగం వెచ్చించాడు."

"మీరు న్యూరో సర్జరీలో కొత్త విషయాలు కనిపెట్టా లనుకుంటున్నారా?"

"కనిపెట్టాలనే, కోరిక. కాని యింకా యెంతో ప్రయత్నం జెయ్యాలి; ఎన్నో అవరోధాలు దాటాలి...."

"మీరా శాఖనే ఎందుకెన్నుకున్నారు?"

"ఒకటి: అదొక నూతనశాఖ. ఆశాఖ ఇంకా అభివృద్ధి కావలసివుంది. రెండు: దైనందిన జీవితంలో దాని అవసరమూ ప్రాముఖ్యమూ యింతింత కాదు. ఉపరిభాగ నాడీ శస్త్ర చికిత్స ముందు ముందింకా బాగా అవసరమౌతుంది. ఈసారొచ్చే యుద్ధం పూర్వపు యుద్ధాల్లావుండదు. అతిరాక్షసంగా వుంటుంది. అప్పుడీ శాస్త్రం చాలా వుపయోగిస్తుంది మానవుల్ని రక్షించడానికి."

"నిజమే. చాలా రాక్షసంగా వుంటుంది" అన్నాడు లొగునోవ్ ఆలోచిస్తూ, "జెర్మన్లు 147 బ్రిటిష్ విమానాల్ని పడగొట్టారట; రేడియో వార్త. ఇక వాళ్లు మన మీదికి తిరిగితే మరింత ప్రమాదంగా వుంటుంది. చావుతో తిరగబడి పోట్లాడాల్సి వుంటుంది. ఐతే, మీ న్యూరో సర్జరీ ప్రారంభమై యెంతకాలమైంది?"

"ఈ మధ్యనే. పదిహేనేళ్లౌతుందేమో, బాగా ఐతే."

"ఎవరికీ పదిహేనేళ్లు?" అంటూ లోపలికొచ్చింది వార్యా.

"నేనూ, లొగునోవ్, న్యూరో సర్జరీని గురించి మాట్లాడుకుంటున్నాం" అన్నాడు ఇవాన్, వార్యా వంక ఆప్యాయంగా చూస్తూ.

"ఏం, ఎవరైనా స్త్రీని గురించి మాట్లాడుతున్నామనుకున్నావా?" అనడిగాడు లొగునోవ్, నవ్వుతూ.

"నేనదేమీ అనుకోలేదులే" అంది వార్యా; అప్పుడే పరుగెత్తుకొచ్చినట్టు గాలి త్వరత్వరగా పీలుస్తోంది. ఊరికే యిలా వస్తే, యెవరో మాట్లాడుతున్నట్టుండి, చూద్దామని వచ్చాను. ఇప్పుడే కామ్సొమోల్ బ్యూరో సమావేశానికెళ్ళి వొస్తున్నా. డాన్స్‌కి రమ్మని ఆహ్వానం వచ్చిందిగాని, పని వుందని వెళ్ళలేదు"

"ఎవరాహ్వానించారు?"

"పావా."

"ఇప్పుడైనా వెళ్లొచ్చు; వెళ్లు. మాంచి రసకందాయంలో వుండుంటుందిప్పుడు" అన్నాడు ఇవాన్, వెక్కిరింతగా.

"ఆఁ, యేమీలేదు....వూరికే....ఎందుకొచ్చిన ముసుగులో గుద్దులాట కాని, నాకావిడంటే పడదు." అందివార్యా

ప్రత్యేకంగా, ఎప్పుడు చూచినా క్లబ్బులోనే వుంటుంది. క్లబ్బు పనిమట్టుకు బాగానే చేస్తుంది కాని, ఐనా ఆవిడంటే నాకిష్టం వుండదు. ఎంతసేపూ తనసంతోషమే తప్ప, యితరుల్ని గురించ సలు పట్టించుకోనే పట్టించుకోదు. 'గాలికి పుట్టినబిడ్డ!'ట! 'గాలికి పుట్టిన బిడ్డ' అంది ఎద్దేవగా; నేనేదో వింతజంతువు నైనట్టు చూస్తుంది నాపంక. 'యకూత్ పిల్లవి, ఫ్లాబర్ట్ రచనలుగూడా చదివేస్తున్నావే' అంటుంది నన్ను. అందులో యేదో గొప్పున్నట్టు! ఏం, యకూత్‌లు చదువుకోడం విడ్డూరమా? జార్ చక్రవర్తులు యింతకాలం మమ్మల్ని కాలికింద చెప్పులికి మళ్లే చూస్తే, అది మాతప్పా?" అనడిగింది వార్యా; "డాక్టర్ ఇవాన్! మా యకూత్ విద్యార్థులికీ, రోగులికీ మీరంటే యెంతఇష్టమో తెలుసా మీకు? అంతఇష్టం యెందుకో మీరెరుగుదురా? ఏమీలేదు. మీరేపనిచేసినా, మీ స్వార్థంకోసం చెయ్యరు; అందుకని. చివరికి వైద్యశాస్త్రం కోసమని గూడా చెయ్యరు. ప్రజలకోసమని చేస్తారు. ఆ ప్రజలు యెవరూ అనిగూడా మీ రాలోచించరు. వెనకబడిన యకూత్ జాతివారేగదా అని నిర్లక్ష్యం చెయ్యరు. అందుకని మీరంటే అంత యిష్టం. అందుకనీ, మీరంటే మావాళ్ళ కంతప్రేమ."

"మరీ అంత యెదటబడి ముఖస్తుతి చెయ్యగూడదు మీ పై అధికారిని!" అంటూ మందలించాడు ఇవాన్; "మనందరంకలిసి పనిచేస్తున్నాం. వైద్యశాస్త్రాన్ని అభివృద్ధి చేసేది ప్రజలు; ప్రజలకోసం అభివృద్ధి ఔతుందాశాస్త్రం. పావావుద్దేశం వేరైతే కావచ్చు; అందులో అసహజమూ యేమీలేదు. ఆవిడ తరహాయే అంత; దమ్మిడీ యెత్తు పనిచెయ్యదు కాబట్టి."

"నేనలా వెళ్ళి, కామ్సొమోల్ సమావేశాన్ని గురించి విద్యార్థులికి చెప్పిరావాలి" అంది వార్యా, లొగునోవ్‌తో. ఇవాన్ వెళ్ళిపోయాడు. ఇప్పుడు లొగునోవ్, వార్యా లిద్దరే వున్నారు వొంటరిగా.

"ఐతే నేనూ వస్తాను హాస్టల్ దాకా" అన్నాడు లొగునోవ్.

"అక్కర్లేదక్కర్లేదు. బాగా దగ్గిరేగా" అంది వార్యా, "ఐనా, పొద్దుపోతే యెవరో వొకరొస్తారు జతగా; యకూత్ విద్యార్థిని వెంటబెట్టు కెళ్తాను."

"మరీ అంత జాతీయాభిమానం పనికిరాదు" అన్నాడు లొగునోవ్, వుడికిలిస్తూ. "దేన్నిగురించీ, మీ సమావేశం?" ఆ నల్లటి కళ్ళల్లోకి, ఆ పసిముహంలోకీ చూస్తూ ప్రక్కప్రక్కనే నడుస్తున్నాడు.

"ఇంకా పసిపిల్లే" అనుకున్నాడు లోపల. ఇంతలో యింతకు పూర్వం ఇవాన్‌తో మాట్లాడుతున్నప్పటి దృశ్యం గుర్తుకొచ్చింది. ఇవాన్‌తో మాట్లాడుతున్నప్పు డావిడ ముఖం పెరిగిన స్త్రీ ముహంలా వుంది; ప్రేమిస్తూన్న స్త్రీలా వుంది. ఈ వార్యాఅంటే పావాకి గూడా యిష్టమేనని తెలుసు లొగునోవ్‌కి. మరి వార్యాకంతకోపం యెందుకు పావా అంటే. పెద్దకారణం యేమీ లేదు. పావాకీ ఇవాన్‌కీ పడదు. ఇవాన్ కిష్టంలేని వ్యక్తులంటే వార్యాకీ యిష్టం వుండదు; అంతే. అంత కంటే పెద్దకారణం యేమీలేదు. 'నీ శత్రులు, నా శత్రులు' అని వార్యా భావం.

"ఇవాన్‌ని ప్రేమించడం లేదుగదా వార్యా ?" అనుకున్నాడు లోగునోవ్. బహుశా అలా ప్రేమించడం గూడా సహజమేనేమో. యౌవనం, భావనా బలం, కృతజ్ఞతా భావం, గౌరవాదరాలు....మిగతా విద్యార్థులకి లాగానే యీవిడకీ ఆయనలో తన ఆదర్శాల ప్రతిబింబం కన్పిస్తూందేమో."

"ఇకెళ్లొస్తాను."

"మంచిది" అంటూ కరస్పర్శ చేస్తూన్న చేతిని మృదువుగా నొక్కాడు; ఆ చేతిని వదలకుండా, అలాగే పట్టుకుని నిలబడిపోయాడు. "ఇదివరకింత మర్యాద చూపించేదానివి కాదు నేనంటే. ఎంతో స్వతంత్రంగా వుండేదానివి."

"అలాగా ?" అని దయగా చూసినట్టు చూచింది వార్యా, "ఇప్పు డిదివరకటిలా కాదుగదా మీరు; ప్రముఖ పదవిని నిర్వహిస్తున్నారు...."

"వార్యా !" అని మాత్రం అనగలిగాడు; తర్వాత కాస్సేపేమీ మాట్లాడలేక పోయాడు; "ఎప్పుడూ వొంటరిగా వున్నట్టే అనిపించిందా నీకు ? చెప్పవూ."

"నేనొంటరిగా యెప్పుడూ వుండను. ఎప్పుడూ యెవరితో వొకరితో వుంటూనే వుంటాను."

"అందరికంటేనూ నీకెక్కువిష్టమైన వ్యక్తి....యితరులందరికంటే కాస్త యెక్కువ తరచుగా నీ జ్ఞాపకాల్లో మెదిలే వ్యక్తి, యెవరో వొకరుండాలి గదా...."

"వుండేవుండాలి" అన్నది వార్యా ఒక క్షణం ఆగి. ఆవిడముఖంలో యేదో వింత కాంతి కన్పించింది.

"ఐతే, ఆ అదృష్టవంతుడెవరు ?"

"ఎవరైతే నేం!" అంది వార్యా, ఎదురుతిరిగి మాట్లాడు తున్నట్టు, "నేను పదేపదే ఆలోచించినంత మాత్రాన ఆయన కదనంగా కలిగే ఆనందమంటూ యేమీ వుండదు."

మళ్ళీ ఒకసారి గట్టిగా నొక్కాడు లోగునోవ్ ఆవిడ హస్తాన్ని; తన్ను బాధపెట్టినందుకు బదులుగా ఆవిణ్ణిగూడా బాధపెట్ట తలచినట్టు. వార్యా యేమీ అనలేదు. కావాలని గూడితో గుచ్చుకున్న వార్యా గుర్తుకొచ్చిం దతనికి.

పట్టువదలి, అలాగే నుంచున్నాడు ఆచేయలాగే తన అరచేతిలో వుంచుకుని. గాయపడినపక్షిలావుంది ఆవిడ అరచేయి తన అరచేతిలో, కదలకుండా మెదలకుండా. సిగ్గేసిందతనికి. గభాల్నవంగి, చేతిలోవున్న చేతిని ముద్దుపెట్టుకున్నాడు.

చాలసేపలాగే నిలబడి పోయాడు వార్యా లోపలికెళ్ళిన గుమ్మంవంకచూస్తూ. ఇంకా ఆచేతి నునువెచ్చదనం ఆ పెదవుల మీదలాగేవుంది. ఇంతవర కతను యే స్త్రీచేతినీ ముద్దుపెట్టుకో లేదు; ఇతరులలా ముద్దెందుకు పెట్టుకుంటారో అర్థంచేసుకోనూ లేదు. అదంతా యేదో అర్థంలేని సాంప్రదాయం అనుకునే వాడు. కాని యిప్పుడు తెలిసొచ్చింది: ఆముద్దాడడంలోవున్న దివ్యానుభవం యేమిటో అతనిహృదయం అప్పుడతనికి తెలియ జెప్పింది. ఆ దివ్యానుభవాన్నింకా ఆ పెదవుల మీ దలాగే పదిలపరచుకుని వూరంతా తిరిగాడు. ఇప్పుడే గనుక వార్యా తన ప్రక్కనవుంటే....ఎన్నెన్ని తీయని మాటలు చెప్పేవాడో. యింతవరకా మాటలేమిటో గూడా తెలియవతనికి; కాని ఇప్పుడు.... సెలయేటి ప్రవాహంలా వచ్చి పడుతున్నై పెదవుల మీదుగా!

"మరీ, యేమిటీ పిచ్చి ఆలోచనలు లొగునోవ్!" అని చెప్పుకున్నాడు తనకుతానే; "ఈకొంత్రపదవితో కొత్త ఖారం వచ్చిపడింది నీ నెత్తిమీద. ఇప్పుడీతరుల్ని గురించి ఆలోచించాలి నువ్వు. ఆవిడ ఇవాన్ని ప్రేమిస్తే మాత్రమేం? 'బుద్ధి లేకపోతే సరి!'" అనుకున్నాడు డెనిస్ మాటలు గుర్తుకొచ్చి.

డెనిస్ సంగతి గుర్తుకొచ్చి, అక్కడికెళ్దామనుకున్నాడు. వార్యా గూడా వుండేది అక్కడే. అక్కడికెళ్తే స్వంత యింటి కెళ్ళినట్టే వుంటుంది.

చేతి గడియారంతీసి, కళ్ళముందు పెట్టుకుని. "అప్పుడే నిద్రపోయుండరు బహుశా" అనుకున్నాడు.

ఆగస్టుమాసం వెళ్ళిపోవచ్చింది. రాత్రుళ్ళు బాగా చీకటిగా వుంటున్నై.

"అదే పాతకథ" అనుకున్నాడు విచారంగా, ఆ నీలాకాశంక్రింద నిలబడి; "మినుకు మినుకు మనే చుక్కలు విహాహం కాని పడుచు పిల్లల నిట్టూర్పులు. విఫల ప్రేమజీవుల విచారం. మళ్లీ చందమామ కన్పిస్తాడు ఆకాశంలో; ఆ చందమామని చూచి కుక్కలు మొరగడం ప్రారంభిస్తాయి. ఈప్రాంతపు కుక్కలు తోడేళ్లలా వుంటై." చిరునవ్వు నవ్వుకున్నాడు విషాదంగా; అంత గట్టిగుండే నీరుకారినట్లయ్యింది. కాని ఏమనుకున్నా ప్రయోజనంలేదు; ప్రయోజనంలేదని తెలుసుకుని, జరగవలసిందేదో జరక్క తప్పదు అనుకున్నాడు. అదిగూడా తెలిసి నవ్వుకున్నవ్వు మరింత విషాదంగావుంది.

డెనిస్ యింటి దగ్గర కొచ్చాడు లొగునోవ్; కిటికీదగ్గర ఇవాన్ కన్పించాడు. ఇప్పుడితను తనకు ప్రత్యర్థి. తనభాగంలోనే వున్నాడుగదా అని సంతోషించాడు లొగునోవ్.

కిటికీమీది కొంగి, బయటికి చూస్తున్నాడు డాక్టర్ ఇవాన్. లోగునోవ్ నడక తగ్గించాడు; ప్రక్కనున్న పొదల చాటు కెళ్లాడు. ఇవాన్నిచూస్తే అసలీ ప్రపంచంలోనేవున్నట్టు లేడు. ఒకటి రెండు నిమిషాలలా పొదల చాటునే నిలబడి పోయాడు లోగునోవ్. పిలవడానికి ధైర్యం చాలలేదు. డాక్టర్ని చూస్తే అసూయా కలిగింది; సద్భావమూ కలిగింది.

"అయ్యో, భగవంతుడా!" అన్నాడు ఇవాన్‌వున్నట్టుండి. ఆ వొక్క మాటలో అతని హృదయంలోవున్న వేదనంతా వెల్లువికి బయటబడినట్టుంది. లోగునోవ్ వొళ్ళు జలదరించింది; వెనక్కితిరిగాడు.

"ఐతే నేనూహించింది అబద్ధం కాదన్నమాట," అనుకున్నాడు లోగునోవ్ వెనక్కి తిరిగి వెళ్లిపోతూ, "మొత్తం మీదేదోవుంది; చాల బాధపడిపోతున్నాడు మనిషి."

# 67

డెనిస్ కుర్చీలో కూర్చునున్నాడు కాళ్ళకిస్లిప్పర్లేసుకుని. పత్రిక చదువుకుంటున్నాడు. ఎలీనా కుట్టుపని చేసుకుంటోంది.

"వార్యా యింకారాలేదు" అన్నాడు డెనిస్, పత్రిక మీంచి తలపైకెత్తి.

"రాలేదని నాకూ తెలుసు" అన్నాడు లోగునోవ్, ఇల్లంతా కలయజూస్తూ. ఏమీతోచనప్పు డెన్నిసార్లో వచ్చాడిక్కడికి కాలం హాయిగా గడుస్తుందని.

పిల్లలందరూ నిద్రపోయారు. వాళ్ళ ఉచ్ఛ్వాసనిశ్వాసాలన్నీ సమంగా విన్పిస్తున్నాయి. ఆరిపోయిన పొయ్యి దగ్గర్నుంచి

యింకా కొద్ది వెచ్చదనం వస్తోంది. ఇంట్లో వంటకాలవాసన వేస్తోందింకా. ఆ వాసనకంటే యెక్కువగా, కిటికీలోంచి పూల వాసనొస్తోంది. మంచుపడితే ఆపూలు పాడైపోతాయని, మొక్కలు పెల్లగించి, కుండీల్లో పెట్టి, కిటికీల కెక్కించారు.

"మీ గుమ్మడికాయ లెలావున్నై ?" అనడిగాడు లోగునోవ్.

"బాగానే వున్నై; ఇంకా పెరుగుతున్నై" అన్నాడు డెనిస్, భార్యవైపు చూస్తూ.

"పెరక్కేం ? బలే బాగా పెరుగుతున్నై" అంది ఎలీనా నవ్వుతూ, "ఇంకా క్రిస్టమస్ రాలేదుగా. చాలా ఆలస్యం వుంది. అప్పటికి తయారౌతై. ఎందుకూ, ఆచాపల్తో కప్పడం ఆపేసి, యే వున్నికోటులో పట్టుకొచ్చి కప్పితే బాగుండును. డెనిస్ ! యెందుకట్లా కోతలు కోస్తావ్ ? అసలక్కడ గుమ్మడికాయ వాసనైనా లేందే !"

"ఆగు. అవే కన్పిస్తై !"

"ఇంకా యెప్పుడూ కన్పించేది ? పువ్వులన్నీ కోసి అవతల పారేస్తే యింకా యెక్కణ్ణుంచి వస్తై కాయలు ? మీ ఆశేగాని !"

"ఇదొక కుటుంబ కలహం!" అనుకున్నాడు లోగునోవ్, వాళ్ళ మాటలు వింటూ.

"అసలు వాటిని సరిగ్గా నాటలేదనుకుంటా నేను. పుస్తకంలో వుందిగదా అని గొయ్యి తీసి గోతిలో వేశా యెరువు; అట్లా చెయ్యకుండా మొక్క కుదురుచుట్టూ పేరిస్తే పొయ్యేదేమో. పెరగవలసిందే మరి...." అన్నాడు డెనిస్.

"ఎవరికైనా చెప్పొచ్చుగాని, మీకు మట్టుకు నచ్చజెప్ప లేం" అంది ఎలీనా, కుట్టుపనిముట్లన్నీ ఒకచోట పెడుతూ. "ఇవ్వాళ చేసిన అజామ్ కాస్తతిని, టీ తీసుకుందాం, పట్టండి. ఇవ్వాళ మా వార్డులో ఒక పడుచుపిల్ల మహా బాధపడింది. ఆవిడ భర్తేమో పనిమీద పట్టణం వెళ్లాడట; ఇకిక్కడా అమ్మా యికిక బంధువులెవరూ లేరట మిగతా వాళ్ళందరికీ యెవళ్లో వొకళ్లు యేదో వొకటి తెచ్చిపెడుతున్నారు, నాకు తెచ్చిపెట్టే వాళ్లెవళ్లూ లేరని బాధపడింది. అలాగా అనుకుని, యింటి కొచ్చి కాస్త జామ్ చేసి పట్టుకెళ్ళి యిచ్చొచ్చా. ఆయమ్మాయి పనిజేస్తున్న ఫ్యాక్టరీలో వాళ్లు పట్టుకొచ్చిచ్చారని చెప్పా."

"పోనీ, నువ్వే చేశానని చెప్పకపోయావా?"

"నన్ను రోజూ చూస్తూనే వుంటుందిగా. ఇట్లా చెప్పితే బాగుంటుందని యిట్లాగే చెప్పా."

"మీరోగులంటే బాగా యిష్టమా మీకు?" అనడిగాడు లొగునోవ్, ఇవాన్‌తో వార్యా అన్నమాటలు తలచుకొని.

"ఎందుకిష్టం వుండదు. చచ్చేంత యిష్టం. వాళ్ళందరూ పిల్లల్ని కనేందు కొచ్చేతల్లులు."

"వాళ్లూ బాగానే వుంటారా మీరంటే?" అనడిగాడు లొగునోవ్. ఎలీనా పనిజేస్తూనే మాట్లాడుతూంటుంది; మాట్లాడుతూనే పనిజేస్తూంటుంది; అలా చూస్తూ కూర్చోవడ మంటే లొగునోవ్‌కి అమితయిష్టం.

"వాళ్ళకా? నేనంటేనా?" అంటూ ఒక్క క్షణం ఆగింది ఎలీనా, రొట్టెను కోస్తూన్నదల్లా ఒక్క సెకను సేపు కత్తలా పైకెత్తి; "బాగానే వుంటారు కాని తర్వాత

వెంటనే మరిచిపోతారు. అంతా సవ్యంగా జరిగి యింటికి వెళ్ళిపోవడం అంటే బాగానే సంతోషిస్తారు. అదీ సహజమే. నొప్పితో బాధపడుతున్నంత సేపూ, వాళ్ళకి స్పృహ వుండదు; ఆ నొప్పితోనే సతమతమవ్వడం సరిపోతుంది. ఆ నొప్పి కాస్తా తగ్గింతర్వాత, బిడ్డ! ఆ బిడ్డని చూసుకుని మురిసిపోవడంతోనే సరిపోతుంది." ఏ విధమైన కష్టం పడుతున్నట్టూ లేకుండా, లోకంరీతే యింత అన్నట్టు ఎలీనా అలా మాట్లాడుతుంటే ఆశ్చర్యం వేసింది లొగునోవ్‌కి.

"ఐతే, యిక మీ కాపనంటే సంతృప్తిగాని, సంతోషం గాని యేముంటుంది?"

"ఓ. కావలసినంత" అంది ఎలీనా విసురుగా, "ఐనా, యేమిటీ యివ్వాళ మీరిట్లా ప్రశ్న లేస్తున్నారు అదే పనిగా? మిమ్మల్ని గూడా కోసెయ్యాలేంవిటి, యీరొట్టిని కోస్తున్నట్టు?"

"మీ యిష్టం; కానీండి!" అన్నాడు లొగునోవ్, నవ్వుతూ "ఏమీలేదు, మీపనంటే మీకు యిష్టంగా వుందో లేదో తెలుసుకుందామని...."

"ఆహా! మీకా కష్టమేమీ అవసరంలేదు. నా పనికంటే యింకా నాకావలసిందే ముంటుంది? పని చేస్తున్నానుగదా అని అందరూ వచ్చి నాకు ధన్యవాదాలు చెప్పడం యెందుకు?"

"మరి యింటిదగ్గర?"

"ఇంటి దగ్గరకూడా అంతే. ఒకమనిషి కేదైనా సాయం చేస్తే, యికా విషయం అతని కెప్పుడూ గుర్తుచెయ్యను నేను. మనం యేదో మేలుచేసినట్టు కనబడితే, అవతలివాళ్ళకది యిర కాటంగా వుంటుంది. ఈభావాన్ని సాధ్యమైనంత త్వరగా

తొలగించుకోడానికిగ్గాను కొంతమంది మంచివాళ్ళు వెంటనే ధన్యవాదా లర్పించేస్తారు. ఇంకా కొంతమంది నువ్వువాళ్ళకి బంగారపు గనియిచ్చేసినా సరే, 'మనకివ్వాలికాబట్టి యిచ్చారు, యిందులో గొప్పేముంది!' అనుకుంటారు. ఇంకా కొంతమం దుంటారు; వాళ్ల కెంతమేలుచేస్తే అంతా కీడుచేసినట్టే. మేలు చేసిన వాళ్ళని పరమ శత్రువులుగా చూస్తారు వాళ్లు."

"మీమాటలు చూస్తే, లోకంలో వున్నవాళ్ళంతా చెడ్డ వాళ్ళే నన్నట్టుంది" అన్నాడు లొగునోవ్.

"అంతతేలిగ్గా నిర్ణయాలు చేసెయ్యబాకండి మరి" అంది ఎలీనా, "మనుషులంతా చెడ్డవాళ్ళనుకుంటే, నావృత్తేసాగదు; నేనీపనే చెయ్యలేను. అదికాదు; నేననేది మనుషులంతా చెడ్డ వాళ్ళనికాదు. ప్రజల్లో సమానత్వం లేనప్పు డొస్తుంది యీ కృతజ్ఞతాభావం అనంటున్నా. మన జీవితాల్లోకి మరింత న్యాయాన్నీ, మరింత సమతాభావాన్నీ చొప్పించగలిగిన నాడు, యీ కృతజ్ఞతాభావం లేకుండా పోతుంది; చేసిన మేలుగూడా రుణమే అన్న ఆలోచన రాకుండాపోతుంది. అదీ నేననేది."

"ఐతే మరి, ఇవాన్ ఇవానోవిచ్ విషయంలోగూడా అంతేనా?" అని అడిగేశాడు లొగునోవ్.

"ఇవాన్ ఇవానొవిచ్ సంగతివేరు" అన్నాడు డెనిస్. పత్రిక జాగ్రత్తగా మడిచి, దూరంగాపెట్టి. "ఆయన ప్రజలకి చేస్తున్నమేలు యింతింతకాదు. సోవియెట్ డాక్టర్ కావడం మూలాన్న, పెద్ద సర్జెన్నిగదాన్న సంతృప్తి లేదాయనకి. ఒక ఆపరేషన్ బాగా జరిగింది గదాని వూరుకోడు. ఆ ఆప రేషనైం తర్వాతగూడా రోగి పరిస్థితి యెలావుందో తెలుసు

కోవాలని తహతహలాడ్డాడు. మళ్ళీ పూర్వంలా పనిచెయ్య గలుగుతున్నాడా, లేదా? అనీ; అతని బంధువులతన్ని సరిగ్గా చూస్తున్నారా, లేదా? అనీ; యీ ఆపరేషన్‌వల్ల వికలాంగా ళ్లాంటి వేర్పడి అతని జీవితానికేమీ యిబ్బంది కలగదుగదా! అనీ; ఇవే ఆలోచన లాయనికి. 'భలేమంచి కేసు!' అంటూంటా డాయన, తరుచు. జబ్బుకి 'భలేమంచి' యేముంటుంది?"

"అంటే, బహుశా వైద్యశాస్త్రందృష్ట్యా కావొచ్చు."

"ఔను. సరిగ్గా అదే. అలాంటూపరేష నొచ్చినప్పుడు చాలా హుషారుగా వుంటాడు. ఆయన రోగులూ అంతే. వైద్య శాస్త్రానికి కొత్త అధ్యాయాలు చేర్చడంలో తామూ సాయ పడినట్టు సంతృప్తి పడతారు. గొప్పగాగూడా చెప్పుకుంటారు. వీలుదొరికితే చాలు, వాళ్లందరూ డాక్టర్ ఇవాన్‌ని ఆకాశాని కెత్తి మరీ మాట్లాడతారు. కాని రోజువారీ జరిగే చిన్నచిన్న విషయాలకి సంబంధించినంత మట్టుకు, ఎలీనా చెప్పేది నిజమే. నావుద్దేశమూ అంతే." అని, సగర్వంగా భార్యవంక చూశాడు డెనిస్.

వార్యా చూపిన వుత్సాహానికీ, డెనిస్ చెప్పిన మాటలకీ భేదం యేమీలేదు. వార్యాకీ, డెనిస్‌కీ, ఇవాన్ అంటే వున్నంత గౌరవం లొగునోవ్‌కీవుంది.

"అదినిజమే కాని, మీరన్న యితర విషయాలతో ఏకీభ వించలేను" అన్నాడు లొగునోవ్, తన ఆలోచనల నొక క్రమపద్ధతిలో పెట్టుకుంటూ; "కృతజ్ఞతాభావంకంటే గూడా, మనం యిలా ఆధారపడి వున్నామే అన్న భావం యెక్కువగా కుంగదీస్తుంది ప్రజల్ని. మన సమాజంలో నిజాయితీకి, విశ్వా

సానికీ వున్న స్థానాన్నే యీ కృతజ్ఞతా భావానికి గూడా యివ్వాలి. ఎందుకనంటే, మనందరం శ్రమజీవులం; కష్టపడి పనిచేసే వాళ్లం. ఒక వ్యక్తి కింకొకవ్యక్తి చేసేసహాయం బిక్షం రూపంలోనో, దానం రూపంలోనో వుండదు, వుండగూడదు. తాను కష్టపడి పనిచేస్తూ, కష్టపడి పనిచేస్తూవుండే యితరుల్ని గౌరవించడం నేర్చుకున్న మనిషి, అవసరం వచ్చినప్పు డెవరైనా తనకు సస్నేహంగా సాయంచేస్తే, కృతజ్ఞుడు కాకుండా యెలా వుండగలడు? అంతేకాదు; ఫాక్టరీలో శరీరశ్రమని తగ్గించే సాధనాన్ని ఒకరు కనిపెట్టారనుకోండి; లేక మనస్సు నాహ్లాదపరిచే కళాఖండాన్నెవరో సృష్టించారనుకోండి. మనకా కృతజ్ఞతాభావం కలిగి తీరుతుంది. మన సమాజం వృద్ధిపొందిన కొద్దీ, యీకృతజ్ఞతకున్న అర్థంగూడా విస్తృతమౌతుంది. ఎందుకనంటే అప్పుడు మనం మన పక్కనున్న మనుషులంటే మరింత శ్రద్ధ చూపించేందుకు అవకాశం కలుగుతుంది. అప్పుడీ కృతజ్ఞతాభావం, 'రుణ పడ్డాం' అన్నట్లుండదు; స్నేహాన్ని పెంపొందించేందుకూ, అనురక్తిని అభివృద్ధిచేసేందుకూ, పరస్పర విశ్వాసాన్ని మరింత గట్టి పరచేందుకూ, పరస్పర ప్రేమాదరాలు మరింతవిశాలమైన పునాదిమీద బలవత్తర మయ్యేందుకూ వుపయోగిస్తుంది; తనకంటె బలహీనమైన వ్యక్తిని ఉత్సాహపరచి, అభివృద్ధి చేసేందుకు ఎవరికి తాహతున్నంతవరకు వారు కృషిచెయ్యడానికి వుపకరిస్తుంది. సమిష్టి కృషిఅంటే అదే."

"నిజం, నిజం." అన్నాడు డెనిస్ ఉత్సాహంగా, "కొస కంటా లాగితే, యేదైనా తెగిపోతుంది. చిన్నప్పుడు నేను అందర్నీ నమ్మేసేవాణ్ణి తెలివితక్కువగా. అట్లా యెంతడబ్బు పోగొట్టుకున్నానో లెక్కలేదు! ఎలీనా నడగండి, చెబుతుంది.

నాదగ్గర డబ్బు చేచాలు, ఎవరన్నా అప్పడగడానికొస్తే లేదన లేక పోయేవాణ్ణి. తర్వాత 'అబ్బాయి, నువ్వునాకప్పున్నావ్' అని చెప్పడానికిగూడ అంత మొహమాటమూ పడేవాణ్ణి మళ్లీ. ఇం కేముంది. అట్లాగే ఒకడి తర్వా తొకడు చొప్పున నాస్నే హితుల్నందర్నీ పోగొట్టు కున్నాను. ఆ అనుభవాన్నిబట్టి అన్నాను యిందాకన్న మాటలు. అనుభవాన్నిబట్టి నిజమనే అనిపించింది, కాని హృదయంతోఆలోచిస్తే తప్పనే తెల్తోంది."

# 68

పావా యింటికెళ్లిన అతిథులెవరికీ బెరుకుగాని, బిడియం గాని, కొత్త కొత్తగాగాని వుండేదికాదు; వచ్చినవాళ్ళని వాళ్ల దారిని వాళ్ళని ఆనందించుకోమని వదిలేసేదేతప్ప, తానేమీ జోక్యం కలుగజేసుకునేదిగాదు పావా.

"ఇల్లంతా శుభ్రంగా, హాయిగా, చూడ ముచ్చటగా వుండేట్టు చూడడం నావంతు; బల్లమీద కావలసినంత తిండి వుండేట్టు చూడడం నావంతు; వచ్చింతర్వాత హుషారుగా యెలా గడపడం అన్నది వచ్చినవాళ్ళకే వదిలేస్తాను." అనేది పావా, స్నేహితుల్తో.

భోజనాలదగ్గర కూర్చున్నప్పుడు గూడా మీరిది రుచి చూడండి, అది తినిచూడండి అంటూ ఎవరినీ, ఏమీ బలవంతం చేసేదికాదు. తానుమట్టు కేదీ వదలిపెట్టకుండా అన్నీ రుచి చూచేది. అతిథులూ అంతే. ఎవరికందింది వారు కన్నుమూసి తెరచేప్పటికి పూర్తిచేసేసేవారు.

"ఒకి బోహీమియన్లు!" అంది ఎలీనా, ఒకసారిలాగే పావాంగారింటిదగ్గర పార్టీ కెళ్ళి. ఒకటే గొడవ; డాన్సులు, పాటలు, మాటలు; ఎవరేమంటున్నారో ఎవరికీ విన్పించదు. అంతా చేపలబజారులాగుంటుంది. గౌరవస్థుల యిల్లులాగానే వుండదు.

అలాంటి పార్టీలో కొచ్చిపడింది ఓల్గా. అందరూ వొకే సారి మాట్లాడు తున్నారు. గ్రామఫోన్‌నుంచో, రేడియో నించో, పియానోనించో సంగీతం కట్టలుతెగి ప్రవహిస్తూనే వుంది నిరంతరాయంగా. తావ్‌రోవ్ ప్రక్కనే కూర్చుంది ఓల్గా, తల పైకెత్తి, కనులు కుంచించి, అతను చెప్పిందెంతో అతి జాగ్రత్తగా వింటూ. ఛాజ్మానిగురించి ఆవిడ వ్రాసిన చివరి వ్యాసం చదవడం అప్పుడే పూర్తిచేశాడతను. చుట్టూ జరుగు తూన్న గందరగోళాన్నేమీ లెక్కజెయ్యకుండా, తన వుద్దేశం యేమిటో చెప్పుకు పోతున్నాడు.

"వ్యాసం బాగానేవుంది. కుతూహలం రేపేట్టుగానే వుంది. ఒక పెద్ద పదవిని నిర్వహించే మనిషిని బాగానే, నచ్చేట్టు, చిత్రించారు మీరు. కళ్ళకి కట్టేటట్టు చిత్రించారు. ఆ ఇవెంక్ స్త్రీనిగురించి యిచ్చిన వుదాహరణగూడా బాగానే వుంది శానిటోరియమ్‌కి పంపించినందుకని, వచ్చి ధన్యవాదా లర్పి స్తుందే, ఆ సంఘటన. పై కంత చిన్న సంఘటనలాగా కన్పిం చినా, ఆ ఒక్క వుదాహరణలోనూ ఇక్కడ మన ప్రజల్లో వచ్చిన కొత్తమార్పు, ప్రజలంటే సోవియెట్ ప్రభుత్వం చూపే శ్రద్ధాసక్తులూ ప్రతిబింబించుతునై్న; బాగుంది...... ....."

"ఎప్పుడూ మాట్లాడుకునేదేనా యిప్పుడూనూ? వినట్లా లేదూ!" అంటూ, డాన్స్‌కి రమ్మని ఆహ్వానించాడు ప్ర్యాఖిన్ ఓల్గాని.

ప్రక్కనే డాన్స్ చేస్తున్న జంటల్ని చూచింది ఓల్గా; తావ్‌రోవ్ వైపుకి తిరిగి ఏమంటారన్నట్టు కళ్లెత్తి చూచింది. చిరునవ్వు నవ్వాడతను. ఓల్గా లేచింది. తర్వాత వరసవే వచ్చినై ఆహ్వానాలు డాన్స్ చెయ్యమని. ఎప్పటికప్పుడు ఒకి వంతాన వెళ్లడం; త్వరత్వరగా తిరిగి వచ్చెయ్యడం. బుగ్గలు యెరుపెక్కినై; శరీరమంతా మెరిసిపోతోంది.

"ఇవ్వాళ రాత్రెందుకనో మీరు మెరిసిపోతున్నారు!" అన్నాడు ప్ర్యాఖిన్, ఆవిడమీదినుంచి కళ్లు తిప్పుకోలేక.

"నిజంగానా?" అంటూ, హుషారుగా తాను కూర్చున్నచోటి కెళ్ళింది.

"మనం మాట్లాడుకునేందుకుగూడా అవకాశం యివ్వడంలేదు వీళ్ళు" అంది, తావ్‌రోవ్‌తో. డాన్స్ చేసిచేసి అలసిపోయిందేమో, కుర్చీలో కూలబడింది. అలా కూర్చోడంలో, ఆవిడ గౌను అంచెళ్ళి తావ్‌రోవ్ కాలునికప్పేసింది. ప్ర్యాఖిన్ అన్నమాటలు తలచుకుంటూ, కాలు వెనక్కి లాక్కున్నాడు.

"ఏమిటీ, టాల్‌స్టాయ్ నవల్లో నటాషాయా?" అంటోంది పావా, యెవరో అడిగిన ప్రశ్నే మళ్లీ అప్పజెబుతూ, "ఆవిడెలాంటిదైతేనే, యీ రోజుల్లో ఆవిళ్లాంటి వాళ్ళు చాలామందున్నారు. జనం అలాంటి వాళ్ళంటే గౌరవిస్తున్నారు గూడాను, యిప్పుడిప్పుడు."

"అలాంటి పాళ్లీ రోజుల్లోనూ చాలా మందుంటే వుం డొచ్చును గాక; కాని జనం వాళ్ళని గౌరవించుతున్నారన్న మాట మట్టు కబద్ధం" అన్నాడు ఇగోర్.

"ఔనౌను. మీరు కష్టులుగదూ; మీదారే వేరు" అన్నది పావా, కోపంగా.

"నావుద్దేశమూ అదే" అన్నాడు తావ్‌రోవ్, ఓల్గాతో. "ఆత్మగౌరవంవున్న యే స్త్రీగూడా, యింటిపనితో సంతృప్తి పడి వూరుకుంటుందని అనుకోను. అలా సంతృప్తిపడనక పడితే, యికంతకంటే విచారం యింకొకటుండదు. సంఘంలో స్త్రీ తన కొక ప్రత్యేకస్థానాన్ని సంపాదించుకున్నదీ అంటే అదా విడ ఆకర్షణని యినుమడింప జేస్తుంది. తమతమ పనుల్లోనే తమతమ బలం వున్నదీ అని స్త్రీలు గుర్తించిననాడు యిప్పుడు వయసులోవున్న యీ అసమానత్వంగూడా రూపుమాసి పోతుంది."

"వయసులో అసమానత్వం అంటే?"

"చూడండి. పావాయే వున్నదనుకోండి. ఆవిడ యే ప్రముఖ జర్నలిస్టో, ఏ స్టెఖనోవ్ వర్కరో, యే సమిష్టి వ్యవసాయ క్షేత్ర అధ్యక్షురాలో ఔతుందనుకోండి; అప్పుడెవరైనా 'ఆవిడ వయసెంత?' అనడిగితే, 'ఆఁ యెంత! యింకా ముప్పైగూడా లేవనో, నలభైగూడా లేవనో అంటారు. కాని యిప్పుడడిగారనుకోండి యెవరైనా ఆవిడ వయసెంతని. 'అప్పుడే ముప్ఫయ్యొచ్చేసినై' అంటారు. అదీ తేడా. వయసొచ్చినకొద్దీ మేమూ, అంటే మగవాళ్ళం, ముసలివాళ్ళ మౌతాం, బట్టతల, నెరసినజుట్టు, ముడతలుబడ్డ శరీరం. ఐనా,

ఎందుకనో గాని తరతరాలనుంచీ అంటూనే వున్నారు ఆడ వాళ్ళకంటే మగవాళ్ళే యెక్కువకాలం యౌవనవంతులుగా వుంటారని. అదేమీ కన్పించదు చూస్తూంటే. ఇక ఎక్కువ కాలం బ్రతకడం సంగతి చెప్పే అవసరమే లేదు; స్త్రీల ముందు పురుషులావిషయంలో బలాదూరే!"

"బాగానేవుంది! ఐతే యికింటి సంగతీ, పిల్లాజెల్లా సంగతీ యేంగావాలి?" అని కేకేసింది పావా, బల్ల ఆ చివరి నించి.

"స్త్రీ యింటిదగ్గరుండి పోవాలీ అంటే ఒక బండెడు పిల్లలన్నా వుండాలి. అప్పుడైతే యికమనం మాట్లాడ గలిగిం దేమీ వుండదు."

"ఇప్పుడు లండన్‌మీద వెయ్యాలనుకుంటున్న కొత్త యుధ్ధం సంగతి విన్నారా?" అనంటున్నారు ఇంకెవరో.

"ఆ కార్మికపతనం సంగతి? మీ అభిప్రాయం యేమిటీ?"

"నేన్చెపుతున్నాగా మీకు, తెలివితక్కువ ఆడదాని కున్నంత దుర్మదాంధత యింకెవరికీ వుండదంటే నమ్మండి."

"అక్కడ పెట్టిన కొత్తసిలిండర్లు చూడలేదు లాగుంది మీరు...."

"మరి దిగుమతైన వాటి మాటేమిటి?"

"ఎంత చక్కగా వున్నదనుకున్నారు ఆ తెల్లనక్క చర్మంతో చేసిన కోటు...."

"అనుకున్న సమయానికి అనుకున్న చోటికి కావలసిన వస్తువులన్నీ రావడం అనేదొక పెద్దసమస్య...."

"మీ మగవాళ్ళంతా అంతే...."

"వాళ్ళకోటా వాళ్ళు పూర్తిచేసేశారప్పుడే...."

"మీకొక్కవలసిందిప్పుడు మిశ్రమ లోహాలు. తెలిసిందా?" అంటున్నాడు స్త్యాఖన్.

"స్త్రీలపేరు చెప్పి యింకొక గ్లాసుడు తాగుదాం" అని అరచింది పావా పెద్దగా, "ఈకోటాలూ, యీ కార్మికులూ.... వినివిని తలనొప్పి వస్తోంది."

ఓల్గా తావ్‌రోవ్‌లు తప్ప మిగతా వారందరూ పావా చెప్పినమాట శిరసావహించారు.

"స్త్రీలలో ఆలోచనా స్వాతంత్ర్యాన్ని, భావనా స్వాతంత్ర్యాన్ని చూచి, ఒకొక్కసారి ముగ్ధుణ్ణౌతుంటాను నేను" అన్నాడు తావ్‌రోవ్, మళ్ళీ సంభాషణ ప్రారంభిస్తూ.

"ఆలోచనా ?" అనడిగింది పావా. ఇప్పుడు హాలంతా నిశ్శబ్దంగా వుంది; మధ్యమధ్య కత్తులూ, ఫోర్కులూ, గరిటెలు ప్లేట్లకి తగిలి శబ్దం చేస్తున్నాయంతే. "సొంత ఆలోచనలున్న స్త్రీలంటూ యెవరైనా వున్నారా అని ! ఇతరుల ఆలోచనలు అర్థంచేసుకుని, తిరిగి అనగలిగితే అదే పదివేలు. గొప్పగొప్ప వారంతా - మగవాళ్లే అనుకోండి – అసలు స్త్రీలోక క్రమ పద్ధతిలో ఆలోచించనే ఆలోచించలేరని యెప్పుడో చెప్పేశారు. నేను ఆలోచించగల నన్నట్టు నటన గూడా చెయ్యను ! స్వతంత్ర భావన లంటారు....అదివేరు !"

"మీ రెప్పుడో తాతలనాటి కబుర్లు చెబుతున్నారు"

"నాకు తీపంటే మహా యిష్టం" అంది పావా, "తీపంటే అంత యిష్టం వుండడం మంచిది కాదంటారు, కాని నేనేం

చెయ్యగలను! నా రుచి అలాంటిది. ఇంట్లో తీపిలేదనుకుంటే చాలు, జబ్బొచ్చేస్తుంది నాకు."

"నేన్నమ్ముతున్నాను" అన్నాడు తావ్‌రోవ్, చిన్న పిల్లవంక చూచి పెద్దవాళ్ళు నవ్వినట్టొక చిరునవ్వు నవ్వి. పావా యింకొక తీపిపదార్థం తీసి నోట్లో వేసుకుంది పెదవుల రంగు పాడు గాకుండా.

ఖాళీ ఐపోయిన సీసాలు, ఎంగిలి మిగిలిన పళ్లాలు. గ్లాసులు, కత్తులు, ఫోర్కులు, గరిటెలు.... అంతా చిందర వందరగా వుంది బల్ల. అందరూ కూర్చుని పాటలు లంకించు కున్నారు. ఒకరిశ్రుతికీ వొకరిశ్రుతికీ పొత్తు లేదు. కొందరు కూనిరాగాలు తీస్తుంటే యింకొందరు యిల్లు కప్పెగిరేట్టు పాడుతున్నారు. గొంతెత్తి. అందులో మరీ విక్రయశాలలో పనిచేసే లావాటతని గొంతు మరీ బొంగురుగా విన్పిస్తోంది. రెండు పిడికిళ్లూ బిగించి బల్లమీదానుకుని పైకి లేవాలని ప్రయత్నిస్తున్నాడు. కళ్లు రెండూ మూసుకుని గొంతెత్తి పాడుతున్నాడు.

"ఏమిటూ మొరుగుడు! భలే బావుంది!" అంటూ నవ్వింది పావా. ఇంతలోకే ఆ లావాటతను లేచి, కళ్లు తెరవ కుండానే, కాలుస్తూన్న సిగరేట్ తీసి బల్లమీదున్న రొట్టెలో గుచ్చాడు. "ఇదింకా బావుంది!" అంటూ లేచింది పావా.

"నామాట నమ్మండి" అంటూ అతిప్రయత్నంమీద కను బొమ్మలు లేపి, కళ్ళు మూసుకునే ఉపన్యాసం ప్రారంభించా డతను. "విక్రయశాల్లో పనిజెయ్యడమంటే ఏమనుకున్నారు? ....బ్రహ్మాండమైన .... బాధ్యత....బ్ర.... హ్మాం ....డం! ....

మనుషులకందరికీ ఇంధనం యివ్వడం అన్నమాట.... మనుషు లంటే.... యీ మానవ శరీరాలు.... కళేబరాలు...." ఇకా ధోరణిలో మాటలువచ్చేట్టు కన్పించలేదు, ఉపన్యాసం ఆగి పోయింది, నిరుత్సాహంగా కూలబడ్డాడు.

"మనిషిక మనస్మృతిలో లేడు. ఏంచేసినా చేస్తాడిక. అతన్నింటికి చేర్చండి" అంది పావా, చీదరించుకుంటూ. పేకాట ఆడుకుందామని గదిలో కెళ్ళబోతున్న భర్తను పిలి చింది.

లావాటతన్ని యింటికి చేర్చారు.

తావ్‌రోవ్ ఒక గదిలోనుంచింకొక గదిలోకి తిరుగు తున్నాడు. చాలమంది డాన్స్‌కురమ్మని ఆహ్వానించారు.

"ఇంకా నాకాళ్ళమీద నేను సరిగా నిలబడలేక పోతు న్నాను" అన్నాడతను.

మధ్యమధ్య మనిషి దిగాలుగా వున్నా, ఓల్గా దగ్గర కొస్తే చాలు, హుషారుగా వుంటున్నాడు; ఓల్గాకూడా చాల సంతోషంగా వుంది.

చుట్టూ అంతా గందరగోళంగా వున్నా, — ఆ డాన్సే చప్పుడూ, ఒకవైపున వికవికలూ, యింకొకవైపున పకపకలూ, ఇటు సంగీతమూ అటు పాటలూ, ఆడవాళ్ళ గొణగొణ,— యిన్ని జరుగుతూన్నా ఓల్గా, తావ్‌రోవ్‌లు మాత్రం ఒకరి యెదుట వొకరు చాలా ప్రశాంతంగా వున్నారు. ఆవిడ చేయి పట్టుకుని నెమ్మదిగా ఆ గుంపులోంచి బయటికి నడిచాడు. కాని గుండె కొట్టుకుంటూనే వుంది. ఎక్కడే పొరపాటడుగు వేస్తే, తన ప్రక్కనున్న స్త్రీ యే పొరపాటభిప్రాయం పడుతుందోనని

గుండెలు చేతుల్లో పెట్టుకుని ప్రవర్తించే యువకుడిలా వుంది అతని పరిస్థితి.

# 69

పార్టీ ఐపోయింది. ఇంట్లోంచి బయటికొచ్చిన వాళ్ళందరూ యెవరిదారిని వాళ్ళు వెళ్ళిపోయారు. సిగరెట్ పొగతో క్రిక్కిరిసిపోయిన గదుల్లోంచి బయటికొచ్చారేమో, సాయంకాలపు చల్లని గాలి హాయిగా వుంది.

"ఎంత హాయిగా వుంది" అంది ఓల్గా, గట్టిగా వూపిరి పీలుస్తూ, తావ్‌రోవ్ చేయి తన చేతిలోకి తీసుకుని.

పైన నీలాకాశంగూడా వూపిరిపీలుస్తున్నట్టుంది. తెల్ల తెల్లని మబ్బులు తెరచాపల్లా కదలి వెళ్తున్నై. మధ్య మధ్య చుక్కలు తొంగితొంగి చూస్తున్నై. ఎటు చూచినా రాలిన ఆకులవాసన; ఎండుగడ్డి వాసన; నిశ్శబ్దం. ఇంత పెద్దవూరూ ఈ నిశ్శబ్దంలో మునిగి లీనమైపోయినట్టుంది. ఆ నిశ్శబ్దాన్ని భంగం చెయ్యడమే కష్టమనిపించింది ఇద్దరికీనీ. అలాగే, మాటన్నా ఆడకుండా, మసక మసగ్గా కనబడుతున్న ఇసుకదారివెబడి నడిచారు ముందుకి.

క్రిందటి రాత్రీ యిలాగే వుంది.... ఇదేచల్లని గాలి, ఇదే ఆకురాలు కాలం, ఇంటి కప్పులమీంచి పొగ యిలాగే చుట్టలు చుట్టుకుంటూ తేలిపోతూవుంది. అంతా యిలాగేవుంది క్రిందటి రాత్రిగూడా. కాని యీ అవ్యక్త భావనాబలం లేదు; యీ అపూర్వ ఆనందం లేదు; ఇదంతా యీ రాత్రి ప్రత్యేకత.

చెట్లూ, పొదలూ వెనక్కి జారుకుంటున్నై యిరు పైపులా.... పైన మినుకు మినుకు మనే నక్షత్రాలు.... తెల్ల వారేవరకూ యిలాగే వుంటే! కాని, ఓల్గా యిల్లు వచ్చేస్తుంది. ఆ యింట్లో ఆవిడకోసం ఒకరు యెదురుచూస్తుంటారు. ఇంటి కెళ్ళింతర్వాత యిక తావ్‌రోవ్‌ని గురించి ఆలోచించేందు కవ కాశం వుండదు. అతనికి సంబంధించిందంతా ఆ యింటిగేటు దగ్గరే వదలేసెయ్యాలి. తావ్‌రోవ్ అడుగులు నెమ్మదిగా వెయ్యడం ప్రారంభించాడు; వేగంగా నడిస్తే తొందరగా ఓల్గాని వదిలెయ్యాలి సొస్తుంది. అతని భావాల్ని ఓల్గాగూడా గ్రహించినట్లుంది. ఎవరూ ఏమీ మాట్లాడుకో కుండానే యిద్దరూ వెనక్కు తిరిగి నది ఒడ్డుకు బయల్దేరారు. మళ్ళీ అదే నీలాకాశం, లెక్కలేనన్ని నక్షత్రాలు. కాలి కింద మెత్తగా ఇసుక. చిన్న చెట్టు కొమ్మొకటి ఓల్గా ముహానికి రాసుకుంది; ఓల్గా వులిక్కి పడింది; తావ్‌రోవ్‌గూడా వులిక్కి పడ్డాడు.

ఇందాకటి కంటే త్వరగా తీసుకుపోతున్నట్టుంది దారి వెనక్కి. ఇద్దరూ ఆగారు. దాదాపిద్దరూ ఒకే యెత్తున్నట్టు న్నారు. సాయంకాలపు ఆ నల్ల గౌనులో ఓల్గాయే యింకా స్త పొడుగున్నట్టుంది. పైన మసకమసకగా చందమామ. ఆ వెన్నెల వెలుగు ఓల్గా కన్నుల్లో ప్రతిబింబించింది. ఓల్గా చాచినచేయి తన చేతిలోకి తీసుకుని, ఆవిడ ముహంలోకి తేరి పార జూచాడు తావ్‌రోవ్. ఇద్దరి ముఖాల్లోనూ విచారం వుంది; ఇద్దరి ముఖాల్లోనూ ప్రశాంతత వుంది.

"ఇక నే నెళ్ళాలి" అంది ఓల్గా.

"ఓల్గా!" అన్నాడతను; "నువ్వు నన్ను ప్రేమిస్తు న్నావు; నా కీ ప్రపంచంలో నీకంటే కావలసినవారు లేరు.

నాతోనే వుండు! మనిద్దరం కలిసుండాలనే నీ వుద్దేశమూనూ; కాదూ ?"

"నిజమే, వుంది. కాని ఫస్సట్టుండి అకస్మాత్తుగా నేనా పని చెయ్యలేను" అంది ఓల్గా చేయితీసుకుంటూ. ఒకడుగు వెనక్కిగూడా వేసింది. మళ్లీ వెనక్కి తిరిగి, వెక్కి వెక్కేడుస్తూ "ఇంతగస్మాత్తుగా....నావల్ల కాదు...." అంది.

టైప్ రైటర్ అవతలకి జరిపి, అప్పుడే దానిమీదకొట్టిన వుత్తరంతీసి చదువుకున్నాడు ఇవాన్ ఇవానొవిచ్. ఆవుత్తరం వ్రాసింది ప్రిమోర్స్కి సోవియెట్కి. ఒక సంవత్సరం క్రితం తానాపరేషన్ చేసిన ఒకవ్యక్తికి తగిన వుద్యోగం యివ్వవలసిం దంటూ వ్రాశాడందులో. తగిన వుద్యోగం యిచ్చి, జీవితం అంటే పునర్విశ్వాసం యేర్పరచ గలిగితే రోగి త్వరగా కోలు కుని యధాప్రకారం మళ్ళీ జీవితాన్ని ప్రారంభించడానికి తోడ్పడినట్లౌతుందని ఆయన నమ్మకం. అంచేత తనతీరిక సమ యాల్లో ఆయారోగులికి తగిన వుద్యోగా లేమిటో ఆలోచించు తూండేవాడు. హాస్పిటల్ వదలింతర్వాతగూడా వాళ్ళ జీవి తాల్ని గురించీ, ఆరోగ్యాన్ని గురించీ ఆలోచించుతుండేవాడు; వాళ్ళ దగ్గర్నుంచి వచ్చిన వుత్తరాలకి జవాబులు వెంటవెంటనే వ్రాసేస్తుండేవాడు.

ఇప్పుడు ఒక్కసారి వెనక్కితిరిగి చూచు కున్నాడు ఇవాన్ తనజీవితాన్ని; తన భవిష్యత్తుని గురించిగూడా ఆలో చించుకున్నాడు. సంతృప్తి పడ్డాడు. జీవితాన్ని అంటీ అంట కుండా కాదతనింతవరకూ జీవించింది; బీడుభూమిని దున్నే

నాగలిలా జీవితంలోకి చొచ్చుకుపోయాడు. తనశాయశక్తులా, తనచుట్టూవున్న జీవితాన్ని సుఖవంతం జెయ్యడానికి ప్రయత్నించాడు.

"మంచి పనే చేశావు, ఇవాన్!" అనుకున్నాడు బిగ్గరగా.

అలెగ్జీ జోనోవ్ గుర్తుకొచ్చాడు. ఈపాటికి రెండో ఆపరేషన్ చెయ్యవలసింది. ఇదిచేస్తే, ఎడమకాలికికూడా ఉజబ్బు (గాంగ్రీన్) పాకకుండా చెయ్యడానికి వీలుంటుంది; మొదటి ఆపరేషన్ ఫలితాలు నిరర్థకం కాకుండా వుంటాయి. కాని యీరెండో ఆపరేషన్ వద్దంటున్నాడు అలెగ్జీ. న్యాయానికి ఎడమకాలులో యీజబ్బు చిహ్నాలు యేమంత లేవుగూడాను. అందుకనే బలవంతం చెయ్యలేదు ఇవాన్. పూర్వానుభవాన్నిబట్టి చూస్తే రెండో ఆపరేషన్ చెయ్యకుండా వుండడం యేమంత మంచిది కాదని పిస్తోంది. అతన్ని బాధపెడ్తూన్న ఆలోచన యింకొకటుంది. ఉపరి భాగనరాలు దెబ్బతిని, అవయవాలు బండబారిపోతున్నై; పక్షవాతంలాంటి జబ్బులొస్తున్నై. ఇంకా వూరుకుంటే మాంసం కుళ్ళిపోయి అసలు పెద్దఆపరేషనే చెయ్యవలసి వస్తోంది. దెబ్బతిన్న నరాల్ని కలపడం యెలా? ఎక్కడైనా నరంముక్క తక్కువైనప్పుడు దానిస్థానంలో యింకేమి వుపయోగిస్తేమంచిది? ఇదివరకు పిల్లి వెన్నునరమూ ప్రక్కనరాలూ వుపయోగించారు. అవితప్ప యింకేమయినా వుపయోగించ వచ్చునా లేదా? ఈ ప్రశ్న వేసుకుంటూ సమాధానాలకోసం ఆలోచించుకుంటూ కూర్చున్నాడు.....

ఆలోచించుతూనే టేబుల్ మీదున్న టీ కోసం చెయ్యి చాచాడు. టీ చల్లబడుంది; బాగా ప్రొద్దుపోయిందన్నమాట

ఆకలిగా కూడ వుంది. చేతి గడియారం వంక చూచి, నవ్వుకుని పడక గదిపైపుకు బయల్దేరాడు. ఓల్గా యింకా యింటికి రాలేదని దారిలో గుర్తుకొచ్చింది. ఒక్క నిమిషం సేపు ఓల్గా మంచం వంక చూస్తూ నిలబడ్డాడు; పక్కచెక్కుచెదరలేదు; తలగడలు వేసినవి వేసినట్లే వున్నై మంచుగుట్టల్లాగా.

వంట గదిలో కెళ్లాడు. కిరోసిన్ స్టౌవ్ వెలిగించాడు; ఒక సాసేజ్ ముక్క కోసి పెనం మీద వేశాడు; ఇంత వెన్న గూడా వేశాడందులో. పెనం, గరిటే, అన్నీ కలిపి నిప్పుమీ దుంచాడు. ప్రక్కనే స్టూలుంటే లాక్కుని కూర్చున్నాడు దాని మీద. ఇల్లంతా యీ మధ్యనే రంగువేశారు. ఆరంగుల్ని చూస్తే దేవదారు మందు గుర్తుకొచ్చింది.....హాస్పిటల్........ మరియా పెత్రోవ్నాకి చేసిన ఆపరేషన్....

"అయ్యయ్యో! ఏమిటిది? ఇంటినిండా యీపొగేమిటి? మీరిక్కడే కూర్చున్నారా!" అంటూ వచ్చింది ఓల్గా అగస్మాత్తుగా; వచ్చీ రావడంతోనే స్టౌవ్ ఆర్పేసింది.

ఉలిక్కిపడి చూశాడు ఇవాన్; పెనం మీదనుంచి నల్లటి పొగలేస్తోంది. నవ్వుతూ, స్టౌవ్ ఆర్పేసి వెనక్కెళుతున్న ఓల్గా చెయ్యి పట్టుకున్నాడు; జారిపోయింది. లేచి నించున్నాడు.

"మంచి వంటగాళ్లే మీరు" అంటూ పెనం తీసుకుని బయల్దేరింది ఓల్గా.

"స్టౌవ్ ఆర్పేశావెందుకు?" అనడిగాడు ఇవాన్, ఆ పొగలోనే కళ్ళకి చేయడ్డం పెట్టుకుని ఒకడుగువేసి.

"ఇదిగో వస్తున్నా; ఆ పనులన్నీ నేవచ్చి చూసుకుంటా

తెండి!" అంది ఓల్గా, పక్కగదిలోంచి; "బట్టలు మార్చుకుని వస్తా; యీలోపల పొగంతా బయటికి పోనీండి."

తర్వాత పక్కమీద పండుకున్న తర్వాత అనుకుంది ఓల్గా; "రాగానే ఆయన ముహంలోకి చూచి మాట్లాడవలసిన అవసరం లేకుండాపోయింది; మంచే జరిగింది. ఎట్లాగోట్లా ఆయనకి చెప్పెయ్యాలి; యీలోపుగా ఆయన్నందుకు సిద్ధం జెయ్యాలి గూడాను."

చీకట్లో, భర్త పక్కనే భర్తని తాకకుండా పండుకునుంది. ఆకాశం నెత్తిమీదనే వేళ్ళాడుతున్నట్టుంది. ఆ నీలాకాశం తావ్‌రోవ్ ప్రేమనీ! ఆప్యాయాన్ని జ్ఞప్తికి తెచ్చింది.

నిద్రలో నిట్టూరుస్తూ, పక్కకొత్తిగిలి మీద చెయ్యివేశాడు ఇవాన్. బిర్రబిగుసుకున్నట్లయి పోయింది ఓల్గా. ఇవాన్‌కి మెలకువరాలేదు. నిద్రలో కలవాట్లాడడం అలవాటాయనకి; పగలల్లా మాట్లాడింది చాలనట్టు.

మీదపడిన చెయ్యితీసి పక్కమీద పెట్టింది. ఇవాన్‌ని చూస్తే జాలేసింది. తావ్‌రోవ్‌తో కలిసున్నప్పుడు కలిగిన దివ్యానుభవం జ్ఞప్తికొచ్చింది. ఒకవైపున ఆ ఆనందం: మరోవైపున భయమూ, జాలీ. చివరికా ఆనందమే గెలిచింది; పైచేయి ఆ ఆనందానిదే. మధురగానం ఆలపించుకున్నది మనసు. చివరికా వుద్వేగమంతా కన్నీటిలో కరగిపోయింది. ఇంకా తన సమస్య పరిష్కారం కాలేదనీ, పరిష్కారం కావలసి వుందనీ తెలుసు ఓల్గాకి.

జరగవలసినదాన్ని గురించి ఆలోచించుకుంటూ కాస్సేపు సంతోషిస్తూ, కాస్సేపు నిస్పృహపడుతూ, అలాగే పండుకు నుంది తెల్లవారేవరకూ. ఒకవైపున సందేహాల బాధ, మరో వైపున తన ప్రక్కనే అశుభమూ శుభమూ తెలియకుండా నిద్ర పోతున్న భర్త. ఆయన తప్పేమైనావుందా? నిజంగానే తన్నా యన సరిగ్గా చూడలేదా? ఆయన ప్రవర్తనగూడా సహజ మైనదేనని నచ్చజెప్పుకోవాలని ప్రయత్నించిన కొద్దీ యిద్దరి మధ్యా యేర్పడిన అఖాతాన్ని కాదనలేని పరిస్థితి యెక్కువౌ తోంది. ఇదివరకు తనకు కోపం వచ్చినప్పుడు, విసుగుపుట్టినప్పుడు కావాలని బలవంతాన ఆయన ప్రేమను పొందుతున్నట్లని పించేది. ఇప్పుడా అవసరంలేదు; ఇప్పుడాయన అవసరంలేదు తనకి. ఆయనకి దూరంగా జరుగుతూ, 'ఆయనగూడా హాయిగా వుండుగాక' అనుకుంది; తన మనశ్శాంతి కోసమేనేమో.

"నేను స్వార్థపరురాలనే అనుకుందాం; మనోనిబ్బరంలేని దాన్నే అనుకుందాం; ఆయనకంటె అనేక విధాల, అనేక రెట్లు చెడ్డదాన్నే అనుకుందాం; అలా అనుకున్నా యింకా ఆయనతో కలిసివుండడం మరీ తప్పుగదా," అనుకుంది.

అంతా స్పష్టమైపోయినట్టే అనిపించింది; మళ్లీ అంతలోనే కొత్త ఆలోచనలొచ్చిపడినై వ్యధపెట్టడానికి. జరిగిందంతా చెబితే ఏమనుకుంటాడాయన? తావ్‌రోవ్ ఇవాన్ లిద్దహా వొకరికొకరు యెదురైతే....? నుదురంతా చెమటలు పట్టింది; గౌనుమెడ తాళ్ళదులా బిగదీస్తోంది కంఠాన్ని; తలగడలు తగ లడుతున్నట్టున్నై.

అటూఇటూ వొత్తిగిలింది, దొర్లింది. చెయ్యితీసి తలకింద పెట్టుకుంది: రెండుచేతుల్తోనూ తలనొక్కుకుంది; తలగడలుతీసి సర్ది మళ్లీతలకింద పెట్టుకుంది; నిద్రరాలేదు. ప్రక్కనే యిదంతా యేమీ తెలియకుండా, నిద్రపోతూన్న ఇవాన్‌ని చూస్తే కోపం గూడా వచ్చింది చివరికి.

గడియారం నాలుగు కొట్టింది.

తావ్‌రోవ్ కనిపించని నాటిరాత్రి. వర్షంవచ్చి కిటికీ తలుపులతో గుసగుసలాడిన నాటిరాత్రి. ఫాక్టరీ సైరన్స్ గొంతెత్తి ఏడ్చిననాటిరాత్రి. అప్పుడంటే తావ్‌రోవ్ దారితప్పి పోయాడు; కన్పించలేదు. కాని ఈరాత్రి తావ్‌రోవ్ వున్నాడు.. ఇప్పుడీపళాన పక్కమీదినుంచిదూకి వంతెనమీదుగా వూరంతా దాటి అడవిలోకి, చెట్లమధ్యకి పరుగెత్తాలనిపించింది.... తావ్‌రోవ్‌కిగూడా నిద్రపట్టడంలేదేమో బహుశా. బహుశా అతనుగూడా, ఆఖాళీగదిలో నిద్రపట్టక, అటూయిటూ, యేమీ తోచక, తిరుగుతున్నాడేమో లేకుంటే కొండల్లోకో, మిల్లు వైపుకో వెళ్ళాడేమో; ఏమో. వచ్చి, కిటికీక్రింద నిలబడిలేడు. గదా? లేచి, చూడబోయింది....

"మరీ పిచ్చెక్కిపోతున్నట్టుంది" అనుకుంటూ నుదురు నిమురుకుంది.

ఆ ఇసుకమీద నిలుచున్నప్పుడు, ఆనీలాకాశంకింద, నక్షత్రాలు మినుకు మినుకు మంటున్నపుడు, చల్లనిగాలి తాకుతున్నపుడు, తను తావ్‌రోవ్‌ని ముద్దుపెట్టుకోలేదెందుకని?....

ఐదుగంటలు .... ఆరుగంటలు ... సెప్టెంబరులో అంత తొందరగా తెల్లవారదు. తూర్పు తెలతెల వారుతోంది. నక్ష

త్రాలు వెలుగుతగ్గి జలజలరాలుతున్నై క్రిందికి నాణేలకి మళ్లీ శబ్దంచేసుకుంటూ....గడియారం కాదుగద అశబ్దం చేస్తున్నది?

ఓల్గా మేలుకునేప్పటికే, ఇవాన్ పనిలోకివెళ్లిపోయాడు. లేచి, జాగ్రత్తగా దుస్తులేసుకుని, గదంతా సర్దింది ఓల్గా. తన జీవితంలో యింత బ్రహ్మాండమైన మార్పొచ్చిన యీ నాడు గూడా, ఎప్పటిలాగా యీ చిన్నచిన్న పనులు చేసుకోవడ మంటే వింతగానే వుంది. ఎప్పటిలాగానే, వంటింట్లో కూర్చొని ప్రదయం ఫలహారం చేసింది. రెండు చేతుల్తోనూ కప్పు పట్టుకుని, కాఫీ తాగింది.

కిటికీలోంచి బయటికి చూచింది. మబ్బు పట్టింది; వర్షం వచ్చేట్టుంది. పెద్దగాలొచ్చి పడింది వున్నట్టుండి; దుమ్ము లేచింది చుట్టూ. దూరాన తెల్లని ఆకాశం; కిటికీలో ఎర్రని పూలు. పరధ్యానంగా యివన్నీ చూస్తూనే, తావ్‌రోవ్‌ని గురించీ, పూర్తి చెయ్యాల్సిన వ్యాసాన్ని గురించీ, భర్తతో చెప్పవలసిన సంగతిని గురించీ ఆలోచించింది ఓల్గా.

"ముందా వ్యాసం పూర్తి చేసెయ్యాలి; తర్వాత ఆయన్తో మాట్లాడాలి. తర్వాత చికాకుపడిన మనస్సుతో వ్యాసం పూర్తి చెయ్యడం కష్టం" అని నిర్ణయం చేసుకుంది.

తన వ్యాసం వున్న నోట్‌బుక్ తీసుకుంది; ఆ వ్యాసం మార్జిన్‌లో తావ్‌రోవ్ కొన్ని సూచనలు వ్రాశాడు. తెల్ల కాగితాలు తీసుకుంది. తన వ్రాతబల్ల దగ్గర కెళ్లింది.

టెలిఫోన్ మోగింది. చెప్పవలసిందేమిటో. భర్తతో చెప్పేసెయ్యడం మంచిదనుకుంది. ఇష్టం లేనట్టెళ్ళింది ఫోన్ దగ్గరికి. కాని, రిసీవరెత్తి చెవిదగ్గర పెట్టుకునేప్పటికి, ఆ విడ

ముహం వికసించింది; పెదవులమీదికి చిరునవ్వొలికింది; బుగ్గలు ఎరుపెక్కాయి.

"ఔనౌను. నేనే" అంది వుత్సాహంగా; "నేనే; విం టున్నా; చెప్పండి."

ఫోన్ కవతలవున్న మనిషి తెలివిగలవాడైతే, ఆ మా టల కర్థం వేరనీ, ఆ మాటల కర్థం "నిన్నే ప్రేమిస్తున్నాన్నేను; నిన్ను గురించే ఆలోచిస్తున్నా అనుక్షణం" అనీ, యిట్టే తెలిసి పోతుంది.

ఫోన్ కవతలవున్నది తావ్‌రోవ్ కాబట్టి, ఆ మాటల అర్థం సరిగానే గ్రహించగలిగాడు. గ్రహించగలిగాడు కనకనే, చెప్పదలచుకున్న వార్త మంచివార్త కాకపోయినా, వుత్సా హంగానే వున్నట్టు మాట్లాడాడు.

"ఇవ్వాళ మా సమావేశం జరిగింది...." స్వరం స్పష్టంగా వుంది; మనిషి గూడా చిరునవ్వు నవ్వుతున్నట్టున్నాడు; "ఔలి గ్రాం వచ్చింది........ నన్ను రమ్మని.... కాదుకాదు......." అన్నాడు వెంటనే, ఓల్గా ముఖంమీదికి జారిన భయం నీడని చూచినట్టు, "కాదు, కాదు.... బదిలీ కాదు.... మళ్ళీ వచ్చే స్తాను. ఉకమ్యాన్‌లో జరిగే సమావేశాని కిక్కణ్ణుంచి ఆరు గురం వెళ్ళాలిపొచ్చింది.... ఇప్పుడే బయల్దేరుతున్నాం; వెంటనే" తావ్‌రోవ్ కంఠం వణకిపోయింది; "ఐదురోజులు...."

"ఐదురోజులా ?" అన్నది ఓల్గా, నిస్పృహాలా; "ఐదేళ్ళు" అని తావ్‌రోవ్ అంటున్నాడు.

ఆవిడ గొంతులో విచారం చూచి, "అంతా సిద్ధమై పోయింది. కారు నా కోసం ఆపారు" అన్నాడతను వుత్సా హంగా.

"కారా? అప్పుడే...." అన్నది ఓల్గా. ఇంకా ఆవి డాలోచన లోక కొలికికి రాలేదు.

"ఓల్గా!" అన్నాడతను; తర్వాత వూరుకున్నాడు. (ఔను; టెలిఫోన్ ఆపరేటర్లొక్కొక్కసారి ఇతి జాగ్రత్తగా వింటుంటారు.)

అతని గొంతులో ఆదుర్దాని గమనించింది ఓల్గా. "జరిగినదానికి నేనేకోశానా విచారపడడం లేదు. రాత్రేమను కున్నానో, యిప్పుడూ అదే అనుకుంటున్నాను. ఏమీ మార్పు లేదు నాలో" అన్నది.

రిసీవర్ పెట్టేసింతర్వాత భయం వేసింది ఓల్గాకి. అంటే ఇవ్వాళల్లా కన్పించడన్నమాట తనికి. ఇవ్వాళేమిటి! రేపూ కన్పించడు........ ఇప్పుడతను తన దగ్గరుండాల్సిన సమయం; తనకు సహాయం చెయ్యవలసిన సమయం; తనేమో యింకొక వారంవరకూ కన్పించడు! తొందరగా అతనింటికి వెళ్తే దొరుకు తాడేమో.... లాభంలేదు, కారక్కడ తనకోసం ఆగివుందని చెప్పాడు, ఈ పాటికి వెళ్ళిపోయే వుంటాడు. వెళ్ళిపోయే ముందు తనతో కలుసుకుని మాట్లాడేందుకు ఏ మాత్రం అవ కాశంవున్నా అతనలా అనేవాడా? అనేవాడు కాదు. సమా వేశం జరిగింది; సమావేశంలోంచి బయటికి పెట్టిన కాలు కారులో పెట్టి ప్రయాణం చెయ్యవలసి వచ్చింది. ఓల్గా ముహం తేటబారింది, కాని హృదయంలో బాధ వుపశమించలేదు. తన హృదయంలో తావ్‌రోవ్ కెంత స్థానం వుందీ తెలిసొచ్చింది యిప్పుడావిడకి. మొన్న మొన్నటిదాకా ఆ యిద్దరి మధ్యా వూగిసలాడింది తాను. ఇప్పుడు పూర్తిగా తావ్‌రోవ్ వైపుకు వచ్చేసింది. తనకొక నూతన ప్రపంచాన్ని సూచించినందుకు,

చూపించినందుకు; తనకు తగిన వృత్తిని చేపట్టడానికి సహాయం చేసినందుకు; తనలో తనకు ఆత్మవిశ్వాసం కలిగించినందుకు; తానెంతోకాలం వేచివుండీ సాధించలేని కార్యాన్ని, తన్నుత్సాహపరచి, సూచనలిచ్చి, ఫలోన్ముఖం చెయ్యడానికి ప్రయత్నించుతున్నందుకు అతనంటే కృతజ్ఞతాభావం కలిగింది తనకు. ఈ కృతజ్ఞతే, తర్వాత స్నేహంగామారింది. ఆస్నేహమే యిప్పుడు ప్రేమగా రూపొందింది. ఇప్పుడిక తన జీవితాన్నతని జీవితంతో జోడించాలి. అలా జోడించాలీ అంటే, ఇంతవరకూ తనతో కలిసిమెలిసివున్న వ్యక్తితో తనకున్న సంబంధాలను తెంచుకోవాలి; ఈ మొదటి వ్యక్తిగూడా తన్నుప్రేమించాడు, తన విధాన తాను గాఢంగానే ప్రేమించాడు.

"ఆయన్ని మోసగించ కూడదు; మోసగించలేను. ఆయన్ని మోసగించితే నన్ను నేను మోసం చేసుకున్నట్టే" అనుకుందావిడ.

ఇంతలో భర్త అడుగుల చప్పుడు వినవచ్చింది. వరండాలో కొచ్చేశాడు. వెంటనే డెస్క్‌మీదున్న నోట్‌బుక్కూ, కాగితాలూ తీసేసింది.

ఇవాన్ ఇవానొవిచ్ వచ్చేప్పటికి, చెప్పులకోసం వెదుక్కుంటోంది ఓల్గా గదిలో. ఒకక్షణం, ఆవిడ ముహంచూస్తూ అలాగే నిలబడి పోయాడు ఇవాన్. నిన్నటి వుదాసీన ప్రవర్తనని గుర్తుకు తెచ్చుకుని బాధపడ్డాడు. ఇవ్వాళగూడా తానంటే యేమీ ఆప్యాయత చూపడంలేదు; కనీసం పలకరించడంగూడా లేదు. చెప్పులు వెదుక్కుంటోంది....

"నన్ను పిలవలేదే?" అనడిగాడు.

"మీరు నన్నెందుకు పిలవలేదని అడగనే యెప్పుడూ నేను" అన్నది ముహం ముడుచుకుని.

"పని తొందరలో వున్నా."

ఓల్గా మాట్లాడలేదు. భర్తచేసే పనంటే ఆవిడకీ గౌరవం వుంది. తనుమాత్రం పూరికేవుందా? తనపని తనూ చేస్తూనేవుంది. తానేమీ సోమరిపోతులా కూర్చుని లేదే. తన పనంటే ఆయనకేమీ లక్ష్యంలేదు కాబట్టి. అది పనేకాదనుకుంటాడు. పనిలేదు కాబట్టి, తనని గురించి శ్రద్ధచూపవలసిన బాధ్యత తన భార్యదే ననుకుంటాడు.

"హుషారుగా గడిచిందా?" అనడిగాడు కోపంగా, ఆవిడ సమాధానం కోసం ఆగకుండానే.

చెప్పులు చేత్తోపట్టుకుని, తోక తొక్కిన తాచులా లేచింది ఓల్గా.

"ఆహా! కావలసినంత హుషారుగా వుంది!" అంది లెక్కలేనట్టు.

ఆరెచ్చగొట్టే గొంతూ, ఆమొహంచూస్తే ఇవాన్‌కి ఆశ్చర్యం వేసింది. కావాలని కయ్యానికి కాలుదువ్వుతున్నట్టుంది. ఆవ్యతిరేకతని చూచి వెంటనే వెనక్కితగ్గాడు.

"ఊఁ. కానీండి. అడగండి. అనవలసినదంతా అనేస్తాను; చెప్పవలసిందంతా చెప్పేస్తాను" అన్నట్టుంది ఆవిడ ముహం; ఈ ఓల్గా యిదివరకటి ఓల్గాకాదు.

"వొట్టిది, అంతాఅబద్ధం! నీకింకానేనంటే ప్రేమవుంది!" అని ఆక్రోశించింది అతని హృదయం; "నేనింకేమీ నమ్మను;

నమ్మలేను. నువ్వునాదానివి. నానుంచి నిన్నెవ్వరూ వేరు చెయ్యలేరు" అనుకుంటున్నది అతని ముహం.

"ఎందుకు ఓల్గా, నీకంత కోపం?" అనడిగాడు ఇవాన్.

"నాకా? నాకేం కోపం? నాకేమీ కోపంలేదు" అంది ఓల్గా.

# 71

మూడురోజులు గడిచినై. ఐదురోజులు గడచినై. ఈ లోపుగా వ్రాస్తున్న వ్యాసం పూర్తిచేసింది ఓల్గా. పేజీకొక వైపున పంక్తికీ పంక్తికీ మధ్య బాగా ఖాళీవదలి, కావలసినంత మార్జిన్ వదలి వ్యాసం అంతా టైప్ చేసింది. కవరులోపెట్టి కవరుమీద పత్రికపేరు టైప్‌చేసింది. తీసికెళ్ళి తనేపోస్టుచేసింది. పెద్ద భారం ఒకటి తొలగిపోయినట్టానందించింది. ఇకిప్పుడా వ్యాసం వేసుకుంటారా, లేదా అన్నదికాదు సమస్య; ఆవ్యాసం వ్రాసేశి పంపింది; అదీ ముఖ్యం. ఇన్నిరోజుల్నుంచి కష్టపడిన దానికి ప్రతిఫలం ఆవ్యాసం. అదిచాలు ఆనందించేందుకు.

ఈమధ్య మనిషి చాలా విచారంగా వుంటోంది. ఇంట్లోనుంచి బయటి కెళ్ళడంలేదు. కనీసం తనరూపం అన్నా, దుస్తులన్నాగూడా శ్రద్ధతీసుకోవడం మానేశింది. తావ్‌రోవ్ తిరిగి వచ్చెయ్యవలసిన సమయం ఆసన్నమైంది. వచ్చాడు గూడాను. ఎలీనా చెప్పింది. ఓల్గా ప్రవర్తనంతా వింతగా వుండడంచూచి, ఆరోగ్యం చెడిపోయిందేమోనని గాభరాపడింది ఎలీనా. పావా యింటిదగ్గర పార్టీ జరిగి వారం ఐంది. ఆవారం గడిచిపోయి, యింకొక వారం వచ్చింది. టెలిఫోన్ మోగింది. వెళ్ళి ఆటెలి

ఫోన్ యెత్తలేదు ఓల్గా. ఫోన్ అలాగే మోగింది కాస్సేపు. నెరిగిన తల. బరువుగావున్న కళ్లు. అలాగే యీ గదిలోనుంచి ఆగదిలోకి, ఆగదిలోనుంచీ గదిలోకి తిరిగింది. వర్షాకాలం వచ్చింది. వర్షం కురుస్తోంది. కిటికీతలుపుల అద్దాలమీద ఎప్పుడూ వర్షపునీటి బిందువులే; కన్నీటి బొట్టుల్లాగు.

"ఏమిటి ఓల్గా! అట్లావున్నావ్?" అనడిగాడు ఇవాన్. అతనూ ఉత్సాహంగా లేడు.

"ఏమీ లేదు." అంది.

ఒకనాడు, న్యూరాలజిస్టుని వెంటబెట్టుకు నొచ్చాడు ఇవాన్. పరీక్ష చేయించుకోనని యెదురుతిరిగింది ఓల్గా.

"ఏమీలేదు; కొద్దిగా జలుబుచేసింది; అదేపోతుంది" అంది న్యూరాలజిస్ట్‌తో.

"ఐనాసరే. మందుమందే వెచ్చనినీటితో కాపు పట్టండి ప్రతిరోజూ వుదయం. వీలున్నంతవరకు మంచి గాలిలోవుండండి. సాయత్రిం పూటా, వుదయమూ గూడా షికారు కెళ్ళడం మంచిది" అన్నాడు న్యూరాలజిస్ట్.

"ఆయనమందూ అవసరంలేదు, సింగినాదమూ అవసరం లేదు" అంది ఓల్గా, అతనెళ్ళిపోయిం తర్వాత, కూర్చుని చేతి వేళ్ళవంక చూసుకుంటూ.

చేతికున్న వుంగరం ముందుకీ వెనక్కీతోస్తూ కూర్చుంది యేమీ తోచక. ఉంగరం జారి కంగుమని కిందబడి సోఫాకిందికి దొర్లిపోయింది. లేచి ఆవుంగరం తీసుకోవడానికూడా ప్రయత్నించలేదు ఓల్గా.

"నాకేమీ అవసరములేదు" అంటూ గొణుక్కుంది.

ఈవిడింత విచారంగా వుండడానికి కారణమేమిటా అని ఆలోచిస్తున్నాడు ఇవాన్. బహుశా యింకో వ్యాసం తిప్పి పంపించేశారేమో అనుకున్నాడు. అంతే అయ్యుంటుంది అని నిర్ణయంచేసుకున్నాడు; ఆ ఆలోచనే అదొక విధమైన ఆనందాన్నిచ్చింది.

"ఓల్గా," అంటూ ప్రక్కనే కూర్చుని చేతుల్లోకి తీసుకున్నాడు, "నాతోచెప్పు నీ బాధేమిటో చెప్పు. నీకు నాకంటే దగ్గరి స్నేహితులెవరున్నారు. మళ్లీ నీవ్యాసం తిరిగొచ్చిందా పదన్నా పత్రికనుంచి?" అనడిగాడు.

తలూపి, నెమ్మదిగా భర్త కౌగిలిలోంచి బయటపడింది ఓల్గా.

"నన్నేమీ అడగొద్దు" అంది మృదువుగా, "నాబాధ నన్ను పడనీండి."

ఇలాగే గడిచినై రోజులు. ఇంకా యింట్లోంచి బయటికెళ్లడంలేదు, ఓల్గా. ఒకనాడు డ్రాయర్ లోంచి నోట్ బుక్ బయటికి తీసింది. తను సేకరించిన సమాచారం చాలావుందింకా అందులో. అవన్నీ చదువుతూంటే ఆవిడ ముహం మళ్లీ తేటబారింది; ఇంకా చాలా వ్యాసాలు వ్రాయొచ్చును; ఇంట్లోనుంచి బయటికెళ్లకుండానే తనపని తాను సాగించొచ్చును; కూర్చుని వ్రాయడం ప్రారంభించింది. అతినెమ్మదిగా ప్రతిమాట ఆచి, తూచి వేసింది. ప్రతిభావాన్నీ ప్రతివాక్యాన్నీ అరచేతిలో పెట్టుకుని బరువుచూచి వుపయోగించినట్టుపయోగించింది. ఒకడజను పంక్తులు వ్రాయడానికి ఒకరోజల్లా వినియోగించిండి; అప్పటికీ యింకా పూర్తిగా సంతృప్తి కలగలేదు. ఈపనిలో పడడం మంచిదే ఐంది. ప్రొద్దుపోతోంది.

ఉండుండి, ఫోన్ మోగుతుంది యింట్లో, లేవకుండానే వింటుంది ఓల్గా ఆఫోన్ శబ్దం. మామూలుకంటె యెక్కువ సేపు మోగితే లేచి ఫోన్ దగ్గరకెళ్తుంది; అంతే రిసీవర్ ముట్టుకెత్తదు.

చూచి వెళ్దామని పావా వొచ్చిందొకనాడు "ఇదేం పిచ్చి పనీ, యిదేంలోకం" అంటూ ప్రారంభించింది; "అద్దంలో చూసుకున్నారా యెలావున్నారో. దారితప్పిపోయిన సన్యాసిని మెరుగు మీకంటే. ఎందుకొచ్చిన బాధ పెట్టుకోవడం యిట్లా?"

తర్వాత తావ్‌రోవ్ సంగతెత్త బోయింది పావా: కాని ఓల్గా వారించింది.

"ఆయన్ని గురించి నాదగ్గర చెప్పకండి" అంది ఓల్గా. పావా మరీ ఆశ్చర్యపోయింది.

"ఇద్దరూఒకచే—పిచ్చెక్కింది" అనుకుంది తనలో తాను.

"మీరు? మీరు బావున్నారామరి?" అనడిగింది ఓల్గా పావాని ఆనిండునెలలు చూచి.

"నేనా? బావుంటానికేముంది? జరగవలసిందేదో జరుగుతుందిలే అని వూరుకున్నాను" అంది లెక్కలేనట్టు; ఇంకొక పిల్లయెక్కువైనా వొకచే తక్కువైనా వొకచే ఏదో వొకటి యీపీడా తొందరగా విరగడైపోతే. అందం చెడిపోతుంది యీ పాడు కడుపులమూలాన కదూ?" అంటూ గ్లాసుతెచ్చుకోవడానికని లేచింది. "మరీ కంగారూ జంతువుకిమల్లే వున్నాను కదూ. ముందు ముందింకా ఛండాలం బౌతుంది రూపు."

"పిల్లలు పుడితే మన జీవితానికొక అర్థం యేర్పడుతుందని, అప్పుడు భర్తతో సంబంధం మరింత సన్నిహితమౌతుందనీ తెలియదా మీకు?" అనడిగింది ఓల్గా ఆపుకోలేక.

"సంబంధం మరింత సన్నిహితం కావడమా? ఆc. ఔను కుటుంబం దృష్ట్యా చూస్తేఅంతే. ఐనామీకెక్కణ్ణుం చొస్తాయి యాథార్మిక ఆలోచనలు ? మీరన్నట్టు పిల్లలుంటే అదొకరక మైన లంగరే ననుకోండి. మనం అటూయిటూ కదలకుండా పట్టుకుంటారు. కాని, బిడ్డలమూలాన భర్తకి కృతజ్ఞత చూప డం యెందుకు....ఐనా నన్నడగడం యెందుకు? మీరూ కన్నారు గా ఒకపిల్లని...." అంది పావా, చివరికి, కోపంగా.

"ఆc—"

"ఐతే, అప్పుడు ఇవాన్ ఇవానొవిచ్‌ని అంతకుపూర్వం కంటే యెక్కువగా ప్రేమించారా?"

"నిజమే. ప్రేమించాను."

"ఐతే, మీరు వెంటనే యింకొక బిడ్డని కనడం మంచిది. అప్పుడుగాని మీగూడులోకి శాంతీ సంతృప్తీ చేరవు."

వసపోసినపిట్టలా వాగివాగి వెళ్లిపోయింది పావా. హమ్మ య్యాఅనుకుంది ఓల్గా. ఒకపుస్తకంతీసుకుని, పడకగదిలోకెళ్ళింది. వాళ్ళమ్మ యిచ్చిన రగ్గు తీసుకుని కప్పుకు కూర్చుంది. జబ్బుగా వున్నప్పుడీ రగ్గు మోకాళ్ళ వరకూ కప్పుకుని కుర్చీలో కూర్చు నుండేది తల్లి. అప్పుడు తనక్కడికెళ్ళి, ఆరగ్గు బుగ్గలకి తాకేట్టు కూర్చునేది అమ్మప్రక్కనే. బుగ్గలకి మెత్తగా తగిలేది ఆరగ్గు. అమ్మ నెత్తిమీద నిమురుతూ వుండేది. అమ్మ చాలా కాన్పులు కన్నది. చివరికి ఆ కాన్పుల్లో ఒకటి ఆవిణ్ణి కడుపునబెట్టుకొంది.

ఇంత వరకు తెరచి చూడలేదు చేతిలో పుస్తకం. అద లాగే జారి కిందబడింది. ఆచప్పుడికి వులిక్కిపడింది ఓల్గా. కాని వంగి పుస్తకం తీసుకోలేదు. ఇప్పుడసలు చదవాలనిలేదు.

తావ్‌రోవ్‌తో చివరిసారి కలుసుకున్న క్షణాలు మననం చేసుకుంటోంది. ఎంతపద్దనుకున్నా ఆమధురక్షణాలు జ్ఞప్తికొస్తూనే వున్నై. ప్రేమించిన మనిషిని మరచి పోవడం కష్టం. ఇకతన్ని చూడగూడదనీ, చూడరాదనీ దృఢంగా నిశ్చయించుకుంది. ఐనా, హృదయంలో బాధని ఆపుకోలేకుండా వుంది. చనిపోతే బావుండునని పించింది కాస్సేపు. కాని చనిపోగూడదు. జీవించే వుండాలి. జీవించాలి. తప్పదు.... తావ్‌రోవ్‌ని మరచిపోవడం సాధ్యంకాదు.... తన భర్త నిదివరకు ప్రేమించినట్లు ప్రేమించడమూ సాధ్యంకాదు....

"ఈప్రపంచంలో ప్రతిఒక్కరూ ఆనందంగా బ్రతకాలంటే, అదీ సాధ్యంకాదు" అనుకుంది తనలో తాను; "నా పనికోసం.... నాబిడ్డకోసం నేను జీవించాలి; తప్పదు."

# 72

మిల్లునుంచి బయల్దేరాడు తావ్‌రోవ్. కొండలనిండా మంచు అలుముకుని వుంది. కిందనుంచి పొగమేఘాలు పర్వత శిఖరాలవైపుకి లేస్తున్నై. మధ్యమధ్య, అప్పుడప్పుడూ యేదో తెరని చీల్చుకుని బైటపడుతున్నట్టు, పడుతోంది వర్షం. రాళ్ల మీదా, పచ్చికమీదా దబదబా నాలుగు చినుకులు పడడం, మళ్ళీ వచ్చినంత అకస్మాత్తుగానూ మాయమవడం.

గని పేటలోకి వెళ్లాడు తావ్‌రోవ్. నల్లగా భూతాల్లా వున్నై యిళ్లు. తేమగావున్న యిళ్ళకప్పులమీంచి బరువుగా బరువు బరువుగా పైకి పాకుతోందిపొగ; వాతావరణమంతా నిస్ప్రృహాగావుంది. తనయిల్లూ అంతే; ఖాళీగా, నిరాశా

మయంగావుంది. ఈరాత్రికా యింటికెళ్లడం సాధ్యంగాదు; ఆ యింటిలో యేకాంతాన్ని భరించడం తనవల్లగాదు. ఇంత నిరాశ, యింత నిస్పృహ, యిదివరకెప్పుడూ అనుభవించలేదు.

ఓల్గా ప్రవర్తనేమీ అర్థం కాకుండావుంది; ఆవిడకి వుత్తరం వ్రాద్దామంటే ధైర్యంలేదు. ఫోన్ చేస్తే జవాబురాలేదు. వస్తున్నానని ముందు చెప్పకుండానే సరాసరి ఓల్గాయింటికి వెళ్దామనిపించింది; వెళ్ళి యీప్రవర్త నేమిటని అడగాలనిపించింది; వెళ్ళి అడిగేవాడే; కాని ఆవిడంటేవున్న ప్రేమ అభ్యంతరం చెప్పింది. ఇదమిద్ధమని తెలియకపోవడం బాధాకరంగానే వుంది; ఐనా ఓపిగ్గానే భరిస్తున్నాడాబాధ. లేకుంటే ఆవిడ ప్రతిష్ఠ కెక్కడ భంగం కలుగుతుందోనని భయం. బాగా ప్రొద్దుపోయిం తర్వాత ఆయింటివైపు కెళ్ళేవాడు; కిటికీతెరల మీద ఆవిడ నీడ కనిపించక పోతుందా అని. కాని ఆవిడా, ఇవాన్‌వుండే యింటిభాగం అంతా ఖాళీగావున్నట్లనిపించేది; విచిత్రం. చివరికి ఇవాన్ అంటే కోపమూ, అసూయాగూడా కలగడం ప్రారంభమైంది తావ్‌రోవ్‌కి. ఔను మరి; ఇవాన్ ఆవిడభర్త; ఎప్పుడూ ఆవిడెదట వుంటాడు; ఎప్పుడూ ఆవిణ్ణి చూస్తూకూర్చోగలడు....ఇవ్వాళ్టిమట్టుకివ్వాళ....ఆదివారం.... యిద్దరూ యింటిదగ్గర వొకరికొక రెదురుగా కూర్చునుంటారు.

గిరుక్కున వెనక్కి తిరిగి మిల్లువైపుకి బయల్దేరాడు తావ్‌రోవ్, మళ్ళీ. మళ్ళీ మనసు మార్చుకుని, రాళ్లగుట్టల వేపుకి తిరిగాడు. వేసవిలో, ఓల్గాని కలుసుకున్న దిక్కడే. అదే ఆరాయి. ఆరాయిమీదే కూర్చున్న దావిడ, అప్పుడు.... చేతులు రెండూ వొడిలో పెట్టుకుని, కనులువంచి, దీర్ఘాలోచన లోవున్నట్లు....వెళ్ళి ఆరాతిమీద కూర్చున్నాడు తావ్‌రోవ్.

చేతితో ఆరాతిని తాకి చూశాడు; చల్లచల్లగా, తేమతేమగా వుంది. ఓల్గా చేతులు నునువెచ్చగా వున్నై అనాడు; ఇద్దరూ కలిసి చుక్కల క్రింద చకచకా నడిచారు. ఔను. ఆవాళే గనుల్లో కెళ్ళి అక్కడి పరిస్థితులు చూచి, 'ఒకవ్యాసం వ్రాయి' అని తను ప్రోత్సహించింది. ఆ జ్ఞాపకాలన్నీ వేదనగావున్నై యిప్పుడు. మళ్ళీ అలాంటిరాత్రి వస్తుందా!

"ఎంతబావుండును!" అనుకున్నాడు. నిట్టూర్చాడు.

ఇంతలో, ఎవరివో ఆడగొంతులు వినిపించినట్టుంది దాపులోనే. ఇంతకాలం వేచివున్నందు కిప్పుడా ఫలం చేజిక్క బోతుందేమోనని చూశాడు. గతరెండువారాలనుంచీ, ఆనంద మంటే యేమిటో మరచిపోయాడు. ఆగొంతులు వినిపించిన వేపుకి పరుగెత్తికెళ్ళి చూడాలని పించింది. లేచాడు, తమా యించు కున్నాడు. సాచి నాలుగడుగులేశాడు. వార్యా, ఎలీనా, హాస్పిటల్ నర్సులు....తావ్‌రోవ్ కనులు చుట్టూ కలయజూచినై; గుండె ఆశతో దడదడ లాడింది....

"పళ్ళేరుకొద్దామని వెళ్తున్నాం; మీరుగూడా రండి!" అంది వార్యా, తావ్‌రోవ్‌ని చూచి.

"ఎంతో దూరంగూడా వెళ్ళడం లేదు మేం. రండి. ఐనా మా వెంట మగవాళ్ళు గూడా ఎవరూ లేరు. ఎలుగుబంట్లూ అవీ కన్పిస్తే దారిలో....ఎందుకైనా మంచిది మగవాళ్ళు వెంటుం డడం. రండి!" అంది ఎలీనా.

"ఇప్పుడా భయం యేమీలేదులే. కడుపునిండాపట్టించి, యికీ శీతకాలం అంతా యెక్కడపండుకోవాలా అనుంటై ఎలుగుబంట్లు" అంది వార్యా, తావ్‌రోవ్ దగ్గరకొస్తూ, "అబ్బ

అక్కడ పళ్లెట్లా వుంటాయనుకున్నారు? గంపలకి గంపలు. చూపిస్తారండి. ముందీగంపలనిండా పళ్లెత్తుకునేదీ, తర్వాత కూర్చుని, బంగాళాదుంపలు కాల్చుకునేదీ. బావుండదూ? నేనే కాలంలో ఐనా సరే, మంట ముట్టించగలను. మంటవేసుకుని, చుట్టూ కూర్చుని, బంగాళాదుంపలు కాల్చుకుంటూ వుంటే.... ఆహా....రండి!"

ఇంతలో మళ్ళీ వచ్చిపడింది వర్షం. శిఖరాలమీద మేఘాలు మెలికలు తిరుగుతున్నై, కిందపొదలు కలవరపడిపోతున్నై మీదపడిన వానచినుకులు విదలించుకుంటూ.

వాళ్లతోపాటు తాన్‌రోవ్ గూడా యేరడం మొదలెట్టాడు పళ్ళు. ముందు వార్యా గంప; తర్వాత ఎలీనాది. వీళ్ళిద్దరూ వుండేది ఓల్గా వున్నయింట్లో; ప్రతిరోజూ ఆవిణ్ణి కలుసుకుని మాట్లాడుతుండే మనుషులు. తానసలిటు బయలుదేరింది ఓల్గా సంగతి కనుక్కుందామని. పాపా యేదో చెప్పిందిగాని, ఆవిడ మాటలధోరణి వేరు. ఏదో వాగుతుందదే పనిగా. కావలసింది చెప్పదు; చెప్పలేదు. తన పరిస్థితిని తలుచుకుంటే తనకే విచారం వేస్తోంది.

"ఇక చాల్లెండి; గంపలు నిండిపోయినై" అంది వార్యా, నడుంలేపి నవ్వుతూ.

నిజంగానే ఆవిడ గంప నిండిపోయింది. మిగతా వాళ్ళింకా యేరుతూనే వున్నారు.

"రండి, వెళ్ళి వంటచెరకు పోగుచేసుకొద్దాం" అంటూ పరుగెత్తింది వార్యా. గారడీవాడి మల్లే యెక్కణ్ణుంచి తీసిందోగాని బయటికి తళతళా మెరిసే కత్తి పట్టుకుంది చేత్తో.

ఎండిపోయిన బూరుగుచెట్టు కొమ్మలు నరికేసింది గబగబా. ముందా చెట్టుబెరడు కంటించింది నిప్పు. తర్వాత చిన్న చిన్న రెమ్మలూ అదీ వేసింది నిప్పులోకి; తర్వాత పెద్దపెద్ద కొమ్మలు నరికి పడేసింది. కన్నుమూసి తెరచేప్పటికి పెద్ద చలిమంట!

"ఏమండీ! ఆరోగ్యం బాగ్నుంటం లేదా?" అనడిగింది వార్యా, తావ్‌రోవ్‌ని, బంగాళాదుంప లతనివేపుకు విసిరేస్తూ. వాటిని మండే బొగ్గులకింద, మట్టిలో కూరాలి. "ఈ మధ్య మరీ వాడిపోయింది మీ ముహం. కాలు మళ్ళీ నొప్పిచేస్తోందా? శీతకాలం కదూ; చేసినా చెయ్యోచ్చు." మళ్ళీ నాలుగు కొమ్మ లేసింది నిప్పుమీద. ఒక్కసారి పొగ గప్పుమని లేచింది. కళ్ళు నులుముకుంటూ తావ్‌రోవ్‌వంక చూచింది వార్యా, 'జవాబు చెప్పరే' అన్నట్టు.

తావ్‌రోవ్ యేమీ మాట్లాడలేదు. ఒక పుల్ల తీసుకుని మండే కొమ్మ నొకదాన్ని పొడిచాడు, నిప్పు రవలు లేచినై గాలిలోకి; మళ్లీ నిమిషంలో అంతర్ధానమై పోయినై.

"కాదు. వార్యా! అదికాదు." అన్నాడు చివరికి నాకొక సంగతిచెప్పు. "నువ్వు ప్రేమించావనుకో. ప్రేమించ బడ్డావుగూడా అనుకో. ఇంతలో నీ ఆనందానికి అంతరాయం కలుగుతుంది పరిస్థితుల మూలాన. అంటే ఆ పరిస్థితులుగూడా అగమ్యగోచరమైన వనుకో........." ఈ బాధ పడుతూన్నది తనొక్కడే కాదనీ, యింతకంటే బాధ పడుతున్న యింకొక వ్యక్తి వున్నదనీ గుర్తుకొచ్చి, మధ్యలోనే ఆగిపోయాడు తావ్‌రోవ్.

చాలా సానుభూతితో, వింటూ కూర్చుంది వార్యా అతను మాట్లాడడం మానేశాడు. మరీ యెక్కువగా మాట్లాడు

తున్నానని భయపడి పోయాడేమో అనుకుంది వార్యా. ఇంకా స్సేపిలాగే మాట్లాడితే మంచిదనుకుంది. "నేను ప్రేమిస్తున్న మనిషి నన్ను ప్రేమిస్తే ఇంతకంటె కావలసిందేముంది నాకు ?" అనుకుంది.

"ప్రేమించుకునే వాళ్ళలో పొరపాటు అభిప్రాయాలు రానివ్వను నేను" అంది వార్యా, "ఇద్దరు ఒకరి నొకరు ప్రేమించు కుంటున్నారంటే, ఆ వ్యక్తి జీవితం యీ వ్యక్తిదీ; యీ వ్యక్తి జీవితం ఆ వ్యక్తిదీనీ. ఇకప్పుడు వ్యక్తిగతం అంటూ వుండదు."

తన విషాదంలో యెంతోకొంత పాలు, వార్యాతో పంచుకోకుండా వుండలేక పోయాడు తావ్‌రోవ్: "కాని ఆ యిద్దరిమధ్యా మరో మూడోవ్యక్తి వుంటే ?"

"మూడో మనిషా ?" అంది వార్యా, కనుబొమలు కలిపి, ఆనందానికి మధ్య నిలబడిన మూడోవ్యక్తిని గురించి కాదు యిప్పుడు వార్యా ఆలోచిస్తున్నది; ఇప్పుడావిడ ఆలోచించేది ఇవాన్ ఇవానొవిచ్‌తోనూ ఓల్గాతోనూ తనకున్న సంబంధాన్ని గురించి.

ఇవాన్ ఇవానొవిచ్ తనని నిజంగానే ప్రేమిస్తే? కాని అది వూహాతీతమైన విషయం ఎందుకనంటే ఆయన కొక కుటుంబం వుంది—భార్యవుంది; ఆ భార్యంటే మంచి ప్రేమ గూడాను ఆయనకి. ఇంక తావ్‌రోవ్ కేమి సలహా యివ్వ గలుగుతుంది వార్యా.

తావ్‌రోవ్ మాట్లాడకుండా వుండలేక పోయాడు.

"మా యిద్దరిమధ్యకీ రావడానికి అతని కేంఅధికారముంది?

ఆపిడ ప్రేమిస్తూన్నది నన్ను; అతన్ని కాదు. ఆ విషయం ఆవిడే, స్వయంగా చెప్పింది నాకు. అదీకాక........"

"ఉఁ. అదీకాక ?" అనడిగింది వార్యా; తావ్‌రోవ్ ఎవ రిని గురించి మాట్లాడుతోందీ యిప్పటికీ తెలియదు ఆవిడకి.

"ముందొకటి చెప్పునాకు. ఆవిడకీ పెళ్ళైందని చెప్పాను గదా, అలాంటప్పుడు మేం యిద్దరం వొకరి నొకరు ప్రేమించు కోడానికీ, యిద్దరం కలిసి వుండాలని అనుకోడానికీ హక్కుందా, లేదా, మాకు ?"

కనులు కిందికి, వంచి ఆలోచించింది. వార్యా; తిరిగి తలపైకెత్తి చూచినప్పుడు ఆపిడ కనులు నిర్మలంగా వున్నై; ఆలోచిస్తున్నట్లున్నై.

"నాకేం తెలుసును; నేను సామాన్యురాలిని. అందు లోనూ వెనుకబడిన ప్రాంతంలో పుట్టి పెరిగిన దాన్ని.... సోవియెట్ ప్రభుత్వం మన కనేక హక్కులిచ్చింది, నిజమే. కాని, మనం మననిగాని, యితరుల్ని గాని మోసగించ వచ్చునన్న హక్కును మాత్రం యివ్వలేదు. ఐనా మనం అంత నీచులం కావలసిన అవసరమూ లేదు, మోసగించవలసిన అగత్యమూ లేదు. మనదొక కొత్త చట్టం; కొత్త న్యాయం. నాకే వివా హమై, నాభర్త ఇంకొక స్త్రీని ప్రేమిస్తున్నాడని తెలిస్తే...." తాను చెప్పేదంతా అనుభవిస్తూన్నట్లే, వార్యా ముహం వివర్ణమైంది. "నిజమే, బాధపడతాను; చాలా బాధపడతాను. తిరిగి ఆయన ప్రేమని సంపాదించేందుకు నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. ఐనా, విఫలమైతే, 'మీరంత బాధపడడం నాకిష్టంలేదు. మీ సుఖాన్ని కాదనగల హక్కు లేదు నాకు. వెళ్ళి, మీరు ప్రేమించే స్త్రీతోనే సుఖంగా వుండండి' అని

చెప్పేసం వేస్తాను" అని ఒకనిమిషం ఆలోచించింది వార్యా; "మీరేం చెయ్యాలో, యేం చెయ్యగూడదో చెప్పగలగడం కష్టం. బహుశా, ప్రతి వ్యక్తిగత సమస్యా విభిన్నంగానే వుంటుందనుకుంటాను. మనుషులే అంత. ఒకర్ని పోలిన వారెం కొకరుండరు. కాని మన జీవితం అంతా ఒకటే. న్యాయమైనదీ, సరైనదీ చెయ్యాలనే మనందరి ఆకాంక్షానూ."

"బంగాళా దుంపలు! మాడి బొగ్గులై పోతున్నై" అంటూ పరుగెత్తుకొచ్చింది ఎలీనా; వచ్చి అన్నీ కుల్లగించి బయటకి తీసింది; ఐనా, వంటమనుషులు వేదాంతం మాట్లాడితే యెట్లా? వంటపాడై పోదూ?"

# 73

ఇవాన్ ఇవానొవిచ్ అడుగుల చప్పుడు విన్పించింది ఓల్గాకి; ఐనా మంచంమీంచి లేవలేదు. ఇవాన్‌తో పాటు డెనిస్ గూడా వస్తున్నాడు; ఆయన గొంతే అది అని గూడా తెలుసు; ఐనా లేవలేదు. పొద్దుపోయింది. బాగా చీకటిగా వుంది. ఇద్దరూ యేదో సమావేశానికెళ్ళి, వస్తున్నారు. ఇప్పుడావిడ అవసరం యేమీ వుండదు వాళ్ళకి. ఇద్దరూ కూర్చుని మాట్లాడు కుంటారు కావాలంటే........

కాని యింతలో, యింకెవరివో అడుగులు గూడా వినిపించినై. ఆ మూడో వ్యక్తి గొంతుకూడా వినిపించింది; ఎవరో గుండెల్లో గునపాలు గుచ్చుతున్నట్లనిపించింది ఓల్గాకి. సందేహంలేదు; అది తావ్‌రోవ్ గొంతే. ఏమిటలా వుంది, అంత బోలుబోలుగా, ప్రాణంలేనట్టు, జబ్బుపడిన మనిషి గొంతులా.... ....

"ఓల్గాకి వొంట్లో బావుండలేదు" అని చెబుతున్నాడు ఇవాన్, "కూర్చోండి. డెనిస్! యిక్కడే వుండండి మీరు గూడా, వెళ్ళి, యివ్వాళెలా వుందో చూచొస్తాను."

"నిద్రపోయ్యావా, ఓల్గా?" అనడిగాడు అతినెమ్మదిగా; గదిలోకెళ్ళి, ఓల్గా నుదుటిమీద చెయ్యివేసి, "ఎలావుందివ్వాళ?" అనడిగాడు.

"బాగానే వుంది" అని చెప్పింది, కళ్ళు తెరవకుండానే.

"హాల్లోకొచ్చి, కాస్సేపు మాతో కూర్చోగలవా? బోరిస్ తావ్‌రోవ్, డెనిస్ వచ్చారు, అక్కడ కూర్చునున్నారు. నీకని పళ్ళుగూడా తెచ్చాం. నీకిష్టమని 'సామీ' బుడ్డిగూడా తీసు కొచ్చాను."

వద్దని చెప్పేదే కాని, ఎందుకనో మాట్లాడలేక పోయింది ఓల్గా.

ఇవాన్ అలాగే నిలబడున్నాడు ప్రక్కనే.

"సరే, వస్తాన్లెండి" అంది.

అప్పుడాలోచించింది ఓల్గా, తావ్‌రోవ్ యెంత బాధ పడుతున్నాడో నని, "ఏమనుకున్నాడో?" అనుకుంది; "గొంతలా మారిపోయిందేమిటి?"

లేవక తప్పదు. లేచింది. వెళ్ళి దుస్తులు మార్చుకుని అద్దం ముందు కెళ్ళింది. అద్దంలోంచి ఎవరో ముసలావిడ చూస్తు న్నదనిపించింది. తనకళ్ళు తనే నమ్మలేక, యింకొకడుగు ముందు కేసింది. ముహం అంతా తెల్లబడి పోయింది. బుగ్గలు గుంటలు పడినై. కళ్ళక్రింద నల్లటి చారలు. కనుబొమల మధ్య ముడుతలు. ఆ ప్రతిబింబాన్ని చూస్తుంటే, పెదవులు

వణకిపోయినై. ఇంతలో, యింత ముసలిదై పోయిందా తను! ఒక నిట్టూర్పు విడిచింది ఓల్గా. ఇంకా ఆ మారిపోయిన మొహం వంక చూస్తూనే, హాలులో కూర్చున్న వాళ్ళ మాటలు వింటూ నిలబడింది. తావ్‌రోవ్ మాట్లాడుతున్నాడు. ఏం మాట్లాడుతున్నాడో స్పష్టంగా వినబడడం లేదు కాని, మొత్తంమీద గొంతిప్పుడిందాకటి కంటే హుషారుగా వున్నట్టే వుంది. తనకోసం వేచి చూస్తున్నాడతను. సరే, ఇలాగే కనబడడం మంచిది; తనెంత అనాకర్షణీయమైన వ్యక్తో తెలిసొస్తుంది. ఇప్పుడు తనరూపు చూస్తే, బహుశా తన వుద్దేశం మార్చుకున్న మార్చుకుంటాడేమో అతను. గుమ్మంవైపు కొక అడుగేసింది. మళ్ళీ సందేహం. తనభర్తగూడా అక్కడే వున్నాడు. ఆయన ముందు తావ్‌రోవ్ నెలా కలుసుకోవడం? ఏమని మాట్లాడడం?

ఈ క్షణిక బలహీనత నెలాగో ప్రక్కకు నెట్టి, తలుపు తెరిచి, హాలులో కెళ్ళింది; మూర్ఛ వొచ్చినంత పనైంది.

ఇవాన్ ఇవానొవిచ్, ఏపుల్ పళ్లు సర్దుతున్నాడు ప్లేట్లలోకి. డెనిస్ యేదో తరుగుతున్నాడు చాకుతో. ఆ గదిలోకి ఓల్గా అడుగుపెట్టడం ఆ యిద్దరిలో యెవరూ గమనించలేదు. ఏంచెయ్యాలో తోచకలాగుంది, తావ్‌రోవ్ ప్రక్కనే పడున్న వస్తువేదో తీసుకుని చూస్తున్నాడు. ఓల్గా అతనిదగ్గర కెళ్లింది. లేచి నుంచున్నాడతను. మాటలేదు, పలుకులేదు. చేతులు మాత్రం వణకిపోతున్నై. అతన్ని చూస్తున్నకొద్దీ ధైర్యం హెచ్చింది ఓల్గాకి. చింతా చీకులేని మనిషిలా అదే పనిగా మాట్లాడింది భర్తతో. డెనిస్‌తో ఎకసక్కాలాడింది. కాని చివరికి, గ్లాసుల్లో వైన్ పోసే సమయానికి మళ్ళీ మూగదా

నిలా మొహంముడుచుకు కూర్చుంది; తావ్‌రోవ్ తదేకంగా రెప్పవెయ్యకుండా చూస్తున్నాడు తనవంక. అలా చూడ గూడదని ఎలా చెప్పడం అతనికి? ఇకిలా యీ వ్యవహారం కొనసాగటానికి వీల్లేదని చెప్పడం యెలా?

"వాలెంతినోవిచ్ చెప్పాడు, ప్రతిరోజూ షికారుకెళ్ళ మని" అని అన్నది డెనిస్‌తో; "గత మూడువారాల నుంచీ యింట్లోనుంచి బయటికి అడుగు పెట్టలేదు నేను. ఇకిలా యింట్లో కూర్చుంటే నాకీతలనొప్పి తగ్గేట్టులేదు. ఇక రేపట్నుంచీ, అలా కొండలవేపుకి షికారు కెళ్దామనుకుంటున్నా."

# 74

ఆ వేళల్లా చలిచలిగా వుంది. ఆకాశంలో మేఘమన్న మాటలేదు; అంతా తెల్లగావుంది, ఒకటే తెలుపు. దారికటూ యిటూ రాలిపోయిన ఆకులు గలగల మంటున్నై.ఎటుచూచినా ఏకాంతం!

అలాగే కొండలమీది కెక్కింది ఓల్గా. మరీయెత్తు గుట్టలమీద కెక్కవలసి వచ్చినప్పుడు, చిన్నచిన్న గడ్డిదుబ్బులు పట్టుకుని పైకెగబాకింది. తీరా పైకెక్కిం తర్వాత చేతులూ మోకాళ్ళూ వణకిపోవడం ప్రారంభించినై. ఈ మధ్య అలవాటు తప్పిపోవడంవల్లనో, లేక, తావ్‌రోవ్ వచ్చి కలుసుకుంటాడనే భయంవల్లనో, చెప్పడం కష్టం. 'ఇక్కడ యిద్దరమూ కలుసు కుందామని అనుకోలేదు'; ఐనా అతను తప్పక వస్తాడని తెలుసు ఓల్గాకి.

అంచేత, చివరికతను కన్పించినప్పు డావిడేమీ ఆశ్చర్య పడలేదు. గబాగబా అడుగులేసింది అతన్ని కలుసుకుందామని; అతనూ పరుగెత్తుకొచ్చినట్టొచ్చాడు ఆవిణ్ణి కలుసుకునేందుకు.

తావ్‌రోవ్‌ని కలుసుకున్నప్పుడేమనాలో యింటిదగ్గర ఆలోచించుకుని వచ్చింది ఓల్గా. కాని ఆవిడ పెదవికదపకముందే వచ్చి, కౌగలించుకున్నాడు తావ్‌రోవ్. కొంతసేపిద్దరూ అలాగే నిలబడిపోయారు యేమీ మాట్లాడకుండా. తర్వాత, యిద్దరూ, ఒకరిప్రక్కనొకరు నడుస్తూ, ముందుకెళ్ళారు.

ముందు బహిర్ప్రపంచంలోకి వచ్చింది ఓల్గా కాదు. తావ్‌రోవ్ యేమీ మాట్లాడకుండా వూరుకుంటే, యింకా చాలాసేపలాగే వుండిపోయేదేమో ఆవిడ.

"ఇవాన్ ఇవానోవిచ్‌తో చెప్పేస్తాను, మీరొప్పుకోండి" అన్నాడు తావ్‌రోవ్, ఆవిడ చేతులు నిమురుతూ. ఆ చేతులు చల్లగా వున్నై గడ్డకట్టుకున్నట్టు.

తలవంచుకుంది ఓల్గా. గాలివిసురికి, నెత్తిమీద కట్టుకున్న రుమాలులోంచి తప్పించుకునిముహంమీదికొచ్చిపడుతోందిజుట్టు. తావ్‌రోవ్‌గూడా చాలాదగ్గరగా నిలబడున్నాడు. గాలికెగిరి పడే జుట్టు ఇటు ఓల్గా ముహానికీ అటూ తావ్‌రోవ్ ముహానికీ గూడా తగులుతోంది.

ఇద్దరిచుట్టూ దేవదారు చెట్లు. మేఘాలొకదాన్నొకటి తరుముకొస్తున్నై పైపైకి, కొండల వెనకనుంచి. చుట్టూ వున్న వాతావరణం లాగానే వున్నారు వాళ్ళిద్దరూనూ విచారంగా.

"జవాబు చెప్పరేం?" అనడిగాడు తావ్‌రోవ్ బాధగా,

"మళ్ళీ వెళ్ళి ఆ నాలుగ్గోడల మధ్యపడి వుంటారా? అదిమంచి పద్ధతికాదు, ఓల్గా."

"ఇక మనం కలుసుకోగూడదు" అంది ఓల్గా, పెదవులు బిగబట్టుకుని; "నేనిప్పుడు గర్భవతిని" ఆ మాటల తాకిడికి తానే నిలబడలేకపోయింది; ప్రక్కనేవున్న రాతిమీద చతికిల బడిపోయి, రెండు చేతుల్తోను ముహంకప్పుకు కూర్చుంది.

"ఓల్గా!.... నా ఓల్గా!" అంటూ ఆవిడ ప్రక్కనే కూర్చోబడ్డాడు తావ్‌రోవ్. ముహానికి కప్పుకున్న చేతులు విడదీసి, ఆవిడ కన్నుల్లోకొకసారి చూడాలనుకున్నాడు. కన్నీటితో తడిసివున్నై చేతులు. ఆ చేతులు దీసి ముద్దుపెట్టుకున్నాడు. "ఐతే మాత్రమేం? ఈ బిడ్డాయనబిడ్డ ఐనా ఫర్వాలేదు; నాబిడ్డలాగే చూసుకుంటాను నేను."

"ఇక లాభంలేదు" అన్నది ఓల్గా విచారంగా; "నాకూ బాధగానే వుంది. నా మనసూ ఆక్రోశిస్తుంది. ఐనా, నేనేం చెయ్యలేను" అంటూ జేబులు వెదుక్కుంది జేబు రుమాలు కోసం. లేదు. తలకి కట్టుకున్న రుమాలు వూడదీసి, కన్నీరు తుడుచుకుంది. "మనం విడిపోవలసిందే" అన్నది మళ్ళీ.

"వద్దు, వద్దు, ఆ మాటనొద్దు. మనం విడిపోగూడదు" అన్నాడు తావ్‌రోవ్, గట్టిగా. ఓల్గా చేతుల్లోంచి రుమాలు తీసుకుని మళ్లీ ఆవిడ తలకి కట్టాడు, గడ్డం కింద ముడేసి. "నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు. కాదూ? నాకు తెలుసు నువ్వు నన్ను ప్రేమిస్తున్నావని."

"నిజమేం. ప్రేమిస్తున్నాను. ఐనా, యిక మనిద్దరం కలిసి వుండడం సాధ్యంగాదు.... అసంభవం.... ఇక మీరు నన్నొదిలిపెట్టాలి."

తలెత్తి చూశాడు తావ్‌రోవ్ ఆవిడ ముహంలోకి. ఆ చూపూ, ఆ మాటలూ....భరించలేకపోయాడు. లేచి, అడుగులో అడుగు వేసుకుంటూ కొండలు దిగి, వెళ్ళిపోతున్నాడు.

అతను వెళ్ళిపోతూంటే కళ్ళప్పగించి చూస్తూకూర్చుంది ఓల్గా; పెదవులు బిగపట్టుకుని; నోట్లోనుంచి మాట పెగల్లేదు; కాని ఆ కనులు తన్ని పిలుస్తున్నట్లే వున్నై. వెళ్ళిపోతున్న తావ్‌రోవ్ వెనక్కి తిరిగి చూశాడు.

"ఓల్గా!" అంటూ వచ్చిపడ్డాడా విడపాదాల దగ్గరికి.

ప్రేమ, జాలి అనుతాపం.... కాని మళ్ళీ మనసుని చిక్కబట్టుకున్నద ఓల్గా.

"యెందుకూ అలా బాధపడతారు? నాకు మాత్రం.... ఐనా లాభంలేదు" అన్నది, నిర్ధారణ చేసేసినట్టు.

లేచి వెనక్కి తిరిగాడు తావ్‌రోవ్; గబాగబా నడిచి వెళ్ళిపోయాడు, ఒక్కసారిగూడా వెనక్కి తిరిగిచూడకుండా, దుఃఖభారంతో కుంగిపోతూ.

మైకం కమ్మినట్టలాగే, కూర్చున్న చోటనే కూర్చుండిపోయింది ఓల్గా. స్పృహవచ్చి చూసేటప్పటికి వానజల్లు పడుతోంది; ఆ జల్లు అంతలోనే మంచుగా మారిపోయింది: మంచు కురుస్తోంది. అడవిబాతుల గుంపొకటొచ్చి పడింది మబ్బుల వెనకనించి. దక్షిణానికెళ్ళవలసిన బాతులు, దగ్గర్లోనే వున్న కొలను గట్టున వాలినై. చాలాసేపటిదాకా ఆ అడవిబాతులక్కడ రొదచేస్తూనే వున్నై. అటుకొండలూ, యిటు మైదానాలూ, ఎక్కడచూచినా ఎండిపోయిన చెట్లు; ఈ పాడుమంచు వొచ్చి, పచ్చని చెట్లని పొట్టన పెట్టుకుంది.



# 1

ఈ యేడు శీతకాలం కాస్త ఆలస్యంగా వచ్చింది. ఎడతెరిపి లేకుండా పడుతోంది మంచు. అటు పర్వతాలమీద, యిటు లోయలోనూ గూడ చెట్లు వణికి పోతున్నట్లున్నై యీ మంచు దాడికి ఆగలేక. ఎటుచూచినా మంచువర్షం. ఎటుచూచినా మంచుమయం. ఒడ్డు లొరుసుకుంటూ ప్రవహించే నదులు గడ్డకట్టినై; దీనికితోడు హోరుమంటూ వొకటేగాలి; అటుకొండ శిఖరాలమీదనుంచి చిన్నచిన్న రాళ్లూ, ఎండుకొమ్మలూ కొట్టుకొస్తున్నై గాలితోబాటు; లోయలోంచి యిసుకెగిరి పడుతోంది బఁయ్ఁ మంటూ. నదిమీద పేరుకున్న మంచుపగుళ్లలోంచి నీరు మెరుస్తూకన్పిస్తోంది నల్లనల్లగా. నది కటూయిటూ ఒడ్డున దేవదారు చెట్లపొదలూ అవీ కన్పిస్తున్నై మాసికలు మాసికలుగా.

ఈ ఆర్కిటిక్ ప్రాంతం గాలే అంత; కొరుక్కుతింటోంది; అతిధులూ అభ్యాగతులూ అన్న భేదంకూడా పాటించదు.

ఉండుండి గాలితగ్గింది. ఇంతవరకూ కురుస్తున్న మంచు యెక్కడిదక్కడ నేలమీదపడి వూరుకుంది.........

ఇవాన్ఇవానొవిచ్ వున్నికోటుమీద తెల్లగా నక్షత్రంలా పడిందొక మంచుబొట్టు. ఆబొట్టునుచూసి, చిరునవ్వు నవ్వుకున్నాడు ఇవాన్; అంత బావుంది దానిరూపు. ఇంతలో అలాంటిబొట్లు ఒకటి, రెండు, మూడు, నాలుగు....వచ్చిపడినై ఇకిప్పుడు కోటంతా మంచే; మంచుబొట్లన్నీ కలిసి, కోటుకు మంచుపాకుడు పట్టినట్టయింది. చుట్టూ కలయ జూచాడు ఇవాన్; ప్రకృతి అంతా మంచుదుప్పటి కప్పుకున్నట్టుంది. పర్వత శిఖరాలూ, కొండగుట్టలూ, చెట్లకొమ్మలూ, చెట్టూ, మోళ్లూ....ఒకటేమిటి? అంతా, అన్నీ చూడ చక్కగా, నున్నగా, తెల్లగా వున్నై; ఆకురాలు కాలం వెళ్ళిపోయింది: శీతకాలం వచ్చేసింది. ఇదివరకటి మొరటుదనం లేదు ప్రకృతిలో యిప్పుడు; అంతా మృదువుగా, మెత్తగా, ఆహ్లాదకరంగా వున్నట్టుంది.

ఇవాన్ ఇవానొవిచ్కీ అలాగేవుంది. ఆకురాలుకాలంలో అమితంగా బాధపడ్డాడు; ఈమంచు వర్షంతో మనశ్శాంతి కలిగినట్లైంది. కాని....ఓల్గా ప్రేమకి తాను దూరమై పోతున్నట్టు యిప్పుడిప్పుడే అర్థంకాతోంది అతనికి. ఇంతవరకూ ఆవిడప్రేమ అతని జీవితానికి సౌఖ్యాన్నిచ్చింది; ఆనందాన్నిచ్చింది. వొచ్చే ప్రమాదాన్నిముందే పసికట్టగలిగిన వాతావరణ శాస్త్రవేత్తలా ప్రకృతిని పరిశీలించుతున్నా డత నిప్పుడు; చెట్లమీద మిగిలిపోయిన ఆ నాలుగాకుల్నిగూడా తుడిచి పెట్టుకుపోయింది

యిందాకటిగాలి. కొత్త ఆకులుతొడిగి, పూవులు పూసేందుకు సిద్ధంగా వున్నై యెండిపోయిన చెట్లు; ఐనా రాలిపోయిన ఆకుల్ని తలచుకుని విచారిస్తున్నట్టు నిలబడున్నై మోడుబారి. కొమ్మలు పెళుసుబారి, వొకదాన్నొకటి రాచుకుని గరగర మంటున్నై బాధపడుతున్నట్టు. చెట్లబెరడు కంటుకున్న మంచు బిందువులు, సాయంకాలపు సూర్యకాంతిపడి, ఎర్రగా, నెత్తురు బొట్టుల్లా వున్నై.

ఊళ్లో పార్కుపక్కగా బడి నదివైపుకు నడిచెళ్లాడు ఇవాన్. విచారంగా, యీలవేసుకుంటూ, చెట్లసందునబడి వెళ్తున్నట్టుంది గాలి. నదిదగ్గర కెళ్ళాడు. ఇంతవరకూ మసకమసగ్గా, పసుపుపచ్చగావున్న మంచురంగు మారింది; స్వచ్ఛంగా నీలిరంగులు కక్కుతోంది. ఇకిప్పుడు మనస్సు నాహ్లాద పరచుకోడానికి మార్గమంటూ యేమీలేదు ఇవాన్‌కి; మరీ తోచనప్పుడీలా సాయంకాలం షికారుకు బయల్దేరడం వొక్కటిమాత్రం మిగిలుంది. భుజాన తుపాకి వేళ్లాడేసుకుని బయల్దేరాడు. ఆ నది పక్కనేబడి తిరుగుతూంటే భార్య సంగతి గుర్తుకొచ్చింది. ఇప్పటికీ తనతోనే వుంటోంది ఓల్గా; ఐనా ఆవిడ రహస్యాలోచనలూ, భావాలూ యేమిటో తనకు తెలియవు. ఈ మధ్య మరీ మారిపోయింది; ఇదివరకటి ఓల్గా కాదు. ఆ ప్రేమ లేదు; ఆ సామీప్యం లేదు; ఆ ఆప్యాయం లేదు. ఇవాన్ చాలా ప్రయత్నం చేశాడు ఆవిణ్ణి దగ్గరికి తీసుకోవాలని; తనంటే ఆవిడకు విశ్వాసం కలిగేట్టు చేసుకోవాలని. లాభం లేకపోయింది. ఆవిడ మరింత దూరంగా జరుగుతోంది; మరింత ఏకాంతం కోరుతోంది. తలుపులన్నీ మూసుకుని గడవేసుకుని కూర్చున్నట్టుంటోంది; మనసులోకి తొంగిచూచే అవకాశమూ, ఆస్కారమూ లేకుండా

చేస్తోంది. ఇంట్లోనుంచి బయటికి వెళ్ళిందీ అంటే, ఎక్కడికి వెళ్ళిందో తెలియదు; ఎవర్ని కలుసుకుందో తెలియదు. తను హాస్పిటల్ కి వెళ్తే, ఆవిడ యింటిదగ్గర కాలం యెలా వెళ్ళబుచ్చుతూందో తెలియదు; సాయంకాలం పూట మనస్సు నాహ్లాద పరచుకోడానికేం జేస్తోందో తెలియదు. ఒక్కోసారి, అలాగే శూన్యంలోకి శూన్యంగా చూస్తూ కూర్చుంటుంది. గంటలతరబడి, బాహ్యప్రపంచంతో తనకేమీ సంబంధం లేనట్టు.

అలా, ఒంటరిగా, ఆవిడ కాలం వెళ్ళబుచ్చుతూంటే చూచి, బాధపడిపోయేవాడు ఇవాన్. ఇంట్లోవున్న నిశ్శబ్దాన్ని భరించలేక, సాయంకాలం పూట, వొంటరిగా, షికారుకని బయల్దేరుతున్నాడు. అతనితోపాటు షికారు కెళ్ళడం మానేసింది ఓల్గా. షికారుకన్న మాటే యేమిటి, ఎక్కడికీ కలసి వెళ్లడమే లేదసలు. ఇవాన్ కీ తెలుసు ఆవిడ, కావాలనే తనతో రావడం లేదని. ఐనా చూడనట్టు నటించాడు, గుర్తించనట్లు వూరుకున్నాడు; అలా వూరుకుంటేనే మంచిదేమో అనుకున్నాడు. అంతేగాదు; తనని తాను మోసగించుకోవాలని గూడా ప్రయత్నం చేశాడు. మొట్టమొదట తను ప్రేమించింది ఓల్గాని; ఇంకా ఓల్గాతోనే తన ప్రేమగూడా అంతమౌతుందేమోనని భయపడ్డాడు.

ఒకనాడు, హాస్పిటల్ నుంచి తిరిగొచ్చి చూస్తే, ఎప్పటిలాగానే నిద్రపోతూవుంది ఓల్గా. ఆవిడ మంచం ప్రక్కనే యేవో చిన్న చిన్న దుస్తులూ; లేసూ పడున్నై. దగ్గర కెళ్ళి, యేమిటా అవని కదలించి చూశాడు: చిన్నపిల్లల చొక్కా, పసిపిల్లల టోపీ,.... మనిషి హృదయం కరిగింది; ఆ వస్తువుల వంకా, దుస్తులవంకా ఆప్యాయంగా, గౌరవంగా చూశాడు.

'నిజమేనా ?' అని ఆశ్చర్యపోయాడు. "ఐతే, నానుంచి దాచడం యెందుకు ? మరీ అంత దిగులుగా వుంటుందెందుకని ? ఇలాంటి పరిస్థితిలో, యెప్పుడూ, యీ నాలుగు గోడల మధ్యా వుంటుండెందుకు ?"

"ఆఁ. ఇవన్నీ పావాకోసం తయారు చేస్తున్నా" అని చెప్పింది ఓల్గా, మెలుకున్న తర్వాత.

ఔను. మరి పావా వచ్చి తన్నలా అడిగిందేమిటి ? ఆ పావాకి ఓల్గా యీ సాయం చేయడమేమిటి ? ఇవాన్ కేపీం పాలుపోలేదు.

అలాగే చూస్తూ కూర్చుంది ఓల్గా, భర్తవంక. ఎంత కాలం దాస్తుందో రహస్యం ? చెప్పేద్దామనే అనుకుంది. కాని....ఇవాన్ ఆ వార్తవిని ఎగిరి గంతేస్తాడు, సంతోషిస్తాడు ఆ సంతోషంలో తాను పాలు పంచుకోలేదు. చెప్పుదామను కున్నా చెప్పలేదు; వూరుకుంది. "ఇంకొంత కాలం పోతే, నేనూ సంతోషిస్తానేమోలే" అనుకుంది, నిరుత్సాహంగా.

నెమ్మదిగా నదివొడ్డునేబడి నడిచాడు ఇవాన్. మంచు పగుళ్ళదగ్గర, కాళ్ళకిందబడి కసాపిసా నలుగుతోంది మంచు. మిగతా ప్రకృతి అంతా నిశ్శబ్దంగావుంది.

నది ప్రక్కనున్న పొదల్లోవున్న కౌజుపిట్టలా శబ్దానికి లేచి, ఎగిరిపోతున్నై, పైన పేరుకున్న మంచు విదలించుకుంటూ. ఆ విదలించుకున్న మంచు చిమ్మేడు గొట్టంలోంచి వచ్చే జల ధారలా మెరసి పోతూంది. పిట్టలుమట్టుకు మంచుబంతుల్లా యెగిరిపోతున్నై.

మళ్ళీగాలి. కొమ్మలమీద పేరుకున్న మంచు రాలి పోతూందాగాలికి.

పర్వతం పాదాలదగ్గర కెళ్ళాడు ఇవాన్ నడుస్తూనడుస్తూ. ఎటుచూచినా చెట్లమోళ్లు; నిలువెత్తున నగ్నంగా నిలబడివున్నై నెత్తిమీద మంచుటోపీలు పెట్టుకుని. వాటిని చూచి ఆశ్చర్య పోయాడు ఇవాన్; "అంతెత్తున ఎవరు నరికారబ్బా?" బ్రహ్మ రాక్షసుల్లాంటి వాళ్లెవళ్ళో నరికుండాలనిఅనుకుంటూ ముందుకు యింకా నాలుగడుగులేశాడు.

'ఓహో!' అనుకున్నాడు చుట్టూచూచి. అదికాదు; ఈ చెట్లని నరికేసిందిప్పుడుగాదు; భూమ్మీద మంచు రెండు మీటర్లెత్తున పేరుకున్నప్పుడు వొచ్చుంటారు యీకట్టెలు కొట్టేవాళ్లు అప్పుడున్న మంచుకంటా నరికారు చెట్లమొదళ్లు. తర్వాత మంచు కరిగి పోయింది కిందికి.

'నాజీవితమూ యిలాగేవుంది. నాకు నాజీవితం బాగానే వున్నట్టుంటుంది; సాధారణ జీవితంలాగానే వుంటుంది; సహజంగా వున్నట్టేవుంటుంది. కాని యితరులకి మాత్రం మహా విడ్డూరంగా వుంటుంది; అతి విచిత్రంగా వుంటుంది.' అనుకుంటూ మళ్లీ నదివొడ్డుకు నడిచాడు.

ఇంతలో, గనులవేపునుంచెవరివో గొంతులు వినిపించినై. తలెత్తిచూస్తే యిద్దరు *'స్కీ' లమీద పరుగెత్తుతూ కన్పించారొకమలుపులో. అందులోవొకరు వార్యా; యింకొకరుఓల్గా.

వేసుకున్న స్వెట్టర్ మూలాన బాగా వెడల్పాటి భుజాలున్న స్త్రీ లాగుంది ఓల్గా. ఏదో చెప్పబోతున్నట్టు భర్త

* **మంచు చెప్పులు: వలచగా, పాదంకంటే అనేకరెట్లు పొడుగుగావుంటై చివర్లు వంపులు తిరిగి రెండుచేతులలో రెండుకర్రలు పట్టుకుని, ఆచెప్పులాధారంగా పరుగెత్తుతారు మంచుమీద ఆటలాడుతూ.**

పైకొచ్చింది; కాలికింద 'స్కీ' జారి భర్తమీద పడింది. ఇద్దరూ పడిపోయారు.

"నొప్పెట్టలేదుకదా?" అనడిగాడు ఇవాన్ భయపడుతూ.

లేదన్నట్టు తలూపింది ఓల్గా; భర్తవంక అలాగే ఆశ్చర్యంగా చూస్తూ కూర్చుండి పోయింది అక్కడే.

"దెబ్బేమీ తగల్లేదు" అంటూ, మడమ మంచులోగుచ్చి లేవబోయింది; లేవలేకపోయింది. బాధ పడుతున్నట్టుంది మొహంచూస్తే.

"నేచెప్పలా!" అంటూ గభాల్న లేచాడు ఇవాన్. రెండు చంకలకిందా చేతులాన్చి పైకి లేపబోయాడు భార్యని. ఇవాన్ ముహం ఓల్గా చెంపల్ని తాకింది.

సూదితో గుచ్చినట్టులిక్కి పడింది ఓల్గా; పట్టు తప్పించుకుని, ఇవాన్ చేతుల్లోంచి జారిపోయింది కిందికి.

"ఇక నేలేవగలను" అంది కనురెప్పలారుస్తూ. చేతి గ్లోవ్ తీసి, ఆచేత్తో కళ్లుతుడుచుకుంది. అరచేత్తో కనులు వెచ్చ జేసుకుంటున్నట్టు, బలవంతాన నవ్వుతెచ్చుకుని, "యేమీలేదు; యీమంచు మూలాన కాస్త...."అంది.

తన బాధని కనబడనియ్యగూడదని అట్లా అంటోందని తెలుసుకున్నాడు ఇవాన్; "ఇకింటికెళ్ళడం మంచిదేమో మనం" అన్నాడు.

"ఏంఫర్వాలేదు. ఇంకాస్సేపు 'స్కీ' ల మీద పరుగెత్తుతాం నేనూ, వార్యానూ. వార్యాకి యీ 'స్కీ' లమీద పరుగెత్తడం తెలియదు; నేర్పమనడిగింది. నేర్పుతాను పదమని బయల్దేరాను."

"ఈ స్కీలమీద పరిగెత్తడం చాతగావడంలేదునాకు. మావూళ్ళో 'స్కీ' లు యిలావుండవు. అసలు వాటిని స్కీలనడానికే వీల్లేదు. మంచు చెప్పులంటాం మేం. బాగా పొట్టిగానూ, యింకా వెడల్పుగానూ వుంటై. పెద్దవాళ్ళ చెప్పు లేసుకున్న చిన్నపిల్లలికిమల్లే నడవాల్సొస్తుంది. అడుగులతి నెమ్మదిగా, యెడం యెడంగా వేసుకుంటూ" అంది వార్యా.

వార్యా వొళ్ళూ, దుస్తులూ అంతా మంచు దుమ్మమయం. చేతికర్రల మీదానుకుని చూస్తోంది ఇవాన్ వంక, పెదవులు కొరుక్కుంటూ.

మంచు పడడం ఆగిపోయిందిగాని, మధ్య మధ్య యీకల్లా వచ్చిపడుతున్నై మంచు చిదపలు. వున్నకొద్దీ చలి యెక్కువౌతోంది. ముగ్గురూ యెవరికి వారు వేరువేరుగా బయలుదేరారు. వార్యాయింకా అప్పుడప్పుడూ పడిపోతునేవుందికాని, అడుగడుక్కీ ,ఆత్మవిశ్వాసం హెచ్చుతోంది. ఇప్పుడావిడ శరీరం యిది వరకటిలా భయంతో బిర్రబిగుసు కోవడం లేదు; ప్రతి కదలికలోనూ చక్కని లావణ్యం తొణికిస లాడుతూంది. ఇలాగే, యీస్కీలసాయంతో, యీనది మీదుగా, యీకొండకొనల మీదుగా, యీ అడవుల్నీ! పర్వాతాన్నీ అన్నిటినీదాటి, దూరాన, తెల్లమబ్బులున్నచోటికి ఒక్క యెగురు యెగరాలనిపించింది వార్యాకి.

యెగిరిపోవాలి; రెక్కలు గట్టుకున్నట్టు! నిజమే. ఎందుకు ? ఎక్కడికి ? వూరికేనే; యెక్కడికీలేదు; మళ్లీ యిక్కడికే. యీనేలమీదికే, యీప్రజల మధ్యకేరావాలి తిరిగి. ఈ నేల, యీప్రజలు, యీవాతావరణం లేకుంటే తనుబ్రతకడ

మే కష్టం. తిరిగి మళ్ళీ ఈ ఇవాన్ ఇవానొవిచ్ పనిచేసేచోటుకే రావాలి. పనిచేస్తూన్నప్పుడు ఆయన నవ్వేనవ్వూ, కోపంగా అనేమాటలూ...ఇవన్నీ లేని ప్రదేశంలో తనమనుగడని గురించి వూహించు కోవడంగూడా సాధ్యంగాదు వార్యాకి.

వెళ్తూ వెళ్తూ, వున్నట్టుండి, వెనక్కి తిరిగిచూసింది వార్యా. ఆ తిరగడంలో కిందికి పడిపోయింది. మంచుదులుపుకుని, లేచి, మళ్లీ స్కీలు సరిజేసుకుంది ముందుకెళ్దామని. దూరంగా ఓల్గా, ఇవాన్ లిద్దరూ కన్పించారు. తనొచ్చిన దారిలోనే నిలబడున్నారు కౌగలించుకుని. ఇలాంటప్పుడు వెళ్లగూడదు, వెళ్లిపోదామను కుంది. ఎందుకనోగాని మనసొప్పలేదు. విచిత్రం; వాళ్లవైపుకే బయల్దేరింది. దగ్గరకెళ్లింతర్వాత చేతికర్రలు రెండూ వొకదాని కొకటి కొట్టిమోగించింది. వాళ్లిద్దరూ ఆశ్చర్యంవిన్నట్టే లేరు.

చూస్తే, ఓల్గా భుజాలెగిరిపడుతున్నై వెక్కివెక్కి యేడు స్తున్నట్టు. ఇవాన్ ఏమీతోచక, బాధపడుతూ చూస్తున్నాడు.

వాళ్ళిద్దరూ తనని గమనించకముందే వెళ్లిపోదాం అను కుంది వార్యా. కాని, ఇవాన్ ఆపాడు.

"ఓల్గా పావ్‌లోవ్నా ఆరోగ్యం యేమీ బాగాలేదు" అన్నాడు. ఆ మాటలంటున్న ఆయనగొంతు విని, గుండె ఆగి పోయినంత పనైంది వార్యాకి. "తొందరగా యింటికెళ్లి, గుర్రం గాని, స్లెడ్జ్* గాని పంపమని చెప్పు" అన్నాడు ఇవాన్.

ఇంకా ఆయన మాటలు పూర్తిగానే లేదు. చేతికర్రల్తో వొక్క ఊపు వూపి బయల్దేరింది వార్యా, ఊరివైపుకి. ఇవాన్ ఇవానొవిచ్ యింత గాభరా పడడం యిదివరకెప్పుడూ చూడ లేదు. ఒకవైపున ఓల్గా యేడుస్తోంది; యింకాస్సేపుంటే

*మంచు ప్రదేశాల్లో ఉపయోగించే బండి.

ఆయన దుఃఖమూ కట్టలు తెంచుకుని బయట పడేట్టుంది. వెళ్ళి. సాధ్యమైనంత త్వరలో పంపాలి సాహాయ్యం. ఆ తొందరలో 'స్కీ' చెయ్యడంలో వున్న కష్టనిష్టూరాలన్నీ మరిచిపోయింది వార్యా; ఆరితేరిన మనిషిలా, ఒక్కచోట గూడా పడకుండా రివ్వున దూసుకుపోయింది స్కీల మీద. చెంపలమీద పంచదార అద్దినట్టు మంచుదువ్వ, పై పెదవి మీద తెల్లగా చిరుమంచు మీసం. నోరుతెరచి గాలి పీలుస్తూ, రొప్పుకుంటూ, అలాగే వెనక్కి గూడా తిరిగి చూడకుండా వెళ్ళిపోయింది వార్యా.

## 2

మీదున్న కుక్కతోలు జాకెట్ విప్పి, మంచుమీద పరచాడు ఇవాన్, ఓల్గా కూర్చునేందుకు.

"జలుబు చేస్తుంది మీకు" అంది ఓల్గా.

"నాకేం ఫర్వాలేదు" అన్నాడు ఇవాన్ తల పైకెత్తి గూడా చూడకుండా.

మారు మాటాడకుండా, ఆయన చెప్పినట్టు ఆ జాకెట్టు మీద చతికిల బడింది ఓల్గా, భర్త ప్రక్కనే. ఒక మాటలేదు, ఒక పలుకు లేదు, చుట్ట చుట్టుకుని కూర్చున్నట్టుంది ఓల్గా. ఇద్దరి మధ్యా యింత అఘాతం యేర్పడిందని యింత గట్టిగా యింతవరకెప్పుడూ అనుకోలేదు ఇవాన్; ఇంత గాఢంగా ఆవిణ్ణి ప్రేమించగలననీ అనుకోలేదు యింతవరకు.

మొదటి కాన్పునాడు, హాస్పిటల్ నుంచి ఆవిణ్ణి తీసుకొచ్చిన విషయం గుర్తు కొచ్చింది ఇవాన్‌కి. మంచం పట్టీ మీద కూర్చున్నది ఓల్గా పసికందుని, వొళ్ళో బెట్టుకుని. లేత

రంగుగౌను వేసుకుంది. జడలు రెండూ సుదుటిపైన ముడేసు కుంది. వొళ్ళో దుప్పటిలోంచి బిడ్డ గులాబిరంగు ముఖం కన్పిస్తోంది కొద్దికొద్దిగా. చనుబాల కోసం గిలగిల లాడుతూ వెనుక్కుంటోంది పసిపిల్ల. ఆ బిడ్డని చూచి మురిసిపోతోంది తల్లి, చనుమొన నోటికందిస్తూ. ఎంతో ప్రేమగా ఆ బిడ్డని హత్తుకుని ఆనందిస్తూన్న ఆ మోహంలో, ఇవాన్ అంటే గూడా వొక విధమైన ఆర్ద్రత సుస్పష్టంగా కనిపించింది. అప్పి లా చూస్తూంటే, అప్పుడు, యెంతో సంబరపడిపోయాడు ఇవాన్; ఆవిడంటేనూ, వారిద్దరి జీవితాల్నీ అంత సన్నిహితం జేసిన ఆ పసిపిల్లలంటేనూ, హృదయం ప్రేమతో ప్రపొంగి పోయింది.

ఇప్పుడాబిడ్డ, ఆ నిగనిగలాడే నల్లజుత్తు పసికందు, మరి లేదు. అందువల్ల కాదుగదా యిప్పుడు ఓల్గా తనని ప్రేమించ డం మానివేశింది. ఐనా గర్భవతి నయ్యానని తనకు చెప్పకుండా యెందుకు దాయవలసి వచ్చింది? ఇప్పుడింత బాధపడుతూ గూడా, మరీ యింతపట్టీపట్టనట్టు, యింత వుదాసీనంగా వున్న దెందుకనీ? నిజమే. ఏడ్చింది. ఆ ఏడవడానికి గూడా కారణం భయం; తనమీద తనే జాలిదలచుకొని యేడ్చిన ఏడుపది. ఇక తనని తాను మోసగించుకోలేక పోయాడు ఇవాన్; శరీర మంతా వణకి పోయింది; చలి మూలాన కాదు, నరాల బల హీనత వల్ల.

"మీకు మరీ చలేస్తున్నట్టుంది; జలుబు చేస్తుంది" అంటూ లేచింది ఓల్గా. కోటు తీసుకొని వేసుకోమని బలవంతం జేసింది; వేసుకునే వరకూ వూరుకోలేదు. కోటు తొడుక్కుంటూ

తిరిగేసిన చెయ్యి సర్దుకుందామని ప్రక్కకి తిరిగి చూశాడు ఇవాన్; మోకాళ్ళమీద వంగి కూర్చునుంది ఓల్గా. ఆవిడ ప్రక్కనే మంచుమీదొక నల్లని మచ్చ వున్నకొద్దీ పెద్దదౌతున్నట్టు కనిపించిందా మసక వెలుతురులో.

"నా ఓల్గా!" అంటూ అటుమటించి పోయాడు ఇవాన్.

ఓల్గాని చేతుల్లోకెత్తుకుని, 'స్కీ' గుర్తులున్న దారంటే బయలుదేరాడు. ఆవిడ స్పృహలో వున్నట్టు లేదు. ఇకప్పుడు ఆవిడంటే ప్రేమ, ఆవిడ ఆరోగ్యాన్ని గురించి ఆందోళన తప్ప, మరో ఆలోచనే లేదతనికి.

'ఇదేమిటిలా జరిగింది? ఇదేమిటి?' అని పదే పదే అనుకున్నాడు, యింకేం ఆలోచించాలో పాలుపోక.

స్లెడ్జ్ ఎదురొచ్చింది. ఓల్గానందులో పండుకో బెట్టాడు. చూసుకుంటే చేతులు మెద్దుబారి పోయినై. ఆవిడ ప్రక్కనే కూర్చుని; కౌగలించుకున్నాడు.

'నేనింత దగ్గరగా వుండి సేవ జెయ్యడం ఆవిడ కిష్టం కాదేమో' అన్న ఆలోచనొచ్చింది అకస్మాత్తుగా; వెంటనే దూరంగా జరిగాడు. 'జబ్బుగా వున్న మనిషి; యిలాంటప్పుడవన్నీ ఆలోచించుకుంటూ కూర్చుంటే యెలా? అనుకున్నాడు మళ్ళీ. నది వొడ్డున వున్న చెట్ల సందుల్లోంచి, దూరాన దీపాలు మినుకుమినుకు మంటున్నై తోడేళ్ళ కళ్ళలా. 'ఆవిడేమనుకుంటే మాత్రమేం? నాయంతట నేను మాత్రం చచ్చినా వదలనావిణ్ణి.'

ఇంటికైనా కూడా తీసికెళ్ళకుండా, వెంటనే హాస్పిటల్లో చేర్పించేశారు ఓల్గాని.

డాక్టర్ గూసేవ్ వచ్చి చేతులు కడుక్కుంటున్నాడు. ఇవాన్ ఇవానొవిచ్, అక్కడే అటూ యిటూ తిరుగుతున్నాడు ఆందోళన పడుతూ. డాక్టర్ గూసేవ్ వంక భయం భయంగా చూశాడు; నన్ను గదిలోనుంచి బయటికి పడెయ్యగలడన్నట్టు ఆశగా చూశాడు.

"మీరే స్వయంగా చేస్తారా?" అనడిగాడు గూసేవ్.

"లేదు, లేదు, నేనే!" అంటూ అరచి సంతపని చేశాడు. ఇవాన్, భయంతో; "దగ్గర సంబంధీకుల్ని ఆపరేట్ చెయ్యడం అంటే యెంత కష్టమో మీకు తెలియదు గనుకనా?"

కావడానికి ఆపరేషన్ చాలా తేలికైన ఆపరేషన్; అనుభవం వున్న సర్జన్లెవ్వరూ ఆపరేషన్ చెయ్యడాని కొప్పుకోరు గూడాను, మరీ యింత తేలికైన ఆపరేషన్‌కి మేమెందుకని. అవసరమైతే, ఎలీనాయే చేస్తుందిలాంటివి, సాధారణంగా. కానిప్పుడు ఇవాన్ ఇవానొవిచ్ కదే వొక గడ్డు ఆపరేషన్‌లా వుంది; ఓల్గా పండుకున్న గదిలో కెళ్లాలంటేనే కాలెక్కడం లేదు. ఆ తెల్లని మొహమూ, ప్రాణం లేనట్టు వ్రేలాడుతున్న ఆ చేతులూ, నీలిరంగుకు తిరిగిన ఆ గోళ్లూ....పూర్తిగా మారిపోయింది ఓల్గా!

ఆపరేషన్ బల్లమీద పండుకో బెట్టారావిణ్ణి. చనిపోయే ముందొచ్చినట్టు వస్తున్నై వెక్కిళ్లు అదే పనిగా. రక్తం యెక్కించిం తర్వాతగూడా కోలుకోలేదు. తన మీదేదో నేరం మోపుతోందావిడ అనిపించింది ఇవాన్‌కి. ఇకా ఆపరేషన్ గదిలో వుండలేక పోయాడు; బయటి కెళ్ళిపోయాడు.

గదిబయట అటూ యిటూ తిరుగుతున్నాడు. ఏవో సామానులు గలగలమన్న శబ్దం. తర్వాత బాధగా మూలిగిన మూలుగు; ఒక పిచ్చికేక. అంతే. తర్వాతంతా నిశ్శబ్దం.

గోడప్రక్కనే వున్న బల్లమీద కూర్చున్నాడు, వంగి పోయిన భుజాల మధ్య తల వ్రేళ్లాడేసుకుని. మనుషులటూ యిటూ నడుస్తున్నారు. ఎవరో మాట్లాడుకుంటున్న చప్పుడు. ఇంతలో, తలుపు తెరచి మూసిన ధ్వని....

"అంతా ఐపోయింది." అన్నాడు గూసేవ్ వచ్చి.

ఇవాన్ ఇవానొవిచ్ కళ్ళప్పగించి చూశాడతని వంక, పాలిపోయిన ముఖంతో. ప్రశ్నలేశే ధైర్యంగూడా లేదు.

"అంతా సవ్యంగానే జరిగింది" అన్నాడు గూసేవ్, గౌను విప్పుకుంటూ; "అదృష్టవశాత్తూ, ఆవిడ కెక్కించవలసిన రక్తంగూడా సిద్ధంగా వున్నట్టు దొరికింది."

"బ్రదుకుతుంది గద!" అన్నాడు ఇవాన్.

"తప్పకుండాను!" అన్నాడు గూసేవ్, యింత అనుభవ మున్న సర్జన్ యిలా యెందుకు బెంబేలు పడిపోతున్నాడో అర్థంగాక. "ఆడవాళ్ళిలాంటి వాటినుంచి తొందరగానే కోలు కుంటారు...." అంటూ వాక్యం మధ్యలోనే ఆగిపోయాడు, ఇవాన్‌వంక చూచి. ఇవాన్ వణికిపోతున్నాడు. "అదేవిటి? యెందుకలా గాభరాపడుతారు? ఇంకో రెండు గంటల్లో లేచి కూర్చుంటుందావిడ ఎప్పటికి మల్లే" అన్నాడుగూసేవ్.

"చాలా మంచిపనిచేశారు. ధన్యవాదాలు."

నెమ్మదిగా లేచి, జాగ్రత్తగా అపరేషన్ గదిలోకెళ్లాడు ఇవాన్. అప్పుడే తీసినమడత కప్పుకునుంది ఓల్గా, ఆపరేషన్

బల్లమీద. తల ప్రక్కకితిరిగుంది; కళ్ళుగట్టిగా మూసుకునున్నై. ఆవిడ కణతల దగ్గర తడితడిగా వున్న జుత్తుమీద తన చెంప నాన్చాడు ఇవాన్.

ఆవిడకదల్లేదు; కనురెప్పలుగూడ కదలినట్టుకన్పించలేదు.

మర్నాడుదయం హాస్పిటల్లో ఓల్గా నిద్రమేల్కొనే ప్పటికి, మనసంతాదిగులుదిగులుగావుంది. వెల్లికిలాపండుకునుంది. తలక్రింద తలగడలేదు. సిన్నటివన్ని గుర్తుకొచ్చునై కలల్లోలాగా: కురిసేమంచు; యింతలో కడుపులోపోట్లు. ఈసారి బిడ్డనికనాలనే వాంఛ ఆవిడలోఅంతిదిగా యేమీలేదు. కానితనజీవితంలో యేర్పడ్డ లోటుని, శూన్యాన్ని పోగొట్టుకోవాలంటే, పూర్తి చేసుకోవా లంటే యీ మాతృత్వం తప్పని సరైంది. అదికాక, భర్తకూ తనకూ వున్న పూర్వ సంబంధాన్నీ, సాన్నిహిత్యాన్నీ తిరిగి పొందాలన్న అభిలాషకూడా గూడు కట్టుకుంది మనసులో, తనకు తెలియకుండానే. న్యాయానికి భర్తంటే ఏవగింపుగాని, ద్వేషంగానిలేవు. ఆయనంటే యిదివరకున్నంత గౌరవం యిప్పు డూ వుంది; కాని రాను రాను యెందుకనోగాని, అపరిచితుడిలా కన్పిస్తున్నాడు.

దుప్పటి కిందిచేతులు కదిలించి, కళ్లు మూసుకుంది ఆయాసపడిపోయినట్టు. చాలబలహీనంగావుంది. ఆలోచించేందు కు గూడా ఓపిక లేకుండా పోయింది. ఒక ఆలోచనలేదు, ఒక అభిలాష లేదు, ఏ భావనాలేదు. అంతా శూన్యం.

ఎవరో వస్తున్న అడుగుల చప్పుడు వినిపించింది; మళ్లీ యీలోకంలో పడింది ఓల్గా.

ఇవాన్ ఇవానొవిచ్ వార్డు లోపలికొచ్చాడు. డ్యూటీ మీదున్న డాక్టరు రోగుల పరిస్థితిని గురించి చెబుతూంటే అదొక రకమైన ఉన్నతాధికార భావం ప్రతిబింబించేదతని ముహంలో; ఇప్పుడూ సరిగ్గాఅలాగేవుంది మొహం. ఇంతలో మధ్యవయసులో వున్న ముసలావిడ మంచంమీంచి లేచి కూర్చుంది; ఇవాన్ వంక మాత్ర ప్రేమ పుట్టి పడేట్టు చూస్తోంది. ఇవాన్ ఆవిణ్ణి ఆరోగ్యం యెలావుందని అడిగాడు. ఆ ప్రశ్న విని ఆవిడ యెంతో సంతోషించింది. ఇదంతా చూస్తూనే వుంది ఓల్గా; కాని ఇవాన్ కనులు తప్పించుకుని మరీ చూస్తోంది. కాని మిగతా రోగులలా కాదు. ఆయనెప్పుడు తమవైపు చూస్తాడా అని ఆతురతగాచూస్తున్నారాయన వంక. వాళ్ళందరికీ ఆయనంటే అపరిమితమైన ప్రేమ, గౌరవం; ఎప్పుడొస్తాడా అని యెదురు చూస్తుంటారు. తన భావాలన్నీ దూరంగా నెట్టి, ఇవాన్ వైపుకు తిరిగింది ఓల్గా. ప్రక్కనే నిలబడున్నాడు. ఇప్పుడతని ముహంలో యిదివరకటి అధికారచ్ఛాయలు లేవు; ఏదో సంతోషం మందకొడిగా ప్రతిబింబిస్తోందా ముహంలో. విశాల మైదానంలో సగర్వంగా నిలబడిన మహావృక్షంలా వున్నాడుమనిషి; మంచి ఆజానుబాహువు. నిలబడి చిరునవ్వు నవ్వుతూంటే, యెంతో ఆకర్షణీయంగా వున్నాడు. ఓల్గా అతని వంక చూచింది; పూర్వపు ప్రేమ మళ్ళీ ఒకసారి వెలిగింది ఓల్గా కన్నుల్లో. మనిషి అందమైన వాడని తనకిదివరకే తెలుసు; కాని ఆయన్ని చూస్తూంటే మనసు గర్వపడడం లేదు; హృదయం చలించడం లేదు. ఏదో విచారం, ఏదో పశ్చాత్తాపం. అనుకోకుండానే, ఒక దీర్ఘ నిశ్వాసం వదిలి కనులు మూసుకుంది ఓల్గా.

ఇవాన్ ఇవానొవిచ్ ప్రక్కనే కూర్చున్నాడు; చేయి తీసుకున్నాడు, నాడి చూశాడు. అతని స్పర్శ అపరిచితుడి స్పర్శలా వుంది.

"ఎలావుంది ?" అనడిగాడు. ఆమాటల్లో యేదో ఎత్తిపొడుపున్నట్టు గ్రహించింది ఓల్గా.

"బాగానేవుంది" అంది. ఆవిడ ఆరోగ్యాన్ని గురించి అతనెంత కలత చెందాడో తెలియదావిడకి; గత రాత్రంతా హాస్పిటల్లోనే నిద్రలేకుండా పడి వున్నాడని తెలియదు; తను నిద్ర పోతూన్నప్పుడు ఎన్నిసార్లో వచ్చి చూశెళ్లాడని అసలే తెలియదు.

ఓల్గా చేయితీసి, చెంపకదుముకుంటూ "నే నెంత బాధ పడ్డానో నీకు తెలియదు" అన్నాడు.

అతన్ని చూస్తే జాలేసింది; విరక్తిభావం కాస్సేపు కనిపించకుండా పోయింది. నెమ్మదిగా అతని చెంపను నొక్కింది ఆ చేతివ్రేళ్ళతో ఆప్యాయతని సూచిస్తూ. అవీయివీ మాట్లాడబోయాడతను; ఆవిడ మెదలకుండా వూరుకుంది. తర్వాత అతను తనకోసమని తీసుకొచ్చిన ఆహారాన్ని చుట్టుప్రక్కల వాళ్ళకి పంచియిచ్చింది; ఆ ఆహారాన్ని ముట్టుకోగల శక్తి లేకుండా పోయింది. ఈ ఇవాన్నే ఒకప్పుడెంతో గాఢంగా ప్రేమించింది. గౌరవించింది; లోలోపల పూజించుకుంది; అతని జీవితమూ తన జీవితమూ ఏకమౌతున్నదిగదా అని ఆనందించింది; ఆ ఆనందంతో పరవశమై పోయింది; అప్పుడీ పరిస్థితులిలా మారతాయని కలలోగూడా అనుకోలేదు; ఆ ఆనందం తన జీవితాంతందాకా అలాగే వుంటుందని అనుకుంది

అప్పుడు. అదంతా గతం. ఇప్పుడా ఆనందమేదీ ? ఎక్కడికి పోయింది ?

ఆరాత్రి ఓల్గాకి నిద్రపట్టలేదు. ఊరికే మంచం మీదటూ యిటూ దొర్లుతూ పడుకుంది. కిటికీరెక్కల అద్దపు తలుపుల మీద మంచు పట్టింది. బయట వెన్నెలకాస్తోంది. కిటికీ తలుపు లోంచి లోపలికొస్తోంది వెన్నెల తెల్లని ముసుగులా. ఆ వెన్నెల కిరణాల్ని చేతితో అందుకోవాలని చూచింది ఓల్గా. చేతికి చిక్కినట్టే చిక్కి జారిపోతోంది వెన్నెల చిన్నపిల్లలా. అలాగే కాస్సేపు వెన్నెలతో ఆడుకుంటూ పడుకుంది ఓల్గా. వార్డులో మూల నెవరోయిద్దరురోగులు మాటాడుకుంటున్నారు. మిగతా పక్కలమీద రోగులుగూడా నిద్రపోయినట్టులేరు. అందరికీ యేదో వొకబాధ.

పావా వచ్చింది, బోలెడుసంచులూ పొట్లాలూ తెచ్చింది.

"ఓ బ్రహ్మాండంగా వున్నారు మీరు" అంది అవన్నీ బల్ల మీద పెడుతూ; "ఇదిగో, యిది చాకొలెట్, యివి కేక్స్, యీ పళ్లు ఇగోర్ యిచ్చాడు. పిల్లలకి తీపి తెమ్మని ఉకమ్యాన్ పంపించాను డ్రైవర్ని. రోజురోజుకీ పెద్దవాళ్ళయి పోతున్నారు వాళ్ళు. వాళ్లకి తీపి పెట్టకపోతేయెలా? చిన్నపిల్లలకేదీ తక్కువ గాకుండా చూడాలి. మనందరం ఒకప్పుడు చిన్నపిల్లలమేగా. మళ్లీ రమ్మంటే వస్తుందా బాల్యం! రాదు. అందుకని, అదున్న ప్పుడే అన్నీ అమరేట్టుచూసుకోవాలి! జీవితంలోకల్లా హాయిగా వుండేది అప్పుడే! కాదూ?" అంటూ నిట్టూర్చింది పావా; "లాంచెలీ యేం జేశాడనుకున్నారు? కూర్చున్నాడు కూర్చున్నట్టు ఒక కిలోగ్రాము చాకొలెట్టూ దేశాడు లోపలికి! తర్వాత విరేచ నానికి మందెయ్యాలి సొచ్చింది—వాడు మరీ వున్నచోటుండడు.

ఎప్పుడూ యేదో వొకటి పగలగొట్టడమో, విరగ్గొట్టడమో; పరమ చిలిపి! పట్టుదల, యెంత పట్టుదలని! చెప్తే నమ్మరు. వాడొద్దనుకుంటే యికంతే! మనం యెంత చెప్పినా అంతే; చచ్చిగీపెట్టినా సరే! ఇక కామిల్లా అంటూరూ, అలాంటిపిల్ల నసలు చూశుండరు మీరు. ఎప్పుడూ ఆ అద్దంముందే. అదీ చిలిపిదే; యేదో వొకటి యెప్పుడూ పగలగొడుతూనే వుంటుంది. పిల్లలలా వస్తువులన్నీ పగలగొడతారే, యెందుకను కున్నారు? బహుశా వాళ్ళకి వ్యక్తిగతాస్థంటే యిష్టం వుండ నసుకుంటా," పిల్లల అల్లరికీ అర్థం చెప్పుకుని సంతృప్తి పడినట్టే వుంది పావా.

"అంతేనేమోలే" అంది ఓల్గా; పావా వాగుడు వింటున్నకొద్దీ కోపం యెక్కువౌతోంది ఓల్గాకి.

ఇంతలో అంతర్జాతీయ పరిస్థితి గుర్తుకొచ్చింది పావాకి; "జెర్మన్లికిప్పుడే నిమిషానైనా ఇంగ్లండ్ మీద దాడిచెయ్యొచ్చునంటున్నారు. ఇంగ్లీష్ కెనాల్ ప్రక్కన అంతా సర్వసన్నద్ధం చేసుకున్నార్నున్నారట——"

"ఇంగ్లీష్ ఛానల్" అని సరిదిద్దింది ఓల్గా.

"ఆఁ, అదే; ఛానల్. మూడువేల తెప్పలు తయారు చేశారట జెర్మన్లు. ఒక్కొక్కదాంట్లో ఆరారు తెప్పలు చొప్పున కలిపి కడతారట. తర్వాత దానిమీద యినపరేకు లేస్తారట. అట్లా కడతారట వంతెన. టాంకులూ, కాల్బలమూ యీ వంతెనమీదుగా దాటుతుందట; సరే యిక విమానాలు వేలకొద్దీ గాలిలో వుంటై. చూట్టానికది చాలా బావుంటుంది. కాదూ కాకపోతే తగిన వాతావరణం కోసం తటపటాయిస్తున్నారట."

ప్రశాంతంగా వుండాలి సముద్రం మరి; మంచుగూడా పట్టి వుంటే యింకా మంచిది. ఓ, ఓల్గా! ఇప్పుడు సముద్రతీరాని కెళ్ళాలని పిస్తోంది; ఎంతబావుంటుందని యీకాలంలో. సోచీ! సోచీ సముద్రతీరం! గులాబీపువ్వు లిప్పు డక్కడ కో అంటే కోట్లకి కోట్లు దొరుకుతై! ఆఁ, అన్నట్టు మరచిపోయాను నేను; ఇదుగో యీ బాదంపప్పు తెచ్చిందీ మీకోసమే; తీసు కోండిదిగో....అన్నిటికంటే ముఖ్యమైందింకొకటుంది" అంటూ హాస్పిటల్ ముసుగు పక్కకి తొలగించి, అందమైన పర్సొకటి బయటికి తీసింది పావా.

"ముందు ముఖ్యమైన సంగతులన్నీ చెప్పి, తర్వాత పిచ్చాపాటీ మాట్లాడ్తారు అందరూనూ" అంటూ మళ్లీ మొద లెట్టింది పావా; "నేనందుకు తలకిందులు. ఎందుకనోగాని అవసరమైన విషయాలు తరచూ మరిచిపోతుంటాను నేను. ఐనా, అది సహజం గూడాను. ఎందుకంటూరా? తేలికవస్తువు లేగా ముందు పైకితేలేది! కాదూ?" అంటూ ఓల్గావంక చూచి ముసిముసి నవ్వులు నవ్వుతూ పర్సులో వెదకడం మొదలెట్టింది.

ఎంతసేపు వెదికినా అనుకున్నది చేతికి దొరికినట్టులేదు. ఈ వసపిట్ట అంత ముఖ్యమైంది ఏమి పట్టుకొచ్చిందా అని ఓల్గాకిగూడా కుతూహలం హెచ్చింది.

"ఒక మనిషిని గురించి, యికెప్పుడూ మీముందెత్తగూడ దని చెప్పారు మీరు యిదివరకొకసారి" అన్నది పావా, ఓల్గా వంక అదోమాదిరిగా చూస్తూ; ఇవ్వాళేమైతే అయ్యిందిలే, యీ పనిమట్టుకు చేసిపెడతానని అమ్మని మాటిచ్చివచ్చాను ఆయనకి. అలా మాటిచ్చానూ అంటే అందుకు కారణంవుంది. ఇది మీ

వ్యక్తిగత విషయం కాదు. అభివందనా లందచెయ్యమని చెప్పాడు మీకు...."

"దేనికీ, ఆ అభివందనాలు ?"

"సాహిత్యంలో మీరు సంపాదించిన విజయానికి. ఇవీ అని యిదమిద్ధంగా నేమీ చెప్పలేదు గాని ఆయన...." అంటూ పర్సులోంచి వొకవుత్తరం బయటికి తీసింది పావా, హుషారుగా; "ఇదిగో, యిదీ, వుత్తరం. మాస్కో పత్రిక నుంచి కత్తిరించిన కాగితంగూడా పిన్ చేసుంది దీనికి." అసలు రహస్యం బయట పెట్టేసింది కాబట్టి, ఓల్గావంక తాపీగా, పరీక్షగా చూస్తూ, "చూశారామరి, మీ వ్యాసం మాస్కోలో అచ్చయ్యింది! అంటే, యిక మీ పేరు యీదేశం నాలుగు మూలలా మారుమోగి పోతుందన్నమాట! కాదూ ?" అంది పావా.

"ఇక చాల్లే వూరుకోండి. ఏంమాటలవీ" అంది ఓల్గా; నిజంగానే ఓల్గాకి విసుగు పుట్టుకొచ్చింది; కొద్దిగా భయంగుడా వేసినట్టుంది.

బలహీనత; ఆవేశం; తత్తరపాటు! గబగబా వుత్తరం తీసుకుని తలగడకింద పెట్టింది, యెక్కడ మాయమైపోతుందో నని భయపడుతూన్నట్టు.

పావా వెళ్ళిపోయింతర్వాత, వుత్తరం బయటికి తీసి చదివింది, గుండెలు చేత్తో పట్టుకుని. తావ్రోవ్ వ్రాసిన వుత్తరం అది.

"మీకొక మంచివార్తచెప్పబోతున్నా; ఆ వార్త విని నేనూ చాలా సంతోషించాను. మీరు వ్యాసం పంపిన పత్రికఆ వ్యాసాన్ని వేసుకుంది. అక్కడక్కడా కొద్దిగా

తీసేసినట్టున్నారు; కొద్దిగా చిన్నచిన్న మార్పులుగూడా చేసినట్టున్నారు. ఐనా మీరు బాధపడవలసిన అవసరం యేమీ లేదు. మీ ప్రథమ ప్రయత్నం విజయవంతమైంది. అనవసర పరిచయాలతో వృథా చెయ్యని కాలాన్ని మీరు సద్వినియోగం చేస్తున్నందుకు సంతోషించాను. మీరింకా పురోభివృద్ధి పొందాలని నా ఆకాంక్ష.''

అభినందనాలతో,
మీ,
బోరిస్ తావ్‌రోవ్.

'నా—బోరిస్ తావ్‌రోవ్' అనుకున్నది ఓల్గా.

ఆ చిన్న వుత్తరం తీసి దుప్పటికింద పెట్టుకొంది. వొళ్లంతా ఝల్లుమన్నట్లైంది. ఆ కాగితం స్పర్శ మూలాన్నైనో లేకుంటే ఆ వాక్యాల మధ్యవున్న ప్రేమనీ, ఆప్యాయాన్నీ గ్రహించేమో; ఏమో; ఆవిడకే తెలియాలి. పత్రికనుంచి కత్తిరించిన కాగితం మడతలు విప్పింది ఓల్గా.

ఐదు కాలాల చివర పెద్దపెద్ద అక్షరాలతో వుందావిడ పేరు. మళ్ళీ గుండె దడదడలాడింది. గుండెదడ తగ్గింతర్వాత చదువుకుంది వ్యాసం. నిజమే కొన్ని మార్పులు చేశారు; ఐనా బాధేమీ పడలేదు.

'నిజంగా నేనేనా వ్రాశింది యింతబాగా?' అనుకుంది ఆశ్చర్యపోతూ. అక్కడక్కడా వ్యాసాన్ని కుదించడం వల్ల వ్యాసం యింకా బాగుపడింది; మెరుగ్గా వుంది. తాను చెప్ప దలచుకున్న విషయాన్ని అర్థం చేసుకుని, ఆ విధంగా సహాయ పడిన సంపాదకులంటే కృతజ్ఞతా భావం యేర్పడింది.

దుప్పటికిందున్న కాగితం తగిలింది శరీరానికి; ఆస్పర్శతో ఆవిడ ఆనందం మరింత యినుమడించింది.

'ఎంతమంచి దుప్పట్లివి!' అనుకుంది, ఆ దుప్పటి వంకా, పరిశుభ్రంగా వున్న ఆగదినీ చూస్తూ.

దూరాన గదిలో ఎవరిదో మూలుగు వినిపించింది. గోడ కవతలివైపున పసిపిల్లలు గల్లంతు చేస్తున్నారు ఆకలేసి. నర్సులా పిల్లల్ని జాగ్రత్తగా చేతుల్లో పెట్టుకు తీసుకెళ్తున్నారు. పాలిచ్చే సైమది.

ఓల్గా నవ్వుకుంది.

వార్డులో వాళ్లు నెమ్మదినెమ్మదిగా మాట్లాడుకుంటున్నారు; యుద్ధాన్ని గురించి.

ఒక మధ్య వయసు పిల్లలతల్లి మాట్లాడుతోంది. "ఎంత మందమాయకులు చనిపోతున్నారో యీ పాడు యుద్ధం మూలాన. ఒక్కరాత్రంటే వొక్కరాత్రి, 1800 కిలోగ్రాముల బాంబులు పడేశారట! ఒక్కొక్క వీధికివీధి నేలమట్టమై పోతుంది! ఇంకేం వుంటుంది? అంతా సర్వనాశనం. ఎన్ని ప్రాణాలెన్నిప్రాణాలు! ఎన్ని సజీవ సమాధులు!"

ఆ మాటలు విన్నది ఓల్గా; ఇందాకటి చిరునవ్వు లేదిప్పుడా పెదవులమీద. సుదూరాన జరుగుతూన్న ఆ విధ్వంసాన్ని తలచుకుని, భయభ్రాంత ఐపోయింది.

# 3

ఇవాన్ ఇవానొవిచ్ అప్పుడే ఒక ఆపరేషన్ పూర్తి చేశాడు; ఇంకా ఆగదిలో ఈథర్ వాసన వేస్తూనే వుంది.

మధ్య వయసు యకూత్ ఒకతనొచ్చాడా గదిలోకి, ముందు వెనకలాడుతూ; ఆ వాసనచూచి సిగ్గుపడుతూ దిక్కులు చూశాడు. టేకు చెట్టులా వున్నాడు దిట్టంగా. అతని వెనకే నికీతా వున్నాడు. ఆపరేషన్ బల్లచూస్తూ నిలబడి పోయాడు యకూత్, చొక్కా నలుపుకుంటూ.

"చొక్కా తీశెయ్యండి" అన్నాడు నికీతా, రోగి ఎడమ చెయ్యి పట్టుకుని; ప్రాణం లేనిదానిలా వేళ్లాడుతోంది ఆ చెయ్యి.

అతను చొక్కా తీశేస్తుంటే సాయంజేసి, ప్రక్కగది గుమ్మంవైపు చూశాడు నికీతా. ఇందాకటి ఆపరేషనై పోగానే, యీ రెండో ఆపరేషన్‌గూడా చేశేస్తానన్నాడు ఇవాన్. కాని యింతవరకీ ఆపరేషన్‌కి సిద్ధమైనట్టెక్కడా కన్పించడం లేదు.

"బల్లమీద పండుకోబెట్టి. మోర్ఫైన్ ఇంజెక్షనిద్దాం. ఇవాన్ ఇవానొవిచ్ చేతులు కడుక్కునొచ్చేప్పటికొక పది నిమిషాలు పడుతుంది" అన్నాడు సెర్గుతోవ్.

బల్లమీద పడుకున్నాడు యకూత్ భయపడుతూ. సరిగ్గా గాలిపీల్చడంగూడా మానేశాడు.

"ఏం ఫర్వాలేదు," అనన్నది వార్యా యకూత్ భాషలో; "భయం యేమీలేదు. ఇవాన్ ఇవానొవిచ్ చాలా తొందరగానే పూర్తి చేశేస్తారు." రోగి భుజంకిందున్న నీలి నీలి మచ్చల్ని తాకి చూస్తున్నాడు సెర్గుతోవ్. "ఎలుగ్గొడ్డు దెబ్బ కొట్టిందా భుజాన్ని" అని వివరించింది వార్యా; "ఐదు నెల్ల నుంచీ అలాగే వుందా చెయ్యి. ఎక్కడ జరిగిందిది; అమెరికాలో?"

"ఉక్కొయ్యావద్గర" అన్నాడు అమొనోవ్; నికీతా చేతిలోవున్న పనిముట్టును చూచి, భయపడి పోయాడతను. ఏదో వెండిగుండు లాగుంది పైన; కింద పొడుగాటి సూది. దాంతో పొడిచేసేట్టున్నాడు నికీతా. "ఛా, ఛా, సిగ్గుచేటు— ఎలుగ్గొడ్డంటే ఏభయమూ లేదు; యీ సూదిని చూచి యింత భయపడతా వెందుకు!" అంది వార్యా. "ఆ ఎలుగ్గొడ్డు వొచ్చి మీదబడబోతే, కత్తితో పొడిచి చంపేశాడు. అప్పటికీ వచ్చి మీదబడి ఆ చెయ్యిముట్టుకు పాడుచేసింది; యింకేంచేసేదో గాని, యీలోపుగానే దాని ప్రాణం పోయింది" అని చెప్పింది వార్యా, సెర్గుతోవ్‌తో. ప్రక్కనేవున్న గదివైపు చూచింది వార్యా, ఇంకా రాలేదేమా అన్నట్టు.

ఇవాన్ ఇవానొవిచ్ యింకా రాలేదు.

'ఎందుకనబ్బా' అనుకుంది వార్యా, ఆశ్చర్యపోతూ. భయపడింది. వెంటనే, గబగబా స్టెన్ ఆఫీసు కెళ్ళింది.

ఆఫీసులో, రెండు చేతులూ డెస్కుమీద పెట్టుకుని కూర్చున్నాడు ఇవాన్, తలవంచుకుని. ప్రక్కనున్న గ్లాసుడు టీ అట్లాగే వుంది; ముట్టుకున్నట్టుగూడా లేదు. ఏష్‌ట్రేమీద పెట్టిన సిగరెట్ సంగతిగూడా మరచిపోయాడు; అదలాగే కాలిపోయింది; కాలిపోయిన సిగరెట్, సిగరెట్‌లా అలాగే వుంది ట్రేమీద.

"ఇవాన్ ఇవానొవిచ్!" అని పిలిచింది వార్యా, సంకోచిస్తూ.

అతనా పిలుపు విన్నట్టు లేదు. అలాగే కూర్చున్నాడు కదలకుండా. వార్యా మరింత దగ్గర కెళ్ళింది.

"రోగి ఆపరేషన్ గదిలో కొచ్చేశాడు" అని చెప్పింది.

ఉలిక్కిపడి, చూశాడు తలెత్తి.

ఆ కనుల్లో ప్రాణం వున్నట్టు లేదు; నిస్తేజంగా వున్నై — వార్యా గాభరా పడిపోయింది. ఏదో తీవ్ర వేదనతో బాధ పడుతున్నట్టుంది ఇవాన్ మొహం అంతా.

అతనిలాగే, ఆవిడగూడా, కళ్ళప్పగించి చూస్తూ నిలబడిపోయింది, కాస్సేపు. ఎవరూ మాట్లాడలేదు. స్వతస్సిద్ధంగా ప్రేమించే స్త్రీల కలాంటి సమయాల్లో ఏంచెయ్యాలో వెంటనే తెలుస్తుంది. "ఆపరేషన్ కంతా సిద్ధంచేసి వుంచారారోగిని" అని చెప్పింది వార్యా, సుస్పష్టంగా; ఇక మీరు లేవక తప్పదు, లేవాలి అని ఆజ్ఞాపిస్తున్నట్టు.

ఆవిడ ఆజ్ఞని వెంటనే పాలించాడు ఇవాన్; కష్టంలా లేచి నిలబడ్డాడు.

తన జీవితమూ, ఆశలూ, ఆశయాలూ అన్నీ విభిన్నంగా కన్పించుతున్నా యిప్పుడు ఇవాన్‌కి. ఒక్కసారి వెనక్కి తిరిగి చూస్తే—తన భార్యతో గడిపిన మధుర క్షణాలు....కీకారణ్యంలో బయలు ప్రదేశంలోంచి చొచ్చుకునొచ్చే నునువెచ్చని సూర్యకిరణాలు....కాని ఆ అడవిలో నడచే మనిషి—ప్రయాణీకుడు గానీ, వేటగాడు కానీ, దారితప్పిన మనిషిగానీ, ఎవరైనా కానీ—ఆ సూర్యరశ్మిని చూస్తూ కాళ్లు బారచాచుకుని కూర్చోడు. ఒక్కసారటు చూచి, ఆనందించి, తిరిగి తన పనిలో తాను నిమగ్నుడై పోతాడు. తనూ అంతే. తనూ, ఓల్గా, యిద్దరూ చెట్టపట్టాలు పట్టుకుని కలిసి నడవలేక పోయా రెందుకని? పరిస్థితులిలా ఐనవీ అంటే అందుకు యెవరూ కారణం?

ఎప్పుడూ యేదో వొకటి చెయ్యాలనేగదా ఓల్గా వుద్దేశం గూడా; మరెందుకనీ యిలా వెనకబడి పోయింది ?

ఆవేళ, ఆచెట్లకింద బల్లమీద కూర్చున్నప్పుడెంత దీనంగా, దిగాలుగా కన్పించిందో ఓల్గా గుర్తుకొచ్చింది.

వార్యా వెంట, ఆపరేషన్ గదిలో కెళ్తూ 'అసలు నేనా దరిద్రపు వ్యాసం అనువాదం చెయ్యమంటూ యివ్వకపోతేనే బావుండేది ?' అనుకున్నాడు.

వెళ్ళి, యాంత్రికంగా, చేతులు కడుక్కున్నాడు, వార్యా అందిచ్చిన ఆపరేషన్ గౌను కట్టుకున్నాడు; చేతులికి రబ్బరు గ్లోవ్స్ తొడుక్కున్నాడు. సెర్గుతోవ్ చెప్పేమాటలు గూడా సరిగ్గా వినిపించుకోకుండా ఆపరేషన్ బల్లదగ్గర కెళ్ళాడు. ఇదివరకే ఆ రోగి చరిత్రంతా క్షుణ్ణంగా చూశాడు; ఆ దెబ్బ తిన్న చేతిని పరీక్షించడం గూడా యింతకుముందే పూర్తి చేశాడు. ఇంతవరకూ యీ ఆపరేషన్ అంటే బాగా శ్రద్ధ చూపిన ఇవాన్, ఇప్పుడెందుకనో అతి వుదాసీనంగా వున్నాడు. ఆపరేషన్ బల్లమీద వెల్లకిలా పండుకునున్నాడు రోగి. ఆప రేషన్ చెయ్యవలసిన చేతిని బల్లకు అంటిపెట్టి కట్టారు; దండల దగ్గర్నుంచి కిందిభాగం అంతటా చేతికి అయొడిన్ పూశారు. ఎలుగ్గొడ్డు కొట్టిన దెబ్బలు బాగా కన్పిస్తూనే వున్నై పైకి. చేతివేళ్ళు వొంకర్లు తిరిగిపోయునై; అంటే మధ్య నరం దెబ్బతిన్నదన్న మాట.

## 4

"ఇంజెక్షనిస్తాం మీ కిప్పుడు" అని హెచ్చరించాడు

ఇవాన్, రోగిని.

నొవొకెయిన్లో వున్న సిరింజ్ తీసి, రెండు వరసలుగా చేశాడు ఇంజెక్షన్లు: ఒకటి పైపైన, రెండోది౦కా ౖస్త లోతుగాను. చర్మంకింద పొడుగ్గా వాచినట్టు కన్పించింది.

"నొప్పిగా వుందా ?"

"ఏమంత లేదులెండి" అన్నాడు అవెమెనోవ్.

గాయాల కిందినుంచి ప్రారంభించి, పొడుగాటి గంటు పెట్టాడు ఇవాన్, స్కాల్పెల్ తో. గాయానికి లోపల తెల్లటి మచ్చ కన్పించింది.

"ఫోర్సిప్ !"

పట్టుకున్న పనిముట్లలోంచి, సన్నగా పొడుగ్గా, చివర వంపు దిరిగిన పనిముట్టొకటి యేరి, అందించింది వార్యా.

వార్యాచేతుల్లోంచి ఆ పనిముట్టు లాక్కుని, చివర మరి కాస్తవంచి, గాయంలోకి గుచ్చాడు అతి కష్టం మీద.

"ఏమైన బాధగా వుందా ?"

"లేదు."

క్రిందవున్న నరం దెబ్బతినకుండా 'ఫోర్సిప్' తో నొక్కిపట్టి, పైనరాన్ని రెండుగా కోశాడు. కత్తెరతో మళ్ళీ యింకొక గంటు పెట్టాడు. ఎలెక్ట్రిక్ కరెంట్ తో రక్తస్రావాన్ని ఆపాడు. మచ్చబడ్డ నరాన్ని స్కాల్పెల్ తో కొయ్యడం ప్రారంభించాడు.

"అబ్బబ్బ ! యెన్ని మడతలు" అన్నాడు పళ్ళుబిగబట్టి, "మామూలుగా పట్టుదారంలా వుంటుంది; యిప్పుడిన్ని ముళ్ళా!"

"ఎందుకూ, ఆ పైె నరం కోశెయ్యండి, అడ్డం వస్తోంది" అన్నాడు సెర్గుత్లోవ్.

"కోశెయ్యడానికేం? అన్నీ కోశెయ్యొచ్చు; తర్వాత కుట్టడమే కష్టం."

గంటుకడుగున, పెన్సిలంత వెడల్పున పాలిపోయిన నరం కన్పిస్తోంది.

"అంతా స్పష్టంగా వుంది. ఎలెక్ట్రిసిటీతో యీ నరాన్ని పరీక్షచేసి చూడాల్సిన పనిగూడా లేదు" అన్నాడు ఇవాన్.

విడిపోయిన నరాలముక్కలకి మధ్య దాదాపొకసెంటీ మీటరున్నర ఖాళీవుంది.

"ఆ చివరలు రెండూ సరిగ్గా కత్తిరించి కుట్టెయ్యాలి."

"నరాన్ని సాగదీశా ?"

"ఉఁ. సాగదియ్యొచ్చును."

నరాల చివరలు రెండూ సరిగ్గా కత్తిరించి ఫోర్సెప్స్‌తో ఆ రెంటినీ నెమ్మదిగా, కలిసేవరకూ సాగదీసి, పైపొర కుట్టేశాడు ఇవాన్.

"ఇంతకంటె మంచి సిల్కు కావాలి; యిది మరీముతగ్గా వుంది. ఇదెందుకూ నా మొహానికొట్టుకోడానికా ?" అన్నాడు విసుగ్గా వార్యాతో.

వార్యా సిగ్గుపడిపోయింది; ఆ సిగ్గుతో చెవుల కొనలు గూడా ఎర్రబారనై. మారు మాట్లాడ కుండా మళ్ళీకొత్త సూది లెక్కించి యిచ్చింది.

ఆ కుట్టుపని ఐపోయింతర్వాత, మళ్ళీ అంత విసుగ్గానూ, "సూదిపట్టులేవీ ? ఎక్కడ ? చర్మం కుట్టాలి !" అంటూ కేక లేశాడు.

నోట్లోనుంచి మాట బయటికి రాకముందే, అవి చేతుల్లో కొచ్చేశినై. ఐనా, ఇవాన్ ముహంలో ఆ విసుగు తగ్గలేదు. వార్యా ముహంమాత్రం ప్రశాంతంగా వుందిప్పుడు. బల్ల పక్కనే, జరిగేదంతా జాగ్రత్తగా చూస్తూ నిలబడుంది. రోగి పరిస్థితీ, సర్జెన్ మనఃపరిస్థితీ, ఆపరేషన్‌లో ప్రతి అడుగూ.... అన్నీ అర్థం ఔతున్నై వార్యాకి.

"చర్మం అంచులు దగ్గరికి రాగానే కుట్లు వేశెయ్యాలి, ముడతలు పడకుండా" అన్నాడు ఇవాన్, ఫోర్సెప్స్‌తో చర్మం అంచులు పట్టుకుని, "అలా ఐతే చివరికి అసహ్యంగా మచ్చలు పడకుండా వుంటై."

ఇక ఇవాన్ ఆలోచన లిక్కడలేవు; అలవాటు ప్రకారం మాట్లాడు తున్నాడు; చేయపలసిన పని గూడా అలవాటు ప్రకారం చేసుకుపోతున్నాడు. కుట్టడం పూర్తై పోయింది. ఆ నరం గుండా విద్యుత్తు యింకా ప్రవహించలేదు; నిజమే. ఇప్పుడప్పుడే ప్రవహించదు గూడాను. ఆ నరాల చివరలు కలిసినచోట కొత్త న్యూరైట్ మొలకలెత్తాలి; అక్కణ్ణుంచి నరంపొడుగూతా, శాఖలన్నింటికీ నెమ్మదిగా పాకాలి. న్యూరైట్ అంత తొందరగా తయారు కాదు. ఇరవై నాలుగు ఘంటలకి, బాగా ఐతే ఒక మిల్లీ మీటర్ పెరుగుతుంది. ఆ లెఖ్ఖన, చెడిపోయిన చేయి బాగుపడాలంటే చాల కాలం పడు తుంది; తప్పదు.

సెర్గుతోవ్ డ్రెస్సింగ్ చేశాడు. సామానులన్నీ వార్యా సర్దేశింది. వార్యా ఇవాన్ కేసి చూసింది. అపరేషన్ పూర్తై పోయినా, యింకా అక్కడే, అపరేషన్ బల్ల పక్కనే నిలబడు న్నాడు. ఏదో ఆలోచనల్లో మునిగి తేలుతున్నట్టున్నాడు.

అమొసోవ్ తల తిప్పి దుప్పటి దూరంగా నెట్టి, ఇవాన్ ఇవానొవిచ్ వంక దీర్ఘంగా చూశాడు.

"ధన్య వాదాలు, డాక్టర్ !" అన్నాడు.

తప్పక తిరిగి త్వరగా కోలుకుంటాననే ఆత్మవిశ్వా సమూ, సంపూర్ణ కృతజ్ఞతా ప్రతిధ్వనించాయా మాటల్లో. ఆ మాటలు విని, సిగ్గుపడిపోయాడు ఇవాన్ తన పుదాసీన భావాన్ని తలచుకొని.

"అప్పుడే ఆచేతి నుపయోగించుకోగలననే ధైర్యం వచ్చి నట్టుందే ?" అన్నాడు ఇవాన్, విషాదంగా నవ్వుతూ; "ఇంకా చాలాకాలం వోపిక పట్టాలి, నేస్తం ! నువ్వు నాలుగుమాసాలు కనీసం యింకా నాలుగు నెలలన్నా ఆగితేనేగాని ఆ నరాలు పుష్టి పట్టవు. ఇంకా ఓపిక పట్టాలి" అంటూ రోగి చేతిని తాకాడు. సర్జెన్ చేయి చల్లగావుంది.

"ఓపికపడతాను. వేచి చూస్తాను" అన్నాడు యకూత్ నవ్వుతూ; "మంచికోసం ఓపిక పట్టొచ్చును; తేలికే ! కాని చెరుపు కలుగుతుందని తెలిసీ, ఓపిక పట్టడంవుందే, అదీ కష్టం."

## 5

"చెరుపు కలుగుతుందని తెలిసీ, ఓపిక పట్టడం ఉందే అదీ కష్టం."

కిటికీల బయట చీకటి పడుతోంది. చిన్న చిన్న మొక్కలమీదనుంచి మంచు బెతికెలు జారి పడుతున్నై. నది వొడ్డునుంచీ, యీ హాస్పిటల్‌దాకా బూరుగు మొక్కలు నాటాడు డెనిస్. కాని అవీ వుత్తర ప్రాంత శీతోష్ణస్థితి నెదిరించి పెద్దగా పెరిగేట్లేమీ కన్పించడం లేదు. ఆ గుమ్మడి మొక్కలూ అంతే; ఐనా డెనిస్ ఆశాభావం తగ్గలేదు.

కిటికీదగ్గర నిలబడి బయటికి చూస్తున్నాడు ఇవాన్. ఆ తెల్లని ఆకాశం; ఆ పెరగని మొక్కలు; పడుతూన్న మంచు. మనసులో విచారం. హృదయంలో బాధ. ఒక్కసారి గొంతెత్తి, తోడేలులా అరచి, ఆ బాధనంతా వెళ్ళగక్కుకో గలిగినా బావుండుననిపించింది అతనికి.

కనులముందు కట్టినట్టు కన్పిస్తోంది ఓల్గా ముహం. ఆ తెల్లని తలగడమీద, ఒక ప్రక్కన ఆ చక్కని చిన్న మొహం. "వెళ్ళిపో" అంటున్నట్టుంది. ఆ చేతి విసురూ అలాగే వుంది, "వెళ్ళిపో, నానుంచి దూరంగా వెళ్ళిపో" అంటున్నట్టు.

"నా కిప్పుడేమీ బావుండలేదు" అంటూ దుప్పటి గడ్డంవరకూ లాక్కుంది ఓల్గా; పెదవులుగూడా కప్పేసుకుంది. అప్పుడావిడ కనుల్లో కోపం ఎర్రజీరలు బారినట్టుందిగూడా. ఆవిడ ప్రతి కదలికలోనూ కనిపించింది ఆ విసుగూ, కోపమూనూ.

వార్డులోనుంచి బయటి కొచ్చేశాడు ఇవాన్. తన ఆఫీసులో కిటికీదగ్గర నించున్నాడు. అడుగుతీసి అడుగువేస్తే

తాహాతు గూడా లేకుండా పోయింది. వెళ్ళాలనుకున్నా, యెక్కడికెళ్తాడు? ఈ హాస్పిటల్లే యిల్లిప్పుడు. నిజమే. మొట్ట మొదటిసారి, ఒల్గా బొదానీన్యాన్నీ, ఉపేక్షనీ పసికట్టిందగ్గ ర్నుంచీ యిందే. తన సందేహాలకి సమాధానాల నిక్కడే ఆలోచించుకుంటున్నాడు. తన పనిలో నిమగ్నుడై పోయి, విచారాన్నీ, దుఃఖాన్నీ మింగాలని ప్రయత్నిస్తున్నాడు. కాని, ఇప్పుడు, ఇక్కడకూడా అదేమాట యెదురౌతోంది అను క్షణమూ: "వెళ్ళిపో; నానుంచి దూరంగా వెళ్లిపో."

తన యింటికెళ్తే యెదురయ్యే వెలితినిగురించీ, గంటల తరబడి గడవకుండా నిలబడిపోయే రాత్రినిగురించీ, కిటికీలోంచి అతి నెమ్మదిగా లోపలికి పాకే శీతాకాలపు వేకువజామును గురించీ, ఆలోచించుకుంటూ, అలాగే, అటూ యిటూ తిరుగు తున్నాడు ఇవాన్. అతనిలోని ప్రతి నరమూ యెదురు తిరిగి నట్లుంది.

"నేనేం చేశాను? నా తప్పేమిటి?" చేతులవంక చూచుకున్నాడు. "ఎంతమంది కెంత మేలుచేసినవీ చేతులు! నేనంత ముసలివాడినీ కాదే. అనాకారినీ కాదు. ఉదాసీనుణ్ణీ గాదు."

ఒక పొడుగాటి అద్దంముందు కెళ్ళి ఆగాడు. తన రూపొకసారి ఆపాదమస్తకం చూసుకున్నాడు ఆ అద్దంలో.

"నేనా ఇగోర్ కంటే కనాకష్టమా? ఏమిటిది? జాలా? కుతూహలమా? వొట్టి మోసమా? పచ్చి దగా?"

ఇంతలో ఒక దారుణమైన ఆలోచనవొచ్చి పడిందతనికి.

"అందుకనే దాచిందా రహస్యం, నాకు చెప్పకుండా ....గర్భవతినని చెప్పేందుకుగూడా నిరాకరించింది!"

ఒక దీర్ఘ నిశ్వాసం. అది నిశ్వాసంగూడా కాదు; మూలుగు లాంటి మూలుగు. దగ్గరగా కన్పించిన కుర్చీలో కూలబడి పోయాడు. రెండు చేతుల్లోనూ తల పట్టుకుని నిలువెల్లా వణకి పోయాడు, దారుణ బాధని సహించలేక పోతున్నట్టు.

చివరి కెలాగో లేచి, గది బయటికి నడిచాడు. తలంతా చెరిగుంది జీబుజీబుగా. ఇంకీ సందేహాలతో యిలా సతమత మయ్యి లాభంలేదు. ఈ అనిశ్చిత పరిస్థితినిలా పొడిగించి ప్రయోజనం లేదు. వాస్తవం యేమిటో తెలుసుకోవాలి; నిజ మేమిటో తేల్చివేసుకోవాలి.

సరిగ్గా అదేసమయానికి, హాస్పిటల్ బయట, మంచులో తారట్లాడుతున్నాడు తావ్రోవ్, యేంచెయ్యాలో పాలుపోక; చివరి కేమనుకున్నాడో, నిర్ణయం చేశేసుకుని హాస్పిటల్ మెట్లెక్కాడు. వెళ్ళి తలుపు తెరిచాడు. తలుపు కిర్రుమంది.

ఫర్ జాకెట్ తీసి, వొంకెకి తగిలించి, తటపటాయించాడు కాస్సేపు. కనుబొమలకీ, కనురెప్పల చివరలకీ పట్టిన మంచు తుడుచుకున్నాడు.

హాలులో వార్యా కనిపించింది.

"ఎవర్ని చూట్టానికొచ్చారు? హాస్పిటల్ టైము చాలా సేపైంది" అంది వార్యా.

"చాలాసేపైందా ?"

"...రోగులందరూ అప్పుడే నిద్రబోతున్నారు కూడాను."

"ఒక్క నిమిషమంటే ఒక్క నిమిషం, వార్యా ఇవ్వాళ్ళ నీదేనా డ్యూటీ ?"

"నేనే. ఒక రోగి పరిస్థితి చాలా ప్రమాదంగా వుంది వ్వాళ, ఆపరేషనైన కేసు."

"ఓల్గా....ఓల్గా పావ్‌లోవ్నా దగ్గరికి తీసికెళ్ళాలనుకున్నా నిన్ను. ఆవిడ కొకటివ్వాలి నేను. కిటికీలోంచి చూశాను నిన్ను: అందుకనే లోపలికొచ్చాను."

"పగలెందుకని రాలేదు మీరు, పావాతో బాటు?" అనడిగింది వార్యా, ఇంత ఆలస్యంగా వచ్చారెందుకని అనుమానపడుతూ; "రేపురండి."

వార్యా మొహ్మాడేతీరు చూచి, ఒక్క క్షణం ఆగి, ముందు వెనక లాడాడు, తావ్‌రోవ్; కాని, ఓల్గా....యింత దగ్గర కొచ్చాడు మరి !

"ఒక్క నిమిషమంటే ఒక్క నిమిషమేనని చెప్పాగా" అంటూ వార్యాని ప్రక్కకి తోశి, వెళ్ళిపోయాడు లోపలికి.

అతను ఓల్గావున్న వార్డులో కడుగు పెట్టాడో లేదో, వార్యా వెనక అడుగుల చప్పుడు వినిపించింది. వెనక్కి తిరిగి చూశింది: ఇవాన్ ఇవానొవిచ్ !

కనులువంచి, పాదాలు చూసుకుంటూ నడిచొస్తున్నాడు; మొహం అంతా నల్లగావుంది విచారంగా.

"మూడో మనిషి" అన్నాడు తావ్‌రోవ్, అడవిలో పళ్ళేరుకునేందుకని వెళ్ళినప్పుడు. ఆ మాటలు గుర్తుకొచ్చినై వార్యాకి వెంటనే. 'అదన్నమాట సంగతి!' అనుకుని భయపడిపోయింది. ఇప్పుడర్థమైంది ఆ మాటల అర్థం.

ఇవాన్ ఇవానొవిచ్, ఓల్గా లిలా వుండడానికీ, ఒకళ్ళ నొకళ్ళలా చూచుకోడానికీ, వొకరంటే వొకరంత సన్నిహితంగా వుండకపోవడానికీ, తావ్‌రోవ్ ఆందోళనకీ, అలా వార్డులో పరుగెత్తడానికీ, యిదేనన్నమాట కారణం! 'ఓసీ తెలివితక్కువ పెద్దమ్మా! యీ మాత్రంగూడా అర్థం చేసుకోలేక పోయావన్నమాట; నీ తెలివి తెల్లారినట్లేవుంది. మూడో వ్యక్తి! అంటే ఆవిడ ఇవాన్ ఇవానొవిచ్‌ని ప్రేమించడం లేదన్నమాట. ఆయనేనన్న మాట అవరోధం! ఇప్పుడెళ్ళి యికాయన తన కళ్ళతో తాను చూస్తాడన్నమాట యిదంతా, యీ ప్రేమసల్లాపమంతా! చూచి సహించగలుగుతాడా? ఏమౌతాడో.'

కపట నాటకాలూ అవీ ఆడగల సత్తాలేదు వార్యాకి; శక్తి యుక్తులూ లేవు; అందుకని వూరికే కూర్చుంటే కొంపలంటుకు పోతై. ఏదో వొకటి చెయ్యాలి వెంటనే.

"ఇవాన్ ఇవానోవిచ్ !" అన్నది ఆయనముందు కొకడుగువేశి.

తలెత్తిచూచి, ఆగాడు ఇవాన్.

బిగించిన తీగలా, నిటారుగా నిలబడి, సూటిగా చూచిందతని కళ్ళల్లోకి.

"ఏమిటి, వార్యా ?" అనడిగాడు, అప్పుడే నిద్రలోంచి మేల్కొన్నట్లు.

ఒకవైపున భయం; మరోవైపున ఆదుర్దా, ఆందోళన. "మీతో యిప్పుడే ఒక మాట చెప్పాలి. చాలా అవసరం. ఆలస్యమైతే వీల్లేదు. ఒకసారిలారండి" అంది.

వెనక్కి తిరిగి చూడకుండా, తాన్ కోవ్ వెళ్ళినవైపుకు కాకుండా రెండోవైపుకు దారి తీసింది.

వార్యా వెనకే బయల్దేరాడు ఇవాన్. "చాలా అవసరం" అంది వార్యా. అవసరమా? ఓల్గాని గురించి కాదు కదా!

ఇద్దరూ కలిసి ఇవాన్ ఆఫీసుదగ్గర కెళ్ళారు. ఇవాన్ని ఆఫీసులోకి వెళ్ళనిచ్చి, తను గుమ్మానికడ్డంగా నించుంది వార్యా. ముహమంతా ఎర్రబారింది. నోటంట మాట రావడం లేదు. గౌను దారాలులాక్కుంటూ నిలబడింది.

"ఏమిటి వార్యా? చెప్పు" అన్నాడు ఇవాన్, తల వంచుకుని; ఏదో పెనుతుపాను దెబ్బకు సిద్ధమై కూర్చున్నట్టు.

ఆయనేమనుకుంటున్నాడో తెలుసు వార్యాకి. తను నిజం చెబితే ఎంత బాధ పడతాడో తెలుసు. అంత బాధ, వేదన కలిగించడానికి సిద్ధం కాగలదా తాను?

ఇంతవరకూ, నిష్కపటంగా, అతనివంక చూస్తున్న కళ్లు నేలకు వాలినై.

"మాకోర్స్‌ని గురించి మాట్లాడదామని...." అంటూ నత్తులు గొట్టింది, ఏంచెయ్యాలో తోచక నవ్వుతూ.

"మీకోర్సా? వార్యా! యిప్పుడా అలాంటి ప్రశ్నలు! ఆ ప్రశ్నలకి జవాబుచెప్పే తీరికగూడా వుంది నాకు, వార్యా!" అన్నాడు, పొంగుకొస్తున్న దుఃఖాన్ని బలవంతాన ఆపుకున్నట్టు. అని గుమ్మంవైపుకి బయల్దేరాడు.

"ఒక్క నిమిష మాగండి! ఒక్క నిమిషమంటే ఒక్క నిమిషం!" అంటూ ప్రార్థించింది వార్యా, నిలుచున్న చోటు-

నుంచి కదలకుండా. ఆవిడ మనసులో యిప్పుడున్న ఆలోచన వొక్కటే: ఎట్లాగోట్లా, తావ్రోవ్ వెళ్ళేవరకూ యీాయ న్నిక్కడాపాలి. "ఒక్క నిమిషం!" అంది మళ్ళీ.

ఇవాన్ ఇవానొవిచ్‌కి వెంటనే అనుమానం వేశినట్టుంది. "నన్నిక్కడిలా ఆపడమెందుకు. అసలు నన్నిక్కడి కెందుకు తీసుకొచ్చావ్ ?" అంటూ లేచాడు.

"ఏమీలేదు...." అంటూ నీళ్ళు నమిలింది వార్యా; కను రెప్పలు కిందికి వంచి, "నేను మిమ్మల్నెంత ప్రేమిస్తున్నానో మీకే గనక తెలిస్తేనా!" అంది, కట్టలు తెగిన ఉద్వేగంతో. "మీరు 'చనిపో!' అనండి; ఇప్పటికిప్పుడు నించున్న దాన్ని నించున్నట్టు చనిపోతాను. అగ్నిగుండంలోకి గనాకమంటే దూకుతా. మీరేది చెయ్యమంటే అది చేస్తాను!"

ఇవాన్ ఏమీ మాట్లాడలేక పోయాడు.

"కాని, నువ్వు చనిపోవడం యెందుకు? నిన్ను చని పొమ్మని ఎందుకంటాను నేను? అవేం మాటలమ్మా? నువ్వంటే నాకెంత యిష్టమో నీకు తెలియదూ!"

"నిజవేఁ, నాకు తెలుసు" అంది వార్యా, పిడికిళ్ళు బిగించి కణతలదగ్గర పెట్టుకుంటూ. గట్టిగా ఏడవాలనిపించింది గొంతెత్తి; తల వంచుకుని ఆ యేడుపు నాపుకుంది.

## 6

తావ్రోవ్‌ని చూచి కంగారు పడిపోయుంది ఓల్గా. ఇవాన్ ఇవానొవిచ్ వస్తాడనుకుంది; వెళ్ళేముం దొకసారొచ్చి

కనబడకుండా వెళ్ళేడు; తప్పకుండా వస్తాడు; ఆయన అడుగుల చప్పుడు హాలులోంచి యెప్పుడు, వినబడుతుందా, యెప్పు డొచ్చి వెళ్ళిపోతాడా అని చూస్తోంది.

అనుకోకుండా వచ్చేశాడు తావ్‌రోవ్ అకస్మాత్తుగా; ఒంటరిగా, రాత్రిపూట, రోగులందరూ నిద్రపోయే సమయాన. నైట్‌గౌన్ కాలరు కంఠంచుట్టూ పెనవేసి పట్టుకుని, ఒక భుజంమీదానుకుని, లేచి చూచింది, గాభరాపడుతూ. అతని ముహంలో ఎంతో వేదన; అతని కన్నుల్లో ఆవేదన; నునుసిగ్గు దొంతరలు. ఆర్ద్రంగా చూచింది ఓల్గా అతనివంక. దగ్గరకెళ్ళి, ఆవిడ పక్క ప్రక్కనేవున్న కుర్చీలో కూర్చున్నాడు చప్పుడు చేయకుండా.

"ఇక, నువ్వు లేకుండా నేబ్రదకలేను" అన్నాడు చెవిలో చెబుతున్నట్టు అతి నెమ్మదిగా; "నాభావాల నణచు కోవాలని యెంతో ప్రయత్నించాను. ప్రయత్నించిన కొద్దీ నా బాధ లెక్కువైనై; నన్ను నేను హింసించుకోవడమే తప్ప ప్రయోజనం లేదు. ఇప్పటికే నా ఆరోగ్యం చెడిపోయింది; నూరేళ్లూ నిండాయనిపిస్తోంది."

చుట్టూ పండుకునున్న రోగులవంక చూచింది ఓల్గా; ఇవాన్ వచ్చే గుమ్మంవంక చూచింది.

"నీ భావాలూ, నాభావాలూ ఒకటేఐతే, మనిద్దరమూ యిలా బాధపడడం యెందుకు ? దేనికీ యీ వేదనంతా ? ఎవ రికి మాత్రం యేంలాభం ? పోనీ, ఆయనకు మాత్రం తెలిశా?"

"అదంతా తర్వాత మాట్లాడుకుందాం" అంది ఓల్గ.

"తర్వాతేమిటి ?"

"ఆయనొస్తారేమో, భయంగావుంది." అని వొప్పేసుకుంది ఓల్గా; అలా వొప్పుకున్నందుకు సిగ్గుపడుతూనే. ఆ కంగారునీ, గాభరానీ దాచుకోలేక పోయింది. "ఇంకా హాస్పిటల్లోనే వున్నారాయన."

మౌనంగా, ఆవిడవంక అలాగే, కన్ను లార్పకుండా చూస్తున్నాడు తావ్‌రోవ్, ఆవిడన్న మాటలు వినబడనట్టు.

"ఓల్గా! ఇప్పుడు తెలుస్తోంది నాకు. నేనే తప్పు చేశాను. నేనింకా నిబ్బరంగా వుండవలసింది. నీ ఆరోగ్యం బాగుపడగానే, నిన్ను తీసికెళ్ళి పోతాను."

"ఓహో?" అంది ఓల్గా. ఈ యిద్దరు మగవాళ్ళ దృష్టిలోనూ తాను మనిషైనట్టే లేదు. ఏదో ప్రాణంలేని వస్తువు. ఎవరిష్టం వచ్చినప్పుడు వాళ్ళు, వాళ్ళిష్టం వచ్చినట్టు ప్రవర్తించొచ్చు నన్నమాట యీ ప్రాణంలేని కట్టెతో. కాని తావ్‌రోవ్ కన్నుల్లో ఆ భావం యేమీలేదు; ఓల్గా అంటే వున్న ప్రేమ, అనురాగం, శ్రద్ధ, పూజ్యభావం, ఆవిడ చెప్పినట్టు చేసేందుకు సంసిద్ధతా ప్రస్ఫుటంగా వ్యక్తమౌతున్నై ఆ కన్నుల్లో.

"ఇంకా చాలాకాలం వుండాలా యిక్కడ?" అనడిగాడు తావ్‌రోవ్.

అడిగినదానికి జవాబు చెప్పకుండా, "అంతా తెలుసా మీకు?" అనడిగింది ఓల్గా.

తెలుసు నన్నట్టు తలూపాడు తావ్‌రోవ్. ఇంకేమీ మాట్లాడలేక, ఆవిడ చేయితీసుకుని పెదవులతో తాకాడు.

హాస్పిటల్ వార్డులో వున్నానన్న సంగతే మరచిపోయినట్టున్నాడతను. ఇంకో ఐదు జతల కనులూ, చెవులూ అదే

గదిలో వున్నాయనిగూడా గుర్తించినట్టు లేదు. నిజమో, నటనో గాని, మిగతా ఐదుగురు స్త్రీలూ నిద్రపోతున్నట్టున్నారు. కాని అందులో యే ఒక్కరు కన్ను తెరచి చూచినా, అక్కడ కూర్చున్నది తావ్‌రోవ్ కాదనీ, ఇవాన్ ఇవానొవిచేననీ మట్టుకు అనుకునే ఆస్కారం లేదు.

"అన్నీ తరవాత మాట్లాడు కుందాంగా" అంది ఓల్గా మళ్ళీ; "నామాట నమ్మండి. నన్ను విశ్వసించండి. మీరిక వెళ్ళి పోవాలి; వెళ్ళండి; చేతులు జోడిస్తాను."

ఆవిడ కనుల్లో ఆ దిగులూ, ఆ భయమూ, ఆ బెదురూ చూచింతర్వాత గాని అర్థం కాలేదు తావ్‌రోవ్‌కి తానేం చేస్తూందీనీ.

"వెళ్తాను," అంటూ సంబాళించుకుని లేచాడు వెంటనే; వెళ్ళలేక, వెళ్ళలేక వెళ్ళిపోయాడు.

మళ్ళీ హాలులోకొచ్చాడు ఇవాన్ ఇవానొవిచ్; 'ఎలాంటి పరిస్థితు లెలా మారిపోయినై విచిత్రంగా!' అనుకున్నాడు.

వెళ్ళి, ఓల్గాతో అన్నీ మనసువిప్పి మాట్లాడాలనుకున్నాడు; అప్పుడన్నీ స్పష్టమై పోతాయి; వున్నవిషయ మేదో తెలుస్తుంది; అసలుసంగతి బయటపడుతుంది. కాని ఆ 'అసలు సంగతి'ని వినే ధైర్యం లేదు. ఏదో వొకవిధంగా తప్పించుకుని బయటపడాలి.

హాస్పిటల్ లౌంజ్‌లో కూర్చుని, కొంత మంది రోగులు రేడియో వింటున్నారు.

తలుపులదగ్గర కెళ్లి, "నిద్రపోయే సైమైంది; నిద్రపోయే సైము" అంటూ గొణిగాడు ఇవాన్.

రేడియోలో వార్తలు చెబుతున్నారు. వెళ్ళి, ఒక మూలనున్న సోఫాలో కూర్చోబడ్డాడు; యీ లోకంలోనే వున్నట్టు లేదు.

ప్రపంచయుద్ధం చెలరేగుతోంది. ప్రాగ్దేశాలన్నీ కొల్లగొడుతున్నారు జపాను వాళ్ళు; పశ్చిమ దేశాల నెత్తిమీద ఒకటే విమానాల రొద. బ్రిటిష్‌వాళ్ళు బెర్లిన్‌మీద బాంబులు వేశారు. జర్మన్లు లండన్‌మీద బాంబులు వేస్తున్నారు. బకింగ్‌హామ్ రాజభవనంలో వాళ్ళందరూ బాంబురక్షణ పాంతాల్లో తలదాచుకుంటున్నారు. రాజూ, రాణీ వెళ్ళిపోయారు: రాజభవనంమీద యింతవరకూ నాలుగు సార్లు వేశారు బాంబులు.

"అనగా అనగా ఒక రాజు; ఒక రాణి" అంటూ గొణుక్కున్నాడు ఇవాన్; "హుఁ........ అనగనగా........"

ఒక పెద్ద భవనంమీద పడిందొక బాంబు; అనేక మంది అన్యాయంగా ప్రజలు చచ్చిపోయారు. కాని, రాజుగారు మాత్రం సురక్షితంగా వున్నాడు. గొప్పగొప్ప లార్డులూ, వారి శ్రీమతులూ వాళ్లందరికీ బాంబురక్షణలున్నై. అలాంటి పరిస్థితుల్లో ఎలాంటి మర్యాద (ఎటికెట్) పాటించాలో అని ఆలోచించాడు ఇవాన్, తన సహజ హాస్యధోరణిలో.

కవెంట్రీ యంత్రాగారాల్లో మంచి ఉక్కు తయారౌతుంది; యుద్ధసామాగ్రులికి చాలా బాగా వుపకరిస్తుందా ఉక్కు. అక్కడ వేలకొద్దీ కార్మికులుంటారు, వాళ్ళ వాళ్ళ కుటుంబాలతో సహా, అనగనగా........హుఁ....

తలెత్తి, చుట్టూ చూశాడు ఇవాన్. గదిలో తను తప్ప యింకెవ్వరూ లేరు. అతన్ని చూచి, భయపడి, యెక్కడి వాళ్ళక్కడి కెళ్ళిపోయారు రోగులు. మరి....ఓల్గా ? ఆవిడతో మాట్లాడొద్దూ ? బాంబు బ్రద్దలై దగ్గర వస్తువులన్నీ పైకెగిరి పడినట్లు, లేచి నిలబడ్డాడు ఇవాన్. ఓల్గా గదివైపుకి బయల్దేరాడు.

ఇవాన్ వార్డులో కెళ్ళేప్పటికి రోగులందరూ నిద్ర పోతున్నారు. ఓల్గా మట్టుకింకా కళ్ళుబార్లా తెరిచి చూస్తూనే వుంది. కాని, భర్త గదిలో కొచ్చిన సంగతిగూడా గుర్తించినట్లు లేదు. ఆవిడ ముహంవంక చూస్తూ, అలాగే నిలబడి పోయాడు ఇవాన్ కాస్సేపు. తర్వాత, నెమ్మదిగా అడుగులో అడుగేసుకుంటూ వెళ్ళాడు ఓల్గా పక్క దగ్గరికి. ఉలిక్కిపడింది ఓల్గా.

"మీరా!....యింకా యిక్కడే వున్నారేం?"

ఎంతో ఆందోళనపడుతున్నట్టుంది ఆ గొంతు. వార్యాతో జరిగిన సంభాషణ గుర్తుకొచ్చింది ఇవాన్‌కి.

"ఆలస్యమైంది. ఎవరోవచ్చి........" అన్నాడు.

తనుచేసింది నేరమనే అనుకుంటున్నాడాతను? ఇంకాస్సేపలాగే వుంటే, యేమనేవాడోగాని, యింతలో ఓల్గాచేయి వెచ్చగా తగిలింది; ఓల్గాకి జ్వరం వచ్చింది.

డ్రాయరు సొరుగులోంచి థెర్మామీటర్ తీసి విదిలిస్తూ, "నీకు బాగా జ్వరంగావుంది. పక్కమీదినుంచేమైనా లేచావా? గదిలో అటూఇటూ యేమన్నా నడిచావా?" అనడిగాడు.

ఇవాన్ గాభరాపడిపోయాడు. నుదురంతా [illegible]

పడిందతనాలోచిస్తూంటే. జబ్బుమళ్ళీ విషమ పరిస్థితిలో పడు తుందేమోనని భయపడిపోయాడు. అంతకు పూర్వం అనుకున్న మాటలూ, అడగాలనుకున్న మాటలూ, అన్నీ మరిచిపోయాడు. ఇకప్పుడు తన ఆవేదన సంగతి యింకేం చెబుతాడు. ఊరుకున్నాడు.

# 7

హాస్పిటల్ మెట్లుదిగుతూ 'బయల్దేరే ముందనుకున్న దేమిటి? జరిగిందేమిటి?' అనుకున్నాడు ఇవాన్.

ఓల్గా ఆరోగ్యం బావుండ లేదు; ఆవిడంటే వోకరక మైన జాలి, కనికారమూ కలిగినై ఇవాన్‌కి. ఇదివరకటి అను మానాలూ, అసూయా నెమ్మదించినై. జరిగినవన్ని మరిచి పోవడమూ, క్షమించేసి వూరుకోవడమూ చేతకాదతనికి; ఈ చెంపను గొడితే ఆ చెంప చూపాలని గూడా అంగీకరించని మనిషి. కాని, ఓల్గా ఆరోగ్యం బాగుండలేదు; ఓల్గా అంటే అపరిమితమైన ప్రేమ.

బూట్లకింద మంచు గరగరలాడుతోంది. మంచు తగిలి చెంపలు చురుకు చురుక్కు మంటున్నై. ఊపిరి పీల్చడమే కష్టంగా వుంది. ఐనా, నది ప్రక్క రోడ్డు చేరుకునేదాకా నడుస్తూనే వున్నాడు ఇవాన్. అక్కడికెళ్ళింతర్వాత ఆగాడు, ఏం చేయాలో ఆలోచించుకునేందుకు. కాని యింటికెళ్ళాలనిపించ లేదు; ఇల్లంతా బేలుమంటూంటుంది. బాగా అలసిపోయేదాకా యిలాగే తిరిగి, తిరిగి యింటికెళ్తే నన్నా నిద్రపడుతుందేమో. వెళ్ళగానే.

ఉన్నిటోపీమీద, కనుబొమల మీద, కనురెప్పలమీద మంచు పేరుకుంది. ఆకాశమంతా తెల్లని పలాచటి ముసుగు వేసుకున్నట్టుంది. ఆ ముసుగులోంచి మసక మసకగా మెరుస్తున్నై నక్షత్రాలు; గాలిలో వణకిపోతున్నై, కన్నుగీటుతూ; మినుకు మినుకు మంటూ గలగలా మర్మరధ్వని చేస్తున్నట్టున్నై. వార్యా అన్నమాటలు నిజమేనా ? నిజమయ్యేందుకు అవకాశం వుందా? ఆ గలగల శబ్దం చేస్తున్నది మినుకు మినుకు మనే చుక్కలేనా? లేక, తాను పీలుస్తున్న గాలా?

వార్యా........ఓల్గా స్థానాన్ని యింకొకస్త్రీ ఆక్రమించ గలదా తన జీవితంలో? అసలిలాంటి ఆలోచన రావడమేమిటా అని ఆశ్చర్య పోయాడు ఇవాన్; శరీరంలోని ప్రతి అణువులేచి నిలబడి వ్యతిరేకించిందా ఆలోచన్ని. ఓల్గా రాకపూర్వం, కామెనుష్కాలో తానుగడిపిన రెండుసంవత్సరాలూ గుర్తుకొచ్చినై ఇవాన్‌కి. ఆ రెండేళ్ళలోనూ యెన్నిరకాల ఆకర్షణలు; మనసు పరి పరి విధాల పోయేది; చలించేది. ఇటు పనిచేసేప్పుడూ, అటూ తీరిగ్గా వున్నప్పుడూ గూడ రకరకాల స్త్రీలొచ్చిపోతూండేవారు. ఐనా, మరీ వొంటరి తనంగా వున్నప్పుడు, ఏకాంతం బాధాకరంగా తయారైనప్పుడు వెంటనే ఏ వేటకనో, షికారుకనో, కట్టెలు కొట్టేందుకనో వెళ్ళిపోయేవాడు. శారీరక శ్రమ జేసి బడలి పోయింతర్వాత, వచ్చేవాడు యింటికి. ఆ బడలికతో మనసిక చలించకుండా వుండేందుకని, తప్పుడు దారులు పట్టకుండా వుంటుందని. రంగు పులుముకున్న పాపా పెదవులూ, కవ్వించి రెచ్చగొట్టే ఆ చూపులూ తలచుకుని తుపుక్కున వుమ్మేశాడు ఇవాన్.

అతనికి కావలసింది ఓల్గా .... ఓల్గాయే .... ఎనిమిదేళ్ళ

క్రితం తనకు పరిచయమైన ఓల్గా, యింతకాలంనుంచి తాను ప్రేమిస్తూవచ్చిన ఓల్గా.

'ఓల్గా పవిత్రమైన మనిషి; ధైర్యంగా ఉండేది; శీలవతి; మంచి మనిషి; నేనంటే యెంతో గౌరవంగానూ, ఆదరంగానూ వుండేది; కాని మరి యిప్పుడిలా ఐపోయిందేమిటీ?' అనుకున్నాడు ఇవాన్; 'ఇప్పుడా పవిత్రతాలేదు, ఆ ధైర్యమూ లేదు. ఆ శీలమూ వున్నట్టులేదు...మొత్తంమీద యెందుకోగాని బాగా బాధపడిపోతోంది ... నాతో చెప్పేందుకు భయపడుతోంది ... ఐనా ఆవిడంటే నా ప్రేమేమీ సడలడంలేదు; ఎందుకని? అందమైనది కాబట్టా? ఐతే, వార్యా అంతకంటే అందంగా వుంటుంది, అంతకంటే సొంపుగా గూడా వుంటుంది, వయసులో ఓల్గా కంటే చిన్నది కాబట్టి...............'

ఎంత గాఢంగా ప్రేమిస్తోందో వార్యా తనని. తన ప్రేమని, ఆఫీసులో వ్యక్తంచేస్తున్న వార్యా రూపు యింకా కళ్ళకుకట్టినట్లేవుంది: ఆ తెల్ల గౌను, ముహంలో స్ఫుటిపడే ఆ పావిత్ర్యం, . చెడుగంటే యేమిటో తెలియని మనిషి వార్యా; పవిత్రమైన వ్యక్తి: ఎప్పుడూ తనపనిలోతాను నిమగ్నమై వుంటుంది; సృజనాత్మకమైన పనులంటే యెంతో ఆసక్తి, యెంతో శ్రద్ధ, యెంతో యిష్టం! అందుకనే అంతమంది యువకులు ఆవిణ్ణి ప్రేమించడం! లొగునోవ్ గూడాను...లొగునోవ్ అంటే ఇవాన్ కి బాగా యిష్టం. అతని సంగతి గుర్తుకు రాగానే, గనుల షేటవైపుకు బయల్దేరాడు: ఎవరో వొక మంచి వ్యక్తిని, స్నేహపూర్వకంగా సానుభూతిని చూపించగల వ్యక్తిని, కలుసుకోవడం మంచిది యిలాంటప్పుడు.

కాని, లొగునోవ్ యింటివరకూ వెళ్లలేదు ఇవాన్. ఇవ్వాళతని ఆలోచనలన్నీ అలాగే వున్నై; శూన్యంలో వ్రేళ్లాడుతున్నై. నదిమీద వంతెన దాటగానే, తావ్‌రోవ్ ఎదురయ్యాడు; స్నేహపూర్వకంగా పలకరించాడు.

ఈ మధ్య తావ్‌రోవ్‌ని కలుసుకోవడం తటస్థపడలేదు; ఇవాన్ కతనన్నా బాగా యిష్టమే.

"బావుందా ?" అన్నాడు తావ్‌రోవ్; "ఇలాంటి రాత్రిని చూస్తే మనస్సు ఆనందంతో నిండిపోతుంది; ఏమిటా యీ ఆనందం అని వెనక్కితిరిగి ఆలోచించేప్పటికే, యేముక్కో యేచెవో తినేస్తోంది పాడుమంచు !"

తావ్‌రోవ్ గొంతులో యేదో తెచ్చిపెట్టుకున్న ధైర్యం ధ్వనించింది; కాని ఇవాన్ అదంతా గుర్తించినట్టు లేదు. "నిజమే. బాగా చలిగానే వుంది ? షికారుకా బయల్దేరారు ?" అనడిగాడు.

"బాధలు మరచిపోదామని." అన్నాడు తావ్‌రోవ్, ధైర్యంచేసి మనసువిప్పి మాట్లాడుతూ; "ఇప్పుడే యెంతో హుషారుగా వుందామని. బయలుదేరాను; కాని యేమి లాభం ?"

ఇంకా తాఫ్‌రోవ్ యేమేమి మాట్లాడేవాడో, యేమేమి రహస్యాలు చెప్పేవాడో తెలియదు; ఇంతలోనే యెవరో కొండవాలునబడి పరుగెత్తుకొస్తున్నట్టు కనిపించింది యిద్దరికీనీ. ఆవిరి యంత్రంలా, రొప్పుకుంటూ రొజుకుంటూ వచ్చాడు షెనిఫ్.

వచ్చి, "హమ్మయ్య!" అంటూ, ఇవాన్ చెయ్యి పట్టుకున్నాడు; "పేటంతా గాలించాను మీకోసమని! చాలా పెద్ద ప్రమాదం జరిగింది; మీరేమో యెక్కడ వెదికినా కన్పించలేదు...!"

"ఓల్గా ?" అన్నారు తావ్‌రోవ్, ఇవాన్‌లు యిద్దరూ కలిసి ఒకేసారి. ఇద్దరు మనుషు లొకే పేరును వుచ్చరించినట్టు గూడా లేదు; ఒక మనిషే అన్నట్టుంది. అంచేతా సంగతి డెనిస్, ఇవాన్‌లలో యెవ్వరూ గుర్తించనుగూడా లేదు.

"కాదు" అన్నాడు డెనిస్ విసుగ్గా; మళ్ళీ యిద్దరూ 'హమ్మయ్యా' అనుకున్నారు ఒకేసారి. "కాదు. కత్తిపోటు తిన్నమ్మాయిని తీసుకొచ్చారు హాస్పిటల్‌కి; ఆ దెబ్బగూడా గుండెలో తగిలింది. గూసేవ్ సంగతి మీకూ తెలుసుగా, ఆపరేషన్ చెయ్యడానికి వీల్లేదన్నాడు."

డెనిస్ చెప్పడం యింకా పూర్తి కానేలేదు; హాస్పిటల్ కేసి చరచరా నడిచెళ్ళి పోయాడు ఇవాన్.

# 8

ఆ కత్తిపోటుకు గురైన స్త్రీ ప్రవేశశాలలో పండుకునుంది. తల వొక ప్రక్కకి తిరిగి వ్రేళ్ళాడుతోంది; హాస్పిటల్ కొచ్చిం దగ్గర్నుంచీ అలాగేవుంది స్పృహ లేకుండా. వెళ్ళగానే, చేతులవీ కడుక్కుని వచ్చేశాడు ఇవాన్, రోగిదగ్గరికి. బాగా పాలిపోయి, వెలవెలబోతోంది ఆవిడ ముహం. బాగా ఆయాసపడిపోయినట్టు పీలుస్తోందూపిరి. కనురెప్పలు వేసే మాత్రం

బలంగూడా లేదేమోననిపించింది ఆ సగం మూసుకున్న కనులు చూస్తూంటే.

చిరిగిన బ్లౌజూ, లోపలి బోడీగూడా తీసేశారు ఇవాన్ వచ్చింతర్వాత. అంతా రక్తసిక్తం. చేతి కంటుకుపోయాయా దుస్తులు నెత్తుర్లో తడిసుండడం మూలాన. ఎడమవైపు రొమ్ముదగ్గర, చనుమొనకు కొద్దిగా యెగువన వుంది గాయం; కత్తితో పొడిచినచోటు. ఆ గాయం చూడగానే, మిగతా ప్రపంచంమాట మరిచిపోయాడు ఇవాన్; అతి జాగ్రత్తగా పరీక్షించాడా గాయాన్ని.

నాడి సరిగ్గా అందడంలేదు కాని చాలా వేగంగా కొట్టు కుంటున్నట్టుంది. నిమిష నిముషానికీ గుండెవేగం మందగించి పోతోంది. కత్తి గుండెమీది పైపొరకూ్కాడ తగిలినట్టుంది.

గూసేవ్‌వంక చూశాడు డాక్టర్ ఇవాన్.

ఇంకేమీ ఆశలేదన్నట్టు, "గుండెకాయ గూడాను" అన్నాడు గూసేవ్.

"నిజమే. గుండెకే తగిలింది దెబ్బ" అన్నాడు ఇవాన్; "ఆపరేషన్ చెయ్యాలి. సరే. ఆపరేషన్ గదిలోకి తీసికెళ్ళం డీవిణ్ణి" అని చెప్పాడు డెనిస్‌తో; "తీసుకెళ్ళగానే, వెంటనే, నరాలకి సెలైన్ ఇంజెక్షనివ్వండి."

గూసేవ్‌కేమీ ఆశవున్నట్టు లేదు: ఆపరేషన్ టేబుల్ మీద ఆవిడెలాగూ చనిపోతుంద; ఎందుకొచ్చిన బెడద. ఇక్కడే వుంచితే యింకాస్సేపటి కెలాగూ ప్రాణాలు విడిచేది. ఆపరేషన్ బల్లమీదకి తీసికెళ్ళనేల; అక్కడ చనిపోయిందని అని పించుకోనేల? ఏమో, అదంతా డాక్టర్ ఇవాన్ యిష్టం.

తను మాత్రం యీ ఆపరేషన్ కెంతదూరంగా వుంటే అంత మంచిది.

ఇవాన్ ఇవానొవిచ్ ఆపరేషన్ చేసేందుకు సన్నద్ధమయ్యాడు. వార్యా, నికీతా, సెర్గుతోవ్, ఇక్కడే. ఆపరేషన్ బల్లదగ్గరే వున్నారు. మొత్తం స్మృతి తప్పించిగాని ఆపరేషన్ చేసేందుకు వీల్లేదు. ఎక్స్‌రే తియ్యలేదు; తీసేందుకు టైమూ లేదు, తీసినా అవసరంగా తెలిసేదీవుండదు. గర్భాన్ని యెక్కించ లేదు; ఇలాంటి కేసుల్లో ఆపని చెయ్యడం నిషిద్ధం.

బల్లప్రక్క కొచ్చి నిలబడ్డాడు ఇవాన్.

ఆవిడ శరీరమంతా దుప్పట్లు కప్పారు. మధ్యలో గాయం వున్నచోట మాత్రం కొద్దిగా ఖాళీవుంచారు. గూసేవ్ మత్తు మందిచ్చాడు. శస్త్రాన్ని వుపయోగించవలసిం దెక్కడా అని చాలా జాగ్రతగా పరీక్షించి చూశాడు ఇవాన్, అయొడిన్ పూసిన గాయమంతా. కంఠం కిందనుంచీవున్న ప్రక్క టెముకలు మళ్ళీ వొకసారి లెక్కబెట్టాడు; తర్వాత 'స్కాల్పెల్' పుచ్చుకున్నాడు.

"నిద్రపోతోందా ?"

ఔనని తలూపాడు నికీతా.

వివిధ శస్త్రాల్నుపయోగించి, అతి నేర్పరితనంగానూ, సుళువుగానూ, రొమ్మునందు కనబడేట్టు కోసేశాడు.

ఆవిడ శ్వాస తీసుకుంటూన్న చప్పుడు తప్ప యింకేమీ వినిపించడం లేదాగదిలో. పల్చటి పొరలోంచి, ఆ గుండె కొట్టుకోవడంగూడా స్పష్టంగా కనిపిస్తోంది. ఫోర్సెప్స్‌తో ఆ పొరను గూడా పైకెత్తి పట్టుకుని, కత్తిపెట్టి, రెండుగా చీల్చాడు.

సర్జెన్ ఇవాన్. వెంటనే రక్తం చిమ్ముకుంటూ వచ్చింది పొర లోంచి. గాజ్ పెట్టి వచ్చే రక్తాన్ని అద్దేశారు ప్రక్కనున్న సర్జెన్లు. ఆకిప్పుడు గుండె వుపరిభాగంగూడా కనిపిస్తోంది నెత్తురులో పైకీ కిందికీ తేలుతూ. తా నింతకు పూర్వం చీల్చిన పొరలోకి నెమ్మదిగా ఎడమచెయ్యి పోనిచ్చి, జాగ్రత్తగా గుండెను పట్టుకుని పైకి లేపాడు; దడదడ కొట్టుకుంటోంది గుండె; గుండె వుపరి భాగాన ఒక చిన్న గాయం వుంది ముక్కోణాకారంలో.

"కుట్లు!" అన్నాడు సర్జెన్ ఇవాన్ వెంటనే.

సర్జెన్ చాపిన చేతిలో ఒక సూది వుంచి, యింకో సూది సిద్ధంగా చేతిలో వుంచుకుంది వార్యా. ఎడంచేతిలోవున్న గుండె కాయ మీదనుంచి చూపులు తిప్పకుండానే, కుట్లు వెయ్యడం పారంభించాడు ఇవాన్. సెర్గుతోవ్ జాగ్రత్తగా బిగించి ముడేశాడవి. రక్తస్రావం ఆగిపోయింది. ఇవాన్, గుండె కాయని పదిలంగా పైకి లేపి, పొరమీదున్న రక్తం అంతా తుడిచి, మళ్ళీ యథాస్థానంలో వుంచాడు. ఇక పై పొరగూడా కుట్టేద్దామని అనుకుంటూ వున్నాడు, ఇంతలోనే, గుండె కొట్టుకోవడం మానేశింది; ఒక సెకను క్రితంవరకూ, కుట్లు వేస్తున్నప్పుడుగూడా ఆడుతూనేవుంది పైకీ, కిందకీనీ. అందువల్ల కుట్టడంలో కొద్ది ఆలస్యమైంది గూడాను. ఇంతలోనే ఆగిపోయిందగస్మాత్తుగా. వెంటనే ఆవిడముఖం నీలిరంగుకు తిరిగింది. నికీతాకి నాడి అందలేదు.

"ఇవాన్ ఇవానొవిచ్!" అన్నాడతను భయపడిపోయి.

ఇవాన్ నుదురంతా చెమట పట్టిపోయింది. సంబాళించుకుని "చూశాను" అన్నాడు.

"నేన్చెప్పలా !" అన్నాడు గూసేవ్.

అతనివంకోకసారి చూచి, "ఒక అడ్రెనలైన్ ఇంజెక్షన్ నివ్వు. ఊc, వెంటనే!" అన్నాడు నికీతాతో, ఇవాన్.

మళ్ళీ చేయి లోపలికి పోనిచ్చి, గుండెకాయని నెమ్మదిగా నిమరడం ప్రారంభించాడు. ఇంజెక్షనిచ్చింతర్వాత అందరూ వూపిరి బిగబట్టుకుని చూస్తున్నారు శవంచుట్టూ చేరి. ఆపరేషన్ గదంతా, సూది పడినా వినిపించేంత, నిశ్శబ్దంగా వుంది.

గుండె నెమ్మదిగా కదిలినట్లైంది; కొద్దికొద్దిగా అంచెలంచెలమీద ముడుచుకుంది గుండెకాయ. చలితో గడకట్టుకు పోయిన పక్షి నునువెచ్చని చెయ్యి తగిలి రెక్కలాడించినట్టు, ఆడుతోంది గుండె, ఇవాన్ చేతుల్లో. నెమ్మదిగా రక్త ప్రసారంగూడా ప్రారంభమైంది: రోగి ముహం లేత యెరుపు రంగుకు తిరిగింది. నాడి ఎప్పటిలా కొట్టుకుంటోంది. సంతృప్తిగా చిరునవ్వు నవ్వాడు నికీతా.

అందరూ, భారం దించుకున్నట్టు, దీర్ఘనిశ్వాసం వదిలారు.

జులై మాసం యెండలో తిరిగితే పట్టినట్టు పట్టింది ఇవాన్ నుదుట చెమట. ప్రక్కకు తిరిగి, "కాస్త చెమట తుడవండి!" అన్నాడు.

ప్రశాంతంగా, గుండెమీది పొరనుగూడా కుట్టేశాడు. గుండె సందునుగూడా మూసేశాడు.

ఆపరేషన్ పూర్తైంది. రోగి వూపిరి పీలుస్తోంది. గుండె ఎప్పటిలా ఆడుతోంది. ఆపరేషన్ బల్ల ప్రక్కనే నిలబడు

న్నాడు ఇవాన్. అలసిపోయి. నాడిని పరీక్షించాడు. ఒక ప్రాణం దక్కింది.

# 9

"బ్రతుకుతుందా ఆవిడ ?" అనడిగింది ఓల్గా.

"తప్పకుండాను."

"ఎవరు పొడిచారో కత్తితో ? ఎందుకు పొడిచారో ?"

"ఆ, యేదో కీచులాట" అన్నాడు ఇవాన్; "ఎవడో మోటు వెధవై వుంటాడు."

"మృగం" అంటూ గొణిగింది ఓల్గా.

"పడ్డాడు! వాడు నిజంగా మృగమే ఐతే, యీావిడక్కడే చనిపోయేది" అన్నాడు ఇవాన్ సాలోచనగా; "వాడు పొడిచిన పద్ధతి చూస్తే వొట్టి పిరికివాడిలా వున్నాడు. మొట్టమొదట తప్పే పోయింది.... చెయ్యి వణికిందన్న మాట. రెండోసారి కోపం కొద్దీ మళ్లీ పొడిచాడే తప్ప, కత్తి వెనక్కి లాగుదామన్న ధైర్యం గూడా లేకుండా పోయింది వాడికి. ఇక్కడి కొచ్చింతర్వాత డెనిస్ తీసేశాడు హాస్పిటల్లో."

"మీరు .... మీరొక వ్యక్తినలా చంపగలరూ ?"

"ఛ. ఏం మాటలవి!" అన్నాడు ఇవాన్ మాట తుంచేస్తూ; "నా జీవితం అంతా, పోయేపోయే ప్రాణాల్ని రక్షించడాని కంకితం చేశాను. ఒక్క నెత్తురుబొట్టు కిందరాలినా, నా ప్రాణం పోయినంత పనౌతుంది. సర్జెన్లు కటికవాళ్ళ కంటె కనాకష్టం అనుకుంటారు కొందరు; వాళ్ళకేమి ఉదాత్త

భావాలే వుండవనుకొంటారు. కానది పొరపాటు; మానవ ద్వేషులు అనుకోవలసిన మాట అది. రక్షించిన రోగుల్ని కన్న బిడ్డల్ని చూసుకున్నట్టు చూస్తాడు సర్జెన్, ఎప్పుడూనూ. పైకి మొరటుగా వున్నా, యెట్లా వున్నా, అసలైన సర్జెనే నిజమైన మనిషి; ఆమాటలన్నీ నేననడం బాపుండదు కాని... ....”

“ఏమో, తగిన కారణం వుంటే ... ఎవరు చెప్ప గలరు ? .... ఒక్కోసారి జరుగుతై ........” అంది ఓల్గా, మళ్లీ.

“అదంతా ఆయా పరిస్థితులమీద ఆధారపడుంటుంది” అన్నాడు ఇవాన్; “ఘోరాన్యాయం చేస్తున్న మనిషి, ఆ అన్యాయం చేస్తూ వుండగా పట్టుబడితే, బహుశ, నేనూ వద లేనేమో. చెప్పలేం. కాని సామాన్యంగా మనిషన్న తర్వాత ఉద్రేకాల్ని అదుపులో పెట్టుకోవడం మంచిది. నేనే, యింటికి వచ్చి; నీతో పరపురుషు డెవరో వున్నట్టు చూస్తే....” అంటూ ఓల్గావంక చూశాడు ఇవాన్, తెల్లబోయి.

“ఊఁ. చూస్తే ఏంజేస్తారు ?”

“అతన్ని చంపను గాని, వెంటనే యింట్లోంచి గెంటే స్తాను. నాలుగు తన్నినా తంతానేమో గూడా. బహుశా తంతానే అనుకుంటా. చెప్పడం కష్టం .... ఊరికే వాదించు కునే వ్యవహారం కాదుగదా; నా జీవితానికే సంబంధించిన సమస్య........”

“ఐతే, జీవితానికి సంబంధించిన సమస్యలన్నీ కొట్లా టలతో పరిష్కారం ఔతాయా ?” అనడిగింది ఓల్గా, నర్మ గర్భంగా.

ఆవిడా ప్రశ్నడిగిన తీరుచూస్తే, ఆగొంతు వింటే చిర్రు మంది ఇవాన్‌కి. “చూడు, ఓల్గా! అసలు విషయం యేమిటో

చెప్పు. ఇంకా యెంతకాలం పరీక్షిస్తూ కూర్చోగలప్పు నా ఓర్పుని? ఎంతకాలం నాకీ హింస? నన్నిలా చిత్రహింస చెయ్యడం దేనికి?....పోనీ, యేదో హుషారులో జరిగిన పొరపాటైతే...."

"అర్థం పోతోంది."

"నన్నిక ప్రేమించడం మానేశావా?" అనడిగాడు ఇవాన్, కొండకొమ్ము మీదనుంచి దూకే మనిషిలా; అంత నిరాశగానూ.

అప్పుడాయన్ని చూస్తే జాలి పుట్టుకొచ్చింది ఓల్గాకి; వున్నదున్నట్టు చెప్పలేక పోయింది. "ఏమో, నాకు తెలియదు" అంది.

"నాతో మనసువిప్పి మాట్లాడేందుకు భయపడుతున్నావ్ నువ్వు. 'ఏమో, నాకు తెలియదు'-అంటే? ఏమన్న మాట?" అన్నాడు, ఒకవేళ నిజం చెప్పేస్తుందేమోనని ఒక మూల భయపడుతూనే. బాధపడ్డాడు. కాస్సేపాగి, "రేపు నువ్వు యింటికెళ్ళిపోవచ్చు. నేనా ఉఛఖాన్ వెళ్లొస్తేనే పోతుందేమో—ఆ యకూత్ ప్రాంతానికి. నేనిక్కడ లేకుండా, దూరంగా వున్నప్పుడైనా, నువ్వి పరిస్థితులన్నీ జాగ్రత్తగా ఆలోచించుకునేందుకు వీలుంటుందేమో; చూడు." అన్నాడు.

## 10

మంచు మొఖానికి తగిలి మంటెత్తుతోంది. బంగారపు గనుల ప్రాంతం అంతటా పొగా, మంచూ దట్టంగా అలముకున్నై. హాస్పిటల్‌నుంచి బయల్దేరి, డెనిస్ యింటి వరాండా

యెక్కింది ఓల్గా. తలుపుతీసి లోపలికెళ్ళి, వెంటనే వేశేసింది తలుపులు, తనతోపాటూ మంచూ, చలీ యెక్కడ లోపలికొస్తాయోనని. నెత్తిమీది రుమాలు తీసి, ఒక్కసారి చుట్టూ చూచింది.

భోజనాల బల్లదగ్గర కూర్చునుంది ఎలీనా, నటాషాని ఒడిలో కూర్చోబెట్టుకుని; చేతిలో 'సోవియెట్ మెడిసిన్' అనే పత్రికుంది; నటాషా నెత్తిమీదినుంచి తొంగిచూస్తూ ఆ పత్రిక చదువుకుంటోంది ఎలీనా.

"ప్రకృతికి ఎదురులేనట్టుంద" అంది ఎలీనా నిట్టూరుస్తూ. ఓల్గావైపుకు తిరిగింది; "కష్టంలేకుండా కాన్పులు జరగాలని అదేపనిగా రాస్తున్నారు; ప్రయత్నాలు చేస్తున్నారు. ఇంత వరకేమీలాభం కన్పించటంలేదు. కొంతకాలం పోతే, కని పెట్టనుగూడా కెనిపెడతారేమో యేమైనా కొత్త పద్ధతులు. కాని ఖుప్పుడు మేం, వైద్యం చేసేవాళ్ళం, వూరికే ప్రకృతి సిద్ధంగా జరిగే కాన్పుని చూస్తూ కూర్చుంటున్నాం. మరీ, యెదురుతిరిగి ప్రకృతి దొంగెత్తులేస్తే, అప్పుడుమట్టుకు కొంత మేలు చెయ్యగలుగుతున్నాం ప్రసవించే తల్లికి. కాని సాధారణంగా వొచ్చే ఆ నొప్పులూ, ఆ బాధా తీశెయ్యడం మావల్ల కావడం లేదు. కాన్పుకుపడే కష్టం సామాన్యమైందేమీ కాదు; చిన్న కడుపునొప్పొస్తేనే అంత తల్లడిల్లి పోతారే జనం! ఏదో మార్గం అన్వేషించాలి."

నటాషా దుస్తులు సర్ది, నేలమీద కూర్చోబెట్టింది ఎలీనా; పత్రిక మూసేసి, "ఎట్లావుంది మీ ఆరోగ్యం?" అనడిగింది ఓల్గాని.

"చాలావరకు బాగుపడినట్టే" అని జవాబు చెప్పింది ఓల్గా, ఎలీనావంక ఆప్యాయంగా చూస్తూ; కొద్దిగా అసూయ గూడా కలిగింది ఓల్గాకి అవిణ్ణి చూస్తూంటే.

మరి. ఆ వసపిట్ట, పావాతో అంతకాలం ఎందుకు వృథా చేసినట్టు? అని అనుకుంది ఓల్గా.

ఎలీనాకి నలభై యేళ్ళనీ, నలుగురు బిడ్డల తల్లని చూచినవాళ్ళెవ్వరూ వూహించనుగూడా లేరు; మళ్ళీ, ప్రొద్దు గూకులూ యేదోవొక పని జేస్తూనే వుంటుంది. 'నలభై యేళ్లొచ్చినై యింకెందుకు? నోట్లో మట్టే' అన్న సామెత యింకెవరికైనా వర్తిస్తుందేమో కాని, యీ ఎలీనాకు మట్టుకు వర్తించదు? అంత హుషారుగా వుంటుంది ఎప్పుడునూ.

కూతురువంక చూచి నవ్వుతూ, చేతులెత్తి జుత్తు సర్దుకుంటోంది ఎలీనా; ప్రక్కనున్న వాళ్ళుగూడా నవ్వవలసిందే ఆవిడతోపాటు. అంత స్వచ్ఛమైనదీ, హృదయ పూర్వకమైన దీనీ ఆనవ్వు; రంగు పూయకుండానే, అంత స్వచ్ఛంగా వుంటా యీావిడ పెదవులు లేత గులాబీల్లా.

'ఎంత ఆరోగ్యం పుంజుకున్నా, ఆవిడకి మల్లేమట్టుకు నవ్వలేను' అనుకుంది ఓల్గా.

'మెడికల్ వర్కర్' పేజీలు తిప్పుతూ, "తీరిక చేసుకుని పత్రికగూడా చదువుతారన్నమాట మీరు" అంది.

"చదవవొద్దూ మరి. మా వైద్యంలో వెనకబడిపోతే యెట్లా? మీ వ్యాసాలూ చదువుతుంటాను మరచిపోకుండా" అన్నది ఎలీనా. అని, వెంటనే గొంతు తగ్గించి, "ఇవాన్ ఇవానోవిచ్ యేమిటీ అట్లా వుంటున్నారు. ఈ మధ్య మరీ

సగమైపోయారు. హుషారుగా వున్నట్టే వుండడంలేదు" అన గింది ఓల్గాని.

సంబాళించుకుని, ఓల్గా సమాధానం చెప్పేలోపుగానే, వార్యా వచ్చింది తలుపు తెరచుకుని; గుమ్మందగ్గర నిలబడి, కోటు కాలరుకీ, జడలకీ పట్టినమంచు దులుపుకుంటూ.

"హెల్లో" అంది ఓల్గాని చూచి, తప్పక మర్యాద కన్నట్టు; వెంటనే ఎలీనా వైపుకి తిరిగి, నవ్వుతూ, కోటు గుండీలు విప్పుకుంటూ, "ఇవ్వాళ మాకెన్ని పుస్తకా లొచ్చా యని!" అంటూ చెప్పింది యెంతో వుత్సాహంగా; "చెప్పినా నమ్మరు మీరు. బళ్ళకి బళ్ళొచ్చి నయ్యాంటే నమ్మండి!"

దుస్తులు మార్చుకున్న తర్వాత, ఒకనిమిషం అటూ యిటూ పచారు జేసి, చివరికి, నటాషా కూర్చున్నచోట చతి కిల బడింది వార్యా; బొమ్మలాటలా అవీ ఆడుతూ నటాషాని ఆడిస్తూ కూర్చుంది. వార్యాని చూస్తే ముచ్చటేసింది ఓల్గాకి: వార్యా వొత్తి అందగత్తె మాత్రమే కాదు; ఏదో అవ్యక్తా కర్షణ గూడా వుంది; అటు పనిలోనూ ఆరితేరింది; ఇటు యిం ట్లోనూ నలుగురితోనూ కలిసి పోతుంది; అందరికీ తలలో నాలుకలా వుంటుంది.

ఇప్పుడు నాదగ్గర గోగోల్, తుర్గెనీవ్, చెఖోవ్ల పుస్తకాలన్నీ వున్నై అని చెప్పింది వార్యా, వాళ్ళిద్దరికీనీ. "వడ్రంగి దుకాణాని కెళ్ళి, పుస్తకాల బీరువా చిన్నదొకటి చెయ్యమని చెప్పేశొచ్చేశాను," అంటూ విరగబడి నవ్వింది వార్యా. "అక్కడున్న యువకు డొకతనేంజేశాడో తెలుసా మీకు? నన్ను పెళ్ళి చేసుకోమని అడిగాడు. బలేగా వుంటా

డులే కుర్రాడు; ఆ సెత్తిజుట్టూ అడీనీ. ఈకలు తీసిన కోడి లాగుంటాడు. వచ్చి, యేమన్నాడో తెలుసా? 'నిన్ను కళ్ళల్లో పెట్టుకు పూజించుకుంటాను! ఇక్కడి పుల్లతీసి, అక్కడ పెట్టవలసిన పనిగూడా లేకుండా జేస్తాను. నాదగ్గరొక విక్ట్రోలా వుంది; 'జాజ్' రికార్డులు బోలెడన్ని వున్నై. నీకు రంగు రంగుల దుస్తులు చక్కటివి కుట్టిస్తాను. ఇకా దుస్తులేసుకుని, రోజల్లా రికార్డులు వింటూ కూర్చోటమే నన్నమాట నీకు పని!' అన్నాడు. ఎప్పుడైనా కలన్నా కన్నారూ మీరట్లా" అంటూ కడుపు చెక్కలయ్యేట్టు నవ్వింది; ఆ నవ్వాపుకోలేక యెగిరెగిరి పడింది. "ఎప్పుడైనా కలన్నా గన్నారా మీరట్లా? నన్ను బొమ్మలాగా అలంకరించి కూర్చో బెట్టతాట్ట. దమ్మిడీ యెత్తు పనిజెయ్యకుండా, యికట్లా రికార్డులు వింటూ కూర్చోవాలట రోజల్లా! ఇంకా బోలెడు 'జాజ్' రికార్డులు నీగగ్గర లేనివి వుంటయ్‌గదా; అవి గూడా పూర్తిగా పోగుచెయ్యి మరి, అప్పటిదాకా ఆగుతాలే నేనని చెప్పాను. లేకపోతే రోజూ ఆ రికార్డులే పెట్టుకుని విని విని విసిగిపోతా కదా! అన్నాను. అదీగాక, నాబుద్ధి మంచిదికాదు నాకు అల్లాటప్పాయి అబ్బాయిలంటే యిష్టం వుండదు; తగిన వరుడు దొరికేదాకా పెళ్ళి చేసుకోను; అప్పటిదాకా ఆగితే నీతల కాస్తా పూర్తిగా బట్టతలై పోతుందే అనిగూడా అన్నాను. ఆ మాటలే అనలేదనుకోండి. ఐనా, పాపం అతని తప్పేముంది; అతని జుట్టలాంటిది; అతనేం జేస్తాడు పాపం. నాకోసం ఆగాలంటే చాలా కాలం పడుతుంది. నువ్విసిగి పోతావని మట్టుకు చెప్పాను ఖచ్చితంగా. ఏం? బావుండలా?" అనడిగింది వార్యా, ఎలీనాని; మళ్ళీ ఓల్గావైపుకు తిరిగింది: 'ఇకాదుస్తులేసుకుని, రోజల్లా రికార్డులు-

వింటూ కూర్చోడమే నన్నుమాట నీపని!' అంటాడు. అమ్మో! రోజిల్లానే! పిచ్చెత్తిపోదూ నాకు? మెడకి పలుపేసి కట్టెయ్యాలతనిక! లేకపోతే తోకపట్టుకుని ఉడత నేళ్ళాడేసినట్టు, నా జడలు రెండూ పట్టుకు నేళ్లాడ దియ్యాలి." లేచి తనగదివైపుకు నడిచి, గుమ్మంలో ఆగి, మళ్ళీ ఓల్గావంక చూశిందొకసారి. "మీకు తెలుసా? ఉడతని తోకదగ్గర పట్టుకు లాగితే, తోకూడి వొచ్చేస్తుంది. నేను నాకళ్ళారా చూశాను గూడాను వొకసారి. మావూళ్ళో వొకసారి పిల్లలందరూ జేరి, మాయింటి గోడమీదొక వుడతుంటే పట్టుకున్నారు. మా యిళ్ళెట్లా వుంటాయో తెలుసుగా మీకు? రష్యన్ యిళ్లకిమల్లే మా యిళ్లకి దూలాలడ్డంగా వెయ్యరు; నిలువుగా పాతుతారు. చుట్టు గుడిసెలాగా వుంటుందన్న మాట. కిందనేల బాగా విశాలంగా వుంటుంది. కప్పుదగ్గిరి కెళ్లినకొద్దీ ఖాళీ తక్కువై పోతుందన్న మాట. ఆఁ ఏం జరిగిందంటే .... వేసవికాలం. గోడమీదుంది ఉడత. పిల్లలెళ్లి, పుల్లతో దాని తోకణిచి పెట్టారు. అది పడ్చింది; నిజంగానే" అనన్నది వార్యా భయపడిపోయినట్టు; "చక్కగా వున్నై దాని కళ్లు నల్లగా బఠాణీ గింజలంత; దాని కన్నీటిబొట్లు గూడా అంతే బఠాణీ గింజలంత వున్నై. నమ్మలేకపోయానుకోండి నేను. ఇప్పటికీ అనిపిస్తుంటుంది నాకు. అంత చిన్న జంతువు; అంత లావాటి కన్నీటి బొట్లు! ఇంకేముంది? తోకమీద చెర్మం వూడొచ్చిందంతే; సన్నపాటి బొమికమాత్రం మిగిలుంది. నాకూ యేడుపొచ్చింది; ఏడ్చేశాను. ఇకా పిల్లలజత. చచ్చినా సరే, పట్టగూడదనుకున్నాను. పిల్లల్ని తలా నాలుగూ అంటించాను."

# 11

"నా ఇవాన్ ఇవానొవిచ్! నేనేమీ మరిచిపోలేదు; అన్నీ గుర్తున్నైనాకు." అనుకుంది వార్యా తనలో తాను, గదిమధ్యలోవున్న స్టూల్ మీద పెద్ద బేసినొకటి పెడుతూ. ఆయనంటే చచ్చేంత ప్రేమ; ఆయనకోసం చనిపోవాలన్నా సరే, సిద్ధమే; హాయిగా సంతోషంగా విడుస్తుంది ప్రాణం. కాని.... ఆయనకోసం బ్రదకడం, ఆయనలా విజ్ఞానమూ, తెలివితేటలూ సంపాదించడం,.... అయనలా అందరి కష్టాల్లోనూ ఆదుకో గలగడం.... యింకా మంచిది!

బేసిన్ నీళ్ళలో చేతులు ముంచి, అరచేతులు బేసిన్ అడుక్కి పోనిచ్చి, ఆన్చి, వేళ్లు కదుపుతు నిలబడింది కాస్సేపు. గదంతా చలిచలిగా వుంది. ఎంత చలిగా వున్నాసరే, చన్నీళ్ళతో యీ వ్యాయామం రోజూ చేస్తూనే వుంటుంది వార్యా. ప్రతి వుదయమూ యీ చన్నీళ్ళతో వొళ్ళు కడుక్కుంటూనే వుంటుంది. నీళ్ళల్లో, ఆవిడ చేతులు అప్పుడే పూసిన పూవుల్లా వున్నై. నీళ్ళలోంచి బయటికి దుమికొక సబ్బు పట్టుకుని మళ్ళీ నీళ్ళల్లో మునిగిన్నై ఆ చేతులు.

ఆ సబ్బుమీద అక్షరాలున్నై. చేతి వ్రేళ్ళు చదివిన్నై ఆ పేరుని: "రోండో". గమ్మత్తైన పేరు: "రోండో". అదేం పేరూ సబ్బులికి? రష్యన్ పేరు కాదది. కాని ఆ సబ్బు రష్యాలో తయారైందే. "రోండో" కలాలున్నై, "రోండో" పెన్నులున్నై. "రోండో" సబ్బులు! బాగానే వుంది! ఏమిటీ పనికిమాలిన ఆలోచనలు!!

చంకలవరకూ చేతులికి రాసుకుంది సబ్బు; తర్వాత చెంపలకేసి రుద్దుకుంది; వాసన చూసింది; చిన్నపిల్లలా పగలబడి

నవ్వుకుంది. ఔను. ఇలా స్నానం చేస్తే చాలా హాయిగా వుంటుంది!

నెత్తిమీద జెడలు, తలగుడ్డలా చుట్టుకుంది. అంచేత ముహం మామూలుకంటె పొడుగ్గా వున్నట్టుంది. ఒక కూజా నీళ్ళు తీసుకుని మెడమీదా, చేతులమీదా గుమ్మరించుకుంది, వంగి. నీళ్ళు చల్లగా వున్నై; చక్కలిగిలి పెడుతున్నట్టుండి, మళ్ళీ నవ్వుకుం దొకసారి హుషారుగా. నీరు నెమ్మదిగా, బిగుతుగావున్న రొమ్ములమీంచి జారి, బేసిన్‌లో పడింది.

'హాయ్, హాయ్' అనుకుంది వార్యా, టర్కిష్ టవెల్‌తో తుడుచుకుంటూ.

వెంటనే దుస్తు లేసుకుని, గది సర్దుకోవడం ప్రారంభించింది. ఆ గదిలోవున్న సామానంతా, తాను కష్టపడి సంపాయించిన డబ్బుతో కొనుక్కున్నవి; అవంటే ఆవిడకి ప్రాణం; అంత జాగ్రత్తగా చూసుకుంటుంది వాట్ని. చైనా సామానంటే మరీ యెక్కడలేని ప్రీతి.

వార్యా, ఒకసారి, ఎలీనాతో చెప్పింది:

"మావూళ్ళో, పాలు తోడెయ్యడానికి పాత్రలుండేవి కాదు; పేడతో గిన్నెల్లా చేసి యెండబెట్టేవారు; తర్వాతందులో మంచు పులిమేవారు. నీళ్ళు జల్లితే ఆ మంచంతా లోపలొక పొరలా వుండేది. ఇకప్పుడు పాలుపోసి తోడుబెట్టేవారు. ఈ మంచుండడం మూలానా పాలకి, ఆ పేడ అంటేది కాదు. పెరుగూ శుభ్రంగానే వుండేది."

గతాన్నెప్పుడూ గుర్తు చేసుకుంటూనే వుంటుంది వార్యా; ఆ గతంతో, యిక్కడున్న ప్రస్తుత పరిస్థితిని పోల్చి చూసుకుంటుంది. వచ్చిన మార్పుని చూచి మురిసిపోతుంది.

అలా మురిసిపోతూ వచ్చింది వార్యా ఇవ్వానొవ్నా హాస్పిటల్ కి. శీతకాలం. హాస్పిటల్లోకి అడుగు పెట్టగానే తెలిసిపోయిందావిడకి, ఇవాన్ ఇవానొవిచ్ హాస్పిటల్లోనే వున్నాడని; ఏమైనా చూసిందా ఏమైనా విన్నదా అంటే అదేమీలేదు. ఐనా తెలిసిపోయిందాయన నక్కడే వున్నాడని. వెళ్ళి, తొంగి చూసింది ఆఫీసులోకి. ఆ ఆఫీసు చూస్తే, ఆయన ఆరాత్రంతా అక్కడే వున్నట్టుంది. ఎందుకని? ఏరోగికేసైనా గడ్డుగా వుందా? గది మధ్యలో నిలబడి జ్ఞాపకం చేసుకుంది. సర్జికల్ శాఖలోవున్న రోగులపేర్లూ, యేం జబ్బైనదీ, ఏం చికిత్స చెయ్యాలని డాక్టర్లు చెప్పిందీ....అంతా కంఠతా వచ్చును ఆవిడకి. అమోఘమైన జ్ఞాపకశక్తి. కావాలంటే, ఇవ్వానొవ్నా రాత్రి వొళ్ళు మరిచి నిద్రపోయినా ఫర్వాలేదు ఇవాన్ ఇవానొవిచ్. ఆయన యింటికెళ్ళలేదు సరిగదా, నిద్రగూడా పోలేదు గత రాత్రంతా. కిటికీలోవున్న ఏష్ట్రేనిండా కాల్చి పారేసిన సిగరెట్ ముక్కలు; సిగరెట్లు మరీ అంత చివరిదాకా కాల్చేదాయ నొక్కరే. అన్ని సిగరెట్లలా తాగాలంటే, రాత్రంతా కాలుస్తూనే వుండుండాలి. కిటికీ అద్దాలమీద చేత్తోగీసిన గీతలింకా కన్పిస్తూనే వున్నై, అంత మంచు పొరలోనూ.

వార్యా జన్మభూమి, యగోనుస్క్,లో కిటికీల కద్దాల తలుపులు యీ మధ్యనే పెడుతున్నారు. అంతకు పూర్వం అన్నిటికీ ఆ మంచునే వుపయోగించేవారు..

నిలువుగా ఒక గీత; దాని మధ్యగా యింకొక గీత. 'క్రాస్' గీసినట్టుంది. అలాంటిదే యింకొక క్రాస్; తర్వాతొక ప్రశ్నార్థకం; మళ్ళీ యింకొక క్రాస్. పరీక్షగా చూసింది కిటికీ తలుపులమీదున్న ఆ గుర్తుల అర్థమేమిటో తెలుసుకుందామని;

ఎవరో గీసిన గీతల రహస్యం తెలుసుకోవాలని ప్రయత్నించడం పొరపాటు కాదాఅన్న ఆలోచనకూడా రాలేదు. తనకెంతో ప్రేమపాత్రుడూ, ఆత్మీయుడూఐన వ్యక్తి రహస్యాల్ని తెలుసుకుంటే తప్పేముంది? ఆవ్యక్తేదైనా బాధపడుతూంటే, యే యమయాతనో పడుతూంటే, అందులో తానూ పాలుపంచుకోవాలని అనుకోవడం సర్వసహజమేగా?

తర్వాత, యింటికెళ్ళింతర్వాత ఎలీనానడిగింది వార్యా: "ఏసుక్రీస్తు శిలువకి మారుగా క్రాస్‌ని వ్రపయోగిస్తారు, సరే; అంతకన్నా యింకేమైనా అర్థంవుందా ఆ క్రాస్‌కి. అంటే, క్రాస్ మతచిహ్నమని నాకూ తెలుసనుకోండి. రష్యన్ల కదిగాక యింకేమైనా అర్థంవుందా అని?"

"ఎలాంటి 'క్రాస్'?" అనడిగింది ఎలీనా.

"అదే ఒకదానికి మధ్యోక నిలువుగీత."

"ఏమో మరి. నువ్వసలు గీసింది క్రాస్ కాదేమో. క్రాస్ ముక్కేమో."

"క్రాస్ ముక్కా? అంటే?"

"అదే, యేదైనా బల్లనో, క్రిస్మస్ చెట్టునో నిలబెట్టడానికి చేస్తామే కొయ్యముక్కల్తో, అదీ."

"క్రిస్మస్ చెట్టా? కాదు, కాదు; దానర్థం అదా!"

## 12

"ఎల్లుండి బయల్దేరుతున్నాను, వార్యా! నేను" అన్నాడు ఇవాన్ ఇవానొవిచ్.

వార్యా కళ్ళు చీకట్లు కమ్మినట్లైనై; చేతిలోవున్న ట్రే జారి క్రింద పడినంత పనైంది.

"ఎక్కడికి వెళ్తున్నారు?"

"తైగా ప్రాంతానికి; అక్కడివాళ్ళకి సాయం చెయ్యడానికి."

"మరి మా కోర్సు?"

"ప్రస్తుతం గూసేవ్ చూస్తుంటాడు, కొంతకాలం."

"ప్రస్తుతానికే నన్నమాట?" సంతోషంతో ఎగిరి గంతేసింది వార్యా. ట్రేలోవున్న కత్తెరలూ, ఫోర్సెప్స్, స్కాల్పెల్స్ గలగలమన్నై; ఏదో వొక పనిముట్టు క్రిందబడింది గూడాను.

అప్పటి కాపరేషన్ పూర్తైపోయింది; రోగిని వార్డులోకి తీసికెళ్ళి పోయారు. ఆపరేషన్ గదంతా సర్దుతోంది వార్యా. ఐనా, చేతిలోవున్న సామానంటే జాగ్రత్తగా వుండవలసిందే ఎప్పుడూనూ. ఆపరేషన్ చేసేప్పుడే గనక యిలా పనిముట్టు క్రిందబడితే, యెంత కోపంగా చూశేవాడో ఇవాన్ ఇవానొవిచ్! వార్యా కంగారు పడిపోయింది; సామానున్న ట్రే వొక చోట పెట్టి, క్రిందపడింది తీసేందుకు వంగింది. ఇవాన్ ఇవానొవిచ్ తరచూ వుపయోగించే స్కాల్పెల్ అది.

'అమ్మో' అనుకుంటూ, ఇవాన్‌వంక చూచింది వార్యా తలెత్తి.

కాని, ఇవాన్ ఆవిడ చేసిన పొరపాటును కానీ, ఆవిడ పడే తత్తరపాటును గాని గమనించినట్లే లేడు; చాలా విషాదంగా ఆలోచిస్తున్నట్టున్నాడు. అతిముఖ్యమైన పనిమీదే వెళ్ళిపోతున్నాడిప్పుడు; కాని దాని వెనక యింకో కారణంగూడా

వుంది: ఇప్పుడాయన యింట్లోనే ఆయనకు స్థానం లేకుండా పోయింది; ఆయన వుండాలని కోరుకునే వారెవ్వరూ లేరు ఆయింట్లో. బాధపడుతున్నాడు, వేదన పడుతున్నాడు. ఆయనకు సాయం చెయ్యగల స్థితిలో లేదు తాను. పిల్లలు తోక పట్టుకున్న ఉడుతలాగుందావిడ పరిస్థితి. బఠాణీ గింజలంత కన్నీటి బొట్లు కుదురు గట్టుకున్నై ఆవిడ కన్నుల్లో. ఇంకేదో వెదుకుతున్నట్టు, తల వంచుకుని కూర్చుంది అలాగే. కాస్సే పున్న తర్వాత, స్కాల్పెల్ పట్టుకుని నిలబడి,

"తిరిగొస్తారా?" అనడిగింది పిరికి పిరికిగా.

"వస్తాను" అన్నాడు ఇవాన్, మనసిక్కడ లేనట్టు.

"మీతో యింకెవ్వరు వస్తున్నారు? ఒక్కరూ వెళ్ళలేరు మీరు."

"నికీతాని తీసికెళ్తున్నాను."

"నన్ను తీసికెళ్ళండి" అంది వార్యా వున్నట్టుండి; "నాకంటే నికీతా యెందులో మెరుగు? నేను మీరుచేసే ఆప రేషన్లకి అండగా వుంటాను; మీకు వొండి పెడుతాను; వంటంతా నేర్చింది నాకు ఎలీనా. తీసికెళ్ళండీ నన్ను!" అంటూ బ్రతిమా లింది, ఇవాన్ కళ్ళలోకి సూటిగా చూస్తూ.

"వొద్దు, వార్యా! నికీతాకి చెప్పేశానుగూడాను తీసి కెళ్తున్నానని. అక్కడి దారులన్నీ తెలుసతనికి; ఆ ప్రాంతం వాడతను. అదీగాక కయ్యూర్*గా పనికొస్తాడు. మంచి వాడు; సమర్థుడు. అక్కణ్ణుంచి తిరిగొచ్చేప్పటికి ఫస్ట్ క్లాస్ ఫెల్డ్ షెర్ గా తయారై వస్తాడు, చూస్తూండు."

* దుప్పులబండిగాని, కుక్కలబండిగాని తోలేమనిషి.

"నేనూ కయ్యూర్ గా పనిచెయ్యగలను" అంది వార్యా, మొండిగా; "జంతువు లెలాంటివైనా సరే, దారెంత గతుకులుగావున్నా సరే, తోలగలను నేను. ఆకురాలు కాలంలో గూడా తోలగలను బళ్లు. అప్పుడవి చెప్పినమాట సరిగ్గా వినవు. వేసవికాలం అంతా మైదానాలన్నీ తిరిగితిరిగి, మేసిమేసి, బలువెక్కి వుంటాయవి. ఐనా, అప్పుడుగూడా తోలగలన్నేను. ఇకా ప్రాంతం నాకు తెలియదంటూరు. ఎప్పుడూ యెవళ్లో వొకళ్ళక్కడి వాళ్ళుంటూనే వుంటారు మనతోపాటు. మీరూ, నికీతా వంటరిగా వెళ్లడానికెవళ్లూ వొప్పుకోరు. బోలెడంత పనుంటుంది.... డేరా లేసుకోవాలి, వంటచెరకేరుకోవాలి, ........"

"అంచెలంచెలుగా వెళ్తున్నాం మేం".

"ఆఁ. ఐతే నన్నుగూడా తీసికెళ్లండి తప్పకుండా! మీకు మరీ వొంటరిగా వుంటే, ఖోమస్*మీద పాటలుపాడి వినిపిస్తాను."

"ఓహ్హో, వార్యా! మరీ పసిపిల్లలలా మాట్లాడతావేఁ నువ్వుఁ?" అన్నాడు ఇవాన్, చిరునవ్వు నవ్వుతూ. ఆవేళాయన ముహంమీద చిరునవ్వు కన్పించడానికదే ప్రథమం. "లోకు లేమనుకుంటారో మనల్నిగురించని ఆలోచించవే. ఆలోచించవేఁ?"

"అనుకోనీండి!" అంది వార్యా, లెక్కలేనట్టు.

"ఎలా సాధ్యం? నేను....అంటే నాకు.... నేను వివాహితుణ్ణి, వార్యా!" అన్నాడు చిరునవ్వు తెచ్చుకుని, చెప్పలేక చెప్పలేక.

---

* యకూత్ సంగీత వాద్యం.

"హుఁ" అంది వార్యా, బల్లమీద స్కాల్పెల్‌తో, యాంత్రికంగా, గీతలుగీస్తూ...క్రాస్...మరో క్రాస్...

కనులు వాల్చి, మళ్ళీ, అలాగే, ఇంకో క్రాస్ గీసింది.... ఆయన చెప్పిన అభ్యంతరానికి తకీమని జవాబు చెప్పగలదు తాను; స్పష్టంగా చెప్పగలదు వున్నదున్నట్టు; ఆయనకు నచ్చేట్టుగా గూడా చెప్పగలదు....కాకపోతే పెడసరంగా వుంటుంది ఆ జవాబు; ఆయన బాధపడతారు. అయినా బాధపెట్టలేదు తను. అందుకని నోరు మూసుకు వూరుకుంది.

"ఉఁ. అదీ సంగతి, వార్యా!" అన్నాడు ఇవాన్, ఒక నిమిషం ఆగి. "అదీగాక ఆ స్కాల్పెల్ నలా పాడుచెయ్యడం యెందుకు? ఆబల్లనీ చెడగొట్టాల్సిన అవసరంలేదు. ఇంకా, ఆ రెండూ పనికొస్తై. మనకు వాటి అవసరమూ వుంది."

# 13

లినెన్ జేబురుమాలుతో చేతులు తుడుచుకుని, రుమాలు జేబులో పెట్టుకున్నాడు ఇగోర్. కొత్తగావచ్చిన యంత్రాన్ని నడిపి చూస్తున్నాడు. మిల్లులో కొత్త యంత్రాల్ని అమరుస్తున్నారు. ఈ యంత్రాన్నమర్చడం పూర్తయ్యింది; ఇప్పుడు నడిపి చూస్తున్నారు. బాగానే వున్నదన్నట్టు సంతృప్తిగా తలూపుకున్నాడు ఇగోర్; ఈలపాట వేసుకోడం మొదలెట్టాడు; చెవింకా అలాగే దోరగా పెట్టి, యంత్రంచేసే శబ్దం వింటూ.

ఇన్స్పెక్షన్ చేస్తూ, తావ్రోవ్ గూడా వచ్చాడక్కడికి. "బాగానేవుంది! బాగానే పనిచేస్తోంది" అన్నాడు; "ఇక

మిల్లు వుత్పత్తిగూడా పెరుగుతుంది. ఇకప్పుడు మనం యెవరికీ వెనకబడం."

"ఎలాగైతేఁ, సాధించాం" అన్నాడు ఇగోర్. అతని కన్నుల్లో, చూపుల్లో పట్టుదల కన్పించింది; స్త్రీ లెదురు పడి నప్పుడా కన్నులే కరిగిపోతున్నట్లుండేవి !

తావ్‌రోవ్‌గూడా బాగా వుత్సాహంగా వున్నాడు, "సాధించేందుగ్గూడా మనం యేమంత కష్టపడవలసిన అవసరం లేకపోయింది; మిల్లుని పునర్నిర్మించాలనే మన పథకాన్నందరూ అంగీకరించి బలపరచారు కాబట్టి" అన్నాడు.

"ఏఁ, ఎందుకంగీకరించరు ? బలపరచ కేంజేస్తారు. లాభమూ, ప్రయోజనమూ వుంది; వున్నట్టు కనిపిస్తోంది. ఉత్పత్తి శాతం హెచ్చుతుంది. అలా హెచ్చడం అంటే అందరికీ యిష్టమే !"

"నీక్కూడానా ?"

"ఊఁ, నాక్కూడాను. మన మిల్లులోవున్న మెషీన్ల కన్నిటికీ బాధ్యత నాది. ఆ బాధ్యతంటే యేమిటనుకుంటున్నారు మీరు ! ఏమీ పొరపాటు జరక్కుండా వుండాలంటే, ఒక్క నిమిషంగూడా యేమరివుండేందుకు వీల్లేదు నేను. ....ఇదిగాక, యింకా నేను కనిపెట్టే కొత్తకొత్త విధానాల్ని గురించీ సాధనాల్ని గురించీ ఆలోచించుకోవాలి...."

"కవిత్వం వ్రాయాలిగూడానాయె" అన్నాడు తావ్‌రోవ్, కాస్త యెత్తిపొడుస్తూన్నట్టుగానే.

"కాదనడం లేదునేను."

"అదీగాక, పావాతో ప్రతి సాయంకాలమూ పిచ్చా పాటీగూడా మాట్లాడుతూ వుండాలికూడా నాయె."

"ఇక చాల్లే, వూరుకోండి!" అన్నాడు ఇగోర్ విసుక్కుంటూ; "ఇహో మాత్రంగూడా లేకపోతే, యెప్పుడూ ముహం ముడుచుక్కూర్చోవా అన్నమాట! నాకుమాత్రం విశ్రాంతుండొద్దూ; కాస్సేపు నవ్వుకోవాలని నాకుమాత్రం వుండదూ? ఆఁ. అన్నట్టు మీకు తెలుసా? సర్జెన్ ఇవాన్ టైగా ప్రాంతాని కెళ్తున్నట్టు."

"ఆఁ....విన్నాను."

"ఎందుకనట?"

"ఏముందీ, అసలిదివరకెప్పుడో వెళ్లవలసింది. తర్వాత చూద్దాం అన్నట్టాలస్యం చేశాడాయనే."

ఇగోర్ పరిశీలనగా చూశాడు తన పై అధికారివంక; తావ్‌రోవ్ గొంతులో యేదో సంతృప్తి వున్నట్టే ధ్వనించింది, సందేహంలేదు. ఇద్దరూ కలిసి షాప్‌లోంచి బయటి కెళ్లిం తర్వాత, ఇంకొకసారి దొంగచూపులు చూశాడు ఇగోర్ తావ్‌రోవ్ వంక: తావ్‌రోవ్ ఏదో దీర్ఘాలోచనలో పడ్డాడు. జీవితంలో, మొట్టమొదటిసారిగా, యేదో తీవ్రమైన సందిగ్ధ స్థితిలో వున్నాడని కన్పిస్తూనేవుంది. తావ్‌రోవ్ చూపుల్లో తీక్షత వుంది; ముహం గంభీరంగా వుంది; ఉన్నతాధికారి కుండవలసిన హుందా లక్షణాలన్నీ మరీ ప్రస్ఫుటంగా కన్పిస్తున్నై ఇప్పుడు.

నలుగురినీ ఆకర్షించే వ్యక్తిత్వమూ, హుందాతనమూ- తనకూ వుంటే బాగుండునని కలలు గంటూంటాడు ఇగోర్

యెప్పుడూ. కాని అతనిలో ఆవ్యక్తిత్వమూ లేదు; ఆ హుందా తనమూ లేదు; లేదని అతనికి తెలుసు; అందుకని బాధగూడా పడుతుంటాడు. కన్నులు మంచివే, అందంగా వుంటాయి; ఆకర్షణీయంగా వుంటాయి; సందేహం లేదు. కానేం లాభం ? వాటిని చూచి, పావా పరిహాసం జేస్తుంది; వార్యా అసల వక్కడున్నట్టు గుర్తించనే గుర్తించదు; ఓల్గా పట్టించుకోదు. ఎప్పుడైనా ఓల్గా అతనితో మాట్లాడితే పనినిగురించి మాట్లాడు తుందంతే.

గత వసంతంలో, కొండల్లోకి పిక్నిక్కెళ్ళినప్పుడు ఓల్గా యెంత హుషారుగా వుందో గుర్తుకు తెచ్చుకున్నాడు ఇగోర్. అప్పుడావిడమూలాన కలిగిన బాధవల్ల, తావ్‌రోవ్ అంటే వైముఖ్యం యేర్పడింది ఇగోర్‌కి.

ఇద్దరూ కలిసి, యంత్రాలు చూసుకుంటూ బయల్దేరారు మిల్లులో. కొత్తగావచ్చిన క్రషర్ యంత్రం దిట్టంగా వుంది; ఉక్కు దవడల్తో రాళ్ళన్నీ పిప్పిపిప్పి జేస్తోంది. బెల్టులూ, మోటర్లూ బుఁయ్ మంటున్నై. గిరగిరా తిరిగే చక్రాలు చక్రాల్లాగానే లేవు; నిలబడిపోయిన తెల్లని రేకుల్లావున్నై. మిల్లు టాప్‌స్పీడ్‌లో పనిచేస్తోంది.

ఇదంతా చూస్తూ ముందుకు నడిచాడు ఇగోర్. ఈ యంత్రాలుగాక, కొత్తగావచ్చే యింకొన్ని యంత్రాలున్నై. అవిగాక పవర్ హౌస్ (విద్యుత్కేంద్రం) లో యంత్రాలు, బయట బరువులెత్తే క్రేన్లు. ఆవిరితో పనిజేసేవి, నీటితో పని జేసేవి, నూనెతో పనిజేసేవి.... ఆయా యంత్రాల్ని నడిపే వ్యక్తుల చెప్పుచేతుల్లో వుండే యంత్రాలు. తాను వాటిచే కవిత్వంకంటేగూడా బాగుంటాయి, యీ యంత్రాల నడవడిని

గురించీ, కార్యక్రమాన్ని గురించీ పై అధికారులకు పంపే నివేదికలు.

"బాగా వ్రాయలేని కవికంటే, అన్నీ తెలిసిన మెఖానిక్కే మెరుగు," అనుకున్నాడు ఇగోర్ లోపల్లోపల. ఆ ఆలోచనలతో, నెత్తిమీదున్న పెద్ద బరువేదో దింపుకున్నట్లైంది; అతని మనసంతా తేలిక తేలికగావుంది.

# 14

ప్లాటన్ లొగునోవ్ గూడా, ఇగోర్ లాగానే తల్లికి గారాబు బిడ్డ. కాని, లొగునోవ్ తల్లి కతను గాక యింకా పదకొండుగురు ఆడపిల్లలున్నారు. అతని తండ్రి ఉరల్ కర్మాగారంలో ఫోర్మన్‌గా పనిజేశాడు; భార్యంటే అపరిమితమైన ప్రేమ అతనికి. ఇప్పటికీ యింకా అందంగానే వుంటుంది లొగునోవ్ తల్లి, యింత వయసొచ్చినా. ఎలీనాకీ ఆవిడకీ చాలా పోలికలున్నై ఆవిషయంలో: రూపురేఖల్లోనూ, గుణగణాల్లోనూగూడా. అతని అక్కచెల్లెళ్ళవన్నీ మంచి మంచి రష్యన్ పేర్లు: మాన్యా, కాత్యా, సోన్యా, ల్యూబా, లేనా, ఓల్గా, తాతియానా, నటాషా, స్వెత్లానా, దున్యా. కడసారి కూతురు పేరు 'మే'. కార్మికుల సెలవు దినానికి గుర్తుగా పెట్టుకున్నారా పేరు.

ఆ అక్క చెల్లెళ్ళంటే లొగునోవ్ కంతులేని ప్రేమ. ఆనందంతో వాళ్ళందరూ కేరింతలు కొడుతూంటే ఎంతో సంతోషం అతనికి! అక్క చెల్లెళ్ళ సంగతి గుర్తుకొచ్చి నవ్వుకున్నాడు. ఎంత మార్పెంత మార్పు. బీద కుటుంబాల్ని

గురించీ, కట్నం యివ్వలేని యీడొచ్చిన ఆడపిల్లల్ని గురించీ ఎకసక్కాలాడే కథలెన్నో చెబుతుండే వారిదివరకు. ఇప్పుడా కథలంటేనే ఏవగింపు, రోత. తన అక్క చెల్లెళ్ళ దగ్గర కట్నాలూ లేవు; ఇవ్వవలసిన అవసరమూ లేదు. ప్రాథమిక పాఠశాలల్లోనూ, హైస్కూళ్ళలోనూ చదువుకుంటారు; కావా లంటే తర్వాత కాలేజీలకీగూడా వెళ్తారు. తన కుటుంబంలో అంతా చక్కగా కలిసి మెలిసి వుంటారు స్నేహితుల్లాగా: అందరూ ఒకరికొకరు సలహాలిచ్చుకుంటారు; సాయం జేసు కొంటారు. ఎవరికాళ్ళమీద వాళ్ళు నిలబడ గలిగేవరకూ, అందరూ అండగా నిలబడతారు. వయసు ముదిరిపోతుందేమో నన్న భయంలేదు; అయ్యో, పద్దెనిమిదేళ్లొచ్చినయ్యే యిక పెళ్ళి కాదేమోనన్న దిగులులేదు. పద్దెనిమిదేళ్ళ వయసులో హాయిగా ఎవరి చదువుల్లో వారు నిమగ్నమై వుంటారు యే చీకూచింతా లేకుండా. సెలవుల్లో యింటికొచ్చినప్పుడా గూడంతా ప్రతిధ్వనించిపోతుంది, రెక్కలొచ్చిన పక్షిపిల్ల లెగిరి పోతూ చేసే సంబరాల ధ్వనితో.

పెద్ద కుటుంబం. వాళ్ళందరినీ పెంచి పెద్దవాళ్ళని జెయ్యాలంటే కష్టమే. గుడ్డలు కుట్టించాలన్నా కష్టమే అంత మందికి. అక్కడికీ పిల్లలకోసమని, పాతగుడ్డలే వేసుకునేది తల్లి. ఐనా స్కూలు కెళ్లే పిల్లలు; దుస్తులు బాపుండాలి. అంచేత కష్టంగానే వుండేది. అప్పుడప్పుడూ జబ్బులు; మధ్యమధ్య కీచు లాటలు; తల్లి అవన్నీ లెక్క జెయ్యకుండా పెంచింది అందర్నీ. వాళ్ళందరూ పెద్దవాళ్లై, జీవితంలో ఎవరిబాధ్యతల్ని వాళ్ళు నిర్వహించుకుంటూంటే చూచి ఆనందించడమే ఆమె జీవి తానికి పరమావధి. అదే ఆమె జీవితానికి లక్ష్యం.అందులో యిద్దరి

ప్పుడు డాక్టర్లు.ఒకరు గ్రామీణ ఆర్థికశాస్త్రవేత్త.మరొకరుటీచరు.
తనూ,యింకా నలుగురూ కాలేజీ చదువు పూర్తి జేశారు.ముగ్గు
రింకా స్కూలు కెళ్తున్నారు. అందులో ఒకామె ఫ్యాక్టరీలో
టర్నర్ గా చేరాలని నిర్ణయించుకుంది. చిన్నవాళ్లు ముగ్గురూ
యింటిదగ్గరే వుంటున్నారు. అంత పెద్దకుటుంబమూ కందెన
వేసిన బండిలా, సాఫీగా సాగిపోతోంది. ఆడపిల్లలకి పెళ్ళి
ళ్లెట్లా ఔతాయూఅన్న బెదురు లేనేలేదు తల్లికి; కాకపోతే....
దేశమూ విశాలమైన దేశం; కావలసిన పనా, చాలావుంది;
అందుచేత యీ పిల్లలు దేశ సేవ కోసమని యే మారుమూలల
కెళ్తారో, తన కంటికి దూరమౌతారేమోనన్న దిగులొక్కటే
ఆవిడకి.

లొగునోవ్, మొట్టమొదట, ఉరల్స్ లో పనిజేశాడు.
అక్కణ్నుంచి దూరప్రాచ్యాని కెళ్లాడు, స్వచ్ఛందంగా. అక్కడ
చాలాకాలం వున్నాడు. ఐనా, తల్లి కెప్పుడూ వుత్తరాలు
వ్రాస్తుండేవాడు; డబ్బు పంపుతుండేవాడు. ఆవిడ కష్టపడి
వ్రాసిన జవాబులన్నీ జాగ్రత్తగా పదిలం చేసుకున్నాడు.

తన అంతరాంతరాల్లోవున్న రహస్యాలుగూడా తల్లికి
చెప్పేశే అలవాటుందతనికి. అంచేత, యిక్కడి కొచ్చింతర్వాత
వార్యాని గురించిగూడా వుత్తరం వ్రాశాడు తల్లికి. అంటా
తన అక్కచెల్లెళ్ళ లాగానే వుంటుంది; ఐనా మళ్ళీ ఎంతో తేడా.
తన అక్కచెల్లెళ్ళు కార్మిక వర్గంలోంచి పైకొచ్చి చదువుకున్న
వాళ్ళు; వార్యా అలా కాదు, వెనుకబడిన జాతుల్లోంచి ఒక
సారి పైకొచ్చింది అవ్వాయి సువ్వలా. ఐనా యీకొత్తనేలలో
పెళ్లూనుకుంది బాగా.

ఎక్కడో వెనుకబడిన ప్రాంతంలోవున్న అడవి తెగలపిల్ల, పయూరోపియనోన్ని ప్రేమించడం, ఆ ప్రేమతో అలాగే కృంగి కృశించి అంతంగావడం.... అవన్నీ పూర్వగాథలు; సోవియట్ దేశంలో యిప్పుడా తరతమ భేదాలులేవు.

ఈమధ్య గనుల దగ్గర పని బాగా వత్తిడిగావుంది; అందు కని డెనిస్ యింటికెళ్ళేపాటి తీరుబడిగూడా లేకపోయింది లోగు నోవ్‌కి. కొత్తపదవిని స్వీకరించిం తర్వాతగూడా, ఆ గను లంటేనూ, అక్కడ జరుగుతూన్న పనంటేనూ అతని ఆసక్తి పూర్వంలాగానే వుంది. మాత్రెమియనోవ్ గూడా ఎప్పుడూ లోగునోవ్ వెంటనే వుంటున్నాడు. బంగారంపడే కొత్తచోటు లో పని. నేల గట్టిగావుంది. పని మందకొడిగా సాగుతోంది. అపనెప్పుడు పూర్తౌతుందాఅని మాత్రెమియనోవ్‌కి నిద్రగూడా పట్టడంలేదు సరిగా. చిన్నకూతురు నెత్తుకుని వచ్చింది మరియా యింటికి. ఇకిప్పుడు యెవరు 'తా తా!' అని పిలిచినా మాత్రె మియనోవ్ నవ్వడంలేదు యిదివరకటిలాగా. మనమరాలెలాగూ వచ్చిందిగదా అని సంతోషం!

గనుల దగ్గరకని బయల్దేరాడు లోగునోవ్. ఉదయంవేళ. బాగా చలిచలిగావుంది. మంచుగూడా బాగా దట్టంగాపట్టింది. బంగారపు గనులున్న లోయలో మురికి పత్తిలాగా అంటుకు నుంది మంచు. పర్వతశిఖరాలసలు కన్పించనే కన్పించడంలేదు. ఇళ్ళకప్పులూ, అక్కడక్కడా చెట్లతలలూమట్టుకు కన్పిస్తున్నై; అదికూడా మసక మసకగానే.

లోగునోవ్ కెంత చలివున్నా లెక్కలేదు; లక్ష్యపెట్టడు. అందుకనే బయల్దేరాడు అంత చలిలోనూ, రోడ్డునబడి. రోడ్డు కటూయిటూ కొండలమీదినుంచి జారి వచ్చినమంచు. ఉన్న

ట్టుండి గనుల్లో కెళ్ళేదారి అవులిస్తున్నట్టు కన్పించింది నల్లగా. దగ్గర్లోనే చలిమంట వేసుకుంటున్నారు కార్మికులు. ఆచలిమంట పొగా, గనిలోపల్నుంచి వచ్చేఆవిరీ కలిసి, ఆదారిదగ్గర తీగల్లాం అలుముకున్నై; చలిమంటలదగ్గరా కార్మికులతోపాటు ఇవాన్ ఇవానొవిచ్ గూడా వున్నాడు. మామూలు కంటే గూడా ఆజానుబాహులా కన్పించాడు లొగునోవ్‌కి: కాళ్ళలా యెడంగాబెట్టి, రొమ్ము విరిచి నిలబడడం, బాగా దళసరిగా వున్న చర్మంకోటూ, ఉన్నిబూట్లూ, చెవులగంతలున్న వున్ని టోపీ, భుజానికి వేళ్లాడేసుకున్న ఆతుపాకీ....సర్జెన్ ఇవాన్‌ని చూచి, చకచకా వేశాడు అడుగులు లొగునోవ్.

హెల్లో అనడంగూడా మరచిపోయాడు. "మీరిక్కడేం జేస్తున్నారు?" అన్నాడు దగ్గరకెళ్లీ వెళ్ళగానే.

"యేమిటీ, యిక్కడేం జేస్తున్నానా?" అనన్నాడు ఇవాన్, అప్పుడే కలలోంచి మేల్కొన్నట్టు; "ఆఁ ఆఁ. నిజవేఁ. డాక్టర్లని చూస్తేచాలు, యేమైనా ప్రమాదం జరిగిందేమోనని భయంవేస్తుంది; నిజమే. నేనూరికే యిటువెళ్తూవెళ్తూ ఆగాను; పొగచూచి.

"వేటకని బయల్దేరారా?" అనడిగాడు లొగునోవ్, 'అంతేగద' అనుకుంటూ; "ఈమంచులో యేం వేటాడ్తారు?"

"ఆఁ. వేటకనే.... కాస్సేపు నడుద్దామని." అన్నాడు ఇవాన్. ధైర్యంగా ఒక చిన్ననవ్వు నవ్వేద్దామనుకున్నాడు గాని నవ్వలేక పోయాడు. "ఇంతవరకెప్పుడూ గనులు చూడ లేదు" అన్నాడు, అందరూ తన్నక్కడ ఆపాడుమంచులో వదలి వెళ్ళిపోతారేమోనని భయపడుతున్నట్టు. "ఐనా, యింత

కాలం యిక్కడుండి గనుల్లో పనెలా జరుగుతుందో తెలుసుకోకుండా వెళ్ళిపోవడంగూడా సిగ్గుచేటే! కాదూ?"

"రండి అంతాచూపిస్తాను. తరచు వస్తూనే వుంటాను యిక్కడికి. పాత అలవాటుకదూ; ఒక పట్టానపోదు. అందులో యిప్పుడు చేతినిండా పనిగూడా వుంది."

ఇద్దరూ ఒవరాల్స్ * వేసుకుని, పంజరంలోకెక్కి గనుల్లోపలికి దిగారు. అక్కడ కార్బైడ్ లాంతర్లు తీసుకుని కార్మికులు పనిచేసేచోటు కెళ్లారు. ఇదివరకు ఓల్గా వెళ్ళిన దారి గూడా యిదే. గనుల్లో ముఖ్యమైన ప్రదేశాలన్నీ తిప్పిచూపించాడు లొగునోవ్, డాక్టర్ కి. కార్మికుల్నందరినీ పరిచయం జేశాడు. ఆ కార్మికులందరి పేర్లూ తెలుసు లొగునోవ్ కి. డాక్టర్ వాళ్లందరివంకా అతి శ్రద్ధగా చూశాడు; అందులో అతనెరిగిన ముఖాలుగూడా వున్నైకొన్ని. లొగునోవ్ చెప్పిందంతా శ్రద్ధగా విన్నాడు; కాని అక్షరం అర్థమైతే ఒట్టు.

# 15

ఆ భూగర్భంలో, లొగునోవ్ వెనకేబడి, గనులన్నీ తిరిగాడు ఇవాన్. కాని అతని మనసక్కడలేదు. అక్కడక్కడా ఎదురయ్యే కార్మికుల సౌహార్ద భావమూ, మీదనుంచి పడుతున్న నీటిచినుకుల్ని తప్పించుకొనేందు కప్పుడప్పుడూ కాలర్ పైకి లేపడమూలాంటి విషయాలుమాత్రం లీలగా కన్పిస్తున్నై అతనికి. తన జీవితమంతా, యిలాగే, లక్ష్యంలేని నడక అని అనిపించింది ఇవాన్ కి. ఏ హుషారూలేని బాల్యం. చదువు. పని.

* గనుల్లో పనిచేసేవారికి ప్రత్యేకించిన దుస్తులు

తర్వాత పనీ, చదువూ, రెండూనూ. కాలం గడిచినకొద్దీ కష్టంగానే వుంది; ఐనా చేసేపనిలో ఆసక్తీ, చేయవలసినపనిలో కుతూహలమూ వుంటంవల్ల సమయం తొందరగానే గడచి పోతూంది. ఇప్పుడంటే ఆ కుతూహలమూ పోయింది, ఆ ఆసక్తీ పోయింది; జీవితాని కర్థమంటూ లేకుండా పోయింది; విసుగుపుడుతోంది; బ్రతుకే భారంగావుంది. తను డాక్టరై ఏమిటీ ప్రయోజనం? తనజబ్బు తానే నయంచేసుకోలేనివాడు డాక్టరై తేనేం, కాకపోతేనేం? ఆకలి లేకుండా పోయింది, ఆహారం గొంతుదగ్గర పట్టుకున్నట్టుంటోంది, గొంతు దిగడం లేదు. నిద్రరాదు. విశ్రాంతిలేదు. ఒక విషయాన్ని గురించి ఐదు నిమిషాలు స్థిమితంగా ఆలోచించగల శక్తిగూడా లేకుండా పోయింది. మనసంతా అశాంతి; నిలుచున్నచోట నిలవబుద్ధి కాదు; ఒకక్షణంగూడా విశ్రాంతిలేదు. ఈబాధనుంచి విముక్తి పొందాలి; ఈ వేదననుంచి బయటబడాలి. తన మనసులోమాట చెప్పి, బరువుదింపుకుందామంటే, యీవ్యక్తిగత విషయాలు యింకే వ్యక్తితో చెప్పుకోవాలో అర్థంగావడంలేదు. ఇంతకు పూర్వం ఐతే లొగునోవ్‌తో చెప్పేవాడే; కాని వార్యాతో మాట్లాడిం తర్వాత, వార్యా అభిప్రాయం తెలిసిం తర్వాత, యీ లొగునోవ్‌తో మాట్లాడాలన్నా మొహమోటమి అడ్డం వస్తోంది; తనేదో నేరం చేసినట్టనిపిస్తోంది; లొగునోవ్ ఎంతో ఆప్యాయంగా దాచుకున్న గుప్తధనాన్ని దొంగిలించినట్టని పిస్తోంది.

'ఇంకో అర్థంలేని సందిగ్ధపరిస్థితి!' అనుకున్నాడు ఇవాన్ గోడవంక చూస్తూ.

"తెలిసించాండీ; అందువల్లొచ్చిందన్న మాట యీ గను లకి ప్రిథమబహుమానం" అన్నాడు లొగునోవ్.

"ఓహో, అలాగా, తెలిసింది" అన్నాడు ఇవాన్. న్యాయానికాయన కదనంగా తెలిసిందేమీ లేదు. "అనవసరంగా యిక్కడ కాలం వృథా చేస్తున్నాను. ఉదయం నుంచింతవర కేమీ పనే చెయ్యలేదు."

వ్యక్తిగత విషయాల్ని గురించి ఇవాన్‌తో మాట్లాడాలనే అనుకుంటున్నాడు లొగునోవ్ కొద్ది రోజుల్నుంచీ. కాని యిది వర కొకసారి ఆ సంభాషణొచ్చినప్పుడు, ఇవాన్ మాటలు మార్చేశాడు, ఆవిషయం మాట్లాడడం యిష్టంలేనట్టు. అంచేత మళ్ళీ రెండోసారి ప్రయత్నించడం అనవసరం అనుకున్నాడు లొగునోవ్.

"ఏం, యెందుకని? పనెందుకు జరగలేదు?" అనడిగాడు లొగునోవ్, జాగ్రత్తగానే.

"నేను ఉఛఖాన్ వెళ్తున్నాను. మీకు తెలుసుగా, తెలియదూ? ఇవ్వాళ నా చివరి ఆపరేషన్ చేస్తాను, రేపు లేదు, ఎల్లుండి బయల్దేర్తాను. నెలా రెండు నెల్లపాటు."

"అంతా సిద్ధంగా వుందా?"

తలూపాడు ఇవాన్. ఆవాళ, బల్లమీద కూర్చుని ఓల్గా, తనూ పోట్లాడుకున్న సంగతి జ్ఞప్తికొచ్చింది. అప్పుడే తైగా పాంతానికి ప్రియాణాన్ని గురించీ, అక్కడి ప్రజలు తీసు కొచ్చిన బహుమానాల్ని గురించీ చెప్పాడు లొగునోవ్.

సొరంగం చాలా చిన్నది; పాకి వెళ్ళవలసి వచ్చింది. చేతిలోవున్న లాంతర్ల వెలుతురు కాస్సేపు పోటీ పెట్టిన కత్రల

మీదా, కాస్సేపు కప్పుమీదున్న దుంగలమీదా పడుతోంది. నానిపోయిన కొయ్యవాసనా, మట్టివాసనానూ.

"నేనెళ్ళి పోతున్నానని సంతోషపడుతోంది" అన్నాడు ఇవాన్ వున్నట్టుండి బిగ్గరగా; "ఇష్టంలేని చుట్టం యింటికొస్తే యెలా చూస్తారో అలాచూస్తోంది నన్ను."

లొగునోవ్ నడక తగ్గించాడు; ఏమిటని అడగలేదు. మాట్లాడలేదు. ఇకిప్పుడు ఇవాన్ అంతా చెబుతాడని తెలుసు.

"చాలా కాలంనుంచి మేం యిద్దరం సరిగ్గా వుంటంలేదు; పరాయి వాళ్ళలాగా వుంటున్నాం" అని వినిపిస్తోంది వెనక నుంచి. అదే స్వరం. అదే బాధ. "అన్నిటికంటే పెద్దయిబ్బంది: నాకన్నీ తెలుసు; ఐనా నాఅంతట నేను విడిపోలేక పోతున్నాను." ఆ గొంతులో వేదనని భరించలేక పోయాడు లొగునోవ్; వెనుదిరిగి గూడా చూడలేదు. ఇవాన్ కాలికేదో తగిలినట్టుంది; మాట్లాడడం మానేశాడు.

"మీరు వెళ్ళడం గూడా వొక విధంగా మంచిదేనేమో" అన్నాడు లొగునోవ్ సాలోచనగా. న్యాయానికి డాక్టర్ వెళ్ళిపోవడం యిష్టంలేదు లొగునోవ్‌కి. ఈ మధ్యొకసారి ఇగోర్ కొన్ని సంగతులు చెప్పాడు. అప్పట్నుంచీ తనూ కొన్ని సంఘటనలు పరీక్షగా చూశాడు. ఐనా తావ్‌రోవెక్కడ? ఇవానెక్కడ? తావ్‌రోవ్‌ని చూచి ఇవాన్ భయపడడం అనవసరం అని లొగునోవ్ అభిప్రాయం. "మీరే పొరపాటు పడడం లేదు గదా?" అనడిగాడు మృదువుగా, "ప్రతి వ్యక్తీ కావాలనుకునే స్వాతంత్ర్యాన్నే ఓల్గా పావ్‌లోవ్నా గూడా కావాలనుకుంటూందేమో అనిపిస్తోంది. మీరందు కావిడకి సాయం జెయ్యాలి; చేయూత యివ్వాలి. మీరు ప్రయత్నం చేశారా? ప్రయత్నించి

విఫలులయ్యారా? ఐతే, మీరు సరైన పద్ధతిలో మాట్లాడలేదేమో దూరంగా వుంటే మీకుగూడా విషయాలన్నీ స్పష్టంగా ఆలోచించుకునే సావకాశం చిక్కుతుంది."

"ఏమో? ఎవరికి తెలుసు?" అన్నాడు ఇవాన్ గట్టిగా వూపిరి పీల్చుకుని వదులుతూ.

"ఇక్కణ్ణుంచెక్కడి కెళ్తున్నారు యిప్పుడు?" అనడిగాడు లొగునోవ్; అతనూ, ఇవాన్ లాగానే, చాలా నిరుత్సాహంగా వున్నాడు. ఇద్దరూ కలిసి, పంజరంలో, పైకొచ్చేశారు.

"నాయిల్లని చెప్పడానికూడా వీల్లేకుండావుంది. వెళ్ళి, సామానదీ సర్దుకోవాలి. ఆ చివరి ఆపరేషన్ నాలుగు గంటలకి చెయ్యాలి. సాధారణంగా ఆపరేషన్లు ఉదయం పూటే చేస్తాను. ఇవ్వాళంతా తల్లకిందులుగావుంది. మిమ్మల్ని చాలా బాధ పెట్టాను; ఇకెళ్తొస్తాను."

వెళ్ళేప్పుడన్నీ మరచిపోయినట్టు యేదోవొకటి హుషారుగా అనాలి గదాని, "ఎలాగైతే, బంగారం యెలా తవ్వి తయారు చేస్తారో చూశారుగా!" అన్నాడు లొగునోవ్.

# 16

"ఏదేది, ఒక్కనిమిషం నన్నుగూడా ఎత్తుకోనివ్వండి. అరరె. మరీ యింత పసిగుడ్డా! ముద్దొస్తోంది; కాదూ?" అంటూ పసిబిడ్డ వీపుకిందా, తలకిందా చేతులు పెట్టి పైకి తీసుకుంది ఒళ్లో. ఆబిడ్డవంక ఆప్యాయంగా చూస్తూ, "ఏం, బంగారం! యీ లోకం అంతా విడ్డూరంగా వుందా నీకు? ఇంకా కళ్ళు

సరిగ్గా తెరిచి చూడలేవు కదూ; ఫర్వాలేదు. నాలుగు రోజులు పోతే నువ్వే చూస్తావులే...." అంది.

"వాళ్ళ పిల్లల్ని వీళ్ళ పిల్లల్ని ముద్దులాడడం ఎందు కమ్మా! మహారాజులాగా సొంతబిడ్డల్నే కని యెత్తుకోక!" అంది ముసలావిడ నవ్వుతూ.

"నిజమేఁ" అంది ఓల్గా, ఆలోచించుకుంటున్నట్టు.

"ఆఁ, యింకా కావలసినంత టైముంది మీకు." అంది పావా; మంచం పట్టీమీదే కూర్చునుంది; చిన్న గౌనువేసుకుంది. మోకాళ్ళు గుండ్రంగా అందంగా కన్పిస్తున్నై. గౌను గుండీలు తీసింది. పాలిచ్చే టైమయ్యింది. "మనసులో వున్న సంగతులు సాధించండి ముందు."

"భలేవారే మీరు!" అంది ఓల్గా, సగంకోపంతోనూ, సగం విసుక్కుంటూనూ.

తల్లి చేతుల్లో నుంచి పసిపిల్లణ్ణి తీసుకుంది పావా. "నేనూ చూస్తున్నాగా. నాకన్నీ తెలుసు. నాకళ్ళు కప్పలేరు మీరు. కాదూ, చిన్నీ?" అంది గులాబీ బుగ్గలు ముద్దెట్టుకుంటూ; "నా బిడ్డ బంగ్గారపు సుద్ద; కాదండీ! అచ్చుపోసినట్టన్నీ వాళ్ళ నాన్న గారి పోలికలే."

"నిజవేఁ. ప్ర్యాఖిన్ లాగానే వుంటాడు" అంది ఓల్గా.

"ఇంకా యెవళ్ళకి మల్లేవుంటాడనుకున్నారు మరి?" అనడిగింది పావా, ఆశ్చర్యంగా.

"మరి మీరప్పుడు అట్లా అన్నారు...."

"అర్థంలేని మాటలు లక్ష చెబుతూంటాను ప్రతిరోజూ. ఏమీ చెప్పకపోతే, ఇవాన్ ఇవానొవిచ్ వింటారూ? అందుకని,

నా రహస్యం భర్తకి తెలిసిపోతుందని భయపడుతున్నానన్నై నా అనుకుంటే, సహాయం చేస్తారేమో మీవారు అనుకున్నాను. ఐనా లాభం లేకపోయె. ఇంకొక కాన్పంటేనే భయం వేసింది నాకసలు. ఇవాన్ ఇవానొవిచ్ది మరీ రాతిగుండె. ఐనా, మంచిదేలే. నాబిడ్డ వరహాల మూట!" అంది మళ్ళీ చేతుల్లో బిడ్డనింకొకసారి ముద్దెట్టుకుంటూ. పావా చెప్పిందాంట్లో ఏది నిజమో అర్థంకాలేదు ఓల్గాకి: ఇదివరకు చెప్పిందా, యిప్పుడు చెప్పిందా? ఏమో!

"మీపనే హాయిగా వుందనుకుంటా. ఏదెట్లా జరిగినా సంతోషిస్తూనే వుంటారు మీరు" అంది ఓల్గా.

ఒక నిమిషం ఆలోచించింది పావా, కావాలని కనుబొమలు కుంచిస్తూ.

"ఏమీలేదు. నేనుదేనికీ యెప్పుడూ ఎవరితోనూ షిర్యాదు చెయ్యను; ఇతరుల్ని బాధపెట్టను; నేను బాధపడను. నాకూ అసంతృప్తిగావుండే విషయాలనేకం వుంటే వుండొచ్చును గాక. అప్పుడప్పుడూ నాజీవితం వృధాచేశేసుకున్నానేమో అనిగూడా అనిపిస్తుంది. ఏ పేరుమోసిన నటినో, ఏ మంచి హోటలు మేనేజరునో అయ్యేదాన్నే నేమో ప్రయత్నిస్తే. అలాఐతే తప్పకుండా పేరు ప్రతిష్ఠలు సంపాదించుకునే దాన్నే!" అని, తానే హోటలు మానేజరో ఐతే, చుట్టుప్రక్కలుండే వాళ్ళ మీద యెలా అధికారం చలాయించడానికి వీలుండేదో వూహించుకుంటూ వుబ్బి తబ్బిబ్బై పోయింది పావా.

ఒళ్ళుమరచి పావాచేసిన డాన్స్ గుర్తుకొచ్చింది ఓల్గాకి; నవ్వుకుంది.

"ఇంకా యిప్పుడేం జేస్తాన్లెండి. అంతా ఐపోయిందిగా, బురదలో దిగబడిపోయాను. కావలసినంత డబ్బుంది మాకు; ప్రాక్టీసు పాడుచేస్తున్నా డసలునన్ను. ఎప్పుడూ ఏదో ఒక బోన సొస్తుంది; జీతం పెరుగుతూనేవుంది. చూశారా, యీ వెల్వెట్ అయన పట్టుకొచ్చిందే; ఎప్పుడూ ఏదో వొక బహుమానం పట్టుకొస్తూనే వుంటారు; ఐనా, నాకూ కావలసినన్ని బాధ్యత లున్నాయనుకోండి. ఈ యిల్లంతా నిభాయించుకు రావద్దూ. మీరేమన్నా అనండి: ఆడది యిల్లుసంబాళించుకుంటే; అదే పదివేలు. ఇక పిల్లల్ని పెంచడం సరేసరి....ముగ్గురుపిల్లలు! మాటలామరి! మీకూ వుండాలి పిల్లలు; ఐనా, మీదారివేరు. ఏం జేస్తున్నారు? వ్రాస్తున్నారా మరి?"

"ఆ వ్రాస్తూనే వున్నాను. ఇక్కడనేక నూతనకార్యక్రమాలు జరుగుతున్నై; అవన్నీ చూస్తే నామనసానందంతో వుప్పొంగి పోతుంది. అన్నిటిని గురించీ ఒకేసారి వ్రాసెయ్యాలని పిస్తుంది. ఇప్పుడునాకు యిరవై నాలుగ్గంటలూ అదేపని, అదే ఆలోచన: ఈ గొప్ప కార్యక్రమానికి అక్షరరూపం యివ్వడం యెలాగాఅని."

# 17

పార్టీబ్యూరో సమావేశం పూర్తయ్యేప్పటికి చాలా ఆలస్యమైంది.

'ఈజిల్లా కమిటీని నడపవలసిన విధంగా నడపాలంటే మాటలుకాదు....అన్ని విషయాల్ని సమగ్రంగా అవగాహన చేసుకోవాలి; సరైన నిర్ణయాలు తీసుకోవాలి.' అనుకున్నాడు

లొగునోవ్, బజారువెంట నడుస్తూ; 'ఇక్కడున్న వాళ్ళందరూ మంచివాళ్ళు. వాళ్ళమీద ఆధారపడవచ్చును. కాకపోతే, యిప్పటికొచ్చిన ప్రశంసలుచూచి సంతోషించి వూరుకోగూడదు, నిర్విరామంగా పనిచెయ్యాలి; చేయించాలి. ఇక్కడవాళ్ళు చాలా మంచివాళ్ళు; చక్కని రాజకీయచైతన్యం వున్నవాళ్ళు.

"విషయాలన్నీ సమగ్రంగా అవగాహన చేసుకోవడానికీ, సరైన నిర్ణయాలు తీసుకోడానికి" శాయశక్తులా పనిచెయ్యడం మూలాన లొగునోవ్ సగానికి సగం చిక్కిపోయాడు.

'ఇక్కడి కార్యకర్తలందరూ బాధ్యతలు బాగా గుర్తెరిగిన వాళ్ళు' అనుకున్నాడు లొగునోవ్. 'అందులో ప్రతీ వొక్క వ్యక్తీ తనకు తగిన రంగంలో, తనకుతగిన స్థానంలో వున్నామా అని అనుకోవాలి. లేకుంటే తన కిందపనిజేసే వాళ్ళనుంచి పూర్తిపనిని రాబట్టనూలేదు; వాళ్ళని సంతృప్తిపరచనూలేదు. వ్యక్తుల కుద్యోగాలివ్వడమూ, ఏంచెయ్యాలో చెప్పడమూ జిల్లాకమిటీపని కానిమాట నిజమే; అదంతా చూసుకునేది ప్రభుత్వమూ, అధికార వర్గమూనూ. కమిటీ పనల్లా స్థూలంగా సూచనలూ, సలహాలూ యివ్వడం. అది చెయ్యాలన్నా వ్యక్తులందర్నీ, అరచెయ్యిలాగా చదవగలిగి వుండాలి; తెలుసుకుని వుండాలి. అదీగాక సూచనలుగాని సలహాలుగాని అదునుకివ్వగలగాలి; ఆప్రత్యేకరంగంలో, ఆప్రత్యేక బాధ్యత నిర్వహిస్తున్న వ్యక్తి అందుకు తగడని తర్వాతనుకునేకంటే, ముందే జాగ్రత్తపడడం మంచిది. అంటే—ఏమాత్రం ప్రమత్తతగానూ వుండగూడదు; కునుకెయ్యగూడదు...

ప్రభుత్వ వ్యవసాయక్షేత్రం డైరెక్టరొకతను బ్యూరోకిచ్చిననివేదిక గుర్తుకొచ్చింది లొగునోవ్ కింతలో; 'అతనిపనిలో

ద్వారిన లోపాలెత్తి చూపాం. రాజకీయ అధ్యయనం అంటే యింకా ఎక్కువ శ్రద్ధచూపాలని చెప్పాం. నామట్టుకునేను చదవవలసిందుంది యింకా—అగ్రగామీణార్థిక వేత్త తెచ్చిపెడతా నన్న పుస్తకాలు చదవాలి. ఇప్పటి కారు మాసాలైంది యీ పదవి తీసుకుని నేను. మొదట్లో యెంతపని జేసినా యిటు వ్యవసాయరంగంలోగాని, అటు పారిశ్రామిక రంగంలోగాని చెప్పుకోతగ్గ ఫలితాలేమీ కలిగినట్టే కన్పించలేదు. మొదటి మూడు మాసాలూ గడచిం తర్వాత, మళ్లీ మూడునెలలూ పూర్తయ్యేప్పటికిగాని అభివృద్ధి బాగానే జరిగిందన్న సంగతి తేలలేదు. మా ప్రయోజనాలన్నీ—యీ జిల్లా ప్రయోజనాలన్నీ —ఒకటే అన్నవిషయం నానాటికీ స్పష్టమౌతోంది.

తలపైకెత్తి చూశాడు లొగునోవ్ నీలాకాశం, తళతళ లాడుతున్న నక్షత్రాలు. ఇంతవరకూ ఆలోచనలతో ముడిపడిన కనుబొమలు తేరుకున్నై. ముహం ప్రశాంతంగా వుంది. దూరంగా నదిమీద గడ్డకట్టుకున్న మంచు పగిలినశబ్దం దూసుకు వచ్చింది, తుపాకీ దెబ్బ శబ్దంలాగా. మళ్ళీ ఎప్పటిలా నిశ్శబ్దం. నదికివెళ్ళే రోడ్డంట స్లెడ్జిబళ్ళదారులు తెల్లగా కన్పిస్తున్నై మెరుస్తూ. చిన్నప్పటిలాగా మళ్ళీ ఆబళ్ళమీదెక్కి సవారీచేస్తే! ఇప్పుడు తన అక్కచెల్లెళ్ళతోగాదు ఆ సవారీచేసేది; వార్యాతో. గాలికెదురుగా, మంచుదువ్వ లెగ్గొట్టుకుంటూ వెయ్యాలి ఆ సవారీ; ఇద్దరూ కలిశొక్కసారి బోల్తాకొట్టాలి, ఆడపిల్లలా నవ్వుకుంటూలేచి, ఆమంచు పౌడర్ కొట్టుకున్న ముహంమీద ముద్దులవర్షం కురిపించాలి.

సరాసరి డెనిస్ యింటికి వెళ్ళాడు లొగునోవ్; వెళ్ళి గట్టిగా తట్టాడు తలుపు. శీతకాలం చలి లోపలకు రాకుండా తలుపు దిగ్బంధంచేశాడు డెనిస్.

వార్యా థోమస్ వాయించుతోంది చిన్న స్టూలు మీద కూర్చుని. లొగునోవ్‌ని చూచి తలూపింది వార్యా, ఆవాయిద్యాని కంటుకున్న పెదవులు కొద్దిగా కదిపి చిరునవ్వు లొలక బోస్తూ. తాళం చెవిలాగున్న దానికంటి పెట్టుకున్న లోహాన్ని వేళ్ళి కణుపుతో నొక్కింది. ఆవిడ గాలి పీల్చి వదుల్తూంటే చెవికింపుగా శబ్దం వస్తోంది. ఎవరి మీదో యేవో ఫిర్యాదు చేస్తున్నట్టుందా మధుర సంగీతం. కాని, సంగీతంలో ప్రవేశంలేని వాళ్ళకి లోతుపాతులు తెలియవు.

"యేం, వార్యా! కలలు గంటున్నావా?" అన్నాడు లొగునోవ్, ఉన్నికోటు తీసి, డెనిస్‌తోనూ ఎలీనాతోనూ కరస్పర్శ చేస్తూ.

"యేమిటీ. వార్యా పాడుతున్న దేమిటో అర్థంకాలేదా మీకు?" అనడిగాడు డెనిస్. లొగునోవ్ మొహంలో వచ్చిన మార్పునిచూచి, ఆశ్చర్యపోయాడతను; బాధ్యతల బరువెక్కువ కావడంమూలాన అలావున్నాడేమోలే అని సరిపెట్టుకున్నాడు. కాని ఎలీనా వుద్దేశంవేరు. ఆవిడ స్త్రీ. స్త్రీలు సహజసిద్ధంగా కొన్ని సంగతు లిట్టే గ్రహించేస్తారు. లొగునోవ్ ముహంలో వచ్చిన మార్పుకి కారణం అతని హృదయమేనని పసిగట్టేశింది ఎలీనా; ఆవిషయమే భర్తకి చెప్పింది. భర్త మొదట్లో వొప్పుకోలేదుగాని, తర్వాత భార్య చెప్పిన మాట నిజమేనని నచ్చిందతనికి.

"ఆఁ. ఇప్పుడిప్పుడే అర్థమౌతోంది" అన్నాడు లొగునోవ్, నెమ్మదిగా.

"నిజంగానా?" అనడిగింది వార్యా, ఒకక్షణం ఆగి; "ఉదాహరణకిది........"

ఆవిడకి దగ్గరగా వొంగి, థోమస్‌ని శ్రద్ధగా చూశాడు లొగునోవ్: మృదువైన నవ్వులసవ్వడిలాగుంది సంగీతం. విం టూన్న కొద్దీ అతని ముహంమీద విషాదరేఖలు పొడసూపినై.

"ఇక చాల్లెండి!" అంది వార్యా. వాలిన కనురెప్ప ల్లోంచి ప్రక్కగా అతని వైపుచూచి; "చాల్లెండిక. ఇంకాస్సే పుంటే నారహస్యాలన్నీ గ్రహించెయ్యగలరు. మరీ అన్నీ తెలుసుకుంటే యెట్లా? కొన్ని రహస్యాలన్నా నావినన్ను దాచుకోనీయండి."

"అంతస్వార్థమా" అంటూ గొణిగాడతను.

"వార్యా! ఆ థోమస్ మీద అన్నిపాటలూపాడగ్గలవా?" అనడిగాడు డెనిస్, స్టూల్ మరింత దగ్గరకు లాక్కుంటూ, "ఏదీ, యిందాక పాడావే. అలాంటివి?"

"ఆ కోకిలని గురించి పాడిందా మీరనేవి? ఉఁహుఁ; సాధ్యంకాదు. కొన్నికొన్ని పాటలసలు యీ థోమస్ మీద పాడలేం. ఇది ప్రత్యేకించి ఆడపిల్లల వాయిద్యం. చిన్నప్పుడు దీనిమీద పాడాలని యెంత తపించి పోయేదాన్నని! మా అక్క య్యలు పాడుతూంటే అసూయపడేదాన్నిగూడా. వాళ్ళ రహస్యాలన్నీ యీ థోమస్‌తో చెప్పుకునే వారొకళ్ళతో వొకళ్ళు."

"ఏదంటే యెక్కువ అసూయపడేదానివి? వాళ్ళుపాడు తున్నారనా రహస్యాలు చెప్పుకుంటున్నారనా?" అనడిగింది ఎలీనా, తనకుర్చీగూడా దగ్గరగా లాక్కుని.

"రెండూనూ" అన్నదివార్యా; థోమస్ తీసి జేబు రుమాల్లోచుట్టి; జేబులోపెట్టుకుంది. "ఇప్పుడిప్పుడు రష్యన్ పాటలు

గూడా నేర్చుకుంటున్నాను. రష్యన్ సంగీతమంటే చెవికోసుకో బుద్ధేస్తుంది. ఖోమస్ సంగీతమంటే జోలపాటలా వుంటుంది. ఖోమస్ వాయించినప్పుడల్లా మాలోయ, మాప్రాంతం, మా అడవిగుర్రాల గుంపులు, మా కొండలబారులు, ఆకొండల బారుల్లో మంచుపైకి తలలుపెట్టి గాలికి ఊగిసలాడే పచ్చిక.... గుర్తుకొస్తాయి నాకు. ఎక్కడో దూరప్రాంతాలనుంచివచ్చారు మాయకూత్‌లు, ఆరువందలేళ్ళకి పూర్వం. మాపుక్కిటికథల నిండా సింహాలు, సముద్రం, డేగలు....వస్తూవస్తూ గుర్రాలూ ఆవులూ తోలుకొచ్చాం మాతోపాటు. సోవియట్ ప్రభుత్వం వచ్చేదాకా మేం పడ్డ కష్టాలూ, యిబ్బందులూ యిన్నన్ని కాదు. కాని యిప్పుడీ వుత్తరప్రాంతంలో యేం జరుగుతోందీ మాయకూత్‌లకి తెలిసినంతగా యింకెవ్వరికీ తెలియదు. సరే గాని....నిన్నసాయంత్రం డెనిస్ నేర్పిన పాట పాడుకుందాం, పట్టండి."

లేచివెళ్ళి, స్టోవ్‌లో యింకొంకింత బొగ్గేశివచ్చి కూర్చున్నాడు డెనిస్. స్టోవ్‌లో లేచినమంటలవంక చూస్తూ పాడడం ప్రారంభించాడు :

ఆరేయి ఆరేవు
అతి శాంతముగదోచె*

ఎలీనా, లొగునోవ్ లిద్దరూగూడా పాడడం ప్రారంభించారు. ఆ రాగంలో తన గొంతు మేళవించడానికా అన్నట్టు, చెవులుదోరగాపెట్టుకునివిని, వార్యాకూడా కలిపిందగొంతు :

ప్రియపురీ! నీకిదే వీడ్కోలు వందనము
వేకువనే మనము ఎడబాటు నొందెదము

*మిత్రులు కృష్ణమూర్తిగారికి కృతజ్ఞతతో.

ఆగట్టుపై మందహాసముఖి, ఆత్మసఖి
నిలిచి మెలమెల్లగా ఊగించు తనకరము.*

# 18

"ఇక మనము విడిపోక తప్పదేమో" అన్నాడు డెనిస్ సాలోచనగా; "యుద్ధం నానాటికీ భయంకరం ఔతోంది. తటస్థ విధానాన్ని మానుకోవాలని అమెరికా ప్రభుత్వం సూచించబోతూందట; ఇవ్వాళ్టి పత్రికల్లో వార్తఅది. ఎావుం డలామరి? హిట్లరు పెట్టిన చిచ్చుముందు కూర్చుని, చలికాగా లని చూస్తున్నారు అమెరికన్ వ్యాపారస్థులు. కొత్త విమానం వొకటి కనిపెట్టి వదిలారువాళ్ళు; దానిపేరు 'ఫ్లయ్యింగ్ ఫోర్ట్రెస్.' బ్రిటన్‌కి మారణాయుధాలు సప్లైచేసేందుకు అను మతి నివ్వమని అడుగుతున్నారు వాళ్ళు."

"అడుగుతారు. అడగరూ మరి. అమెరికన్లకీ, ఇంగ్లీషు వాళ్ళకీ చుట్టరికంగూడావుంది. అక్కచెల్లెళ్ళకి మల్లే" అన్నది ఎలీనా.

"ఔనౌను. యిదివరకా అక్కచెల్లెళ్ళు ఒకళ్ల జుట్టొకళ్లు పీక్కున్నారు; ఒకళ్ల నొకళ్లు రక్కుకున్నారు. అమ్మో కోటీ శ్వరు లంటేనూ, పెట్టుబడి దారులంటేనూ, యేమిటను కున్నావ్? కాస్తలాభం వస్తుందనుకుంటే వాళ్ళు అమ్మా, అయ్యా అనిగూడా చూడరు. అందరూ స్వాహాయే. చర్మం వొలవమన్నా వొలుస్తారు. అంత కిరాతకులు వాళ్లు. అంటే, ఒక్కమాటలో చెప్పాలంటే, తాటస్థ్యానికి రోజులు దగ్గర పడినై అన్నమాట. అమెరికాగూడా యుద్ధంలోకి దిగిందంటే,

---

*మిత్రులు కృష్ణమూర్తిగారికి కృతజ్ఞతతో.

ప్రపంచ యుద్ధమన్నమాటే. ఇంగ్లండ్ మీదకి దూకేముందు హిట్లర్ మనమీద దాడిచేస్తాడు. వాడు మరీ పిచ్చికుక్కతంతు. ఎవళ్లో వొకళ్లు బుద్ధిచెప్పేదాకా ఒకడివెన కొకణ్ణి కరవాలనే చూస్తుంటాడు. ఇక మనమూ యుద్ధంలోకి దిగక తప్పదను కుంటా."

"అలాగే వుంది" అన్నాడు లొగునోవ్; "మీరంతా అంతర్యుద్ధంలో పాల్గొంటున్నపుడు మేమంతా తల్లుల పొత్తిళ్ళలో బిడ్డలం. సోవియెట్ ప్రభుత్వం నీడన పెరిగి పెద్దవాళ్ల మయ్యాం మేము. ఈసారి ఆప్రభుత్వాన్ని రక్షించుకోవలసిన బాధ్యత మాది."

"మీరు గూడా వెళ్తారా యుద్ధంలోకి, లొగునోవ్ ?" అనడిగింది వార్యా, ఎప్పటిలా సహజ కుతూహలంతో.

"మరి ? నువ్వా?"

"నేనా? నేను నర్సుని; కామ్సొమోల్ సభ్యురాలిని!" అని సగర్వంగా చెప్పింది వార్యా.

"నేనూ ఆశ్వికదళంలో ఫెల్డ్ షెర్ గా పని జేశాను." అన్నాడు డెనిస్.

"అంటే యిక నేనూ, చిన్నపిల్లలూ మిగులు తామన్న మాట. ఐనా, యిక్కడ మేంచేయవలసిందీ బోలెడంతుంటుంది" అంది ఎలీనా.

లొగునోవ్ లేచాడు; అతనూ, వార్యా కలిసి గుమ్మం వేపుకు నడిచారు.

"ఆ కోకిల పాటేమిటీ?" అనడిగాడతను. అప్పుడే వెళ్ళి పోవడం యిష్టంలేదు; ఏదో వొక వంకతో యింకాస్సేపుండాలని అతని ప్రయత్నం.

"అది, వసంత కాలాన్ని గురించి యకూత్‌లు పాడుకునే పాట" అంది వార్యా; అని, కొండమేకలా నిలబడింది, అలికిడై తేచాలు, బాణంలా దూసుకు పోయేందుకు సిద్ధంగా!

"ఇంకొక సారెప్పుడైనా పాడి వినిపిస్తాలే మీకు" అని వాగ్దానం చేశింది లొగునోవ్‌కి; "పాట భావం యిదీ; వేసవికాలం వొచ్చిందనీ, ఎక్కడ చూచినా పచ్చని పచ్చిక సూర్యకాంతిలో స్నానమాడుతూ మిలమిలలాడుతోందనీ పాడుతోంది నా ప్రియమైన పక్షి. ఇంకా యిట్లాగే చాలా చాలా భావాలు, చక్కగా వుంటుంది పాట; కాని విషాదంగా గూడా వుంటుంది; చాలా విషాదంగా వుంటుంది."

అలా, తన్మయత్వంతో మాట్లాడేప్పుడు, ప్రక్కనున్న మనిషి చేయి పట్టుకోవడం అలవాటు వార్యాకి. ఆడవాళ్లు ప్రక్కనుంటే కౌగలించుకునిగాని మాట్లాడదు. కాకపోతే, ఇవాన్ ఇవానొవిచ్ ప్రక్కనుంటే మట్టుకు, కాస్త జాగ్రతగా వుంటుంది.

లొగునోవ్‌కి తెలుసదంతా.

"ఈమధ్య యేమంత హుషారుగా వుండడంలేదే నువ్వు." అన్నాడు వున్నట్టుండి.

అనుకోకుండా అతనన్న మాటలు విని వులిక్కిపడింది వార్యా; వెంటనే అతని భుజంమీద వేసిన చేయి తీసివేసుకుంది.

"ఇప్పటికే ప్రొద్దుపోయింది. నేను మళ్ళీ రేపు తెల్లారగట్టే లేవాలి" అంది.

కావాలని, ఆవురించబోయింది గూడాను. కాని అలాంటి నటనలంటే అసలే చిరాకు; అందుకని, ''మీకూ్కడా యింటి కెళ్ళే బైమైందనుకుంటాను.'' అని మాత్రం అనేశింది.

ఇంట్లో నుంచి బయటికెళ్ళి పోయాడు లొగునోవ్. బయట, బజారులో, చలిలో నిలబడి, "ఇప్పుడప్పుడే యింటికెందుకు? ఇప్పుడింటికెళ్ళాలని లేదు నాకు" అన్నాడు; కాని అతని మాటలూ, ఫిర్యాదులూ వినేందుకక్కడెవ్వరూ లేరు.

ఆయింటి బయట, అలాగే, కిటికీల వంక చూస్తూ నిలబడ్డాడు. కిటికీ అద్దాలమీద మంచు పువ్వులు. అద్దాల వెనక కదలుతున్న నీడలు. లోపలి కాంతి అద్దాలలోంచి బయటకొచ్చి మంచుమీద పడి పసుపు పచ్చగావుంది. లొగునోవ్‌కి చలి వెయ్యలేదు; ఒంటరిగా వున్నానే అన్న బాధలేదు; కాని విచారం మాత్రం ముంచుకొచ్చింది.

"గడ్డుకేసు....చాలా గడ్డుకేసు....ఐనా ఆశాలేశంవుంది" అన్నాడిందాక ఇవాన్, ఒకరోగిని గురించి చెబుతూ. ఆ మాటలు గుర్తుకొచ్చినై లొగునోవ్‌కిప్పుడు.

డాక్టరున్న భాగం వైపు యింటి కిటికీలని చూశాడు లొగునోవ్. ఇప్పుడాయ నేమనుకుంటున్నాడో, అని అనుకున్నాడు.

ఇవాన్ ఇవానొవిచ్ చదువులగది కిటికీలో మాత్రం వెలుగుతోంది దీపం. మిగతా మూడు కిటికీలూ గ్రుడ్డికళల్లా చీకట్లోకి చూస్తున్నై తెల్లగా. ఎందుకనోగాని యిల్లంతాబావురుమంటున్నట్టుంది; పాడుపడినట్టుంది. గనులదగ్గర ఇవాన్ ఇవా

నొవిచ్‌తో జరిగిన సంభాషణ గుర్తుకు తెచ్చుకుని, మనసు దృఢం చేసుకుని, మెట్లెక్కి వెళ్ళి, తలుపు తట్టాడు లొగునోవ్. ఒక్క నిమిషం ఆగి యింకొకసారి కొట్టాడు తలుపు. నెమ్మదిగా తెరచుకున్నై తలుపులు; ఎదురుగా ఇవాన్ మొహం కనిపించింది పాలిపోయి.

లొగునోవ్‌ని గుర్తించినట్టులేదు ఇవాన్. "లోపలికి రండి" అన్నాడు నెమ్మదిగా. తలుపులు మూసి సర్జెన్ వెనకాలే బయల్దేరాడు లొగునోవ్. హాలులో దీపంలేదు, చీకటిగా వుంది. 'ఎందుకొచ్చానా యిక్కడి కిప్పుడు' అని అప్పుడుగాని లొగునోవ్‌కి తట్టలేదు. బహుశా డాక్టర్ తనతో ఆరహస్యాలు ఆపుకోలేక చెప్పివుంటాడు; ఎందుకు చెప్పానా అని తర్వాత పశ్చాత్తాప పడ్డాడేమో గూడాను.

ఇద్దరూ కలిసి చదువుల గదిలో కెళ్ళారు. "ఓహో! మీరా!" అన్నాడు ఇవాన్, "రోగిని చూడ్డానికి రమ్మని పిలుచుకెళ్ళడాని కొచ్చారేమో యెవరన్నా అనుకున్నాను. మీరొచ్చారు. సంతోషం. మంచిదే. చాలా మంచిది." అన్నాడు; కాని ఆ సంతోషం ఏమీ కన్పించలేదు ఇవాన్ ముహంలో. అప్పుడే గడ్డం చేసుకున్నట్టున్నాడు. "చూశారా? పని జేసుకుంటున్నాను." అన్నాడు.

డెస్క్‌మీద పడున్న వ్రాత ప్రతివంక చూస్తూ తలూపాడు ఇవాన్. టైప్‌రైటర్ మీద యింకో కాగితం వుంది.

"నేను రావడం వల్ల అభ్యంతరం యేమీలేదు గదా?" అన్నాడు లొగునోవ్ కుర్చీలో కూర్చుంటూ.

"ఏం పర్వాలేదు. ఇప్పుడు పని కాస్త వొత్తిడిగానే వుంది. అదీగాక రెండు మూడు రోజుల్లో ప్రయాణం. ఈలోగా

అన్నీ పూర్తి చేసేశెయ్యాలి. ఎప్పుడో వెళ్ళవలసిందీ ప్రయాణం మీద; ఇప్పటికే ఆలస్యమైంది...". అన్నాడు ఇవాన్. లొగునోవ్ కనులటూ యిటూ చూస్తూ, ఒక మూలన పడున్న ఇవాన్ దుస్తులమీదా, పక్కమీద పడినై.

"ఓల్గా ఆరోగ్యం యేమంత బాగాలేదు." అన్నాడు ఇవాన్, లొగునోవ్ ప్రక్కవంక తదేకంగా చూడడంచూచి. ఇంతలో, లొగునోవ్ కన్నీ తెలుసన్న సంగతి గుర్తుకొచ్చింది. "లొగునోవ్, ఇకనా పనైపోయింది. ఇక నేనుచేయగలిగిందేమీ లేదు. ఇలాంటి విషయాల్లో, మనసు రాయిచేసుకొని విడి పోతే పోతుందను కునేవాణ్ణి యిదివరకు. నాదగ్గరకొచ్చేప్పటికి కాలశొస్తోందినాకు. విడిపోవడం అంతతేలికగాదు. మనసుని రాయి కమ్మనమంటే ఐపోదు. నిజం తెలుసుకోవాలంటేనే బాధగావుందిప్పుడునాకు....ఎంతసేపూ ఓల్గా అనారోగ్య మనో లేకుంటే యింకా అలాంటిదేయేదో కుంటిసాకు చెప్పుకుని సర్దుకోబుద్ధేస్తుంది. నీకవతల యింకేదైనా ఆధారం వున్న ప్పుడో, అసలు ప్రేమే నశించి పోయినప్పుడో ఐతే విడి పోవడం తేలికేనేమో. కాని....ఇంకా ప్రేమిస్తూనేవున్నప్పుడు ...ఐనా, ఏం లాభంతే మాట్లాడి?....ఒక కప్పుటీ యివ్వనా?"

యింతకు పూర్వమే డెనిస్ యింట్లో టీ త్రాగొచ్చాడు లొగునోవ్. ఐనా, ఇవాన్ ముహంచూచి సరే నన్నాడు.

"ఆవిడిప్పుడు నిద్రపోతోంది. నిజంగానే ఆవిడ ఆరో గ్యం బాగున్నట్టులేదు." అన్నాడు ఇవాన్, ఏమ్ చేస్తేగా వుప యోగిస్తున్న సాసర్ తీస్తూ;" ఇంతదరిద్రపు చలిలోనూ షికారు కని బయల్దేరుతుంది. దుప్పి బళ్ళమీదా, లారీలా మీదానూ."

డాక్టర్ వంటింట్లో కెళ్ళిం తర్వాత, గదంతా కలయ జూశాడు లొగునోవ్. ఇంట్లో స్త్రీ వున్నట్లేవుంది ఆగది. కాని ఆస్త్రీ ఆయింటికి చెందిన మనిషిగాదు. ఎవరో పనిమనిషి. పొద్దున్నే వచ్చి తనపని తను చేసుకునివెళ్ళి పోతుంది మళ్ళీ మర్నాడు పొద్దున్నగాని రాదు. గదంతా ఆఫీసులాగావుంది. రాత్రిపూట పనివుండి, ఆరాత్రికా ఆఫీసులోనే పండుకోవాలను కుంటే. సర్దరూ ఆఫీసుని; అలా సర్దివుంది.

'ఇకెళ్ళిపోతాడన్న మాట యీాయన' అనుకున్నాడు లొగునోవ్; ఈయనిక్కడలేక పోవటం అవకాశంగా తీసుకుని, వదిలెయ్యదుగదా ఓల్గా? మీరిక్కడే వుండిపొండని యీాయనతో అనడానికీ వీల్లేదు. మీకు తప్పకుండా ఒకడాక్టర్ని పంపుతాం అని అక్కడ వాళ్ళకి మాటిచ్చాం; అదీగాక, వీళ్ళిద్దరూయిక్కడ యిట్లా, వుండడమూ యేమంత భావ్యంగాదు, వుండలేరు గూడాను; అసంభవం. ఒకవేళ, బహుశా, కొంతకాలం దూరం గా వుండడమే మంచిదేమో గూడాను; అప్పుడొకళ్ళ నొకళ్ళు నిష్పాక్షికంగా అర్థం చేసుకునేందు కవకాశం చిక్కుతుంది. మీరిద్దరూ రాజీ పడండని చెప్పినా అర్థం వుండదు; వాళ్ళు పోట్లాడుకున్నది మాత్రం యెక్కడ? ఎవరికీ అర్థంకాని బాధ లేవో వాళ్ళ ఆనందానికి అంతరాయం కలిగిస్తున్నై. ఛా ఛ! ఎంతచక్కని దాంపత్యం...ఎంతహాయిగా వుండేవని!"

"ఆс. ఐపోయింది." అంటూ వచ్చాడు ఇవాన్, వంటిం ట్లోంచి, టీపాట్ చేత్తోపట్టుకుని; "ఈరోజుల్లో పొయ్యి ప్రొద్దు పోయేదాకా వుంటుంది. ఇదిగో తినడానికికూడావుందకొద్దిగా"

అంటూ వెన్నా, జున్నూ, యింకా రెండుమూడు టిన్నులూ, సిగంఖాళీఐన కోగ్నాక్* బుడ్డీ తీసుకొచ్చాడు.

డెస్కుమీదున్న టైప్ రైటర్ తీసి మంచంమీద పెట్టి, కాగితాలన్నీ సర్ది, భోజనం అంతా సిద్ధంచేశాడు. స్త్రీ సహాయం లేకుండా అన్నీ పనులు చేసుకునేందుకూ అలవాటుపడి పోయినట్లున్నాడు.

"స్నేహాన్ని తలచుకుని తాగుదాం" అన్నాడు లొగునోవ్‌తో. యిద్దరూ కూర్చున్న తర్వాత; "మీరొచ్చారు; సంతోషం. హాస్పిటల్‌నించి యింటికిరాగానే, పనిచేసుకుందామని కూర్చున్నాను. మనసు బాగా లేనప్పుడు, పనిజేస్తే, విచారభారం వుపశమిస్తుంది; ఏమంటారు?" అంటూ నిట్టూర్చాడు. మళ్ళీ తన ఆలోచనల్లో తాను మునిగి పోయాడు, లొగునోవు ప్రక్కనే కూర్చున్నాడన్న సంగతికూడా మరిచిపోయి. కాస్సేపటికి, మళ్ళీ తనే తేరుకుని. "ప్రేమని తలచుకునే తాగుదాం. ఏం? ఆశ్చర్యంగా వుందామీకు? నాలాంటివాడేదో తలక్రిందులైనంత మాత్రాన ప్రపంచమే మారిపోదుగదా! ఇంకా, లలితభావాలున్న వ్యక్తు లసంఖ్యాకంగా వుంటారు. ఈదెబ్బతిన్నంత మాత్రాన నాకు మానవుల్లో విశ్వాసం లేకుండా పోదు." అన్నాడు.

"మీరూ, నేనూ అలాకాములెండి" అన్నాడు లొగునోవు, వార్యా సంగతి తలచుకొని, తనభావాలూ, ఆదర్శాలూ దృక్పథం ఇవాన్ ఆలోచనలకి చాలా దగ్గరగానే వున్నై. అలాంటప్పుడింకా వాదనల కాస్కారం యేంవుంటుంది? "యీరోజుల్లో మానవత్వం మీద నమ్మకం సడలడం అంటేనూ

*ఒక రకమైన సారా

కలుసుకునే సదవకాశంగూడా కలుగుతుంది. ఉత్తరప్రాంత ప్రయాణం అంటే జీవితాంతంవరకూ గుర్తుంటుందంటారుమరి."

"నేనీ ప్రయాణాన్ని మరిచిపోవాలన్నా మరచిపోలేను. అంత ప్రాముఖ్యంవుంది యీ ప్రయాణానికి." అన్నాడు ఇవాన్, విషాదంగా నవ్వుతూ. "ఆప్రాంతలో ఒక చిన్న హాస్పిటల్ తెరుస్తాను. ప్రత్యేకించి కౌతూహాలం లేపే కేసు లేమైనా వుంటే, యిక్కడికొచ్చి, పూర్తి పరీక్షచేసి, ఆకేసుల చరిత్ర వ్రాస్తాను. ఎందుకూ, ఈమధ్యనే ఇక్కడికొక గమ్మత్తయిన కేసొచ్చింది....." అంటూ యీమధ్యనే హాస్పిటల్‌లో చేరిన ఒకరోగిని గురించి చాలా వుత్సాహంగా చెప్పడం ప్రారంభించాడు ఇవాన్. "ఎంతపెద్ద ఆపరేష ననుకున్నారు. ఇదిగో ఇంతకురుపు కోశెయ్యవలశొచ్చింది." అంటూ చిక్కుడు గింజంత పరిమాణాన్ని చూపాడు. లొగునోవ్ ఆశ్చర్యపోయాడు అంతచిన్న పరిమాణాన్నెంతో పెద్దదిగావర్ణించుతున్నాడేమిటా అని. అసలు లొగునోవ్ మనసక్కడలేదు. సర్జెన్ చెబుతున్న మాటలన్నీ శ్రద్ధగా వినడం లేదతను. మధ్యమధ్య చెదురుచెదురుగావింటున్నాడు. "ఆకారొటిడ్ ప్రక్కకితోసేశాను.... చాలా లోతుకు వెళ్ళవల శొచ్చింది.... మొట్టమొద టసలంత లోతుకు పరికరాలు పెట్టడమే కష్టమైపోయింది....రోగికి స్పృహొచ్చే టప్పటికి చేతిలో బాధన్నమాటే లేకుండా పోయింది."

"జబ్బేమిటీ, సంధివాతమా?" అనడిగాడు లొగునోవ్.

ఆశ్చర్యంగా చూశాడు ఇవాన్, అతనివంక.

"సంధివాతమా? కాదు, కాదు; అదేమీకాదు, మోటారుప్రమాదంలో జరిగింది! మొట్టమొదటి ఆపరేషన్ ఉకమ్ఛాన్‌లో చేశారు, ఛలేవారు! సంధివాతమా! అలాంటి మాటంటా

రని అనుకుంటూనే వున్నాను సుమా నేను!" అంటూ పగలబడి నవ్వాడు ఇవాన్; "అంతేలే; మీరు గనుల్ని గురించి చెప్పే ప్పుడు నాకూ అలానేవుంది అంతా అగమ్యగోచరంగా."

# 19

ఓల్గాకి బాగా జలుబు చేసింది. భోజనాల గదిలో కూర్చునుంది ఒంటరిగా, తలకొక అంగోరా రుమాలు చుట్టుకుని తాను వ్రాసిందొకసారి తిరిగి చదువుకుంటోంది. ఇంట్లో వొం టరిగా వున్నాను గదా అనే ధైర్యంతో, యింతకు పూర్వమే పూర్తిచేసిన వ్యాసం వొకటి తీసి బిగ్గరగా చదువుకుంటోంది. ఆవిడ వ్రాసిన వ్యాసం వొకటీ మధ్య రేడయోలో గూడా ప్రసారమైంది: ఇవెన్ సమిష్ఠి క్షేత్రానికి చెందిన ఒకతన్ని గురించి వ్రాసిందది. రేడియోలో వింటూంటే, తన వ్యాసం తనకే చాలా విచిత్రంగా కన్పించింది. ఒకే విషయం అనేకసార్లు పునరుక్తి చేసినట్లనిపించింది; మొహం మొత్తినట్టుంది.

ఆ వ్యాసాన్ని తలచుకుని తనకు తానే సిగ్గుపడిపోయింది. పత్రిక్కి వ్రాసిన వ్యాసంలా లేనేలేదు. ఊరికే పేజీలు నింపి ప్రయోజనం ఏమిటి? ఆమాట కంటే, యీమాటా, యీమాట కంటే ఆమాటా బావుందని వ్యాసమంతా భాషని దృష్టిలో పెట్టుకు వ్రాస్తే లాభమేమిటి? పత్రికల్లో, నీకోసం వాళ్లు ప్రత్యేకించే ఆ కొద్ది స్థలమూ, చక్కని కిటికీల్లా వుండాలి. ఆ కిటికీల్లోంచి, నీవు చెప్పదలచుకున్న విషయం సుస్పష్టంగా కన్పిం చాలి. ఆకిటికీ అద్దాలనిండా లతలూ, బొమ్మలూ నింపగూడదు. పైకప్పుడు అందంగా వున్నట్టు కన్పిస్తే కన్పించవచ్చును కాని, చెప్పదలచుకున్న విషయం వాటి మాటున పడిపోతుంది;

స్పష్టంగా కనిపించదు; తెలియదు. సుస్పష్టంగా, నిరాడంబరంగా వ్రాయగలగడ మంత కష్టమైన పని యింకొకటిలేదు.'

ముందున్న వ్యాసాన్నింకొకసారి చూచింది ఓల్గా. 'ఈ సారలా వ్రాశాననుకుంటా' అని తనకు తానే సంతృప్తి పడింది.

"తైగా ప్రాంతమంతా భయంకరంగా, తెల్లగావుంది; కాని ఒక కొత్త సమిష్టి క్షేత్ర దివ్యకాంతిలా మంచులో మిలమిలలాడుతూ కేరింతలు కొడుతున్నై."

పెన్సిల్ తీసుకుని, కొట్టేశి మళ్ళీ వ్రాసింది ఓల్గా:

"శీతకాలపు తెలుపులో తైగా ప్రాంతమంతా భయంకరంగా వుంది; కాని ఒక కొత్త సమిష్టి క్షేత్రపు విద్యుద్దీపాలా మంచు తెర ముందు మిలమిలలాడుతూ కేరింతలు కొడుతున్నై."

ఈసారి గూడా ఓల్గాకు సంతృప్తి కలగలేదు. మళ్ళీ కొట్టేశింది. మళ్ళీ వ్రాశింది:

"శీతకాలం, చలి, ఎటు చూచినా తెల్లని తెలుపు. తైగా ప్రాంతం అంతా భయంకరంగా వుంది. కాని అక్కడొక కొత్త సమిష్టి వ్యవసాయ క్షేత్రం వుంది. ఆ క్షేత్రం విద్యుద్దీపాలు అంత మంచులోనూ ఆకాశజ్యోతుల్లా మెరుస్తున్నై."

'నేను వ్రాయబోతూన్న వ్యాసం సమిష్టి వ్యవసాయ క్షేత్రాన్ని గురించన్నది స్పష్టమౌతోందిప్పుడు. మళ్ళీ యీ వ్యాసాన్ని రేపు చదివినప్పుడింకా కొన్ని మార్పులు చెయ్యవలసి రావొచ్చును. కాని మరీ అదేపనిగా మారుస్తూపోతే, యీ వ్యాసమంటేనే అసహ్యం వెయ్యొచ్చును నాకు, అంచేత యెక్కడో ఒకచోట గీతగీసుకోక తప్పదు. పత్రికకి వ్యాసం వ్రాయడం అంటే, ముందందుకు సంబంధించిన సమాచార మంతా అవగాహన చేసుకోవాలి. వొత్తి సమాచారం అందించి

నంతమాత్రాన సంతృప్తి చెందడు పాఠకుడు, అంతకంటె సం పూర్ణభావం యేదో అందజెయ్యాలి వాళ్ళకి. 'ఇవెన్ సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో రైతులు కొత్త యిళ్ళల్లోకి ప్రవేశిం చారు' అనే వ్రాస్తే సరిపోదు ఇరవయ్యేళ్ళక్రితం ఇవెన్‌ల కసలు యిళ్ళంటే యేమిటో తెలియదు. స్టోవంటే యేమిటో, ప్రక్క దుప్పట్లంటే యేమిటో తెలియనే తెలియదు.'

ఆ ఇళ్ళల్లో చూచిన సంగతులు గుర్తుకొచ్చినై ఓల్గాకి. ఒకనాడు థెర్మామీటరు సున్నాకింద యాభై డిగ్రీలు చూపు తోంది. ఒక ముసలి ఇవెన్ అమ్మమ్మ, మీదున్న ఉన్నిజాకెవ్ తీసేశి, మనమణ్ణి తీసుకెళ్ళి, స్నానాల తొట్టిలో స్నానంచేయి స్తోంది; ఆవిధంగానైనా మనమడికి యెంతోకొంత వెచ్చదనం కలగ జేద్దామని. ఆ చిరుచేతుల్తో నీళ్లు చిందగొట్టుతూ, తెల్లగా నీటిబుడగలా మెరుస్తున్నా బల్బు వంక చూస్తూ ఆడు కుంటున్నాడు మనమడు. అతనికంటె పెద్దపిల్లలందరూ తొట్టె చుట్టూచేరి సంతోషంతో గల్లంతు చెయ్యడం మొదలెట్టారు ఏదో వినోదం చూస్తున్నట్టు. ఒకళ్ళ నొకళ్లు తోసుకుంటూ తొట్టెవున్న బల్లమీద కెక్కారు; అమ్మమ్మ చేతుల కడ్డంపడ్డారు.

ఇవెన్ పౌరులకు సుస్వాగతం! మీకొత్త యిళ్ళల్లో ప్రవే శించినందుకు ధన్యవాదాలు! ఈ నూతన పరివర్తనని, మీ జీవి తాల ఆనందాన్ని ఎలా వర్ణించగలను నేను? ఏమని వర్ణించగలను

తలుపు తీసిన చప్పుడు....ఇవాన్, హాస్పిటల్ కెళ్ళాడు. ప్రయాణానికి ముందు హాస్పిటల్ కెళ్ళడం యిదే చివరిసారి. ఇంత పెందలకాడే తిరిగిరాడు. పావా ఐతే, యీ పాటికి, వాతావరణాన్ని తిట్టడం ప్రారంభించేదే; మరీ యింత చలిగా వుండడమంత బుద్ధి తక్కువ లేదని మొదలెట్టేదే వ్యవస్యాసేం:

ఎలీనా ఐతే, తలుపు మెల్లగా మూసి, తలుపు దగ్గరున్న పీచు మీదీ పాటికి కాళ్ళు తుడుచుకుంటుండేది. వార్యా ఐతే పావురంలా పరుగెత్తుకొచ్చేశేది. తావ్‌రోవ్ కాదుగద? ఇంకా ఆ ప్రశ్నకు సమాధానం చెప్పుకోగల స్థిమితం ఓల్గాకు రానేలేదు, లొగునోవ్ మాటలు విన్పించినై :

"ఇంట్లో బ్రతికున్నారా ఎవరైనా?"

"రండి!" అన్నది ఓల్గా వెంటనే.

లొగునోవ్ అంటే, మొదటినుంచీ యిష్టమే ఓల్గాకి. డెనిస్, ఎలీనా, నేత్రవైద్యుడు పిరొకోవ్ లంటే ఓల్గాకి బాగా యిష్టం. పాత స్నేహితులికి మల్లేనే చూచుకునేది వాళ్ళని. చిన్నప్పటి నుంచీ ఒకేచోట పుట్టి పెరిగిన వాళ్ళలా చూచేది.

ఒకరినొకరు పలకరించుకున్న తర్వాత, ఎలీనాతో జరిగిన సంభాషణ జ్ఞప్తికి తెచ్చుకుంది ఓల్గా; నిన్న పిరొకోవ్‌తో గూడా అదే సంభాషణ జరిగింది. తానంటేనూ, తన భర్తంటేనూ వాళ్ళందరికీ ఒకే విధమైన అభిప్రాయమూ, భావమూ వుండి వుండాలి. లొగునోవ్ ఎందుకొచ్చాడో వెంటనే అర్థమైపోయింది ఓల్గాకి.

నిన్న, నేత్రవైద్యుడు పిరొకోవ్ అన్నమాటలు: "ఓల్గా మీరు గూడా ఇవాన్ ఇవానొవిచ్‌తో బాటు తైగా ప్రాంతానికెందుకెళ్లరు? వెళ్ళండి. అక్కడ కూడా మీకు కుతూహలం రేపే విషయాలు చాలా వుంటై." ఆమాటలు ఎవరో అతి సన్నిహితులైన పెద్దవాళ్ళు చెప్పినట్టుగా చెప్పాడాయన.

"కుదరదు లెండి, అసలా సంగతి ఆలోచించను గూడా లేదు నేను" అన్నది ఓల్గా.

"ఆలోచించండి. ఆలోచించడం అవసరం" అన్నాడా యన తన సలహాని త్రోసి పుచ్చడం కూడదని నచ్చచెప్తూతు న్నట్టు; "మీరు కూడా వుంటే, ఆయన చేసేపని చాలా తేలికౌ తుంది. మీరు ప్రక్కనుంటే ఎన్ని యిబ్బందు లెదురైనా బాధ పడడాయన."

"పొరపాటు పడుతున్నారు. నేను ప్రక్కనుంటే ఆయ నకష్టాలెక్కువౌతాయి."

"అవేం మాటలండీ? మరీ యీమధ్య చూడండి ఆయ నెంత బాధపడి పోతున్నారో. క్షమించండి. నాకూ చాలా విచారంగా వుంది. ఏదో అతిస్వల్ప విషయం కోసమని మీరిద్దరూ యిలా....ఇవానెంత మంచి మనిషి! ఎంత మంచి మనిషి!...."

"అదేమీ స్వల్ప విషయం మట్టుకు కాదులెండి" అన్నది ఓల్గా. ఆగొంతులో ఆశ్చర్యమూ లేదు, కోపమూ లేదు. "ఐనా యెందుకు లెండి యిప్పుడా విషయాలన్నీ తెలుకోవడం."

పిరొకోవ్ కంటే, మరీ సూటిగా, కుండబ్రద్దల కొట్టినట్టు డిగింది ఎలీనా. "మీరేమైనా పోట్లాడుకున్నారా?" అనడిగింది; "లేదూ? ఐతే, యింకేం? కాస్త ప్రేమచూపు. ఆయనకు నువ్వంటే యెంతప్రేమో నీకూ తెలుసుగద? ఆయన రూపే మారిపోయింది. ఎప్పుడూ ఏదోవొకపనిలో మునిగుంటే, సంతో షంగా వుండొచ్చును గదా అనేమో, పాపం, రాత్రింబవళ్లు పనిజేస్తూ కూర్చుంటున్నారు. కాని ఆకళ్ళు చూశావా; ప్రాణంలేదు. రెండూ రెండు నల్లటి నూతుల్లా వున్నై."

'లొగునోవ్‌గూడా యీ సంగతే మాట్లాడ డాని కొచ్చారా?' అనుకుంది ఓల్గా; 'అందరూ ఇవాన్‌ని గురించే ఆలోచిస్తున్నారు; విచారిస్తున్నారు. నిజమే. ఆయన చాలా బాధ పడుతున్నారు, నాకూ కనబడుతూనేవుంది. ఏమిలాభం! నేను మాత్రం తక్కువ బాధపడుతున్నానా? ఆయనలో చాలా మంచిగుణాలున్నాయని నేనూ అంగీకరిస్తాను; ఆయన చేసే పని చాలా గొప్పదని నేనూ వొప్పుకుంటాను. కాని జరిగిన దానికి నేనేం చెయ్యగలను?"

"మా యిద్దరికీ ఎవరిబాధలు వారికున్నై." అన్నది. ఓల్గా, లొగునోవ్‌తో; "చూడండి ఇక్కడ కూర్చుని యిందాక ట్నుంచీ సతమత మౌతున్నాను. ఈవాక్యం అట్లా వ్రాసినా, యిట్లా వ్రాసినా, యెట్లావ్రాసినా ఒకటేగదా అనుకోవచ్చు మీరు. మరి నావుద్దేశం వేరు. నాపనంటే నాకెంతో విలువ. ఎంత బాగా వ్రాయాలా అని నాతపన. మీకేమో, యిదేదో ప్రక్కపనిలా వుంటుంది."

"అదేమిటి? మీరలా యెందు కనుకోవాలి?" అన్నాడు లొగునోవ్, "మీరుచేసేపనికి చాలా ప్రాముఖ్యంవుంది. అచ్చైన మాటంటే సజీవమైన మాటన్నమాట. ప్రతిమాటలోనూ సజీవ మైన భావమూ, ఆలోచనా వుండాలి. మన జీవితాల్లో అత్యద్భుతమైన విషయాలెన్నో వున్నై. కాకపోతే వాటి నన్నిటినీ గమనించాలంటే, శ్రద్ధాసక్తు లుండాలి. తిరిగి వాటిని నలుగురికి తెలియజెయ్యాలంటే, ఎలాచెప్పాలి, ఏరూపంలోచెప్పాలి అనేది మీరు కష్టపడి తేల్చుకోవలసిన విషయం. జర్నలిస్టులు...."

ఈమధ్యేలా, ఓల్గాతో మాట్లాడిన వాళ్ళెవరూ లేరు. ఓల్గాలో వుత్సాహం వురకలు వేసింది. తానిప్పుడేం జేస్తోందీ,.

భవిష్యత్తులో ఏంచెయ్యదలచుకుంది. అంతా హుషారుగా చెప్పేశింది ఓల్గా. ఆవిడ వుత్సాహాన్ని చూస్తే లొగునోవ్‌కి ఆశ్చర్యం వేసింది; గౌరవం కలిగింది.

"మీతోవొకమాటఅనాలనిపిస్తోంది, ఓల్గాపావ్‌లోవ్నా!" అన్నాడు లొగునోవ్; "జిల్లాపార్టీకమిటీ కార్యదర్శిగాకాదు నేను చెప్పదల్చుకున్నది; ఒక స్నేహితుడిలా మాట్లాడదలచుకున్నాను. నిజం చెప్పాలంటే, నాకీ వైవాహిక జీవితంలో అనుభవంయేమీలేదు. అందుకని మరీ యిదిగావుంది నాకు. మీకూ, ఇవాన్ ఇవానోవిచ్‌కీ భేదాభిప్రాయాలెక్కడ ఎందుకు వచ్చాయో తెలుసుకుందామని."

ఒక్క నిమిషంసే పూరుకుంది ఓల్గా.

"నాకే తెలియదు సరిగ్గా." అంది చివరికి; "మాయిద్దరి మధ్యా కలతలేమీ వున్నట్టులేవు. మేం యిద్దరమూ ఎవరిదారిన వాళ్ళం అభివృద్ధయ్యామేమోనని నా అనుమానం. ఇవాన్ ఇవానొవిచ్ మంచి దయార్ద్రహృదయుడే. కాని, ఎందుకనో నాకు సంబంధించినంతవరకు, ఆయన ప్రవర్తనదొకవింతగా వుంటుంది. చిన్నపిల్లని చూచినట్టు చూస్తారు నన్ను. చిన్నపిల్లని సముదాయించినట్టు సముదాయించాలని చూస్తారు. నా అజాగ్రత్తవల్లనే, నేనొక నూతిలో పడిపోయాననుకోండి.... ఆయన చూచిగూడా నన్ను బయటికి లాగాలని ప్రయత్నించరనుకోండి .... నాఅంతట నేను బయటికే ఎక్కిరాగల స్థోమత లేదనుకోండి అప్పుడెలావుంటాయి నాభావాలు .... అలావుంది యిప్పుడు నాపరిస్థితి...."

# 20

పెనం పొయ్యిమీద పెట్టి నుంచునుంది ఓల్గా. పెనం వేడెక్కుతోంది. ప్రక్కనే పళ్లెంలో, తయారైన కేకులు కుప్పలు కుప్పలుగా వున్నై.

"అబ్బబ్బ, ఎవరు కనిపెట్టారోగాని ఈ కేకులు చెయ్యడం; చాలా కష్టం" అంది వార్యా; "కాస్త కత్తి జారిందంటే చాలు, కేకంతా పిండిపిండై పోతుంది. ఎట్లాగైతేం కేకుచెయ్యడం మట్టుకు చేతనైంది."

షాపు దగ్గర్నుంచీ తనవెంటబడొచ్చిన కుక్క నెళ్ళగొట్టడంలో లీనమైవుంది ఎలీనా; అందుకని వార్యామాటలకి వెంటనే జవాబు చెప్పలేదు.

"ఛా! ఫో అవతలకి! ఊరినిండా కుక్కలే, వెధవకుక్కలు సంచిలోవున్న చేపని చూచి పరుగెత్తుకొచ్చింది వెంటబడి." అంటూ కుక్కని వెళ్ళగొట్టి, దభీమని తలుపేసేశింది ఎలీనా; "భోజనాలైం తర్వాత ఇవాన్ ఇవానోవిచ్ కి యింకా కొన్ని పిండివంటలు చెయ్యాలి" అంది, తలకు కట్టుకున్న తెల్లరుమాలు విప్పుతూ; "దూర ప్రయాణానికి బాగా పనికొస్తై."

"నేనూ సాయంజేస్తా మీకు" అంది వార్యా. నిట్టూరుస్తూ.

ఇంకో పదినిమిషాలలాగే కేకులుచేస్తూ, మాట్లాడకుండా నిలబడుంది పొయ్యిదగ్గర. పొయ్యివేడికి చేతులు గులాబీల్లా ఎర్రవారినై.

చివరికేకుగూడా పెనంమీదినుంచి తీసేశిం తర్వాత, ఎలీనావైపుకు తిరిగింది వార్యా.

"నన్నుగూడా తనతోపాటు తీసుకెళ్ళమంటే తీసు కెళ్ళరు. ఎందుకని ? పదిచెయ్యమంటే అదిచేస్తాను! నేను చూచినంత శ్రద్ధగా యింకెవ్వరూ చూడలేరాయన్ని!" అంది, విసుగ్గా చేతిలో కత్తి అటూయిటూ తిప్పుతూ.

ఎలీనా విస్తుపోయింది. "వార్యా! నీకు మరీ మతిపో తున్నట్లుంది. ఇంతచిన్నపిల్లవి అమగవాళ్ళలోబడి ఎట్లాపోతావ్వొంటరిగా ?"

"ఏః? ఎందుకెళ్ళగూడదు? మా ఇవెంక్ జాతి స్త్రీల కన్నీ తెలుసు యీ ప్రయాణం విషయాలు. మాకు డేరా లెయ్యడం తెలుసు, బళ్ళకి దుప్పులెన్నెలా కట్టాలో తెలుసు, మందలో కెలా తరమాలో తెలుసు. చిన్నప్పుడీ పనులన్నీ చేసిందాన్నే నేను. లేళ్ళనెలా చంపాలోగూడా తెలుసునాకు; ఇవన్నీ మీకు విడ్డూరంగా కనిపించొచ్చు. కాని లతులసార్లు చేశానీ పనులన్నీ."

"బాగానేవుంది!" అంది ఎలీనా, "ఇంత పసిదానివిః అంత కటికీ పనులెందుకు చెయ్యాలిశొచ్చింది?"

"అందులో సిగ్గుపడవలసిందేముంది? మనం కాపాడ వలసింది జంతువుల్నిగాదు; మనుషుల్ని. నేను చెప్పిన వన్నీ చెయ్యలేననా మీ వుద్దేశం. ఊరికే గొప్పలు చెప్పుకుంటున్నా ననా?" అంటూ గుమ్మం దగ్గరకి పరుగెత్తింది వార్యా; "చూడండి. మీకళ్ళముందే ఆకుక్కని కత్తితో ఏంజేస్తానో!"

"వార్యా! పిచ్చెక్కిందానీకేమైనా? ఇవాన్ ఇవానొవిచ్ చూస్తే ఏమనుకుంటారు? కటికిదానివనుకుంటారు. పిల్ల రాతుసి వంటారు!" అంటూ కోప్పడింది ఎలీనా. అప్పటి కప్పు

టికే తలుపుతీసి కుక్కదగ్గర కెళ్ళిపోయింది వార్యా, కత్తి చేత్తో బట్టుకుని.

వార్యా కోపంగాచూచింది కుక్కవంక. అది ఎస్కిమో కుక్క. పెద్దది కాళ్ళు రెండూ ఎడంగాపెట్టి, తోకాడిస్తూ నుంచునుంది. ఆకుక్క కన్నుల్లో స్నేహభావం తొణికిస లాడు తోంది. అడవి వేటగాళ్ళల్లో స్నేహభావం తొణికిస లాడు తోంది. అడవి వేటగాళ్ళవెంట వుంటాయలాంటి కుక్కలు; వాళ్ళకి చాలా చేదోడుగా వుంటాయి. అప్పుడప్పుడు స్లెడ్జిబళ్లకి గూడా కడతారు వాటిని. వాటి నెవరూ చంపరు. చంపడం క్రూరమనిగూడా అంటారు. నిజంగానే, ఇప్పుడు ఇవాన్ ఇవానోవిచ్ చూస్తే ఏమంటాడు ? తన చేతులవంక చూచుకుంది వార్యా. ఆకత్తి దూరంగా పారేయకుండానే వున్నదున్నట్టు గభాలున రెండుచేతుల్లోనూ కుక్కమెడ గట్టిగా వాటేసుకుని, మెడమీదున్న బొచ్చులో మొహంపెట్టి, జలజలా కన్నీరు కార్చింది వార్యా.

అప్పటి కర్థమైంది ఎలీనాకీ, వార్యా మనసులో ఎంత బాధపడుతున్నదీనీ; "ఊరుకో, పిచ్చిపిల్ల! ఊరుకోమ్మా!" అంది.

"ఓల్గం పావ్లోవ్నా గూడా వస్తోందా?" అనడిగింది వార్యా, భోజనాల బల్లచూస్తూ.

"లేదు. వొంట్లో బావుండలేదట."

"ఐనా, వెళ్ళిపోతున్నారా ఇవాన్?" అనడిగింది, లేని ఆశలు కల్పించుకుంటూ.

"వెళ్తారా. ఆయనెళ్ళిపోతే, తొందరగా కోలుకుంటుం దావిడ." అన్నది ఎలీనా, మూతి బిగించి, భోజనాలుంచే పళ్ళాల దగ్గరకెళ్తూ.

"నాకివ్వండి. వాళ్ళిద్దరి భోజనాలూ వాళ్ళగదికి తీసికెళ్లి యిచ్చొస్తాను." అని పళ్లేలు తీసుకుంది వార్యా.

"తలమీద రుమాలు కప్పుకోమ్మా" అంది ఎలీనా. వార్యా ప్రవర్తనా అదీచూస్తే, చెయ్యగూడని పనేమైనా చేశేస్తుందేమోననిపించింది. వెనక్కితిరిగి చూచేప్పటికి వార్యా వెళ్ళిపోయింది, రుమాలు కప్పుకో కుండానే!

గబగబా మెట్లెక్కి హాలులో కెళ్ళిపోయింది వార్యా.

"భోజనం తీసుకొన్నాను మీకు" అని కేకేశింది.

మొదట్లో గుండె ఆగినంత పనైంది వార్యాకి; తర్వాత మళ్ళీ పిచ్చిగా కొట్టుకోవడం మొదలెట్టింది. ఇవాన్ ఇవానొవిచ్ యింట్లో వుండడని తెలుసు వార్యాకి. హాస్పిటల్లోనే వుంటాడు. యీవేళప్పుడు. కాని, ఓల్గా, ఇవాన్ భార్య, ఆయనంత యెక్కువగా ప్రేమించేభార్య.........ఇవాన్ ప్రేమ నంత ఎక్కువగా ఎలా పొందగలిగిందో ఓల్గా? ఓల్గా ఎదురుగా వచ్చింది. తినేస్తున్నట్టు చూశిందావిడవంక వార్యా. ఓల్గా జుత్తంత మంచిదా? తన నల్లటి కురులకంటే బావుంటుందా? మరా తెల్లటి బుగ్గలు? ఓల్గా కనులు చాలా విశాలంగా వుంటై; ఇప్పుడు మెరిసిపోతున్నై. ఆకప్పుకున్న దుప్పటి మూలాన్నో యేమో బాగా పొడుగ్గావున్నట్టుగూడా వుంది.

"ఎందుకూ మీకీ కష్టం." అన్నది ఓల్గా నెమ్మదిగా; "నాఆరోగ్యం మరీ అంత చెడలేదు. ఏదో వొకటి నేనే వొండు కునేదాన్ని."

"ఏం ఫర్వాలేదులెండి. భోజనం ఆరుగురికి తయారు జేసినా, ఎనిమిదిమందికి తయారుచేసినా వొకటే; అదనంగా మేమేమీ కష్టపడలేదులెండి."

పళ్ళాలు తీసుకుని వంటింట్లో కెళ్ళింది ఓల్గా; వార్యాని హాలులోనే వదలి. వార్యాచుట్టూ చూశింది; పుస్తకాలు, కాగితాలు, నోటుపుస్తకాలు వున్నై టేబుల్‌మీద పత్రికల్లో పడిన ఓల్గా వ్యాసాలు వార్యా చదివింది. బాగానేవున్నై. ఐతే. యిక్కడన్నమాట ఆవిడవన్నీ రాసుకునేది! అంతా బాగానే వుందికాని, మరి ఇవాన్ ఇవానొవిచ్‌కి యీవిడ మరీయింత దూరం యెందుకు ఐపోతున్నట్టు?

"మిమ్మల్ని చూస్తుంటే విచారం వేస్తోందినాకు." అంది వార్యా; బిర్రబిగతీసిన తీగలాగా మోగింం దావిడగొంతు.

ఆమాటలలా సవాలులా ధ్వనించడానికి కారణం మనసులోవున్న ఆందోళనే నేమో, చెప్పడం కష్టం.

ఖాళీ పళ్ళాలు చేత్తో పట్టుకుని, సరిగ్గా అప్పుడే హాలులో కొచ్చింది ఓల్గా; ఆమాటలు విని వులిక్కిపడింది; కనులు మరింత పెద్దవైనై. ఒక్కనిమిషం యిద్దరూ ఒకళ్ళనొకళ్ళు చూసుకుంటూ అలాగే నిలబడి పోయారు మాట్లాడకుండా.

వార్యా యింకా చాలాచాలా అనాలనుకుంది :

'మీరలా ఇవాన్‌ఇవానోవిచ్‌ని అంతబాధపెట్టడం దేనికి? ఆయన్ని బాధపెట్టి మీరుమాత్రం బావుకునే దేమిటి, ఆయన్తో పాటు మీరూ బాధపడడం తప్ప?' కాని ధైర్యంలేదు; ఊపిరి పీల్చడమే కష్టంగావుంది. 'పెళ్లిచేసుకున్న తర్వాత ఇకేమీ చెయ్యకుండా, కూర్చుని, గ్రామఫోన్ రికార్డులు పెట్టుకో

వచ్చునని అన్నాడే, అలాంటి వాణ్ణయితే ఎవళ్ళయినా తిరస్కరించొచ్చును. కాని, ఈ ఇవాన్ ఇవానోవిచ్‌ని కాదనడమా? అతనికీ, ఈయనకీ హస్తిమశకాంతరం! తన కోర్సులో చదువుకునే ఆడపిల్లలు అభివృద్ధి చెందడమంటే ఇవానొవిచ్ కెంతో యిష్టం. కొత్తగా వచ్చిన డాక్టర్లకిగూడా, బాగా బాధ్యతాయుతమైన ఆపరేషన్లప్పగించి, శిక్షణ నిస్తాడు, ఆవిధంగా వాళ్ల అనుభవాన్ని పెంపొందించి అభివృద్ధి చెయ్యాలని. ఆయన నవ్వుతూవుంటే ఎంతో ఆనందంగా వుంటుంది; కోప్పడితే గుండెలు కొట్టుకుంటై! కాని, యీమధ్య వూరికే విసుక్కుంటున్నాడు; లేకపోతే అసలు పెదవేవిప్పకుండా వూరుకుంటున్నాడు.

"ఎందుకూ? నేనంటే అంతవిచారపడడం దేనికీ ?" అనడిగింది ఓల్గా.

వార్యా వెంటనే జవాబు చెప్పలేదు; చేయిచాచి, తన కందిస్తూన్న ఖాళీ పళ్ళాల్ని చూడలేదు.

"నా విచారం యేవొక్కరినో చూచికాదు. మీ యిద్దరంటేనూనూ.... ఆయనలా వున్నప్పుడు, అంతదూరం ప్రయాణంమీద, వొంటరిగా యెలా వెళ్ళనిస్తున్నారు మీరు ? ఆయనంత కోపానికి అర్హుడు కాదు; అలాంటి మనిషేమీ కాదాయన."

"ఎలాంటి మనిషి ?" అనడిగింది ఓల్గా, వార్యావంక విచారంగా చూస్తూ.

"ఆయన....చాలా....చాలా మంచివారు." అంటూ గొణిగింది వార్యా, ప్రేమగా.

"మీకాయనంటే యిష్టమా ?"

"ఓ. చాలా ... చాలా యిష్టం" అంది వార్యా; ఆయ నెంత మంచివాడో తనకే తెలుసును మరి!

ఒక్క క్షణంసేపు ఓల్గా కసూయ వేసినట్లైంది. కాని మరుక్షణంలోనే మారిపోయిందా భావం.

"నిజమే మీరనేది నిజమే. ఆయన చాలా మంచివారు; నిజమే, కాని ఏం చెయ్యగలం? దురదృష్టవశాత్తూ మేం యిద్దరం వొకరి నొకరు సరిగ్గా అర్థం చేసుకోలేక పోతున్నాం; అందుకనే యీ భేదాభిప్రాయాలు."

# 21

"నేను పుట్టింది ఓలెక్మాలో. విప్లవం మొదలైంది గూడా ఆ యేడే. అంతర్యుద్ధం తర్వాత మాకుటుంబం వలసొచ్చింది. అప్పుడు నేనూ, మా అక్కచెల్లెళ్లూ, అదిగో, అంతంతుండే వాళ్ళం" అని చెప్పింది వార్యా, నటాషాతో పాటు ఆడు కుంటున్న పిల్లలవంక చూపించి.

పిల్లలందరూ రగ్గులమీద కూర్చుని ఆటలాడుకుంటు న్నారు. నటాషా బొమ్మలకి దుస్తులువేస్తూ గుసగుసలాడు కుంటున్నారు.

"ఒంటరిగావుంటే మనదుంప తెంపేస్తుందా అది; ఆ పిల్ల లొస్తే చాలు, తన ఆటలేమో, తనేమో, మన సంగతే పట్టించు కోదు నటాషా" అంది ఎలీనా, కూతురువంక చూస్తూ; "నర్సరీ స్కూల్లో చిన్నప్పటినుంచీ, యీ పిల్లలకి సమిష్టి జీవితం అల వాటు చేస్తారు. చక్కని సాంఘిక ప్రవర్తన గూడా నేర్పు

తారు. "అంటూ నవ్వి, మళ్లీ తన వంటపనిలో తాను మునిగి పోయింది.

అందులో కాస్త పెద్దపెద్దవాళ్ళంతా టేబుల్ చుట్టూ కూర్చునున్నారు వంటకి సాయం జేస్తూ.

ఓల్గాని చూసెళ్దామని వచ్చిన పావాగూడా అక్కడే వుంది. వంటపని కావిడా సాయంజేస్తోంది. మొహం నిండా పిండిమరకలు. చేతులు చేసే పనికంటే, నోరు చేసే పనే ఎక్కువగా వుంది.

"ఏమో బాబు, నా పిల్లల్ని మట్టుకు చచ్చినా, నర్సరీ స్కూలికి పంపను." అంది పావా; "మంచి ప్రవర్తనా అదీ నేర్చుకోవాలంటే, యింకా బోలెడంత టైముంది! ఇప్పట్నుంచీ వాళ్ళ నా కటకటాల్లో పెట్టడం ఎందుకు. ఈ చిన్నతనం నాలుగురోజులన్నా, వాళ్ళిష్టం వచ్చినట్టు తిరగ నివ్వడం మంచిది. బ్రతికినంతకాలం గుర్తుంచుకుంటారు మా అమ్మ చిన్నప్పుడు ఏచింతా చీకూ లేకుండా తిరగనిచ్చిందని. ఐనా ఇప్పుడు వాళ్ళ సంగతులన్నీ వాళ్ళమ్మమ్మే చూచుకుంటుంది. అప్పుడే మా చంటిదాన్ని గూడా ఆవిడ కప్పగించేశాను. ఇల్లే మంచిది పిల్లలకి, చక్కగా!"

ఎందుకనోగాని, వార్యాకి చాలా వుత్సాహంగా వుంది. "నా చిన్నప్పుడు మా బ్రతుకు చాలా కష్టంగా వుండేది. మేం చాలా బీద వాళ్ళం అప్పుడు" అనంది వార్యా; "ఓలెక్మాలో మానాయన కప్పుడు ఆరావులు మట్టుకుండేవి."

"ఆరావులే!" అంది ఎలీనా, ఆశ్చర్యంగా.

ఎంతసేపు మాట్లాడమన్నా, విసుగులేకుండా మాట్లాడేశేట్టుంది వార్యా.

"ఆవుల మందలకిమందలుండవలసిన వాళ్లకి ఆరావ్వు లుంటే మాత్రం ఏమూలకొస్తాయ్ ? రెండుసేర్ల పాలిచ్చే ప్పటికి గగనమై పోయేది. అందుట్లో యకూత్‌ల ఆహారం గూడా అంతా పాలమయం. మాకుటుంబంలో ఒకళ్ళ తర్వా తొకళ్లం అంతా ఆడపిల్లలం పుట్టుకొచ్చాం. మొత్తం ఐదు గురం. మానాన్నకదీ దురదృష్టమే ఐపోయింది. మగపిల్లడు పుడితే, ఎంతోకొంతపొలం యిచ్చేవారు గ్రాంటుగా. ఆడపిల్లలు పుడితే అదేమీలేదు. అంటే దెబ్బలుతప్ప యింకేమీ దొరికేయి గాదు ఆడపిల్లలికి. ఆడదానికి దెబ్బల్తో తప్ప బుద్ధి చెప్పలేం అని యకూత్ల నమ్మకం. చిన్నప్పుడు తల్లిదండ్రులు కొడ్తారు. పెద్దదై పెళ్లైంతర్వాత, భర్తకొట్టే దెబ్బలకిక అంతే వుండదు. తన బీదరికం మీద కోపం వచ్చినప్పుడూ, ఆవులుపోయినప్పుడూ పైవాళ్లెవరైనా తనని కోప్పడినప్పుడూ,...ఒకప్పు డనేముంది, ఎప్పుడైనా సరే, ఎవరిమీద ఎందుకు కోపం వచ్చినాసరే, వచ్చి భార్యని కొట్టి ఆకోపం అంతా తీర్చుకోవడం పరిపాటి. ఇంకొక గమ్మత్తుంది. యకూత్‌లసలు అడవిజాతికింద లెఖ. కాని యీ వుత్తర ప్రాంతానికొచ్చింతర్వాత వాళ్లు ఎక్కడో వొకచోట స్థిరపడి పోవలశొచ్చింది. శీతాకాలం అంటే ఎనిమిది నెలలు. థెర్మామీటరు సున్నాకింద అరవై డిగ్రీలు చూపుతుంది. గుర్రాలకి బాగా వూలు పట్టేది. వాటిష్టం వచ్చినట్లల్లా మైదా నాల్లో తిరిగి కొవ్వెక్కేయవి. ఆవుల్ని మట్టుకు పాకల్లోనే కట్టేసి, ఎండు గడ్డెయ్యాలి. అందుకని వేసవి కాలమంతా ఆ ఎండుగడ్డిని పోగుచెయ్యడంతోనే సరిపోయేది. బాగా పెద్ద పెద్ద ఆవుల మందలున్నవాళ్ళు—వాళ్లని 'తయోన్' అంటారు—

బంగారంలాంటి భూమిచూచి ఆక్రమించేసే వాళ్ళు. ఆ భూములకోసం పెద్దపెద్ద పోట్లాటలు...."

"ఓహో! వర్గకలహాలన్నమాట!" అంది పావా.

"ఒకసారి మానాన్నకీ, ఒక పెద్ద తయోన్‌కీ పోట్లాటొచ్చింది. ఉన్నచోటి నుంచి పారిపోవలశొచ్చింది మేం. అక్కణ్ణుంచి ఇందిగిర్కాకు బయల్దేరాం. కార్మిక సంఘాలుగాని, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలుగాని లేవప్పుడు. మానాన్న ఎవరో ఇవెంక్‌ల దగ్గర లేళ్లని కాయడానికి నౌకరుగా కుదిరాడు. తర్వాతా టండ్రాలోనే చనిపోయాడు. ఒక హాస్టలు స్కూలోచ్చేదాకా మేమూ వాళ్ళదగ్గరా, వీళ్ళదగ్గరా నౌకరీ చేస్తూ తిరిగాం. మాఅమ్మ, పాపం, క్షయవ్యాధితో చనిపోయింది. చనిపోయేదాకా, ఎప్పుడూ ఆ ఓలెక్మానే తలచుకుని బాధపడుతుండేది మాఅమ్మ." వార్యా కంఠం గద్గదమైపోయింది; ఐనా, తీవ్రమైన వుద్వేగంతో మాట్లాడడం మొదలెట్టింది: "ఓలెక్మా! ఎంతచక్కని ప్రదేశం! ఆపేరు తలచుకుంటేనే చాలు, సంతోషం వుప్పొంగుతుంది. ఓలెక్మాలో పర్వతాలూ, యిక్కడి పర్వతాల్లాగానే వుంటాయి కాని ఆపర్వతాలపైన పచ్చిక దుప్పట్లు చక్కని అడవులు. మేమూ అడవుల పంచనే వుండేవాళ్ళం. బాగా మబ్బులు పట్టిన రోజున గూడా సూర్యుడు వెలుగుతూన్నట్టే వుండేది. ఆచెట్ల మొదళ్ళంత బంగారపు రంగుగా వుండేవి ఇక పూల సంగతి చెప్పే పనేలేదు! మాకప్పుడాటవస్తువులంటూ యేమీ వుండేవి కాదు; అందుచేత మా ఆటలన్నీ పూలతోనే. శీతకాలంలో, ప్రొద్దుగూకులూ యిళ్ళల్లోనే వుండవలశొచ్చేది. మేముండే గదికీ, పశువుల పాకకీ మధ్యవున్న తలుపు తెరచి వుంచేవాళ్ళం; పశువుల శరీరాల్నుంచి బయటికొచ్చే వెచ్చదనం

మాక్కూడా తగులుతుంది గదా అని. అప్పుడప్పుడలు మా గదుల్లోకొచ్చి అటూ యిటూ తిరిగేవి. గదంతా చీకటి. మరో వైపున కడుపులో ఆకలి. ఇక భయ మొస్తుందంటే, ఎందుకు రాదు ?" చేతులు రెండూ వొడిలో పెట్టుకుంది వార్యా; పాత కాలపు స్మృతుల బరువుతో కనులు బరువెక్కినట్టున్నై: "ఆ జీవితాన్ని తలచుకుంటే చాలు, భయం వేస్తుంది! దేశం బీదదేశమా అంటే కాదు, చలి వుంటే ఫర్వాలేదు; చలికి అలవాటు పడిపోవచ్చును. అందులోనూ మేము కష్టపడి పనిజేసేవాళ్ళం; ఏ కొత్త విషయమన్నా నేర్చుకోవాలనే ఆసక్తి కలవాళ్ళం."

"నువ్వు చాలా అదృష్టవంతురాలివి. ఆపాడు బ్రతుకులోంచి బయటబడ్డావు. చదువుకున్న వాళ్ళ మధ్య సహవాసంగా, సౌఖ్యంగా బ్రదుకుతున్నందుకు ధన్యవాదాలర్పించాలి నువ్వు." అంది పావా, ఆ విడకామేలంతా తానే చేసినట్టు.

"నేను బయట పడ్డందుకు కాదు; నాతోటి ప్రజలంతా బీదరికంలోంచి, అపరిశుభ్రంలోంచి బయట పడగలిగినందుకర్పించాలి ఆ అభివందనాలూ, ధన్యవాదాలూనూ" అంది వార్యా, గట్టిగా; "పూర్వం ఎవరో కొద్దిమంది డబ్బున్న వాళ్లు మాత్రం రష్యన్లతో సంబంధాలు పెట్టుకోగలిగేవారు; వాళ్లు మట్టుకే అనుభవించగలిగేవారు ఆ రష్యన్ సంస్కృతీ వైభవాన్నంతా. అప్పటికీ, సంకుచిత బుద్ధివున్న జాతీయ వాదులు వాళ్ళనికించ పరుస్తూనే వుండేవారు, జాతీయాభిమానం లేకుండా రష్యన్లని అనుకరిస్తున్నారనీ, రష్యన్ పద్ధతుల్నలవర్చుకుని తమ ప్రజల్ని అవమానించుతున్నారనీనీ. నాకా జాతీయ వాదులంటే అసహ్యం!" అన్నది వార్యా బల్లమీద గట్టిగా గుద్దుతూ; కోపంతో కనులు కుంచించింది. "వాళ్ళంటే

పరమసహ్యాం నాకు! వాళ్లు మా ప్రజలకి చేసిందేమీ లేదు; మా ప్రజల్లో మూడోవంతుకు పైగా క్షయతో బాధపడుతుండేవారు పసిపిల్లలు సగానికి సగం చనిపోతుండేవారు. ఇప్పుడా పాత రోజులికి పరుగెత్తుతారట మళ్ళీనీ! విప్లవం మొక్కగా వుండ గానే త్రుంచివెయ్యాలని ఆ జాతీయ వాదులు చేసిన ప్రయ త్నాన్ని గురించాలోచించినప్పుడల్లా ఏడుపొస్తుంది నాకు !"

వార్యా మాటలు వింటూ, మిగతా విషయాలన్నీ మరచిపోయారు చుట్టూవున్నవాళ్ళు. ఆవిడవంకే చూస్తూ కూర్చున్నారు కదలకుండా మెదలకుండా. ఇంతలో వార్యా ముహం మీద చిరునవ్వు చిందులాడింది :

"ఇకమేమిప్పుడు ఒక్కడుకూ్కడా వెనక్కి వెయ్యం. మేము సాధించిందీ, జయించిందీ మా నుంచి యింకెవ్వరూ లాక్కోలేరు. ప్రజల దగ్గర్నుంచి జీవితాన్ని లాగెయ్యాలని ఎవరైనా అనుకుంటే అది వొట్టి భ్రమ. ఎవరివల్లా కాదావని!"

# 22

'సరే, వెళ్తున్నాను. గుండెమీదింత బరువు పెట్టుకుని యిక్కణ్ణుంచి వెళ్ళిపోవడం సులభంగాదు....చాలా కష్టం. కాని యికిక్కడ వుండలేను. విషయాలన్నీ యింకొకసారి మననం చేసుకునేందుకూ, తన భావాల్నన్నిటినీ తిరిగి విమర్శిం చుకునేందుకూ ఓల్గాకి అవకాశం యివ్వాలి.' ఈ చివరి ఆలోచ నతో ఇవాన్ మరీ సిగ్గుపడిపోయాడు: 'ఓరి పిచ్చి వెధవా! నిన్నెట్లా గొట్లా వదిలించుకోవాలని శాయశక్తులా ప్రయత్ని స్తోంది ఓల్గా. నువ్వేమో ఆవిణ్ణే పట్టుకుని ప్రాకులాడాలని

చూస్తున్నావ్. సిగ్గు లేకపోతే సరి. ఆవిడ ముహంలోని ప్రీతి కదలికా "ఫో, దూరంగా వెళ్ళిఫో" అంటోంది. నువ్వేమో, నువ్వు లేకపోతే ఆవిడ బాధ పడిపోతుందేమోననుకుంటున్నావ్! అసలింతకీ కుండపగలగొట్టినట్లన్నీ మాట్లాడేద్దామంటే ఆ ధైర్యం లేదు నీకు! ఛ. ఛ. నా జన్మలో భయపడే రగను నేను. ఏదన్నా భయపడి ఎరగను! ఇప్పుడీచివరి ఆశ కాస్తా పోతుందేమోనని భయపడి పోతున్నాను!'

ఆ కంపనంలో, చేతిలో వున్న దంతపు చాకును విరగ్గొట్టాడు ఇవాన్. అది కాగితాలు కోసుకునేందు కుపయోగించే చాకు; పైన చక్కని బొమ్మలు గూడా చెక్కున్నై.

'ఇదన్నమాట నీచేతి చలవ' అనుకున్నాడు ఆ చాకు మీద చెక్కిన బొమ్మల వంక చూస్తూ; 'ఒక్క చిన్న గుడిసె, కప్పుకన్నంలోంచి పైకిలేచే పొగ; దుప్పి; ఉత్తర ప్రాంత భూశకలం: పర్వత పంక్తులు, సూర్యుడు, ఆకులులేని చెట్లు. చక్కని చేతిపని.' విరిగిన ముక్కలు రెండూ టేబుల్ మీద పెట్టి నిట్టూర్చాడు. 'నువ్వెంత ప్రయత్నించినా యికవి అతుక్కోవు; అలాగే వుంటాయి' అనుకున్నాడు.

కిటికీదగ్గర కెళ్ళాడు. కిటికీ అద్దంమీద పేరుకున్న మంచు తుడిచి బయటికి చూశాడు. ఇంటి కప్పుల మీంచి తెల్లటి పొగ లేచి లోయకి లోయనంతా కమ్మేస్తోంది. దూరాన సూర్యాస్తమయపు కాంతి. ఇంటిముందు స్లెడ్జి బళ్ళమీద తన సామానంతా ఎక్కిస్తున్నారు యకూత్‌లు; వాళ్ళ మాటలు వినవస్తున్నై. పైన పల్చని మేఘాలు కమ్ముకుంటున్నై.

'బాగా చలిగా వుంటుంది. రాత్రికింకా ఎక్కువౌతుంది. ఇప్పటికే సున్నాకింద అరవై డిగ్రీలుంది.'

నున్నటి లేడి చర్మంతో చేసిన పెద్ద మేజోళ్ళ తాళ్ళు తీసి బెల్టుకి తగిలించుకున్నాడు. ఇకలాటి మేజోళ్ళరగడం గాని చిరగడంగాని జరగదు. పైనా లోపలా గూడా వున్నిపొర. లోపల సీమ కుందేటిచర్మంతో చేసిన చిన్నచిన్న మేజోళ్ళూ. తేలిగ్గా వుంటాయి. వెచ్చగా, సుఖంగా వుంటాయి.

ఈ పెద్దపెద్ద మేజోళ్ళూ" లేడి తోలుకోటూ, చెవికి దొప్పలున్న కుందేలుటోపీ ... అన్నీ యకూత్ లే తీసుకొచ్చారు డాక్టర్ గారి కోసమని. అంతా సరిగ్గా ఆయన ఆడికి సరిపోయేట్టు కుట్టుకొచ్చారు.

'నేనంటే ఎంత ప్రేమ! ఎంతశ్రద్ధ!' అనుకున్నాడు ఇవాన్. ఇంతలో, ఎవరో ఆడవాళ్ళు మాట్లాడు తున్నట్లుండి, వెనక్కి తిరిగి చూశాడు.

పిండివంటలన్నీ పెద్ద సంచీలో పెట్టుకుని, రెండు చేతుల్తోనూ ఎత్తి పట్టుకొస్తూంది ఎలీనా; ఆవిడ ముహం చూస్తే చాలా విచారంగా వున్నట్టుంది. వెనకే ఓల్గా, పొట్లాలన్నీ పెట్టిన సంచీ పుచ్చుకునొస్తోంది.

తీరా ప్రయాణమై బయలుదేర బోయేసరికి, ఓల్గా అంటే తనకున్న ప్రేమ ఎంత గాఢమైందో మరీ స్పష్టంగా తెలిశొచ్చింది ఇవాన్ కి. ఇవ్వాళ పొద్దుట్నుంచీ తిరిగింది తిరిగి నట్టే వుంటోంది, ప్రయాణాని కన్నీ సిద్ధం చేస్తూ. ఎప్పుడూ ఏదో వొక పనిమీద ఇటు డెనిస్ యింటికో, అటు బజారుకో తిరుగుతూనే వుంది. ఈ చివరి కొద్దినిమిషాలూ, ఎలాగో ఒకలా తనకు దగ్గరగా లేకుండా, తనతో వొంటరిగా వుండే అవకాశం లేకుండా వుండాలని కాదుగదా ఓల్గా యిట్లా హడావిడిగా తిరుగు తున్నది .... వున్నట్టుండి మంచు కొరుకుడుకు

మందు తేవాలంటూ బజారులో మందుల షాపుకి పరుగెత్తు తుంది; అందుకోసమని మంచు బాతు కొవ్వు సంపాయించి ఎలీనా పొట్లంకట్టి జాగ్రత్తపరచిందని తెలిసికూడా. ఏదో వొక వంక; ఇంటిదగ్గరుండకుండా వుంటే చాలు!

"కిట్ బాగ్*! మీరు కిట్ బాగ్ మరచిపోయారు! పట్టుకొస్తున్నా వుండండి." అంటూ కేకేసింది వార్యా, డెనిస్ యింట్లోంచి.

తనవెంట రావాలని ఎంత ప్రాధేయపడి అడిగింది వార్యా! ఆ సంగతి జ్ఞప్తి కొచ్చింది ఇవాన్కి; తనవెంతో ప్రేమిస్తున్నానని మనసు విప్పి చెప్పింది ఓల్గా. వార్యా లాగుంటే; వార్యా ప్రేమించినంతగా ఓల్గా తనని ప్రేమిస్తే ఎంత బావుండును!

లొగునోవ్, డెనిస్ లిద్దరూ వచ్చారు, తలుపు గూడా తట్టకుండా. తర్వాత నేత్రవైద్యుడు, సెర్గుతోవ్, మొదలైన డాక్టర్లంతా వచ్చేశారు. ఇంటినిండా మనుషులు కిటకిట లాడు తున్నారు. కాస్సేపటికి మహిళాసంఘం వచ్చింది. అందులో పావాకూడా వుంది: ఎప్పటిలా మెరిసే కళ్లు, తెల్లని పళ్లు, కవ్వించి వదిలే చిరునవ్వూ ...

ఇవాన్ బయల్దేరబోయ్యేముందందరూ కలిసి వైన్ తాగారు. తర్వాతాయనతోపాటు అందరు వరండాలో కొచ్చారు.

'సరే, అంతా నీయిష్ట ప్రకారమే, నువ్వు కావాలను కున్నట్టే జరుగుతోంది' అనుకున్నాడు ఇవాన్ విచారంగా, ఓల్గావంక చూస్తూ.

---

*సిపాయీలు వీపుమీద వేసుకునే సంచీ

అందర్నీ తోసుకుని ముందుకొచ్చింది వార్యా; కాని పెదవి కలిపి మాటాడలేకపోయింది. ఇవాన్ కావిణ్ణి చూస్తే జాలేశింది. డెనిస్, ఎలీనా లిద్దరూ తలలువంచి నుంచునున్నారు. ఎటు చూచినా పొగ మంచుమేఘాలు. ముందు స్లెడ్జి బళ్ళకి కట్టిన దుప్పులు, వరసలు దీరి నుంచునున్నై. దూరప్రయాణం గనాని మంచి మంచి వాటిని ఏరేరి తెచ్చారు; ఊఁ అంటే చాలు; రాత్రిలోకీ, చలిలోకీ సవారీ వెయ్యడానికి సిద్ధంగా నిల బడున్నయ్యావి, శిలా ప్రతిమల్లా. ఇక ఆలస్యం అనవసరం.

"సరే, ఓల్గా, నామీద మరీ అంత కోపం అట్టే పెట్టుకో వొద్దు" అన్నాడు ఇవాన్; ఆ గొంతులో బాధనీ, ఫిర్యాదునీ, అణచుకున్న కోపాన్నీ చూచి, వణకి పోయినట్లైంది ఓల్గా.

"ఫర్వాలేదు, ఫర్వాలేదు" అంటూ గొణుక్కుని, భార్య బుగ్గలు నిమిరి, తలపైకెత్తి, వుద్వేగాన్నణచుకోలేక, గుడ్డిగా ముద్దెట్టుకున్నాడు, తర్వాత మిగతా వాళ్ళ వైపుకు తిరిగి,

"ఇకెళ్లొస్తాను!"

అన్నాడు బొంగురు గొంతుతో.

ఆ వున్ని దుస్తుల్లో అతనొక గొప్ప ఆజాను బాహువుగా కన్పించాడు. గబగబా వెళ్ళి, స్లెడ్జి బండిమీద కూర్చుని, యకూత్‌లకి సంజ్ఞ చేశాడు.

దుప్పుల కొమ్ములల్లల్లాడినై; స్లెడ్జి బళ్ళు కిర్రుమన్నై; యకూత్‌ల కొరడాలు పైకి లేచినై. కొరడా దెబ్బలు తిన్న దుప్పులు చెంగుమని దూకినై. స్లెడ్జి బళ్ళు పరుగెత్తినై; వాటి తోపాటు యకూత్‌లూ పరుగెత్తారు కొంతదూరం; తర్వాత ఎగిరి బళ్ళమీద పడ్డారు. బళ్ళు వెళ్ళిపోతున్నై. ఇవాన్ వెనక్కి

తిరిగి చూశాడు తన యింటివైపు. వరండా నిండా జనం: ఇంట్లో యెవరో చనిపోతే పలకరించడానికొచ్చినట్లున్నారు అంతా.

# 23

సందె చీకటి. నది అంతా గడ్డ కట్టుకునుంది. మంచు పొగమబ్బులు మబ్బులుగా తేలిపోతోంది నది వెంట. నదికా వొడ్డునగాని, యీ వొడ్డునగాని నరసంచారమన్నమాటలేదు. దుప్పుల గిట్టల చప్పుడూ, గిట్టలకింద నలిగే మంచుచప్పుడూ, స్లెడ్జి బండిచప్పుడూ తప్ప యింకే చప్పుడూ విన్పించడం లేదు.

స్లెడ్జి బళ్ళు రోడ్డంట బసి పరుగెత్తుతున్నై. ప్రతి స్లెడ్జికీ రెండేసి దుప్పుల్ని కట్టారు. ఒక్కొకదానికీ ఒక్కొక్క పెద్ద పలుపు కట్టి స్లెడ్జి మీద కూర్చున్న మనిషి చేత్తో పట్టుకునున్నాడు. ఆ రెంటిలో ఏవొక దుప్పి వెనకబడి పోయినా, స్లెడ్జ్ బండీ కమ్మి వచ్చి దాని వెనకాళ్ళకి కొట్టుకుంటుంది; అందుకని ఏదీ వెనక బడకుండా ముందుకే పరుగుత్తుతై. నికీతా, ఇవాన్ ఇవానొవిచ్, యింకొకిద్దరు దారి చూపే వాళ్లూ వున్నా రాదళంలో. వున్న సామానంతా నాలుగు స్లెడ్జీల మీద సర్ది కట్టేశారు. మందులు, కట్లు, ఆపరేషన్లకి కావలసిన సామాను, ఎలెక్ట్రికల్ సామాను డాక్టర్ ఇవాన్ వున్న స్లెడ్జి మీద కట్టారు; ఆ స్లెడ్జిని నికీతా నడుపుతున్నాడు. బళ్ళు ముందుకు దూసుకు పోతున్నై. ఇవాన్ గట్టిగా పట్టుకు కూర్చున్నాడు బండి మీద: శరీరం నును వెచ్చగావుంది, మనసంతా చలిచలిగా, శూన్యం శూన్యంగా వుంది. ఆలోచనల్లేవు, ఆవేగాల్లేవు, కోరికల్లేవు; ఏమీలేదు; స్లెడ్జి మీద మనిషి సగం చచ్చిన వాడిలా వున్నాడు.

అందరికంటే ముందున్నది నికీతా బండి. ముహానిక్షాడా వున్ని రుమాలు కట్టుకున్నాడు. ఆ రుమాలు సందులోంచి అటూయిటూ దారివంక చూస్తున్నాడు. ఒక్కోసారి మరీ జాగా చలేశినట్టుంటే దుప్పుల కొమ్ములక్కట్టిన పలుపులు చేత్తో పట్టుకుని, బండిమీదనుంచి క్రిందికి దూకి, బండితోపాటు పరుగెత్తుతాడు కాస్సేపు. తర్వాత మళ్ళీ, చిరుతపులి దూకి నట్టు, ఎగిరి బండిమీద కూర్చుంటాడు.

ఒకచోట దారికడ్డంగా కుందేలు కాలిగుర్తులు కన్పించినై. మంచుకుందేళ్ళు బహుగమ్మత్తుగా పరుగెత్తుతై: ముందుకాళ్ళు రెండూ కలిపి లేపి ఎగిరెగిరి దూకుతై; వెనక్కాళ్ళు రెండూ పెట్టి వూతం తీసికొని ఎగురుతై. ఇంకా స్త దూరంపోయింతర్వాత నది గట్టుమీద యిందాకటికంటె గట్టి గుర్తులు కన్పించినై. అది మంచునక్క నడచెళ్ళిన దారి. దాని తోక మంచుమీద రాసుకుంటూ పోయిన చిహ్నం గూడా కన్పించింది. అక్కడక్కడా ఎలుక బొరియల దగ్గర నిలబడి మూచూచి, మళ్ళీ కౌజు పిట్టలు కనబడితే వాటివెంటబడి, అడవి కోళ్ళు కనబడితే దొంగతనంగా వాటివెంటబడి పోయినట్టుంది; అడివికోళ్ళ కాళ్ళ గుర్తులు గూడా కన్పిస్తున్నై కాస్త అస్పష్టంగా. అక్కడక్కడా ఉడుతల కాలిగుర్తులు గూడా కన్పించినై గాని చాలా తక్కువ. ఈ ఏడీప్రాంతాల్లో వుడుతలు తక్కువే. దేవదారు విత్తులు సరిగ్గాలేక పోవడం మూలాన. చాలాభాగం దక్షిణానికి వలస పోయినై. ఆ ఉడుతలు నడచెల్లిన దారంటే సేబిల్ జంతువుగూడా వెళ్తోంది. సేబిల్ జంతువు ఉడుతల్ని పట్టి, చంపి తింటుంది. బాగా లావుగా గోధుమ రంగుగా వుంటుందది. దాని వొంటిమీద వున్ని, అది కదిలితే చాలు,

తళుక్కు తళుక్కుమని మెరిసి పోతుంది. చాలా అందమైన వున్ని అది. చాలా కాలం మన్నుతుంది గూడాను. అందుకనే ప్రపంచంలో కల్లా ఎక్కువ విలువైన ఉన్ని ఏదంటే, సేబిల్ ఉన్ని అని అంటారు.

నికీతాకేమంత వయసులేక పోయినా, యిప్పటికప్పుడే మొత్తం ఇరవైకి పైగా సేబిల్ జంతువుల్ని పట్టుకున్నాడు. తుపానొచ్చి పడిపోయిన చెట్లకింద బొరియల్లో చిక్కుకు పోయి నప్పుడు పట్టుకున్నవే అవన్నీనీ.

నికీతా కుటుంబానికి మొదట్నుంచీ లేదు ఆలమంద. వాళ్ళ తాత దగ్గర్నుంచీ బీదరికమే. వాళ్ళ తండ్రికూడా చాలాకాలం తయోన్లకింద పాలేరుపని చేశాడు; తర్వాత వేటాడడం నేర్చుకున్నాడు. కమ్యూనిస్టుపార్టీ ప్రచారకులు ఆ ప్రాంతాని కెళ్ళకపోతే, యీ పాటికింకా భుజాన తుపాకి పెట్టుకుని, అడవులంట వేటాడుతూ తిరుగుతూ వుండేవాడే నికీతా. ఆ ప్రచారకులు వెర్ఖోయాన్స్క్ అంటే ఉత్తర యకూతియాకి కేంద్రం అన్నమాట. అంతా కొండల మయం. థెర్మామీటరు సున్నాకింద డెబ్భైదాకా దిగి పోతుందక్కడ; మనుషులు బ్రదకడమే కష్టం. అలాంటి ప్రదేశాలు గూడా వదల్లేదు ప్రచారకులు. ఎంతో వుత్సాహంగా హుషారుగా, తెలివి తేటలుగా ప్రచారం చేశారు వాళ్ళు. వాళ్ళ ఉపన్యాసాల కోసం వేటగాళ్ళూ, పశుల కాపర్లూగూడా చెవులు కోసుకునేవారు. చాలా శ్రద్ధగా వినేవారు. ఆ వుపన్యాసాలు విని యువకులలో ఆలోచనలు రేకెత్తినై. ముసలివాళ్ళలో వెనుక చూపెక్కువైంది. ఏదో మత్తుపదార్థం సేవించినంత వుత్సాహం పుట్టుకొచ్చింది. అప్పుడూ యీ వేటసహకారకేంద్రాలు

నికీతా జన్మ ప్రాంతంలో ప్రారంభమైంది. తర్వాత నెమ్మదిగా సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు వెలిశాయి. కొంత కాలానికి ఏడు సంవత్సరాల స్కూలు ఏర్పడింది. దూర ప్రాంతాల నుంచి వచ్చినవాళ్ల కోసమని హాస్పిటల్ గూడా ప్రారంభించారు.

నికీతా కుటుంబం గూడా వేటసహకారకేంద్రంలో చేరింది. పదమూడేళ్లొచ్చింతర్వాత నికీతా పాఠశాలలో చేరాడు. అతని క్లాసులో అతని సమవయస్కులున్నారు కాని, అతనివయస్సులో సగంగూడా లేని వాళ్ళు గూడా వున్నారు. అదే తరగతిలో తనకంటే ఆ కుర్రాళ్ళే మెరుగనిపించుకోవడం కంటే అవమానం యింకొక్కటుండదు. అందుకని అతిశ్రమపడి చదివేవాడు; ఎప్పుడూ క్లాసులో ఫస్ట్ మార్కులు తెచ్చుకునే వాడు.

"ఇక అబ్బాయికి పెళ్ళి చెయ్యాలి" అన్నారు పెద్దలు. నికీతా అప్పటికే కామ్సొమోల్ సభ్యుడు. వెళ్ళి "దేశం" చూడాలనుకున్నాడు. "పెళ్ళి తర్వాత చేసుకుంటాను. ఈ తైగా ప్రాంతమే ప్రపంచం కాదుగా; బయటి ప్రపంచంగూడా యెలా వుంటుందో తెలుసుకోనివ్వండి నన్ను ముందు" అన్నాడు నికీతా.

బంగారపు గనుల దగ్గర ఫెల్డ్షెర్ కోర్స్ ప్రారంభమైందని తెలుసుకోగానే, వెళ్ళి అందులో చేరాలని నిశ్చయించుకున్నాడు. సరిగ్గా అప్పటికిక్కడ ఏడేళ్ళ పాఠశాలలో చదువుగూడా పూర్తై పోయింది.

ఇప్పుడతనికి ఇరవై రెండో యేడు నడుస్తోంది. బుద్ధిమంతుడు. కల్లాకపటం తెలియనివాడు. కష్టపడి పనిచేస్తాడు. అతి శ్రద్ధగా చదవడం మొదలెట్టాడు వైద్యవిద్య; ఏనాటికైనా

సరే, ఆ రంగంలో, తన ప్రజలకి సంపూర్ణ సేవ చేయగలగాలనే వుద్దేశంతో.

అతని శ్రద్ధని చూచి వార్యా మెచ్చుకునేది; ప్రోత్సహించేది. "ముందీ చదువు పూర్తిచేసి, తర్వాత పుస్తకాలు తెప్పించుకుంటాను. ఉత్తర ప్రత్యుత్తరాలతో డాక్టర్ డిగ్రీ గూడా సంపాదించుకుంటాను" అనేవాడు వార్యాతో. ఈ ప్రయాణం మీద బయల్దేరబోయేముందు, ఎందుకనోగాని, "జబ్బు పడ్డట్టు నటించు" అని సలహా యిచ్చింది వార్యా.

నికీతా కాశ్చర్యం వేసింది: "నటించడమా? నేనే! నా వల్లగాదు." అన్నాడు.

అలాంటి సలహా యింకెవరైనా యిస్తే, వాళ్ళ అంతు చూసేవాడే; కాని, వార్యా ఐపోయింది. కారణం తెలుసుకుని వార్యాని క్షమించేశాడు గూడాను. (నిజానికతనంత అమాయకుడు అంత సున్నిత భావాల నర్థం చేసుకోగలగడం గూడా విచిత్రమే.)

డాక్టర్ ఇవాన్‌తో కలిసి బయలుదేర గలిగినందుకు లోపల గర్వంగా కూడా వుందతనికి. వెనక్కి తిరిగి, ఇవాన్ కూర్చున్న బండి వంక చూశాడు; బండి గతుకు కెగిరెగిరి పడుతున్నాడాయన.

ఇదే ఛాజ్మా: కామెనుష్కా-నదీ ముఖం గూడా దాటి విశాలంగా వున్న ప్రదేశం; మైదానం. ఎటు చూచినా గడ్డ కట్టుకున్న తెల్లటి మంచు. గాలి తీవ్రంగా వీస్తోంది. ఊపిరాడడమే కష్టంగా వుంది. ఈ చలిగాలి పీల్చి యింకా బ్రదగ్గలమా అన్నట్టుంది కాని, గట్టిగా రెండు మూడు సార్లు గాలి పీల్చిం

తర్వాత, హుషారుగానే వుంది; ప్రపంచం అంతా ఆనంద పరవశమౌతున్నట్టు కన్పించింది. స్లెడ్జ్ బళ్ళు సవారీ వేస్తున్నై. పైన, దూరాన చుక్కలు తేలి ఆడుతున్నై. ఉన్నకొద్దీ చలి భయంకరం ఔతోంది. ఆ భయంలోనే ఏదో అవ్యక్తానందం. ఉత్తర ప్రాంతాలలో రాత్రుల ప్రత్యేకతే అది.

"ఇదుగో, నికీతా, ఒకమాట విను. మూడేసి స్లెడ్జిల చొప్పున ఒక టీము కట్టమని చెప్పు కయూర్ నాయకుడితో. నేను గూడా యీ బండ్లు నడపడం నేర్చుకుంటాను." అన్నాడు ఇవాన్, ఒకచోట బళ్ళు కాస్సేపాగ్గానే. యకూత్‌ల లాగా ముహానికి గూడా కప్పుకునే అలవాటు లేదాయనకి. అంచేత కనుబొమల మీదా, రెప్పల మీదా మంచు పేరుకుంది. బళ్ళు ఆగగనే గడ్డం, చెక్కులూ గట్టిగా రుద్దుకుంటేగాని పేరుకున్న మంచు పడిపోలేదు.

ఇవాన్ చెప్పినట్టే టీములు కట్టారు. మళ్ళీ బళ్ళ పరుగు ప్రారంభమైంది. మళ్ళీ మంచు మబ్బులు పైకి లేచినై. మళ్ళీ దుప్పుల గిట్టలు దబదబ లాడినై మంచుమీద.

ఈసారి పలుపులు ఇవాన్ పుచ్చుకున్నాడు. పలుపులాగి కొరడా విసిరి గూపులు పెట్టించడం మొదలెట్టాడు. దుప్పులు మారం కేశినట్టుంటే, వెంటనే దిగి, పలుపులు వదలకుండానే, మెడ పట్టీలు సవరించేవాడు. ఇంతలోనే మళ్ళీ సవారీ! ఎగిరి స్లెడ్జ్‌మీద కూర్చోవడానికి గూడా అవకాశం వుండేదికాదు.

## 24

బాగా ప్రొద్దుపోయింది. గడ్డ కట్టుకు పోయిన అడవి నెత్తిమీద చంద్రుడు ప్రకాశిస్తున్నాడు.

నైజి బళ్లు ఒక యిరుకు దారినిబడి పోతున్నై. వెళ్ళి నది గట్టుకు కొట్టుకున్నై. నది గట్టున వున్న రాళ్ళమీద, తుఫానుకు పడిపోయిన చెట్లమీద గూడా మంచు బాగా పేరుకునుంది.

చందమామ వెన్నెల్లోనూ, చుక్కల వెలుతుర్లోనూ నల్లగా నిలబడి కన్పిస్తున్నై చెట్లు దయ్యాల్లాగా. ఉన్నట్టుండి, చుట్టలు చుట్టుకు పైకి లేస్తున్న దట్టమైన పొగ కనిపించింది బళ్ళల్లో వాళ్ళకి. ఆ పొగతోబాటు బంగారు రవ్వలు గూడా లేస్తున్నై పైకి. దగ్గర్లోనే గుడారాలున్నై. ఆ గుడారాల్లోంచి వస్తోందా పొగ.

గుడారం గుమ్మం మీదున్న తెరతొలగించి బయటికి చూశాడొక మనిషి. లోపల్నుంచి వచ్చేకాంతిలో అతని ఆకారం స్పష్టంగా కన్పిస్తోంది.

"ఇవానా?" అనరిచాడతను.

"ఇవానే!" అన్నాడు బళ్ళల్లోంచి ఒక మనిషి.

"కామెనుష్కానుంచా?"

"కామెనుష్కానుంచే."

గుడారంలో వున్న యకూత్ పరుగెత్తుకొచ్చాడు వాళ్ళని కలుసుకునేందుకు. లోపల ఆడవాళ్ళ గుసగుసలు. గుడారంలోంచి రవ్వలింకా దట్టంగా లేచాయి పైకి.

గుడారం దగ్గర కొచ్చింతర్వాత, గుమ్మంతెర చేత్తో పట్టుకున్నాడు ఇవాన్. ఉలిక్కిపడ్డాడు. అది చాలా మందపాటి గుడ్డ. వెచ్చగా, కాలిన యినుములా తగిలింది చేతికి. గొడ్డలికా వంట చెరకు అంతగా ఎందుకెదురు తిరుగుతోందో

గూడా అర్థమైంది ఇవాన్‌కి: ప్రతీదీ అతిభయంకరంగా గడ్డ కట్టుకొనుంది. ఈ శీతకాలంలో, చెట్లు కంచు విగ్రహాల్లా నిల బడుంటాయి; మంచుగూడా గాజు ముక్కలా గట్టిగా పదునుగా వుంటుంది.

“ఈ రాత్రికిక్కడ వుండిపోదాం” అన్నాడు నికీతా.

“అలాగే వుండిపోదాం” అన్నాడు ఇవాన్; “ఎంత దూరం వచ్చివుంటాం?” అనడిగాడు.

“షుమారొక ముప్పై కిలోమీటర్లొచ్చి వుంటాం. రేపు బళ్ళ జంతువుల్ని మారుద్దాం; ప్రయాణం యింకా తొందరగా సాగుతుంది.”

ఆ గుడారం పెద్దదే. బయట అంతచలిలోంచి లోపల కొచ్చినందుకు బాగా వెచ్చగానే వుంది. పండగకోసం అలంక రించినట్లలంకరించారు గుడారాన్ని. అతిథుల నాహ్వానించ డాని కిద్దరు యువతులు ముందుకొచ్చారు; వున్న నగలన్నీ వంటినిండా పెట్టుకుని.

“కబుర్లేమిటి?” అనడిగింది నికీతాని, ఆ యిద్దరిలోనూ చోరవున్న యువతి.

“మీరే చెప్పండి” అన్నాడు నికీతా; అని, వున్నిదుస్తులు తీశేస్తూన్న ఇవాన్‌కి సాయం జేశాడు.

వాళ్ళకు తెలిసిన విశేషాలన్నీ చెప్పారు.

భోజనాలైంతర్వాత, ఇవాన్‌కి ప్రత్యేకం పక్కేశారు. ఆ పక్కమీద పండుకున్నాడు ఇవాన్. వాళ్ళిచ్చిన కొత్త ఉన్ని దుప్పటి కప్పుకుంటే నిద్రొచ్చేశినట్లైంది. పాత్రలన్నీ కడిగిం

తర్వాత, ఆ యువతు లిద్దరూ ప్రక్కగుడారంలో కెళ్ళిపో యారు; వాళ్ళబంధువులూ, కయూర్లూ అక్కడ పండుకున్నారు. మొదటి గుడారంలో, డాక్టర్ ఇవాన్, నికీతా, ఒక యకూత్ ముసలతనూ మట్టుకున్నారు. ముసలతనున్నది కాపలా కోసం; నిప్పుపొయ్యి పక్కనే కూర్చునున్నాడతను, లేడి చర్మం కప్పుకుని. పొయ్యిలో మంటలు లేస్తున్నై. మంటల నాలుకలనీడలు గుడారం గుమ్మందగ్గరా, ప్రక్క గోడలమీదా పడి నాట్యం చేస్తున్నై. ఆ మంటల వెలుగుకి కన్నులు చిరత లారిపోతున్నై. ఇకలాంటప్పుడు నిద్ర రాకేం జేస్తుంది. బళ్ళకి కట్టుకొచ్చిన దుప్పుల్ని వదిలేశారు; మేతకెళ్ళిపోయినై అవి. దూరాన అడవిలో చెట్లమీంచి క్రిందికి పడుతున్న మంచు బెతి కల చప్పుడు, నదిలో మంచు పగిలినప్పుడు పిస్టల్ పేల్చినట్లొచ్చే శబ్దమూ తప్ప, అంతా నిశ్శబ్దంగా వుంది.

ఇవాన్ ఇవానొవిచ్ కళ్ళు మూసుకున్నాడే గాని నిద్ర రావడంలేదు. తాను నిరాశతో పారిపోయొచ్చాడు. ఎందు కొదిలి పెట్టొచ్చినట్టోయిల్లు? బహుశా అక్కడి వాళ్ళంతా లోలోపల నవ్వుకుంటున్నారేమో తనని చూచి. చివరికి భార్యతో కూర్చుని, వున్న విషయమేమిటో కుండ బ్రద్దలు కొట్టినట్టు మాట్లాడైనా రాలేదు. నిజం తెలిసిపోతుందేమో నని భయం. నిజం తెలిసికోనేందుకు భయం. ఇప్పు డెవరున్నారో తన భార్య దగ్గర? బహుశా ఇగోర్ ..........

నెమ్మదిగా లేచి నిలబడ్డాడు ఇవాన్. దుస్తులు వేసు కున్నాడు. నికీతాని లేపాలా వద్దా అని ఒక్కక్షణం తటపటా యించాడు. ఆ ఆలోచన వొచ్చినందుకు తనని తానే తిట్టు కున్నాడు. గుమ్మం వేపుకు రెండడుగు లేశాడు. కాస్సేపు

బయటికెళ్ళి నడిచొస్తే, బుర్రలో భావాలు కాస్త కుదట బడొచ్చును. సాధ్యమైనంతవరకు చప్పుడు కాకుండానే వేశా డడుగులు; ఐనా ముసలతను లేచాడు.

దగ్గరకెళ్ళి, ఆ ముసలతని భుజంమీద చెయ్యేసి, "పండుకో నిద్రపో! కాస్సేపలా నడిచి వొచ్చేస్తాను. అలవాటులే నాకు" అన్నాడు నెమ్మదిగా.

ఇక ఫర్వాలేదు లెమ్మనుకున్నాడా ముసలతను; పండు కున్నాడు.

బయటకొచ్చి చూస్తే, యిందాకటి కంటె వెలుగ్గా వున్నట్టుంది రాత్రి. నిశ్చలంగా వున్న కొలనులో నీటిలా నీలంగా వుంది పైన ఆకాశం. నల్లగా నిలబడిన చెట్లపైనుంచి దూరాన పర్వతాల శిఖరాలు కన్పిస్తున్నై తెలతెల్లగా. చుట్టూ కలయ జూశాడు ఇవాన్. దుప్పులు మేతకెళ్ళిపోయినై. బళ్ళ మీదున్న సామాను బళ్ళమీదే వుంది. మంచులో బూడిదరంగుగా కన్పిస్తున్నై స్లెడ్జి బళ్ళు. నదిపైపునుంచి గాలి వీస్తోంది. అంతా నిశ్శబ్దంగా వుంది చుట్టుపక్కల ప్రాణిజాలమేమీ లేనట్టు. చలి; నరాలు కొరుక్కుతినే చలి. దూరాన ఎక్కడో గుంటనక్క అరిచరిచి, ఏడుపు లంకించుకుంది. ఒకటే నిరాశ; ఒకటే నిస్పృహ. వెళ్ళి కయూర్లని లేపుదామనిపించింది ఇవాన్‌కి. వాళ్ళని లేపి మళ్ళీ బళ్ళు కట్టించాలి. తిరిగి కామెనుష్కా కెళ్ళిపోవాలి. ఈ బళ్ళూ అవీ కట్టి, ప్రయాణానికి సిద్ధం కావా లంటే, ఎట్లా లేదన్నా యింకొక రెండు మూడు గంటలు పడు తుంది. ఆ రెండుమూడు గంటలూ గడపడం యెలా? ఈ ఆలోచనల చిత్రహింసనుంచి బయటపడడం ఎలా? ఈ మకాంకి, క్రిందటిసారి మకాం పదిహేను కిలోమీటర్లన్నా వుంటుంది.

అక్కడిదాకా నడచెళ్తే, బళ్లు దొరుకుతై. ఇప్పుడే బయల్దేరి, యీ పాటినే వెళ్లిపోతే. ఆ ముసలతను కాస్సేపు చూచి, నిక్కి తాని లేపుతాడు. వాళ్లిలాగో పరుగెత్తుకొచ్చి తనని కలుసుకుంటారు. ఇంటికెళ్లిపోతాను తిరిగి అని చెప్పొచ్చును వాళ్లతో; రేపుదయానికల్లా యింటిదగ్గర వుండొచ్చును.

ఈరాత్రే కామెనుష్కా కెళ్ళిపోవాలని అనుకోవడం యెందుకో అతనికే తెలియదు; అసలొక నిశ్చయానికి గూడా రాలేదు. ఐనా వచ్చిన దారంటే పడి లాక్కుపోతున్నై కాళ్లు. ఛాజ్మానది వొడ్డు దగ్గర కెళ్ళిపోయాడు అప్పటికప్పుడే.

తన హోదాని మరచిపోయాడు, హుందాతనాన్ని మరచిపోయాడు. ఇకిప్పుడతని కింకేమీ పట్టడం లేదు. ఒకటే చిత్తక్షోభ. ఈ విశాల ప్రపంచంలో ఒక పెద్ద తుఫాను లేచింది; ఆ తుఫానులో తానొక గడ్డిపరక. ఆ తుఫానెటు వీస్తే, ఎటు కొడితే, అటెళ్ళిపోతుందా గడ్డిపరక! నది వైపునుంచి కత్తి ఝుళిపించినట్టు దూసుకొచ్చింది చలిగాలి. ఆ గాలి కెదురుగా, నడుంవంచి, తలవంచి, గ్రుడ్డిగా సాచిసాచి అంగలేసుకుంటూ వెళ్ళాడు ముందుకి.

'ఎంత పెద్ద మైదానం! ఎంత విశాలమైన శూన్యం? ఇలాంటి చోటెవళ్ళుంటారు? ఒకేళెవరైనా వున్నా ఎవరికి వారు తమవంతు బాధలు భరించక తప్పదు; ఎవరికి వారు ఎంతో కొంత సుఖం గూడా చవి చూడగలుగుతారా?' అని ప్రశ్నించుకున్నాడు ఇవాన్, తనని తానే. గాలి యీడ్చీడ్చి కొడుతోంది ముఖం మీద. 'నిజమే. మానవునికి ఎంతో కొంత మేలు చేయాలని, మానవుల్నెంతో కొంత సుఖపెట్టాలని ప్రయత్నిస్తున్నాం. కాని ఏం లాభం? ఎవరికి వారు యింతింత

బాధల్ని కొనితెచ్చుకుంటే, ఇక వాళ్ళని సుఖపెట్టడం ఎవరి తరం? ఈ లోకంలో ఇంత బాధ ఎందుకుండాలి? మనసులకీ అర్థంకాని విచారాలూ, ఆలోచనలూ ఎందుకు కలగాలి?'

ఇవాన్ అడుగులు తడబడినై; నడక మందగించింది. గాలి విసురు ఎక్కువైపోయింది. గడ్డ కట్టుకుంటున్న నీరు నెత్తిమీద బోర్లించినట్టుంది. దుస్తులు పట్టుకుని వెనక్కి నెట్టే స్తున్నట్టుంది గాలి.

నది మలుపులో, క్రిందటిసారి వేశిన మకాం కన్పించింది. గబగబా వెళ్ళి చేరాలనుకున్నాడక్కడికి. వెళ్ళాడు. అక్కడెవరూ లేరు. ఆ గుడారాల్లో వున్న మనుషుల పని పూర్తైపోయింది; వెళ్ళిపోయారు. గుడారాల గుర్తులు మట్టుకున్నై: మంచు దిబ్బలు, బూడిద, కొమ్మల పక్కలు, మూడు కాళ్లమీద లేపిన ఉరిస్తంభాల్లా డేరాల అస్థిపంజరాలు!

ఏంచెయ్యాలా అని ఆలోచించాడు ఇవాన్. ఇప్పుడు మళ్ళీ బంగారపు గనుల దగ్గర కెళ్ళిపోతే అక్కడి జనం అంతా ఎంత విచిత్రపోతారో తెలుసతనికి; ఐనా అలాగే నడవడం మొదలెట్టాడు, ఆగడం అతనివల్ల కాలేదు. కాలికొక మంచు గడ్డ ఎదురు తగిలింది; బోర్లా పడిపోయాడు ఇవాన్. ఊపిరాడక, పడిన చోటనే, కాస్సేపలాగే వుండిపోయాడు. మంచు పగుళ్ల మధ్యనుంచి నదిలోపలి నీరు కన్పించింది. ఎంత ప్రశాంతంగా వుందా నీరు! అది నీరో, లేక అదిగూడా గడ్డకట్టుకుపోయిందో! లేచి కూర్చున్నాడు ఇవాన్. ఈ ప్రయాణం మీద బయలుదేరక ముందు, 'స్కీ' చేస్తూ ఎదురు పడిన ఓల్గా గుర్తుకొచ్చింది. తన కళ్ళముందే, ఓల్గా మళ్ళీ యింకొకసారి పడిపోయినట్లైంది,

ఆవిడ కనుల్లో అదే విభ్రాంతి, ఆవిడ పడినచోట మళ్ళీ అదే నల్లని మచ్చ!.... ........

'అంతా ఐపోయింది.' అనుకున్నాడు ఇవాన్ బిగ్గరగా; ఆ మంచుమీద అలాగే, కూర్చున్న చోటనే ముందు కొంగి బోర్లా పండుకున్నాడు.

అలా యెంతసేపు పండుకునున్నాడో అతనికే తెలియదు. మెలకువ వొచ్చేప్పటికి చలి కొరుక్కుతింటోంది; అంత వున్ని దుస్తుల్లోంచీ, భుజాల మీదికీ; మెడ మీదికీ పాకుతోంది. ఇం కాస్సేపలాగే వుంటే ఆ చలికి గడ్డ కట్టుకుని చచ్చిపోవలసిందే; తప్పదు. ఏమో, యీలోపలెవరైనా వస్తారేమో. కాళ్ళూ చేతులూ ఆడకుండా, సగం చచ్చిపోయినవాడిలా పడుంటే చూచి రక్షిస్తారేమో. ఇకప్పుడు గూసేవ్ తనని ఆపరేషన్ బల్ల మీద పండుకోబెట్టి ఆపరేషన్ చేస్తాడు. తన అంగాలన్నీ సాధ్యమైనంత నిరుపయోగంగా వుండేట్లాపరేషన్ చేస్తాడు; సందేహం లేదు.

'ఛాఛ. ఛలేచావే!' అనుకుంటూ లేచి కూర్చున్నాడు ఇవాన్. తలమీద టోపీ సర్దుకున్నాడు. ముఖాని కంటి పట్టిన మంచు తుడుచుకున్నాడు. చుట్టూ చూశాడు.

తూర్పు దిక్కున తెలి మబ్బులు ఎర్రవారబోతున్నై. పైన ఆకాశం అంతా బూడిదరంగుగావుంది. క్రింద నేల గూడా అలాగే వుంది నిశ్శబ్దంగా, పరమ శూన్యంగా, భయంకరంగా. సూర్యోదయం.

డాక్టర్ ఇవాన్ లేచి, కిందటి రాత్రి తనకాతిధ్యం యిచ్చిన యకూత్ గుడారాల వైపుకు నడిచాడు. దారిలో

దుప్పులు కన్పించినై, మంచు పొగలో తలల కొమ్ములాడించు కుంటూ. నికీతా గాభరా పడిపోయి రెండు దళాల్ని వెంట పెట్టుకుని బయల్దేరాడు, డాక్టర్ అడుగుల జాడలు చూసు కుంటూ. ఎందుకైనా మంచిదని, ఒక గుడారం, ఒక యినుప పొయ్యీ గూడా పట్టుకు బయల్దేరాడు.

# 25

వాళ్లు చన్నీళ్ళతో తుడుచుకుని, పొయ్యంటించి, గది సర్దడం ప్రారంభించింది ఓల్గా. హృదయం బరువుగావుంది; ఐనా బెడద దాటి గట్టెక్కినప్పుడుండే ఆత్మశాంతి. తానీ యింట్లో మూడు రోజుల్నుంచి వుంటోంది ఒంటరిగా.

తగరపు రేకొకటి వేడిచేసి, కిటికీ అద్దాని కొత్తింది. అద్దం మీదున్న మంచు కరిగి చారికలు గట్టి క్రిందికి కారుతూంటె చూస్తూ నిలబడింది కాస్సేపు. తర్వాత ఒక దాని తర్వాతొక అరచేయి అద్దం మీద పెట్టి, నోటితో వూది, ఏర్పడిన మంచు కంతలోంచి బయటికి చూచింది. మంచు పెతికెలు పెతికలుగా చక్రం తిరుగుతూ కురుస్తోంది. గబగబా దుస్తులు మార్చుకుని, బయటికి బయల్దేరింది. మంచు బాగా దట్టంగా కురుస్తోంది. బయటున్న వస్తువులన్నిటి మీదా మంచు దుప్పటి కప్పినట్టుంది. గాలిదివరకటి కంటే నునువెచ్చగా వుంది; ఆ గాలిమూలాన చలి బాధ తప్పింది గదాని నేలగూడా సంతోష పడుతున్న ట్టుంది.

గబగబ గెంతుతూ మెట్లు దిగింది ఓల్గా. ప్రపంచం అంతా సరిక్రొత్తగా వున్నట్టుంది. యువతి; ఆరోగ్యంగా వుంది;

యింకేం కావాలి! దొరికిన స్వాతంత్ర్యాన్ని సంపూర్ణంగా ప్రయోగించుకునే అవకాశం చిక్కింది; ఒళ్ళు మరచే ఉత్సాహం కలిగింది ఓల్గాకి.. కనీసం ఈవేళకిక ఆవిడ కేబాధలూ వున్నట్టు కనిపించలేదు. బజారు వెంట మంచుదుస్తు లేసుకుని నడుస్తున్న మనుష్యుల్ని చూచింది; పైనుంచి మొహం మీదికి పడుతున్న మంచు ముక్కల్ని నాలుకతో అందుకుని చప్పరించింది. శలవు లిచ్చేముందు, చివరిసారిగా స్కూలు కెళ్లొచ్చే చిన్నపిల్ల మనసులా కేరింతలు కొడుతోంది ఓల్గా మనసు.

గడచిన ఆకురాలు కాలంలో, తావ్‌రోవ్‌తో కలిసి నడిచిన బాట దగ్గర కొచ్చింది ఓల్గా, తలవని తలంపుగా. ఆదుర్దాగా అటూయిటూ చూచింది అక్కడికి చేరుకోగానే. దారినిండా మంచు; పైనుంచి మంచువర్షం. చెట్ల కొమ్మల నిండా మంచు. బాగా బొచ్చున్న నక్కతోకలా వున్నై ఆ కొమ్మలు. ఇప్పుడక్కడ బల్లలున్న ఆనమాలే లేదు. ఒక్క చోట మట్టుకేదో పెద్ద మంచుదుంగ పడివున్నట్టుంది.

అంతా మారిపోయింది, ఆవిడ మనసు తప్ప. ఇప్పుడా మనసు మరింత పవిత్రంగా, మరింత నిర్మలంగా, మరింత లోతు బారింది.

'ఇదిగో, ఈచీలికదారి మాయింటికెళ్తుంది. యిదుగో, యిక్కడే మేం విడిపోయాం' అని అనుకున్నది ఓల్గా; 'మేం యీమధ్యొకరికొకరం చూచుకోనేలేదెందుకని? ఎప్పుడైనా, అరుదుగా, కనిపించినా, దూరదూరంగానే. ఎందుకని?'

గుమ్మం దగ్గరున్న తపాలా పెట్టెలోంచి పత్రికల చివరలు కన్పించినై. బయటికిలాగి చూచింది ఓల్గా. వాటితో పాటొక నీలిరంగు కవరుగూడా బయట బడింది. కవరుమీద

తన పేరే వుంది. వెళ్ళి పొయ్యిదగ్గర కూర్చుని కవరుచించి చదివింది; తనకళ్ళని తానే నమ్మలేక పోయింది. మళ్ళీ మళ్ళీ చదువుకుంది పైనుంచి కిందికీ, కిందినుంచి పైకీ. ప్రాంతీయ పత్రికకి స్థానిక విలేఖరిగా పనిచేయడానికి అంగీకరించండి అని వుంది ఆవుత్తరంలో. ఉకమ్చాన్‌లో జరిగే పత్రికల సమావేశానికి రమ్మని ఆహ్వానం గూడా వుంది అందులో.

రోడ్డంతా ఒక వెడల్పాటి అగడ్తలా వుంది. రోడ్డుకటూ యిటూ పెద్దపెద్ద మంచుగట్లు. ఆగట్లపైన కొద్దికొద్దిగా కన్పిస్తున్నై చెట్లతలలు. శీతాకాలం వచ్చిందంటే చాలు. ఉత్తర ప్రాంతంలో రోడ్డు కార్మికులికి విశ్రాంతంటూ వుండదు; చేతినిండా పని. ఎప్పటికప్పుడు రోడ్డుమీద పడే మంచంతా తుడిచేస్తూ వుండాలి. మంచెంత దట్టంగా కురుస్తున్నా సరే, ఉకమ్చాన్ — ఛాజ్మారోడ్లు మూయడానికి వీల్లేదు; ప్రయాణాలు కొనసాగుతూ వుండవలసిందే. కార్లు బార్లు తీరి పరుగెత్తుతూ వుండవలసిందే.

ఓల్గా కొంతదూరం, బస్సుమీద వెళ్ళింది. బస్సు వెళ్ళి వెళ్ళి ఒక మంచుగుట్టలో కూరుకు పోయింది. మిగతా ప్రయాణమంతా లారీలో చెయ్యవలసొచ్చింది.

ఎవర్ని చూశినా, ఉన్నీ, కంబళ్లూ కప్పుకున్నారు. గాలి మొహాన కొడుతోంది. దుస్తులు తెరచాపల్లా తేలుతున్నై గాలిలో. ఒంటినిండా మంచుదువ్వ.

ఓల్గా దుస్తులంత ముతకవి గూడా గాదు. ఆ మంచావిడొచ్చి ఆదుకోపోతే, ఓల్గాపని కష్టమే అయ్యేది. వేసుకున్న

పెద్ద వున్నికోటు వొకవైపు లేపి, వచ్చి యిది కప్పుకోమని ఆహ్వానించిందావిడ ఓల్గాని.

"రండి రండి, అలావుండే యింకాస్సేపటికి గడ్డ కట్టుకు పోతారు గూడాను. మనిద్దరమూ కప్పుకుందాం యీ కోటు, రండి" అని ఆహ్వానించిందావిడ.

బ్రతికాం అనుకుంటూ, వెళ్ళి ఆకోటులో దూరింది ఓల్గా, కృతజ్ఞత తెలుపుతూ. కోటు ఓల్గా మీదుగా కప్పి, భుజంమీద చెయ్యేసి, "ఇప్పుడు హాయిగా వుందా! యిదేమిటీ యిట్లా బయల్దేరారు? ఇంతచలిలో! వణకి పోతూంటే చూచి పిలిశాను" అందావిడ.

"పత్రిక ఆఫీసుకి రమ్మని పిలుపొచ్చింది." అని చెప్పింది ఓల్గా

"మాదీ యీవూరు కాదు. స్టెఖోనవైట్ సమావేశాని కని వొచ్చాన్నేను. నాపేరు ఎగోరోవ్నా. నేనూ మావారు కలిసి పదిహేను సంవత్సరాలు పనిజేశాం. ఆయన కాలం జేశారు. ఇప్పుడు నేనొంటరిదాన్ని. ఐనా ఫర్వాలేదు, మాతో పాటు పనిచేశే వాళ్ళందరూ ఆడవాళ్ళే. ఇప్పుడీ యంత్రా లొచ్చింతర్వాత మాపని మరీ తేలికైంది."

సగౌరవంగా చూచింది ఓల్గా ఆవిడముహం వంక: మధ్య వయసు; మగవాడి మొహంలా వుంది, ఎప్పుడూ ఆరు బయట పనిచెయ్యడం మూలాన్నే నేమో.

"నన్నందరూ రాణీఅని పిలుస్తారు" అని చెప్పింది ఎగోరోవ్నా. ఆ మాటల్లో ఆత్మశ్లాఘున వున్నట్టేలేదు. "నేను మరీబలంగావుంటానని అట్లా పిలుస్తారు. ఎంతలావు సిమెంట్

బస్తా ఐనా సరే, యిట్టే లేపేస్తాను పైకి. మా ఆయన తాగినప్పుడల్లా — ఆయనకి చిన్నప్పుడే అలవాటైంది తాగుడు — భుజంమీదేసుకుని మోసుకొచ్చేదాన్ని యింటికి. తాగనప్పుడు ఆయనకీ నాకూ సాపత్యమే లేదు. నాకంటె చాలా బలంగా వుండేవారు. తాగితే మట్టుకు పసిపిల్లలకంటె కనాకష్టం" ఆ జ్ఞాపకాలతో, ఎగోరోవ్నా మనసు బరువెక్కినట్టుంది; మాట్లాడం మానేశింది. తర్వాత సంభాషణ సాగడమే కష్టమై పోయింది; లారీ మిట్ట పల్లాల రోడ్డుమీద ముందుకు పోతోంది ఎగిరెగిరి పడుతూ.

ఈ శీతకాలపు ఉకమ్యాన్ నగరాన్ని గుర్తుపట్టలేక పోయింది ఓల్గా. కిటికీల దగ్గర్నుంచి అన్నీ కొత్తగా వున్నట్లే వున్నై యీ మంచు మూలాన. ఈ ప్రాంతాని కంతటికీ యిదే రాజధానన్న విషయం అడుగడుగునా కన్పిస్తోంది. ఎక్కడ చూచినా కార్లు, లారీలు, గుర్రపు బళ్ళు, ఎడ్లబళ్లు స్లెడ్జిబళ్ళు, రోడ్లప్రక్కన కాలిదార్లమీద అటూయిటూ హడావిడిగా నడచెళ్ళి పోతున్నవాళ్లూ.

శీతాకాలంలో గూడా ఆకర్షణీయంగానే వుంది నగరం. గనులపేటల్లో వున్నట్లు పొగలేదిక్కడ. ఇళ్ళన్నీ ఆవిరితోనే పెచ్చసౌతున్నై.

బస్ స్టాప్ దగ్గర, లారీలోంచి దిగుతూ, 'మాస్కోనుంచి కొంతభాగం పట్టుకొచ్చి పెట్టినట్టుందిక్కడ' అనుకుంది ఓల్గా; 'ఆ పెద్దపెద్ద రాతి కట్టడాలన్నీ రాత్రిపూట యింకా అందంగా వుండివుంటై. ఈ తెల్లని బజార్ల ప్రక్కనే నల్లగా నిలబడి! కిటికీలలోంచి విద్యుత్కాంతులు విరజిమ్ముతూ!

"ఎక్కడికెళ్తారు మీరు ?" అనడిగింది ఎగొరోవ్నా: చేతిలో ఒక పెద్ద సూట్ కేస్ పట్టుకునుంది. (ఇప్పటిదాకా వేసుకునున్న కోటుతీసి ఆ సూట్ కేస్ లో పెట్టింది.)

తలెత్తిచూచింది ఓల్గా. ఎగొరోవ్నా మంచి అజానుబాహువు. చక్కని చిన్నకోటు వేసుకునుంది. ఆకోటుకు సేబుల్ కాలరుంది. నెత్తిమీదున్న టోపిగూడా సేబుల్ జంతు చర్మంతో చేసిందే. ఆ ముహం నిండా తెలివితేటలూ, హుషారు తొణికిస లాడుతున్నై.

"హోటల్ కి" అంది ఓల్గా.

"వొద్దులే, ఆగండి. హోటళ్లలో గదులు ఖాళీవుండవు. ఎక్కడచూచినా స్టైఖానవైట్లే. నావెంటరండి. మా చెల్లెలి వూళ్ళోనే వుంది. వాళ్ళ యిల్లుగూడా పెద్దదే. అక్కడే వుండొచ్చును; రండి."

# 26

ఓల్గాని చూడగానే, కుర్చీమీంచి లేచి, ఆహ్వానించాడు ప్రాంతీయ పత్రిక సంపాదకుడు. "మీ పరిచయం కలిగింది; సంతోషం." అన్నాడు.

ఓల్గా సాధారణంగా, తొణుకూ బెణుకూ లేని మనిషే కాని, పనిచెయ్యడానికనొచ్చింది యిక్కడికి; అంచేత తనశక్తి సామర్థ్యాన్ని గురించి తనకే సందేహం. అదీగాక, తానిదివరకు వ్రాసిన వ్యాసాల్ని గురించిన మంచిచెడ్డలు గూడా వినవలసి వస్తుందేమోనన్న అదుర్దా. బెదురుబెదురుగా వెళ్లింది లోపలికి.

"మీ వ్యాసాలిక్కడ చాలామంచి కౌతుహలాన్ని రేకెత్తించినై" అన్నాడు సంపాదకుడు. మంచి హోదాలో ఉన్న మనిషి తనకు కావలసిన వ్యక్తి కనుపించినప్పుడు చూపే ఆప్యాయత వున్నది ఆయన మాటల్లో. "మీ వ్యాసాల్లో కొన్ని కొన్ని భాగాల్ని గురించి ఏకాభిప్రాయం లేదనుకోండి. ఇక్కడున్న వాళ్ళందరిలోనూ; ఐనా, అది సహజమే. పత్రికల్లో పనంటే అంత తేలికేమీ కాదు, 'అచ్చయిన అక్షరం కలకాలం నిలుస్తుంది' అంటారే: వూరికేగాదు. మనం ఒకరినొకరం పరస్పరం అర్థం చేసుకున్నామనే అనుకుంటున్నాను నేను, కాదూ?"

ఓల్గా కింకా మనస్థిమితం పూర్తిగా చిక్కలేదు. తల వూపింది.

"మీ రిలాగే కొనసాగించాలి పని. మాకు సాధ్యమైన సహాయం అంతా మేం చేస్తుంటాం. సలహా లిస్తూ వుంటాం, బంగారు గనులలో మా పత్రిక్కి విలేఖరిగా వుండమని మిమ్మల్ని కోరదలచుకున్నాం. జీతం ఏర్పాటు చేస్తాం. అదిగాక, మీరు వ్రాసిన ప్రతీ వ్యాసానికీ వేరేడబ్బు చెల్లిస్తాం. వుండేందుకు యిల్లు....... మీ కిల్లు కావాలా? ఎక్కడుంటే బావుంటుంది మీకు? ఐనా మీకు...."

"అక్టోబరు గనుల దగ్గిర వేరే వొక యిల్లు చూపిస్తే బావుంటుంది." అంది ఓల్గా, ఆయన మాట పూర్తి చెయ్యనీకుండా.

సంపాదకుడు ఆశ్చర్యపోయినట్లు కన్పించాడు. ఓల్గాకి వివాహమైనట్టు ఆయన కిదివరకే తెలుసునని తెలుస్తూనేవుంది.

"సరే, అలాగే చూద్దాం." అన్నాడు ఇందాకటిలాగే. "మీ రెళ్ళేటప్పటికి అలాగే ఒక గది ఏర్పాటు చేస్తాం. ప్రత్యేక విలేఖరి చేసే పను లేమిటో మా ఎసిస్టెంట్ చెబుతాడు మీకు." అంటూ చేతినివున్న వాచ్ వంక చూసుకున్నాడు సంపాద కుడు; "స్టెకొనవైట్‌ల సమావేశం వుందివ్వాళ, నే నక్కడికి కెళ్ళాలి. ఆ ప్రక్క ఆఫీసులో కెళ్తే మా పత్రికలో పనిచేసే వాళ్ళందరూ వుంటారు; ఇక నుంచి మీరు వారితో కలిసి మెలిసి పని చెయ్యాల్సి వుంటుంది. ఇవ్వాళ సాయంత్రం యిక్కడ సమావేశం జరుగుతుంది. ఆ సమావేశానికి మీరుకూడా రావాలి. నేనే పరిచయం చేస్తాను మిమ్మల్ని అందరికీనీ."

"తప్పకుండాను." అంది ఓల్గా; సంతోషంగా చిరునవ్వు నవ్వుతూ.

పత్రిక ఆఫీసునుంచి రెక్కలొచ్చిన పక్షిలా వెళ్ళిపోయింది బయటికి.

రెస్టారెంట్‌లో గబగబా భోంచేసింది. చూస్తే యింకా ఆరు గంటలుంది. రోజులో నాలుగో భాగం! తనిష్టం వచ్చినట్టు గడపొచ్చును.

ఇవాన్‌ను గురించి ఆలోచించింది. ఈ వూరొచ్చిం తర్వాత అతన్ని గురించి ఆలోచన రావడం యిదే మొదలు. ఇదో 'ప్రక్కపని'లా వ్యాసాలు వ్రాస్తుందని తనని గురించిక అనలేదు ఇవాన్.

ఎందుకనోగాని, వెంటనే ఓడరేవు దగ్గర కెళ్ళాలని పించింది. వెళ్ళి బస్సెక్కింది. ఇదివరకు తను చూచిందే ఆ రోడ్డు. గాలి చచ్చిపోయింది. ఎక్కడ చూచినా విరిగిపోయిన

కొమ్మలు. దారి కడ్డం వచ్చిన వాటినల్లా విరగ్గొట్టి వెళ్లినట్టుంది గాలి.

సముద్రం: ఎటు చూచినా గడ్డకట్టుకున్న నీరు. బస్సాగగానే గభుక్కున దూకి హార్బర్ వైపుకు పరుగెత్తింది ఓల్గా. ఇదివర కక్కడ వున్న చిన్న చిన్న యిళ్ళన్నీ యింటి కప్పుల దాకా కూరుకుపోయినట్లున్నై మంచులో. ఇంటిచుట్టూ, దారికి సరిపడా, మంచు తవ్వి ఎత్తిపోశారు. కయూక్ తోలు కెళ్తున్న కుక్కల బండొక టటు వెళ్లింది. గాలి చలిచలిగా వుంది. ఐనా, ఫిబ్రవరి నెల కావడంవల్ల సూర్యుడు చక్కగా ప్రకాశిస్తున్నాడు.

ఓల్గా హృదయం ఆనందంతో పురకలు వేస్తోంది. అన్నీ చూస్తూ, ముందు కడుగులు వేసుకుంటూ వెళ్లింది. పర్వతాల మీద మంచు మెరిసిపోతోంది. మూడు టన్నుల లారీలు కొన్ని హార్బరువైపు కెళ్తున్నై బారులు తీరి. హార్బరుపైన విమానం వొకటి గిరగిరా తిరిగి తిరిగి, వేసవికాలం విమానాశ్రయంలోకి దిగింది. జాలరివాళ్ళు వేసుకున్న కర్రల వంతెనమీద గూడా మంచు పేరుకుంది. వెళ్లి ఆ వంతెనెక్కింది ఓల్గా. మీదునున్న అంగోరా రుమాలు, గులాబీల బుగ్గలు; యువతిలా వుంది ఓల్గా. తానూ, తావ్‌రోవూ యిక్కడి కొచ్చా రిదివర కొకసారి. కాని అప్పటిలా లేదు యిప్పటి సముద్రం. అది వసంతం. ఇప్పుడో ముందూ వెనకా ఎక్కడ చూచినా ఒకటే మంచు. సముద్రం ఆటులో వుంది.... ఆ నాడు యిద్దరూ యీ యిసుక లోనే నడిచారు. ఆ పదచిహ్నాలన్నీ చెరిగిపోయినై. తన మధుర స్మృతులు గూడా ఆ పదచిహ్నాల్లాగానే చెరిగి పోతాయా?

"వీల్లేదు !" అనుకుంది ఓల్గా, పెద్దగా అరచేశినట్టు: "నా ప్రేమ నేను బ్రతికినంత కాలం సజీవంగానే వుంటుంది !"

# 27

ఆవేళ సాయంకాలం పత్రిక ఆఫీసులో సమావేశానికి వెళ్లింది ఓల్గా. చాలామంది హాజరయ్యారు. చాలా విషయాలు చర్చించారు. పత్రికలో, ఒక వ్యాసంలో యిచ్చిన వివరాలు సరైనవి కావటు; దాన్ని గురించి కూడా చర్చించారు. ఆ వ్యాసం వ్రాసిన విలేఖరి క్షమాపణలు చెప్పుకున్నాడు. ఇక ముందలాంటి తప్పులు చేయనని వాగ్దానం చేశాడు. సర్దాక్షిణ్యంగా సాగాయి విమర్శలన్నీ. ఓల్గా వ్రాసిన వ్యాసాలు గూడా కొన్ని వచ్చాయి చర్చకి.

జాగ్రత్తగా విన్నదావిడ ఆ విమర్శలన్నీ; తన ప్రయత్నాలంటే అంత శ్రద్ధగా చర్చిస్తున్నందుకు సంతోషిస్తూ.

'చక్కని విలేఖరిగా తయారుకావాలి నేను. ఇంచాకటి ఆ వ్యాసకర్త చేసిన తప్పుల్లాంటివి చెయ్యకుండా వుండేందుకు నా శాయశక్తులా ప్రయత్నిస్తాను.' అనుకుంది లోలోపల.

"మీరు వ్రాయదులచుకున్న విషయాలన్నీ మీరే స్వయంగా పరిశీలించి వ్రాయడం మంచిది." అని అన్నాడు ఎడిటర్; "టెలిఫోన్ మీద ఎక్కువగా ఆధారపడడం మంచిది గాదు. ఇంచాకటి విలేఖరి చేసిన పొరపాటే అది: కూర్చున్న చోటునుంచి కదలకుండా, కావలసిన సమాచారం అంతా, టెలిఫోన్ మీద సేకరించుకున్నాడు. తాను వ్రాయదలకున్న విషయాన్ని స్వయంగా పరిశీలించలేదు. ఫలితం? ఆలోచనలూ,

విషయాలూగూడా కలగా పులగమైపోయినై. ఇప్పుడా తప్పుల కన్నిటికీ సమాధానం చెప్పుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. పత్రికా విలేఖరి అంటే, తానుచేసే పనిని సగర్వంగా చేయ గలగాలి, ప్రేమించగలగాలి, గౌరవించగలగాలి. అప్పుడుగాని ఆ పనంటే సంతోషం కలగదు. మనం బ్రతికేదీ అందుకేగదా! మనం చేసేపనినుంచి సంతోషం పొందడమే గదా, ఎవరు కోరుకున్నా?"

"నిజమే" అనుకుంది ఓల్గా, ఆనందంగా, 'ఎవరి పనిని వాళ్లు ప్రేమించడం అంటే ఏమిటో యిప్పుడు అర్థమౌతోంది నాకు!'

"ఐతే రే పెళ్ళిపోతున్నారన్నమాట మీరు!" అనడిగింది ఎగొరోవ్నా, ఓల్గాని. భోజనాలగదిలో పక్క సర్దుకుంటోం దావిడ. తలవైపున దిళ్ళు పేరుస్తోంది. "నాకు తలదగ్గర దిళ్లు బాగా ఎత్తుగా వుండాలి." మంచంమీద పక్క మళ్ళీ వొకసారి సర్దింది. "నాకు వెచ్చగా పడుకోవడం అలవాటు. ఇదివరకటిలా యిప్పుడు చలి భరించలేను; వయసుగూడా పెద్దదై పోయింది కదూ."

ఎగొరోవ్నామంచం ప్రక్కనేవున్న మడతమంచంమీద ఓల్గా పడక. ఆ మంచం మొనమీదమోపి కూర్చుంది ఓల్గా. ఇంకా దుస్తులు మార్చుకోలేదు.

గది నిశ్శబ్దంగా వుంది. ఎగొరోవ్నా అక్కయ్య పండు కుంది. రేడియేటర్ మీద వెచ్చబడడానికని పరిచిన రగ్గులమీద

ఒక పిల్లి ముడుచుకుని పడుకునుంది, ముందుకాళ్ళతో చెవ్వలు పట్టుకుంటున్నట్టు.

"బాగా చలేస్తుందని తెలుసు ఆ పిల్లికి" అంది ఎగొరోవ్నా, "చూడండి! ఎలా ముడుచుకుని పడుకుందో. ఎవరు కనిపెట్టారోగాని యీ రేడియేటర్లు!" అంటూ వెళ్ళి, తన కాలి మేజోళ్ళు తీసి, రేడియేటర్ మీద, ఆ పిల్లి ప్రక్కనే ఆరేసింది. "బంగారపు గనుల్లో ఇరవై నాలుగు గంటలూ మండుతూండవలసిందే పొయ్యి చలికాగడానికి. బోలెడు కట్టెలు నష్టం! ఇక్కడ చూడండి. ఈ యింట్లో యిన్ని భాగా లున్నవా? వాటికన్నిటికీ ఒకచే ఫర్నేస్! కట్టెల పనేలేదు. బొగ్గులూ, పీటుగడ్డి* మట్టుకుపయోగిస్తారు. చూశారా! కాలం యెంతెంతభివృద్ధౌతోందో. చూస్తూండండి. మా గనుల్లోగూడా చలిమంట లాపేసి, ఈ ఆవిరి రేడియేటర్లనే వుపయోగిస్తాం. అడవిలో చెట్లన్నీ నరికి, చలిమంటలు కాగడం వృధాగదూ? కొన్ని రోజులకీ అడవులే కనిపించకుండా పోతాయి. ఇప్పుడు గూడా గనులలోపల పూటీలకీ, పోటీలకీనని బోలెడుచెట్లు నరకాల్సొస్తోంది!"

ఎగొరోవ్నా లేచి రేడియేటర్ దగ్గరకెళ్ళింది. రేడియేటర్నీ, దానిమీద పడుకున్న పిల్లినీ ఒకసారి చేతితో నిమిరి వెళ్ళి పడుకుని రగ్గులాక్కుంది మీదికి. గట్టిగా ఆవులించింది; నిద్ర తోసుకొస్తోంది.

"ఇక్కడి సంస్కృతీ భవనాన్ని చూశారా? పార్కెట్ నేల. ఆర్కెస్ట్రా. బాగా వెలుతురు. ఖొలోద్ని కాన్‌లో మా

---

*ఈ గడ్డిని ఎండబెడితే, పంటచెరకుగా వుపయోగిస్తారు. బురదనేలలో బాగా పెరుగుతుంది.

క్లబ్బుగూడా యింత పెద్దగా వుంటుంది. కాని యిక్కడి ప్రదర్శనంమట్టుకు చాలా బాగుంది! పొట్ట చెక్కలౌతుందనుకున్నాను! ఆ పాటలూ, ఆ నాట్యమూ.... ఏమంటారు ఆ ప్రదర్శనాన్ని?"

"ఆపరెటా" అంది ఓల్గా; అందుకు సంబంధించిన కరపత్రాలు చూచిందావిడ.

"ఆఁ, ఆఁ, ఔను. ఆపరెట్టా." అని ఒక్క నిమిషం ఆగింది, ఎగొరోవ్నా; కిందటేడు బంగారం వుత్పత్తి అనుకున్న దానికంటే నలభై శాతం ఎక్కువ జేశారు మా వాళ్ళు. ఈ యేడు బహుశా అంతకంటేగూడా యింకా ఎక్కువే ఉత్పత్తి చేస్తాం. కాని మా సంస్కృతీ కార్యకలాపాలు బాగా వెనకబడివున్నై; వాటి మీదింకా ఎక్కువ శ్రద్ధ చూపాలి మేం. మా ప్రాంతంలో మంచి పాటగాళ్లుగూడా వున్నారు!"

లేచి, దుస్తులు మార్చుకుని, లైట్లార్పుతూ చిరునవ్వు నవ్వుకుంది ఓల్గా. వెళ్ళి మడత మంచంమీద పడుకుంది. మంచు పేరుకున్న కిటికీ అద్దాల్లోంచి గదిలోకి పడుతోంది వెన్నెల. నీలినీలి వెన్నెల. ఆవేళ హాస్పిటల్లో గడిపిన రాత్రి గుర్తొచ్చింది. మాస్కోవదలి వచ్చేనాడు...కలలో గూడ అనుకోలేదు తానూ, ఇవాన్ ఇవానొవిచ్ యిలా ఒకరికొకరు దూరమైపోతారని! యీ దూర వుత్తరప్రాంతానికి వచ్చింతర్వాత గాని తనకు అర్థం కాలేదు, సర్జెన్‌పని యెంత ముఖ్యమైనదీనీ. అతనికి భార్యగా వున్నప్పుడు, అతని చెప్పుచేతల్లో మెలగుతున్నప్పుడు, ఆయనపని ఎంతగొప్పదో తనకర్థం కాలేదెందుకని? ఇప్పుడు డాక్టర్ ఇవాన్ గొప్పదనం తెలిశొస్తోందే తనకి. ఎందుకని? దూరంగా వుండిచూడడం వల్లనా? లేక

పోతే, తన తెలివితేటలు అభివృద్ధి కావడం వల్లనా? ఐనా, ఆయన ప్రతిబింబం మీద, యింకో మనిషిరూపం అలుముకు నుంది; ఆ ప్రతిబింబంకంటె, యీ రూపం యింకా స్పష్టంగా వుంది; యీ రూపమంటేనే తన కెక్కువ ప్రేమ, అప్యాయం, శ్రద్ధ! డాక్టర్ ఇవాన్ సర్జరీలో ఎంతగొప్పవాడో, తావ్‌రోవ్ గూడా తనరంగంలో అంత గొప్పవాడూనా?

'గొప్పవాడు కాకపోతే, అలా గొప్పవాడయ్యేందుకు నేచేయగలిగిన సాయం అంతా చేస్తాను' అనుకుంది ఓల్గా; అనుకుని ఆనందంతో పరవశమై పోయింది.

ఎగోరోవ్నాని గురించీ, పత్రిక ఆఫీసులో కలుసుకున్న వారినిగురించీ ఆలోచించింది మళ్ళీ. ఇంతకుపూర్వం వాళ్ళ నెవరినీ చూచెరగదు. ఐనా, ఒకావిడ ఆతిథ్యాన్ని పొందింది; ఆ ఆఫీసులో వాళ్ళతో కలిసి పనిజేసేందుకు అంతా నిర్ణయమై పోయింది. ఇవ్వాళ, ఈ రాత్రి యీ గదిలో, యీ పక్కమీద, యిలా పండుకోగలగడమే ఒక నిదర్శనం, తనచుట్టూ వున్న వ్యక్తులు ఎంత వుత్తములో తెలుసుకోవడానికి. ఆ వ్యక్తులంటే కృతజ్ఞతాభావం కలిగింది ఓల్గాకి. గనులదగ్గరున్న మా త్రైమి యానోకి, గనుల్లో పనిచేసే కార్మికులు, ప్రభుత్వ వ్యవసాయ రంగాల్లో పనిజేసే రైతులు, స్త్రీలు, .... అందరూ గుర్తు కొచ్చారు. దూరసముద్ర ప్రయాణం జేసి, నేలమీదికి దిగి నప్పుడు కలిగినంత సంతోషమూ మళ్ళీ కలిగింది ఓల్గాకి. ఇప్పుడు తనకాళ్ళక్రింది నేల గట్టిగా వుంది! తనచుట్టూ వుండే యీ వ్యక్తులంతా తనవాళ్ళే. ఊపిరి పీల్చకుండా బ్రతకలేదు తాను; వీళ్ళులేకుండానూ బ్రతకలేదు. వీళ్ళే తనజీవితాని కూపిరి! వాళ్ళజీవితానికి తానుగూడా ఎంతోకొంత అవసరం కాగలి

గితే, తన అస్తిత్వం వాళ్ళ అస్తిత్వాని కెంతో కొంత ప్రయోజనం చేకూర్చగలిగితే, ఎంత బావుండును!

# 28

కప్పులోనుంచి వొలికిననీరు దారిలోనే గడ్డకట్టి పడింది కింకికి.

"అబ్బ! చలి చంపేస్తోంది." అన్నాడు నికీతా, డేరా దార ముసుగు క్రిందికొదుల్తూ.

"నిజమే" అన్నాడు ఇవాన్. చలిమంట ప్రక్కనే పైవ్ కాలుస్తూ కూర్చునున్నాడు ఇవాన్. "ఈ చలిమంట యింత బాగా మండుతున్నా, నాచేతులు చలితో వణికి పోతున్నై; అందులోనూ మంటకింత దగ్గరగా కూర్చునున్నా."

"ఇంకొక రెండురోజులు పోతే, యిక మన మకాం యూర్తు*ల్లోనే" అన్నాడు నికీతా.

సామానంతా సర్దికట్టేశారు. కోట్లు వేసుకుని బయటికెళ్ళారు. మంచుదుప్పలు సిద్ధంగా నిలబడి వున్నై. గుంపులు గుంపులుగా; కాలిగిట్టలు బాగా దృఢంగా, పెద్దవిగా వున్నై. కాలిగిట్టలకీ, సీలమండలకీ మధ్యవున్న భాగం చక్కగా సన్నగా వుంది.

"గిట్టలు దిట్టంగా వున్నై" అన్నాడు ఇవాన్; "కావాలంటే, ఆగిట్టల్తోనే మంచు తవ్వుకుని సంపాదించుకోవచ్చు కావలసిన ఆహారం."

*జంతు చర్మాలలో తయారుచేసిన డేరా. సైబీరియాలో ఆనాదిజాతుల యిళ్ళు.

ధృవాల్లో వుండే ఎలుగుబంటుల్లా వున్న రెండు మంచు దుప్పుల్ని తీసుకెళ్ళి, ఇవాన్ యొక్క స్లెడ్జ్‌బండికి కట్టారు.

డేరాని ముశిచేస్తున్నాడు నికీతా. ఇవాన్ గూడా వెళ్ళాడు సాయం జెయ్యడానికి. చేతుల మేజోళ్ళు తీయనవసరం లేకుండా, చెయ్యగల పనులన్నింటిలోనూ ఇవాన్‌గూడా సాయంజేస్తాడు వాళ్ళకి. శస్త్ర చికిత్స చేసే వాళ్ళకి చేతులు చాలా ముఖ్యం; వాటితరవాతే ఏదైనా.

స్టోవ్ బయటికి పట్టుకెళ్ళి, అందులో వున్న నిప్పంతా గుమ్మరించేశాడు నికీతా. ఇవాన్ వెళ్ళి గుడారం మధ్యవున్న గుంజతీసేశాడు. ఇద్దరూ కలిశి, గుడారం గుడ్డ మడతలు వేసేశారు. ఇప్పటిదాకా గుడారంవున్న చోట అంతా ఖాళీగా వుంది : మంచులో ఏదో పెద్దగుంట పడినట్టుంది; చుట్టూ చెట్ల కొమ్మలు. అందులో ఒకమూల రెండు పెద్ద దుంగలు అడ్డంగా పడున్నై. ఆ దుంగలకింద గొయ్యి బాగా లోతుగా వుంది. ఆ గొయ్యిలో మంచంతా కరిగి పోయింది. అడుగున పచ్చని పచ్చిక గూడా కన్పిస్తోంది. గుడారం తియ్యకపూర్వం, అక్కడ స్టోవ్ వుంది. ఆ వేడికి, మంచంతా కరిగి ఏర్పడిన గొయ్యి అది.

క్రిందటినాడు ప్రయాణం అనుకున్న దానికంటే బాగా ఆలస్యమైంది. అందుకని చేరాలనుకున్న మకాంకి చేరుకోలేక పోయారు. చీకటిపడగానే తమదగ్గరున్న గుడారాలే తీసి, వేసుకున్నారు. ఆలస్యమవడానికి కారణం, ఆ నది. నదిలోనీరు మంచుపగుళ్ళలోంచి పైకొచ్చి పడింది. పైకొచ్చిన నీరు మంచుమీద అద్దంలా పేరుకుపోయింది, దారంతా జారుడు.

దుప్పులు వేగంగా నడవలేక పోయినై. అడుగడుక్కీ జారి పడిపోవడం ప్రారంభించినై.

"ఇవ్వాళ గూడా ప్రయాణం కష్టమే ననుకుంటా. ఏమంటావ్, నికీతా?" అనడిగాడు ఇవాన్; స్లెడ్జిబండకి తాడొకకొసన బిగించి రెండోవైపుకి విసిరేస్తూ.

"కష్టంగానే వుండొచ్చు ముప్పాతిక మూడుపాళ్ళు" అన్నాడు నికీతా. నది 'వుడికిపోతోంది'. దార్లో యిబ్బందుల్సి రాకపోతే అంతమట్టుకది గొప్పే." అంటూ దాపటి దుప్పి నడుంచుట్టూ తిప్పిన తాడు, వెలపటి దుప్పి మీదికి విసిరేశాడు; ఖాళీగావున్న రెండోచివర స్లెడ్జికి ముడేశాడు. ఇక బళ్ళన్నీ సిద్ధంగా వున్నై బయల్దేరడానికి.

నదికటూయిటూ రాతిబండలు. గాలి బాగా విసురుతోంది. కొండలమీద మంచు కొట్టుకొస్తోంది ఆగాలికి. కన్నుల మీద చేతులు దొన్నెల్లా పెట్టి, కళ్ళు కుంచించి చూశాడు ఇవాన్.

మళ్ళీ జారిపడడం ప్రారంభించినై దుప్పులు. ముందొకటిజారి పడుతుంది; మళ్ళీ కాళ్ళకి పట్టుచిక్కే దాకా అట్లాగే ముందుకి పోతూంటూంది పొట్టమీద, పడిపోయింది పడిపోయినట్టే. దానికి కాస్త పట్టుచిక్కి, లేచి నడవడం ప్రారంభించీ ప్రారంభించకముందే రెండోది పడిపోతుంది. ప్రయాణం సాగడం లేదు. వాటికీ విసుగెత్తినట్టుంది. మెదిత్తే కదిత్తే వెనక్కి తిరగడం మొదలెట్టినై. ఇకలాభం లేదనుకున్నట్టున్నారు. కయ్యూర్లంతా బళ్ళమీదనుంచి క్రిందికి దిగారు; దుప్పులపలుపులు పుచ్చుకుని బళ్ళముందు నడవడం ప్రారంభించారు. వాళ్ళనిచూచి, ఇవాన్, నికీతాలు గూడా దిగారు బళ్లు

కొండలమీదనుంచి కొట్టుకొచ్చిన మంచు దుమ్ము దుమా·రంలాగుంది. దూరాన సూర్యోదయ మైనట్టుంది; కొండల అంచులన్నీ ఎర్రబారినై. నదిమీద కాంతిపడి మరీ మెరసి పోతోంది. ఆ కాంతులీనడం చూస్తే, గనులు గుర్తుకొచ్చినై ఇవాన్‌కి. మళ్ళీ గుండెబరువెక్కి నట్లనిపించింది. అంతా శూన్య·మనిపించింది. ఓల్గాతో వున్న నాలుగు మాటలూ అనేస్తే· పోయేదే అనుకున్నాడు ఇవాన్. అలాగే ముందుకు నడిచాడు· పలుపులు చేతపట్టుకుని.

చలి చంపేస్తోంది. ఐనా ముహం కప్పుకోలేదు ఇవాన్. ముహం కప్పుకోకపోతే, మంచు కొరుక్కు తింటుంది. కయ్యూర్లు ముహం కప్పుకుంటారు. ముక్కుమట్టుకు కొద్దిగా· కనబడుతుంది పైకి. ఆ ముక్కుచివరల మీదగూడా మంచు· పేరు కుంటుంది. ముహం కప్పుకోకపోయినా, ఎందుకనో గాని, ఇవాన్ మంచుకొరుకుడు రుచిచూచి యెరగడు. అప్పు డప్పుడూ, ముహం బండబారి నట్లనిపించినప్పుడు, చేత్తో రుద్దు· కుంటాడు చెంపలూ అవీనీ.

వాతావరణం మారిపోయింది అగస్మాత్తుగా. ఇంతకు పూర్వంనదికి ఎగువన కన్పించిన ఎరుపు కనిపించడం లేదిప్పుడు. దగ్గరగావున్న మంచు నీలిరంగుకు తిరుగుతోంది.......

కాళ్ళ క్రిందికి నీళ్లొచ్చింతర్వాత గాని అర్థం కాలేదు· ఇవాన్‌కి, పంజరుగుతున్నదీనీ. నీళ్ళు! మంచుమీద పారు తోంది నీరు ఆవిరితో కలిసి. ఇక ప్రయాణం సాగడం కష్టమే.

"ఇంకొక మూడుకిలో మీటర్లెళ్ళితే చాలు, నది వొడ్డు· కెక్కొచ్చు" అన్నాడు నికీతా; దారిచూపే మనిషి చెప్పిన· మాటలు విని.

ఇకిప్పుడు దుప్పులు గూడా ఎదురుతిరగడం మానేశాయి. చిందిన నీరు గుడ్డలమీద పడి గడ్డకట్టుకు పోతోంది. స్లెడ్జిబళ్ళ రన్నర్లంతా మంచుమయం. క్రింది పగుళ్ళలోంచి బయటి కొచ్చేనీరు కాస్తాగితే చాలు వెంటనే గడ్డకట్టుకుపోయి చిన్న చిన్న అడ్డకట్టలుగా తయారై పోతోంది. బళ్ళు ఆ కట్టలమీద కెక్కలేవు.

నది ఒడ్డు కెళ్దామని బయల్దేరాడు దారిచూపే మనిషి. ఇంతలో స్లెడ్జి బళ్లకింద మంచు కదుల్నాడింది. నికీతా ఇవాన్‌లు యిద్దరూ పక్కకి తప్పుకున్నారు. సర్జికల్ సామానూ, ఎలెక్ట్రికల్ సామాను అంతా నికీతా బండిమీదున్నై. రొమ్ముల్లోతు నీళ్ళల్లో, దారిచూపే మనిషి, ఆ బండినుంచిబండిదగ్గరికీ యీ బండిదగ్గర్నుంచి ఆ బండి దగ్గరకీ పరుగులు తీశి, దుప్పుల కట్టిన తాళ్ళు తెగ్గోసేశాడు. దుప్పులు పరుగెత్తినై. స్టౌవ్, ఆహారం, ఉన్నిసంచులూ, రగ్గులూ, నదికర్పణం ఐపోయినై.

ఇవాన్ ఇవానొవిచ్ గాభరా పడిపోయాడు. ముందులూ ఆపే వున్న బళ్లకేసి చూశాడు. అవిగూడా మునిగిపోతా యేమోనని భయం; ఆదుర్దా. ఉన్నకొద్దీ నీరెక్కువై పోతోంది. అనుకున్నట్టు, అప్పుడే సంచుల మీది, కెగబాకుతోంది. గబగబా, తనబండొదిలిపెట్టి నికీతాకి సాయం చెయ్యడానికి పరుగెత్తాడు. బండినీళ్ళల్లో మునిగిపోయింది. చేతుల్తో తమిడీ, బండి చక్రం పట్టుకున్నాడు. ఆపదలో అంతులేని శక్తొచ్చి పడుతుంది; ఆశక్తితో, ఆ రెండు చేతుల్తోనూ, మొత్తం బండినంతా పైకి లేపాడు. ఒకవైపున పొగమంచు; ఊపిరాడడం లేదు. ఐనా, అలాగే, ఆ బండినలా ఎత్తిపట్టుకుని ఒడ్డుకెళ్ళాడు. ఇకక్కడ బండిదింపి, యింకా పైకి యీడ్చాడు మంచుమీద.

మంచుమీద కోపంగా కాళ్ళతో తన్నుతూ, తనవెనకున్న వాళ్ళనందర్నీ రమ్మని పిచ్చికేక లేశాడు, చేతులూపుతూ. దుప్పులన్నీ ఒకదానివెనకొకటి ముట్టెల్తో పొడుచుకుంటూ పైకెక్కినై.

చేతులందించి ఒక్కొక్కళ్ళనీ పైకి లాగాడు ఇవాన్. అందరూ చేరుకోగానే, చిన్న చలిమంటేశారు అప్పటికప్పుడే గాలన్నమాట లేదు. దుస్తుల్లోంచి ఆవిరొస్తోందిపైకి. కయుర్యా ర్లూ, నికీతా కలిసి కాపాడి పట్టుకొచ్చిన సంచులు మంచు మూటల్లా వున్నై. వాటివంకొకసారి చూశాడు ఇవాన్. తనజేబులు తడుముకుని చూచుకున్నాడు : ఆజేబులో, రక్తాన్ని పోల్చి చూచుకునేందుకు సీరం ఏంపౌల్స్ వున్నాయి దూదిలో చుట్టి; పదిలంగానే వున్నై. అంత బరువూ ఎత్తుకు రావడం మూలాన, ఇవాన్ కాళ్లూ చేతులూ వణకిపోతున్నై గజగజ; కాని మనసుమాత్రం ప్రశాంతంగా వుంది. తనొచ్చినపని పూర్తిగాకుండా తిరిగి బంగారపు గనుల దగ్గరకి వెళ్ళిపోవల సొచ్చేది, ఏమాత్రం భయపడి వెనకాడినా; ఎంత సిగ్గు చేటు. ఎలాగైతేనేం, కావలసినవస్తువులన్నీ కాపాడుకున్నాడు: ఇంకేం కావాలి !

# 29

ఆ పిండివంటలన్నీ చూశారా ! ఎట్లా గడ్డకట్టుకుపోయి నయ్యో. కయుర్యార్లు పట్టుకొచ్చారాసంచి, లేకపోతే మునిగి పోవలసిందే" అన్నాడు నికీతా. అవన్నీ అట్టగట్టుకున్నట్టు పడున్నై.

"ఏం ఫర్వాలేదు. కొద్దిగా వెచ్చజేస్తే, పై కాగితం వచ్చేస్తుంది. తర్వాత నెమ్మదిగా కత్తిపెట్టి ముక్కలు చేద్దాం. వాటినొదిలి పెట్టొద్దులే తినకుండా." అన్నాడు ఇవాన్.

నికీతా నవ్వాడు.

"మీమాటలు వార్యా వింటేనా! బలేగా వుంటుంది. ఈ పిండివంటలెలా, ఎప్పుడు తినాలో అన్నీ ఒకచిన్న పథకం లాగా చెప్పుకొచ్చింది నాతో, బయల్దేర బోయేముందు!"

"మరవన్నీ నదిలో యీదులాడ్తాయని, ఆ యమ్మాయి కేం తెలుసూ" అన్నాడు ఇవాన్; వార్యా సంగతి గుర్తుకొచ్చి ఒకచిన్న చిరునవ్వు మెరసిందతని పెదవులమీద.

"ఏమైతే యేమిలెండి. మందుమట్టుకు జాగ్రత్తగా చేర్చాం చెడకుండా. డెనిస్ చేసింది మంచిదే అయ్యింది; మందులన్నీ తారుసంచుల్లో కట్టాడు తేమపడకుండా. నీళ్ళల్లో ఎక్కువసేపు వుండనివ్వలేదు గూడాను వాటిని."

"చూశావా, ఆబండినెట్లా ఎత్తుకొచ్చేశానో" అన్నాడు ఇవాన్, గర్వంగానే.

"నిజమే! నేనింకా ఆ పలుపులు కొయ్యనేలేదు, అప్పుడే పైకెత్తేశారు బండిని. మిమ్మల్ని చూస్తాంటే సాల్మన్ చేపల్ని పట్టే ఎలుగుబంటి గుర్తుకొచ్చింది నాకు. గుడ్లుపెట్టే కాలంలో ఎలుగుబంటి చేపల్ని వేటాడ్డం చూశారా ఎప్పుడన్నా మీరు?"

"ఆ చూశాను. కాని యీ కష్టాలన్నీ యింత తేలిగ్గా తప్పించుకున్నాం; అదృష్టవంతులమే."

అందరూ యిప్పుడు కొయ్యదుంగల గదుల్లో కూర్చున్నారు. 'నది వుడికి పోతోందని' తెలియగానే, స్థానిక

సోవియెట్ కొంతమంది యకూత్లని పంపింది వీళ్లకి సాయం జెయ్యడానికి. వాళ్ళు తీసుకొచ్చారు వీళ్ళని యిక్కడికి. గది బయట గాలిదుమారం తీవ్రంగా వుంది. చీకటి పడింతర్వాత మరీ ఎక్కువైంది. బయటగాలి గింగురుమంటూ రొద చేస్తోంది. ఆ రొదలు ఎక్కువైనప్పుడల్లా, గదుల్లో కూర్చున్న వాళ్లందరూ నిశ్శబ్దంగా, చేసే పనులన్నీ ఆపి, చెవులురిక్కించి కూర్చుంటున్నారు. చుట్టుపక్కల యుర్తుల్లో వుండేవాళ్ళు గూడా వచ్చారు డాక్టర్ ఇవాన్ని చూద్దామని. గదిలో నూనె దీపం వెలుగుతోంది. వందుప్రిమిట్టితో వేసిన పెద్దపొయ్యిలో చలిమంటగూడా ఎగిరెగిరి పడుతోంది బయట గోలచేస్తున్న దుమారాన్ని చూద్దామని అనుకుంటుందా అన్నట్టు.

ఈ ఆర్కిటిక్ తుపానే అంత; అంతకంటే ప్రమాదమైన దుర్మార్గపు జంతువుండబోదు అనుకున్నాడు ఇవాన్.

నిప్పుమీద ఊగిసలాడుతున్న కుండలో దుప్పి మాంసం వుడుకుతోంది.

"మార్ఫా అంతోనోవా యేదోకథ చెబుతోంది. ఆవిడ కడుపునిండా కథలే. విన్నవికొన్ని స్వంతం కొన్నినీ." అంటూ ఆవిడకూర్చున్న వేపుకి వేలుచూపి చెప్పాడు నికీతా. దూరంగా పొడుగాటి బల్లదగ్గర, మిగతా స్త్రీలతో కలిసి కూర్చునుంది మార్ఫా. ఆబల్లనిండా లేడి చర్మాలూ, నక్కతోళ్లూ యింతెత్తున పడివున్నై. మార్ఫా మధ్యవయసు మనిషి. కాయకష్టంచేసే దానిలా వుంది ముహం చూస్తే. జిల్లా సోవియెట్‌కు అధ్యక్షురాలు. డాక్టర్ని చూచేందుకని వచ్చింది.

శీతాకాలానికని కాళ్లకి చేతులకీ దుస్తులల్లుతున్నారు

చుట్టూ కూర్చున్న వాళ్ళు. అందులో కొందరు యువతులు సైపు కాలుస్తున్నారు ఒకళ్ళ కొకళ్ళందించు కుంటూ.

"చాలా చెడ్డ అలవాటది" అన్నాడు ఇవాన్, నికీతాతో; "ఆయువతుల్లో చాలామంది కామ్సొమోల్ సభ్యులనుకుంటాను. యువతులు, అందులోనూ పిల్లలు పొగ తాగడం చాలా అరిష్టమని చెప్పు వాళ్ళకి: అందులోనూ ఒకే సైపు అంతమంది త్రాగడం మరీ తప్పు. ఆగాగు, నేనే చెబుతాలే వాళ్ళకి; భోజనాలైంతర్వాత ఒకచిన్న వుపన్యాసం యిస్తాను."

"ఇక్కడ కామ్సొమోల్ సభ్యులు చాలామంచి వున్నారు" అన్నాడు నికీతా; "కావాలంటే యింతకంటె బాగా బ్రతకగలశక్తిగూడా వుంది వాళ్ళకి. ఈ సహకారసంస్థకి డబ్బుగూడా బాగా వుంది. ఎవరిపాత్రలు వాళ్ళు, ఎవరి తుండుగుడ్డలు వాళ్ళు సంపాయించుకోగలరు గూడాను." అంటూ లేచి కలయజూశాడు. ఎటుచూచినా గోడలనిండా ఖరీదైన వున్ని దుప్పట్లు కన్పించినై. "బాగా డబ్బున్న సహకారసంస్థ!" అని మళ్ళీఅన్నాడు సగర్వంగా.

ప్రయాణం మధ్యలో ఆగినప్పుడల్లా నికీతాకి వైద్యం నేర్పడం ప్రారంభించాడు ఇవాన్. చదువుకునేప్పు డతను చూపే దీక్షా, శ్రద్ధాచూచి ఇవాన్ సంతోషించేవాడు. తనకు తెలిసిందంతా చెప్పెయ్యాలనిపించేంది. ఈ వైద్యం నేర్చుకున్న తర్వాత; కావాలనుకుంటె, నికీతాకి చేతినిండా వుంటుంది పని. కామెనుష్కాలో యింకా యెంతమందికో యిస్తున్నారు శిక్షణ! ఇక్కడికొస్తూ ఆ వైద్య విద్యార్థుల్నందర్నీ గోసేవ్ చేతుల్లో పెట్టివచ్చాడు. గోసేవ్ కెందుకప్పగించానా అని అప్పుడప్పుడూ విచారం కలుగుతోంది యిప్పుడు. కాని, ఆ

సంగతి గుర్తుకొచ్చినప్పుడల్లా ఒక నిట్టూర్పు విడిచి, తన ప్రయాణాన్ని గురించీ, ఉచ్ఛఖాన్‌లో తాను చేయవలసిన పనిని గురించీ ఆలోచించడం ప్రారంభించే వాడు.

నికీతా అన్నమాటలు విని, ఇవాన్‌గూడా చుట్టూ కలయజూచాడు. నిజమే, ఎటుచూచినా విలువైన ఉన్ని. ఉన్ని దుకాణంలా వుంది గది. ప్రతి అలంకరణలోనూ, ప్రతి పక్కమీదా వున్నిదే ప్రధానస్థానం.

ఇది సేబుల్ జంతువుల వున్ని తెచ్చేందుకు అనువైన రుతువుకాదు. నికీతా లెక్కల ప్రకారం, అక్టోబరు నుంచి డిసెంబర్ వరకూ మట్టుకే దొరుకుతాయా జంతువులు. ఇకిప్పుడు ఉడుతలూ, శివంగులూ, చేపల్ని తినేఆటర్ జంతువులు మట్టుకు దొరుకుతై విరివిగా; వేటగాళ్లు గూడా అవే పట్టుకొస్తున్నారు.

'ఇక్కడగూడా ప్రజలు నానాటికీ అభివృద్ధి ఔతున్నారు.' అనుకున్నాడు ఇవాన్; 'ఇక్కడగూడా కార్మికులు పోటీపడి పనులు చాలా బాగా చేస్తున్నారు.'

భోజనాలైనంతర్వాత. ఆరోగ్యాన్ని గురించి, పొగ త్రాగడంవల్ల వచ్చేనష్టాల్ని గురించీ చిన్నవుపన్యాసం యిచ్చాడు ఇవాన్. తర్వాత వెళ్లి, నిప్పుపొయ్యి ప్రక్కన కూర్చున్నాడు, చలికాగుతూ.

మళ్లీ స్త్రీలందరూ ఒకచోట గుమికూడి తమతమ కుట్టుపనులు ప్రారంభించారు. మళ్లీ యింకొక కథ మొదలెట్టింది మార్ఫా. ఇవాన్ ఉపన్యాసం విన్నతర్వాత వెంటనే పొగ త్రాగడం అంటే యిష్టంలేక పోయిందావిడకి; అందుకని పైప్ చేతిలోనే పెట్టుకు కూర్చొని కథచెప్పడం ప్రారంభించింది.

"ఏమిటాకథ ?" అనడిగాడు ఇవాన్, నికీతానీ; చుట్టూ కూర్చున్న స్త్రీలంతా చాలా శ్రద్ధగా వింటున్నారు మార్ఫా చెప్పే కథ.

"ప్రేమకథ. విషాదాంతమయ్యే ప్రేమ కథ." అని చెప్పాడు నికీతా.

"ఏదీ, నాకనువాదం చేసి చెప్పు."



"ఈ కథ జరిగింది ఓలెక్మా ప్రాంతంలో. చాలా కాలం క్రితం జరిగిన కథ. నలభయ్యేళ్ళన్నా ఔతుంది జరిగి. ఆ ప్రాంతంలో ఒక యకూత్ కాంట్రాక్టరుండేవాడు. బాగా డబ్బున్నవాడు. బంగారు గనుల్లో కాంట్రాక్టుపని చేసేవాడు. వాళ్ళకాక్కావలసినవన్నీ గుర్రబ్బళ్ళలో పంపేవాడు. ఎండుగడ్డి వ్యాపారంగూడా చేసేవాడు. అతని భార్యపేరు దూన్యా. బాగా అందమైన మనిషి. ఆ అందాన్ని చూచి కొనుక్కొచ్చాడతను. ఆవిడ చుట్టపక్కాలు బాగా బీదవాళ్లు; అందుకని అమ్మేశారు. పెళ్లైంతర్వాత గూడా ఆవిడ అందం చెక్కుచెదరలేదు. అతనికైదుగురు పిల్లల్ని కన్నది. ఐనా పొడుగాటి చెట్టుల్లే అట్లాగేవుంది అందంగా. మొట్టమొదట్నుంచీ అనాథ; చదువు సంధ్యలులేవు. ఐనా అందరూ ఆవిణ్ణి గౌరవించేవారు; ఆవిడముందు మాట్లాడ్డానికి గూడా సిగ్గుపడేవారు. ఎప్పుడూ నల్లటి దుస్తులు వేసుకునుండేది. చేతులు పాలకంటె తెల్లగా వుండేవి. చెంపలు అడవిగులాబికంటె మిసుమిక్కిలి మృదువుగా వుండేవి. ఆవిడ నవ్వుతూంటే ఆ రెండు కనులూ రెండు చిరు

పతుల్లా వుండేవి. ఆవిడ యింట్లోకొచ్చి, "కాప్పే"అంటేచాలు, అందరూ నిశ్శబ్దం ఐపొయ్యేవారు. ఆవిడ హుందాతనమూ అదీ చూస్తే, అందరిలాంటి మనిషి కాదనిపించేది. ఎక్కువమంది ఆపిణ్ణి గౌరవించడానిక్కారణం గూడా అదే; ఆ హుందా తనం. యకూత్‌ల కసలు ఆడవాళ్ళని గౌరవించే అలవాటు లేదు. మంత్రగత్తెల్ని చూస్తేమటుకు భయపడి పోయేవారు. మంత్రగత్తెలూ ఆడవాళ్లే ఐనా, వాళ్ళదగ్గర మంత్రాలుంటాయి కాబట్టి భయపడక తప్పేదికాదు.

"దూన్యా పెద్ద కొడుకు చాలా చిన్నవాడే; ఐనా ఆ వసంతంలో జరిగిన గుర్రప్పందాల్లో పేరు తెచ్చుకున్నాడు. చిన్నప్పటినుంచీ పిల్లల్ని నిర్భయంగా వుండమని నేర్పేది తల్లి. తొమ్మిదేళ్లొస్తే చాలు, అడవి గుర్రాల స్వారీకి అనుమతి యిచ్చేసేది. పెద్ద కొడుక్కి పదమూడేళ్లొచ్చినయ్యో లేదో, ఏం జరిగిందో ఎవరికీ తెలియదు, ఉన్నట్టుండి ఒక సామాన్య కయ్యూర్‌ని తీసుకుని, యాకుత్‌స్క్‌కి లేచిపోయింది.

"మబ్బులూ గిబ్బులూ యేమీలేకుండా ఆకాశం వురిమితే ఎట్లా చెప్పుకుంటారో;" అట్లా చెప్పుకున్నారు అందరూ ఆ విష యాన్ని గురించి. ఆ రోజుల్లో, యకూత్‌ల్లో యీ లేచి పోవడాలూ అవీ ఏమీలేవు. భర్తనొదిలిపెట్టి, యింకెవరితోనో లేచిపోవడమంటే తల తీసేశినట్టే. కాని దూన్యా, భర్తనీ పిల్లల్నిగూడా వదిలిపెట్టి, లేచెళ్ళిపోయింది. భర్త తనని కొనుక్కొచ్చాడు; అతన్నావిడ ప్రేమించి యెరగదు; ఇకతని తో కాపరం జెయ్యడం కష్టమనుకుందేమో బహుశ! ఎవరికి తెలుసు ?

"నాకు యాకుత్‌స్క్‌లో కన్పించింది దూన్యా" అని కథ కొనసాగించింది మార్ఫా, కాస్సేపాగి; "అప్పుడావిడ చెల్లగా లేదు; లోపలి నరాలన్నీ కనిపించుతున్నై; మనిషి పాలి పోయింది. చెంపలు ఎర్రబారినపుడు, మంచులో నెత్తురులా వుండేది. మనిషి వాడిపోతూవుంది. మొత్తంమీదేదో మనోవ్యాధ పట్టుకుంది. జీవితమా ఒంటరి జీవితం. ఇరుగు పొరుగు వాళ్లా గౌరవించడం మానేశారు. ఆవిణ్ణి చూచి, అసహ్యించు కుంటూన్నట్టు దూరం దూరంగా తొలగిపోయేవారు. ఆవిణ్ణి చూస్తే, సానుభూతి కలిగింది; నేనూ అలాంటి దాన్నే; పాత దురాచారాల కన్నిటికీ ఎదురు తిరిగిన దాన్ని. మా యిద్దరికీ స్నేహం యేర్పడింది. తన కష్ట సుఖాలన్నీ నాతో చెప్పుకుంది దూన్యా."

"కనీసం కడగొట్టు బిడ్డనైనా తనకిమ్మని బ్రతిమాలింది భర్తని. అతనొప్పుకో లేదు. ఇరుగు పొరుగు వాళ్ళు తనని గౌరవించక పోయినా దూన్యా అంతబాధ పడలేదు గాని, తన బిడ్డలే తనకి దూరమౌతారని తెలిసింతర్వాత కుళ్ళి కుళ్ళి యేడ్చింది. దానికి తోడు ఆ కయ్యూర్ చేసిన మోసం. ఆవిణ్ణి లేపుకుపోయింది ప్రేమతో కాదు, కామంతో. ఆ కామం తీరి పోయింతర్వాత అతని నిజ స్వరూపం బయటబడింది. దూన్యా అది చూచి అతన్ని ఎత్తి పొడిచేది; పట్టుకు తన్నేవాడు. ఇక చావు తప్ప గత్యంతరం లేదనుకుంది దూన్యా."

"తర్వాత కొద్దికాలానికి చనిపోయింది గూడాను. విషం తాగలేదు. ఉరి పోసుకోలేదు. ఆ బాధతో అలాగే క్రుంగి కృశించి ప్రాణాలొదిలింది" అని ముగించింది మార్ఫా.

"నేనైతేనా, చచ్చినా వూరుకునేదాన్ని గామ. కోర్టుకెళ్ళేదాన్ని. పోట్లాడైనా సరే, నా బిడ్డల్ని నేను తెచ్చుకునేదాన్ని" అన్నంతవరకూ ఆ కథ వింటూకూర్చున్న యువతుల్లో ఒకావిడ; "నాకేం కష్టమా? నా పిల్లల్ని నేనే సాకుకునేదాన్ని."

"యికచాల్లే, నోరు ముయ్యవే పిల్లా!" అంది మార్ఫా; ముద్దు ముద్దుగా; "ముందు నీ చదువు పూర్తిచేసి దర్జీపని నేర్చుకో. నీ చేతులు వాటంతటకవి పని చేస్తాయని నమ్మకం కుదరగానే నిన్నొక దర్జీ షాపుకి మేనేజరుగా పడేస్తాం. నువ్వేదూన్యా వైనా నీకూ గత్యంతరం వుండేదికాదు. ఆ రోజులే అలాంటివి. ఆడవాళ్ళకి ముక్తి అంటూ వుండేదిగాదు. ఇప్పుడంటే రోజులు మారినై. ఈ రోజుల్లో సమిష్టి క్షేత్రాల్లో ట్రాక్టర్లుగూడా నడుపుతున్నారు స్త్రీలు. మొన్న సుప్రీమ్ సోవియెట్ చివరి సమావేశానికని యాకుత్స్క వెళ్ళినప్పుడు చూశాను. ఏంబ్యులెన్స్ విమానాన్ని యకూత్ స్త్రీలు నడుపుతున్నారు. వాళ్ళని చూస్తుంటే అపరిమితమైన ఆనందం వేసింది నాకు. అదంతా సోవియెట్ ప్రభుత్వం చేసిన మేలు మనకి!" అని తన రొమ్ము మీదున్న పతకాన్ని సగర్వంగా తాకి నలువైపులా చూచింది సంతోషంగా; ఆ పతకం యకూత్ ప్రభుత్వంలో ఆవిడగూడా సభ్యురాలనేందుకు నిదర్శనం.

ఆ రాత్రి, ఇవాన్ ఇవానొవిచ్, ఓల్గాని గురించి కలగన్నాడు. మార్ఫా చెప్పిన కథకి ఓల్గా కథా నాయకురాలు. స్లెడ్జ బండిమీద వేసుకుని ఆవిణ్ణి తోలుకు పోతున్నాడు; ఓల్గా హృదయ విదారకంగా ఏడుస్తోంది. అగస్మాత్తుగా, బండి నదిలో పడిపోయింది, ఇవాన్ ఇవానొవిచ్ కి, మెలకువ వచ్చింది.........

గాలి యింకా వీస్తూనే వుంది; మంచు నటూ యిటూ చెదరగొడుతూ కిటికీల మంచు తెరల్లోంచి బయట కటిక చీకటి కనిపిస్తోంది. చలి మంట యింకా మండుతూనేవుంది. అటులో కప్పుమీదా, ఏటవాలు గోడల మీద పడి ప్రతిఫలిస్తోంది వెలుగు. డేరా కప్పుమీద, గుంజలు విడిపోయిన చోట అంతా నీడలు నీడలుగా వుంది, చారలు చారలుగా. తాతలనాటి కథల్లో తూర్పు దేశాల్లో నవాబుల గుడారాల్లా వుంది.

ఇవాన్ ఇవానొవిచ్ తలపులన్నీ ఓల్గాని గురించే యిప్పుడు. తనకంత దూరమెందుకై పోయింది. మొట్ట మొదటావిడ కామెనుష్కా వచ్చినప్పటి సంగతులు జ్ఞప్తికి తెచ్చుకోబోయాడు. అప్పుడు తనతో ఏమనంది ఓల్గా? ఏమో; మాటలు గుర్తుకు రాలేదు. ఆవిడ చేతినును వెచ్చదనమూ, ఆ స్పర్శవల్ల అతను పొందిన అమర సుఖమూ మట్టుకు గుర్తుకొచ్చినై. మళ్ళీ అలాంటి స్పర్శకోసం, అదే స్పర్శకోసం అతని శరీరమంతా తహ తహలాడింది.

'మేమిద్దరమూ కలిసివుండడానికా స్పర్శ ఒక్కటేనా కారణం?' అని ఆలోచించుకున్నాడు భయంభయంగానూ, సిగ్గుసిగ్గుగాను; "ఈ స్పర్శతప్ప, యీ మధురస్పర్శ తప్ప మరేమీలేదా ? మాతాతలకంటే మేమేమీ మెరుగు కాదన్న మాటేనా ? కాని, వాళ్ళకి కొన్ని కట్టుబాటులునైన్నై, కొన్ని ఆచారాలునైన్నై; అందుకని యిష్టంవున్నా లేకపోయినా భార్యాభర్తలు కలిసేవుండేవారు. మూర్ఫా చెప్పినకథలో దూన్యా గుర్తుకొచ్చింది ఇవాన్‌కి. 'దూన్యా ఎందుకు నాశనమై పోయింది ? తన కుటుంబాన్ని కాదని వదలిపెట్టి వెళ్ళిపోయింది కాబట్టి. దూన్యాపారిపోయిందీ, తేచిపోయిందీ పోకిరీతనంవల్ల

కాదు; నిజమైన ప్రేమని వెదుక్కుంటూ వెళ్ళింది. ఇప్పుడు నన్నూ ఓల్గానీ ఏకంచేసే బంధనం ఏముంది? ప్రేమలేకపోయిం తర్వాత యిక ఓల్గామీద నాకు హక్కేముంది? ఆ ప్రేమాలేదు, ఆ బంధనమూ లేదు, ఏమీ లేదు. ఇకేమీలేదు! ఓల్గా నన్నొది లేశింది; వొదిలేశెళ్ళిపోయింది; నన్నెప్పుడూ ఎరగని మనిషిలా వదిలేసి, పోయింది!

గాలి పెద్దగా వీచింది. డేరా పునాదుల్తో కదిలినట్లు య్యింది; చలిమంట గప్పుమని లేచింది. ఇవాన్ క్షుభితహృద యంలో గూడా ఒకమాట గప్పుమని లేచింది పైకి: ఎరగని మనిషి!

పక్కమీదినుంచి లేచి, ఉన్ని మేజోళ్ళు తొడుక్కుని, శబ్దం చెయ్యకుండా వెళ్ళి, చలిమంటదగ్గర బల్లమీద కూర్చు న్నాడు. పొగతెల్లగా లేచి, పొగగొట్టంలో కెళ్తూంటే చూస్తూ తన ఆలోచనల్లో తాను సతమత మౌతున్నాడు.

మళ్ళీ గనుల దగ్గరకెళ్తే యెలా వుంటుంది? ఓల్గానీ, ఓల్గాప్రియుణ్ణీ కలుసుకుని, వాళ్ళిద్దర్నీ శిక్షిస్తే ఏమౌతుంది? తనకింత దుఃఖం తెచ్చిపెట్టిన వాళ్ళని శిక్షిస్తే తప్పేముంది?.... ఇవే ఆలోచనలు.

"ఇకప్పుడు మాతాతలకీ నాకూ తేడా ఏముంటుంది?" అని గొణుక్కున్నాడు; "అదీగాక, పూర్వు లందరికంటే యింకో అడుగైనా ముందుండాలని ప్రయత్నిస్తున్న వాణ్ణి నేను. ఓల్గా స్వతంత్రంగా వుండాలనంటే, ఎప్పుడూ కాదన లేదు నేను. మార్ఫా చాలా చక్కగా ముగించిందా కథ- 'ఏంబ్యులెన్స్ విమానాల్ని యకూత్ స్త్రీలు నడుపుతున్నారు'- నిజమే; మార్ఫా అంత ఆనంద పడడంలో తప్పేమీ లేదు."

# 31

"ఇదే ఉఛఖాన్ స్కూలు. పదేళ్ళబడి." అన్నది మార్ఫా ఇవాన్‌తో. ఇవాన్ దళం ముందే వచ్చేశింది స్కూలు దగ్గరకి; మార్ఫా బాగా వెనకే బయల్దేరింది. ఆవిడి స్లెడ్జికి కట్టిన మంచు దుప్పులు బాగా బలమైనవి. అంచేత తొందరగానే వచ్చి కలుసు కోగలిగింది వాళ్లని.

వాళ్ళందర్నీ చూచి, స్కూలు పిల్లలందరూ బయటికి పరుగెత్తుకొచ్చారు: నల్లని జుత్తు, బాగా పొట్టిగా వేసిన కత్తిరింపు; మెత్తని బూట్లు, బూట్ల అంచులకి రంగురంగుల వున్ని; ఉన్నిదుస్తులు.

"ఇది మగపిల్లలుండే చోటు" అని చెప్పింది మార్ఫా. పిల్లల్నందర్నీ పేర్లుపెట్టి పిలిచి పలకరించింది.

పిల్లల్తో ఏదో చెప్పింది వాళ్ళ భాషలో. వాళ్ళందరూ పరుగెత్తుకెళ్ళారు స్లెడ్జీల దగ్గరికి, నికీతాకి సాయం జేసేందుకు.

"ఆడపిల్లలందరూ యింకోయింట్లో వుంటారు." అంటూ దూరంగా వున్న యిల్లొకటి చూపించింది మార్ఫా. చేయెత్తి చెట్ల మైదానంలోంచి, కొండలు పైకి లేచేచోట, కొన్ని యిళ్లున్నై. ఆ యిళ్ల పొగగొట్టాలన్నీ బారులుతీరినట్టు కన్పిస్తున్నై. ఆ యిళ్లవంక చూపింది మార్ఫా. "మా దుకాణాలు విద్యుత్కేంద్రం, జిల్లా సోవియెట్ ఆఫీసు, ఉన్ని వ్యాపార కేంద్రం,.... రేడియో కేంద్రంఅన్నీ అక్కడే ఉన్నై. తొందర్లోనే యిక్కడ గనులుగూడా తవ్వబోతున్నారు. ఒకసారి మీరుగూడా రండి అక్కడికి. ఎంతోదూరంగూడా లేదు. యిక్కడికి ఉదయం పూటొస్తాను, ఉలుస్ ఫెల్డ్ షెర్‌ని వెంటబెట్టుకుని. ప్రస్తుతానికి

మీదగ్గరా ఫెల్డ్‌షెర్ వుండడం మంచిది; పని నేర్చుకుంటాడు. మాకొక మంచి డాక్టరుండడం చాలా అవసరం. ఈ ఉలుస్‌లో జనాభా దినదిన ప్రవర్ధమానం ఔతోంది. ఇదివరకు అందరూ కలిసి వొకచోట వుండడం గిట్టేదికాదు యకూత్‌లకి. ఇప్పుడు మేమూ రష్యన్ పద్ధతి అవలంభిస్తున్నాం. అప్పుడు యిరుగు పొరుగులంటే యిష్టంవుండేది గాదు వాళ్ళకి. గ్రామాలనేవి వుండేవేకాదు. గ్రామాలుంటేనే బావుంటుంది. సమిష్టిజీవితం చాలా ఆనందంగా వుంటుందిగదూ! మీకిక్కడ బాగావుందా ?

"ఆ బాగానేవుంది" అన్నాడు ఇవాన్ ఇవానొవిచ్, హృదయపూర్వకంగానే. దూరాన పర్వత శ్రేణులు, పెద్దపెద్ద లోయలు, ఎగుడు దిగుడు శిఖరాలు; నిజంగానే మనోహరంగా వుంది.

ఈ ఉత్తరప్రాంత దృశ్యాలంటేనే మమత ఇవాన్‌కి. గొప్ప శాస్త్రీయ సంగీతంలా వుంటాయి. తన హృదయ బాధను మాన్పే అంజనంలా వుంది.

"ఇక్కడ, ఇక్కడా ఆకాశం గూడా మంచుతో చేసి నట్టువుంది తెల్లగా,....దూదిపింజల్లా తేలిపోతూన్న ఆమబ్బులు ...." అనన్నాడు మార్ఫాతో; "సన్న వాతావరణం యింకా బావుంది; కాని ఎందుకనో గాలినిండా ఏదో మెరిసిపోయే ధూళి గూడా వున్నట్టనిపించింది."

"అదా ! అదిమంచు. డిసెంబర్‌నుంచి ఫిబ్రవరి దాకా యిక్కడ మంచలాగే పడుతుంది" అంది మార్ఫా; మంచు బాగా కురిసిందీ అంటే వసంతకాలం వచ్చేశిందన్న మాటే. అదిగో....అక్కడున్నై మా తోటలు. యింకా అవతల వున్న వన్నీ మా పశ్చిక బయళ్ళు. మా సమిష్టి క్షేత్రాల్లో కావలసి

నన్ని ఆవులూ, ఎద్దులూ వున్నై. మందలు, మందలు. చిన్న చిన్న పనులకన్నిటికీ ఎద్దుల్నే వుపయోగిస్తాం. దూరప్రదేశాలకి బరువులు మొయ్యవలసినప్పుడు మాత్రం గుర్రాల్నుపయోగిస్తాం. సంవత్సరం పొడుగూతా యిష్టంవచ్చినట్టు తిరుగుతూంటై 'తైగా' ప్రాంతం అంతటా. కాని యిప్పుడిప్పుడు పొలాల్లో పనులకిగూడా వుపయోగిస్తున్నాం గుర్రాల్ని". మొత్తం ఆజిల్లాలో జరిగిన అభివృద్ధి కార్యక్రమాలు, సాధించిన విజయాలూ అన్నీ పూసగుచ్చినట్టు చెప్పదలచుకుంది మార్ఫా. ఆవిడ జీవితం అంతా ఆవిజయ సాధనలోనే గడచింది. ఇప్పుడు డాక్టర్ ఇవాన్ ఆ జిల్లాకి రావడంగూడా, సాధించిన ఆ విజయాల్లో ఒకటి!

"కాస్సేపు విశ్రమించండి. మీరోగుల్నొకసారి చూడండి. తర్వాత మీకు మా చేపల పరిశ్రమ చూపిస్తాను. సేబుల్ జంతువుల రక్షణస్థలం చూపిస్తాను: ఆ జంతువుల్నిప్పుడు వేటాడగూడదని నిషేధం పెట్టాం. అక్కడెన్ని జంతువులున్నవో చూచి, తర్వాత అ నిషేధం తొలిగిస్తాం. మీ కెందుకు. అన్నీ చూపిస్తాగా నేను మీకు" అంటూ వెళ్ళి తలుపులు తెరచింది మార్ఫా.

స్కూలు భవనం బాగా పెద్దదే. లోపలన్నీ టేబుల్స్, బెంచీలు. స్టోవ్‌లన్నీ బాగా ఎర్రగా కాలుతూన్నై; ఐనా పై కిటికీల మీదింకా మంచు పట్టేవుంది.

"మీ గనుల అధికారులు బాగా సాయంచేశారు మాకు. వారి సాయంతోనే యీ స్కూలు కట్టుకున్నాం" అని చెప్పింది మార్ఫా; "ఈ స్కూల్లో వున్న స్టోవ్‌కీ, మా డేరాలో వుండే చలిమంటల పొయ్యిలకీ చాలా తేడావుంది; మొట్టమొదట వీటిని

వెలిగించడం గూడా చేతనయ్యేది కాదు మాకు. తర్వాత తర్వాత, అన్నీ నేర్చుకున్నాం."

ఒకమూలనున్న రెండు గదులూ, ఇంతవరకు నిద్రపోయేందు కుపయోగించిన పెద్దగది (డార్మిటరీ) ఒకటీ యిచ్చారు హాస్పిటల్ కని.

"ఇది మీకు పనికొస్తుందిగదూ ?" అనడిగింది మార్గా. ఆపరేషన్లైపోయిం తర్వాత రోగుల్నీ పెద్దగదిలో వుంచ వచ్చును. చూశారా, అప్పుడే పక్కలూ, మంచాలూ అన్నీ సిద్ధం చేసేశాం. మీ రుండేది ఆ గదిలో. దానవతల గది రోగుల్తో మాట్లాడడానికి. దాని కవతల ఆపరేషన్ గది వుంది. ఆపరేషనైంతర్వాత, రోగుల్ని అటు ఆగదిల్లోంచీ, మీ గదిలోంచీ తీసుకురావడం మంచిదికాదని చెప్పాడు ఫెల్డ్ షెర్. అందుకని, అక్కడ గోడలో యింకొక ద్వారం పెట్టించాం."

"బావుంది; బావుంది: చాలా బావుంది. మా ఎలెక్ట్రిక్ సామానులికి ప్లగులుగూడా పెట్టించారు. చాలా బావుంది."

"మీ రొచ్చేప్పటికి అన్నీ సిద్ధం చెయ్యాలి గదాని సిద్ధం చేశాం; ఆపరేషన్లకి. మా ఫెల్డ్ షెర్ గూడాసాయంగావుంటాడు. ఇదివర కిక్కడొక నర్స్ గూడా వుండేది. మీ రొచ్చేముందే సెలవు పెట్టింది. ఉకమ్బాన్ లో, ఆనర్స్ తల్లికి బాగా జబ్బుగా వుందట; అందుకనీ, సెలవు పెట్టింది" అంటూ డాక్టర్ వెనకాతే నడుస్తూంది మార్గా. ఇంకా వాళ్ళిద్దరూ ఉన్ని దుస్తుల్లోనే వున్నారు; ఆ దుస్తులోంచి ఆవిరొస్తోంది పైకి. పని ప్రారంభించేందు కిద్దరూ సిద్ధంగానే వున్నారు.

డాక్టర్ కోసమని ప్రత్యేకించిన గదిలో అడుగు పెట్టారు ఇద్దరూ. కళ్లు జిగేలు మన్నాయి. ఏటు చూచినా విలువైన

ఉన్ని రగ్గులు. పండుకునే మంచం. మంచంమీదొక వెండి నక్క తోలు. గోడలనిండా ఖరీదైన రగ్గులు. రగ్గులనిండా అల్లిక పని. క్రింది నేలమీదగూడా రగ్గులు. ఆ రగ్గులమీద మళ్ళీ వెండి నక్క చర్మాల గుట్టలు.

దీర్ఘంగా నిట్టూర్చింది మార్ఫా; ఇవాన్ వంక చూడకుండా, చెప్పడం ప్రారంభించింది. "మా సమిష్టి క్షేత్రం అధ్యక్షుడూ, వేట సహకార సంఘం అధ్యక్షుడూ కలిసి, మిమ్మల్ని సంతోషపెట్టాలని చేశారీ పని. ప్రత్యేకించి యీ రగ్గులకోసమని, దుప్పి చర్మాలిచ్చి పంపారు కొందర్ని. అవి మారకంచేసి పట్టుకొచ్చారివన్నీ. ఛుకోత్కాలో ఒక పెద్ద అధికారి వున్నాడట. గోడలనిండా వెండి నక్క చర్మాలు వేళ్ళాడేస్తేగాని, అందంగానూ, వెచ్చగానూ వుండదని అన్నాడట ఆయన. ఆయన్ని సంతోషపెడదామని అక్కడ వాళ్ళలాగే చేశారట. మా వాళ్ళది విన్నారు. మిమ్మల్ని సంతోషపెట్టాలని యివన్నీ తీసుకొచ్చారు."

మార్ఫా అలా ఎందుకు నిటూర్చిందో వెంటనే అర్థమైంది ఇవాన్‌కి. "ఎందు కొచ్చిన ఖర్చు యిది! అర్థం లేదు. ఇలాంటి గదిలోకి అడుగుగూడా పెట్టను నేను" అని ఆ వున్ని రగ్గులు తీసి, చేతితో పరీక్షించి మెచ్చుకుని, "సరే, యికివి యిక్కణ్ణుంచి తీసెయ్యండి. ఇవిక్కడగాదు వుండవలసింది; సమిష్టి క్షేత్రం ఆఫీసులోనూ, సహకార కేంద్రం ఆఫీసులోనూ వుండనీండి" అన్నాడు.

మార్ఫా ముహం చేటంతయ్యింది. అవెక్కడున్నా తన కొకటే అన్నట్టు నటించబోయింది; కాని చివరికి "ఆ పెద్ద

అధికారి ఛుకోత్కాలో అధికారి నిజమైన సోవియెట్ అధికారి కాదు సుమండీ!'' అని అనేశింది.

# 32

భోజనాలైన తర్వాత, యిక రోగుల్ని చూడాలి పద మన్నాడు ఇవాన్.

"పదండి, పదండి" అంది మార్ఫా ఉత్సాహంగా; "సంతకొచ్చినట్టు వొచ్చారు జనం. దూర దూరాలనుంచి వొచ్చారు. నేను యీ ప్రాంతందాన్ని కాదు. మాది లేనానది వొడ్డుననున్న వూరు. మా నాన్న ఎలా వుండే వాడోగూడా తెలియదు నాకు; నా చిన్నప్పుడే చనిపోయాడు. తర్వాత మా తల్లి, పొరుగూరతన్ని పెళ్లాడింది. నన్నూ, నా యిద్దరు తమ్ముళ్ళనీ తనతోపాటు భర్తయింటికి తీసికెళ్ళాలను కుంది మా అమ్మ. మా వూరు వాళ్లొప్పుకోలేదు. అదొక ఆచారం. ఆ ఆచారం ప్రకారం మేం ఆ వూళ్ళోనే వుండి పోయాం. అవుదూడల చర్మం కప్పుకునేవాళ్ళం. తిండికోసం డేరా డేరాకి తిరిగే వాళ్ళం. కాళ్ళకి చెప్పులుగూడా లేకుండా మంచులోపడి: ఇప్పుడంటే ఉచఖాన్ అంతా నా యిల్లే అన్నట్లు తిరుగుతున్నాగాని, అప్పటి బ్రదుకే వేరు; కుక్కబ్రదుకు; కుక్క కంటే కనాకష్టం. ఇప్పుడంటే నేను ఒక మనిషిని. నా చుట్టు ప్రక్కల వుండే వాళ్ళంతా నా చుట్టాలే అనుకుంటాను యిప్పుడు. ఇక్కడున్న ఆస్థంతా నా స్వంతమే అనుకుంటాను. ఇవాన్ ఇవానొవిచ్, మీ రొచ్చారు! యిప్పుడిక్కడికి. ఇక్క డున్న ఆస్తంతా మీదిగూడాను యికనుంచి. ప్రజల డబ్బు అనవ

సరంగా వ్యయమౌతూంటే బాధేస్తుంది నాకు. మీకూ బాధగానే వుంటుంది; కాదూ? అంటే మీరుగూడా యీ ఆస్తంతా మీదే ననుకుంటున్నారన్నమాట. ఔనా?"

"ఔను" అంటూ లేచాడు ఇవాన్; ఉన్నిటోపీ తీసుకుని తలమీద పెట్టుకున్నాడు.

"అటు చూడండి" అంటూ చెయ్యి పట్టుకు లాగింది మార్ఫా; "ఆ కొండలు చూశారా! నది కవతలవేపున లేవూ? అవి! ఆ కొండల్లో పైన బొగ్గుందట, బొగ్గు. ఇంకాస్త అటు పోతే ఇనుమూ, తగరమూ వున్నయ్యట. బొగ్గూ, ఇనుమూ అంత దగ్గర దగ్గరగావుంటే యింకేం కావాలి చెప్పండి. పరిశ్రమలు స్థాపించడం తేలిక. ఉచఖాన్ ఒక పెద్ద నగరం ఐపోతుంది. రెండు మూడేళ్ళైతే మనమే గుర్తుపట్టలేం; అలా మారిపోతుంది. ఇనుము బయటికి తీయడంలో యకూత్‌లు బహు నేర్పరులు. యకూతియాలో వున్న వడ్రంగులు బాగా పేరుమోసినవాళ్ళు. కాకపోతే వాళ్ళదంతా చేతిపని. ఐనా ఫర్వాలేదు. ఫౌండ్రీల్లో పనిచెయ్యడానికి కావలసినంతమందున్నారు యువకులు."

"ఫెల్డ్‌షెర్ ఇక్కడికి వసంతకాలంలో వస్తాడు" అని చెప్పాడు, ప్రక్కనే నడుస్తున్న నికీతా.

మళ్ళీ తన జన్మభూమిల్లోకీ, ఆ పర్వతపంక్తుల మధ్యకి వచ్చినందుకు చాలా సంతోషంగా వుందతనికి. ముఖం అంతటా కన్పిస్తోంది ఆ సంతోషం. ఆ చీమ కళ్ళల్లోంచి ఆ ప్రకృతినంతా చూడడం కష్టంలాగానే కన్పించినా, ఆ కన్నులు సూటిగా ప్రతి చిన్న వివరాన్నిగూడా వదలకుండా స్వీయం చేసుకుంటున్నైప్పుడు.

"ఈ వేసవిలో కనీసం వొక ముప్పై పక్కలన్నా వుంటే హాస్పిటల్‌ని నిర్మిద్దాం. అక్కడ శిక్షణపొందే ఫెల్ద్‌షెర్‌లందరూ యిక్కడికే కావలశొస్తారు బహుశ" అంది మార్ఫా.

"నేను ఫెల్ద్‌షెర్ నౌతానంటే నమ్మకం కలగకుండా వుంది" అన్నాడు నికీతా, ఇవాన్‌వంక చూస్తూ; దేశమంతా తిరుగుతూ, వాళ్ళకీ, వీళ్ళకీ వైద్యం చెబుతూ తిరుగుతూ ఆగమంటే ఆగలేను. మా ప్రాంతం చాలా విచిత్రమైన ప్రాంతం. ఉత్తరాన తెల్లటి టండ్రాలు: తెల్లటి ధృవప్రాంతపు ఎలుగుబంట్లు, సీల్ జంతువులు, రాత్రిళ్ళు ధృవాల వెలుతురు. ఐనా యిక్కడికంటె అక్కడే వెచ్చగా వుంటుంది. ఈ లోపలి ప్రాంతం అంతా యకూతియా. ఈ యకూతియాకి సముద్రపు గాలి రాకుండా పర్వతాలు అడ్డుకుంటున్నై. మా వెర్హోయాన్‌స్క్ కూడా అంతే: చుట్టూ పర్వతాలు. అతి చలిగా వుంటుంది. ప్రపంచంలోకల్లా చలి ప్రదేశం. శీతాకాలంలో ఒక్కొక్క రాత్రి నెలన్నరరోజులుంటుంది. మంచుచూస్తే ఏమంత పెద్దగా పడదు; ఐనా ధర్మామీటరు సున్నాకింద డెభ్భై డిగ్రీలు చూపుతుంది. ఇంకా ఉచ్ఛ్వాన్ మెరుగు; కాస్త వెచ్చగా వుంటుంది."

"ఐతే మాత్రమేం? వేసవికాలం బాగా వేడిగానే వుంటుంది" అంది మార్ఫా.

## 33

క్రింద లోయ; చెట్లు గుంపులు గుంపులుగా, సముద్రంలో దీవుల్లా వున్నై. పైన ఆకాశం; పొగ మబ్బులు కదలకుండా మెదలకుండా యెక్కడివక్కడ నిలబడివున్నై. అనాదుల గుడి

శెలూ, గుడారాలూ అక్కడక్కడా చెదురు చెదురుగా కన్పిస్తున్నై. పొగమంచులోంచి సూర్యుడు కన్పిస్తున్నాడు, చాలా క్రిందగా వ్రేళ్ళాడుతున్నట్టు; సూర్యుడి చుట్టూ రంగు రంగుల గుడి కట్టింది. మంచు గడ్డకట్టుకుపోయిన అడవిలోంచి ఒక యకూత్ బయటి కొచ్చాడు: ముక్కోణాకారపు టోపీ, *సోన్ దుస్తులు; వచ్చి మంచు దుప్పుల్ని పిలిచాడదొక వింత గొంతుతో. ఆ పర్వతశ్రేణుల్లో ఆ గొంతు విచిత్రంగా ప్రతిధ్వనించింది.

నదిపైన మంచు గడ్డ కట్టుకునుంది పొరలు పొరలుగా. ఆ పొరల పగుళ్ళలోంచి, అక్కడక్కడా, నల్లటినీరు కన్పిస్తోంది. ఇవాన్ ఇవానొవిచ్ అవతలి గట్టెక్కి చుట్టూ కలయజూశాడు. వీళ్ళందరూ తన సాయంకోసమేనా వచ్చింది ?

అతని పేరు ప్రతిష్ఠలు తైగా ప్రాంతమంతటా ప్రాకినై. అతని గొప్పతనాన్ని గురించి కథలల్లుకున్నారు; పాటలు కట్టారు. ఎంతో దూరం నుంచి వచ్చినవాళ్ళున్నారు. గ్రుడ్డి వాళ్ళకి చూపు ప్రసాదీస్తాడాయన. ఒక వేటగాడికి చెయ్యిపడి పోతే, మళ్ళీ బాగుచేశాడు, కొత్తచెయ్యి యిచ్చినట్టు; క్రూర జంతువేదో పంజాతో కొట్టిందా చేతిమీద, అప్పట్నుంచీ త్రాడులా వ్రేళ్లాడిందా చెయ్యి. పోనీ వైద్యంచేసి ఏమైనా డబ్బు తీసుకుంటాడా అంటే తీసుకోడు; అంతా వుచితం. జబ్బులన్నీ అలా నయంచెయ్యడం అంటే అదొక మహిమే. నమ్మ తగిన మహిమ. ఈ నూతన జీవితమే అంత: అంతా మహిమల మయం. ఎంత మహిమైనా డబ్బులేకుండా జరగడం అంటే నమ్మడం కష్టమే వాళ్లకి. ఏదో వొక ప్రతిఫలం యివ్వాలి. అంచేత వస్తూవస్తూ బహుమానాలు తీసుకొచ్చారు: గుర్రాలు,

*వదులొదులుగా, వెచ్చగా వుండే బుద్ధచేతుల దుస్తులు

మంచు దుప్పులు, ఉన్నిరగ్గులు, వెండి నక్కచర్మాలు; కొందరు సేబుల్ జంతుచర్మాలుగూడా తీసుకొచ్చారు.

అందరూ వచ్చి నిలబడ్డారు ఆయన్ని చూస్తూ. ఆయనంటే సామాన్యుడు కాదు. దేశం మారుమూలల్లోగూడా ఆయన పేరెరగని వాళ్ళంటూలేరు. కనులముందు కన్పిస్తున్నాడిప్పుడా అజానుబాహువు. ఆయన్ని చూస్తేనేచాలు ఆశ కలుగుతోంది, గౌరవం ఏర్పడుతోంది. మూడునాలుగేళ్ళ కుర్రాడొకడు అందరికంటే ముందు నుంచునున్నాడు, ఉన్ని సూటేసుకుని. పొట్టమీద మాత్రం ఏ గుడ్డాలేదు; అక్కడున్న వున్నిగుడ్డ నక్కతోకలా వేళ్ళాడుతోంది. నల్లని కళ్ళతో, ధైర్యంగా చూస్తూ నుంచున్నాడు. ఆకుర్రాడి పట్కాలోంచి, యకూత్‌ల వేటకత్తిలా, కత్తొకటి వేళ్ళాడుతోంది.

"ఇదెందుకూ ?" అనడిగాడు ఇవాన్, ఆ కత్తి పదును చూచి, నవ్వుతూ.

"మాంసం తినడానికి" అంది ప్రక్కనేవున్న మార్ఫా. అందరూకలిసి, హుషారుగా, లోపలికెళ్ళారు.

"ఏం దగోర్ !*, ఏమిటీ కథ ?" అంటూ ఒకముసలి యకూత్‌ని పలకరించాడు ఇవాన్.

ఆ యకూత్ చలిమంటదగ్గర కూర్చునున్నాడు బాచీ పెట్టివేసుకుని. విశాలమైనరొమ్ము. చలిమంటలోంచి ఉంగరాలుంగరాలుగా లేస్తోంది పొగపైకి; చలిమంటల వెలుతురా యకూత్ మొహంమీద పడుతోంది. ఆపొగ చారికలమధ్య, ఆ వెలుతురులో, బుద్ధభగవానుడిలా వున్నాడు అతను.

---

*స్నేహితుడా !

"నికీతా! అతనికి జబ్బేమిటో అడుగు." అన్నాడు ఇవాన్, ఆయకూత్ ముహం శ్రద్ధగా పరీక్షించుతూ.

"అడగడం యెందుకూ? చూడగానే తెలిసిపోవాలి మీకు" అన్నాడా యకూత్; వచ్చిన వాళ్ళందరూ ఆశ్చర్య పోయారు ఆ మాటలు విని; గుసగుసలు ప్రారంభించారు.

"నేను మంత్రగాణ్ణేమీ కాదు చెప్పకుండానే అన్నీ తెలుసుకోడానికి." అన్నాడు ఇవాన్ ప్రశాంతంగా. ఒక్కటి మట్టుకు గట్టిగా తెలుసునాకు. మీ ఆరోగ్యం ఏమీ బాగులేదు. నీ కుడిచెవిలోకేదో భూతం ప్రవేశించిందని చెప్పి వుండొచ్చు మంత్రగాడు. బాధగా వుందా? ఎక్కడ? అంటూ తనచేయి, అతనిముహం దగ్గరగా, అటూయిటూ తిప్పాడు. యకూత్ కొద్దిగా వెనక్కి తగ్గాడు. "చూపెలావుంది? ఎప్పుడైనా మూర్ఛ వొస్తుందా?" అనడిగాడు ఇవాన్.

"అడగడం ఎందుకూ? చూడగానే తెలుసుకోవాలి!" అన్నాడా యకూత్ మళ్ళీ, నికీతా ఆప్రశ్నలనువాదం చేస్తే విని.

'ఏం లాభంలేదు. అతని ఆరోగ్యాన్ని గురించి అతనికే శ్రద్ధలేకుండా పోయింది.' అనుకున్నాడు ఇవాన్. ఆ రోగి తమ్ముడివైపుకు తిరిగి — అతనిపేరు జఖార్ — యింకా కొన్ని ప్రశ్నలు వేశాడు. అతనూ సమాధానాలు చెప్పలేదు. జవాబు చెప్పడానికి నిరాకరించాడు.

"ఛాఛ! మీకు బుద్ధిలేదు" అంటూ కోప్పడ్డాడు ఇవాన్. చూస్తే జఖార్ తెలివితేటలు గలవాడిలాగానే వున్నాడు. మరి మూర్ఖత్వం ఎందుకు? "మీఅన్న జబ్బంటే అసలు పట్టినట్టే లేదు నీకు" అంటూ వెనక్కి తిరిగాడు ఇవాన్.

జఖార్ ఏమనుకున్నాడో వెంటనే "ఒక్కనిమిషం !" అంటూ కేకేశి డాక్టర్ దగ్గర కెళ్ళాడు. "బహుశా యీ జబ్బేమంత ప్రమాదమైంది కాదేమో. స్తైపాన్, మా అన్నయ్య; అప్పుడప్పుడు తలనొప్పిగా వుందని అనేవాడు. తర్వాత కొంత కాలానికి చూపుగూడా తగ్గడం ప్రారంభించింది. తర్వాత చెవుల్లో అదేపనిగా నాదుగా వుందని అనేవాడు. ఇకిప్పుడు వేటాడడానిక్కూడా పనికిరాకుండా పోయాడు. గంపెడు సంసారం. కాస్తతక్కువగా తీసుకోవాలి డబ్బు మీరతని దగ్గర........"

"ఏమిటీ అంటాడతను ?" అనడిగాడు ఇవాన్, కౌతూహలంతో.

"ఆఁ, ఏమీలేదు. డబ్బు ఎక్కువగా తీసుకోవద్దంటున్నాడు." అని చెప్పాడు నికీతా నవ్వుతూ.

"వాళ్ళలా అర్థం లేకుండా మాట్లాడుతూంటే వూరుకుంటారేఁ మీరు ? యింకా నవ్వుతారెందుకు పైగా!" అంటూ మండిపడ్డాడు ఇవాన్; "మాకు జీతాలిస్తారని చెప్పండి. గనుల అధికారులు జీతాలిస్తారని చెప్పండి. సోవియెట్ ప్రభుత్వం జీతమిస్తుందని చెప్పండి !"

"ఇంకా మావాళ్ళ మీద మంత్రగాళ్ళ ప్రభావం పోలేదు; వాళ్ళ వుద్దేశాలూ, నమ్మకాలూ యింకా ప్రచారం ఔతూనే వున్నై రహస్యంగా." అని చెప్పింది మార్ఫా.

# 34

ఆవేళ రెండు ముఖ్యమైన సంఘటనలు జరిగాయి, అక్టోబర్ గనుల్లో: రెండుగనుల్ని అతితొందరగా కలిపేశారు;

ఫిబ్రవరీ నెలలో పూర్తిచెయ్యాల్సిన బంగారం ఉత్పత్తి పథకాన్ని అనుకున్న సమయానికి చాలా ముందుగానే పూర్తి చేశారు. ఆ రెండు విజయాల్ని సాధించినందుకు ఉత్సాహంగా ఉత్సవం జరుపుకుంటున్నారు. ఆ వుత్సవానికి, లొగునోవ్ గౌరవనీయుడైన అతిథి; బాగా హుషారుగా వున్నాడు.

తెరెంతీ ప్యాతివొలోస్‌ని పట్టుకుని, గట్టిగా, బుగ్గమీద ముద్దుపెట్టుకున్నాడు లొగునోవ్. ప్యాతివొలోస్, ఆగనులు తవ్వేవాళ్ళల్లోకల్లా గొప్పవాడు; ఆ ప్రాంతాని కంతటికీ తెలుసును అతనిపేరు. రెండుగనులమధ్య దారికొట్టడానికి, కార్మికులతని నాయకత్వం కింద పనిజేశారు. చివరిదెబ్బ కొట్టిందీ, ఆ రెండుగనుల మధ్య దారిలోంచి మొట్టమొదట అడుగుపెట్టిందీ అతనే.

ప్యాతివొలోస్ భుజంమీద చెయ్యేసి, అక్కడ సమావేశమైన గనికార్మికుల్నీ, ఫోర్మెన్‌నీ అతిథుల్నీ చూస్తూ, ఉపన్యసించాడు లొగునోవ్:

"మన ప్రాథమిక కార్యక్రమంగూడా పూర్తైపోయింది, అనుకున్న సమయానికంటే చాలా ముందుగానే. అంటే మన గని అన్ని విధాలా ప్రథమస్థానం పొందిందన్న మాట. అనవసరంగా గొప్పలు చెప్పుకోవడమూ తప్పే; అవసరమైనప్పుడు సగర్వంగా చెప్పుకోక పోవడమూ తప్పే. మనమిప్పుడిలా సగర్వంగా చెప్పుకునేందుకు తగినంత కారణం వుంది. అంతమాత్రాన అంతా పూర్తయ్యిందని విశ్రమించ గూడదు మనం. మనలో ప్రతి ఒక్కరూ, ఎవరుచేసే పనిని వాళ్లొకయుద్ధరంగంగా భావించాలి. చక్కనిపనిచేస్తే మనసుకు శాంతి లభిస్తుంది. చక్కగా పనిచేసే వాళ్లందరికీ యిది అనుభవైకవేద్యమే.

"లొగునోవ్ చెప్పింది అక్షరాలా నిజం" అన్నాడు ప్యాతివొలోస్, దగ్గరనే నిలబడ్డ మా త్రైమియానోవ్‌నీ, ఓల్గానీ చూస్తూ. ఓల్గా అక్కడికి విలేఖరిగా వచ్చింది. "సోష లిజాన్ని నిర్మిస్తూ, మనల్ని మనమే నిర్మించుకుంటున్నాం. సోషలిజాన్ని పెంపొందిస్తూ మనల్ని మనమే పెంపొందించు కుంటున్నాం. మన జీవితాలు సుసంపన్నాలు.. అక్షరాలాను. నా మట్టుకు నేను ప్రతినెలా ఆరువేల రూబుల్స్ సంపాయిస్తు న్నాను." అంటూ నవ్వాడు ప్యాతివొలోస్. నవ్వినప్పుడు పళ్లమధ్య ఖాళీ కనిపించింది అందరికీనీ. "ఇప్పుడు నేనేది కావా లంటే అది కొనుక్కోగలను!"

"ఇంకేం! కట్టుడుపళ్ళు కొనుక్కో తొందరగా; పళ్లూడి పోయినైగా" అంటూ హాస్యమాడాడు, దగ్గర్లోనే నిలబడ్డ ఎలెక్ట్రీషియన్.

"దానికేం తొందర లేదిప్పుడు" అన్నాడు ప్యాతివొ లోస్; "మనం శ్రద్ధ వహించవలసిన విషయాలు వేరే వున్నై. మొన్న నేను ఉకమ్యాన్ వెళ్ళాను, స్టెఖనొవైట్ సమావేశాని కని. సరాసరి ఒక హోటల్ కెళ్ళాం. మా కోసం ఒక గది ప్రత్యేకించిపుంచారు;లోపలికెళ్ళాం.మంచంమీదదుప్పట్లున్నైగాని అవియిస్త్రీచేసిన దుప్పట్లుకాదు. నే నా హోటల్లో పనిచేసే ఆవిణ్ణి పిలిచాను. వచ్చింది. ఇస్త్రీచేసినదుప్పట్లు కావాలన్నాను. లేవని చెప్పింది. నా కోపం వచ్చింది. నే నంటే యింత అశ్రద్ధేమి టని ఎగిరిపడ్డాను. ఈ ప్రాంతానికంతటికీ పేరుమోసిన గని పనివాణ్ణని తెలుసా మీకని గద్దించాను. 'గొప్ప గని పనివాడి కైనా యివే; గొప్ప సైనికాధికారికైనా యివే దుప్పట్లు; వేరే యింకేమీ దుప్పట్లులేవు!' అని సమా[illegible] చెప్పింది. విన్నారా?"

అంటూ కాస్సేపాగాడు ప్రేక్షకుల నవ్వు తగ్గేదాకా; "అప్పు డావిడ మాటలు వింటూంటే నాకూ నవ్వొచ్చింది. ఒక ఆడ ధొచ్చి నా నోరు మూయించిందని కాదు నా కప్పుడు నవ్వొచ్చింద; ఏమిటా, నేనేమి కావాలని అడుగుతున్నానా అని ! కామెనుష్కాకి వచ్చేవరకు దుప్పట్లంటే యేమిటోకూడా తెలియదు నాకు. మా తండ్రికి తెలియదు. మా తండ్రిగూడా గని మనిషే; బొగ్గు గనుల్లో పని జేసేవాడు. విప్లవం వొచ్చే వరకూ ఆయన వంటినిండా దుస్తులేసుకుని ఎరగడు. కాని యిప్పుడు? ఇంకా నేను చెప్పడం ఎందుకు ? మన జీవితంలో ఎంతెంత మార్పు వచ్చిందో తెలుస్తూనే వుందిగదా! మన జీవన ప్రమాణాల విలువ పెరిగింది! శ్రామికులకు గౌరవం హెచ్చింది. నిజమే. ఇంకా అనేక సౌకర్యాల్ని సాధించుకోవలసి వుంది; సాధించుకుంటాం గూడాను. కాని యీ సౌకర్యాలు ఏ కొద్ది మందికోసమో గాదు; కోట్లకొద్దీ సామాన్య జనం కోసం ! మన దేశ ప్రజలందరికీ సర్వసమానమైన సౌకర్యాలు ....... బహుశా నేను గాడి తప్పినట్టున్నాను" అంటూ లొగునోవ్ వంక చూశాడు ప్యాతివోలోస్; లొగునోవ్ అతన్ని ఉత్సాహ పరుస్తున్నట్లు నవ్వుతూ కూర్చున్నాడు.

ఈ సమావేశం ఏదో మొక్కు తీర్చుకోవడానికన్నట్టు, అంతా పట్టాలమీద నడిపించాలని లొగునోవ్గా అనుకోలేదు. మాత్రెమియనోవ్గా అనుకోలేదు. ఎవరిష్టం వచ్చినట్టు వాళ్ళు, ఎవరికి చేతనైనట్టు వాళ్లు మాట్లాడారు గద్దె నెక్కి. హాస్యాలూ, నవ్వులాటలూ, ఎగతాళీ, ఎద్దేవా......... "మీ హృదయంలోంచి ఏది వచ్చినా వినడానికిసిద్ధమే; అందులో పొల్లుమాటలంటూనూ,

గాడి తప్పిన మాటలంటూనూ వుండవు" అని ధైర్యం చెప్పాడు లొగునోవ్.

"ప్యాతివొలోస్, బలేవాడే" అన్నాడు మార్త్రెమియనోవ్; ఓల్గాని గనులవేపుకు తీసుకెళ్తూ; ఆ వుపన్యాసం విని విసిగిపోయినట్టున్నాడు. ఐనా కొడుకును చూచి తండ్రి గర్వపడతాడే, అలా సగర్వంగా చెప్పుకొచ్చాడు; "అతని పని అతనికి క్షుణ్ణంగా తెలుసు. ఏ పనైనా అప్పజెప్పండి, చక్కగా చేస్తాడు; వెనకాడడు. నేను ఫోర్మన్‌ని గాబట్టి నా కదంతా తెలుసు. పనిలో చాలా మంచివాడు. కాని, నోరు విప్పితేచాలు, ఎప్పుడూ యెవర్నో ఒకర్ని హేళన చెయ్యకుండా వూరుకోడు. పార్టీలో కొచ్చింతర్వాత యింకా స్తిమెరుగయ్యాడనుకున్నాను. కాని యివ్వాళా వుపన్యాసం విన్నారా? ఏమన్నాడో? అంత మంది అతిధుల ముందలాగేనా మాట్లాడవలసింది ? బాగా మాట్లాడతాడుగదా అనుకున్నాను."

"బాగానే మాట్లాడాడుగా" అంది ఓల్గా; "ఆ ఒక్క చిన్న సంఘటన చెప్పి, ఎంత బాగా నవ్వించాడు అందర్నీ; మళ్ళీ మన ముందున్న కర్తవ్యాన్ని గురించి గూడా బాగానే చెప్పాడు."

"ఇక్కడున్న వాళ్ళంతా అంతే. తమ కర్తవ్యం ఏమిటో బాగా గుర్తెరిగిన వాళ్లు" అన్నాడు మార్త్రెమియనోవ్.

గనిలోంచి బయటి కొచ్చేప్పుడు కళ్ళకి చేతులడ్డం పెట్టుకుంది ఓల్గా. బయట వెలుతురు చిరతలాడేట్టుంది. నీలాకాశం. సూర్యుడి చుట్టూ ఇంద్రధనుస్సులా గుడి కట్టుంది. దారెంట గబగబా నడిచింది ఓల్గా. ముడి మిల్లు దగ్గర కెళ్ళింతర్వాతగాని నడక తగ్గించలేదు. చాలా కాలంనుంచి అనుకుంటోంది అక్కడికి

వెళ్ళాలని, వెళ్తే తావ్‌రోవ్‌ని కలుసుకోవలశొస్తుందిగదాని ఎప్పటికప్పుడు వాయిదా వేసుకుంటూ వస్తోంది పనిని.

హాస్పిటల్లో సంభాషణ జరిగినప్పటికీ,యిప్పటికీతావ్‌రోవ్ అంటే ఆవిడకున్న భావంలో మార్పేమీ లేదు; ఐనా ఎందుకనో, అతన్ని కలుసుకోకుండా తప్పించుకుంటూ తిరుగుతోంది. పరిస్థితులు పక్వమయ్యేవరకూ వేచి చూడాలని ఆవిడ ఉద్దేశం; ఏదో వొక నిశ్చయాని కొచ్చేముందు అంతిమ పరీక్ష చేసుకోవాలని అనుకున్నట్టుంది.

గనుల నిర్వాహకవర్గంతో మాట్లాడుతూ కూర్చునున్నాడు తావ్‌రోవ్, ఆఫీసులోనే.

"ముందు యింటిదగ్గర మాట్లాడినా బాగుండేదేమో; కనీసం ఫోనన్నా చేసి మాట్లాడాల్సింది" అనుకుంది ఓల్గా, నెమ్మదిగా అతను కూర్చున్న డెస్క్‌దగ్గర కెళ్తూ.

ఆవిడ లోపలికి రావడం చూచి గూడా తావ్‌రోవ్ కుర్చీలోంచి లేవలేదు; లేచి ఆహ్వానించాలని తోచలే దతనికి; ఆవిణ్ణి చూడడం అంతతలవని తలంపుగా జరిగింది మరి. ఎంతో శ్రద్ధగా చూశా డావిడవంక.

"ప్రాంతీయ పత్రిక తరఫున పంపించారు నన్ను" అని చెప్పింది ఓల్గా. చుట్టూ కూర్చున్నవాళ్ళ వంక చూచి తల అడించింది. మళ్ళీ తావ్‌రోవ్ వైపుకు తిరిగింది. "ఇప్పుడు ముడి బంగారం ఉత్పత్తి ఎక్కువయ్యిందిగదా; మీ ఫ్యాక్టరీ ఉత్పత్తిని గూడా దానికి తగినట్టు ఎలా పెంచారో తెలుసుకోమని పంపారు నన్ను. ఆ విషయం మీదొక వ్యాసం వ్రాయమన్నారు.

మీరు చేసిన మార్పులూ, మీరు కొత్తగా తెచ్చిన యంత్రాలూ, ..........అన్నిటిని గురించీ వివరంగా చెప్పాలి."

"అలాగే" అన్నాడు తావ్‌రోవ్; ఓల్గా అన్న మాటలన్నీ సరిగ్గా విన్నాడో లేదో, అతని ముహం జూచి చెప్పడం కష్టమే. "ఒక్క సెకను సేపాగితే, మేం చర్చించే విషయం ముగించుకుని, మిల్లంతా చూపిస్తాను మీకు" అన్నాడు చివరికి అతి నమ్రతగా; చిరునవ్వుగూడా నవ్వినట్టు లేదు.

కిటికీ దగ్గరున్న బల్లమీద కూర్చుని నోట్‌బుక్ బయటికి తీసింది ఓల్గా;తన ఆలోచనల్లో తాను మునిగిపోయినట్టుంది చూసే వాళ్ళకి. కాని, ఆ గదిలో వున్న ప్రతీ చిన్న వివరాన్నీ శ్రద్ధగా పరికించింది; తావ్‌రోవ్ ప్రతికదలికనీ గమనించుతూనే వుంది. అందులో వింతగూడా ఏమీ లేదు: తాను ప్రేమించిన మనిషిని గురించి అన్ని విషయాలూ సాకల్యంగా తెలుసుకోవడం అవసరం; పనిచేసేప్పు డెలా వుంటాడోగూడా చూడడం అవసరం. శ్రమకున్న విలువనిగురించి ఎన్నిసార్లో వుత్సాహంగా చెప్పాడు తనకి; అతనన్న మాటలెన్నెలా ఆచరిస్తున్నాడో చూస్తేగాని తెలియదు మరి. అతనంటే ఎంత ప్రేమవున్నా, అతని లోపా లేమైనా వుంటే వెంటనే చూడగల శక్తి వుంది ఓల్గాకి.

ఫ్యాక్టరీ బాగా పని చేస్తోందనీ, తావ్‌రోవ్ చాలా మంచి ఎంజినీరని అందరూ అనుకొంటున్నారనీ, అందరూ అతన్ని గౌరవిస్తున్నారనీ ఆవిడ కదివరకే తెలుసు; కాని పని చేస్తుండగా అతన్నిదివర కెప్పుడూ చూడలేదు. అంచేత, చాలా శ్రద్ధగా గమనించడం మొదలెట్టింది. అతను తన సహచరుల్తో ఎలా కలిసిమెలిసి మాట్లాడతాడో, ఎలా చర్చిస్తాడో తెలుసు కోవాలనే ఉత్కంఠంతో.

సహచరుల్తో మాట్లాడేప్పుడు తానేదో ఉన్నతాధికారినన్న భావమే వున్నట్లు లేదతనికి. వాళ్ళతో ఏదో పనిని గురించి చర్చిస్తున్నాడు; తా నక్కడ వున్న సంగతే మరిచి పోయినట్టున్నాడు. పనిలో అంత తన్మయత్వాన్ని చూచి ఓల్గా సంతోషించింది. వాళ్ళు చర్చించుకునే విషయం యేమిటో ఆవిడ కర్థంకాలేదు. కాని తావ్‌రోవ్ చెప్పే విషయాన్ని చాలా శ్రద్ధగా వింటున్నారు తోటి ఎంజినీర్లు. చివరి కతను చెప్పిందే అంగీకరించారు గూడాను. ప్యాతివోలోస్ అంటే మూర్తెమియనోవ్ వున్న సద్భావమే తావ్‌రోవన్నీ వీళ్ళందరికీ వున్నట్టు కన్పిస్తూనే వుంది. అతనితో కలసి పనిజెయ్యడం వాళ్లందరికీ వుత్సాహజనకంగానే వుంది.

"ఆ పనై పోయింది. చాలా సేపు కూర్చోబెట్టాను; క్షమించాలి. ఇక మనం వెళ్ళొచ్చును" అన్నాడు తావ్‌రోవ్, ఓల్గా దగ్గర కొచ్చి.

ఆవిణ్ణి కలుసుకున్నందుకు చాలా ఆనందంగా వుందతనికి. ఆ ఆనందాన్ని దాచేందుకతను ప్రయత్నించనూ లేదు. ఇంతకు పూర్వం చేసిన చర్చనుగురించీ, ఆపనిని గురించీ అంతా మరచి పోయినట్టున్నాడు. అతనికిప్పుడు కనిపిస్తున్న దొక్క ఓల్గాయే. ఆ సంగతిగూడా గుర్తించింది ఓల్గా. గుర్తించి సంతోషించింది.

ఆఫీసులోంచి బయల్దేరి, యిద్దరూ మిల్లులో కెళ్ళారు.

ముందుకొకడుగేసి, ఓల్గా ముందు నడవాలని అనుకున్నవాడే, ముందుకు వేయబోయిన అడుగు వెనక్కేవేసి, ఓల్గా చేయి తనచేతిలోకి తీసుకుని, ప్రక్కప్రక్కనే నడుస్తూ, ఆవిడ వైపు కొరిగి "నన్నుగూడా చూద్దామనేనా వచ్చింది?" అనడిగాడు బిగ్గరగా.

చుట్టూ యంత్రాలహోరు.

"ఔను." అంది ఓల్గా.

# 35

తలుపు తెరచిన శబ్దంవిని, తలపైకెత్తి చూశాడు లోగునోవ్. వార్యా పరుగెత్తుకొచ్చింది లోపలికి చేతులనిండా పొట్లాలు పట్టుకుని. వచ్చీరావడంతోనే అవన్నీ టేబుల్ మీద గుట్టగా పెట్టి, చేతులు నలుపుకోవడం ప్రారంభించింది, టోపీ కోటూ గూడా తీశెయ్యకుండానే.

"అబ్బ. ఇంత చలిగా వుందేం! యీ ప్రాంతానికి చెందిన దానికి నాకే యిట్లావుంటే..." అంది వార్యా.

ఇదిగో, యీ బేసిన్‌లో ముంచు చేతులు" అన్నది ఎలీనా.

"ఫర్వాలేదులే. అదే తగ్గుతుంది" అంటూ, ఎర్రగా వున్న వేళ్ళ చివరలు వూదుకుంటూనూ, రుద్దుకుంటూనూ, లోగునోవ్ దగ్గరకెళ్ళింది వార్యా: "బావున్నారా!"

"ఆహా. దివ్యంగా" అన్నాడతను, నవ్వుతూ.

"అందరూ అంత దివ్యంగా వున్నట్టులేరులే." అంది వార్యా; "ఛీఛీ ఎంతసిగ్గు చేటెంత సిగ్గుచేటు!"

"ఏమిటదీ!" అన్నాడు లోగునోవ్, ఆవిడ ముహం పరీక్షగా చూస్తూ.

"ఏం మీరింకా వినలేదా? ఆవిడయిల్లు మారుతోంది."

"ఎవరూ?.... ఓహో నిజంగానా?"

"నిజమే ఓల్గాపావ్‌లోవ్నా, తాప్‌రోవ్ యింటి కెళ్ళి పోయింది."

"ఏం మాటలవి వార్యా! అంటూ తృళ్ళిపడినట్టు వెనక్కి తిరిగింది ఎలీనా; ఆవిడ టేబుల్ అంచున హడావిడిగా పెట్టిన బేసిన్ సరిగ్గా నిలవలేక క్రిందపడి ఢమఢమ లాడుతూ దొర్లి పోయింది. "జరిగిన సంగతేనా నువ్వు చెప్పేది ?"

"పత్రిక ఆఫీసు వాళ్ళావిడకొక గదిగూడా యిచ్చారు. అందులో యెందుకులే, మా యింటికేవచ్చి వుండమన్నాడట తాప్‌రోవ్; వెళ్ళింది. ఆ గదిలో వుంటేమాత్రం ఎవరికళ్ళు కప్పగలిగేదిలే. వాళ్ళిద్దరూ కలిశున్నప్పుడు చూస్తేనేచాలు, అంతా అర్థమై పోతుంది!" వార్యా గొంతులో అసూయ కనిపిస్తూనే వుంది. "ఓల్గా పెట్టెలన్నీ వేసుకెళ్ళడానికి గుర్రబ్బండీ వచ్చింది; ఇప్పుడే చూశాను." అంటూ ఆగిపోయింది వార్యా; ఎందుకో గాని, ఏదో సంతృప్తిగూడా కలిగినట్టుంది.

"పెట్టెలన్నీ వేసుకుని, ఎక్కడికీ ఆ గుర్రబ్బండి ?" అనడిగాడు డెనిస్, అమాయకంగా.

"ఎక్కడికా? కాట్లోకి !" అంటూ మండిపడింది ఎలీనా; తర్వాత, నెమ్మదిగా "పాపం ! ఇవాన్ ఇవానొవిచ్ ! వింటే భరించలేడు" అంది.

వార్యాకీ వచ్చింది కోపం.

"చేస్తున్నపని అంత ముఖ్యమైన పని. ఇకెలా చెయ్యగలడూ ఆ పని ?"

"వెళ్ళి ఓల్గా పావ్‌లోవ్నాతో మాట్లాడొస్తా" అంటూ లేచాడు డెనిస్.

"పిచ్చిగానేమైనా ఎత్తిందా?" అంటూ లేచింది ఎలీనా; "గొప్పవారే. వెళ్ళిమాట్లాడొస్తారట. ఏమని? ఇవాన్ ఇవానొవిచ్‌కీ అంతా తెలిసే వుంటుంది; బహుశా అందుకనే వెళ్ళిపోయారేమో. వెళ్ళేముందు నేను చూశాగా, ఇద్దర్లోనూ ప్రాణంవున్నట్టే వుండేది గాదు."

"మీరుచెప్పేది నిజమే'' అన్నాడు లొగునోవ్; ''కావాలనే వెళ్ళిపోయారాయన. ఆయనిందుకు సిద్ధమయ్యే వెళ్ళిపొయ్యాడు. కాని యిదంతా యిలా యెందుకు జరగాలో ఆయనకర్థంకాక మహా వ్యథపడ్డాడు.''

"ఔను ఎందుకు జరగాలిలా?" అనందుకుంది వార్యా వెంటనే; ''ఆవిడట్లా ఎందుకు చేసిందో, చెయ్యడానికి కారణం యేమిటో, ఒక్క మంచికారణం, ఒక్కటంటే ఒక్కటి న్యాయమైన కారణం చెప్పగలరూ మీరు?"

''ఇలా జరగడం మంచిది కాదు, నిజమే; ఎవరికీ సంతోషకరం గాదు. ఆవిడిలా చెయ్యకుండా వుంటేనే బావుండేదేమో అనే అనిపిస్తోంది నాకూనూ. కాని, మొట్టమొదటి రాయి నేనే విసరాలంటే, నావల్లగాదు. విషయమే అలాంటిది. చాలా సున్నితమైన వ్యవహారం."

ఒకసారెళ్ళి ఆగది చూశొద్దాం, రండని ఎలీనాని వెంటబెట్టుకుని, ఇవాన్ ఇవానొవిచ్ యింటి తాళంచెవి తీసికొని బయల్దేరింది వార్యా.

వెళ్ళి, గుండెలు చేత్తో పట్టుకుని తలుపు తాళం తీసింది. గదులన్నీ ఖాళీ చేసినట్లున్నై; ఓల్గా వుపయోగించే అత్తరువాసన

యింకా పూర్తిగా పోలేదు. ఇంట్లో ఎక్కడున్నది అక్కడే వున్నది; ఐనా యిల్లు ఖాళీ! యిదివరకటి కంటే చీకటిగా వుంది. కిటికీలు చూచింది వార్యా. కిటికీ అద్దాలనిండా గడ్డ కట్టుకున్న మంచు. వెళ్లి పక్కమీది తలగడలు నిమిరింది చల్లని చేత్తో.

"పాపం! ఇవాన్ ఇవానొవిచ్."

కాని, వార్యా హృదయాంతరాళాల్లో, ఓల్గా చేసిన పనివల్ల ఏమంత విచారం కలిగినట్టులేదు. ఇదే యింట్లో కూర్చుని ఓల్గాతో మాట్లాడిన మాటలు గుర్తుకు తెచ్చుకుంది వార్యా. అప్పుడు నిజంగానే ఓల్గాఅంటే జాలికలిగింది.

"ఇవాన్ ఇవానొవిచ్ ఎక్కడ? తావ్‌రోవెక్కడ? అంత బ్రహ్మాండమైన మనిషికి బదులు, యింతచిన్న వ్యక్తిని ఎన్నుకున్నదే; అదిచాలదూ ఆవిడకి తగిన శిక్షే జరిగిందిలే అనుకోడానికి. ఆవిడంత గుడ్డితనంగా ప్రవర్తించింది కదా; యింకేవర్నేమని ఫలితం?"

వంటగదిలో పాత్రలటూయిటూ కదిలించింది ఎలీనా; ఆశూన్యంలో ఆ శబ్దం మరీ కొట్టొచ్చినట్టు వినిపించింది.

"ఇకనుంచి రోజూవచ్చి స్టోవ్ వేడిచేసి వెళ్తుంటాను" అందివార్యా; "ఇవాన్ ఇవానొవిచ్ వొచ్చేప్పటికి, యిల్లిట్లాగే వదిలేస్తే, వుండేపారంగూడా వుండదు."

గబగబా వెళ్ళి కట్టెలు పట్టుకొచ్చి, నిప్పుచేసి, ఇవాన్ గదిలో స్టోవ్ వెలిగించింది వార్యా. ఇంట్లో అటూయిటూ తిరగడం ప్రారంభించింది శబ్దంచేస్తూ; యింట్లోవున్న నిశ్శబ్ద వాతావరణాన్నంతా దూరంగా పారదోలుతున్నట్టు.

డాక్టర్ చదువులగదిలో డెస్క్ మీదున్న కాగితాలు తీసి సర్దింది. ఒక పత్రికల కట్ట; పుస్తకాలు. బాగా అందరికీ కనిపించే చోట ఒక నీలికవరు పెట్టివుంది. తీసిచూస్తే, దానిమీద ఇ. ఇ అర్జానోవ్ అని వ్రాసి వుందొక పంక్తి. ఆ పంక్తి కిందొకగీత. ఆగీతకింద 'ఓల్గాపావ్‌లోవ్నా నుండి' అని వ్రాసి వుంది.

కవరటూ యిటూ తిప్పిచూశింది వార్యా; వాసనగూడా చూశింది. అత్తరు వాసనేమీ లేదు. తీసి మళ్ళీ ఎప్పటిచోట పెట్టేశింది కవరు. స్టోవ్ వెలిగించడం మూలాన గదిబాగా వెచ్చబడింది. కిటికీ అద్దాలమీద మంచు కరిగి, చినుకులు చినుకులుగా నేలమీద పడుతోంది. సోఫామీద బీరువాలోను వున్న పుస్తకాలన్నీ తీసి దులుపుతూ కూర్చుంది వార్యా. మధ్యమధ్య ఆ కవరువంక చూడడం మట్టుకు మానలేదు.

"ఇ. ఇ. అర్జానోవ్" వార్యాఐతే, 'ఇవాన్ ఇవానొవిచ్' అని వ్రాశేది. 'ప్రియమైన ఇవానొవిచ్' అనిగూడా వ్రాశేది. అంతా ఆవిడనుకున్నట్టే గనక జరిగితే, ఎప్పుడూ, ఒక్కక్షణం గూడా ఆయన్ని వదలకుండా, యింటిదగ్గరైతే యింటిదగ్గరా, ఆఫీసులోఐతే ఆఫీసులోనూ వెంటనే వుండేది. ఓల్గా వ్రాసిన చిరునామా సిగ్గుచేటుగా వుంది; అవమానకరంగా వుంది. ఆ కవరుతీసి నిప్పులో పడేద్దామనుకుంది వార్యా. పళ్ళుపటపట కొరుక్కుంటూ చేతికందిన పుస్తకంతీసి పేజీలు తిప్పడం ప్రారంభించింది. అది పుష్కిన్* రచన. ఆయన పాటలు యకూత్ పిల్లలికి స్కూల్లోనే నేర్పుతారు. వార్యాగూడా నేర్చుకుంది.

*ప్రఖ్యాత సోవియెట్ రచయిత.

ఇంటిదగ్గరగూడా ఆవిడకొక పుష్కిన్ పుస్తకం వుంది. ఏమీ తోచనట్టు పేజీలు తిప్పింది.

నాకీర్తి వెల్లువలు నలుదిశలు వ్యాపించు
ప్రతిజాతి నా ఘనత పొగడుటకు గర్వించు
స్లావులూ, తుంగలూ, సంచారగణములూ
గళమెత్తి నాయశో గాధ నాలాపించు*

పై అట్ట తిప్పిచూసింది వార్యా. అట్టమీద పుష్కిన్ బొమ్ముంది. కవి, విశాలమైన కళ్లు, ఉంగరాలు తిరిగిన జుట్టు; తనవంకే చూస్తున్నాడు.

"తుంగస్ జాతివాళ్లిప్పుడు ఉరల్ పర్వతాల కవతలి వైపున వుండడంలేదు" అని చెప్పింది ఆఫోటోలో వున్నకవికి; "మీరెప్పుడైనా సైబీరియా వెళ్లారా? యకూతియాలోకి పంపబడిన రాజకీయ నిర్బంధితుల పేర్లు గుర్తుకు తెచ్చుకోవాలని ప్రయత్నించింది. ఆ నిర్బంధితుల్లో పుష్కిన్ లేడు. జార్ చక్రవర్తులాయన్నీ వదల్లేదన్న సంగతి వార్యాకి తెలుసును; ఆయన్ని నిర్బంధించారు, ఎక్కడికోగాని ప్రవాసం పంపారు గూడాను.

రాజకీయ నిర్బంధితులు చాలా శ్రమపడ్డారు యకూతియాలో. కాని వారితోపాటు వారి ఉన్నతాశయాలూ, ఆదర్శభావాలూ, సంస్కృతీ, సత్యమంటే వారికున్న ప్రేమ.... అన్నీ వెంటతీసుకొచ్చారు యకూతియా ప్రాంతానికి.

---

*మిత్రులు కృష్ణమూర్తిగారికి కృతజ్ఞతో –

"అలాంటి ఆదర్శజీవులు డిసెంబరిస్టులు*. ఛెర్నిషెవస్కీ,[1] సెర్గో ఆర్జోనికిడ్జ్[2] మొదలైన వారంతా మనతోపాటున్నారు." అనిచెప్పింది వార్యా, పుష్కిన్ బొమ్మతో; "ఆనాటి అనాది జాతులు, తుంగస్‌లాంటి జాతులీనాడు స్కూలు కెళ్తున్నారు. చదువులు నేర్చుకుంటున్నారు. ఇప్పుడిక వాళ్ళని అనాది జనులనేందుకు వీల్లేదు; మిమ్మల్ని గురించి గూడా పూర్తిగా తెలుసుకున్నారు వాళ్ళు.

వార్యా మళ్ళీ పేజీలు తిప్పింది. 'యెవ్‌గెనీ ఓనెగిన్' కన్పించేవరకూ తిప్పింది పేజీలు. ఈసపల నిదివరకొకసారి వచన ధారంలో, పద్యాలలో చదివింది. అందులో చాలాభాగం మరచి పోయిందిప్పుడు. ఐనా అదంతా పూర్తిగా అర్థమూ కాలే దిప్పుడు. ఇప్పుడెందుకనో, తలవని తలంపుగా, ఆకథ గుర్తు కొచ్చింది. తానే పరష్యన్ కుగ్రామములోనో వున్నట్టూ, తాతియానా పడిన బాధలన్నీ తానే పడుతూన్నట్టూ వూహిం చుకుంది. వార్యా పగటికలలుకనే రకం గాదు; ఐనా, తూరుపు తెలతెల వారేప్పుడు కూర్చుని మాయమైపోతున్న చుక్కల్ని లెక్కపెట్టడమంటేనూ; చలిమంటల చుట్టూ కూర్చుని ముస

---

*డిసెంబరిస్టులు : అభ్యుదయభావాలతో రహస్యం రాజకీయ సంస్థ స్థాపించి, నిరంకుశ జార్ చక్రవర్తులమీద 1825 డిసెంబర్‌లో తిరుగుబాటు లేవదీశారు.

1. ఛెర్నిషెవస్కీ, నికోలాయ్ గావ్రిలొవిచ్ (1828–'89) భౌతిక వాదాన్నంగీకరించిన రష్యన్ మేధావి; రచయిత. రాజకీయాల్లో పాల్గొన్న అభ్యుదయవాది.

2. ఆర్జొనికిడ్జ్, గ్రిగోరీ కాన్‌స్తాంతినొవిచ్ (1886–1937): లెనిన్ స్టాలిన్‌ల సహచరుడు, బోల్షెవిక్ పార్టీలో పేరుమోసిన నాయకుడు. సోవియెట్ ప్రభుత్వ మూల స్తంభాల్లో ఒకరు.

లమ్మలు చెప్పే కథలు వినడమంటేనూ బాగా యిష్టం. అదీగాక తానూ ప్రేమించింది. సఫలంకాని ప్రేమ. విఫలమైన ప్రేమ.

కనులు మూసుకుని ఒక పాదం గుర్తుకు తెచ్చుకుంది.

ప్రేమంటివి వేరొకరా ?
ఈ హృదికధినాధులగుట
వేరొకరికి అలవికాదు.*

'నిజం ! నిజం !' అనుకుంది వార్యా; 'కాని అంత మంచి అమ్మాయిప్రేమని ఓనెజిన్ ఎందుకు నిరాకరించినట్టు? అతనికి పెళ్ళిగూడా కాలేదే !'

సోఫామీద సర్దుకుని కూర్చుంది వార్యా; పుస్తకం మోకాళ్ళమీద పెట్టుకుంది; తలవంచి చేతిమీద ఆన్చింది.

తాతియానా బాధ వూహించుకుని చాలా విచారించింది. ఓనెజిన్ పశ్చాత్తాపపడతాడేమో అనుకుంది; ఏదో ఒకవిధంగా తిరిగి తాతియానాని ప్రేమిస్తాడేమో ననుకుంది.

ఓనెజిన్, లెన్స్కీని చంపినపుడు, వార్యా కనులనిండా నీళ్లు తిరిగినై. రెండు మూడు బొట్లు పుస్తకం మీద గూడా పడినై. జాగ్రత్తగా మునివ్రేళ్ళతో తుడిచేశింది. ఆ సంఘటన చదువుతూంటే గుండె ఆగినంత పనైంది:

ఆతడు శయనించెవుండె నమిత నిశ్చలముగా
నుదుటి మీద గోరాడెను శాంతి విచిత్రముగా*

నాయకుడలా హంతకుడుగా తయారు కావడానికి కారణం ఆ సోమరితనమేనేమో. బహుశా పుష్కిన్ గూడా అలాగే వున్నాడేమో చనిపోయినప్పుడు. ద్వంద్వయుద్ధంలో గుండుదెబ్బ తగిలి చనిపోయాడు పుష్కిన్ గూడా;

---

*మిత్రులు కృష్ణమూర్తిగారికి కృతజ్ఞత్తో —

పరిత్యక్త భవనము వలె
అంతా చీకటి, శూన్యము
ఎలుకల కలకల కలము తప్ప
నిశ్చల నీరవ దైన్యము
గవాక్షాలు బిడాయించి
కామందాయె పరారీ
ఎచ్చటికో ఏమో కాని,
అజా పజా చిక్కదైరి.*

ఇవాన్ ఇవానొవిచ్ డెస్క్ ప్రక్కనే వున్న కిటకీ నుంచి పారజూచింది వార్యా. పైనుంచి క్రిందివరకూ అంతా మంచు. గడ్డ కట్టుకున్న మంచు.

ఎచ్చటికో ఏమో కాని
అజా పజా చిక్కదైరి *

పుస్తకంతీసి చదవడం ప్రారంభించిందిసుశ్మీ; తాతియానా పెళ్ళి చేసుకుంది;పిలుకోసమని చేసుకున్న పెళ్ళి. తిరిగి ఒనెజిన్‌ను కలుసుకుంది తాతియానా. వార్యా కళ్లు చెమ్మగిల్లినై. ఒనెజిన్ నిలకడగల మనిషి కాదు. ఐనా అతనంటే జాలే కలిగింది వార్యాకి. తాతియానా అంటే మరీ జాలి కలిగింది. "నువ్వు ప్రేమించిన మనిషి నిష్ప్రయోజకుడనీ, నిరర్థుడనీ తెలుసు కోవడంకంటే బాధాకరం యింకేముంటుంది! అందుకనే తాతియానా అతన్ని నిరాకరించింది. ఆవిడ ప్రేమించిన మనిషి, ఆవిడనుకున్న మనిషి కాదు."

"మరి నా మనిషో ?" అని తనని తానే ప్రశ్నించుకుంది వార్యా. మొట్టమొదటిసారిగా ఇవాన్ ఇవానొవిచ్‌ని

*మిత్రులు కృష్ణమూర్తిగారికి కృతజ్ఞతతో –

విమర్శనా పూర్వకంగా పరీక్షించి చూచుకుంది. నిజంగానే ఇవాన్ ఆదర్శ పురుషుడు. 'ఓనెజిన్ కంటె వెయ్యిరెట్లు మెరుగు' అనుకుంది వార్యా, సగర్వంగా.

# 36

ఉఛఖాన్ కొచ్చేరోగుల్లో ఎక్కువమంది చాలా సామాన్యమైన జబ్బుల్తో బాధపడుతూన్న వాళ్ళే; ఆ జబ్బులు నయం చేసేందుకు ఇవాన్‌లాంటి అనుభవం వున్న సర్జెన్ గూడా అవసరమే. కాని ఇవాన్ వుద్దేశం వేరు; తానిక్కడికి వచ్చింది పెద్ద పెద్ద జబ్బులు నయం చెయ్యాలనే కాదు; తన చికిత్సలకి గొప్ప ప్రచార విలువ గూడా వుంది. అంచేత ప్రతి ఆపరేషనూ అతి జాగ్రత్తగా చెయ్యావలశిందే; ఆపరేషన్ ఫలితం ఏమౌతుందోనని, అదెంత చిన్న ఆపరేషనైనా సరే, ఆదుర్దాగా వేచి చూడవలశిందే.

అడుగులో అడుగు వేసుకుంటూ, మెల్లగా, వస్తారు రోగులు గదిలోకి. వచ్చి, కప్పుకొచ్చిన ఉన్ని రగ్గులూ అవీతీసి, అందుకోసం ప్రత్యేకించిన బల్లమీద వేస్తారు; టోపీలు తీశి, మేకులకి తగిలిస్తారు. నెత్తిమీదజుత్తూ, వంటిమీది దుస్తులూ సర్దుకుని భయం భయంగా తొంగిచూస్తారు ఆపరేషన్ గదిలోకి. ఆపరేషన్ గది గుమ్మానికొక మైనం గుడ్డ కట్టారు తెరగా; ఆ తెరకిలోపల తెల్లని శుభ్రమైన గుడ్డ వుంది. అప్పుడాపరేషన్ జరుగుతూంటే, అందులో యింకా స్త తహతహలాడేవారు, తలుపు సందుల్లోంచి చూస్తారు లోపలికి. ఆ జాను బాహువు డాక్టరు తెల్లటి దుస్తుల్లో పైనుంచి దిగివచ్చిన దేవతలా కన్పించే

వాడు. ఆయన వుపయోగించే పరికరాలు తెల్లగా మెరసిపో తూంటవి; చాలా చిన్నవవి. చేతిలో అలాంటి కత్తులు పట్టు కుంటేనా! ఆహా! ఆహాహా!! ఇంకేముంది! కాని ఆ డాక్టర్, ఆ పరికరాలతోనే ఆపరేషన్ ప్రారంభించి, మనిషి చర్మం కోసి, ఇంకా లోపలికి గంట్లుపెట్టి, నెత్తురు నరాలకి క్లాంపులు బిగించి.... ....అబ్బ! వాళ్లు చూడలేక కళ్ళు మూసుకుంటారు; కాపడానికి జన్మతః వేటగాళ్ళు! ఐనా, కళ్ళు మూసుకుని తలలు తిప్పేసు కుంటారు ఆ దృశ్యం చూడలేక. మనిషి నెత్తురు చూడలేరు! మనిషి నెత్తురు చూడడానికీ, మనిషి మృత్యువు చూడడానికీ భేదం లేదు. ఒకవేళారోగి అకస్మాత్తుగా వున్నపళాన ఆపరేషన్ బల్లమీదనే ఆ ప్రాణం కాస్తా విడిచేస్తే? అతని ఆత్మ ఎక్కడ ప్రవేశిస్తుందో ఎవరు చెప్పగలరు? ఎంత దూరంగా వుంటే అంతమంచిది!

కాని చికిత్స చికిత్సే; చికిత్స చేయించుకోవలసిందే! ఇంకా నూకలున్నప్పుడు, కావాలని కోరి చనిపోవడం దేనికి? మంత్రగాళ్ళు అదోకరకంగా నయం చేస్తారు జబ్బులు. కామె నుష్కానుంచి వచ్చిన డాక్టర్ ఇవాన్ నయంజేసే పద్ధతి వేరు. ఎవరి పద్ధతి వారిది. పాతగుడ్డల్ని బాగుచేసినట్టు బాగుచేస్తాడు ఇవాన్ శరీరాన్ని; ఇక్కడొక ముక్క తీసేస్తాడు; అక్కడొక కొత్త ముక్కోళి, కుట్టేస్తాడు. ఒక్కోసారి కడుపు కోసేస్తాడు. వేటాడేప్పుడే గనక అలాంటి గాయమైతే, వెంటనే ప్రాణాం లొదలవలసిందే. కాని యీ డాక్టర్ పద్ధతివేరు; గాయంచేస్తాడు, సూదీ దారం తీసుకుని మళ్ళీ చక్కగా కుట్టేస్తాడు, చేయి తిరిగిన దర్జీలాగా.

నికీతా, అంతకుపూర్వంనుంచీ అక్కడేవున్న ఫెల్డ్షెర్ వాసిలీ గూడా ఆపరేషన్ గదిలోనే వుంటారు, తెల్లనిదుస్తులేసుకుని; ఇవాన్‌కి సాయం జేస్తూంటారు. రోగి ముక్కూ, నోరు గూడా తెల్లని వస్తువుతో కప్పేస్తాడు ఇవాన్. అప్పుడాయన ముహం చాలా గంభీరంగా వుంటుంది. ఆ తెల్లని వస్తువుమీదేదో మందు చిలకరిస్తాడు నికీతా. అమందు వాసన తియ్యగా అదో రకంగా వుంటుంది. అమందు పడింతర్వాత కాస్సేపటిదాకా రోగి గట్టిగా పీలుస్తాడు ఊపిరి, గొణుక్కుంటూంటాడు. తర్వాత మెదలకుండా పడుకుంటాడు.

తలుపుల సందుల్లోంచి నల్లనికళ్ళు, విచిత్రంగా, ఆశ్చర్యంగా, భయం భయంగా; కుతూహలంగా చూసూవుంటై; తర్వాత గుసగుసలు, ఆకులు గలగల లాడినట్టు :

"ఏం, ఇవాన్!"

"ఓ, నికీతా !"

"ఆఁ. ఆఁ, వాసిలీ, మంచినేస్తం !"

ఆపరేషన్ బల్లమీద రోగి నిద్రపోతుంటాడు; అదొక వింత నిద్ర! ఊపిరపీలుస్తున్నట్టే వుంటాడు. అప్పుడప్పుడూ గురకగూడా విన్పిస్తుంది. కాని బాధ అతని ఆత్మకంటినట్టు కన్పించదు. తెల్లనిగుడ్డలేశి అతని శరీరానికి కట్లు కడతారు, శరీరం కోస్తారు. సూదుల్తో గుచ్చుతారు, లేడిచర్మం అతుకు పెట్టినట్టు కుడతారు; ఐనా ఆరోగి కిమ్మనడు. అలాగే నిద్రపోతూంటాడు పండుకుని. ఒకరోగి కాలు కుళ్ళిపోయింది, పూర్తిగా నీలిరంగుకికూడా తిరిగింది; అతనికాలు కోసేశారు, బొమికమీద అంపము పెట్టి కోశారుకూడాను; ఐనా అతనా నిద్రనుంచి మేల్కోనేలేదు!

భయంకరంటే గూడా కుతూహలమే బలవత్తరంగా వుండేది. అడవుల్లోనుంచి వచ్చిన వాళ్ళందరూ సాయం జెయ్యడానికి సిద్ధమయ్యేవారు వాళ్ళంతట వాళ్ళే, అడగకుండానే; ఏదో ఒకవిధంగా, ఏదో ఒక వంకతో, ఆపరేషన్ గది ప్రక్కగదిలో వుండగలిగితే చాలు: వంటచెరకు తెచ్చేవారు; స్టోప్‌లు వెలిగించి పెట్టేవారు. వస్తూవస్తూ అప్పుడే పట్టిన చేపలూ, కుందేళ్ళూ, ఉడుతలూ, శివంగులూ పట్టుకొచ్చేవారు వేటగాళ్ళు. శివంగిని కూరొండుకుంటే చాలా రుచిగా వుంటుంది. మేం సాయం జేస్తాం, మేం సాయంజేస్తాం అంటూ బోలెడుమంది వచ్చేవారు ముందుకి; వాళ్ళందరితోనూ ఏమిసాయం చేయించుకోవాలో అర్థమయ్యేదికాదు ఇవాన్‌కి.

చాలాదూరంనుంచి, ఒకసంచారక మకాంనుంచి ఇవెంక్ యువతి వచ్చింది. జన్మలో చీపురుబ్రష్ పట్టుకుని ఎరగదు. వచ్చి, రాత్రిపూట కాపలాకాసే ముసలావిడ అజమాయిషీ క్రింద నేల కడుగుతోంది. ఎప్పుడూ అలవాటు లేకపోవడం మూలాన నీళ్ళుచింది పడుతున్నై వొళ్ళంతా. ఆవిడవి బాగా పొడుగాటి జడలు; భుజాలమీదినుంచి జారి నేలమీద జీరాడుతున్నై; తలొకవిసురు విసిరి అవి మళ్ళీ వీపుమీద పడేట్టు చేస్తుంది యువతి, ఇవాన్ చూశాడు.

"మాషా! ఆజడలు ముడేసుకో" అన్నాడు.

యువతి భయపడిపోయి, వంగి పనిచేస్తున్నదల్లా నిటారుగా లేచినిలబడింది.

"బ్రష్షుతో కడగాలి నేల, జడల్తో కాదు." అన్నాడు ఇవాన్ కఠినంగానే.

ఆవిడదగ్గరకెళ్ళి, ఆ రెండు జడలూ పట్టుకుని, నడినెత్తిన గుట్టగా చుట్టాడు.

"మాత్ర్యోనా!" అని పిలిచాడు ముసలావిణ్ణి; "వెళ్ళొక గాజ్ రుమాలు పట్టుకురా!" అన్నాడు. "రుమాలు" అని మళ్ళీ యకూత్ భాషలో చెప్పాడు, నవ్వుతూ. "ఆఁ. ఇలాతీసుకురా. ఇదిగో ఇక్కడ కట్టు. ఆఁ, అట్లా.. చూశావామ్మా! నేలనే కాదు కడగవలశింది! అప్పుడప్పుడూ యీ జడల్ని గూడా కడుక్కుంటుండాలి నీళ్ళతో!"

మాషాలాంటి వాళ్ళు చాలామంది వున్నారక్కడ ఎప్పుడూ సాయంజేస్తూ వుండేందుకు. ఉఛఖాన్‌బళ్ళో చదువుకునే చిన్నపిల్లలమీద ఎక్కువగా అధారపడేవాడు ఇవాన్. అందులో ఒక విశేషం వుంది. ఆ చిన్నపిల్లలకి భయంతక్కువ. వాళ్ళామంచుదుప్పుల్ని పట్టుకుని, చంపి, చర్మం ఒలిచేస్తారు; ఐనా, మనిషిరక్తం చూచి గాభరాపడి పోయేవారు. కానీ ఆపరేషన్లు చేసేప్పుడా భయమూ గియమూ అంతా మరచిపోయి, ఏకాగ్రతతో పనిచేశేవారు. పనిలేనప్పుడు, నికీతా, ఒకోక్కసారి స్వయంగా ఇవాన్, ఆపరేషన్ పరికరాలపేర్లూ అవీ చెప్పి, అవెందుకుపయోగిస్తారో సవివరంగా చెప్పేవారు వాళ్ళకి. ఆ ఆడపిల్లలుగూడా తెలివిగలవాళ్ళు; సూక్ష్మగ్రాహులు; చెప్పినవన్నీ నోట్‌పుస్తకాల్లో వ్రాసుకునేవారు. అందులో యిద్దరప్పుడే ఆపరేషన్ దగ్గర సాయం జేస్తున్నారు గూడాను.

"మనదగ్గర పనిచేసేవాళ్ళూ, రోజురోజుకూ పెరిగిపోతున్నారు. కాని మనకి బడ్జెట్ లేదు; జీతాలిచ్చేందుకు డబ్బులేదు" అన్నాడు ఇవాన్ ఒకనాడు నికీతాతో.

జిల్లా సోవియెట్‌నుంచి అప్పుడే తిరిగొచ్చాడు నికీతా; ఉత్తరాలు పట్టుకొచ్చేందుకని వెళ్ళాడు.

"ఇవిగో, యివి వార్తాపత్రికలు. అన్నిటికంటే చివరిదీ," అన్నాడు నికీతా; ఇదొక నెలరోజులు పాతది. జర్మన్ ఫాక్టరీల మీద ఇంగ్లీషు విమానాలు దాడి చేస్తున్నాయట ఈలోపుగా అసలీయుద్ధం ముగిశినా, ముగిశుండవచ్చు. అదృష్టవశాత్తూ మనకొక రేడియో వుంది గాని,........"

"కామెనుష్కా వార్తలేమీ లేవా? "అనడిగాడు ఇవాన్.

"పోస్టొచ్చిందికాని ఉత్తరాలేమీ లేవు."అన్నాడునికీతా. ప్రతి రోజూ, తానే స్వంతంగా వెళ్ళి, తన డాక్టర్ కేమైనా వుత్తరాలున్నాయేమోనని పోస్ట్‌మెన్ బల్లంతా గాలించి వస్తాడతను. "ఇవిగో, ఇవన్నీ వార్తా పత్రికలు. ఫిబ్రవరి పదహేనో తారీఖున పద్దెనిమిదో పార్టీ సమావేశం ప్రారంభమైంది మాస్కోలో. వైద్యాన్ని గురించి గూడ చర్చించారు అందులో. ఇదిగో, యిందులో చూడండి. క్రిందటేడు ప్రజారోగ్యం కోసమని తొమ్మిది బిలియెన్లకి పైగా రూబుల్స్ ఖర్చుచేశారు. ఈ సంవత్సరం యింకొక బిలియెనున్నర ఎక్కువ ఖర్చు చేయబోతున్నారు. పట్టణాల్లోనూ, పల్లెల్లోనూ వున్న హాస్పిటళ్ళల్లో యింకొక ఇరవయ్యేడు వేల కొత్త పక్కలు యేర్పాటు చెయ్యాలనీ, ప్రసూతి చికిత్సాలయాల్లో యాభై వేల పక్కలు యేర్పాటు చెయ్యాలనీ తీర్మానించారు. వస్తూ వస్తూ లెక్క లేసి చూశాను: హాస్పిటల్‌కి వంద లెక్కన రెండువందలదెభై కొత్త హాస్పిటళ్ళు కట్టాలన్నమాట; అంటే డాక్టర్ గదు ల్లాంటివి కాక ఒక్కొక్క హాస్పిటల్‌కి పదేశి వార్డులుంటాయన్న

మాట. ఒక్క సంవత్సరంలో ఐదువందల ప్రసూతి చికిత్సాలయాలూ, రెండువందలడెబ్భై హాస్పిటళ్లూ కట్టబోతున్నాం! చూశారా! విప్లవానికి పూర్వం, యకూతియా అంతా వెదికి చూచినా చెప్పుకోదగ్గ హాస్పిటల్ అంటూ ఒక్కటిగూడా వుండేదిగాదు. ఇప్పుడీ పద్దులో ఉఛఖాన్ హాస్పిటల్ గూడా చేర్చారంటూరా? లేదా? ఇవాన్ ఇవానొవిచ్! చెప్పండి."

"ఎందుకు చేర్చరు? తప్పకుండా చేరుస్తారు, నికితా" అన్నాడు ఇవాన్; "సరేగాని, నాకేమీ వుత్తరాలు రావడం లేదని ఎందుకను కుంటున్నావు నువ్వు?"

"ఏమో."

"నీకూ రావడంలేదా యేమీ?"

"లేదు. ఐనా అక్కడ మన విద్యార్థులికి తీరికెక్కడ? అదీగాక, యిక్కడ మనం యేం చేస్తోందీ రాస్తే, చదవాలనుంటుంది వాళ్ళకి."

"డెనిసన్నా వ్రాయడేం వుత్తరం!" అన్నాడు ఇవాన్ మళ్ళీ.

"వార్యా గూడా అంతేగా"అన్నాడు నికీతా; "అంటే, అంతా సవ్యంగా వుందన్నమాట, లేకపోతే రాశేవారే."

"అంతా అపసవ్యంగా వుందేమో; అందుకని యేమని వ్రాయాలో తోచక వూరుకున్నారేమో."

"అపసవ్యంగా యెందుకుంటుంది? మనం అట్లా అనుకోవలశిన అవసరం మాత్రం యేముంది?"

"సరే; సంగతులేమిటో చెప్పు".

"ఏముంది. కయూర్ లు చాలా దూరంనుంచి వచ్చారు. వాళ్ళకి కామెనుష్కా కబుర్లు తెలియవు."

"అసలేమైనా విశేషాలున్నాయంటావా ?"

"ఏదో వొకటి అనాలి కాబట్టి అన్నాగాని, కబుర్లున్నాయని కాదు."

# 37

గడ్డుకేసేదైనా ఆపరేషన్ కొచ్చిందంటే, ఆపరేషనైం తర్వాత గూడా, అతిశ్రద్ధగా వుంటాడు డెనిస్. న్యూరోసర్జెరీని గట్టిగా బలపరచే వాళ్ళలో అతనొకడు.

అతనికున్న అనుభవాన్ని బట్టైతే, యీ పాటికి, దూరాానున్న ఏ చిన్నగని వైద్యశాలకో సర్వాధికారిగానో, లేకుంటే ఏ సర్క్యూట్ డాక్టర్ గానో, పంపించవలశిందే. కాని, ఈ హాస్పిటల్లో ఫెల్డ్ షెర్ గా ఐనాసరే, యిక్కడే వుంటానని పట్టుపట్టి మరీ వుంటున్నాడు.

ఒకనాడు సెర్గుతోవ్ వస్తే, తన వుద్దేశమంతా పూసగుచ్చినట్టు చెప్పాడు డెనిస్. ట్రేడ్ యూనియన్ చందాలు చెల్లించడానికని వచ్చాడు సెర్గుతోవ్. హాస్పిటల్లో వున్న ట్రేడ్ యూనియన్ కమిటీ కిప్పటికి మూడు సార్లునుంచీ డెనిస్ నే ఎన్నుకుంటున్నారు అధ్యక్షుడుగా. "నేనిక్కడే, యీ ప్రజల మధ్యే వుండాలనుకుంటున్నా" అని చెప్పాడు డెనిస్, "ఎక్కడికో దూరంగా వెళ్ళిమాత్రం నేను పొడిచెయ్యగలిగిందేముంది? ఐనా, యిక్కడ నా కుటుంబాన్నంతా వదిలేశెళ్ళడమూ యిష్టంలేదు

నాకు. అదీగాక, యీ రోజుల్లో డాక్టర్ డిగ్రీ వున్నవాళ్ళని తప్ప పంపడంలేదు. ఫెల్డ్‌షెర్‌లదేముంది? నర్సులు గూడా వచ్చేశారు. డాక్టర్ చెప్పే పనులన్నీ, నేను చేశినట్టానర్సే చేస్తుంది అనుభవం బాగావుంటే."

"ఐతే, యిక మీ అవసరం తీరిపోయినట్టేనా?" అని హాస్యమాడాడు సెర్గుతోవ్.

"ఇంకా పూర్తిగా తీరిపోలేదనుకో. కాని భవిష్యత్తే మంత ఆశాజనకంగా మాత్రంలేదు."

"ఐతే, రెండుసంవత్సరాల ట్రెయినింగిచ్చి, మిమ్మల్నందరినీ తయారు చేశారెందుకూ ఇవాన్ ఇవానొవిచ్?" అనడిగాడు సెర్గుతోవ్.

జవాబు చెప్పేముందు, సాలోచనగా ముక్కు గోక్కున్నాడు డెనిస్:

"ఈప్రాంతం సమస్యలు వేరుకావడం ప్రధాన విషయం. చిన్న చిన్న పల్లెలు. పల్లెకూ పల్లెకూ మధ్య బోలేడు దూరం. ప్రతిపల్లెలోనూ ఒక డాక్టర్ని పెట్టాలంటే సాధ్యంకాదు; అంతమందిడాక్టర్లు గూడా లేరసలు. అంటే, తాత్కాలికంగా, ప్రస్తుతానికి ఫెల్డ్‌షెర్‌లు కావాలన్నమాట. ఇక రెండో విషయం: ఆయన ట్రెయినింగిచ్చిన వాళ్ళందరూ యువకులు. వాళ్ళందరూ, కుతూహలం వుంటే, —ఆ కుతూహలాన్ని ఇవాన్ కలిగించారనే నాదృఢ నమ్మకం—యిప్పుడున్న జ్ఞానంతో సంతృప్తిపడరు. నెమ్మది నెమ్మదిగా ఉన్నత డిగ్రీలు సంపాదించడానికి కృషిచేస్తారు. ఎందుకూ, మననికీతా మట్టుకు నికీతా పుస్తకాలన్నీకొని అట్టిపెట్టుకున్నాడు; ఉత్తర ప్రత్యుత్తరాలతో చదివి పై

పరీక్షలకి కూర్చుందామని. యీ యీపుస్తకాలు తెప్పించుకో మని నేనే చెప్పాను అతనికి."

"ఐతే మీరుగూడా చదువుతున్నారన్నమాట" అని నవ్వాడు సెర్గుతోవ్.

"ఇప్పుడేమిటి! మూడేళ్ళనించి చదువుతున్నా ప్రిమోర్స్క్ మెడికల్ స్కూల్లో."

"ఓరి, యింతకాలంనుంచీ రహస్యంగా దాచారన్న మాట; భలే. మొత్తంమీద ఉక్రేనియన్ జిత్తులమారితనం పోలేదు!"

డెనిస్ నవ్వాడు.

"జిత్తులకంటే మొండితనమూ, పట్టుదలా యెక్కువ. ఏదైనా అనుకుంటే అదయ్యేదాకా వదలిపెట్టను. నీ పెద్దలంటే సరైన గౌరవం చూపనందుకుగాను యిప్పుడు నీకొక శిక్షగూడ వేస్తున్నాను. వెంటనే వెళ్ళి, వాలెంతినోవిచ్‌ని ఆరోగ్య కేంద్రానికి పంపడాని కవసరమైన అనుమతి పత్రం రావడాని కింత ఆలస్యం యెందుకైందో కనుక్కురావాలి."

"మీరు అధ్యక్షులు. మీ మాట కాదనగలనా? చిత్తం! చిత్తం!" అన్నాడు సెర్గుతోవ్ కొంచెమువినయం అభినయిస్తూ. వెంటనే, గొంతుమార్చి, ఎప్పటిలా, "ఇవ్వాళ గూసేవ్‌చెప్పారు; ఇవాన్ ఇవానొవిచ్ యికిటు రారట. అక్కణ్ణుంచతే సరాసరి మాస్కో వెళ్ళిపోతారట." అని చెప్పాడు.

డెనిస్‌కి కోపం వచ్చింది."ఇవాన్ ఇవానొవిచ్ యిక్కడికి రారా! ఆ గూసేవ్ కాయకసంగతి తెలియదులే. ఇవానొవిచ్

యెవరనీ గూసేవ్ వుద్దేశం? పారుబోతనా? తనకి సభ్యత్వం వున్న పార్టీకి గూడా తెలియజెయ్యకుండా ఏ కమ్యూనిస్టైనా అలాంటి పనిజేస్తాడూ? అందులో, ఇవానొవిచ్ పార్టీ నాలోచించకుండా ఏపనీ చెయ్యరు; నీకు తెలుసో తెలియదో."

"వ్యక్తిగత జీవితాన్ని గూడాలత్యం చెయ్యకుండానా?"

"బాగానే వుంది! అందులో ఆయన తప్పేముంది? ఓల్గా పావ్‌లోవ్నా ఆయన్నొదిలి పెడితే, అందు కాయన్దా బాధ్యత? ఆ బాధ్యతంతా ఆవిడదే. నాకున్నదల్లా ఒకటే చింత: ఉచఖాన్‌లో రోగులుచాలా మంది వున్నారేమో, వారందరికీ చికిత్సచేసి వచ్చేప్పటికి వసంతకాలం వచ్చేస్తుందేమోనని. అవసరమనుకుంటే బహుశా ఆయన వేసవిదాకా వున్నా వుండొచ్చును. ఇక్కడరోగు లిక్కడున్నారు ఆయనకోసం ఎదురుచూరులు చూస్తూ. వాళ్ళ కాపరేషన్ చెయ్యాలంటే గూసేవ్‌కేమో భయం. కోలిమాగనుల్నుంచి యిద్దరొచ్చారు, ఒఖోత్‌స్క నుంచి యింకొకతనొచ్చాడు. అతనొచ్చి అప్పుడే రెండువారాలై పోయింది."

"ఆరోగ్యకేంద్రానికి నాకేమీ అనుమతి పత్రం అవసరం లేదులే" అన్నాడు. న్యూరాలజిస్ట్ వాలెంతినొవిచ్, రెండు రోజులతర్వాత; "యకూత్‌స్కనుంచి టెలిగ్రామ్ వచ్చింది నాకు. నా పాతస్నేహితుడొ" కాయన ఆ నగర హాస్పిటల్‌కి డాక్టర్‌గా వెళ్ళాడు. నేమ వెంటనే వెళ్ళిపోయి యేదో వొక కొత్తవుద్యోగం చూసుకుంటాను."

ఇరవై నాలుగు గంటల డ్యూటీచేసి, అప్పుడే గూసేవ్

ఆఫీసులోకి అడుగుపెట్టాడు డెనిస్: "ఉఛఖాన్ మీదగానే వెళ్తారా?" అనడిగాడు.

"ఏదారెంట వెళ్తారని కయూర్ లనడగలేదు. ఉఛఖాన్ మీదగా వెళ్తేనే అడ్డదారౌతుంది. కాకపోతే శీతకాలం గదూ, దారంత బాగా వుండకపోవచ్చు. నాకూ, ఉఛఖాన్ మీదగా వెళ్తే, మన ఇవాన్ ఇవానొవిచ్‌ని చూడొచ్చునే అని వుంది. ఐనా, అదంతా కయూర్ ల యిష్టం."

"మీరు ఉఛఖాన్ మీదగా వెళ్ళేటట్టయితే, ఇవాన్ ఇవానొవిచ్ కివ్వడానికి ఒక వుత్తరం యిస్తాను మీ చేతికి." అన్నాడు డెనిస్; తర్వాత, "ఆ వుత్తరం ఓల్గాపావ్‌లోవ్నా వ్రాసిన వుత్తరం" అని అతినెమ్మదిగా అన్నాడు, ఆగదిలో వున్నది వాళ్ళిద్దరే ఐనప్పటికీని.

వాలెంతీనొవిచ్ ముహం వాడిపోయింది.

"తప్పకుండా నేనే పట్టుకెళ్ళాలంటారా? అసలే గుండె జబ్బు. అలాంటి వార్త అందజెయ్యడమంటే మాటలు గాదు."

"సిగ్గులేదటండీ!" అన్నాడు డెనిస్, కోపంగానే; "ఐతే ట్రేడ్ యూనియన్ కమిటీ అధ్యక్షుపదవి నుపయోగించుకుని, అధికార పూర్వకంగా పంపే ఏర్పాట్లు చేస్తాను ఆ వుత్తరాన్ని.

డెనిస్ మాటలింకా పూర్తికానేలేదు; గూసేవ్ వచ్చాడు లోపలికి: "డెనిస్ ఖిమ్మతొన్నిక టడుగుదామని వచ్చాను. కొత్తగా వచ్చిన సర్జ్యానిక్ డాక్టర్ కి పనిబాగా తెలియదు. ఆయనబదులు, మీరే, స్లాంత్‌సెవీ గనుల్దగ్గర కెళ్లొస్తే బావుం టుందనుంది నాకు. అక్కణ్ణుంచి ఏవరో ఒకావిడ వచ్చింది గూడాను డాక్టర్ కావాలని. .అదీగాక, అలెగ్జీ తెలుసుగా మీకు? ఇవాన్ ఇవానొవిచ్ కాలాపరేషన్ చెయ్యాలా మొన్న

వేసవి కాలంలో? ఆ అలెగ్జీ అక్కడేవున్నాడు; ఆయన ఆరోగ్యం ఏమంత బావుండలేదట.

"అలెగ్జీయా? ఏం, ఏమైందాయనకి?" అనడిగాడు డెనిస్ ఆదుర్దాగా.

''మళ్ళీ కాలికేదో వచ్చిందట.''

''మళ్ళీనా ? అదేమిటి ? ఇవానొవిచ్ చేసిన ఆపరేషన్ బాగానే జరిగిందే !'' అంటూ వెంటనే ఇవాన్‌ని సమర్థించాడు డెనిస్.

"ఆపరేషన్ ఐంతర్వాత ఏమౌతుందో యెవరికి తెలుసు? చేసిన ఆపరేషన్ గూడా ప్రయోగాత్మకంగా చేసిందాయె !"

"ఏం ప్రయోగాత్మక మండీ ! అలాంటాపరేషన్లెన్ని చెయ్యలేదు ? పదిసంవత్సరాల్నుంచి చేస్తున్నాం అలాంటి ఆపరేషన్‌నులు, ఇంతవర కెవ్వరూ అవిపనిచెయ్యలేదని అనలేదు" అని, యీ కొత్తపద్ధతి ఆపరేషన్‌ని సమర్థించాడు డెనిస్; యీ ఆపరేషన్‌లకి గూసేవ్ వ్యతిరేకని యిదివరకే తెలుసతనికి.

"ఇంకొక పదిసంవత్సరాలకేమౌతుందో ఎవరికిమాత్రం యేం తెలుస్తుందిలే ?" అన్నాడు గూసేవ్, కోపంగానే.

"ఏం జరుగుతుంది ? ఏమీ జరగదు ! అంతే ఒక్కటి మట్టుకు నిజం: బాగా అనుభవం వున్నవాళ్లూ, తెలిసినవాళ్లూ చెయ్యాలి ఆ ఆపరేషన్." అని న్యూరాలజిస్ట్ వంక చూశాడు డెనిస్, తనని బలపరచమన్నట్టు. గూసేవ్‌తో పోట్లాటెందుకులే అన్నట్టు, తలవంచేసుకున్నాడు వాలెంతీనొవిచ్. దాంతో మరీ కారం రాసుకున్నట్టయ్యింది డెనిస్‌కి: "ఐతే, యిప్పుడలెగ్జీని బాధపెట్టేది ఎడమకాలేమో. ఇవాన్ ఇవానొవిచ్ మొదటే హెచ్చరిక చేశారు ఎడమకాలు బాధపెడుతుందని.'' అన్నాడు;

అని, 'ఎవరేం బాధపడినా యీాయనకి బాధ వుండదు; తానను కున్న సిద్ధాంతం సరైందనుకుంటే చాలు, సంతృప్తి పడతాడు. నీచుడు!' అనుకున్నాడు తనలోతాను.

ఇంతజరిగినా, గూసేవ్ కోరిన కోరికని తిరస్కరించా లని తోచనేలేదు డెనిస్‌కి. అక్కడ రోగులు బాధపడుతూ వుండివుంటారు. వెళ్ళి తీరవలసిందే.

గూసేవ్ వెళ్ళిపోయాడు. డెనిస్, వాలెంతీనొవిచ్‌లు గూడా బయల్దేరారు. "ఎందుకూ? వూరికే ఆయన్తో మాట్లాడ్డం? చెప్పింది వింటాడు గనుకనా ? తాబట్టిన కుందేటికి మూడే కాళ్ళనే రకం !" అన్నాడు వాలెంతీనొవిచ్.

"ఐతే నాకేం ? అందుకని ఆయనన్న దానికల్లా ఔనన మంటావా ?"

"ఎన్ని చెప్పినా, మనపై అధికారిగదా !" అని నవ్వాడు వాలెంతీనొవిచ్.

కనులకింద బాగా గుంటలు పడినై ; పొట్టగూడా బాగా వొచ్చింది; తలగడ పెట్టినంత లావుగావుంది అక్కడ. ఇకముసలి వాడైపోతున్నాడని డెనిస్ గుర్తించడానికదే మొదలు.

"ఎంతమారిపోయాడు !" అని సానుభూతిగా అనుకో బోయాడు డెనిస్; కాని, ఇంతలోనే, యిందాక ఇవాన్‌ని సమర్థించేందుకు వెనకాడాడన్న సంగతి గుర్తుకొచ్చి, కోపం వొచ్చింది.

"శానిటోరియెమ్‌కి ముందు అనుమతి పత్రం తీసుకుని, ఆరోగ్యం కుదటబడేదాకా మీరక్కడ వుండడమే మంచిది" అన్నాడు డెనిస్.

"కాదులెండి. ముందెళ్ళి నాకొత్తవుద్యోగంలో చేర్తాను. లేకుంటే నాపాత సహచరుడితో కలిసి పనిచేసే అవకాశం పోతుంది."

# 38

గూసేవ్ చెప్పినట్టు ప్రయాణమయ్యాడు డెనిస్. స్లెడ్జ్ బండి వూపుకి, ఊయలూపినట్టు, కునుకుగూడా పట్టింది. ఒక చోట, బండిమలుపు తిరుగుతున్నప్పుడు కిందపడిపోయినంత పనైంది. సందెచీకటి పడేప్పటికి వెళ్ళవలసిన చోటుకి చేరుకున్నారు.

ఆరోగికి డబుల్ న్యుమోనియా.

పరీక్ష జేస్తూ, "ఇంతకాలం యెందుకూరుకున్నారు, ఏ డాక్టర్నీ పిలవకుండా ?" అనడిగాడు డెనిస్. 'గుండె బాగానే వుందిగాని లివర్ బాగా పెద్దదైనట్టుంది. మనిషి రంగుగూడా ఏమీ బావుండలేదు' అనుకున్నాడు.

ఆవిడ చాలా బలహీనంగా, బక్కపలచగా వుంది. నరాలన్నీ పైకి కనబడుతునైన్నై. అలాగే పక్కమీద కూర్చునుంది భయపడిపోతూ.

"జబ్బురాగానే, డాక్టర్ని పిలిచేంత తీరికెక్కడుంది నాకు ?" అంటూ గొణిగిందావిడ; "ముగ్గురు బిడ్డల తల్లిని. మా వారేమో కాలం చేశారు."

'ఇది పచ్చకామాల జబ్బే (జాండిస్), సందేహం లేదు. సల్ఫాపైరిడైన్ ఇంజెక్షనిస్తే బాగుండును; మరా లివరట్లా

వుండగా ఊగా ఇంజెక్షనివ్వడమేమో మంచిదిగాదు' అని అను కున్నాడు డెనిస్.

కాస్సేపాలోచించి, మందొకటి తయారుచేసి, ఇంజక్షనిచ్చాడు ఆవిడకి.

'ఇక్కడ చాలారోజులు వుండ వలసొచ్చేట్టుంది. ఈవిడ్నిలా కామెనుష్కాకి తీసుకుపోదామా అంటే వీల్లేదు. ఇక్కడే రాత్రింబగళ్లు యీవిడ పక్కనే గడపాలి కాలమంతా' అను కున్నాడు.

ఈరోగిని గురించి ఆలోచించు తున్నాడన్న మాటే గాని, అటు అలెగ్జీనీ మరచిపోలేదు డెనిస్. ఆ యింటి ఘారు గావిడ రాగానే. రోగినావిడ కప్పగించి, హాస్టల్ కి పరుగెత్తాడు. అలెగ్జీవుండేది హాస్టల్లోనే.

డెనిస్ కి తెలిసినంతవరకు, అలెగ్జీ ఎడమకాలు బాధ పెడుతోందన్న వార్తలేమీ రాలేదు. ఆపరేషన్ అవాగానే వెళ్ళి తన వుద్యోగంలో ప్రవేశించాడు అలెగ్జీ. ఇవాన్ ఇవా నొవిచ్ చెప్పినట్టు, అప్పుడప్పుడూ, స్థానికంగా వున్న డాక్టర్ దగ్గర కెళ్ళి వస్తున్నాడు. అతనారోగ్యంగా వున్నాడనే వచ్చినై ఇంతవరకొచ్చిన రిపోర్టులన్నీ.

వరండా ఎక్కుతూ, 'ఎడమకాలే బాధపెంటుంది' అని మళ్లీ వొకసారనుకున్నాడు డెనిస్; క్రిందటిసారి అపరేషన్ చేసి నప్పుడు ఇవాన్ అదే అన్నాడు; ఇలాంటి జబ్బుల్లో అలా జరగడం సహజమేనని అన్నాడు. మరా గాసెవ్ ఎందుకిలా అలా వాగుతాడు?

లోపలికెళ్ళి చూస్తే గుండె ఆగినంత పనైంది; ఎదురుగుండా మంచంమీద కూర్చునున్నాడు అలెగ్జీ, వీపు వెనకొక దిండు పెట్టుకొని. గడ్డంవరకూ వంచి, రెండుచేతుల్తోనూ పట్టుకు కూర్చున్నాడు మోకాలు. డెనిస్ వంక చూశాడు గాని గుర్తించినట్టు లేదు; బాధతో మెలికలు తిరిగి పోతున్నాడు. పెదవులమీద రక్తం చిమురుస్తోంది. కనుపాపలు కదుల్లాడి పోతున్నై.....

"అలెగ్జీ! అలెగ్జీ! ఏమిటి సంగతి అలెగ్జీ?" అంటూ వెళ్ళి మంచంమీదనే, అతని పక్కనే కూర్చున్నాడు డెనిస్; తనతో తీసుకొచ్చిన మందులసంచి పక్కనే వున్న బల్లమీద పెట్టాడు.

"ఇక నావల్లగాదు. నేనిక భరించలేను. ఈ బాధిక సహించలేను"

"ఏ కాలు? ఓహో! ఎడమకాలేగద!" అన్నాడు డెనిస్, పెద్దబరువు దించుకున్నట్టు.

"నిద్ర రావడంలేదు. నిద్ర పోలేకపోతున్నాను. ఇప్పటికి నాలుగురోజుల్నుంచీ కంటిమీద కునుకు లేదు. మొట్టమొదట చల్లగా ఐసులాగుండేది కాలు; తర్వాత్తర్వాత నిప్పుకి మల్లే మండి పోతోంది.... మొదట్లో కాలు కదిపి నప్పుడే వొచ్చేది నొప్పి; ఇప్పుడు కదిపినా ఒకటే, కదపకపోయినా ఒకటే; ఒకటే నొప్పి. అంతా యిదివరకున్నట్టే వుంది. నాపనై పోయింది. ఇక నేనిలవలేను. ఈ బాధకిక ఆగలేను."

"హాస్పిటల్ కి వచ్చెయ్యక పోయావా?"

"ఎందుకూ? ఆ కసాయివాడు గూసేవ్ తో నా కాలు కోయించేసుకోడానికా? ఇదివరకొచ్చినప్పుడే చూశాడు

నా దుంప తెంపాలని. ఇవాన్ ఇవానొవిచ్ వచ్చేవరకూ ఎట్లా గోట్లా ఆగాలనే చూస్తున్నాను. ఆయన రావడానికి యింకా చాలా కాలం పట్టేట్టుంది. రోజూ ఫోన్ చేస్తున్నారు, ప్రొద్దుటా సాయంత్రం పూటాను. అయనచెప్పినట్టు వింటేసే బాగుండే దేమో !"

"నన్ను గుర్తించలేదా అలెగ్జి ?" అనడిగాడు డెనిస్, మందులసంచీ అందుకుంటూ.

మొహంమీద పడుతూన్న అట్టకట్టుకున్న జుత్తులోంచి శ్రద్ధగా చూశాడు అలెగ్జి. ఇంతవరకూ వున్న జ్వరపుచూపు వున్నట్టుండి మాయమైనట్లైంది. పెదవులు కదలినై ; నవ్వేందుకో, ఏడ్చేందుకో తెలియలేదు. ఏడిచేందుకు సిగ్గు; నవ్వేందుకు ఓపిక లేదు.

"డెనిస్ ! మీరా ? ఇవాన్ ఇవానొవిచ్ రాలేదా యింకా ?"

తలూపి ప్రక్కకి తిరిగాడు డెనిస్, అలెగ్జి నిరుత్సాహాన్ని చూడకుండా తప్పించుకుందామని.

"ఇప్పుడే ఒకింజెక్షనిస్తాను." అన్నాడు సిరింజ్ చేతిలోకి తీసుకుంటూ, "ఈ ఇంజెక్షనిచ్చింతర్వాత కాస్తస్థిమితం చిక్కుతుంది నీకు; అప్పుడు కాలు పరీక్ష చేస్తాను. మేం ఆపరేట్ చేసిన కాలెలా వుంది ?"

"బాగానే వుంది. ఆ ఆపరేషన్‌కి ముందు ఏడునెలలు బాధ పడ్డాను. చివరికెలాఐతేం, మీ పుణ్యమా అంటూ బాగుచేశారు..."

ఆరాత్రల్లా నిద్రలేదు డెనిస్‌కి; తెల్లవారు ఝామున ఒక అర్జెంటు వుత్తరం వ్రాద్దాం ఇవాన్ కనిపించింది. ఉదయం

ఎనిమిదింటికి బయల్దేర్తాడు కామెనుష్కాకి వుత్తరాలు తీసికెళ్ళే మనిషి. ఆరోగి నిద్రమేల్కొనే టప్పటికి ఉత్తరం వ్రాయడం పూర్తి చేసెయ్యాలి. అలెగ్జీ విషయమూ; గూసేవ్ అనే మాటలూ; దూరదూర ప్రాంతాల్నుంచి, ఇవాన్ చేతి చలువతో తమతమ జబ్బులు నయం జేసుకోవాలని వచ్చి, యిక్కడ వారాలతరబడి, పడిగాపులు పడుతున్న రోగుల్ని గురించీ వ్రాయాలా వుత్తరంలో. ఎట్లాగోట్లా ఇవాన్‌ని సాధ్యమైనంత త్వరలో రప్పించుకోవాలి. వాలెంతీనొవిచ్ నిన్నరాత్రే బయల్దేరి వెళ్ళిపోయాడు; ఆయనచేతికీ వుత్తరంగూడా యిస్తే పోయేది. ఇవెంక్ పోస్టుజవానుల కిద్దామా అంటే వాళ్ళచేతి వుత్తరాలు తొందరగాచేరవు.

మధ్య విశ్రాంతిలేకుండా ఏకబిగిని ఇరవైనాలుగు గంటల డ్యూటీ; అందులో డెనిస్‌కి డ్యూటీఅంటే డ్యూటీయే. రోగుల గురకలకీ, మూల్గులకీ దూరంగా వెళ్ళి, ఏదో వొక మూలన నక్కి రెండునిమిషాలైనా సరే, కళ్ళు మూసుకుని కునికిపాట్లు పడి వచ్చేమనిషాఅంటే అలాంటివాడు కాదు. చలిలో స్లెడ్జిబండిమీద పడివచ్చాడు. ఆ న్యూమోనియా రోగి, అలెగ్జీ... ఆవులింతలదేవనిగా వస్తున్నై డెనిస్‌కి. కళ్ళు మూసుకుపోతున్నై. ఆటేబుల్ మీదున్న తెల్లకాగితమే తలగడ అనుకుని కాస్సేపు కన్నుమూయ గలిగితే ఎంత బాగుండును!

కాని, అటుచూస్తే అలెగ్జీ. పాపం, నాలుగురోజుల్నుంచీ నిద్రమొఖ మెరగడు. డెనిస్ధైర్యం చెప్పింతర్వాత, ఆ ఇంజెక్షన్ పుచ్చుకుని, నిద్రపోతున్నాడు.

ఆవులించాడు డెనిస్. కళ్లనులుము కున్నాడు. తలొక్కసారి విదిలించుకున్నాడు. కాగితం కలం తీసుకున్నాడు.

"ప్రియమైన ఇవాన్ ఇవానోవిచ్ !" అని ప్రారంభిం
చాడు ఉత్తరం. "సాధ్యమైనంత త్వరగా తిరిగివచ్చెయ్యండి !"
ఔనుమరి ! అది విశ్వాసంగల ఆత్మ; ఒంటరి ఆత్మ. ఆ ఆత్మ
ఆక్రోశమే అది.

తర్వాతిక వరసబెట్టి వ్రాశాడు, ఇదివరకి వాళ్ళు చేసిన
గడ్డు ఆపరేషన్‌లను గురించీ, ఇప్పుడు కామెనుష్కా లో
వేచి కూర్చుంటున్న రోగుల్ని గురించీసీ.

"అలెక్సీ మీకోసమని గంటలు లెక్కపెట్టుకుంటూ
కూర్చున్నాడు. ఇప్పుడతని ఎడమకాలికి వెంటనే ఆప
రేషన్ చేసెయ్యాలి. మీరనుకున్నట్టుగానే ఆ కాలికీ
గూడా కుడికాలు కొచ్చిన వ్యాధే సోకింది. వ్రేళ్లూ,
అరికాలూ అన్నీ బాగా వాచిపోయినై. గోళ్ళచుట్టూ
వున్న చర్మం రంగుగూడా పూర్తిగా మారిపోయింది.
పాపం ! చాలా బాధపడుతున్నాడు. ఆ మనిషిని చూస్తే
చాలు, కళ్ళంటనీళ్ళు తిరుగుతై. అంతటి సంకటపరిస్థితి
స్థితి. వళ్ళుపగుల్తున్న బాధనే భరిస్తున్నాడు. మీరు మాట
పొరపాటున వినకపోతారేమో అని యిప్పుడు భయపడు
తున్నాడు. మీరాపరేట్ చేసినదాంతో సుళువు చెయ్యా
లని గూసేవ్ పరిహారం చెయ్యాలని ప్రయత్నిస్తున్నాడు.
నేను. ఆదిలోనే ఆ పరిహారాన్ని [illegible] చేశాను.

ఇక మీ రక్కడ వుండడానికి వీల్లేదు. [illegible]
మైనపని వున్నాసరే, వచ్చెయ్యండి. నిన్న [illegible]
వాలెంతీనోవిచ్‌తో ఒల్గాపాప్‌లోవ్నా [illegible]
యిచ్చి పంపాను. ఆ ఉత్తరం సంపాదించి పోస్టు [illegible]
బాధ్యత అక్కడ మీరొంటరిగా వున్నారని, [illegible]

# 39

మొనెలాఖరుదాకా యీచలి యిలాగే వుంటుంది. వసంతంవచ్చేవరకూ యీ వృక్షాలన్నీ యిలాగే వుంటాయి మంచుదుప్పటి కప్పుకుని. కానివ్వాళ కాస్త వెచ్చగా వుంది. ఉఛఖాన్ మీదెటుచూచినా మంచుమబ్బులు. తెల్లటి పక్షి యేదో పెద్దపెద్ద రెక్కలు విప్పి కప్పినట్టుంది వూరుమీద. ఉండుండి, ఒక్కసారి, మంచువర్షం ప్రారంభమైంది. ఉఛఖాన్ నది తనమార్గం మార్చింది. ఇనివరకెన్నిసార్లు మార్చిందో యిట్లా లెక్కలేదు. మారిన మార్గాలనిండా యిప్పుడు చెట్లు. పర్వతాల మీదనుంచి చూస్తే, లోయంతా మంచు కప్పుకున్న మంచు దుప్పిలా వుంది.

రెండుకొండలమధ్య, ఖరీదైన ఉన్ని నుసుగేసుకుని, ముక్కోణాకారపు టోపీ పెట్టుకుని నిలబడున్నా డొకతను. క్రిందవున్న గుడారాలవంకా, యిళ్ళవంకా తదేకంగా చూస్తు న్నాడు.

అతను పడుచువాడేమీ కాదు; గడ్డంలేని ముహంమీద ముడుతలున్నై బాగా; కనురెప్పలూ అంతే: వదులొదులుగా వున్నట్టున్నై. ఐనా, బండికి కట్టిన మంచుదుప్పుల్ని వూడదీసి, వాటిని కొండవాలుగా క్రిందికి తోలుకొస్తున్నప్పుడతనినడక పడుచువాడి నడకలా వుంది. క్రిందికొచ్చి దుప్పుల్నొక చెట్టుకు కట్టి మళ్ళీ కొండపై కెళ్ళాడు. స్లెడ్జిబళ్ళ నన్నిటినీ కలిపి కట్టి, ఆ తాడు చేత్తో పుచ్చుకుని, బళ్లు వాలున జారుతూంటే, వెనక తాడు లాగుతూ నడిచొచ్చాడు. అలా దుప్పుల్నొడదీయక

పోతే కొండవాలున బళ్ళు తోలడం కష్టం; స్లెడ్జిలెళ్లి దుప్పుల వెనకాళ్ళకి కొట్టుకుంటాయి.

"దారిమంచిది కాకపోతే దుప్పికి తలనొప్పి" అని గొణుక్కున్నాడతను; ఆ వాగ్రంతాల సామెత గుర్తుకొచ్చి మళ్ళీ దుప్పుల్ని బళ్ళకి కట్టాడు. దారిపడని మంచుమీద తోలుకెళ్తున్నాడు బళ్ళు. దాపటిదుప్పి అలసిపోయినట్టుంది, భారమంతా వెలపటి దుప్పిమీదేశి నడుస్తోంది.

కాస్తదూరం వెళ్ళేప్పటికి చెట్లొత్తుగా తగిలినై దారిలో. అడవిగుర్రాల గుంపు, మందకిసుందంతా పండుకునుంది. ఒక్కొక్క గుర్రం మీదా యింతింత వున్ని పెరిగివుంది. జూల్లు వ్రేళ్ళాడి పడిపోతునై. అంతకుపూర్వం అవి తవ్వుకున్న గుంటలు పూడిపోతున్నై మంచుపడి; ఆ గుంటల్తో పాటు గుంటల్లోఉన్న గడ్డినీ. వచ్చే స్లెడ్జిబళ్ళ పసిగట్టింది గుర్రాలరాజు. దుప్పులవాసన వేసింది దానికి. సకిలించింది. కాని మిగతా గుర్రాలు కదలలేదు; అవలాగే పండుకునున్నై. దుప్పులా దారినినడిచి వెళ్ళిపొయ్యేదాకా, ఆ గిట్టల చప్పుడు చెవికి దూరమయ్యేదాకా, అలాగే చెవులు రిక్కించుకునుంది గుర్రాల రాజు. అడవిగుర్రాల్ని పట్టుకు చంపాలనుకునే వాళ్లిలా దుప్పులబళ్ళమీదరారు. జీనులు వేశిన గుర్రాలమీదెక్కి వస్తారు. అప్పుడిక ఆ తోటంతా గుర్రాల సకిలింపుల్తోనూ, పరుగెత్తే గుర్రాల గిట్టల చప్పుడుతోనూ, విరిగి కిందపడే కొమ్మల మోతతోనూ ప్రతిధ్వనించి పోతుంది .... కాని ఇప్పుడా భయమేమీ లేదు; ఇది వొట్టి స్లెడ్జిబండిమాత్రమే. ఎవరో ప్రయాణికులు. అందుకనే ఆ గుర్రాలలా లెక్కలేకుండా వున్నై.

పరిశుభ్రంగా వుంది అద్దంలా. ఆవులు బయటికి రాగానే గడ్డితీసి వేస్తున్నారు ఒక్కొక్కదానికి. ఖోటోన్‌కీ ఖోటోన్‌కీ మధ్య, పేడతీసి, యిటుకరాళ్లలా, చేసి అట్టిపెట్టారు పిడకలు. వేసవి కాలంలో ఆ పిడకలే కాల్చి పోగేస్తారు, ముసిరే దోమల్ని తరిమేయడానికి. ఎద్దుల్ని వేరుగా కట్టేసారు ఆవులకి దూరంగా. బాగాబలంగా వుంటై ఎద్దులు. జీను వేస్తే గుర్రాల్తో సమానంగా పరుగెత్తుతై.

'దిట్టంగా బలిశున్నై పశువులు; సందేహంలేదు.' అనుకున్నాడతను; 'ఇవన్నీ సమిష్టిక్షేత్రం దొడ్లు. పేడతీసి, పాతేసి, ఎరువుగూడా చేస్తున్నారట పిల్లు! బాగానే వుంది; పెరగపండుతున్నాయ్యట ఆ ఎరువుతో! ఏంలాభం? పాతాచారాలన్నిటినీ పాతేస్తున్నారు!' స్కూలు భవనం ప్రక్కగా వెళ్తూ కాంద్రించి మహమ్మాదా యకూబ్ : 'ఆడవాళ్లకి చదువా? ఎందుకూ!' ఎక్కడచూచినా ఆడవాళ్లే యీరోజుల్లో. ఇక్కడా అంతే. అంతా మూర్ఖ్యాదేనట అధికారం. అంతా యిలాగే వుంది. అంతామారిపోతోంది. పాతవన్నీ పాడైపోతున్నై. నాశనం చేసేస్తున్నారు పాతపద్ధతులన్నింటినీ. శతాబ్దాల నుంచి ఎదుర్కొంటూ వస్తున్నాం యీరష్యన్ పద్ధతుల్ని, ప్రభావాన్ని. ఇక్కడికొచ్చిన రష్యన్లందరూ యిక్కడిభాష నేర్చుకున్నారు. ఇక్కడి అలవాట్లూ, ఆచారాలూ అనుసరించారు.

కుంటూ. ఇవతలికట్టదగ్గర, ఇవాన్ ఇవానొవిచ్ దగ్గర చికిత్సకని వచ్చిన రోగుల దుప్పులున్నై.

ఇవతలికట్టదగ్గర మనఃషుల్ని చూడగానే పలుపులు లాగి, బళ్ళనాపేశాడా యకూత్. చూచినవాళ్ళందరూ పరుగెతుకొచ్చారు బళ్ళదగ్గరకి. భుజాలు కుంచించి, కనుబొమలు చిట్లించి చూశాడు వాళ్ళందర్నీ. బండిమీద నిలబడిన ఆమనిషి తను కళ్ళయెదుటుండే, తమకంటే బలవత్తరమైన వ్యక్తిగా మారి పోతున్నాడనిపించింది చూపరులకి. ఒక్కనిమిషంలో వూరంతా పాకి పోయిందా వార్త:

"మంత్రవేత్తవచ్చాడు! ఉలాఖాన్* మంత్రవేత్త!"

"సిగ్గులేదూ మీకు? వొట్టి బలహీనులు మీరంతా!" అన్నాడు ఉలాఖాన్ బండిమీద చక్రవర్తిలా నిలబడి; జనం అంతా కిక్కురు మనకుండా, నిశ్శబ్దంగా వున్నారు. "జబ్బులికి చికిత్స చేశేది కత్తితోనా? ఎవరన్నావింటే నవ్విపోతారనైనా లేదూ మీకు? ఆ రష్యన్ డాక్టరొచ్చి కత్తితో మన జబ్బులు పొగొడతాడా? ఎప్పుడైనా విన్నామా యిలాంటి విడ్డూరం! చిరకాలంనుంచీ వస్తూన్న సాంప్రదాయాన్ని మరచిపోయారు. ప్రకృతి దేవత తెలివితేటల్ని అవమానిస్తున్నారు మీరు. నేను దేవుళ్ళని పిలిచి, మీ జబ్బులు మాన్పమని కోరుతున్నానూ అంటే మీకు స్వతస్సిద్ధంగా వుండవలసిన ఆరోగ్యాన్ని చేకూర్చి పెట్టమని కోరుతున్నాను. ఎవరైనా సరే, వచ్చినజబ్బునుంచి బయటబడాలంటే, తనకి చేతనైనట్టు, తనబలాన్నే వుపయోగించుకుని కోలుకోవాలా జబ్బునుంచి.

* గా ష్మ.

అలా కోలుకోలేక పోతే, అదతని ఖర్మ. ఆ జబ్బుకు లొంగి పోవాలి. అంతే. మన తాతలనాటినుంచీ, ముత్తాతలనాటినుంచీ వస్తున్న ఆచారం అది, విశ్వాసం అది, నమ్మకం అది. సాంప్రదాయం అది. ఉపయోగరహితమైన వస్తువేదైనా సరే, నశించిపోవలసిందే. తప్పదు. అంతేగాని, కాలుపోయిన కుందేలుబ్రిదకడం యెందుకు ? కామెనుష్కానుంచి వచ్చిన యీ ఇవాన్ ఎంత మంది కాళ్లూచేతులూ కోసేశాడు ?"

"ఎంతమందా ? అబ్బే. ఎంతమందో ఎక్కడున్నారు !" అన్నాడు గుంపులోంచి, ఒక తాత.

"ఎంతమందో ఎక్కడున్నారా ? నీకున్నవి కళ్ళు గాదూ ? కళ్లూ చెవులూ వున్నయ్యా అసలునీకు ? ఐతే మనవాళ్ళలో నూటికి యాభై మందికి, ఆ ఇవాన్ వొచ్చి, కాళ్ళూ చేతులూ తీసేశేదాకా చూస్తూ కూర్చుంటావన్న మాట ?"

"మనజాలరి పావెల్ మంచులోపడి కాలిరగొట్టుకున్నాడు. ఆ కాలు తీశెయ్యకపోతే, మొత్తం మనిషే కుళ్ళిపోయేవాడు. డాక్టర్ ఇవాన్ వొచ్చి ఆ కాలు తీసేశాడు. పావెల్ బాగుపడ్డాడు." అన్నాడు యిందాకటి తాతే; "నాకు కళ్లున్నయ్యా అనడుగుతున్నావ్ కదూ? ఉన్నై. రెండు కళ్లున్నై. ఏదీ నీ నక్క మొహం ఒకసారి చూడనీ సరిగ్గా. నీ నక్క మొహమూ; నీ నక్క జిత్తులూనూ! ఎన్నిరోజుల్నుంచీ సరిగ్గా చూపు కనబడక బాధపడ్డాన్నేను. నిజంగా నేనూ వుపయోగం మాలినవాణ్ణే; ఐనా నాశనం కాలేదు. ఔనౌను; ప్రకృతిదేవత తెలివితేటలు గదూ ! ఆ తెలివితేటల ప్రకారమైతే అంధుడు గూడా, బ్రతికినంత కాలమూ సుష్టుగాతిని, గురకలు పెట్టి

నిద్రపోవచ్చు; కాదూ? నా మెనుష్కానుంచి దేవుడి సుత్తే వచ్చాడు డాక్టర్ ఇవాన్. పుట్టంధుణ్ణి నాకు కళ్ళిచ్చాడు, చూపు కనబడేట్టు చేశాడు. మాకు నీ సాంప్రదాయాలూ వద్దు; ఏమీవద్దు" జనమంతా తాత చెప్పేది విని ఔనౌనంటూ తలలూపారు. "మాకు జబ్బులొచ్చినప్పుడల్లా మంత్రాలు చదివి, నీగుడారం నిండా డబ్బులు పోగుచేసుకున్నావు నువ్వు. కాని డాక్టర్ ఇవాన్ అట్లాగాదు; మా దగ్గర ఒక్కపైసా గూడా ముట్టకుండా నయం చేస్తున్నాడు మా రోగాలు!"

"బుద్ధుంటేగా మీకు!" అన్నాడు మంత్రవేత్త: "ఇదంతా డబ్బు పుచ్చుకోకుండా ఉచితంగా చేస్తున్నారనుకుంటున్నారు మీరు! చివరికి గాని తెలియదు మీకు; మీ పంట మీద గుడ్డలుగూడా వొలిచేసి నప్పుడుగాని అర్థంగాదు. ఏడీ? ఆ పావెల్ ఎక్కడున్నాడు?"

గుంపులోంచి ముందుకొచ్చి నిలబడ్డాడు పావెల్. యువకుడు. ఇంకా కొయ్యకాళ్ళతో నడవడం బాగా అలవాటు లేదతనికి.

"ఇక్కడేవున్నా!" అన్నాడు ముందుకొచ్చి.

"ఇదుగో, యిక్కడే వున్నాడట!" అన్నాడు మంత్రవేత్త ఎద్దేవ చేస్తూ; భలేవాడివిలే. ఉచితార్థంగా ఇచ్చాడు గదూ వాళ్ళు నీ కా కొయ్యకాళ్లు? బాగానే వుంది! ఆ కొయ్యకాళ్లు పెట్టుకుని ఏంచేస్తావయ్యా నీవు? చేపలు పడతావా? వేటాడతావా! ఏం చెయ్యగలవు? ఎందుకు పనికొస్తుందది నీకు? కాలు లేకపోతే నక్కగూడా బదకలేదే! నువ్వెలా బతుకుతావ్? దుప్పంతటి జంతువు కాలిరిగితే, మర్నాటికి చచ్చిపోతుందే! తెలియదూ?"

"డుప్పు, సర్కా; అవి జంతువులు!" అన్నాడు పావెల్ పరిశాంతంగా; "మేం జంతువులం గాదే! మనుష్యులం. మానవులం. జంతువుల్లాగ బ్రతకాల్సిన ఖర్మ మాకేం పట్టింది? ఈ కొయ్యకాలుతో ఎట్లా బ్రతుకుతానని అడుగుతున్నారు మీరు? చెప్పనా! ఇప్పుడక్కడ మేమొక సహకార సంస్థ పెట్టుకున్నాం. ఆ సంస్థకి కాపలా ఉద్యోగం ఇస్తున్నారు నాకు. తుపాకీ పట్టుకునుంటా గుమ్మం దగ్గర నేను. ఏ జంతువైనా సరే. దగ్గరకొచ్చిందంటే చాలు; నా గుండుకి ఎరకావాల్సిందే; చివరికి మీరైనా సరే!"

"నిజం, నిజం!" అని కేకలేశారు జనం అంతా.

"యహూదీలన్న వాళ్ళ కళ్ళు తిన్నగా ఉంటాయ్" అని కేకేశాడు గుంపులోంచి ఎవరో; "నీకళ్ళట్లా లేవ్. ఏటవాలుగా ఉన్నై. నీవి యహూదీ కనులుగాదు; గుంటనక్క కళ్ళు. నువ్వు మనిషివి కాదు; జంతువ్వి!"

"ఏదీ, దగ్గరగా చూద్దాం పట్టండి అతని కళ్ళు!"

"మంచుగుంటలో నుంచి లేపండిరి, బాగా కన్పిస్తాయ్ కళ్ళు!"

"సోవియెట్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా మాట్లాడుతున్నాడు. సైన్యానికప్పగించండతన్ని!" అన్నాడు అప్పుడే వచ్చిన కొమ్సొమోల్ సభ్యుడొకతను. మంత్రవేత్తను భయపెట్టేందుకని కొందరూ, నిజంగానే అతనికి బుద్ధిగరపాలని కొందరూ. రెండడుగులు ముందుకేశారు.

"మహాపాపం మిమ్మల్ని కట్టి కుదుపుతుంది, తప్పదు. జాగ్రత్త!" అంటూ, గబగబా పలుకులు విసబట్టి, మప్పాల్ని

కొరడాతో నాలుగంటించాడు మంత్రవేత్త. స్లెడ్జిబండి వెనక్కి తిరిగి పరుగెత్తింది. మధ్య మధ్య భయం భయంగా వెనక్కి తిరిగిచూస్తూ ఒకచే సవారి ఆ మంత్రవేత్త; జనం కేరింతలు కొడుతూ, గేలిచేస్తూ బండివెంట బడ్డారు కాస్తదూరం, మంచు ముద్దలు తీసి బండికేసి గురిచూచి కొడుతూ.

# 40

మార్చి మాసంగూడా వెళ్ళిపోయింది. పగలు బాగానే కన్పిస్తున్నాడు సూర్యుడిప్పుడు. మంచుమీద పేడు కట్టి గుల్ల బారింది.

ఒకనాడు కొంతమంది యకూత్‌లు రెండు అడవిమంచు దుప్పుల్ని తోలుకొచ్చారు స్కూలు దగ్గరికి.

"మాంసం!" అన్నారు.

నాలుకలు బయటికి చాచి రొప్పుతూ, డొక్క లేగ రేస్తూ నిలబడున్నై అవి. మంచుపేడు తగిలి మోకాళ్ళు రక్తం చిమ్ముతున్నై.

తలమీద టోపీ లేకుండానే వరాండాలో కొచ్చాడు ఇవాన్, తెల్లగౌను తొడుక్కుని; బయటి కొచ్చింది ఆవేట గాళ్ళకి ధన్యవాదాలు చెబుదామని. కాని, ఆ జంతువుల్ని చూడగానే పెదవులమీది చిరునవ్వు పెదవులమీదనే మాయమై పోయింది. కళ్ళనీళ్ళు గమ్మినై. ఈ జంతువులకీ తనకీ భేదం లేదనుకున్నాడు. ఎప్పుడూ నవ్వుతూనో, కేకలేస్తూనో పని చేస్తుంటాడని అనుకుంటారు చుట్టుపక్కలున్న వాళ్ళు. నిజమే

మరి; చుట్టుపక్కలున్న వాళ్ళుగూడా ఆయనచేసే పనిచూశి, తామూగూడా పని ప్రారంభించ వలసిందే కాని, వాళ్ళల్లో ఏఒక్కరికీ తెలియదు అతని హృదయంలో యెంతబాధ దాక్కుని వుందీనీ. చీకటిపడితే చాలు భయపడి పోతాడు, యిక తన భావాల్నీ, తన ఆలోచనల్నీ తప్పించుకోడానికి వీలుండదే అని; ఒంటరిగా కూర్చుని ఆశలేని తనజీవితాన్నెలా గడపాలా అన్నీ ఆలోచించవలసి వస్తుందే అని.

వచ్చిన వేటగాళ్ళకి ధన్యవాదాలు చెప్పి, యింట్లోకెళ్ళి పోయాడు వెంటనే.

ఆవేళ సాయంత్రం వుత్తరం పట్టుకొచ్చి యిచ్చారు. మార్ఫా తీసుకొచ్చి యిచ్చింది. నికీతాతోపాటు ఆవిడా ఆదుర్దాగా వుంది, డాక్టర్ ఇవాన్‌కి వుత్తరాలేమీ రావడం లేదేమా అని. ఈ వుత్తరం పట్టుకెళ్ళిస్తే డాక్టర్ సంతోష పడతాడను కుందావిడ. ఆ వుత్తరం పట్టుకొచ్చింది గూడా పోస్టాఫీస్‌నుంచి కాదు. స్లెడ్జ్ బండిమీద వెళ్ళే బంగారు కళ్ళజోడు మనిషిచ్చాడది. డాక్టర్ వచ్చేవరకూ ఆగడానికి గూడా వీల్లేదని హడావిడి పడ్డాడు. అప్పటికే చీకటి పడుతోంది. స్లెడ్జ్‌బళ్ళకి కట్టిన దుప్పులు ఆపురాపురు మంటున్నై అలసిపోయి. ఇంకో రెండు గంటలు వెళ్తేనే గాని, ముందు మకాం తగలదు. అందుకని, మారు మాటాడకుండా తీసుకుంది మార్ఫా ఆ వుత్తరం. మహదానందంతో అందించింది మార్ఫా ఆ నలిగిపోయిన కవరు డాక్టర్ చేతికి. కవరుమీద 'ఇ. ఇ. అర్జానోవ్' అని వ్రాశుంది. కవరు క్రింద 'ఓల్గాపావ్‌లోవ్నా నుంచి' అని వుంది.

ఆ కవరుచూచి తెల్లబోయాడు డాక్టర్; పెదవుల చివరలు వణకిపోయినై. మార్ఫా అది గమనించింది; ఇక్కడ వుండడం మంచిది కాదనుకుంది. నికీతాని పిలిచి,

"నికీతా! వెళ్ళి రోగుల్ని చూశొద్దాం, పద." అంది.

ఇవాన్ ఇవానొవిచ్ ఆ మాటలు విన్నట్టేలేదు. ఆ కవరలాగే చూస్తూ నిలబడిపోయాడు గది మధ్య. కవరు తేలికగా వుంది; చాలా తేలిగ్గావుంది. అక్కడికక్కడ నిలబెట్టి, మేకులు కొట్టేసినట్టుంది. ప్రాణాపాయం కలిగిన జంతువొక మూలకి చేరుకుంది; ఎదుట వేటగాడు, వెనక్కెళ్ళేందుకు చోటులేదు. ఏం చేస్తుంది? డాక్టర్ గుండె దడదడలాడింది.

ఓల్గా పావ్‌లోవ్నా నుంచి. ఎలాగైతేం వచ్చిందిప్పటికి. ఏముందో లోపల?

విశ్వప్రయత్నంచేసి, సర్వశక్తులూ కేంద్రీకరించుకుని కవరు చించి చూశాడు. నోరెండిపోయింది. అలాగే బలవంతాన కళ్ళు తెరచి చూచాడు లోపలి కాగితం. ఆ కాగితం మీదున్న అక్షరాలు హృదయాన్నీ, మనస్సునీ, మెదడునీ శూలాలై గుచ్చుకున్నై. నోటితడి మరింత ఆరిపోయింది; చెవులలో గింగురుమంటున్న హోరు మరీ ఎక్కువై పోయింది; ఆ దెబ్బకి తాళలేకనే నేమో, కూర్చోబోతుంటే, బల్ల తగిలింది కాళ్ళకి. ఐనా, కనులు కాగితంమీదనుంచి కదలలేదు.

'క్షమించండి. ఇక తావ్‌రావ్‌తో కలిసి మెలసి వుండబోతున్నాను; మంచికే. అతను లేనిదే నా జీవితానికి కేమీ అర్థం వుండదు. ఇంకో మార్గాం

తరం లేదు నాకు. నన్నర్థం చేసుకునేందుకు ప్రయత్నించండి, క్షమించండి.

— ఓల్గా.'

ఐతే, అతనన్నమాట తననుంచి ఓల్గాని దొంగిలించింది!

రెండు చేతుల్తోనూ తలపట్టుకున్నాడు ఇవాన్ ఇవానొవిచ్; పగిలిపోబోతున్నట్లుంది తల. లేచెళ్ళి, పక్కమీద పండుకున్నాడు తల తలగడలో దూర్చి.

" 'అతను లేనిదే నా జీవితానికికేమీ అర్థం వుండదు.... నేనూ? నా సంగతేమిటి? నేనేమై పోవాలి?"

సాయంత్రం వరకూ అలాగే పక్కమీదనే పండుకున్నాడు ఇవాన్; నికీతా ఏవో ప్రశ్న లెయ్యబోయాడు, వేశాడు; కాని సమాధానం లేదు. తెల్లవారబోయేముందు కొద్దిగా కునుకుపట్టింది ఇవాన్‌కి. నిద్రలో ఏడ్చాడు. అంత వయసొచ్చిన మనిషి అలా వెక్కి వెక్కి యేడుస్తూంటే యేం చెయ్యాలో తోచలేదు నికీతాకి; లేచి పక్కమీద కూర్చున్నాడు దిగులుగా.

మర్నాడుగూడా అంతే. పక్క దిగలేదు ఇవాన్. గోడ వైపుకు తిరిగి అలాగే పండుకునున్నాడు.

"వచ్చి ఫలహారం తీసుకోండి" అని బ్రతిమాలాడు నికీతా.

"ఏదో ఒకటి తినకపోతే యెట్లా?" అని కోప్పడింది మార్ఫా.

"తర్వాత" అని పట్టబలవంతాన సమాధానం చెప్పాడు ఇవాన్. అంత వ్యథలోనూ, తన అవసరం యిక్కడున్న వాళ్ల

కెంత వుందో గుర్తించాడు. "తొందరగానే లేచి వస్తున్నానని చెప్పు, నికీతా!" అని అన్నాడు. అన్నాడన్న మాటేగాని లేవ లేదు. అలాగే పడుకునున్నాడు. ఇలా జరుగుతుందని అతని కింతకు ముందే తెలుసు. ముందు తెలిసినంత మాత్రాన, తగ్గ లేదా బాధ.

తావ్‌రోవ్‌ని గురించి ఆలోచించాడు ఇవాన్. ఓల్గానెలా పొందగలిగాడు తావ్‌రోవ్ ? తనకంటే ఎనిమిదేళ్లు చిన్న వాడు కావడంవల్ల కాదుగదా! అవిడ వయసూ, అతని వయసూ ఒకటే; ఇద్దరూ సమవయస్కులు. తావ్‌రోవ్ కామె నుష్కా కొచ్చింది ఆవిడకోసమే. వాళ్ళిద్దరూ మొట్టమొదట స్టీమర్ మీద కలుసుకున్నారు. అతని కనులే అలా వుంటేవి; కల్లా కపటం ఎరగనట్టు! అనవసరమైన కోపం వెల్లువై పారింది ఇవాన్ హృదయంలో. చచ్చిపోవాలనిపించింది; ఐపూ అన మాలూ లేకుండా నశించిపోవడం మంచిదనిపించింది. ఇంతలో నికీతా మాటలు విన్పించినై; కర్తవ్యం గుర్తుకొచ్చింది.

"ఆరైపోయింది. డ్రెస్సింగ్ నేనే చెయ్యనా ?" అనడి గాడు నికీతా.

"ఉఁ" అన్నాడు ఇవాన్.

'ఆరు గంటలైంది' అనుకున్నాడు ఇవాన్; 'అంటే ఒక రోజు గడచిందన్నమాట పూర్తిగా. ఒక రాత్రీ, ఒక పగలూ! ఇంకా బ్రదికే వున్నాను నేను. ఇంతకాలమూ వేచి కూర్చు న్నాను; ఇలా జరుగుతుందని తెలిసీ వేచి కూర్చున్నాను. ఇప్పు డింకేముంది; కావలసిందంతా ఐపోయింది; పూర్తైపోయింది' అనుకుంటూ తలగడని కరుచుకున్నాడు. 'ఇంకేముంది; అంతా ఐపోయింది'.

"ఏం పట్టుకొచ్చానో, చూశారా! ఇవాన్ ఇవానొవిచ్!" అంటూ లోపలి కొచ్చింది మార్ఫా. "చూడండి!" అంటూ బల వంతం చేసింది లోపలి కొచ్చి.

ఇష్టంలేకపోయినప్పటికీ, తప్పక, తలెత్తి చూశాడు ఇవాన్. జిల్లా సోవియట్ అధ్యక్షురాలు, మార్ఫా దగ్గుమీద కూర్చునుంది, చేతిలో ఒక చిన్న దుంగ పట్టుకుని! బోలుదుంగ. దుంగ కొకవైపున ఉన్ని టోపీ వుంది.

"ఏమిటది?" అనడిగాడు ఇవాన్, విసుగ్గా, నిద్రలేక వుబ్బిన కళ్లు కుంచించి చూస్తూ.

"ఒక్క నిమిషమాగండి, మీరే చూస్తారు" అంటూ ఆ టోపీ తీసేసింది మార్ఫా. లోపల్నుంచి, ఏదో డప్పు కొడుతు న్నట్టు ఒకచే రొద.

"ఉడుతా" అనడిగాడు ఇవాన్, తనకు తెలియకుండానే చిరునవ్వు నవ్వుతూ.

"కాదు, కాదు!" అంటూ ప్రక్కకి తప్పుకుంది మార్ఫా. ఏదో వొకవిధంగా తన మనసుని రంజింపజెయ్యడానికే యిలా చేస్తోందని తెలుసు ఇవాన్‌కి. ఐనా, ఆవిడకిలాంటి ఆలోచన తోచడం విచిత్రమే.

మార్ఫా ప్రక్కకి తప్పుకోగానే, ఆ దుంగలో ఒక విచిత్రమైన జంతువు కన్పించింది. గుండ్రని కళ్ళు, నక్క మొహం, గుండ్రంగా చిన్నచిన్న చెవులు. ఎలా కన్పించిందో అలాగే మాయమైపోయింది. ఉన్నట్టుండి, పైకొక్క గెంతు గెంతి, గదిలో అటూ యిటూ పరుగెత్తడం ప్రారంభించింది. దాని మెడమీదొక తెల్లటి మచ్చవుంది. పరుగెత్తేటప్పుడు కూడా

ఆ బెదురు చూపులూ, ఆ కూతలూ, అంతా గమ్మత్తుగా వుంది. పరుగెత్తుతూంటే, పిల్లిలా వుంది !

"ముంగిస!" అంది మార్ఫా; "మహా తెలివి తేటలు గలది. వొట్టి జిత్తులమారి. ఐనా పారిపోదు లెండి; దాని పిల్లలిక్కడే వున్నై. దుంగలో కంత మూసేసి, కొమ్మ నరికి పట్టుకొచ్చారు మా వాళ్ళు. మీ దగ్గరికి తీసికెళ్ళి చూపించమన్నారు వాళ్ళు, ఈ తైగా ప్రాంతంలో ఎలాంటి జంతువులుంటాయో మీకూ తెలియాలని!"

డాక్టర్ మంచం క్రింద దాక్కున్న ముంగిసని "ఉష్షుష్" అంటూ అవతలికి కొట్టి, దుంగపట్టుకొచ్చి చూపింది మార్ఫా. కుతూహలంగా లేచి చూచాడు ఇవాన్ లోపలేముందోనని. ఆ బోలులో, మార్ఫా చెప్పినట్లు, ముంగిస పిల్లలున్నై నాలుగు. చేయి చాచి, ఒక పిల్లనందుకుని పరీక్షగా చూద్దామనుకున్నాడు ఇవాన్; యింతలోనే మళ్ళీ నిస్పృహ. లాభం లేదన్నట్టు, తల వూపి, మళ్ళీ పక్కమీద పండుకున్నాడు.

ఒక్కనిమిషం పాటైతే మాత్రమేం, డాక్టర్‌ని మరిపించ గలిగానుగదా అని సంతృప్తిపడింది మార్ఫా: "చూశారా ! చూడ చక్కగా వుంటాయివి. వీటి నన్నిటినీ యిక్కడే వదిలి పెట్టెళ్తాను. మీ కడ్డం వస్తాయనుకుంటే నికీతాతో చెప్పండి; తీశేస్తాడు".

కళ్ళు యింటి కప్పు కప్పగించి, "రోగు లెలా వున్నారు? కొత్త కబుర్లేమైనా వున్నాయా?" అనడిగాడు ఇవాన్.

ఎంతసేపని పడుకుంటాడు అక్కడలా. వాళ్ళూ వీళ్ళూ వచ్చి, ఏ యెనిమిదేళ్ళ పసిపిల్లవాడినో ఆడించినట్టు తనని ఆడించ బోతే ఏం బావుంటుంది గనుక ?

అన్నీ కొత్తకబుర్లే. గ్రీసుమీదా, యుగోస్లావియామీదా యుద్ధం ప్రకటించింది జెర్మనీ. అప్పుడే విమానాల మీదెళ్ళి బాంబులుగూడా వేస్తున్నారు. పట్టణాలకి పట్టణాలు నాశనమై పోతునై. అటు ఇంగ్లండ్‌మీదా వేస్తున్నారు బాంబులు. సోవియట్ దేశం వొక్కటే యింతనుట్టుకు ప్రశాంతంగా వుంది. ఐనా మనమీద యుద్ధం జెయ్యడమంటే మాటలుగాదు....ఉచ ఖాన్‌కి యింకా ఎక్కువమంది జనం వచ్చారు. ఇక్కడి జనం అంతా మంత్రవేత్త కెలా బుద్ధి చెప్పిందీ గుప్పుమని చెప్పుకుం టున్నారు అందరూ." అని ఒక్క క్షణమాగింది మార్ఫా; సందే హిస్తూనే, "మళ్లీ యివ్వాళ స్తెపాన్ చచ్చిపోయినంత పనైంది. నికీతాయే కిందా మీదా పడి, మళ్లీ తేరుకునేట్టు చేశాడు" అని చెప్పింది.

"స్తెపానా" అంటూ గాబరాగా అడిగాడు ఇవాన్, పైకి లేచి; "మరి నాకు చెప్పలేదే మీరు?"

"ఎలా చెప్పం? టైముంటేనా?" అని అంది మార్ఫా; అంతలోనే, ఇవాన్ వంకొకసారి చూచి, "మిమ్మల్ని బాధ పెట్టడ మెందుకని...." అంటూ నత్తులు గొట్టింది.

"వాలెంతీనొవిచ్ అంత హడావిడిగా వెళ్ళిపోకుండా వుంటే బావుండేది" అన్నాడు నికీతా; "ఆయనగూడా స్తెపాన్‌ని పరీక్ష చేస్తే బావుండేది".

"వాలెంతీనొవిచ్చా?"

"మార్ఫా చెప్పిన పోలికల్నిబట్టి చూస్తే, ఆ ఉత్తరం తెచ్చి యిచ్చింది అయనే అయ్యుండాలి".

ఒక్క నిమిషంసేపు ఆశ్చర్యపోయాడు ఇవాన్; మళ్లీ అంతలోనే అతని ముహం వికసించింది;

"ఎక్కడున్నా డిప్పుడు? సరిగ్గా సమయానికొచ్చాడు దేవుడిలాగా. ఆయనుంటే చాలా మంచిది స్తెపాన్‌ని పరీక్ష జెయ్యడానికి.

"ఆయన ఆగలేదు" అన్నాడు నికీతా.

"నిన్నే వెళ్ళిపోయాడు" అంది మార్ఫా నిట్టూరుస్తూ. ఆయన్నంత తొందరగా వెళ్ళిపోనిచ్చినందుకు తనని తానే తిట్టుకుంది.

'చివరికిలా తయారయ్యాడన్న మాట ఆయనగూడా' అనుకున్నాడు ఇవాన్; అక్కడికీ, ఒక్కడ స్తెపాన్ అనే అతన్ని పరీక్ష జేయడానికి తానవసరమని తెలిసిగూడా, వాలెంతీనొవిచ్ వెళ్ళిపోయినట్టు!

"వెళ్ళి పిలుచుకురావాలంటే, మన కాయన అందు తాడా?" అనడిగాడు, కాన్స్టెపాగి.

చేసిన తప్పు నిప్పటికైనా సరిదిద్దుకునేందు కవకాశం వుందని తెలుసుకుని "ఓ. తప్పకుండాను" అంది మార్ఫా, వుత్సాహంగా; "వాళ్ళ దుప్పులు బాగా అలసిపోయున్నై గూడాను. ఒక్కరోజేగదా; ఎక్కువదూరం గూడా వెళ్ళుండరు. మన బళ్ళు మంచివి కడితే, వాళ్ళ నందుకోవచ్చు."

"ఎట్లాగైనా సరే, ఆయన్ని తీసుకురాకతప్పదు" అంటూ లేచి, అప్పుడే ప్రయాణానికి సన్నద్ధం గావటం ప్రారంభించాడు ఇవాన్; "నేనే బయల్దేర్తాను; ఆయన్నొప్పించి తీసుకోస్తాను."

"ఎందుకు రాడూ? తప్పక వస్తాడు. ఆయన మాత్రం సోవియట్ డాక్టర్ కాదూ?" అంది మార్ఫా.

లియొకాదియా కాళ్లు ముడుచుకుని, కూర్చుంది పొయ్యి దగ్గర. పేరు లియొకాదియా ఐనా, అందరూ ఆ పేరు పొట్టి జేసి, కాద్కా* అని పిలుస్తారావిణ్ణి. కాద్కా చాలా అందమైనది; ఆ బాదంకాయి కళ్లూ అవీనీ. జఖార్ కి భార్య. జఖార్ అంటే స్తెపాన్ తమ్ముడన్నమాట. పొయ్యి దగ్గర కూర్చుని, ఉడుతల చర్మాలు సరిజేస్తోంది కాద్కా. జఖార్ గూడా ప్రక్కనే కూర్చుని సాయం జేస్తున్నాడు భార్యకి; అతని సాయం అవసరమై కాదు, భార్య ప్రక్కన మాట్లాడుతూ కూర్చోవడమంటే సరదా.

"నాకు నిప్పుగూడా అవసరంలా వెచ్చబెట్టడానికి. నువ్వుంటే చాలు నా ప్రక్కన; నువ్వు కంటే గొప్ప" అంటూ భార్య పిరుదలమీద చెయ్యేశాడుజఖార్; "నీది పుడుకు నెత్తురు. ఎంత పుడుకు నెత్తురైతే మాత్రం ఏం లాభం? నీకు పిల్లలు పుడతారా అని!"

కాద్కా నవ్వింది.

"మా అమ్మకి నలభయ్యేళ్లొచ్చిన తర్వాత పుట్టాను నేను. నాకూ మా అమ్మ చాలే వచ్చిందేమో. మరీ ఆలస్య మైతే, యాభయ్యేళ్ళకైనా కనలేకపోతానా అని!

కాద్కా నవ్వుతూంటే కొండలమీద తిరిగే గొర్రెల మెడల్లో గంటలు మోగినట్టుంది. ఆ నవ్వు వినే అది స్తెపాన్ యిల్లని, ఇవాన్ ఇవానొవిచ్ వాళ్ళూ పోల్చుకుంది. ఇవాన్ ఇవానొవిచ్ వెంట నికీతా వున్నాడు, వాలెంతీనొవిచ్ వున్నాడు;

---

*'కాద్కా' అంటే రష్యన్ భాషలో 'తొట్టి' అన్న అర్థం.

ఉఛఖాన్‌కి యాభై కిలోమీటర్ల దూరంలో, రెండో మకాం దగ్గర అందుకున్నారతన్ని. మొదట వాళ్ళని చూచి, మనిషి క్రుంగిపోయాడు కాని, తర్వాత ఒక మనిషి జీవన్మరణ సమస్య కోసమని వాళ్ళొచ్చారని తెలిసిం తర్వాత, ఎమరు చెప్పకుండా బసుల్దేరి వచ్చేశాడు వాళ్ళతో బాటు. కాకపోతే, ఆపరేషన్ అయ్యేదాకా వుండమంటే మట్టుకు సాధ్యం కాదని చెప్పాడు.

ఇవాన్ ఇవానొవిచ్ అందు కంగీకరించాడు. పరీక్షచేసి, రోగనిర్ణయం చేసి వెళ్ళిపోతే చాలు, ఆపరేషన్ పని తాను చూచుకుంటానని వాగ్దానం చేశాడు. ఓల్గానిగురించసలు సంభాషణే రానందుకు వాలెంతీనొవిచ్ సంతోషించాడు.

స్తెపాన్ యింట్లో వున్న వాళ్ళందరినీ పలకరించాడు ఇవాన్.

"బాపున్నావా, కాద్యా?" అన్నాడు నికీతా.

"ఆవిడ కదేం పేరు! యింకా మంచిపేరు పెట్టుకోక" అన్నాడు వాలెంతీనొవిచ్; "ఆవిడ కాపేరు పెట్టిన మతగురు వెవరో కాని వొట్టి పిచ్చివాడు."

"నాకు పేరు పెట్టేముందు కాద్యాలో వుంచారు. మా వూరుకు మతగురు వొచ్చేప్పటికి నాకు పన్నెండేళ్లొచ్చేశానై; అంతవరకు పేరులేకుండానే పెరిగాను. పన్నెండేళ్ళ పిళ్ళని స్నానం చేయించేదెలా? అందుకని తొట్టెలో స్నానం చేయించి, ఆ తొట్టెపేరే నాకు పెట్టేశారు".

ఈ కథ నావిడకి ఆవిడ తల్లిదండ్రులు చెప్పారు. ఆవిడా నిజమేననుకుని నమ్మింది. అదికాక, జఖార్ కా పేరంటే యెంతో ఇష్టం. ఇకా పేరు మార్చుకోవలసిన అవసరం

ఏముంది ? సగర్వంగా నవ్వుకుంది కాద్యా తనలో తాను. నికీతాలాంటి సంయమిగూడా ఆవిడమీదినుంచి కళ్ళు తిప్పుకోలేక పోయాడు; అలాగే కళ్ళప్పగించి, ఆవిడ సౌందర్యం చూచి ఆనందిస్తున్నాడు.

ఈలోపుగా ఇవాన్ ఇవానొవిచ్, వాలెంతీనొవిచ్ స్త్రెపాన్‌ని పరీక్ష చెయ్యడం ప్రారంభించారు. నికీతా అది చూచి, గబగబా వెళ్ళాడు వాళ్ళ దగ్గరకి.

స్త్రెపాన్ పరిస్థితి బాగావిషమించింది. డాక్టర్లొచ్చేప్పటికే, స్పృహా తప్పిపడుకునున్నాడు. పక్కమీద శవంలాపడున్నాడు, కప్పుకేసి కళ్లతో చూస్తూ. భార్యా, బిడ్డలూ దగ్గరకూర్చుని ఏడవడం ప్రారంభించారు. కాద్యాకూడా కళ్ళెంట నీళ్ళు పెట్టడం ప్రారంభించింది.

స్త్రెపాన్ ప్రక్కనే కూర్చున్నాడు ఇవాన్. రోగి చెయ్యి తన చేతిలోకి తీసుకుని, వాలెంతీనొవిచ్‌తో ఏమిటో గాని చెప్పాడు. స్త్రెపాన్ చొక్కా పైకి తీసి, అతని రొమ్ముమీద స్టెతస్కోప్ పెట్టి పరీక్ష చేశాడు. ఇంతలో నికీతా ఇంజెక్షన్ తయారు చేశాడు. రోగి చేతిమీద, సరైన చోటు చూచి ఇంజెక్షనిచ్చాడు ఇవాన్.

జఖార్ గూడా ప్రక్కనేకూర్చుని, మాట్లాడకుండా చూస్తున్నాడు. నిమిషాలు గడచినై. రోగి శరీరం రుద్దుతున్నారు డాక్టర్లు; చివరికేదో మందుతీసి రోగి ముక్కు దగ్గర పెట్టారు. కాస్సేపటికి స్త్రెపాన్ కళ్లు తెరచి చూచాడు; ఒక తుమ్ము తుమ్మాడు.

"ఏం, ఏమిటీ కథ?" అనడిగాడు ఇవాన్, లాలింపుగా.

"నాకేం తెలుసు, మీరే చెప్పాలి"అన్నాడు స్త్రెపాన్.

"యకూత్స్క్‌నుంచి విమానం తెప్పిస్తే, మంచిదేమో." అన్నాడు వాలెంతీనొవిచ్; "ఇంకా మంచుకరగడం ప్రారంభం కాలేదు కాబట్టి, ఎక్కడో వొకచోట, దగ్గర్లోనే, దింపొచ్చు విమానాన్ని. మీరనేదే గనక నిజమైతే ఆపరేషన్ ఎంత తొందరగా చేస్తే అంత మంచిది. రోగి పరిస్థితి చాలా ప్రమాదంగా వుంది."

"ఎక్కడికి పంపుదామంటారతన్ని?" అనడిగాడు ఇవాన్; "ఇక్కడింకా నేను చూడవలసిన పనులు చాలా వున్నై; యిప్పుడప్పుడే కామెనుష్కాకి బయల్దేరడానికి వీల్లేదు నేను."

"ఇర్కుత్స్క్‌కి పంపుదామా? నొవొసిబిర్స్క్‌కి పంపుదామా?"

"అక్కడ న్యూరోసర్జరీ ఎవళ్ళు చేస్తున్నారో తెలియదే నాకు; పోనీ, సరాసరి మాస్కో క్లినిక్‌కే పంపితే?"

"ఏం, స్తెపాన్! మాస్కో వెళ్తావా?" అనడిగాడు నికీతా.

స్తెపాన్ ముహంచూస్తే, యిష్టమున్నట్లనిపించలేదు.

"సోఖ్ * !" అన్నాడు; "సోఖ్! నేను విమానంలో ఎగరలేను. జబ్బు మనిషిని."

అతని భార్యా గూడా అదేమాట. "సోఖ్!" అంది; "ఆయనన్నక్కడికి తీసికెళ్ళడానికి వీల్లేదు. అక్కడొంటరిగా వుండలేడు. సోఖ్"

"ఓరి, పిచ్చాళ్ళారా" అన్నాడు జఖార్; "వెళ్తే యేం? విమానం ఎక్కితే యేం? చక్కగా, ఎత్తుగా, ఎగురుతూ దేశమంతా చూడొచ్చు; చాలా బాగుంటుంది."

---

* వొద్దు.

"నువ్వెక్కు విమానం!" అన్నాడు సైపాన్; "నేను ముట్టుకెక్కనా విమానం. అదన్న మాట నిజమే. నేనొంటరిగా వుండలేను. కావాలంటే ఆరోగ్యంగావున్న వాళ్లెక్కండా విమానం."

వాళ్ళనుకునే మాటలన్నీ ఇవాన్‌కి అనువదించి చెప్పాడు నికితా. "మరికేంచేద్దాం?" అంటూ గొణిగాడు ఇవాన్.

స్తెపాన్ ఏడవడం మొదలెట్టాడు, వున్నట్టుండి.

"అందరి జబ్బులూ నయంజేస్తున్నారు మీరు. నా జబ్బు గూడా మీరే నయం జెయ్యాలి. నా జబ్బు నయం చేస్తానని చెప్పారు మీరు; ఎంతో ఆశ పెట్టుకున్నాను డాక్టర్, మీ మీద. ఇప్పుడు మీరు ఎక్కడికో పంపించేస్తానంటే ఎట్లా? నేనెక్కడికీ వెళ్ళను; మీరే నయం చెయ్యాలి నా జబ్బు."

"డాక్టర్ గారితో నువ్వన్నా చెప్పు నికీతా!" అన్నాడు జఫ్గార్; "ఆయనే చెయ్యమనిచెప్పు; మా అన్నయ్య జబ్బుని ఆయనే నయం చెయ్యమని చెప్పు"

కుటుంబం అభిప్రాయం అంతా విన్న తర్వాత, "ముందసలు జరిగిందేమిటో తెలుసుకోవాలి గదా" అన్నాడు ఇవాన్; "సరే, స్తెపాన్‌ని మన హాస్పిటల్లోనే వుంచి చూద్దాం. ఏం చెయ్యాలో తర్వాతాలోచిద్దాం. ఆపరేషన్‌కి కావలసిన సామానంతా నా దగ్గరుంది. నికీతా! వాళ్ళనడిగి చూడు; అసలా దెబ్బ ఎప్పుడు, ఎలా తగిలిందో అడిగిచూడు."

"చాలా కాలమైంది" అని ప్రారంభించింది సైపాన్ భార్య; "ఎనిమిదేళ్లౌతుంది. వసంతకాలంఅది. మేమందరమూ కలిసి ఒక పెద్ద సంతకెళ్లాం. గుర్రప్పందాలూ అవీ గూడా

జరిగిన్నై ఆసంతలో. మగాళ్ళందరూ కావలశినంత ఓడ్కా అదీ తాగి హుషారుగా వున్నారు. ఆ మత్తులోనే పోట్లాడుకోవడం ప్రారంభించారు. ఆ పోట్లాటలో పొరుగూరు కుర్రాడొకతను యింత రాయి తీసుకుని స్తైపాన్ తలమీద కొట్టాడు. యిక్క డింత బొప్పిగట్టింది; సరిగ్గా నా గుప్పిటంత బొప్పి. కాస్సే పసలు తెలివితప్పి పడిపోయాడు, శవానికిమల్లే."

"నిజమేఁ, గుప్పిటంత బొప్పి! ఇదిగో, ఇక్కడ తగిలింది" అని స్తైపాన్ గూడా చెప్పాడు.

స్తైపాన్ భార్య, స్తైపాన్, ఇవాన్ ఇవానొవిచ్, వాలెంతీనొవిచ్,....అందరూ ఆ దెబ్బ తగిలినచోటు తడిమిచూశారు.

"అట్లా పడిపోయినప్పుడు, చుక్కలు కన్పించినయ్యని గూడా చెప్పాడు స్తైపాన్"అని చెప్పిందతని భార్య, జరిగిన సంగతులు గుర్తుకు తెచ్చుకుంటూ.

"నిజమేఁ, చుక్కలు."అన్నాడు స్తైపాన్.

"నేననుకున్నదే నిజం" అన్నాడు వాలెంతీనొవిచ్: "పిడికిలంత బొప్పెఅంటే మాటలా, వెంటనే స్పృహ తప్పి పోయివుంటుంది."

స్తెపాన్ని హాస్పిటల్లో ప్రవేశపెట్టుకున్న తర్వాత, వాలెంతీనొవిచ్, ఇవాన్ కలిసి పరీక్షలు చేశారు మళ్ళీ మళ్ళీ, రోగనిర్ణయం చేసేందుకు. చివరికొక నిర్ణయాని కొచ్చారు; మెదడుకు కుడిభాగంలో కణితి గట్టింది.... మెనింగియోమా.

మాస్కో వెళ్ళడానికొప్పుకోమని అదేపనిగా చెప్పి చూశింది మార్ఫా, స్తైపాన్ కి. ఆలస్యం అమృతం విషం.

అప్పుడే వసంతకాలం గాలిదుమారాలు ప్రారంభమైనై. ఇం కొన్ని రోజులుంటే మంచు కరగడం మొదలౌతుంది. రోగి పరిస్థితి రోజు రోజుకూ విషమించుతోంది. అంత దూరం పంపిం చడానికింకేదో గుప్తకారణం వుండి వుంటుందని స్తెపాన్ అను మానం; మాస్కో వెళ్ళేందుకతను అంగీకరించలేదు:

"అందరి జబ్బులు నయం జేస్తారే, డాక్టర్ ఇవాన్; నన్ను మాత్రం ఎందుకు బాగు చెయ్యలేదు?"

అతని కుటుంబంగూడా అతన్నే బలపరచింది.

"వాణ్ణంత బలవంతంచేసి పంపడం మంచిదికాదు" అన్నాడు జఖార్; "నిజంగానే ఆ జబ్బంత ప్రమాదమైందే ఐతే, యింకాస్త కనికరం చూపాలి మీరు; జాలిపడాలి. వాణ్ణలా బాధపెట్టడం దేనికీ, యిష్టంలేనిపని చెయ్యమని? ఇలాంటి జబ్బులొచ్చిన వాళ్ళని, ఇవాన్ కామెనుష్కా లో బాగుచేశారుగదా."

"సరే, ఇక్కడే చేద్దాం ఆపరేషన్" అన్నాడు ఇవాన్.

"మనం చేసిన రోగనిర్ణయం విషయంలో మీరేమీ సం దేహించవలసిన పనిలేదు" అన్నాడు వాలెంతీనొవిచ్, ఇవాన్ తో; ఎప్పటిలా ముగ్గోళ్లాడిస్తూ.

"చాలా చాలా ధన్యవాదాలు" అన్నాడు ఇవాన్, ప్రేమగా నవ్వుతూ.

వాలెంతీనొవిచ్ అంటే బాగా గౌరవాదరాలు ఏర్ప డినై ఇవాన్ కి. చివరికాయన అలా ముగ్గోళ్ళాడించడం గూడా యిష్టమే ఇవాన్ కి.

వాలెంతీనొవిచ్ చేతులు రెండూ పట్టుకుని, "మీ మేలు మరవలేను నేస్తం!" అన్నాడు ఇవాన్, మళ్ళీ.

ఆ ఆప్యాయాన్ని చూచి వాలెంతీనొవిచ్ కంఠం గద్గద మైపోయింది: "అందులో ఏముంది; ఎప్పుడే అవసరం వొచ్చిందను కున్నా పిలవండి నన్ను, సందేహించకండి" అన్నాడు.

"వెళ్ళి, వుద్యోగంలో చేర, ఆరోగ్య కేంద్రానికెళ్ళి పోండి వెంటనే" అని చెప్పాడు ఇవాన్. "విశ్రాంతి తీసుకో వాలి మీరు తప్పకుండా; అశ్రద్ధ చెయ్యకండి" అని మరీమరీ చెప్పాడు, వాలెంతీనొవిచ్ వెళ్ళిపోబొయ్యే ముందు.

"వాలెంతీనొవిచ్ వెళ్ళిపోయ్యారు. నేను చెప్పాలా ఆయన సోవియట్ డాక్టరనీ, తప్పకుండా వొచ్చి, సాయంజేసి వెళ్తారనీనీ" అంది మార్ఫా, చిన్నపిల్లలా సంతోషిస్తూ.

ఆ వేళ సాయంత్రం, ఇవాన్ ఇవానొవిచ్ గదిలో ఒక చిన్న సమావేశం జరిగింది; నికీతా, మార్ఫాలున్నారు.

"రోగి పరిస్థితి నెప్పుడూ గమనించుతూ వుండేందుకూ ఎలెక్ట్రిక్ పరికరాలనుపయోగించేందుకూ ఫెల్డ్ షెర్ వాసిలీ వుంటాడు. నికీతా నా ప్రక్కనే నిలబడి, హుక్స్ పట్టుకుం టాడు. నాకక్కావలసిన పరికరాలూ అవీ అందించడానికింకొక యిద్దరు కావలశొస్తారు." అంటూ చెప్పుకొచ్చాడు ఇవాన్ "ఎప్పటికప్పుడు స్టోవ్‌ని చూస్తూండేందుకూ, వేడినీళ్ళదగ్గానే అందించేందుకూ యింకొకళ్ళుండాలి. నికీతామీద నాకు పూర్తి విశ్వాసం వుంది. మిగతావాళ్ళుగూడా అతని లాగానే ప్రశాం తంగా నదురూ బెదురూ లేకుండా పని చెయ్యగల వాళ్ళైతే ఎంత బావుండును. కావాలంటే ఒక గంటసేపైనాసరే, కను రెప్పలు కదల్చకుండా చూడమన్నా చూస్తూ వుండగలడు నికీతా. కాదూ, నికీతా?"

నికీతాకి గొప్పలు వినడమంటే తగని సిగ్గు; సిగ్గుపడుతూ చిరునవ్వు నవ్వాడు.

"ఈ ఆపరేషన్ జరగడానికి మూడు నాలుగు గంటలు పడుతుంది"

"నాలుగ్గంటలే!" అని ఆశ్చర్యపోయాడు ఫెల్డ్ షెర్ వాసిలీ; "ఆ నాలుగ్గంటలూ చేస్తూనే వుంటారా?"

ఇవాన్ ఇవానొవిచ్ తలూపాడు.

"కాదు, కాదు. ఈ ఆపరేషన్‌లో తొందర పడగూడదు; ఎంత ప్రశాంతంగా, నెమ్మదిగా, జాగ్రత్తగా చేస్తే అంత మంచిది.

"ఐతే, పరికరాలు తొందర తొందరగా అందించాల్సిన అవసరం వుండదన్న మాట?"

"ఎప్పుడడిగితే అప్పుడు, ఏదడిగితే అది, వెంటనే అందించెయ్యాలి."

"సరే. ముందు మన నర్సుల్తో రిహార్సల్స్ వేసుకుందాం" అన్నాడు నికీతా; "ఇదివరకు కొన్ని ఆపరేషన్లు చూశారు వాళ్లు; అంచేత భయపడరు. పరికరాల పేర్లుగూడా తెలుసు వాళ్ళకి."

"నేనూ అదే అనుకున్నాను. ఈ ఆడపిల్లలు తెలివైన వాళ్ళే. రెండు రోజులేసుకుందాం రిహార్సెల్స్, మంచి సూచనే అది."

"అవసరమైనప్పుడు నేనూ సాయం చేస్తాను" అంది మాశా.

తలంతా శుభ్రంగా క్షౌరం చేయించుకుని, ఉతికిన రాత్రి గౌను వేసుకుని వచ్చాడు స్తెపాన్, ఆపరేషన్ బల్లదగ్గరకి. ఆపరేషన్ బల్లమీద తెల్లటి నూనెవస్త్రం పరచి వుంచారు.

స్తెపాన్ చుట్టూ వున్నదంతా తెల్లగా పరిశుభ్రంగా వుంది: సర్జన్, అతని సహాయకులూ తెల్లని గౌను లేసుకుని వున్నారు. కప్పుకు గట్టిన తెరలూ అంతే; తెల్లగా వున్నై. రెండు టేబుల్స్ మీద, స్టెరిలైజ్ చేసిన బేసిన్‌లోనూ, ట్రేలోనూ ఆపరేషన్ కవసరమైన పరికరాలన్నీ తెల్లగా మెరుస్తూన్నై. కట్లుకట్టే గుడ్డల చుట్టలు, నెత్తురోత్తగానే పీల్చే దూది, గాజ్, సిల్క్ చుట్టలు....రకరకాల వున్నై అక్కడ. చిన్న చిన్న ప్లాస్కులూ, మందు బుడ్లూ అనేక రకాల వున్నై. ఇవన్నీ సిద్ధంచేశి వుంచింది, స్తెపాన్ కోసం. ఆకత్తులూ, కత్తెరలూ....! మెదడులో జరగాలి ఆపరేషన్. ఎలా చేస్తాడో మరి ఇవాన్. మెదడు దగ్గర కెళ్ళాలంటే, పుర్రె పగలగొడితే తప్ప సాధ్యం కాదని స్తెపాన్‌కి తెలుసు. అందుకనేనేమో, తలంతా శుభ్రంగా గీయించింది.

స్తెపాన్ వొళ్లంతా చల్లబడినట్లైంది. శరీరమంతా చలితో వణకిపోయింది. జబ్బు వచ్చిందగ్గర్నుంచీ వుదాసీనంగా వున్న మనిషికిప్పుడు ఎక్కడలేని భయం ముంచుకొచ్చింది. కాని, ఎదురుగా, ఆపరేషన్ బల్ల పక్కనే నిలుచున్నాడు సర్జన్ ఇవాన్, చొక్కా చేతులుపైకి మడుచుకునీ, తడిచేతులు పైకెత్తినీ; ఆయన్ని చూస్తే కాస్త ధైర్యం పుంజుకుంది స్తెపాన్‌కి.

"ఏం భయంలేదు, స్తైపాన్! భయపడబోకు. పండుకో. కదలకుండా మట్టుకు పడుకో. నువ్వు కదలగూడదు, అంతే; సర్వం సవ్యంగా జరిగిపోతుంది."

"కదలనండి." అని వాగ్దానం చేశాడు స్తైపాన్, ఫెల్డ్ షెర్ వాసిలీ వంక చూస్తూ, వాసిలీ ముహంమీద గూడా అందరి ముహాలమీదలాగానే ముసుగు.

మళ్లీ డాక్టర్‌ని చూచాడు స్తైపాన్, ఆశగానూ, బ్రతిమాలుతూన్నట్టూనూ. తలవూపుతూ చిరునవ్వు నవ్వాడు డాక్టర్. గట్టిగా ఒక్కసారి వూపిరి పీల్చి, ఆపరేషన్ బల్లమీది కెక్కాడు స్తైపాన్. వాసిలీ అతని శరీరాన్ని పట్టుకుని ఎడమ చేతి వైపుకు తిప్పాడు; స్తైపాన్ శరీరం భయంతో బిగతీసుకున్నట్టుంది. స్తైపాన్ తల లేపి, దిండుసరిగా అమర్చాడు వాసిలీ; డాక్టర్ చెప్పినట్టు, రోగి కాళ్ళకేదో వెచ్చని వస్త్రం చుట్టాడు. ఆ పక్క మీదలా ఎంతసేపో పండుకోవాలి స్తైపాన్; తప్పదు; ఐనప్పుడు భయపడి ప్రయోజనమేముంది? ఎట్లాగోట్లా భరించాలి గాని.

తల వెనకేదో దోమ కుట్టినట్టనిపించింది స్తైపాన్‌కి. ఒకసారి కాదు; రెండుసార్లు. ఇంకేదో ఎక్కువ బాధ కలుగుతుందని అనుకున్నాడతను; అందుచేత ఆ దోమకాటుకి 'అబ్బ' అని గూడా లేదు. తైగా ప్రాంతంలో తిరిగేవాడికి దోమ కాటొక లెక్కా? కాస్సేపటికా కాట్లు గూడా తగ్గిపోయినై. ఏదో చిన్ని కుదిలింపు, స్పర్శ; ఏదో లాగినట్టు, ఏదో కిర్రుమన్నట్టు, ఏదో గరగరలాడినట్టు అనిపించింది. అతను నిద్ర పోలేదు కాని, బాధేమీ లేదు. అతనికి జ్ఞాపకమున్నదల్లా ఒక్కటే: కదలగూడదు; కదిలితే సర్జెన్ ఇవాన్ పనికి అంతరాయం కలుగు

తుంది. స్త్రైపాన్‌లాంటి వేటగాడికి కదలకుండా వుండడమంటే ఎవరో వొచ్చి నేర్పవలసిన అవసరం యేముంటుంది!

తన దృష్టినీ, మనసునీ అంతా కేంద్రీకరించాడు ఇవాన్ ఆ ఆపరేషన్‌మీద. ఆపరేషన్ చెయ్యవలసిన భాగమంతా బెంజైన్‌తో కడిగాడు; తర్వాత ఆల్కహాల్‌తో తుడిచాడు. తర్వాత ఎనాస్థెటిక్ యిచ్చాడు. ఎంతో జాగ్రత్తగా వున్నాడు; ఐనా ఆందోళన; తనకి చెప్పుకోదగ్గ సాయం చెయ్యగలవాళ్లెవళ్లూ దగ్గర్లో లేరే అని. ఒంటరిగాడు. అందుకని, ఆపరేషన్ ప్రారంభించే ముందంతా తానే, స్వయంగా, సంసిద్ధం చేసుకున్నాడు.

అవసరమైతే, ఎక్కించవలసిన రక్తాన్నివ్వడానికి సిద్ధంగా పక్కగదిలో ఒక రక్తదాతని అట్టే పెట్టాడు.

అన్నీ జాగ్రత్తగా పరిశీలించి, నొవొకెయ్న్ ఇంజెక్షనిచ్చినచోట వుబ్బిన భాగాన్ని కత్తితో కోశాడు ఇవాన్.

"క్లాంపులు" అన్నాడు ఇవాన్. పక్కనే నిలబడ్డ యువతి అందించింది. ఆ క్లాంపుల్తో నెత్తురు నరాల్ని పట్టుకోవాలి.

డాక్టర్ ఇవాన్ ఏంచేస్తున్నాడో చూచే అవకాశం గూడా లేదాయువతికి. ఆవిడ పనల్లా విదడం, అయనేది కావాలంటే అది అందించడం. ప్రాణమంతా చెవుల్లోనూ చేతుల్లోనూ పెట్టుకుని నిలబడుంది.

క్లాంపులన్నీ అవసరమైనచోట బిగించాడు నికితా.

"కరెంట్!"

తన సహాయం కోసమని వచ్చిన రెండో యువతివంక అదుర్దాగా చూశాడు ఇవాన్; పాపం, ఆవిడ యీ పని నేర్చుకుని నెలన్నా కాలేదు యింకా; గాభరాపడిపోయింది, నుదురు మీద ముక్కుమీద చెమట పట్టింది.

"కరెంట్ తక్కువ చెయ్యండి. ఒకటిమీదుంటే చాలు. నొప్పి పెడితే నాతో చెప్పు స్తెపాన్. నొప్పి పెట్టగానే చెప్పేశెయ్యి నాతో; సందేహించొద్దు. నాకు తెలియాలి నీకెలా వుందీనీ."

కరెంట్ స్విచ్, పొరపాటు సమయంలో పడింది. ఇవాన్‌కి కోపం వచ్చింది. ఏమన్నా అంటే ఆవిడ అసలే కంగారు పడిపోతుందేమోనని ఏమీ అనకుండా వూరుకున్నాడు.

మళ్ళీ కోశాడు. ఒకసారి. రెండుసార్లు. ఆపరేషన్ చేసే చోట క్రమ క్రమంగా చర్మాన్ని తొలగించేస్తున్నాడు డాక్టర్. ఎప్పటికప్పుడు గాజ్ పెట్టి, నికీతా కందిస్తున్నాడు; నికీతా క్లాంపులు బిగిస్తున్నాడు. చివరికాచర్మం పొరని చెవిమీదికి తిప్పి క్లాంపు బిగించాడు. కొక్కెం పెట్టి, చేతి ట్రెఫైన్ తీసుకున్నాడు ఇవాన్.

"కొంతమంది సర్జెన్లు ఎలెక్ట్రిక్ ట్రెఫైన్* ఉపయోగిస్తారు. కాని నాకు చేతి ట్రెఫైన్ అంటేనే యిష్టం." అన్నాడు ఇవాన్ నికీతాతో; "రోగికి చేతి ట్రెఫైన్ ఐతేనే మంచిది. తేలికగా వుంటుంది. పొరపాటు జరగడానికిగాని, జారడానికిగాని అవకాశం వుండదు. ఆలస్యం ఔతుందనుకో. ఆలస్యం మాత్రం ఎంతలే; పదిహేను నిమిషాలు. స్తెపాన్! నొప్పిగా వుంటే చెప్పు.

---

*శస్త్ర వైద్యుల కపాలం కోసే గ్రుంత్రని అర్థం.

"స....రే; సరే" అన్నాడు స్తెపాన్.

నూతిలోనుంచి వొచ్చినట్టుందతని గొంతు.

కోతకోసిన చర్మానికి పక్కనే, ఐదు చిన్నచిన్న రంధ్రాలు పెట్టాడు ఇవాన్; పెర్ఫొరేటర్ తీసేశి, కట్టర్ ప్రయోగించాడు అందుకు. ఆ కట్టర్ గూడా బండబారిన తుపాకి గుండు ఆకారంలో వుంది.

రోగి కాలులోకి సెలైన్ యివ్వడం ప్రారంభమయ్యింది. సెలైన్ యింకా చాలావుంది. ఐనా మార్ఫా అవసరమైన జాగ్రత్తలన్నీ తీసుకుంది. తనతో పనిచేసే మనిషికి మళ్ళీమళ్ళీ గుర్తుచేసింది సూచనలు, స్టోవ్‌నిగురించీ, వేడి నీటిని గురించీ, ఉష్ణోగ్రతని గురించీనీ. అన్నీ అనుకున్నట్లుండాలి మరి.

రోగి పుర్రెలో చేసిన రంధ్రాలు టాంపన్‌తో కప్పాడు ఇవాన్; దగ్గరున్న రెండు రంధ్రాల దగ్గరపడిన ఎర్రటి ఎముక దుమ్మును తుడిచేశాడు. మొండిబారి చిన్నవంపున్న ప్లేట్ కటి తీసుకుని, దాని సాయంతో, దారంలాంటి రంపాన్ని ఒక రంధ్రంలోంచి ఎక్కించి, రెండో రంధ్రంగుండా బయటికొచ్చేట్టు చూశాడు. తర్వాత రెండు చేతుల్తోనూ ఎముకని రంపంతో కోసినట్టు కొయ్యడం ప్రారంభించాడు. అప్పుడు గాని, "కిటకి" కమ్మి ఏర్పడదు.

"ఊరికే గల్లంతు పడుతున్నట్టున్నాను" అన్నాడు స్తెపాన్.

రెండురంధ్రాల మధ్య ఎముక తెగిపోయింది. ఎముక ఒకవైపు మరీ పలచగానూ గరుకుగానూ, వుంది. నెత్తురు కారకుండా మైనం పెట్టారక్కడ. ఎముకనీ, చర్మాన్నీ గాజ్‌తో

కప్పారు; ఆగాజ్‌మీదొక నాప్కిన్ కప్పారు. క్లాంపులు తప్ప యింకేమీ కనిపికిచడంలేదు పైకి.

"చూశావా, దీని పరిమాణం ఎంత పెద్దదిగా వుందో" అంటూ 'ద్యూరా'ని చూపాడు ఇవాన్, నికీతాకి; "ఇదింత పెద్దదిగా వుండగూడదు. ఇక్కడ నాడి ఆడడం లేదసలు. ఇక్కడ వొత్తిడి తగ్గించడానికి గాను పంక్చర్ చేద్దాం"

ఆ పనిగూడా పూర్తి చేసేశాడు ఇవాన్. మెదడు వాపు తగ్గడం ప్రారంభించింది. అంతవరకూ బిగదీశినట్టున్న పొర ముడుతలు పడడం ప్రారంభించింది. నెమ్మదిగా, మెదడు ఆడడం మొదలైంది; కదులుతోంది, గాలి పీలుస్తోంది.

ఫోర్సెప్స్‌తో పైకిలేపి, దారంతో పొరని పైకిలేపి, జాగ్రత్తగా, అందుకోసం ప్రత్యేకించిన కత్తెరతో కత్తిరించాడు.

# 43

ఆపరేషన్ గది తలుపుల కవతల జనం గుమి కూడారు. తలుపుకూ, తలుపు తెరకీ మధ్యవున్న రంధ్రంలోంచి చూద్దామని ఒకళ్ళనొకళ్లు తోసుకుంటునారు. కాదాక్క, జఖార్లుగూడా వచ్చారు. ఆపరేషన్ గది పొడుగ్గా వుంటుంది. ఆపరేషన్ బల్ల గదికా చివర వుంది; అదీగాక, మూర్హా అడ్డుంది. మునికాళ్లమీద నిలబడ్డాడు జఖార్ ఏమైనాకన్పింస్తుందేమోనని. కాస్సేపొకతనిమీద చెయ్యేసీ, ఇంకాస్సేపింకొకని వీపునానుకునీ చూడడం మొదలెట్టాడు. ఏదోపని చేసుకుంటూ, తలుపువైపుకు తిరిగాడు ఇవాన్ లోపల. ఇంకేముంది? జనం అంతా వెనక్కి

విరగ బడ్డారు. జఖార్ పట్టు తప్పింది; విరుచుకు పడ్డాడు వెనక్కి. చేత్తో పట్టుకున్న తలుపు తెర వదలకుండానే. తెర చిరిగి పోయింది.

ఆ అదుటుకి చిన్న బల్లమీదున్న సీసాలన్నీ గలగల లాడినై. ఐనా, ఇవాన్ వెనక్కి తిరిగిగూడా చూడలేదు. అసలా శబ్దం ఆయన విన్నాడో, లేదో.

"ఘాండవతలికి" అంది మార్ఫా వచ్చి, యకూత్ భాషలో.

వెంటనే, ఎక్కడివాళ్ళక్కడ సర్దుకున్నారు. జఖారసలు బ్రదికున్నట్టే లేడు; కాళ్ళు పట్టుకునవతలికి లాగేశారెవరో అతన్ని. ఒక్క సెకనులో కొత్త తెర కట్టేశారు. మళ్ళీ అంతా నిశ్శబ్దం. తలుపు మూసిన శబ్దంగూడా లేదు. వచ్చిన వాళ్ళందరూ వెళ్ళిపోయారు.

"నొప్పిగా వుంది!" అన్నాడు స్తెపాన్; "ఎముక నొప్పిగా వుంది"

"ఎముక నొప్పి చెయ్యదు. నేను పొరని పట్టుకుంటున్నాగదూ, అందుకనీ...." అన్నాడు ఇవాన్.

"ఎక్కడోగాని నెత్తురు కారుతున్నట్టుంది" అన్నాడు నికీతా, ఇవాన్ గౌనుమీద నెత్తురు చుక్కలు చూస్తూ.

"చూడు, ఎక్కడో" అన్నాడు ఇవాన్; ప్రతీ నెత్తురు బొట్టూ అమృతపు బొట్టనుకోవాలి; కారనీ గూడదు." అంటూ, నికీతా కనిపెట్టగలడో లేదోనని, తానే స్వయంగా వెదికిపట్టుకున్నాడా రక్తనాళం; క్లాంపుతో బిగించేశాడు.

గౌనుమీద నెత్తురుచుక్కలు వెంటనే నల్లబడి పోయినై, తుప్పు మరకల్లా.

మెదడు పొర పైకి తీయగానే, లోపల బుడుపు కన్పించింది.

"ఇదిగో, యిక్కడుంది" అన్నాడు ఇవాన్; "స్తెపాన్! నువ్వు పనులన్నీ పురచేత్తో చేస్తావ్‌కదూ ?" అనడిగి, అతనితో మాట్లాడమని వాసిలీని పురమాయించాడు.

"ద్రవ పదార్థం!"

"క్లాంపులు."

పరికరాలు వాటంతటకవే లేచి, ఇవాన్ చేతికందుతూన్నట్టునై.

ఇవాన్ ఆందోళన తగ్గింది. తాముచేసిన రోగనిర్ణయం సరైనదే. తనపని తాను చేస్తూనే, వాలెంతినోవిచ్‌కి ధన్యవాదాలర్పించాడు ఇవాన్ లోలోపలే. ఓల్గా గూడా గుర్తుకొచ్చింది అప్పుడే; కాని వీపుమీదున్న బరువేదో విసరేస్తున్నట్టు నిటారుగా నిలబడ్డాడు ఇవాన్.

"నెత్తురొత్తిడి ఎంత? కరెంట్! ఇదుగో, చూడమ్మా, అతన్ని మాట్లాడించు ఎలాగోలా. నువ్వు మట్టుకు నామాటలే వింటూండు."

కరెంట్ స్విచ్ వేసింది మొదటి యువతి. వాసిలీ గేజ్ చూస్తున్నాడు.

"నెత్తురొత్తిడి తొంభై."

"హుం, పరిస్థితానికి ఫర్వాలేదు."

బుడుపుకోశేప్పటికి నెత్తురదేపనిగా రావడం మొద, లెట్టింది. ముందు సెలైన్‌తో కడిగేశి, స్టైరెల్ గాజ్‌తో తుడిచి ఎలెక్ట్రిక్ పంపుతో పీల్చేశాడు, నెత్తురు కారడం ఆగేవరకూ.

అతి జాగ్రత్తగా, సెలైన్‌లో ముంచిన గాజ్‌ని మెదడు నరానికీ, బుడుపుకూ మధ్యకి చొప్పించి, రెంటినీ విడదీశారు; అప్పుడే రక్తనాళాలు గూడా నొక్కి పట్టారు నెత్తురు కారకుండా.

"స్తైపాన్, ఎలా వుంది?

జవాబు లేదు.

తనపని ఆపకుండానే, "స్తైపాన్ స్తైపాన్!" అని పిలిచాడు ఇవాన్.

కలవరిస్తున్నట్టు, "వేడి" అన్నాడు స్తైపాన్.

"కాసిని నీళ్ళివ్వండి. నెత్తుగొత్తిడెంత?"

"యాభై అరు."

"ఏదీ, కేంఫరింజెక్షన్"

బొడిపంతా వేరైంది కాని, యింకా మొదలలాగే వుంది, మెదడు నరంలోకి బాగా దిగినట్టుంది.

"క్లాంపులు"

ఫోర్సెప్స్‌తో పట్టుకుని, రక్తనాళాలు క్లాంపుల్తో బిగించాడు. "చూశావా, నికీతా! ఈ క్లాంపుల మూలాన పొరపెడదు; యివి ముడుచుకోవు! చూశావా ఎట్లా వున్నాయో" ఉద్రేకంతో గుత్తుల్లాగా అన్నాడు.

మెదడులోకి చేసిన రంధ్రాన్ని మరింత వెడల్పుచేశాడు. బుడుపు దగ్గరకి తేలిగ్గా వెళ్ళేందుకు.

"రోగితో మాట్లాడు తూండండి."

క్రమక్రమంగా బుడుపు చుట్టూ గాజ్ చొప్పించి, ఒక సూది లోపలికి పోనిచ్చి, నెమ్మదిగా బుడుపును మెదడునుంచి పూర్తిగా వేరుచేశాడు.

"రోగితో మాట్లాడు తూండండి"

ఆ బుడుపంతా కారీ ప్లవర్ లా వుంది; మెదడులోకొక ఆరు సెంటీమీటర్లు దిగివుంది.

"నెత్తురొత్తిడి తగ్గిపోతోంది. డెబ్భైకొచ్చేసింది" అన్నాడు ఫెల్డ్ షెర్.

"మనం మొదలెట్టినప్పుడెంత వుంది ?"

"నూటముప్పై."

"వేడి నాప్కిన్." అనడిగాడు ఇవాన్; చేతికివ్వగానే, అది బుడుపు తీసేసింతర్వాత ఏర్పడిన ఖాళీలో కుక్కాడు. నెత్తురతని మోకాళ్ళమీద పడుతోంది. "మాట్లాడు స్తెపాన్."

స్తెపాన్ మాట్లాడలేదు.

అతన్తో మాట్లాడండతన్తో మాట్లాడండి. ఎంత ? నెత్తురొత్తిడెంత ?

"యాభై ఐదు"

గాయాన్ని తుడిచి, స్టెరైల్ గాజ్ తో కప్పాడు డాక్టర్.

"నెత్తురెక్కించుదాం" అన్నాడు.

ఆపరేషన్ బల్లపక్కనే, యింకో బల్లమీద పండుకున్నాడు రక్తదాత.

ఇవాన్ ఇవానొవిచ్, వాసిలీ కలిసి ఎక్కించడం మొదలు పెట్టారు సెత్తురు. వాసిలీకి సహాయంగా ఏడవతరగతి చదువుతూన్నమ్మాయి వుంది. వేసుకున్న రిహార్సెల్స్ బాగా వుపయోగించినై.

"ఎంత ఇప్పుడు ?"

"డెబ్బైఐదు." అన్నదా అమ్మాయి.

"చాలు. ఇకచాలు. షుమారు రెండునందలయాభై సి.సీ.ల రక్తం యెక్కించాం."

"ముహం అంతా నొప్పిగా వుంది" అన్నాడు స్తెపాన్.

"ఇంకేం పర్వాలేదు; గండం గడిచినట్టే" అన్నాడు ఇవాన్.

స్తెపాన్ దగ్గడం ప్రారంభించాడు.

మళ్ళీ గాయాన్ని కప్పి, కాస్సేపు వేచి చూచాడు ఇవాన్.

ఇదివరకు బుడుపున్నచోటు చాలా తొందరగా వూడిపోవడం ప్రారంభించింది. ఇవాన్‌కి భయంవేశింది యిదెక్కడ బ్రెయిన్ ఓయెడెమా ఔతుందోనని. అదైతే, ఎముక కప్పు కొత్తది వెయ్యడం సాధ్యంకాదు. గనులదగ్గర శైపిస్ట్ ఆపరేషన్ బల్లమీదనే చనిపోయిన సంగతి గుర్తుకొచ్చింది. స్తెపాన్ అలా మరణించగూడదు ! అడుగడుక్కీ కొత్త ఆపదలు : శ్వాస ఆగిపోవొచ్చును, గుండె ఆగిపోవొచ్చును. మానసికోద్రేకం కల

గొచ్చును. ఎప్పుడేది వస్తుందోననిఅతి జాగ్రత్తగా వున్నాడు సర్జెన్.

నెత్తురు కారడం ఆగిపోయింది. బయటికి కనిపించు తున్న మెదడునంతా సెలైన్‌తో కడిగారు. కుట్లు వెయ్యవలసినచోట్లల్లా కుట్లేసేశారు. పై చర్మానికి మంచి సిల్కుతో వేశారు కుట్లు. ముహంవైపు భాగాని కక్కడక్కడా గుర్రపు వెంట్రుకల్తో కుట్లేశారు.

"మచ్చలు పడకుండా వుండేందుకు" అని చెప్పాడు ఇవాన్; "ఇప్పుడెలావుంది ? స్తెపాన్! చెప్పు."

"ఇంకా చావలేదు"

"రోగితో మాట్లాడండి, రోగితో మాట్లాడండి అని అదే పనిగా చెప్పానే మీకు, ఎందుకో తెలుసా ? స్తెపాన్ పురచెయ్యి మనిషి. పురచేతి మనుష్యులికి మాట్లాడే శక్తి మెదడుకు కుడివైపున వుంటుంది. దానికెక్కడ దెబ్బ తగులుతుందోనని భయపడ్డాను." అని చెప్పాడు ఇవాన్, ఎస్సిస్టెంట్లకి; "ఇప్పుడతనికి పూర్తి విశ్రాంతి నివ్వాలి. అతని పక్కయివతలికి తీసుకొచ్చి, వేడినీటి సీసాలతో వెచ్చ జెయ్యండి. రేపటి దాకా యీగదిలోనే వుంచుదాం స్తెపాన్‌ని. రక్తదాతని గూడా యీరాత్రి కిక్కడే వుండమనండి; అవసరమైతే నెత్తురెక్కించొచ్చును."

## 44

ఆపరేషన్ బల్లమీద నుంచి స్తెపాన్‌ని తీసింతర్వాత ఒక నాలుగు గంటలసేపతని ప్రక్కనే కూర్చున్నాడు ఇవాన్. అప్పుడుగాని [illegible] సిగరెట్ కాల్చుకుందుకని అప్పు

డెళ్లాడు తనగదిలోకి. ఓల్గా వుత్తరం గుర్తుకొచ్చింది. ఇంతవరకా వుత్తరాన్ని గురించి ఆలోచించేందుకు గూడా సమయం చిక్క లేదు. ఇప్పుడు గూడా ఆలోచించే ఓపిక లేదు; అలసిపోయు న్నాడు. ఇంకా ఆపరేషన్ స్మృతులు చెరగిపోలేదు: పొత్తురోడి కలుగడుతున్న గాయం, బుడుపు పెరిగినచోట పెట్టిన గట్లు, నికీతా, మూర్ఫాల ముఖాలు, అంతమంచి సహాయం చేసిన ఆ ఆడపిల్లల తెలివితేటలు.......అన్నీ కళ్ళకు కట్టినట్లున్నై యింకా.

'ఎంతమంచివాళ్లు వాళ్లు' అనుకున్నాడు. కృతజ్ఞత తోనూ, వాత్సల్యంగానూ, 'ఎలాగైతే, పూర్తిచేశాం! గట్టె క్కాం! ఎలాగోలా యీరోజు గూడా గడిస్తే........'

మళ్ళీ ఆలోచనలు. తన వ్యక్తిగత విషయాల్ని గురించి కాదు; మెదడాపరేషన్ జరిగింతర్వాత గూడా రావడానికి కస కాశం వున్న ప్రమాదాల్ని గురించి, ఆపదలని గురించి.

ఎదురుగా, ఆల్కహాల్ సీసాలో కన్పిస్తోంది కోసేసిన బుడుపు. నికీతా భద్రం చేశాడు దాన్ని.

'ఎప్పుడో కోసెయ్యాల్సింది నిన్ను' అనుకున్నాడు ఇవాన్ దానివంక చూస్తూ; 'ఆలస్యమైతే అయ్యింది గాక,యిక నీకు పుట్టగతులు లేకుండా చేశాం!'

ఇంతలో నికీతా వచ్చాడు గదిలోకి.

వెంటనే, "ఏం జరిగింది?" అనడిగాడు ఇవాన్, లేచి.

"ఏంలేదేంలేదు. మెదలకుండా పండుకునున్నాడు. మూర్ఫా వాళ్లూ వున్నారక్కడ."

"అతని దగ్గర పొగత్రాగనివ్వబోకు వాళ్ళని."

"లేదు, లేదు. అవసరమైనప్పుడు ప్రక్కగదిలో కెళ్ళి కాల్చుకొస్తున్నారు.

"ఆ ఆడపిల్లలు బాగా పనిచేశారు." అన్నాడు ఇవాన్.

"నాకు ముందే తెలుసు వాళ్ళు బాగా చెయ్యగలరని" అన్నాడు నికీతా, సగర్వంగా, "వాళ్ళకీపనంటే యిష్టంవుంది; నేర్చుకోవాలని ఆసక్తి వుంది."

"భలేవాళ్ళు, మంచివాళ్ళు ; భలే మంచివాళ్ళులే" అన్నాడు ఇవాన్, యింకేమనాలోతోచక; "ఐనా వాళ్లలా పొగ తాగకూడదు. మార్ఫా అంటే పెద్దది గాబట్టి, అర్థం చేసుకో గలం మనం."

"చిన్నప్పట్నుంచీ అలవాటు వాళ్ళకి" అన్నాడు నికీతా, తనలో తనే ఆలోచించుకుంటున్నట్టు; "అది హానికరం అని తెలుసుకోగానే మానేస్తారు. వార్యా మానేశిందప్పుడే".

"వార్యా! నిజమే చాలామంచిది; తెలివి తేటలు గలది కూడాను." అన్నాడు ఇవాన్. పాత సంగతులు గుర్తుకొచ్చి, విషాదంగా.

వెంటనే, కావాలని, విషయం మార్చేశాడు నికీతా. "ఈ ఆపరేషన్ యింకొకేడో, రెండేళ్లో వాయిదా వేస్తే ఏమయ్యేదంటారు ?" అనడిగాడు;

"అంతకాలం బ్రదికే వాడుగాదు స్తైపాన్."

"ఆపరేషన్ చేసేప్పుడు మెదడు నెప్పెడుతుందా ?"

"లేదు, లేదు. మెదడుకేనొప్పి వుండదు. కాని ఆపొర. దాని దగ్గర నొప్పెడుతుంది. ఆ నొప్పి గూడా, వొవొకెయ్న్ని

ఇంజెక్షనిస్తే వుండదు. న్యూరో సర్జెరీ! చాల గొప్పశాస్త్రం. నికీతా! నువ్వింకా యువకుడివి. సర్జెన్ కుండ వలసిన లక్షణా లన్నీ వున్నై నీకు: మంచి ఓర్పు, చెప్పినట్టు వినే చేతులూ, చూడగానే అర్థం చేసుకునే సూక్ష్మ గ్రిహణమూ.... అన్నీ వున్నై. మధ్యలో ఆగబోకు. ఇక్కడింకొకటి రెండు సంవత్స రాలు ఫెల్డ్‌షెర్‌గా పని చెయ్యి. తర్వాత చదువు ప్రారం భించు: ఏ వైద్య కళాశాలలోనో చేరు."

"నేనూ అదే అనుకుంటున్నాను" అన్నాడు నికీతా, వుత్సాహంగా; "ఎంత కష్ట పడాల్సొచ్చినా సరే, శ్రిమ పడా ల్సొచ్చినా సరే, సర్జెన్‌ని ఐతీరాలనే నా సంకల్పం. ఇవ్వా ళెందుకో గాని బాగా భయమేసింది."

"ఎందుకూ? తలలోనే రంధ్రాలు పెట్టామనా?"

"కాదు, కాదు. అందుకు కాదు. మనం అసలు సరైన చోట రంధ్రిం కోస్తామో, లేదో అని భయపడ్డాను ముందు. ఆ ఖుడుపు యింకొక చోట వుంటే? మనం ఎక్స్‌రే గూడా తీయించలేదాయె." అన్నాడు నికీతా, సిగ్గు పడుతూనే; "తర్వాత, యిదివరకొక సారి కామెనుష్కాలో జరిగిందే; ఎలె క్ట్రిసిటీ మధ్యలోనే ఆగిపోయింది. గుర్తుందా మీకు? అట్లా మళ్లీ ఆగిపోతుందేమోనని భయం. నెత్తురు పోటొస్తుందేమో నని, స్టెపాన్ మనకిక దక్కడేమోననీ యింకో భయం; మధ్యలో స్టెపాన్‌కి దగ్గొచ్చింది; గుర్తుందా?"

చాలా జాగ్రిత్తగా విన్నాడు ఇవాన్.

"నాకు మాత్రం భయం వెయ్యలేదను కుంటున్నావా? అందుకని అన్ని ప్రమాదాలూ ముందే వూహించు కోవాలి. చూచి మరీ దూకు' అనే సామెతుందే, సర్జన్లా సామెతని

సర్వదా గుర్తుంచుకోవాలి. ఇప్పుడు పుర్రె తెరిచి, మెదడులోకి ప్రవేశిస్తామూ; మెదడు చాలా మృదువుగా వుంటుంది తెల్లగా, బూడిద రంగుగా. అందులో సూదిగుచ్చినా, యింకేం గుచ్చినా రోగికి తెలియదు; గుచ్చిన గుర్తూ కన్పించదు తర్వాత. ఐనా తుపాకి గుండు ముక్కలాంటివి యిరుక్కుపోయే స్థలాలున్నై మెదడులో గూడా; ఇవ్వాళ తీసిన బుడుపు లాంటివి పుట్టు కొచ్చే అవకాశమూవుంది. అంత మాత్రాన రోగి చనిపోక పోవొచ్చు కాని, అతనిదివరకటిలా వుండడు, ఆ ఫలితాలు క్రమేపీ బయట బడతై; ఆ మెదడుని శస్త్ర పరికరాలతో తాకేప్పుడు సూటిగా అనుకున్న చోటనే, అవసరమైన చోటనే తాకాలి. వెంట్రుక వాసి గూడా అటూ యిటూ కాకూడదు. కామెనుష్కాలో చెప్పాను. జ్ఞాపకం లేదుం? మొత్తం మెదడు బొమ్మంతా నీ ముందు పెట్టాను. ఎక్కడేదుందో చూపాను. దృష్టి శక్తి ఎక్కడుంటుందో, బాధ తెలిపే నరాలెక్కడుం టాయో, కాళ్ళకూ చేతులికీ ఆజ్ఞలు పంపే కేంద్రం ఎక్క డుంటుందో చెప్ప లేదూ ? మెదడులో గుండు దూరినంత మాత్రాన మనిషి చనిపోవలసిన అవసరం ఏమీలేదు. అలాంటి మనుషులు గూడా బ్రదుకుతున్నట్టు దాఖలాలు చాలా వున్నై. ఎందుకూ ? కుడిచేతి వైపున ముందు భాగం నుంచి, మన పిడి కిలంత మెదడు తీశెయ్యొచ్చును బయటికి; ఐనా మనిషి బ్రదికే వుంటాడు. కాని! ఆ గుండే, తలకి వెనుక శ్వాస కేంద్రం దగ్గర తగులు తుందనుకో. వెంటనే చనిపోతాడు. గుండె ఆడేందు కవసరమైన కేంద్రం గూడా ఆదరి దాపుల్లోనే వుంటుంది. ఇవ్వాళ సంగతే చూడు: స్టెపాన్ మాట్లాడే శక్తి పోతుం దేమోనని భయపడి పోయాన్నేను. ముట్టగూడని ప్రాంతంలో కొక మిల్లీమీటర్ గూడా ముందుకెళ్ళ గూడదు. మరి మరి

కరాలు. మనం భయపడే దందుకూ. కాని ఆ భయం మూలాన ఒక మనిషి ప్రాణాన్ని రక్షించడానికి వెనకాడను. అలా వెన కాడితే అది పిరికితన మన్నమాట. లోపలెంత భయం భయం గా వున్నా, ముందే పరిస్థితులన్నీ పరిశీలించి, జరగబోయే అతి స్వల్ప విషయాన్ని గూడా వూహించుకుని, ఎన్ని ప్రమాదా లొచ్చినా ఎదుర్కోడానికి సిద్ధ పడతాను."

లేచి, గదిలో యీ చివరి నుంచా చివరికి తిరిగాడు ఇవాన్. ఎవరో ఒకరు మాట్లాడడానికి దొరికి నందుకనేమో సంతోషంగా వున్నాడు; అతని ప్రకృతే అంత: హాస్పిటల్లో ప్రతి గదిలోనూ మనుషులున్నారన్నా ఆనందమే అతనికి. ఇవాన్‌ని చూస్తూంటే నికీతాకి సంతోషం కలిగింది. తన బంధువులందరి కంటే, యీ వ్యక్తే తనకు దగ్గరవాడు. ఇక్కడే వ్యక్తికైనా ఎప్పుడేమి బాధ కలిగినా, వచ్చి ముందు సహాయం చేసేది యీ ఇవానే. కామ్రేడ్ నెలాంటి పరిస్థితుల్లోనూ ద్రోహం చెయ్యలేని వ్యక్తి ఇవాన్. తనూ అంతే. ఇద్దరికీ వయసులో భేదం వుంది. విద్యలో భేదం వుంది, జాతి వేరు. ఐనా, ఇద్దరి మనస్తత్వం వొకటే; ఇద్దరి ప్రకృతీ వొకటే; తమ సంఘమంటేనూ, పని అంటేనూ, కర్తవ్యమంటేనూ యిద్దరి వుద్దేశమూ ఒక్కటే.

తలుపు దగ్గర కెళ్ళి, రోగులొచ్చి కూర్చునే గదిలోకి తొంగి చూశాడు ఇవాన్. మార్ఫా కూర్చునుంది పొగ త్రాగుతూ.

ఇవాన్ అటు చూస్తున్నట్టు గమనించి, వెనక్కి తిరిగింది మార్ఫా.

"వెళ్లి నిద్రపోరేం మీరు?" అనడిగింది కోప్పడుతూన్నట్టు; "మేం నిద్రపోం అని చెప్పాంగదా. ఆ యిద్దరూ స్త్రెపాన్ దగ్గరున్నారు యిప్పుడు; తర్వాతనే వెళ్తాను. మీరూ అలసిపోయారు; వెళ్లి నిద్రపొండి."

"నిజమే. అలసి పోయాను." అన్నాడు ఇవాన్. చప్పుడు కాకుండా నడచెళ్లి, మార్ఫా ప్రక్కనే, స్టౌవ్‌లో వేసే దుంగల మీద కూర్చున్నాడు.

"ఆపరేషన్ గది బయట హాల్లో జఖార్ ఎట్లా పడిపోయాడో చూశారా?" అనడిగింది మార్ఫా నవ్వుతూ; "పిచ్చి దద్దమ్మ! మీ చేయెక్కడ జారుతుందో, ఏం ప్రమాదం జరుగుతుందోనని భయపడి పోయా. స్త్రెపాన్ మెదడంతా తెరచి అట్టి పెట్టుండె అక్కడ. ఇక జఖార్‌నదే పనిగా ఎద్దేవ చేస్తారు తోటివాళ్లంతా. ఎంత సిగ్గుచేటు! వచ్చి, మీ చెయ్యి తోసినట్టేగా, చెప్పండి; కాదూ?"

"నేనసలది గమనించను గూడా లేదే."

"సిగ్గుచేటు కాదూ మరి." అంది మార్ఫా మళ్లీనీ; "ఎందుకెగబడ్డాడా అని అట్లా? అందులోనూ వేటగాడు! అన్నట్టు జఖార్ భార్యని చూశారా మీరు? చక్కని చుక్క. పేరు కాద్కా, మీకు నిద్రి రావడం లేదంటే, వాళ్లిద్దరి కథా చెబుతాను. ముందు నికీతాని పిలుస్తా నాగండి. రష్యన్ భాషలో కొన్ని మాటలసలు నాకు తెలియనే తెలియవు. అతననువాదం చేసి చెబుతాడు."

"నేనొకసారి స్త్రెపాన్‌ని చూశొస్తా యీ లోప్లుగా."

# 45

"సరే, కాద్యా జఖార్ ల కథ చెప్పండి." అనడిగాడు ఇవాన్, ఆపరేషన్ గదినుంచి తిరిగొచ్చింతర్వాత. మార్ఫా ప్రారంభించింది:

''కాద్యా తండ్రి మంచి ధనవంతుడు. తొయోన్*; ఆత్రి కాన్ నదివొడ్డున వుండేవాడు. ఉన్న భూమిలో కల్లా మెరుగైన భూమి అతనిది. ఆవుల మందలు కావలసినన్ని; ఇక గుర్రాలు లెక్కకి గూడా అందేవి కాదు; అన్నుండేవి. బోలెడు మంది పని జేస్తుండే వారతని క్రింద. ఇప్పుడు కాద్యా వయసు నలభయ్యుంటుంది. ఇప్పుడే యింతందగా వుంటే, వయసులో వున్నప్పుడింకెంత అందంగా వుండేదో మీరే వూహించుకోండి. ఆకాశం మీద నుంచి దిగొచ్చిన అప్సరస లాగుండేది. పేరు పెట్టేప్పటికే పెద్దదైంది. అప్పటి దాకా, అందరూ వూరికే మాత్ర్యోనా అని పిలిచేవారు. ఆ పేరు పెట్ట డానికొచ్చిన మతగురువుతో పాటొక వ్యాపారస్థుడు గూడ వచ్చాడు అతనూ బాగా డబ్బున్న వాడే. రష్యన్లతో వ్యాపారం చేస్తుండే వాడు. ఆ వ్యాపారస్థుడూ, కాద్యా తండ్రీ కలిసి కుట్ర చేశారు; రష్యన్ల కటికి దుకాణాలకి ఆవుల్నమ్ము తామనీ, గడ్డి అమ్ముతామనీ ఒడంబడిక కుదుర్చుకున్నారు. మీకూ తెలుసుగా, గడ్డి యకూత్ లకెంత అవసరమో. రొట్టె కంటె ఎక్కువ. అది అమ్మడానికి సిద్ధమయ్యారు వాళ్లిద్దరూ. వాళ్ల మూలానా, ఆ వ్యాపారం మూలానా వేల కొద్దీ యకూత్ లు పేదవాళ్లయ్యారు. ఆ వ్యాపారస్థుడికి బలవంతంగా

---

* జమీందారు లాంటి వాడు.

కాద్యాని చ్చి పెళ్ళి చేసేశాడు తండ్రి; పెళ్ళేముందిలే; బోలెడు డబ్బు తీసుకుని అమ్ముకున్నాడు.

"అప్పటికే కాద్యాకి జఖారంటే ప్రేమ యేర్పడింది. ఇద్దరిదీ ఒకటే యీడు. కలిసి మెలసి ఆటలాడుకున్నారు చిన్నప్పుడు. అతనికి దిక్కూ మొక్కూ యేమీలేదు, అనాధుడు. మొత్తం కులమంతా కలసి పెంచుకుందతన్ని. భర్తెంట బలవంతంగా పంపుతూంటే, పాపం, కాద్యా వలవల ఏడ్చింది, జఖార్‌ని వదల్లేక. కాద్యా భర్త బాగా ముసలాడు గూడాను; చూడడానికి దాని తాతలాగున్నాడు.

కుఖ్తుయీ గ్రామానికి తీసుకొచ్చాడు కాద్యాని భర్త. అతనియిల్లూ రష్యన్ల యిల్లులాగుండేది; అతని అలవాట్లూ రష్యన్ల అలవాట్లే. రాత్రింబగళ్లు ఏడుస్తూ కూర్చునేది కాద్యా. పాపం, ఒక ఏడాదికేడాది అట్లా ఏడుస్తూనే వుంది. తర్వాతిక కూర్చుని ఆలోచించుకుంది: భర్త నొదిలిపెట్టి యింటికెళ్లినా ప్రయోజనం లేదు; మళ్లీ తండ్రి తీసుకొచ్చి అప్పగించెళ్తాడు. అంచేత సాంప్రదాయాన్ని ఎదిరించాలని నిశ్చయం చేసుకుంది. అప్పుడైతే యిటు భర్తా, అటు తండ్రీ గూడా తనని యింట్లో వుండనివ్వరు; తర్వాత జఖార్ దగ్గర కెళ్లిపోవొచ్చును. పిల్ల తెలివిగలది కాదు కాని, గుండె మట్టుకుంది. తన భర్త మొదటి సంబంధానికి పుట్టిన మగబిడ్డతో రహస్యంగా సల్లాపాలు మొదలు పెట్టింది; కొడుకనే భీతి గూడా లేకుండా. ముసలాడి కావిషయం తెలిసింది. కొడుక్కి పెళ్లి చేసేశాడు. ఇక రోజూ కాద్యాని తన్నడం మొదలు పెట్టాడు కోపం తీర్చుకోడానికి. కుక్క కంటే హీనంగా చూడడం మొదలెట్టాడు. ఆ సమయానికి జఖార్ గూడా కఖ్తుయీ కొచ్చాడు. అతనికి మాత్రం

యేముంది? పోయేదేమీ లేదు. పుట్టుబీద, బుర్ర లేదన్న మాటే గాని, సాహసి" అంటూ, ఆపరేషన్ జరిగేప్పుడు జఖార్ చేసిన తెలివి తక్కువ పని గుర్తుచేసింది మార్ఫా; "కుల పెద్దలత న్నొదిలేశారు. పెరిగి పెద్దవాడయ్యాడు. ఇకపని యిష్టం. ఎక్క డికి బడితే అక్కడి కెళ్లొచ్చును. ఆకాశం మీద నుంచి వూడి పడ్డట్టూడి పడ్డాడు జఖార్, కుఘుయియాలో. అసలు కథంతటితో పూర్తి కావలసింది: జఖార్, కాద్యాలు కలిసెక్కడి కైనా లేచి పోతే సరిపోయేది. కాద్యా భయ పడింది. జఖార్ కి కష్టం కలుగుతుందని తెలుసు. ముసలి వాణ్ణింకొక సారి రెచ్చగొడితే, యీ సారైనా విసిగిపోయి తన్నొది లెయ్యక పోతాడా అను కుంది. అందుకని, తన భర్త నౌకర్లలో అందరి కంటే తక్కువ వాడితో సాగించింది గ్రంథం. భర్త కల్గాగైనా విసుగు పుడు తుందని. అనుకున్నట్లే అయ్యింది. పేరు ప్రతిష్టలు పోతున్న య్యాని కలవర పడ్డాడు ముసిలాడు. భర్త వదిలేశాడు. కాద్యా యిప్పుడు సర్వ స్వతంత్రురాలు! జఖార్ కోసం వెదికింది. లేడు. వెళ్లిపోయాడు. తానడిగినప్పుడు లేచి రాలేదని నిస్పృహ పడి పోయాడు, కోపం వచ్చింది; వెళ్లి ఒక తాయోన్ దగ్గర నౌక రీకి కుదిరాడు. మంచు దుప్పుల కాపలా నౌకిరీ. కొంతమంది ఇవెంకుల్తో కలిసి చాలా దూరం వెళ్ళి పోయాడు. ఇకతన్నెలా వెదకి పట్టుకుంటుంది? అందమైన ఆడది; చెడిపోయిందనే కీర్తి! ఎక్కడి కెళ్ళినా, మగవాళ్ళు వెంటపడడం ప్రారంభించారు. తోడేలు పిల్లెంట కుక్కలు పడ్డట్టు పడ్డారు కాద్యా వెంట."

"పాపం! జఖార్, కాద్యా లెప్పటికి కలుసుకున్నారు?" అనడిగాడు ఇవాన్.

"చెబుతా నాగండి" అంది మార్ఫా, పైప్ లో పుగాకు పెట్టుకుంటూ; "ఒకేడుగాదు, రెండేళ్లుగాదు. అంతర్యుద్ధం ఐపోయే దాకా కలుసుకోలేదు, వాళ్లొకళ్ళ నొకళ్ళు. జఖార్ తైగా ప్రాంతంలో వున్నాడు దుప్పులు కాసుకుంటూ. అప్పుడు పల్లెలు మరీ దూరం దూరంగా వుండేవి. కొత్త ప్రభుత్వాన్ని గురించి, ఏర్పడింతర్వాత, ఐదేళ్ళ వరకూ తెలియనే తెలియదు వాళ్ళకి. తర్వాతెప్పుడో వచ్చింది కాద్యా ఆక్కడికి. జఖార్ అక్కడున్నాడని ఎలా తెలిశింది? తైగా ప్రాంతలో వార్తలు వ్యాపించడానికదొక మార్గంవుంది— కాఫ్సె. దుప్పుల గుంపుతో ఒక నెలంతా ప్రయాణం చేశింది కాద్యా. తానూ ఒక తాయోన్ దగ్గర నౌకరీకి కుదిరింది. ఇద్దరూ అలా కలుసుకున్నారు తైగా ప్రాంతంలో. చివరికిద్దరూ కలిసి, నౌకరీనొదిలి పెట్టి, లేచి పోయారు. అప్పట్నుంచీ హాయిగా బ్రదుకుతున్నారు యిద్దరూనూ చిలకా గోరంకల్లాగా.

చాలా సేపటి వరకూ అంతా నిశ్శబ్దంగావుంది. స్టోవ్‌లో వేసిన దుంగల చిటపట. చుట్టూవున్న వాళ్ళ ముహాల మీద చలిమంటల వెలుగుల తెరలు.

ఆపరేషన్ గదిలోకి తొంగిచూచి, "నిద్రపోతున్నాడు" అని అంది ఒక యువతి.

ఇవాన్ ఇవానొవిచ్ లేచి, చప్పుడు చేయకుండా రోగి పండుకునున్న చోటికెళ్ళాడు.

స్తెపాన్ నిజంగానే నిద్రపోతున్నాడు. నాడి సరిపడా వుంది; పై పెదవి మీదా, నుదుటి మీద, కనుబొమల మధ్యా

చిరు చెమట పట్టింది. ఆ తెల్లకట్ల మధ్య అతని ముహం చాలా అందంగా కనిపించింది ఇవాన్‌కి గూడా.

ఆపరేషనప్పుడు సాయం చేసిన యువతుల్లో ఒకావిడ రోగి ప్రక్కనే కూర్చునుంది. "మీరు చాలా బాగా సాయం జేశారు" అన్నాడు ఇవాన్ మళ్ళీ యింకేమనాలో తోచక. వాత్సల్యంగా ఆవిడ నెత్తి మీద చేయివేసి నిమిరాడు; తలకో కరుమాలు కట్టుకునుంది ఆయువతి. "కామెనుష్కా వెళ్ళింతర్వాత మీ యిద్దర్ని గురించీ ఒక వ్యాసం వ్రాశి పత్రిక్కి పంపుతాను. ఇక్కడెంత మంచి వాళ్ళున్నారో దేశానికంతటికీ తెలుస్తుంది." అన్నాడు.

ఎందుకనో గాని, ఇవాన్ ఇవానొవిచ్ కనులు నిండారు లై నై; కారణం ఆయనకే తెలియదు. ఆపరేషన్ గదిలోంచి బయటికి-వెళ్ళి పోయాడు, చడీ చప్పుడూ చెయ్యకుండా.

# 46

తావ్‌రోవ్‌తో కలిసి వుండడం ప్రారంభించిన మొదటి రోజుల్లో, ఓల్గా కెప్పుడూ భయంభయంగా, ఆదుర్దాగా వుండేది. ఇవాన్ ఇవానొవిచ్ ఎప్పుడు తిరిగొస్తాడోనని భయం. అతనికి సన్నిహితంగా వుండే స్నేహితుల్ని కలుసుకోవాలంటే భయం. ఎక్కువ సేపు తావ్‌రోవ్‌ని వదలి వుండాలంటే భయం. తలుపు తెరచిన చప్పుడైతే చాలు, ఉలిక్కిపడేది; ఫోన్ మోగితేచాలు, పులిక్కిపడేది. వ్యాసం వ్రాసేందు కవసరమైన సమాచారం సేకరించడానికెళ్ళినప్పుడు గూడా ఆదుర్దాపడేది తిరిగి వెంటనే ఇంటికి చేరుకోవాలని, యింటి దగ్గరెవరో పసిపిల్లలు తనకోసం

కాచుక్కూర్చున్నట్టు. తిరిగి రావడం ఆలస్యమై, యింటి దగ్గర కొచ్చేప్పటికి, యింట్లో లైట్లు వేశినట్టుంటే, తావ్‌రోవ్ నీడ కదుల్లాడి నట్లుంటే, ఆదరా బాదరా మెట్లెక్కి యింట్లోకి పరుగెత్తేది; వంటింట్లో చొక్కా చేతులు మడుచుకుని పని జేస్తున్న తావ్‌రోవ్‌ని పట్టుకునేది, 'దొంగని పట్టుకున్నట్టు'. అతనితో కలిసి, పది మందిలోనూ తిరగాలంటే సందేహం. తానింటి దగ్గర వుండి, అతను పనిలో నుంచి రావడం ఆలస్యమైతే, అద్దం ముందుకు కనీసం వొక పాతిక సార్లన్నా వెళ్లేది, తలదువ్వుకునేందుకనీ, దుస్తులు సరిజేసుకునేందుకనీనీ. ఇవాన్ ఇవాన్‌విచ్ కోసమని ఆవిడెప్పుడూ అద్దం ముందు కెళ్ళిన పాపాన పోలేదు: తానెలావున్నా భర్త ప్రేమిస్తాడనే నమ్మకం కుదిరిందెందుకనో.

'నేనూ, బోరిస్ సమవయస్కులం; అతనికంటే పెద్దదానిలాగ కనపడగూడదు నేను.' అనుకుందొకసారి; 'నా పనిలో గూడా నేనింకా అభివృద్ధి కావాలి; అలా ఐతే నేనంటే గౌరవాదరాలు ఎక్కువౌతాయి అతనికి'.

ఒకనాడు :

బయట అడుగుల చప్పుడు విని, హుషారుగా వెళ్ళి తలుపు తీసింది.

తావ్‌రోవ్ ఒంటరిగా లేడు. లోగునోవ్ గూడా వున్నాడు. ఏమనాలో తెలియక, ఎలా ప్రవర్తించాలో తెలియక, తికమక పడింది ఓల్గా. అతిథిముందు ముద్దాడడానికి సంకోచించాడు తావ్‌రోవ్; చేయి మాత్రం మృదువుగా నొక్కి వదిలాడు. ఓల్గాకి సందేహం ముంచుకొచ్చింది. తనతో అతను సంతృప్తిగా వున్నాడా? ఇంకొకరి భార్యతో కలిసి మెలిసి వుంటున్నందుకు సిగ్గుపడడంలేదు గద? ఐనా అతను తన

భావాల్నేమీ వ్యక్తం చెయ్యనందుకూ, పవిత్ర భావాల్నీ వాటిని తనలోనే వుంచుకుంటున్నందుకూ సంతోషించింది. అలా వున్నప్పుడే అతని ప్రతి చూపులోనూ ఏదో కైపు, ప్రతి కదలికలోనూ ఏదో అనుబంధమూ వ్యక్తమయ్యేవి. టేబుల్ సర్దడానికీ దానికీ సాయం జేశాడు తావ్‌రోవ్, సరసాలాడుతూ.. ఓల్గా యీ మధ్యే వ్రాసిన వ్యాసాన్ని గురించి ముచ్చటతెచ్చి, ఆవిడ పడుతూన్న బిడియం కాస్తా పోయేట్టు చేశాడు. మనం దెంతో కుతూహలంగా చూశాడు లొగునోవ్ వాళ్ళిద్దర్నీ; తర్వాత సానుభూతి !

ఇవాన్ ఇవానొవిచ్ వెళ్ళే ముందు ఓల్గాతో జరిపిన సస్నేహ సంభాషణ గుర్తుకొచ్చి, "మీరు ప్రజల్తో ఎక్కువగా కలిసిమెలిసి తిరుగుతుండాలి" అని సలహా చెప్పాడు; "అప్పుడు ఇంగ్లీషు క్లాసుల్లో బాగా పాల్గొనే వారు; యీ మధ్యేందు కనో అంత ఎక్కువగా వెళ్తూన్నట్టు లేదా క్లాసులికి. సంఘం నుంచి దూరంగాముడుచుకు నుండాలనా మీ అభిప్రాయం? అది మంచిదికాదు. మీరెంతెక్కువగా ప్రజల్లోకెళ్తే అంత మంచిది. ఈ మధ్యేంకొక కొత్తక్లాసు ప్రారంభించాం; ప్రస్తుత సమస్యలు; ఆ క్లాసుకి గూడా వెళ్తే బాపుంటుందేమో మీరు?"

"ఆవిడ కలాంటి వంటే యిష్టం గూడాను" అని నవ్వాడు తావ్‌రోవ్.

"అలాంటి క్లాసులు నడపడమంటే నాకూ యిష్టమే కాని, ఆపాటి శక్తి సామర్థ్యాలున్నాయా అని."

"మీ కంటే యింకెవరు బాగా నడపగలరూ !"

"ఇది వరకటి కంటే చిన్నవారిలాగా కన్పిస్తున్నారు మీరు" అంది వార్యా, ఓల్గాని చూచి. క్లబ్‌లో ఉత్పత్తి సమావేశం జరుగుతోంది. ఆ సమావేశాని కొచ్చారు యిద్దరూ.

సమావేశం విశ్రాంతికని లేచింది. హాలులో ఎవ్వరూ లేరు. ఓల్గా ఒక్కర్తే కూర్చుని నోట్స్ పూర్తి చేసుకుంటోంది. అందరూ పొగత్రాగడాని కెళ్లారు బయటికి. హాలు బయిటి నుంచి పొగ వస్తోంది లోపలికి; మధ్య మధ్య మాటలు వినిపిస్తున్నై.

వార్యా వచ్చి, ప్రక్కనే బల్లమీద కూర్చునేప్పటికి సిగ్గుముంచుకొచ్చింది ఓల్గాకి.

"నన్ను చూస్తే యింకా విచారం వేస్తోందా?" అనడిగింది, ఏదో వొకటి మాట్లాడాలి గదా అని.

"ల్ .... లేదు" అంది వార్యా.

తనకెంత నష్టమైనా సరే. యితరులొక పొరపాటైన ఎన్నిక చేసుకుంటున్నారను కుంటే, సాధ్యమైనంతవరకూ పొరపాటు జరగకుండా చూచే స్వభావం వార్యాది. ప్రియత్వాన్నీ. శక్తి సామర్థ్యాల్ని గుర్తించలేని వాళ్ళంటే మంట. ఒకసారి కొత్తరకం దుస్తుల్ని చూచి, "ఈ దుస్తులకి రంగులేసి, లతలద్దిన చిత్రకారుడిది చాలా మంచి హృదయం; వున్నతమైన మనసు. అతని కృషి మూలాన చూడండి, ఎంతమంది స్త్రీల కానందం కలుగుతోందో. ఎంత కాలం పట్టిందో అతనికి యీ రంగులిలా ఒక దాని కొకటి పొసగేట్టు ఎన్నిక చేసుకోడానికి! ఈ లతలిలావుంటే బావుంటుందని ఎలా తోచిందో అతనికి!" అంటూ ఆశ్చర్యపోయింది. ఇంకొకసారి, ఆవిడ కొను

క్కున్న చెప్పులు ముందు భాగం అరిగి చిరిగి పోయినప్పుడు, "ఈ చెప్పులు చేసినతన్ని చాలా నీచ హృదయం. ఈ పనింత ఛండాలంగా చేసి, నన్నిలా శిక్షించడం ఎందుకూ అతను?" అని అంది.

ఇప్పుడు, వార్యా, ఓల్గా లిద్దరూ కలిసి, భర్త ల్నెన్ను కోవడాన్ని గురించి మాట్లాడు కుంటున్నారు. ఇవాన్ ఇవానో విచ్ నొదిలి యింకొకరు మెరుగను కోవడం సాధ్యమా? వార్యా కతనంటే ప్రేమ; తన ఎన్నిక ప్రత్యక్షంగా బహిర్ప్రియో జనాలని బట్టేనని ఆవిడ నమ్మిక.

వార్యాని కలత పెట్టే భావాలన్నిటినీ చదివేస్తున్న ట్టుగా, "నిజమే. సరే. కాని ఆయన యింకొకరికి తన హృదయం యిచ్చేశాడని తెలిసి గూడా ఇంకా ఎందుకు ప్రేమి స్తున్నావ్ నువ్వు?" అనడిగింది.

వార్యా సిగ్గు పడింది; ఐనా ఓల్గా వంక సూటిగానే చూచింది.

"ఆయన నాకు చేసిన సాయం యింతింత కాదు." అంది మనసారా, "బ్రదకడం ఎలాగో, పని చెయ్యడమెలాగో, చదువు కోవడమెలాగో.... అంతా నేర్పింది ఆయనే."

"ఐతే, కృతజ్ఞతా భావం మట్టుకే చోటనివ్వాల్సింది నీ హృదయంలోకి; ఆయన చాలా మంచి స్నేహితుడు; కానా?"

"నిజంగానే, గొప్ప స్నేహితుడు"

"కాని నీకాయనంటే వున్న భావం ఒక్క స్నేహ భావమే, కాదు; స్నేహ భావాన్ని గూడా మించి పోయింది; కాదా?"

మళ్ళీ సిగ్గు పడింది వార్యా.

"నిజమే. నేనాయన్ని ప్రేమిస్తున్నాను."

"నీకు ఇవాన్ ఇవానొవిచ్ ఎలాగో, నాకు తావ్‌రోవ్రూ అలాగే. నీకు ఇవాన్ ఇవాన్‌విచ్ ఎంతో, నాకు తావ్‌రోవ్ అంతే! నేను తావ్‌రోవ్‌ని ప్రేమిస్తున్నాను. వొద్దనుకున్నాను; మానుకుందా మనుకున్నాను. నా వల్ల కాలేదు. ఇది వరకు నేను ఆనంద మనుకున్నది యిప్పుడు దుఃఖంగా మారింది."

"ఏం, యిప్పుడు మీరు సుఖంగా లేరా?" అనడిగింది వార్యా వెంటనే.

"నేను చాలా సుఖంగా వున్నాను. ఆనందంగా వున్నాను; కాని, అదంతా.... ఇవాన్ ఇవానొవిచ్ యింకా వున్నారని గుర్తు కొచ్చేవరకే."

ఆ మాటలు వింటే వార్యాకి కోపం వచ్చింది.

"ఐతే, యికాయన బ్రదికుండ గూడదన్నమాట?" అంటూ లేచింది.

"ఛాఛ. అదికాదు." అంది ఓల్గా, భయపడి పోయి, వార్యా చేయి పట్టుకుంటూ; "ఆయనున్న నాలుగు కాలాలూ హాయిగా ఆనందంగా వుండాలనే నా కోరిక. నీకింకా తెలియదు; నువ్వింకా నీ జీవితాన్నింకొకరి జీవితానికి ముడివెయ్యలేదు; అందుకని నీకర్థంకాదు. నన్ను గురించి నాకేమీ భయం లేదు, అందుకని గాదు నేను భయపడుతూన్నది. ఐనా మన సెప్పుడూ ఆందోళన పడుతూనే వుంది."

"అంత ఆందోళన పడవలసిన అవసరమేమీ లేదులే." అంది వార్యా. అనడానికన్నది గాని, ఆ మాటల్లోనే తనకే

విశ్వాసం లేనట్టుంది. హాస్పిటల్లో తావ్‌రోవ్‌ని కలుసుకున్నంత పనైనప్పుడు ఇవాన్ మొహం ఎలా వున్నదీ గుర్తుకొచ్చిందప్పుడు వార్యాకి; "ఇవాన్ ఇవానొవిచ్ తావ్‌రోవ్‌ని కొట్టనూ కొట్టడు; చంపనూ చంపడు!" అన్నది అమాయికంగా.

ఓల్గా వణికి పోయింది. అదిచూసి, వార్యా తాననుకోవలసిందను కుంది.

"అసలలాంటి పని జరుగుతుందని ఎలా అనుకోగలిగారు మీరు!?" అంటూ ఎగిరి పడింది; "ఎప్పుడూ యితరుల్ని గురించే ఆలోచిస్తూంటారే ఆయన! ఎప్పుడూ యితరులకి మేలే చేస్తుంటారే. అలాంటి మనిషెవరికైనా కీడు తల పెట్టగలడని ఎలా అనుకున్నారు మీరు? తన స్వార్థం కోసం, ఇంకొకరి జీవితాన్నెన్నటికీ నాశనం చెయ్యడాయన."

"పొరపడుతున్నావమ్మా నువ్వు" అంది ఓల్గా; "ఇవాన్ ఇవానొవిచ్ వచ్చి పగ తీర్చుకుంటాడేమోనని గాదు, నా బాధ; ఆయనకంత వ్యథ కలిగించానే అనే నా బాధ.

# 47

ఇకీగనుల దగ్గరుంటే, ఏమీ లాభంలేదని తెలిసొచ్చింది పావా భర్త ప్రాఖిన్‌కి. ఐనా ఎప్పుడూ టిప్‌టాప్‌గా వుండాలనీ, తన అధికారం నలుగురికీ తెలియాలనీ ప్రయత్నిస్తూనే వున్నాడు. దుస్తులిదివరకటి లాగానే అతి నీటుగా వుంచుకుంటున్నాడు; బకిల్స్ యిదివరకటి లాగానే తళతళ లాడుతున్నై: కాని యిదివరకున్న అధికారం మాత్రం లేదిప్పుడు.

'స్కారొబొగతోవ్ వుండగా యితనాడింది ఆట, పాడింది పాటగా వుండేది. ఇప్పుడంటే...' అనుకుంది ఓల్గా అతని నిరుత్సాహాన్ని జంకునూ చూచి. పెన్సిలూ, నోట్ బుక్కూ అవీ అన్నీ సర్దుకుంది సమావేశంలోంచి వెళ్ళి పోదామని. ప్రస్తుత సమస్యల క్లాసు కెళ్ళే సమయం అయ్యింది. ఇంతకు ముందెవళ్ళైనా, తాను అబిసీనియాలో ఇంగ్లీషు సైన్యాల పురోగమనాన్ని గురించీ, అడిస్ అబాబా వైపుకు ఇటాలియన్ల తిరోగమనాన్ని గురించీ సుదీర్ఘమైన పాఠాలు చెప్ప గలుగుతుందనంటే, తానే నమ్మగలిగేది గాదు ఓల్గా. అలాంటిదిప్పుడు ఆయాదేశాల భౌగోళిక, ఆర్థిక వైచిత్ర్యాన్ని గూడా జోడించి చెబుతోంది తన పాఠాల్లో; వలసదేశాల ఆశయాలని వివరించి చెబుతోంది. ఐతే, తరచూ నోట్ పుస్తకంలో చూచుకుంటూ చెప్పవలసొస్తోంది యింకా; ఒక్కోసారి సరైన మాటలు దొరకక్క తడబడుతుంది, తడుము కుంటుంది. కాని, మొత్తం మీద ప్రేక్షకులతి శ్రద్ధగా వింటున్నారు. ఆవిడ చెప్పేదంతా; రోజు రోజుకు ప్రేక్షకుల సంఖ్య పెరుగుతోంది.

"ఈ పాఠాల మూలానే నేనభివృద్ధి బొందుతున్నాను. నా విలేఖరి పనికి గూడా యిది బాగా పని కొస్తుంది" అని చెప్పింది ఓల్గా, తావ్‌రోవ్‌తో. యువజన పాఠశాలలో సాయంత్రం పూట ఇంగ్లీషు నేర్పడం గూడా మొదలెట్టింది. వేసవి కాలంలో లేని ఆత్మవిశ్వాసం, యిప్పటికి పూర్తిగా చేజిక్కింది.

అధ్యక్షవర్గం కూర్చున్న టేబుల్ దగ్గరకి తావ్‌రోవ్ వెళ్తూండడం గమనించింది ఓల్గా.

ఆ బెంచీల మీద కూర్చున్న ప్రజల మధ్య నుంచి వెళ్తున్నాడు దారి చేసుకుంటూ. ఒక చిన్న చిరునవ్వు నవ్వుకుంద

తన్ని చూచి. మధ్యరకం సామాన్యపు ఎత్తు. విశాలమైన భుజాలు. నడుం దగ్గర వెడల్పాటి పట్కా. ఏప్రిల్ మాసమైనా యింకా చలిచలిగా వుంది; అందుకని, అందరి లాగానే వున్ని మేజోళ్ళేసుకున్నాడు మోకాళ్ళ దాకా. పటాలం దుస్తులు. ఐతే, ప్రాయాఖిన్‌లాగా, భుజాల మీద పతకాలు లేవు. ఐనా, తావ్‌రోవ్‌తో ప్రాయాఖిన్‌ని తెచ్చి పోల్చడం ఎందుకు?

వెళ్ళి, ఆ బల్లదగ్గర కూర్చునే ముందొకసారి ముహం మీద పడుతూన్న జుత్తు వెనక్కి పడేట్టు తల చిన్నగా పైకి విసరి, చుట్టూ కలయ జూశాడు. కనీసం అక్కడొక అరువందల మందైనా వుండుంటారు. ఐనా; ఒక సెకను సేపు వారిద్దరి చూపులూ కలుసుకున్నై; కూర్చునే ముందతని ముహం మీద కొచ్చిన చిరునవ్వు తెరను చూచింది ఓల్గా.

ఎలాగైతేనేం, అంతా సవ్యంగా వుందిప్పుడు. ప్రథమంలో ఓల్గా ఆనందానికున్న అంతరాయం నిజంలా బాధించడం మానేశింది. ఇప్పుడా బిడియం లేదు, బాధలేదు. ఎవరేమనుకుంటున్నారోనన్న ఆందోళన లేదు; తన మిత్రుల మధ్యనే వున్నట్టుంది. ఆవిణ్ణెవరూ ఎత్తిపొడవలేదు; ఆవిడ చేసిన పని యిష్టం లేకపోవచ్చు కొందరికి, ఐనా యిది మంచి, యిది చెడ్డ అని ఎవరూ తీర్పు చెప్పలేదు; ఆవిడ తిరిగి ఆత్మవిశ్వాసాన్ని పొందుతోంది, తన కాళ్ళమీద తాను నిలబడడం నేర్చుకుంది. రోజులో ఒక్కగంట గూడా వృథా కానీకుండా తన కాసక్తి వున్న పని తాను చేసుకుంటోంది.

క్లాసు ప్రారంభమయ్యే వేళయ్యింది, ఐనా యిక్కడుంటే తన యింట్లో వున్నట్టే వుంది; వదిలి వెళ్ళాలనిపించడం లేదు.

సమావేశంలో యిప్పుడు చర్చిస్తున్న విషయాలు వీలే కరిగా ఓల్గాకేమీ అవసరంలేదు. కాని ఆ చర్చంతా మిల్లుకు సంబంధించిన చర్చ. అంటే తావ్‌రోవ్‌కి సంబంధించిన విషయాలన్నమాట. కూర్చుని జాగ్రత్తగా విన్నది ఓల్గా. ఇంతలో వేదికమీద కొకవ్యక్తి ఎక్కాడు చర్చలో పాల్గొనేందుకు. గత వేసవికాలంలో చూచిందతన్ని హాస్పిటల్లో. తావ్‌రోవ్‌తో మిల్లు విషయం ఏదో చర్చించేందుకని వొచ్చాడప్పుడు. అతను మిల్లులో సీనియర్ మెకానిక్; పార్టీసభ్యులందరిలోకీ బాగా పనిజేసే మనిషి. అతన్నిచూస్తే తన ప్రస్తుతసమస్యల క్లాసు గుర్తుకొచ్చింది ఓల్గాకి. అతనుగూడా ఒకక్లాసు నడుపుతున్నాడు. మొట్టమొదట, తనక్లాసు ప్రారంభించేముందు, తావ్‌రోవ్ సలహాప్రకారం, ఒకటి రెండుసార్లు అతని క్లాసు కెళ్ళింది, తన క్లాసెలా నడుపుకోవాలో తెలుసుకునేందుకని. ఏనాటి సమస్యమీదానాడు ప్రేక్షకులు చర్చలో, హుషారుగా పాల్గొనేట్టు చెయ్యగల తెలివితేటలున్నై అతనికి. అతనికున్న ఆ శక్తిసామర్థ్యాలు తనకు లేవే అని బాధపడింది గూడాను ఓల్గా.

'నేనుగూడా నాప్రేక్షకుల కింటిదగ్గర ఆలోచించుకునేందు కవసరమైన విషయాలనివ్వాలి; మర్నాడు వచ్చి చర్చల్లో పాల్గొనేందుకు తగిన అవకాశం యివ్వాలి' అనుకుంది ఓల్గా. సమావేశంనుంచి బయటికి వెళ్ళింది. అక్కడ క్లాసంతా నిరీక్షిస్తోందావిడ కోసం.

# 48

దూరాన కొండలమీద, ఏదోవింతజంతువు పరుగెత్తుతోంది. పరుగెత్తడంగూడా యిలా అలాకాదు; నాల్గుగుకాళ్ల

సవారీవేస్తున్నట్టుంది. నాలుగుకాళ్ళూ ఒక్కసారే లేస్తున్నై పైకి; ఒకేసారి పడుతున్నై క్రింద మంచుమీద.

తుపాకి క్రిందికొంచి, ఆజంతువు పరుగును చూస్తూ నిలబడిపోయాడు ఇవాన్. వెనుకంతా నీలినీలి ఆకాశం; జంతువు రూపురేఖలు మట్టుకు నల్లగా కన్పిస్తున్నై; వంటిమీది జూలు ఎగిరెగిరి పడుతోంది, అది గెంతినప్పుడల్లా.

"ఏం జంతువది?" అనడిగాడు ఇవాన్ పక్కకి తిరిగి; నికీతా అప్పుడే వచ్చాడు స్కీలమీద. "ఉల్వొరైన్ కాదుగదా?"

స్కీలమీదనే కొండ ఎక్కివచ్చాడేమో, నికీతా బాగా అలసిపోయాడు. బట్టలనిండా మంచుదుమ్ము; స్కీలనిండా అప్పుడే పడినమంచు. "ఆఁ. అదే" అన్నాడు నికీతా ఒప్పుకుంటూ. "ఇంకాస్సేపుంటే లేళ్ళుగూడా కనిపించుతై. లేళ్ళు మేత మేస్తూంటే వెళ్ళి మీదపడతై ఇవి. * కణుజుల్ని గూడా నేటాడగలవుయివి. చిన్నచిన్న చెట్లన్నీ శివంగుల్లా ఎక్కుతై. పెద్ద పెద్ద పంజాలు; పులిగోళ్ళలాంటి గోళ్ళు. శీతకాలంలో రాత్రిం బగళ్ళక ఒకటేపని: వేట. ఎలుకల దగ్గర్నుంచన్నిటినీ తింటుంది; మనిషి శవమైనా సరే.

బాగా ఎత్తుపల్లాలొచ్చేప్పటికి ఇవాన్ వేగం తగ్గించాడు. నికీతా ఆగలేదు. అలాగే రయ్యిఁమంటూ ముందుకెళ్ళిపోయాడు స్కీలమీద; వంపులు తిరగడంలో తనకున్న నేర్పరితనం అంతా చూపిస్తూ. పైన వసంతకాలం సూర్యుడు బాగానే వెలుగుతున్నాడు; ఐనా చలిచలిగానే వుంది. ఉల్వొరైన్ లాగానే గాలిగూడా కొండలంతటా పరుగెత్తుతోంది,

* లేళ్ళజాతికి చెందిన యింకా పెద్దజంతువు.

వాళ్ళ ముహాల్ని కరుస్తూనూ, కళ్ళంట నీళ్లు తెప్పిస్తూనూ. కొండలపైన ఎక్కడజూచినా, మంచు మేకల అడుగుల జాడలు; మంచుగొఱ్ఱెల అడుగుల జాడలు. లోయలో కంటే, కొండల మీదే వెచ్చగా వుంటుంది. అదీగాక, అక్కడ మంచులోకి దిగబడవు గిట్టలు.

ఒక రాళ్ళగుట్ట దగ్గర డాక్టర్ ఇవాన్‌ని దాక్కోమని చెప్పి, తానొక అడుగు జాడవెంటే వెళ్లాడు నికీతా. ఆగుట్ట దగ్గర అడుగుల జాడలు రెండుగా చీలినై.

విశ్రాంతిగా కూర్చుని అటూయిటూ చూశాడు ఇవాన్. ఎట్లాగైనా ఒక వుల్వొరైన్ నివ్వాళ చంపాలని అతని వుద్దేశం. అవి అంతసామాన్యంగా దొరకవు. ప్రమాదకరమైనవి. వాటి తోళ్ళంటే యాకూత్‌లకి చాలాయిష్టం.

కాలం గడిచింది. మేకలూ లేవు, ఉల్వొరైన్లూ లేవు. ప్రథమోత్సాహం తగ్గింది. స్కీలుతీసి వాటిమీద కూర్చు న్నాడు ఇవాన్. ముక్కూ, మొహమూ మధ్యమధ్య రుద్దు కుంటూ తన ఆలోచనల్లో తాను పడిపోయాడు. ఇంకేముంది! ఇక నాలుగైదు రోజుల్లో నలభయ్యేళ్లూ నిండిపోతై. జీవితంలో కల్లా ఉత్తమమైన వయసు దాటిపోతుంది. దాటిపోతుందే ముంది; దాటేపోయింది. ఇంకాబలంగా వున్నాడు, ఆరో గ్యంగా వున్నాడు, తన వయసువాళ్ళకంటే చాలా మెరుగే తను. ఓల్గాతో యీ వ్యవహారం జరక్కుండా వుంటే వయ సును గురించి యిప్పుడాలోచించ వలసిన అవసరంలేదు; అదంతా నిజమే. కాని, ఇకిలాగే బ్రదుకుని వెళ్ళదీయడంఎలా? ఇంకో పాతి, మళ్ళీ, యింకొకరిని ప్రేమించలేదు; ప్రేమించడం సాధ్యంకాదు. ఇంకో స్త్రీని గురించిన ఆలోచనా స్నేహాలు.

వెగటు పుట్టినట్లుంటుంది. ఓల్గా! మనసొప్పుకోవడంలేదు; ఐనా ప్రేమ తగ్గలేదు.

'ఓల్గా నెలా మరచిపోగలను?' అని గొణుక్కున్నాడు.

ఇంతలో, ప్రక్కనే ఏదో కదిలినట్లనిపించింది. వెంటనే తిరిగి చూచాడు; ఏమీ కన్పించలేదు. గాలిమాత్రం రివ్వుమని వీస్తోంది. ఏదో మొరిగిన శబ్దాన్ని మోసుకొచ్చింది గాలి అస్పష్టంగా. ఇంతలో తుపాకి పేలిన చప్పుడు. కొండలన్నీ గింగురుమన్నాయా ధ్వనికి.

'అహ్హా. దొరికిందన్నమాట!' అనుకున్నాడు ఇవాన్.

మళ్ళీ తుపాకి పేల్చిన చప్పుడు.

'తప్పిపోయిందన్నమాట. సిగ్గుచేటు, నికితా! సిగ్గుచేటు! మళ్ళీ యింతలో దొరకదు నీకిలాంటి అవకాశం.'

నికితా గురితప్పి పోయిందే అని ఇవాన్ విచారించడం యింకా పూర్తన్నా కాలేదు, ఎదురుగా లేడొకటి పరుగెత్తు కుంటూ రావడం చూశాడు. ఈలేళ్ళకి కొమ్ములుండవు. అతి వేగంగా పరుగెత్తుకొస్తోంది తనవైపుకి. తుపాకి తీసి, గురి చూశాడు. మూడోసారి తుపాకి పేల్చిన చప్పుడు మళ్ళీ ప్రతి ధ్వనించింది పర్వతాల్లో. ఎదురుగా పరుగెత్తు కొస్తున్నదల్లా గిరుక్కున వెనక్కి తిరిగింది లేడి. దాని పొట్టితోకా, అదీనీ, దాని కాళ్ళకి ఉక్కు స్ప్రింగులున్నట్లున్నై; అలా గెంతుకుంటూ పారిపోయింది.

మళ్ళీ రెండోసారి ఇవాన్ తుపాకి పేల్చకముందే కను మరుగైపోయింది.

'పోతే పోయిందిలే, వెధవది!' అనుకున్నాడు ఇవాన్, విసుగ్గా చదికిల బడుతూ.

రెండుగంటలు గడచినై, అలాగే కూర్చునున్నాడు.

చిట్టచివరి కెట్లాగెతేనే, ఉల్వొరైన్ కన్పించింది దూరంగా వెన్ను విరుచుకుంటూ. బాగా దగ్గరకొచ్చేదాకా వూరుకున్నాడు ఇవాన్; దగ్గరకు రానిచ్చి, గురిచూచి తుపాకికాల్చాడు. తుపాకి కాల్చిన శబ్దంగూడా విన్పించలేదతనికి సరిగ్గా; అంత దడదడా కొట్టుకుంఁదతని గుండె, మళ్ళీ గురితప్పుతుందేమోనని. వెనక్కూగి భుజానికి కొట్టుకుంది తుపాకీ; అది మట్టుకు తెలుసతనికి; ఆవూపు మూలాన్నేనేమో, ఎదురుగావున్న జంతువు ముందుకొక్కపుదుటున వొరిగి కూలిపడింది క్రిందకి.

తుపాకి చేత్తో పట్టుకుని ముందుకు పరుగెత్తాడు ఇవాన్. ఉల్వొరైన్ కదిలింది, మూలుగుతూ ప్రక్క కొరిగింది, తోకాడించుతూ. మళ్ళీ యింకొకసారి పేల్చాడు తుపాకీ ఇవాన్. మూతి మంచులోకి పెట్టి కదలకుండా వుండిపోయింది ఉల్వొరైన్.

# 49

ఒక లేడినీ, దుప్పినీ పట్టుకొచ్చాడు నికీతా. "మొదటి దెబ్బతో దేన్ని చంపావ్?" అనడిగాడు ఇవాన్.

"లేడి" అని చెప్పాడు నికీతా.

ఇద్దరూ కూర్చుని చలిమంట వేసుకోడం మొదలెట్టారు.

ఈ వేటకి బయల్దేరేముందు, ఏది వేటాడాలా అన్నది పెద్ద సమస్యైపోయింది యిద్దరికీనీ: ఎలుగుబంట్లా, లేళ్ళా, దుప్పులా? ఇవాన్ ఇవానొవిచ్ ఉల్వొరైన్‌లని వేటాడాలన్నాడు. అందుకనొచ్చారు యింత దూరం, యీకొండల్లోకి. కొంతమంది యకూత్‌లు వీళ్ళిద్దర్నీ యిక్కడిదాకా తీసుకొచ్చా

దిలిపెట్టి, తిరిగి క్రిందకెళ్ళిపోయారు, దుప్పుల్ని మేపుకోడానికి. వేట పూర్తికాగానే, చలిమంట వేస్తామనీ అది చూడగానే వచ్చి మళ్ళీ తమని క్రిందకి తీసికెళ్ళాలనీ చెప్పారు వీళ్ళు. అందుకూ, యిప్పుడా చలిమంట.

"ఈచలింకా మూడు వారాల పాటుంటుంది" అన్నాడు నికీతా, చలిమంటకు దూరంగా జరుగుతూ; "తర్వాత వెంటనే వేడెక్కిపోతుంది వాతావరణం. ఈలోపుగానే కామెనుష్కా కెళ్ళిపోవాలి."

"నేనాపరేషన్ చేసిన రోగుల్ని చూస్తూవుండొద్దూ. అప్పుడే కామెనుష్కా కెళ్ళిపోతే యెట్లా? స్టైపాన్ పరిస్థితెలా పరిణమిస్తుందో గూడా చూడాలి. అతనిది చాలా గడ్డుకేసు.... ఇకతన్ని చూడననుకుంటూ కామెనుష్కా కెళ్ళిపోతే." అన్నాడు ఇవాన్ విచారపడుతూ.

"కామెనుష్కాకి ఒకసారి వచ్చెళ్ళమని మనం చెప్తే వస్తాడు. వేసవి కాలం వొకసారొచ్చి కనబడమని చెబుదాం."

"చెబితే వస్తాడు. కాని నేనక్కడ వుండొద్దూ. ఈవేసవిలో దేశంలోకెళ్ళి పోతాను, దూరంగా.... చాలా దూరంగా....!" తనలో తను మాట్లాడుకుంటున్నట్టున్నాడు ఇవాన్. డాక్టర్ మొహం చూచింతర్వాత మారుమాటాడే సాహసం లేకపోయింది నికీతాకి.

చాలాసేపు యిద్దరూ మాట్లాడకుండా కూర్చున్నారు. "ఇంకో రెండు మూడు వారాలకి మంచు కరగడం ప్రారంభమౌతుంది. తర్వాత కామెనుష్కా వెళ్ళాలంటే చాలా కష్టం" అని అన్నాడు నికీతా చిట్టచివరికి.

"వెళ్దాం; నికీతా! వెళ్ళక తప్పేదేముంది. పది రోజుల్లో పెద్ద పోయేది మాత్రం యేముందిలే. కాని, మరి అంతదూరం నుంచి వచ్చారే ఆ ఇవెంక్‌లు. వాళ్ళకి చికిత్స చెయ్యకుండా పంపితే, బాగుంటుందా ? వాళ్ళకి కోపంరాదూ ?"

"అదీ నిజమే" అన్నాడు నికీతా; "కాని, ఎప్పటికప్పుడు కొత్తరోగులు వస్తూనే వుంటారు. మిమ్మల్ని జాగ్రత్తగా కామెనుష్కాకి తీసికెళ్ళవలసిన బాధ్యతేమోనాది. అందుకనే నేనింత యిదిగా చెబుతున్నది. ఆలస్యం చేస్తే, ప్రయాణంలో యిబ్బందులు కలుగుతై."

"ఏం పర్వాలేదు, నికీతా! నువ్వేమీ విచారపడకు" అన్నాడు ఇవాన్; "ఇబ్బందులంటే మనకేమి భయం ? ఆ ఇబ్బందుల్నెలా దాటాలో తెలిస్తేచాలు. యిబ్బందుల్ని చూచి భయపడగూడదు. అసలు ఏంచెయ్యాలో తెలియక తికమకలు పడే పరిస్థితులొస్తేగాని బాధ; దీనికేముంది."

తుపాకి తీసుకుని దూరంగా వున్న రాళ్లగుట్ట వేపుకు నడచాడు ఇవాన్; ఒంటరిగా వుండాలనుంది. అదంతా రాళ్ళగుట్టలమయం. రాళ్ళగుట్టలు చిన్నచిన్న కుటీరాల్లా వున్నై; దానికి తోడామంచు. ఇంటికప్పుమీద పట్టినట్లే వుంది. వెళ్ళి, ఆగుట్టల్లో ఒక దాని మీద కూర్చున్నాడు. ఎటు చూచినా, అంతా గందరగోళం. సంజె వెలుగులో, కొండల అంచులు ఆకాశం రంగులో కలిసిపోయినై; పడమట మాత్రం కొద్ది కొద్దిగా కన్పిస్తున్నై పర్వత శిఖరాలు మట్టుకు. ఎటు చూచినా శీతకాలం రాజ్యం చేస్తోంది. అంతా నిశ్శబ్దం. అంతటా నిశ్శబ్దం. నీలి ఆకాశంలో చంద్రవంక కన్పించింది వంచిన బంగారు సూదిలా. స్ట్రెవ్! లే! ఆసూది తీసుకో; కుట్లు వెయ్యి! కాని, స్ట్రెనేడీ? ఇక్కడు

న్నది సర్జెన్ కాదు; సామాన్య మానవుడు. నేలకీ నింగికీ మధ్య యీ కొండల మీద, రష్యన్ కట్టుకథల్లో కన్పించే మనిషే కూర్చునున్నాడు. ఆ మనిషి పేరు ఇవాన్. ఇవాన్ అనే పేరు కట్టు కథల్లో పదేపదే వినిపిస్తుంది. ఇవాన్ రాజకుమారుడు; ఇవాన్ పిచ్చిదద్దమ్మ! ఇతను రాజకుమారుడూ కాదు; పిచ్చి దద్దమ్మా కాదు. ఇతను డాక్టర్; డాక్టర్ ఇవాన్. మంత్రాల మహాత్తు పనిజెయ్యడం మానేశిందిప్పుడు. అతని హృదయంలో వున్నగాయాన్ని యేమంత్రజలమూ మాన్పలేదు. ఏమిచేసినా, ఆ గాయం బాధ పెరుగుతుంది; ఉపశమనమంటూ లేదా బాధకి; ఆ గాయానికిక మందులేదు. గడచిన సౌఖ్యాన్ని తలచుకుని రెంతే హృదయంలా ఫీస్తోంది గాలి; అమని ఆగమనానికదొక గుర్తు. నెత్తిమీద ఆకాశంలో నక్షత్రాల బంగారు కనురెప్పలు కదలుతున్నై. .

కామెనుష్కానుంచి డాక్టర్ ఇవాన్ ఈ ప్రాంతానికి, యీ కునుకుపాట్లుపడే ప్రదేశానికెలా వచ్చినట్టు? కాకతాళీయంగానే వచ్చినట్టా? ఏమో! ఇదొక కొత్తకాలం; నిజమే. కొత్త మహాత్తులు. తైగా ప్రాంతంలో నగరాలు లేస్తున్నై; నగరాలు నిర్మిస్తున్నారు. ఉచఖాన్‌లో సమిష్టిక్షేత్రం రైతులు పొగచూరిన చీకటి కొంపల్నొదిలి, కొత్తగా నిర్మించే చక్కని గృహాల్లోకి కాలుపెడుతున్నారు.

ఈ వేటకి బయల్దేరేముందే ఒకవింత జరిగింది. ఉచఖాన్‌లో సమిష్టిక్షేత్రం క్లబ్బు తెరచారు కొత్తగా. నికీతా, ఇవాన్ లిద్దరూ వెళ్ళారు. తైగా ప్రాంతంలో సినీమా చూపడం అదే మొదలు, లైట్లన్నీ ఆరిపోయి, తెరమీద వెలుగు కన్పించేప్పటికే అందరూ గుసగుసలాడడం మొదలెట్టారు. ఇక బొమ్మలు

కనబడి, మాటలు వినబడింతర్వాత పట్టేందుకు పగ్గాల్లేవు. తమ కళ్ళని తామే నమ్మలేకపోయారు ప్రేక్షకులు. ఏదయ్యామో, దైవమో వచ్చి, ఇవాన్ ఇపానొవిచ్‌ని నిలుచున్న పళాన పైకి లేపి గగనమార్గాన ఎగరేసుకుపోతే ఎంతాశ్చర్యం వేశేదాయనకి! అంతాశ్చర్యం వేశింది అందరికీనీ.

ఉఛఖాన్‌లో ఇవ్వాళొక వూరు లేచింది; క్లబ్బు కట్టుకున్నారు. రేపొక పారిశ్రామిక కేంద్రం వెలుస్తుంది; సాంస్కృతిక కేంద్రం ఏర్పరచుకుంటారు.

'ఇదెవరో ఖ్యూర్ని ఊహించిన స్వప్నజగత్తు కాదు. కళ్ళముందు బోల్షెవిక్కులు కడుతూన్న నూతన జీవితసౌధం', అనుకున్నాడు ఇవాన్; ఈ ఉఛఖాన్ నదీతీరాన నిర్మించే నగరానికి స్తాలినోగోర్‌స్క అని పేరు పెడతారు; ఈ నగర నిర్మాణానికి కారకుడైన మహావ్యక్తిపేరు చిరస్థాయిగా నిలిచిపోతుంది. నేను వింత వ్యక్తినే కావచ్చు; నా వ్యక్తిగత జీవితాన్ని కలగాపులగం చేసేసుకున్న మనిషినే కావచ్చు. ఐనా, నేను చేతగాని సర్జెన్‌ని అని మట్టుకెవ్వరూ అనలేరు!' "ఇక, డాక్టర్ మాట్లాడ్తారు, కామ్రేడ్స్!" అంటూ లేచి నిలబడ్డాడు ఇవాన్ ఆ రాతిగుట్టమీద. తలకున్న ఉన్నిటోపీ తీసేశాడు. గాలి వస్తూన్నవైపుకు ముహం తిప్పాడు. రష్యన్ దేశం గూడా అటేవుంది.

"కొత్తనగరం వర్ధిల్లాలి....స్తాలినోగోర్‌స్క వర్ధిల్లాలి!"

# 50

జిల్లా సోవియెట్ కెళ్లి తిరిగొచ్చాడు జఖార్; మంచి హుషారుగా వున్నాడు. "పెద్ద నగరం వొకటి కడ్తారువాళ్లు.

రోడ్డువేస్తారు. ఆరోడ్డుమీదనుంచి పెద్దపెద్ద యంత్రాలు తీసుకొస్తారు. అహాఁ.కాదు. యంత్రాల్ని తీసుకురావడంగాదు. వాటంతటకవే వస్తాయి యంత్రాలు రోడ్డుమీద పడి. వాటంతటకవేరాలేని యంత్రాల్ని, వాటంతటకవే రాగలిగిన యంత్రాలు మోసుకొస్తాయి. అలా యంత్రాల మీదెక్కివచ్చిన యంత్రాలు నేలమీద నిలబడిపని చేస్తాయి." అన్నాడు.

కార్యవర్గ సమావేశానికి, తైగానుంచి వచ్చిన అతిథులు గూడావచ్చేందు కవకాశం కలిగించింది మార్ఫా. గంటలతరబడి నేలమీదా, బల్లలమీదా కూర్చుని విన్నారు వాళ్ళందరూ, సమావేశంలో చర్చలు.

"సోవియెట్ ప్రభుత్వం వాళ్ళకోసం ఏం జేస్తోందో, వాళ్ళనీ తెలుసుకోనివ్వాలి" అంది మార్ఫా.

జఖార్ గూడా అతిజాగ్రత్తగా విన్నాడు ప్రతీ మాటానూ. తాను వేటగానిగానే వుంటాడు; ఎవరి ధర్మంవారు నిర్వహించవలసిందే. కాని....

"మేమొక గుడారంలో కెళ్ళాం. అందులో ఎలెక్ట్రిసిటీ తయారు జేస్తున్నారు." అని చెప్పాడు భార్యతోనూ, సైపాన్ తోనూ; "అదొక రష్యన్ గుడారం! పెద్ద బోయిలర్, పెద్ద స్టోవ్, మన పొడుగాటి చెట్లలా పొగగొట్టం! అక్కడా వాళ్లు 'కాంతి'ని చేశేది."

భర్తతప్పు చెప్పుతున్నాడనుకుంది కాద్యా. "కాంతి కాదు; నిప్పు. నిప్పనిచెప్పు" అంది, భర్తని సరిదిద్దుతూ.

జఖార్ నవ్వాడు, భార్య మరీ అంత చిన్నపిల్లలాగా మాట్లాడుతుందేమిటని ఆశ్చర్య పడుతూన్నట్టు.

నిప్పుచెయ్యడానికేముంది? నేనుచేస్తాను, నువ్వూచేస్తావు-స్త్రీపానన్నయ్యా చేస్తాడు; అందులో గొప్పేముంది! ఇది కాంతి. వాళ్ళు తయారు చేశేది కాంతి! చెట్లకొమ్మల్లో పచ్చటి రసం ప్రవహించదూ, అట్లా ప్రవహిస్తుంది కప్పిన తీగల్లో." చక్కని పోలిక చెప్పానన్న సంతోషంతో గళమెత్తి గానం చెయ్యడం ప్రారంభించాడు జఖార్.

మోకాళ్లు మడిచి కూర్చునున్నాడు జఖార్; ఆమడిచిన మోకాలు చేత్తో పట్టుకుని తాళంప్రకారం, ముందుకీ వెనక్కీ-వూగుతూ పాడటం ప్రారంభించాడు. ఏదో వింత విషయం చూస్తూన్నట్టు కనుబొమలు పైకిలేపిచూస్తున్నాడు చలిమంట వంక. కనులాలోచనలతో మెరసిపోతున్నై.

పాట పాడుతున్నాడు: తైగాలోని మారుమూలల గ్రామాలకు గూడా ప్రాకునై ఆ తీగలు. ఆ తీగల తలలనిండా బంగారు మొగ్గలు; వసంతకాలంలో విరగబూచిన పొదలా. ప్రతి గుడారంలోనూ ఒక బంగారు మొగ్గబుగ్గ. వేడిమి నివ్వక పోతేనేం గాక, ప్రతిమొగ్గా ఒక చిన్నారి సూర్యుని తునక. ఆ కాంతిలో పేడకుప్పలో పడిపోయిన నల్లపూసని గూడ వెదికి బయటికి తీయగలరు, కనులు కనబడని ముసలులు గూడ. కానిక గుడారాల్లో పేడకుప్పలు కనిపించవు. చీకటిలోనూ, పొగలోనూ పశువుల ప్రక్కన జీవించరిక మానవులు. తైగాప్రాంతానికి కాంతి వచ్చిపడింది. తైగాప్రాంత మంతటా ప్రకాశం; తైగా అంతటా తెల్లని వెలుగు! ఇక తైగాలో కనులు కనిపించని ముసలమ్మ లుండరు. పొడుగాటిజడల పడుచులై పోతా రందరూ. ఆ పొడుగాటి జడల పడుచులా వింత కాంతిలో చలిమంటలముందు-కూర్చుని కొత్తదుస్తులమీద పూసలు కుట్టుకుంటుంటారు!

చక్కనిపాట జఖార్ పాడినపాట. చక్కని గొంతు తనిది. అవూళ్ళోకల్లా మంచి పాటగాడని పేరతనికి. భర్త వంక సగర్వంగా చూచింది కాద్యా. కాని, అంతలోనే ఏదో సందేహం....

"అప్పుడీ చలిమంట లుండవేమో ?"

పాటపాడినట్టు చెప్పాడు జఖార్.

"మంటలూ వుంటాయి; చలిమంటలూ వుంటాయి !"

"ఉండవ్" అని అభ్యంతరం చెప్పాడు స్తెపాన్; "ఈ చలిమంటలకంటే స్టోవ్‌లే మెరుగు. కట్టెలు తక్కువ పడతై, వేడి ఎక్కువ వస్తుంది".

పాటలో మాటలు మారడాని కొప్పుకోవని తెలియదు పాపం వాళ్ళకి. ఒకమంచి పాట కట్టాడు తను; మాటలు మార్చాలని చూస్తున్నారు వాళ్లు. పాట విలువని కట్టెల్తో కొలుస్తున్నారు! ఔనంతే మరి; ఒకడేమో జబ్బుపడ్డమనిషి; రెండో వ్యక్తేమో స్త్రీ. వాళ్ళకంతకంటే అర్థం చేసుకోవడం చేతకాదు. ఆ సమస్యని చిటికెలో పరిష్కరించేశాడు జఖార్.

"ఎవరికేది కావాలంటే, అదే వుంటుంది!"

తొమ్మిదోరోజున స్తెపాన్ నెత్తిమీద కుట్లు వూడదీశాడు ఇవాన్. గాయం మానింది. స్తెపాన్ హుషారుగా వున్నాడు. కొత్తదుస్తులేసుకున్న వ్యక్తిలాగా, అతని ప్రతి కదలికలోనూ 'చూశారా! నేనెంత ప్రముఖవ్యక్తినో!' అన్న భావం దొర్లు కొస్తోంది. దీనికితోడు, ఇవాన్ ఇవానొవిచ్ బహుతరచుగా వస్తున్నాడతన్ని చూచేందుకు. ఆపరేషన్ చేసినప్పుడు బాధ కలిగించిందా అని వచ్చినప్రతిమనిషీ

ప్రశ్నించడమే; లేదని అతను సమాధానం చెబితే అందరూ ఆశ్చర్య పోవడమే! ఇదివరకు డాక్టర్ చేత ఆపరేషన్‌లు చేయించుకున్న వాళ్ళు గూడా నొప్పిలేదనే అన్నారు. కాని, అవన్నీ చిన్నచిన్న ఆపరేషన్లు. స్తైపాన్ యింకా లేత సొరకాయలు కోశినా, వినడానికి సిద్ధంగా వున్నారు చూచేందుకొచ్చినవాళ్లు. కానిఅత నతనితమ్ముడిలాంటివాడు కాదు; తమ్మునికున్న వ్యూహా పటిమ గాని కల్పనాశక్తికాని లేదతనికి.

కథలనేకం పుట్టుకొచ్చినై: స్తైపాన్ తలంతా నరికి, మళ్ళీ కుట్టివేశారట అని చెప్పుకున్నారు కొందరు. తలంతా ఎక్కడ నరికారు, నరక లేదు, కాని తల రెండుగా పగలగొట్టి మెదడు బయటకు తీశాడట అన్నారు కొందరు. ఆ మెదడులో ఆలోచనలు కొమ్మలమీద పక్షుల్లాగా వున్నాయనీ, అవన్నీ చెదరకుండా మళ్ళీ లోపల పెట్టి కుట్టేశారనీ అన్నారు యింకా కొందరు. స్తైపాన్‌ని చూచేందుకని దూరదూర ప్రాంతాల్నుంచి గూడా వచ్చారు జనం. వాళ్ళందరితోనూ చక్కగా మాట్లాడుతున్నాడు. అడిగిన ప్రశ్నలకి సమాధానాలు చెబుతున్నాడు. అంటే మెదడు సవ్యంగానే వున్నదన్న మాట; కొమ్మలమీద పక్షులన్నీ ఎక్కడివక్కడ సరిగానే వున్నవన్న మాట. ఒక్కపక్షిగూడా ఎగిరిపోలేదన్న మాట.

గాయం మానింతర్వాత, కుట్లూడదీసింతర్వాత అందరూ వచ్చి చూచారు ఆ 'కిటికీ'ని. అంతమందతని కోసమని రావడం ఇంతకుపూర్వ మతని జీవితంలో ఎప్పుడూ జరగలా! భార్యా, బంధువులూ అతనంటే అతిశ్రద్ధగా వుంటున్నారు. వచ్చిన వాళ్ళంతా ఏదో వొక బహుమానం తీసుకొస్తున్నారు. అలా రెండుమూడు వారాలు కీర్తిప్రతిష్ఠలతో వెలిగి పోయ్యాడు.

కాని తర్వాత, క్రమక్రమంగా విసుగెత్తడం మొదలైంది. వచ్చినవాళ్ళతో మొరటుగా మాట్లాడడం మొదలెట్టాడు. ఉన్నట్టుండొకనాడు అంతర్ధానమై పోయాడు.

స్తెపాన్ మాయమై పోయినమాట విని ఇవాన్ చాల విచారించాడు. తానెళ్ళిపోవాల్సిన సమయం గూడా దగ్గర పడుతోంది. కాని కీర్తి తైగా ప్రాంతంలో నాలుగు దిక్కులా పాకింది. ఉచఖాన్ కొచ్చేజనం రోజురోజుకూ పెరిగిపోతున్నారు. కొత్తమందులూ, కొత్తపరికరాలూ తెప్పించందే, పని కొనసాగేట్టు లేదు.

కాని రోజూ నికీతా గొడవ ఎక్కువై పోయింది: "ఇక మనం వెళ్లిపోవాలి; లేకపోతే దార్లువున్నకొద్దీ చెడిపోతై."

"నిజమే. నువ్వనేది నిజమే. మనం వెళ్ళిపోవాలి. స్తెపాన్ గూడా మంచి సమయానికే పారిపోయాడు! ఆతనేమయ్యాడో తెలియకుండానే ఎట్లా బయల్దేరను యిక్కణ్ణుంచి ?"

తర్వాత ప్రతిరోజూ నికీతాయో, ఇవానో, ఎవరో వొకరు స్తెపాన్ యింటి కెళ్ళేవారు కబుర్లు తెలుసుకునేందుకు. వాళ్ళు ప్రశ్నలడిగితే, భార్య ఏడ్చేది; పిల్లలు గల్లంతు చేసేవాళ్ళు.

"ఏమైనా తీసుకెళ్ళాడా, వెళ్ళేప్పుడు ?"

"తుపాకి మట్టుకు పట్టుకెళ్లాడు ?"

"బహుశా పిచ్చెక్కిందేమో !" అన్నది కాద్యా, ఒకరోజు.

ఊరంతా వొకటే రూమరు: 'స్తెపాన్‌కి పిచ్చెక్కింది. లేకపోతే మనిషి మెదడుని ముట్టుకోమని ఎవరు చెప్పారు. మెదడు చెడిపోతే. మనిషి చనిపోవాల్సిందే.'

"మనిషి మెదడును ముట్టుకుంటే ప్రమాదం ఏమీ లేదు" అని చెప్పాడు ఇవాన్, ఒకనాడు ఊళ్లో వాళ్ళందరినీ సమావేశపరచి; "కారణంలేని కార్యమంటూ వుండదు. ప్రతిజబ్బుకీ ఒక కారణమంటూ ఉంటుంది. మనకు తెలియని విషయాలని గురించి మాట్లాడడం మంచిది కాదు. ఒకవందసంవత్సరాల క్రితం నొప్పిలేకుండా ఆపరేషన్ చెయ్యమంటే చెయ్యగలిగే వాళ్ళు కాదు శస్త్రవైద్యులు. ఇప్పుడు నొప్పి కలగకుండా ఆపరేషన్లు చేస్తున్నారు. చాలాకాలం క్రితం వరకూ మెదడు మీద ఆపరేషన్ చెయ్యాలంటే భయపడేవారు; ఇప్పుడు నిర్భయంగా చేశేస్తున్నారు.

# 51

డెనిస్ దగ్గర్నుంచి వుత్తరం వొచ్చింది. ఎలాగైతేం, రావలసినచోటుకు చేరుకుంది. మడతలు పడి మాసిపోయిన వుత్తరం చేత్తోపట్టుకుని నిలబడి పోయాడు ఇవాన్, చించి చదవడానికి భయపడిపోతూ. డెనిస్ చాలా స్నేహపాత్రుడు... అలాంటి వాడింతకాలం వుత్తరం వ్రాయకుండా వూరుకుని, యిప్పుడెందుకు వ్రాశినట్టు? అందరూ కూర్చుని వేసుకున్న లెక్కల ప్రకారం యీపాటికప్పుడే తిరుగుదారిలో వుండవలశింది తాను; ఆ సంగతి డెనిస్‌కీ తెలుసు. మరెందుకు వ్రాశినట్టూ యిప్పుడీ వుత్తరం ?

మళ్ళీ ఒకసారి ఉత్తరం మీద ఎడ్రెస్ వంకా, స్టాంపు పఠకా చూచాడు ఇవాన్. ఉత్తరం వ్రాశి, చాలా కాలమై నట్టుంది. ఉత్తరం పట్టుకొచ్చిన కయూర్ దారిలో తన చుట్ట పక్కాలందర్నీ కలుసుకుని పలకరించి వొచ్చుంటాడు. కవరు నెమ్మదిగా తెరచి, ఉత్తరం అంతా ఒక్క క్షణంలో చదివేశాడు ఇవాన్; హాస్పిటల్‌ని గురించీ, గూసేవ్‌ని గురించీ, అలెగ్జీని గురించీ, న్యూమోనియా వచ్చినావిణ్ణి గురించీ, ఓల్గా (ఓ, ఓల్గా!) నిగురంచీ, బుర్దెంకోని గురించీ........

మళ్ళీ ఒకసారి చదివాడు ఫుత్తరం చివర బుర్దెంకోని గురించి వున్న భాగం అంతా. "స్టాలిన్ బహుమానం. మంచిదే. నికోలాయ్ నిలోవిచ్ బుర్దెంకో. సైన్స్ ఎకాడమీ సభ్యుడు. శస్త్రచికిత్సలో అపూర్వ విజయాలు సాధించినందుకు .... ప్రజాప్రతినిధుల నిర్ణయం. పద్నాలుగు మార్చి ప్రావ్దా పత్రికలో."

"నికీతా!" అని పిలిచాడు ఇవాన్; "మార్చి పద్నాలు గోతేదీ ప్రావ్దా రాలేదా మనకి?"

"రాలేదు. మీకు చెప్పానుగా ఆవేళ పోస్టందలేదని. పోస్ట్ పట్టుకొస్తున్న స్లెడ్జ్‌బండి మంచుదారిలో కూరుకుపోయింది. పెద్దగాలిదుమారం వచ్చిందావాళ. కయూర్ దారితప్పాడు గూడాను. ఆవాళ తేదే మే ఎనిమిది."

"మే ఎనిమిదా!" అని ఆశ్చర్యపోతూ అడిగాడు ఇవాన్. అలెగ్జీద గురించి వుత్తరంలో వున్న భాగం మళ్ళీ వొకసారి చూస్తూ రెండోకాలు. పాపం! ఆపరేషన్ చేశెయ్యాలి; వెంటనే. అప్పుడే అక్కడక్కడా నల్లమచ్చలు పడినయ్యట

గూడాను. ఛాఛ. అసలీ వుత్తరం వ్రాశిందెప్పుడో? ఇవ్వాళ, "నికీతా! ఇవ్వాళ తారీఖెంత?"

"మే పదకొండు" అని చెప్పాడు నికీతా ముక్తసరిగా. ప్రతిరోగిని గురించీ డాక్టరలా తల క్రిందులు కావడం అతని కిష్టంలేదు. తన ఆరోగ్యం సంగతే పట్టించుకోడీ డాక్టరసలు. రోగులందరికీ చికిత్సచేసి బాగుచెయ్యడం సాధ్యమూకాదు. తండాలుతండాలుగా వస్తున్నారు రోగులు ప్రతిరోజూనూ. వీళ్ళందరినీ బాగుచేసి బయల్దేరాలంటే, మంచుదారులు మారి పోతాయ్. ప్రయాణం చెయ్యడానికే వీలుండదు. ఆ గొడవే పట్టినట్టులేదు ఎవరికీనీ. డాక్టర్ని తీసికెళ్ళవలసిన బాధ్యతేమో నికీతాది. మార్ఫాగూడా అంతే; మాట్లాడదు. ఈ డాక్టర్ని క్కడెంతకాలం వుంచుకుంటే అంతమంచిదని అనుకుంటూం దల్లేవుంది. ప్రొద్దుగూకుల్లూ పనిలో మునిగి తేలుతూంటాడు ఇవాన్; వసంతకాలం వస్తే మంచెలా కరుగుతుందో, అప్పుడు దారులెలా తయారౌతాయో, ప్రయాణం చెయ్యడం ఎంత ప్రమాదమో ఆలోచించే తీరికగూడా లేదాయనకి. ఎప్పుడైనా నికీతా ఆసంగతెత్తితే,

"రేపా ఆపరేషన్ చేద్దాం...." అంటాడు.

కారణాలు కావలశినన్ని. కారణాలన్నీ బలవత్తర మైనవే. పని చేసేది మానవులతో. ఆ మానవుల కందరికీ వైద్యసహాయం కావాలి. ఆ వైద్యసహాయం ఇవ్వకుండా ఎలా ఉండగలరు? సహాయం చెయ్యక తప్పదు; చేస్తున్నారు.

"ఇవ్వాళ మే పదకొండు" అని చెప్పాడు నికీతా మళ్ళీ; "యకూత్‌ల లెక్క [illegible]; శీతాకాలం ఒక తెల్లని ఎద్దుకింద [illegible] ఆ ఎద్దుకు [illegible] కొమ్ములుంటాయి. [illegible]

మొదటి అఫనాసీ — అంటే మార్చి ఐదు — న విరిగిపోతుంది. రెండోది రెండో ఆఫినాసీ — అంటే ఏప్రిల్ ఇరవైనాలుగు-న విరిగిపోతుంది. మూడో అఫినాసీ-అంటే మే పద్నాలుగు-నాటికి మొత్తం ఎద్దంతా తునాతునకలై నేలలో కలిసిపోతుంది. అదీ యకూత్‌ల లెక్క. మంచు యిక కరగడం ప్రారంభిస్తుంది, డాక్టర్ ! వేసవికాలందాకా మీరిక్కడే వుండదలచుకుంటే యిక నేను మాట్లాడేదే యేమీ వుండదనుకోండి. ఇకప్పుడు మంచుదుప్పులమీద స్వారి జెయ్యాల్సొస్తుంది మనం."

ఇంకా ఆ వుత్తరం చదువుకుంటూ లెక్కలేసుకుంటు న్నాడు ఇవాన్; "స్వారెందుకూ ?" అనడిగాడు.

"రేపే బయల్దేరధాం స్లెడ్జిబల్లమీద !" అన్నాడు; ఒక నిర్ణయానికి వచ్చేశినట్టు.

తన చెవులు తానే నమ్మలేకపోయాడు నికీతా. స్టెరిలైజ్ చేసిన గాజ్ బోయిలర్‌లో వేస్తున్నవాడల్లా, బోయిలర్ తల కిందులు చేసినంత పనిచేశాడు.

"రేపా ?"

"ఆఁ. రేపే. జిల్లా సోవియెట్ దగ్గరకి పరుగెత్తుకెళ్ళి మార్ఫాతో చెప్పిరా, రేపే ప్రయాణమని. కామెనుష్కా కెళ్లి పోవాలని చెప్పు, అక్కడొకరోగికి ఆపరేషన్ చెయ్యాలట, ఛాలా అవసరమట అని చెప్పు.

"సరే, వెళ్లి చెప్పొస్తాను. కాని మనకు, వున్న సమయం చాలుతుంధో లేధో........"

"ఎందుకు ఛాలదూ ?" అన్నాడు ఇవాన్ విసుగ్గా, "నది మీంద మంచు మే ఇరవై నాల్గు దాకా వుంటుంది. మే ఇరవై

నాలుగు దాకానే ఏమిటి, జూన్ ఐదో తారీఖు వరకో, ఆరో తారీఖు వరకో వుంటుంది. అంటే యింకా యిరవై రోజులన్న మాట. ఎందుకు చాలదూ?"

"మనం వచ్చినంత తొందరగా జరగదు ప్రయాణం. ఈ సారింకా ఆలస్యమౌతుంది. దుప్పుల్ని మార్చడానికి యిదివరకే సినన్ని మకాంలు వెయ్యడానికి వీలుండదు." అన్నాడు నికీతా, బోయిలర్ మీద మూత సరిజేస్తూ.

"వెళ్ళగలిగినంత దూరం స్లెడ్జ్ బళ్ళమీద వెళ్దాం. కావాలంటే, తర్వాత తెప్పలుపయోగించుదాం."

నికితా ముహం తేటబారింది. ఆలస్యం చెయ్యడమంటే అయిష్టమే అతనికి; అందుకని ముందు వెనకలు చూడకుండా దూకడమన్నా యిష్టం వుండదు.

"ఔనౌను. తొందరగానే బయల్దేరాలి మనం" అన్నాడు ఇవాన్, సూర్యకాంతికి కళ్ళుకుంచించుతూ.

బయటికెళ్ళి, బ్రిడ్జి దాటుతూ, కోటుజేబులో చెయ్యి పెట్టాడు, చలువజోడు కోసమని. కళ్ళజోడు పెట్టుకునే ముందు నదివొడ్డున నిలబడి చుట్టూవున్న దృశ్యానొకసారి చూచాడు. ఈ మంచుభూమిలో వసంతం అడుగు పెట్టింది. శీతకాలం పెట్టిన అడ్డులన్నీ దాటి, వేలకొద్దీ మైళ్ళు ప్రయాణం జేసి వచ్చిందిక్కడికి. మే మాసం మధ్యలోనే వచ్చినప్పటికీ, ఆ యౌవన శోభయేమీ తగ్గలేదు.

కాని ఈ ప్రాంతాల్లో వసంతమే వేరు. రెండు వారాలకంటె ఎక్కువుండదు. ఆవున్న రెండు వారాల్లోనూ, సూర్యుడు నడినెత్తిమీద, వేసవికాలంలోలా, వెలిగిపోతాడు. ఆ వేడిమికి

క్రిందున్న మంచు కరుగుతుందా అంటే కరగదు; అలాగే చెక్కు-చెదరకుండా వుంటుంది. మంచుమీదపడే సూర్యుడి, కాంతిని చూచిన కళ్ళు చిరతలారి పోవలసిందే. చలువ కళ్ళజోడు లేకుండా ఆ మంచులో రెండు రోజులు ప్రయాణం చేస్తేచాలు, కళ్ళికెందుకూ పనికిరాకుండా పోవలసిందే; ఆ రెండోరోజు రాత్రి మండిపోయే కళ్ళమీద తడిపిన గుడ్డేసుకుని పండుకోవాలి. ఇక తర్వాత పగలు ప్రయాణం మానుకుని, రాత్రిళ్లు చేయవలసిందే ప్రయాణం. అందుకనే, తైగా ప్రాంతంలోవున్న వాళ్ళీరోజుల్లో, చిన్నచిన్న కంతలు పెట్టిన బెరళ్ళు తగిలించుకుంటూరు కళ్ళకి.

'ఇంతగా వెలిగిపోతున్న యీ వెలుతురులో యెక్కడ తిరుగుతున్నాడో స్తైపాన్?' అనుకున్నాడు ఇవాన్, 'వసంతం. ఆపరేషనై పోగానే, తైగాలో, యిలా తిరగడం మంచిది కాదు! ఏంజరిగినా జరగొచ్చును తర్వాత.'

విసుక్కుంటూ, కళ్లజోడు పెట్టుకుని, దగ్గరగావున్న గుడారం దగ్గరకెళ్ళాడు ఇవాన్ గబగబా.

"స్తైపానొచ్చాడు! స్తైపాన్!" అంటూ ఎదురయ్యారు ఆడవాళ్లూ, పిల్లలూ.

"బాగా ఆరోగ్యంగానే వున్నాడు!"

"శివంగిని చంపి పట్టుకొచ్చాడు; శివంగిని!"

ఎదురైన వాళ్ళతో ఎవరితోనూ మాట్లాడకుండా, సరాసరి గుడారంలోకెళ్లాడు ఇవాన్.

చలిమంట దగ్గర కూర్చుని చలికాగుతూన్న స్తైపాన్ లేచి నిలబడ్డాడు భయంభయంగా.

"ఎక్కడికెళ్ళావు, తగ్గోరీ?" అనడిగాడు ఇవాన్.

"దూరంగా"

"ఎందుకు ?"

"స్తెపాన్ వేటగాడు. ముసలమ్మకి మళ్లీ మూలని కూర్చోమంటే కూర్చోలేడు. మీరిక్కడ వుండగానే, వేట ప్రారంభించాలి; అతని మెదడు సరిగ్గా పనిచెయ్యకపోతే మీరు మళ్లీ చికిత్స చెయ్యాలి. స్తెపాన్ చక్కగా వేటాడాడు, డాక్టర్ !" అన్నాడు స్తెపాన్, డాక్టర్ వంక ప్రార్థిస్తున్నట్టు చూస్తూ.

స్తెపాన్ చెబుతున్నది అర్థంచేసుకోవాలని ప్రయత్నిస్తూ, పెదవులు బిగించి చిరునవ్వు నవ్వుకుంటున్నాడు ఇవాన్. ఆ చిరునవ్వుకు ప్రతిఫలం స్తెపాన్ ముహంమీద చిందులాడింది. తన నవ్వును చూచి, స్తెపాన్‌కి బరువు దింపుకున్నట్లయ్యింది. అది గమనించాడు డాక్టర్; గమనించి ఫగలబడి నవ్వాడు. డాక్టర్ నవ్వడం జూచి చుట్టూ చేరిన వారంతా నవ్వారు విరగబడి, గుడారం కప్పెగిరిపోయేట్టు.

"సరే, సరే !" అంటూ కోటుతీసి స్తెపాన్ ప్రక్కనే, చలిమంట దగ్గర, కూర్చున్నాడు ఇవాన్; "తలనొప్పి పెట్టడం లేదన్నమాట ? కాని యింతతొందరగా వేటకెళ్ళగూడదు. వెళ్ళకుండా వుండవలసింది. మళ్ళీ బలంబాగా వంటబట్టేవరకూ ఆగవలసింది." ఇంతలో నికీతా వచ్చాడు లోపలికి. "నికీతా ! ఇటురా !" అని పిలిచాడు ఇవాన్; "నేను చెప్పేదంతా అనువాదం చేసి చెప్పుయితనికి; ఎలా శ్రద్ధ తీసుకోవాలో, ఎంత జాగ్రత్తగా వుండాలో చెప్పు. దూరానవున్న లేడిగూడా బాగా కన్పిస్తుందో లేదో అడుగు. తగరున్న జంతువులు మట్టుకే కన్పిస్తాయా ? ఏం, పర్వాలేదు[illegible]విన్నావా ? అత

నేమంటునాడో ! నేనిక్కడుండగానే వేడాడలని వెళ్ళాడట ఇంకేమన్నా వుందా ? సరేలే. ఎలాగైతేఁ వచ్చాడు. నువ్వొచ్చేసినందుకు నేను చాలా సంతోషిస్తున్నాను, స్తైపాన్ !"

ప్రేమగా స్తైపాన్ భుజం తట్టాడు ఇవాన్:

"మేం రేపు బయల్దేరుతున్నాం, కామెనుష్కాకి."

# 52

ఉఛఖాన్‌లో ఇవాన్ ఇవానొవిచ్ చేయవలసిన ముఖ్యమైన పనంతా పూర్తయ్యింది. డెనిస్ దగ్గర్నుంచి ఆ వుత్తరం వొచ్చినప్పట్నుంచీ, బంగారపుగనుల దగ్గరికి ఎప్పుడెళ్దామెప్పుడెళ్దామని తహతహలాడి పోతున్నాడు.

సామానులు కట్టడానికి సహాయం చేసేందుకు మార్ఫా వచ్చింది. "నదులమీద దారి సవ్యంగా వుండదంటారా ?" అనడిగాడు ఆవిణ్ణి; "లేకపోతే మాత్రమేంలే. ఒకటి రెండు బుటకలేశినా ఫర్వాలేదు; చచ్చిపోంగదా; అదీగాక నీరుగూడా వెచ్చగా వుంటుంది !"

"పరికరాలు కొన్నిక్కడ వదిలి వెళ్తారా మీరు ? మళ్లీ వస్తారేమోగా మీరిక్కడికి."

"రాను మార్ఫా ! బహుశా, రావడానికి వీలుండదనుకుంటా. తొందరలోనే మీకిక్కడొక పెద్దహాస్పిటల్ కడతారు; కొత్త డాక్టర్లొస్తారు. మంచివాళ్ళకి కరువులేదు మనకి. కావలసినంత మంద్యున్నారు మంచి మంచి డాక్టర్లు."

మార్ఫా నిట్టూర్చింది.

"మీ ప్రయాణం చాలా మందకొడిగా సాగుతుంది. మారకానికి దుప్పుల్ని పంపడానికి గూడా వీల్లేదిప్పుడు. మీరీ వేసవికాలం గూడా యిక్కడే వుంటారనుకున్నాం."

"నేనూ అలాగే అనుకున్నాను. కానేంచేద్దాం? ఇకిప్పుడుండేందుకు వీల్లేదు. నాకోసం అక్కడ రోగులు నిరీక్షిస్తున్నారు. అవసరం అనుకుంటే నెమ్మదిగానే చేస్తాం ప్రయాణం; ఏంచేస్తాం మరి? రేపు చాలామంది ఇవెంక్‌లు గూడా బయల్దేరుతున్నారని చెప్పాడు నికితా. అందరి దారీ ఒకటేగా; వాళ్లూ చేయగలిగిన సాయంచేస్తారు."

ఏదో వొక విధంగా ప్రయాణం మాన్పించాలని మార్ఫా సంకల్పం. "ఇకీమంచు ఎప్పుడు కరిగినా కరగొచ్చు; దుప్పులు కాళ్లువేసి తీసేలోపుగానే కరిగిపోవొచ్చు. మెడబంటి దాకా దిగబడిపోతారు మీరూ మంచులో. కాళ్లు నేల నానవు. మంచూ, నీరూ........"

"ఏం పర్వాలేదు. ఎలాగోలా గట్టెక్కుతాంలే. మిగతా వాళ్ళకి లేని యిబ్బంది మాకేనా యిక!"

"మిగతావాళ్ళ సంగతి వేరు. వాళ్ళకలవాట్లు. మరీ పరకరాలు? అందులో మీ పరికరాలన్నీ వూరికే పగిలిపోయేవి."

"పరికరాలన్నీ జాగ్రత్తగా పాక్చేద్దాం. ఇక్కడ కొన్ని తుత్తునాగం డబ్బాలు చూశాను. వాటిల్లో పెడదాం పరికరాలన్నీ. మూతలు అంటించేదాం, తేమ వెళ్లకుండా. మా పరికరాలేమంత బరువుండవు. ఏదైనా పదికిలో గ్రాములకంటే ఎక్కువ బరువుండదు. అవసరమైతే, మా భుజాలమీద వేసుకుని

మేమే మొయ్యగలం. నికీతా, నేనూ కలిసి యెంతదూరమైనా పట్టుకెళ్ళగలం."

మర్నాడుదయం, పెందలకాడే, వూళ్ళో వాళ్ళంతా, పెద్దా చిన్నా అంతా, స్కూలు దగ్గర గుమిగూడారు. ఇవెంక్లూ, యకూత్లూ కూడా దుప్పులు తోలుకొచ్చేశారు. డాక్టర్ దారీ, ఇవెంక్ల దారీ ఒకటిగాదు. కొద్దిదూరం మాత్రమే కలుస్తాయి వాళ్ళ దారులు.

పొద్దెప్పుడే పొడిచింది. తైగా ప్రాంతమంతటానూ, పర్వత శిఖరాల మీదా గులాబీరంగు; పొగగొట్టాల్లోంచి పైకి లేచే పొగకూడా గులాబి రంగుగానే వుంది. చల్లటిగాలి దూసుకొస్తోంది తూర్పు దిక్కునుంచి. కాళ్ళక్రింద మంచు యిదివరకటి కంటే ఎక్కువగా చప్పుడు చేస్తోంది. గుడారాల చూరుల చివర మంచు బంతులు బంతులుగా వేళ్లాడుతోంది.

చూరుల చివరల మంచుబంతులు చూచి, "ఫర్వాలేదనుకుంటా. ఎట్లాగోట్లా చేరుకోలేక పోతామా?" అని ధైర్యం చెప్పుకున్నాడు ఇవాన్; గాలికి ఎగిరిపోయే పొగవంక చూచి, "ఛీ, ఛండాలపు గాలి!" అనుకున్నాడు.

రెండు చేతులతోనూ, డాక్టర్ చేయిపట్టుకుని, "మీరెళ్లిపోతున్నారంటే, చాలా విచారంగా వుంది. నాకేగాదు, యిక్కడున్న వాళ్ళందరికీ అలాగే వుంది. ఇక్కడే వుండిపోగూడదా మీరు? తేలికగుండా వుంటుంది గదా మని." అందిమార్ఫా.

ఉధఖాన్ జిల్లా సోవియెట్ నుంచి, జిల్లాపార్టీ కమిటీ నుంచి వచ్చిన వాళ్లనేకమంది డాక్టర్ తో కరచాలనం చేశారు;

వెళ్ళిపోతున్నందుకు విచారం వెలిబుచ్చారు. ఆత్మీయుల నొదిలి వెళ్తున్నట్టుంది డాక్టర్ కీనీ. కాని తాను కామెనుష్కా వెళ్ళక తప్పదు. అక్కడ అలెగ్జీ కూర్చునున్నాడు తనకోసం దారులు చూస్తూ. 'గంటలు లెక్క పెట్టుకుంటూన్నాడు' అని వ్రాశాడు డెనిస్. వెళ్ళి అలెగ్జీని చూచేవరకూ మనశ్శాంతి వుండదు.

వేటగాళ్లూ, జాలర్లూ, సమిష్టి క్షేత్రం రైతులూ చాలా మంది వచ్చారు ఇవాన్‌కు వీడ్కోలివ్వడానికి. తీసికెళ్ళి, వాళ్లు వాళ్లు తెచ్చిన బహుమతులు చూపించారు. చేపలు, మంచు దుప్పుల నాలుకలు, అల్లికపని చేసిన ఉన్ని బూట్లు, ఉన్ని మేజోళ్లు విలువైన చర్మాలు, రంగురంగుల చర్మాలు....గుట్టలు గుట్టలుగా పడివున్నై. అవన్నీ చూశాడు ఇవాన్. సంతోషించాడు. అందరికీ అవి తీసుకొచ్చినందుకు కృతజ్ఞత తెలియజేశాడు. కాని బహుమతులు స్వీకరించనని నిరాకరించాడు. ఒక్కటి గూడా ముట్టుకోలేదు.

"ధన్యవాదాలు !" అన్నాడు.

"ధన్యవాదాలు!" అంటూ మారుమ్రోగింది జనకంఠం.

చెవులదాకా ఉన్నివస్త్రాలు దిగేసుకున్న యకూత్ యువకుడొకతను పరుగెత్తుకొచ్చాడు, ఇవాన్ దగ్గరికి. అతని చేతుల్లో బాగా బొచ్చున్న వెండినక్క వుంది.

"ఇది తీసుకో డాక్టర్. మీరంటే మాకు చాలా గౌరవం. బహు గౌరవం. మీ ఆవిడకి. మీ భార్యకి.

"నాకు భార్యలేదు" అన్నాడు ఇవాన్ స్పష్టంగా.

"లేకపోతే వస్తుంది. భార్యలేకుండా బ్రతకలేం."

కోటు జేబులో కానక్కాని కుక్కి, ఇవాన్ స్లెడ్జ్ వెదకే

పరుగెత్తాడా యువకుడు; అది కాకపోతే మానె, యింకొక బహుమానమైనా స్వీకరించమని ప్రతిమాలుతూ.

"చాలా గౌరవం, డాక్టర్! బహుగౌరవం! మమ్మల్ని నొప్పించడం ఎందుకు డాక్టర్! తీసుకో డాక్టర్!"

తీరా చూస్తే చేతిలో పెన్సిల్ పెట్టెలాంటి దంతపు వస్తువుంది. చక్కగా చెక్కిన దంతం.

"వెళ్లొస్తాను, దగోర్!" అన్నాడు ఇవాన్, ఆ యువకుడితో కరచాలనం చేసి; "వెళ్లొస్తాను!" అని చేయూపాడు అందరివంకా చూస్తూ.

పెద్దా, చిన్నా అంతా కలిసి చేతులూపారు, డాక్టర్ ఇవాన్ ఇవానొవిచ్‌కి వీడ్కోలిచ్చి సాగనంపుతూ.

"క్షేమంగా వెళ్లిరా, నేస్తం! క్షేమంగా వెళ్లు!" అన్న కేకల్తో ఆ పరిసరం అంతా ప్రతిధ్వనించిపోయింది.

## 53

జిల్లా సోవియెట్ సమావేశం జరుగుతోంది. కామెనుష్కాకు గూడా వచ్చింది వసంతం; తెల్లని సూర్యకాంతి కిటికీలోంచి వొచ్చి, వార్యా వీపుమీదా, నున్నగా దువ్వకున్న ఆవిడ తలమీదా పడుతోంది. మిగతా అందరి ప్రతినిధుల్తోబాటు పొడుగాటి బల్ల దగ్గర కూర్చునుంది వార్యా. ఆ బల్లమీద వసంత కాలపు పచ్చిక రంగు దుప్పటి పరచారు. అధ్యక్షుని ఉపన్యాసం అతిశ్రద్ధగా విన్నది వార్యా. ఆవిడగూడా ఉపన్యసించాలిప్పుడు; జీవిత పరిస్థితుల్ని, సాంస్కృతిక కార్యకలాపాల్ని మెరుగుపరిచే పథకాల్ని గురించి.

ఈ పథకాలన్నిటిని గురించీ క్రిందటేడే చర్చించారు. అప్పుడా పథకాల్లో వేటిని స్థానికంగా డబ్బిచ్చి అమలు జెయ్యాలి, వేటికి కేంద్ర ప్రభుత్వం సాహాయ్యం తీసుకోవాలనే విషయాలన్నీ నిర్ణయించుకున్నారు. తర్వాత ప్రాంతీయ సోవియెట్ స్థానికంగా యివ్వవలసిన డబ్బును గురించొక తీర్మానం చేశింది; సుప్రీమ్ సోవియెట్, కేంద్రంయిచ్చే డబ్బును కేటాయించింది. ఇప్పుడీ సమావేశంలో, ఆ డబ్బు నెలా, ఎక్కడ, ఎప్పుడు వినియోగించాలని చర్చిస్తున్నారు. ఈ ప్రాంతంలో మారుమూలలనుంచీ కామెనుష్కాకి తారురోడ్లు వెయ్యాలి, సమిష్టిక్షేత్రానికొక విద్యుత్కేంద్రాన్ని నిర్మించాలి, ఆరు బాలలకేంద్రాలేర్పాటు చెయ్యాలి; ప్రభుత్వక్షేత్రం దగ్గరొక పెద్ద స్నానాల భవనం, హాస్టల్ సౌకర్యాలతో రెండు స్కూళ్లు, హాస్పిటల్ నింకా పెంచాలి; ఇంకో సర్జికల్ వార్డు కట్టాలి. ఈ చివరి పథకం అంటే వార్యాకి ప్రాణం.

హాస్పిటల్ కి కొత్తవార్డు కట్టించే బాధ్యత గనుల డైరెక్టర్ ప్ర్యాఖిన్ కప్పగించారు. కొత్త భవనాలని కట్టించడానికతను వ్యతిరేకి; అందువల్ల అనవసరంగా జాప్యం చేస్తోంది. క్రిందటేడే కోపం వచ్చింది వార్యాకి, ప్ర్యాఖిన్ ఆపని జెయ్యకుండా వాయిదాలు వెయ్యడం ప్రారంభించేసరికి.

"ఊరికే శుష్కవాగ్దానాలు చేస్తే ప్రయోజనం ఏమిటి?" అనడిగింది ప్ర్యాఖిన్ ని; "చెయ్యనని చెప్పరు. చేస్తాం, చేస్తాం అంటూనే వుంటారు. ఫలానా అప్పుడు చేస్తామనో, ప్రారంభిస్తామనో నిర్ధారణచేసి చెప్పరు. ఎందుకొచ్చిన ముసుగులో గుద్దులాటయిది?"

ఆవిడ మాటలు విని, ప్ర్యాఖిన్ కోపం గూడా తెచ్చుకో

లేదు; ఒక చిన్న చిరునవ్వు విసిరి వూరుకున్నాడు. ఈచిన్నపిల్ల-సోవియెట్‌కి ప్రతినిధిగా ఎన్నికైనా చిన్నపిల్ల చిన్నపిల్లే గదా-మాటలకి ప్రాముఖ్యం యిచ్చి, సమాధానం యివ్వడం తన హోదాకే లోటని అనుకున్నట్టు, జవాబివ్వకుండా వూరుకున్నాడు.

హాస్పిటల్‌కి కొత్తవార్డు కలిపేందుకయ్యే ఖర్చుని కేంద్రబడ్జెట్‌లోనే కేటాయించారు.

జిల్లా సోవియెట్ అధ్యక్షుడి వుపన్యాసాన్ని అతిశ్రద్ధగా విన్నది వార్యా. ఈ అధ్యక్షుణ్ణి గురించి యకూత్‌లు పాటలు కట్టారనీ, కథలు కథలుగా చెప్పుకుంటారనీ అన్నాడు తావ్‌రోవ్. మనిషి బాగా ఆజానుబాహువు. ఆరడుగులపైచిల్లర వుంటారు. కాని పోలికలు అతి సుకుమారమైన పోలికలు. అంత మృదువైన చర్మంమీద గూడా, వసంతకాలపు యెండవల్ల ఏమీ మచ్చలేర్పడలేదు. కోపం వచ్చినప్పుడు మరీ నెమ్మదిగా మాట్లాడ్తాడు, తన అధికారాన్నీ శక్తిసామర్థ్యాల్నీ అంత గట్టిగా ఎందుకు నొక్కి చెప్పాలా అన్నట్టు. అంచేత అందరూ ఆయన్ని 'నిండుకుండ' అంటారు. కాని ఆ నిండుకుండ నెమ్మదిగా మాట్లాడితే చాలు, ఎక్కడివాళ్ళక్కడ వణికిపోతారు. బంగారు గనుల్లో కొత్తప్రసూతి చికిత్సాలయం వొకటి ఏర్పాటు చెయ్యాలని కోరినప్పుడు, మాస్కోలోనూ, ఉకమేచాన్‌లో వున్న వాళ్ళు గూడా యీ అధ్యక్షుడిలాంటి నిండుకుండలే.

"ఇలాంటి అవసరసమస్యని తేలికగా తోసిపారవెయ్యడానికి వీల్లేదు" అన్నారు వాళ్ళు; "కామెనుష్కా స్త్రీలంత మంది పిల్లల్ని కనగలుగుతూన్నందుకు మనం సంతోషించాలి. [illegible]; [illegible] స్త్రీ[illegible] [illegible] వదిలి,

ఆధునిక డాక్టర్లని నమ్మి, ఆధునిక చికిత్సావిధానాల్లో విశ్వాసం వుంచి, ప్రసూతి చికిత్సాలయాల కొస్తున్నారంటే మనం సంతోషించాలి. వాళ్ళకొక చక్కని, వెచ్చని భవనం కట్టి యివ్వడం మన బాధ్యత. ప్రస్తుతం వున్న శస్త్రచికిత్సా విభాగాన్ని ప్రసూతికేంద్రంగా మార్చి, శస్త్రచికిత్సకి మరిన్ని ఆధునిక పరికరాలున్న మరోమంచి సర్జికల్ వార్డును నిర్మించడం మంచిది. అక్కడి ప్రజలు కష్టజీవులు. యీ మార్పులు చెయ్యడం అంటే ఆ కష్టజీవుల శ్రమని గుర్తించి, వారికి తగిన సౌకర్యాలు చేయడమన్న మాట."

'ఈ కబురువింటే ఇవాన్ ఇవానొవిచ్ చాలా సంతోషిస్తారు.' అనుకుంది వార్యా.

మళ్ళీ ఆయన తిరిగివస్తాడనీ; మళ్ళీ ఆయన్ని రోజూ చూస్తూ, ఆయనతో కలిసిమెలిసి పనిజేసే అవకాశం కలుగుతుందనీ వూహించుకుని చాలా వుత్సాహపడింది వార్యా. ఏదో బలమైన వైన్ తాగినట్టు.

దీనికితోడు వసంతకాలపు ఎండ. ఎటుచూచినా బంగారు కాంతి. పరమానందంగా వుంది. కాని యీ గదిలో చాలా అవసరమైన సమస్యల్ని గురించి చర్చ సాగుతోంది. ఈలాంటి చర్చలు జరిగే సమయంలో తానింత ఆనందంగా వుండడం ఏమిటూ అని ఎవరైనా విస్తుపోతారేమోనని వార్యా భయం. చుట్టూ చూచింది. అధ్యక్షుని బల్లదగ్గర తన కెదురుగా కూర్చున్నాడు లొగునోవ్. ఇద్దరిచూపులూ కలిశాయి, అతనావిడ ఆనందాన్ని పసిగట్టినట్టే వున్నాడు. కొద్దిగా, పెదవుల చివరలు కదిలేట్టు, నవ్వింది వార్యా. ఆ నవ్వుకు వేరే అర్థం ఏమీలేదు. తనెంత ఆనందం [illegible]

లాంటిది. అమాయికమైన నవ్వు. కావాలని నవ్విన నవ్వు కాదు. కాని లోగునోవ్ బుగ్గలెర్రబడినై, ఆ నవ్వును చూచి; ఆవిడ వంకే చూస్తూ కూర్చున్నాడు. అది చూచేప్పటికి, యిదేమిటా అనుకుంది వార్యా; ఆవిడబుగ్గలూ ఎర్రబడినై.

# 54

సూర్యుడి వేడితో దారిలోమంచు నున్నబడింది. ఆ మంచుమీద చిన్నిచిన్ని చెప్పుల గుర్తులు చూచుకుంటూ ముందుకు నడిచాడు లోగునోవ్. సమావేశం జరుగుతూన్నప్పుడావిడ విసరిన చూపూ, నవ్వినవ్వూ మననం చేసుకుంటున్నాడు. ఆ చూపుకూ, ఆ నవ్వుకూ ఏమిటి అర్థం? తానంటే ఆవిడ అభిప్రాయం మారిందనడానికి గుర్తు కాదుగద! తర్వాత వార్యా ఉపన్యాసం వింటూంటే, అతనికి మరీ ఆనందం వేసింది. బాగా అనుభవంవున్న వక్తల్లాగా, తనమాటలు తానే వింటూన్నట్టూ కన్పించలేదు ఆవిడ; అలా కాదని, మరీ అనుభవం లేనిదానిలాగా బిడియమూ పడలేదు. ప్రేక్షకులందరూ మంత్రముగ్ధుల్లా విన్నారావుపన్యాసం; ఉపన్యాసం ముగించగానే చెవులు గింగురు మనేట్టు కొట్టారు చప్పట్లు. ఉపన్యాసం ముగించి కుర్చీలో కూర్చొన్న తర్వాత, ఒక్కసారిగూడా లోగునోవ్ వైపుకు కన్నెత్తి చూడలేదు వార్యా; ఇకావిడ భావాల్ని అంచనా వేసుకోవడం ఎట్లా?

ఆవిడ అడుగుల జాడలు చూచుకుంటూ, రోడ్డుమీది కెళ్ళాడు లోగునోవ్. ఇక్కడనుంచీ ఆ అడుగుల జాడలు కన్పించే అవకాశం లేదు. రోడ్డునిండా అడుగులే. స్లెడ్జ్ బళ్ళ గుర్తులు. కామెనుష్కా నదివొడ్డునే బడిపోతుందిరోడ్డు.

తైగా ప్రాంతంలోకి. వార్యా ఎటువెళ్ళినట్టు? నదివొడ్డు కెళ్ళినట్టా? అటు బంగారపు గనులకేసి వెళ్ళినట్టా? కాస్సే పారోడ్డుమీద అక్కడే ఆగి ఆలోచించాడు లొగునోవ్. తనతో మాట్లాడాలని అనుకుంటే, తాను కొద్దిమంది ప్రతినిధుల్తో నాలుగుమాటలు మాట్లాడి వచ్చేప్పటికే, వెళ్ళిపోతుందా ఆగకుండా? తనకా అడుగులజాడలు మట్టుకే వదలి వెళ్ళిపోతుందా? బంగారు గనులవేపుకు మళ్ళాడు లొగునోవ్.

అప్పటికే చాలాదూరం వెళ్ళిపోయింది వార్యా. జిల్లా సోవియట్ సమావేశంలోంచి బయటకొచ్చింతర్వాత కాస్సేపు, మే మాసం మహిమను చూస్తూ నిలబడి పోయింది. చక్కని సూర్యకాంతిలో స్నానం చేస్తోంది లోకం అంతా. పైని నీలాకాశం; క్రింద ఎండపడి తెల్లగా మెరిసిపోతున్న మంచు. ఓహో, వసంతం! వసంతమంటే యిదే. అక్కడినుంచి రోడ్డు వెంటే నడచింది నెమ్మదిగా.

ఇరువైపులా చెట్లు. తడితడి కొమ్మలనుంచి తల దిమ్మెక్కించే కమ్మని వాసన. మంచులో కూరుకుపోయిన పొదలమీదిమంచు నున్ననై పోవడం మూలాన అవి వున్నంత మట్టుకు హద్దుపెట్టినట్టు కన్పిస్తోంది. ఇకామంచు ఏక్షణానైనా క్రిందపడిపోవచ్చు నన్నట్టుంది; మళ్ళీ ఆ పొదలు చిరుగాలిలో తలలూపుతై. కట్టల నడుమ నది, లోతుగా, యింకా నిద్ర పోతూనే వుంది; నదిమీది మంచు యిప్పుడప్పుడే కరిగే చిహ్నాలేమీలేవు. ఆదారినేబడి, ఇవాన్ ఇవానొవిచ్ ని మోసుకొచ్చే బళ్ళిక యెప్పుడొచ్చినా రావొచ్చు.

కరిగే మంచుగట్లమధ్యా పారే సెలయేటిలా, పాట పాడడం ప్రారంభించింది వార్యా మెల్లమెల్లగా. అలాగే.

దారివెంటే నడుస్తోంది. వరుసగా ఇరవైనాలుగు గంటల డ్యూటీ చేసిందివ్వాళ; ఇక రెండురోజులవరకూ శలవు. ఆపరేషన్‌గదినుంచి ఆవిణ్ణి తొలగించి, యింకో నర్సుని పెట్టుకున్నాడు గూసేవ్. ఐనా విచారించలేదు వార్యా: అతనితో పనిజెయ్యడ మంటేనే అయిష్టం; ఊరికే భయపడి పోతాడు; అందించిన ప్రతిపరికరాన్నీ అవమానకరంగా పరీక్షిస్తాడు. అంతకంటే, అనుభవం లేకపోయినా, సెర్గుతోవ్‌తో పనిజెయ్యడమంటేనే యిష్టం. ఇక, ఇవాన్ ఇవానొవిచ్‌తో పనిజెయ్యడమంటే చెప్పే అవసరమేలేదు; బ్రహ్మానందం! ఇవాన్ ఇవానొవిచ్ ఎప్పుడొస్తాడా, ఆయనకు ఎసిస్టెంట్‌గా ఎప్పుడు పనిజెయ్యడాని కవకాశం కలుగుతుందా అని వువిళ్ళూరుతోంది.

ఇంతలో స్లెడ్జిబళ్ళు తప్పుకున్నై వార్యాని. బళ్ళకు కట్టిన లేళ్లు బక్కపలచగా వున్నై. బళ్ళనిండా యిళ్ళసామాను. మడిచిన గుడారంమీద అప్పుడే పుట్టిన రెండులేడిపిల్లలు పండుకుని వున్నై.

"కాప్పే!" అంది వార్యా, చేతుల్తో కమల్ని సూర్యరశ్మినుంచి కాపాడుకుంటూనూ, చిరునవ్వు నవ్వుతూనూ.

"కాప్సే!" అన్నది బండిలో కూర్చున్న ఒక యకూత్; ఒడిలో ఒకపసిగుడ్డు కూడా వున్నట్టున్నది. "కొత్తకబుర్లేమిటో చెప్పు!"

"మాయింటికి రండి చుట్టంగా!" అనన్నది ఇంకో ఆవిడ, వార్యా విలువైన దుస్తులుచూచి విస్తుపోతూ.

క్రమక్రమంగా స్లెడ్జిబళ్ళన్నీ నెమ్మదినెమ్మదిగా ఆగిపోయినై. "ఆ ఇళ్ళల్లో వున్నవాళ్ళందరూ దూరప్రాంతం

నుంచి వచ్చినవాళ్లే. సమిష్టిక్షేత్రం రైతులు. మంచుకరక్క ముందే కావలసిన వస్తువులన్నీ కొనుక్కెళ్దామని వొచ్చారు బంగారుగనుల దగ్గరకి.

"ఏమమ్మో! ఏవూరుమీది?" అనడిగాడొక యకూత్, వార్యాని. మధ్యవయసు మనిషి. దొడ్డికాళ్లు, నల్లద్దాల కళ్ళజోడు పెట్టుకున్నాడు. లేళ్లని కట్టేశి, పైప్ బయటికి తీశాడు వెలిగించుకోడానికి.

వార్యా చెప్పింది. వెళ్లి అప్పుడేపుట్టిన లేడిపిల్లల ప్రక్కన కూర్చుంది, వాటిపట్టుచెవులూ, ఉన్ని వెన్నూ నిమురుతూ.

"రా; వొచ్చి మాతో వుండుగాని" అన్నాడు ఒక యకూత్ పడుచుకుర్రాడు నవ్వుతూ; "పైనుంచి కిందదాకా వెచ్చటి ఉన్నివస్త్రాలు కప్పుతా. నీకు; మా వూళ్లో కావలశినన్ని ఆటపాటలు. అందరూ కామ్సొమోల్ సభ్యులే. అక్కడే ఎవరో ఒక మొగుణ్ణిచూచి పెళ్ళి చేశేస్తాం. ఐనా ఎవరోన్ని వెదకడం ఎందుకూ? నేను చాలనూ!" అంటూ చూశాడు వార్యావంక; వార్యా చూపులు చూచి సిగ్గుపడిపోయాడు.

'ఇదేమిటి; ఇలా చూస్తుంది మగవాడివంక యీ ఆడది. కుండెడు చన్నీళ్లుతీసి ముహంమీద కొట్టినట్టు!' ఐనా, ఆ అందంచూస్తూ అలాగే వుండిపోయాడు; కనులు తిప్పలేదు.

"రా, మాతోపాటు" అన్నాడు మళ్ళీ. ఈసారి నిజంగానే.

"ఇంత తెలివితక్కువవాడివేం నువ్వు? మరీ యింత తెలివితక్కువా!" అంటూ ఏత్తిపొడిచింది వార్యా; కాని

ఆ కనుల్లో ఆ చిలిపితనం పోలేదు, ఆ చురుకలాగే వుంది. ఆ చూపులో చురుకును చూచే యిందాక లొగునోవ్ తబ్బిబ్బైపోయింది. "నేనెవరినో, ఎలాంటిదాన్నో తెలియకుండానే నా యీ బాసలూ, ప్రీతినలూనూ? నాకిదివరకే పెళ్ళైపోతే?"

"ఆఁ నీకు పెళ్ళపడమేమిటి! నాకు తెలియదూ? నీకింకా పెళ్ళికాలేదని కనపడుతూనే వుంది. ఆ తాజాతాజా వొళ్ళూ, ఆ చక్కని చూపులూ. పెళ్ళైన ఆడవాళ్ళు నీకుమల్లే వుండరు."

"మీరుండేచోట కబుర్లేమిటో చెప్పు" అనడిగింది వార్యా, మాటలుమార్చి; ఒకచేతితో, ఆలేడిపిల్లల్ని నిమురుతూ అక్కడే కూర్చుని.

"ఇప్పుడు మేం ఇదివరకటి మల్లేగాదు. పూళ్ళుకట్టుకున్నాం." అన్నాడా పడుచుకుర్రాడు, యికలాభం లేదులెమ్మనుకుని; "ఇదివరకంటే చిన్నచిన్న దేరాలు. దేరాకీ దేరాకీ ఒకకిలోమీటరుదూరం. అలాంటి కొన్ని దేరాలు కలిస్తే ఒకూరు. ఇంకొక యాభయ్యో, వందో కిలోమీటర్లెళితే యింకొకూరు. అదంతా కలిపితే ఒక జిల్లా. ఇప్పుడలాకాదు. మాసమిష్టిక్షేత్రం వాళ్ళం అంతాకలిసి, ఒక పెద్దవూరు కడుతున్నాం యిప్పుడు. అన్ని పక్కా యిళ్ళన్నమాట. తొందర్లోనే ఎలెక్ట్రిసిటీ గూడా వస్తుందంటున్నారు. ఓ, మాకేం, బలేబావున్నాం." మళ్ళీ ఆవిడకనుల నందుకోవాలని చూశాడు.

వార్యా చూపటులేదు; దూరంగా శూన్యంలోకి చూస్తోంది.

"ఔనౌను. నాకూ తెలుసు. తొందర్లోనే వస్తుంది మీకు ఎలెక్ట్రిసిటీ" అంది. అని, ఒకనవ్వు నవ్వి, లేడిపిల్లని

హృదయానికి హత్తుకుని, ఒకముద్దు పెట్టి, స్లెడ్జ్ బండి మీద నుంచి దూకి, బంగారపు గనులవైపుకు పరుగెత్తింది. పరుగెత్తుతూ పరుగెత్తుతూ వెనక్కి తిరిగి, చేతి మేజోడు వూపింది పైకీ, క్రిందికీ.

ఆ పడుచుకుర్రాడు తప్ప, అంతా తిరిగి తమ చేతుల్లో వున్న రుమాళ్లూపారు. అలాగే కదలకుండా మెదలకుండా చూస్తూ నిలబడిపోయాడతను.

బంగారపుగనుల దగ్గరికెళ్ళింతర్వాత, మళ్లీ వెనక్కి తిరిగిచూచింది వార్యా. స్లెడ్జ్ బళ్ళు కన్పించలేదు; రోడ్డుమలుపులో మాయమైనట్లున్నై. కరిగేమంచు మీదపడి వెలిగిపోతూన్న సూర్యకాంతి! ఎందుకోగాని, ఆవిడ హృదయం కేరింతలు కొడుతోంది. మేనెలలో చూచిన మంచుదుప్పుల బళ్ళేనేమో అందుకు కారణం. పాతజీవితం గుర్తుకొచ్చింది. శీతాకాలమంతా పల్లపునేలల్లో గడిపేవారు యకూత్‌లు. ఆ పల్లపునేలంతటా అక్కడక్కడా గడ్డివాములు. శీతాకాలం అతిచలిగా వుండేది; వచ్చిందంటే తొందరగా వెళ్ళేది కాదు. డేరాల్లో దేన్నిచూచినా. బట్టలూ, పాత్రలూ గూడా పేడకంపు. పక్కనే వుండేవి పశువులు. ఆ పశువుల పుచ్చుతోనూ, పేడతోనూ నానిపోయేది నేలంతా. మే మాసం వచ్చినతర్వాత గాని బయల్దేరేవారు కాదు యకూత్‌లు, పర్వత ప్రాంతాల పచ్చిక బయళ్ళలోకి. పశువులమందల్ని తోలుకుని, ఎడ్లబళ్ళ మీద బయల్దేరేవారు, బళ్ళనిండా సరంజామా వేసుకుని. చలికాలం ఖైదు తప్పిందిగదా అని ఆనందంగా కబుర్లు చెప్పుకుంటూ బళ్ళపక్కనే నడిచేవారు మగవాళ్ళు; ఆడవాళ్ళు బళ్ళమీద కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుకునే వాళ్ళు. జీవితం

అంటే యిదే అనిపించేది. సంవత్సరం మొత్తంలో యీ వసంత కాలం ఒక్కటే వాళ్ళకానందం కలిగించేది. నదులకొరదలు వస్తే, శీతాకాలంలో వాళ్ళు డేరాలేసుకున్న ప్రాంతం అంతా ఆ వరదలో మునిగిపోయేది.

అప్పటికీ యిప్పటికీ ఎంతభేదం! వార్యా అక్కణ్ణుంచి ఆ పరిసరాల్నుంచి వొచ్చేశి చాలాకాలమైంది. ఇప్పుడు తనకి ఇరవై మూడేళ్లు. ఇప్పుడంటే, నిన్ననో మొన్ననో తాను పెద్దదైనట్టూ, బ్రదుకంతా ముందే వున్నట్టూ అనిపిస్తోంది. కాని తన పసితనంలో, అప్పటికే నూరేళ్ళు సిండినట్టుండేది.

# 55

ఇంటి దగ్గరెవ్వరూ లేరు. సర్వాంతర్యామి సూర్యుడు మాత్రం పంపుతున్నాడు కాంతిలోపలికి, కిటికీతలుపుల కంతల నుంచి. ఇప్పుడు కిటికీల కిదివరకటి మంచులేదు. లోపలికొచ్చిన సూర్యకాంతి గోడలమీదా, కప్పుమీదా కాంతి నాణాలు వేస్తోంది.

తలుపు తెరచి, కోటూ టోపీ వొంకెలకి తగిలిస్తూ, 'వచ్చింది వచ్చింది వసంతం! వసంతం' అనుకుంది వార్యా.

హృదయాన్నర్పించేస్తానన్న యకూత్ పడుచుకుర్రాడు గుర్తుకొచ్చి, మనసారా నవ్వుకుంది వార్యా; 'వొట్టి పిచ్చి వాడు!' అనుకుంది.

అల్మైరాలోంచి ఒక రొట్టెముక్క తీసి తింటూ తన గదిలోకెళ్లింది. అలసిపోయింది. ఐనా ఆనందంగా వుంది.

ఏచింతా లేదు. ఇక ముందు పుస్తకాలేసుకుని కూర్చోవచ్చును. ఇంతకంటే యింకేం కావాలి జీవితానికి !

దుస్తులు మార్చుకుని, ఉన్నిఅంచులున్న స్లిప్పర్స్ వేసుకుని, అద్దందగ్గర కెళ్ళింది. తలంతా చెరిగిపోయుంది. ఓల్గా దువ్వుకున్నట్టు దువ్వుకోవాలి తల అనుకుంది, ఎందుకనోగాని. అట్లాదువ్వుకుంటే బావుంటుందా ? వెంటనే జడలూడదీసుకుని, దువ్వుకోవడం ప్రారంభించింది, దువ్వెన చివళ్ళదాకా వెళ్లేందుకు జుత్తు ఎత్తిపట్టుకుని. జుత్తు వీపుమీదికి విసరేశి, తలాడించింది. ఏమిచేద్దామా దీన్ని అని యింకా ఆలోచించననైనా లేదు, ఎవరో తలుపు తట్టిన చప్పుడు; తలుపుతీసుకుని లోపలికొచ్చేశారు. ఆ అడుగుల చప్పుడును బట్టిచూస్తే, డెనిసూ కాదు; ఎలీనా కాదు. ఇంకెవరు ? మగవాళ్ళ అడుగులు. సుపరిచితమైన నడక.

చేతిలో దువ్వెన చేతిలోనే పట్టుకుని, గదిగుమ్మం తెర తొలగించి, తొంగిచూచింది, ఉత్సాహంగా.

"ఓహ్హో, లొగునోవ్ ! మీరేనా ?" అంది, ఉత్సాహం అంతా చల్లబడి.

జవాబు చెప్పకుండా, ఆవిడముహం అంతా వెదకి చూచాడతను. ఏమని చెబుతాడు ? ఔను; తనే లొగునోవ్. వింతప్రశ్న. మనిషలానిలబడి సూటిగా కనుల్లోకి చూస్తుంటే ఇంకా సమాధానం మాత్రం ఏముంటుంది వేరే ! వింత సమాధానం.

"ఎవరని అనుకున్నావ్ ?" అన్నాడు సందేహం సందేహంగా.

తనమనసులో ఆలోచనల సంగతి యితరుల కెందుకా అన్నట్టు, "ఎవరనీ అనుకోలేదు" అని చెప్పింది వార్యా; ఆవిడలో స్త్రీత్వం మేలుకుంటోంది.

ఆవిడపంక అలాగే చూస్తూ నించున్నాడు లొగునోవ్. వీపుమీదున్న జుత్తులో సగం భుజంమీదుగా ముందుకు తీసుకుని, జడ అల్లుకోవడం ప్రారంభించింది, నెమ్మదిగా. ఉన్నట్టుండి ముహం వికసించింది, చక్కని చిరునవ్వు అలముకుంది.

"వసంతం చాలా హాయిగా వుందికదూ !" అంది.

ఆ చిరునవ్వూ, ఆ మధురస్వరమూ గిలిగింతలు పెట్టినై అతన్ని.

"వార్యా" అంటూ ఒకడుగు ముందుకు వేశాడు.

"ఒద్దు, ప్లాటన్ ! వొద్దు." అంది వార్యా వెంటనే.

"ఐతే, నేను పొరపడ్డానన్నమాట? ఔనా ?" అన్నాడు నిస్పృహతో.

"పొరపాటా ?" అని అంది వార్యా, నిజంగానే, ఏమిటో తెలియక తికమక పడుతూ; "నేనేమైనా అన్నానా ? నేనేమైనా అన్నానా, మీరు పొరపాటుగా అర్థం చేసుకోడానికి ?"

లొగునోవ్ వెళ్ళిపోయింతర్వాత, వార్యా చాలా ఆందోళన పడింది ఇవాన్ ఇవానొవిచ్‌ని గురించి. "ఇంత ఆలస్యం ఎందుకైనట్టు?"

పనిలోంచి యింటికొచ్చింతర్వాత, డెనిస్‌ని అడిగింది: "వారికబుర్లేమీ తెలియలేదా ? నికీతా వుద్దేశం ఏమిటి ?

స్లెడ్జిబళ్ళు ఎప్పుడైనా ఎక్కడికైనా వెళ్ళిపోగలవులే అనా? ఖలేవాడికే అప్పగించాం డాక్టర్ని! ఇంకొక రెండురోజులిట్లా ఎండ కాసిందంటే చాలు, మంచుబురద. ఇకప్పుడు నడవడానికి గూడా వీలుండదు."

"నీకూ్కడా ఎందుకు వార్యా, యీ విచారం? నేను పడుతున్నాను, చాలదూ? ఫోన్ వచ్చిందని చెబితే చాలు, వణకు పుట్టుకొస్తోంది. ఫోన్కవతలివైపున అలెగ్జి. 'వచ్చారా?' రాలేదు, యింకా రాలేదు!' అదేప్రశ్న. అదేజవాబు. ఎందుకు చెప్పు నాకీశిక్ష? ఆ బాధ తగ్గడానికింత మందు పంప మంటే పంపగలను; ఇంకేం చెయ్యగలను చెప్పు. ఇంకా చాలా మంది రోగులున్నారనుకో ఆయన రాకకోసం ఎదురుచూస్తూ. వాళ్ళందరిదీ ఒకెత్తు, అలెగ్జిదొక్కడిదీ ఒకెత్తు. ఇరవైనాలుగ్గం టలూ అతన్నిగురించే ఆలోచన నాకు. ఏంచెయ్యను?" అంటూ అటూయిటూ తిరగడం మొదలెట్టాడు డెనిస్, ఏమీ తోచనట్టు; "ఇవ్వాళటువైపునుంచి ఒక ఇవెంక్ వచ్చాడు. వేసవి కాలందాకా అక్కడేవుండాలని డాక్టర్ ఇవాన్ అను కుంటున్నట్టు చెప్పాడతను."

వార్యా తెల్లబోయింది.

"వేసవికాలం దాకానా? అంటే, జులై నెలకి ముందు రారన్నమాట."

డెనిస్ మాట్లాడలేదు; చేయూపి వూరుకున్నాడు.

తనగదిలో కెళ్ళిపోయింది వార్యా. చదువుదామంటే బుద్ధిపోలేదు. 'నిజంగానే వేసవి వొచ్చేవరకూ అక్కడే వుం టారా?.... ఏమోలే, వుండడమే మంచిది!'

ఇంకొకగంటసేపు, అలాగే, ఆలోచనలతో బాధించుకుంది తన్ను తాను. తర్వాతొక తెల్లకాగితం తీసుకుని, సిరాబుడ్డి దగ్గరకి లాక్కుంది.

కామెనుష్కా,

మే 15, 1941.

"ప్రియమైన ఇవాన్ ఇవానొవిచ్,

'ఇక్కడ మీరులేందే, ఏమీ బాగోలేదు. ఇప్పుడు మాకు గూసేవ్ నేర్పుతున్నారు. ఆయనకి చాలా విసుగ్గావుంది; మాపీడ ఎప్పుడొదులుతుందా అని చూస్తున్నట్టున్నాడు; ఒక్కోసారసలాయన దేన్నిగురించి మాట్లాడుతున్నాడో, ఏమిచెబుతున్నాడో గూడ అర్థంగాదు మాకు. అంతకంటే, యింటిదగ్గర చదువుకుంటేనే ఎక్కువ తెలుసుకోవచ్చు, నేర్చుకోవచ్చు అనుకుంటున్నాం మేం; అలాగే చేస్తున్నాం కూడాను. నన్ను ఆపరేషన్ గదిలోంచి తీసేశి వార్డ్‌లో నర్స్‌గా వేశారు. నాకు చేతనైనపనంతా, ఏలోటూలేకుండా చేస్తున్నాను; మీకోసం ఎదురు చూస్తున్నాను, ఇవాన్ ఇవానొవిచ్.' (ఇంతవరకు వ్రాసింతర్వాత కలం తో ట్రుపడింది. నల్లని కన్నీటిలా ఒక పెద్దబిందువు పడింది కాగితంమీద. అద్దుడుకాగితంతో జాగ్రత్తగా అద్దింది వార్యా ఆ మచ్చని. మళ్ళీ ఉత్తరం వ్రాయడం ప్రారంభించింది ఆ మచ్చగూడా తన దస్తూరీలో భాగమైనట్టు.) 'కామెనుష్కాకి వసంతం వొచ్చేశింది. ఇప్పటికీ నావుద్దేశం మారలేదు; మీతోపాటు వస్తేనే బాగుండేది నేను; ఎందుకు రావద్దన్నారో యిప్పటికీ అర్థం గావడంలేదు.

మంచు కరిగేముందే, ఉఛఖాన్‌నుంచి మిమ్మల్ని నికీతా యిక్కడికి తీసుకురాగలడన్న నమ్మకంలేదు నాకు. రోడ్లమీదమంచు అప్పుడే నున్నజారిపోతోంది; స్లెడ్జ్ బళ్ళదారులప్పుడే లోతు పడిపోతున్నై.'

'ఇవ్వాళ సోవియెట్ సమావేశంలో, హాస్పిటల్‌కి కొత్తభవనాలు చేర్చడాన్ని గురించి చర్చించాం. పథకాన్నామోదించారు. ప్రస్తుతం వున్న భవనాన్ని వొదలడం కష్టమే, కాని కొత్తభవనాలింకా బాగుంటై. మీరు ఉఛఖాన్‌లో వేసవిదాకా వుండిపోతారని ఎవరో చెప్పారట డెనిస్‌కి; ఇప్పుడే చెప్పాడు నాతో. అలెగ్జీని గురించి మహా విచారపడుతున్నాడు డెనిస్. గూసేవ్ ఆపరేషన్ చెయ్యడాని కతను అంగీకరించడం లేదు; కాలు తీసేస్తాడేమోనని భయం. ఉఛఖాన్‌లో యిప్పటికే, చాలా కాలం వున్నట్టనిపించడం లేదా మీకు, ఇవాన్ ఇవానొవిచ్ ?'

— వార్వారా గొర్రిమోవా"

# 56

ఇల్లు. కామెనుష్కా. దున్నుతేసే ప్రతిఅడుగూ ఇవాన్ ఇవానొవిచ్‌ని యింటివైపుకీ, కామెనుష్కావైపుకీ యింకో కడుగు ముందుకు తీసుకెళ్తోంది.

ఇల్లు. ఆ మాటలో ఏదోనీచం, ఏదోస్వార్థం, ఏదో పరిహాసం, ఏదో యెత్తిపొడుపు, ఏదో విచారం, ఏదో దుగ్ధ, ఏదో కోపం.

ఛా. తాను బానిస కాదు!

దారికటూయిటూ వున్నచెట్లు పరుగెత్తు కొస్తున్నై ఇవాన్ ఇవానొవిచ్‌ని కలుసుకునేందుకు. దుబ్బులవెనక బల్లో స్తున్నై నున్నని మంచుమీద గాడిపెడుతూ. ఇవాన్ జీవితమూ అంతే: స్లెడ్జ్‌బండిలా వస్తోంది వెనకేపడి. చెడిపోయిన అంగాన్ని కోసిపారేశినట్టు జీవితాన్ని కోసి దూరంగా పారెయ్యలేం. అలా పారెయ్యాలనే వుద్దేశమూ లేదతనికి. అతని జీవితమంటే-అతనిచదువు, సంస్కారం, కృషి, ఓల్గాతో గడిపిన దివ్యమైన ఘడియలు. కొన్ని విషయాల వల్ల బాధ కలిగింది; కొన్ని విషయాలవల్ల సంతోషం కలిగింది; అవన్నీ కలిపిచూస్తేనేగాని అతనిజీవితం సంపూర్ణంకాదు. ఆ అన్నిటి మూలకందమే యీ ఇవాన్ ఇవానొవిచ్ అనేవ్యక్తి.

స్లెడ్జ్‌మీదినుంచి కిందికి దూకి, పలుపులు చేత్తో పట్టుకుని, బండిపక్కనే దగ్గరదగ్గరొక కిలోమీటర్ దాకా పరుగెత్తాడు. కాని ఇప్పుడలా పరుగెత్తేది వళ్లు వెచ్చజేసుకోడానికి కాదు, ఆలోచనలు తప్పించుకోడానికి.

మరీ చలిగా వున్నప్పుడు, ప్రయాణం రాత్రుళ్లు చేస్తున్నారు. పగలు దుప్పుల్ని మేతకొదిలి, అందరూ గుడారాల్లో నిద్రపోతున్నారు. పగటిపూట, గుడారం తలుపుతీస్తే చాలు, ప్రపంచం అంతా తెల్లనిమంటని కప్పుకుందా అన్నట్టుంటోంది. మంచలా మెరిసిపోతోంది ఎండపడి, ధగధగా. కన్నెత్తి చూస్తే కాలు, కళ్ళనిండా నీళ్లు కమ్ముకొస్తున్నై.

ఉచఖానేనుంచి బయలుదేరి నాలుగురోజులైన తర్వాత ఐదోనాడు చాలా వేడిగా వుంది. రాత్రిపూట గూడా మంచు పట్టలేదు. ఇకలాంటప్పుడు రాత్రిపూట ప్రయాణం చెయ్యడం

చేనికి. లాభంలేదు సరిగదా, ఆ చీకట్లో దారి తప్పినా తప్పొచ్చును.

తెల్లవారుఝామునే లేచి బయల్దేరారొకనాడు. కాస్త దూరం వెళ్ళారోలేదో, బళ్ళాగిపోయినై అడవిలో. ఇకక్కడ నుంచి, రోడ్డుక్రిందికి మైదానంలోకి దిగుతోంది. మంచు మరీ మెత్తబడిపోయింది. దుప్పులకాళ్ళు దిగబడి పోతున్నై.

"దారేం బాపుండలేదు" అంటూ వచ్చాడు నికీతా, ఇవాన్ దగ్గరికి. కోటు బొత్తాలు తీసేశాడు; టోపీ నెత్తి వెనక్కి లాక్కున్నాడు. నల్లకళ్ళజోడుపైన సుదురంతా చెమటపట్టింది. "నదిచిన్నది, ఒడ్డునదారి లేదు. అన్నీ చెట్లు. చెట్లమోాళ్ళు తగిలితే దుప్పులకి దెబ్బ. మాలో యిద్దరం ముం దెళ్ళి దారిచేస్తే బాపుంటుందేమో అనుకుంటే, ముసలాళ్ళు అందరం సమావేశమై మాట్లాడుకోవా. లంటున్నారు."

"మంచిదే. అలాగే. మాటాకుందాం, పట్టండి."

అదొక గొప్ప సమావేశం. లేత నీలాకాశంక్రింద; కళ్ళు చిరతలారే మంచుమీద. డాక్టర్ ఇవాన్ కూర్చున్న స్లెడ్జ్‌బండి చుట్టూ చేరారు అందరూ, పొగతాగుతూ. మంచుపంక చూస్తూ నిలబడ్డారు. నల్లటి కళ్ళద్దాల్లోంచి చూస్తే కాళ్ళకింది మంచు ముదురునీలంగా వుంది. వసంతం వచ్చినప్పుడుండే ఆనందం కన్పిస్తోంది వాళ్ళ ముహాల్లో; వసంతం వచ్చినప్పు డుండే ఆందోళన వ్యక్తమౌతోంది వాళ్ళ కనుల్లో. ఇవెంకోలు గూడా, యకూత్‌ల పక్కనే కూర్చున్నారు. ఎట్లాగోట్లా డాక్టర్ని బంగారపు గనులదగ్గరికి చేరవెయ్యాలి యకూత్‌లు. ముందా పెద్దనదిదగ్గరికి చేర్చాలాయన్ని. ఆ నదిమీద గడ్డకట్టిన మంచు, బంగారపు గనులకిరోడ్డు. అక్కడికెళ్ళడం ఎలా?

అదీపశ్రిశ్న. యకూత్‌లు వాళ్ళ బాధ్యతని నిర్వర్తించడానికి మనం సాయం చెయ్యాలి అని ఇవెంక్‌ల ఆలోచన. డాక్టర్ ఇవాన్, ఇవెంక్‌లకి గూడా చాలామందికి చికిత్సచేశాడు; సాయంజేశాడు. ఇప్పుడాయనకి సాయంజెయ్యడం ఇవెంక్‌ల వంతు.

"మనం కొండగుట్టలమీద చెయ్యాలి ప్రయాణం; అక్కడమంచు తక్కువగా వుంటుంది. రోడ్డుండదు, నిజమే; ఐనా అదేమంచిది. ఎంతసేపూ, పొద్దుగూకే వైపుకే ప్రయాణం చెయ్యాలి. తెల్లెద్దులకిమల్లే వుంటై రెండు కొండలు; అక్కడి దాకా అట్లాగే వెళ్ళాలి. తర్వాత అడ్డదారి. కెలుగిచ్ నది దాటింతర్వాత, ఉత్తరానికి తిరగాలి. అప్పుడుగాని వెళ్ళం అసలుదారి దగ్గరికి. దారిదగ్గరికే సుమా. అక్కడికింకా చాలా దూరం వుంటుంది దారి. రోడ్డులేని దారంట ప్రయాణం చెయ్యడమంటే కష్టమేమరి...." అన్నాడొక ముసలి ఇవెంక్. వాళ్ళందరిలోకి అనుభవం వున్నవాడతనే. పలచగా, లేడిలా వున్నాడు. చిరగిపోయిన లేడిచర్మం కప్పుకు కూర్చున్నాడు. ఆ నాలుగుమాటలు అని వూరుకున్నాడు. అతను చెప్పవలసిందింకా వుందని తెలుస్తూనే వుంది అందరికీ. ఇంకా యేంజెప్తాడో విందామని కూర్చున్నారు అందరూ ఏమీ మాట్లాడకుండా. కూర్చుని నాలుగుగుక్కలు పొగతాగాడతను.

మళ్ళీ డాక్టర్ ఇవాన్ వైపుకు తిరిగి, ముహంమీది ప్రీతిముడుతా కనబడేట్టు నవ్వాడు :

"మేం మీకు సాయంజేస్తాం. ఇక్కడే మకాంపెట్టి మా ఆడవాళ్ళనీ, పిల్లల్నీ, సామానుల్నీ యిక్కడే వదిలేశి, మీతో పాటొస్తాం. మీ స్లెడ్జీలు కదలాలంటే యకూత్‌లు మట్టుకే

వుం టేచాలదు; మేమూ వుండాలి సాయం జెయ్యడానికి.. దారంతా ఛండాలం. ఏంబాగుండదు." అన్నాడు.

అట్లాగేబయల్దేరినై స్లెడ్జ్‌బళ్ళు దారిలేని అడివినిబడి మొదటినాడొక ఇరవై కిలోమీటర్లెళ్ళారు. రెండోనాడు పద హారు. మూడోనాడెంత కష్టపడినా, పదికిలోమీటర్లెళ్ళేప్పటికే గగనమై పోయింది. ఉన్నకొద్దీ, దారి మరీ అధ్వాన్నంగా వుంది. ముందు నునుషు లెళ్ళి దారి తొక్కాల్సొచ్చింది.

ఇవాన్ ఇవానొవిచ్, నికీతా, మరికొందరూ, ఒకరి వెనకొకరు స్కీ దారినేబడి నడవవలశొచ్చింది. మంచు కింద నీరు. దారంతా మంచు బురద. స్లెడ్జ్ బళ్ళు నీళ్లల్లో యీదుతూ నడపవలశొచ్చింది.

"ఇకిప్పుడేంచేద్దాం ?" అన్నాడు ఇవాన్, నికీతాతో. నికీతాకిగూడా ఆందోళనగానే వుంది.

వెళ్లి కయూర్ లతో మాట్లాడొచ్చాడు నికీతా. "కొమ్మలు కొట్టి దారిలో పడెయ్యాలి."

ఒక్క నిమిషంగూడా ఆలస్యం చెయ్యకుండా, వెంటనే, కనబడిన కొమ్మలల్లా నరికెయ్యడం మొదలెట్టారు. నరికిన కొమ్మలు పట్టుకొచ్చి దారి పొడుగుతా పడేస్తున్నారు. పలుపులు పట్టుకుని లాగాలిశొస్తోంది దుప్పుల్ని.

"ఇంకా డెబ్బై కిలోమీటర్లన్నా వుంటుంది. పెద్దనది" అన్నాడు ఇవాన్. బళ్లు ముందుకు లాక్కుపోతున్నారు. ఇవెంక్‌లూ, యకూత్‌లూ ఎవరి భాషలో వాళ్లు పొలికేకలు పెట్టుకుంటూ.

ఆ నాలుగువందల మీటర్లూ దాటేప్పటికి మధ్యాహ్నమయింది. ఎండ మండిపోతోంది.

"చీకటి పడటానికి ముందలాంటి రోడ్డింకొకటి వెయ్యొచ్చు. మనం" అన్నాడు నికీతా; "అట్లాఐతే సాయంత్రానికా తెల్లెద్దుల కొండల దగ్గరకెళ్లిపోతాం అంటున్నారు ఇవెంక్‌లు. ఈ రాత్రి కక్కడ మకాం వేసి, ప్రొద్దున్నే లేచి అడ్డదారిని బడొచ్చు".

# 57

మర్నాడు పదహారు గంటలు విడవకుండా అందరూ కష్టపడితే, రెండు కిలోమీటర్లు మాత్రం వెళ్లగలిగారు. ఆ చిన్న నది, కెలుగిచ్ నది, పారే మైదానం అంతా మంచుమయం. మనుషులక్కడక్కడ గొంతుకబంటిదాకా దిగబడిపోయారు. నీళ్లలో నాని, స్లెడ్జీలు రెట్టింపుకిరెట్టి బరువెక్కినై. దుప్పులు పూర్తిగా అలసిపోయినై. సాయంత్రం అయ్యేప్పటికసలు ముందుకు అడుగు పడడమే కష్టమైపోయింది.

"ఇక మనం వెళ్లలేమనుకుంటా, నికీతా. నది పక్క రోడ్డుగూడా పనికి రాకుండా పోతుంది" అన్నాడు ఇవాన్, బొబ్బలెక్కిన చేతులు చూచుకుంటూ.

"బాగా నొప్పిగా వున్నవా చేతులు ?" అనడిగాడు నికీతా.

"నొప్పెడుతుదోంది నా చేతులు కాదు. నికీతా! నా మనసు. నా మనసు బాధపడుతోంది" అన్నాడు ఇవాన్, అందని కొమ్మమీది ఆకులు అందుకునేందుకు మెడ చాస్తూ

యాతన బడుతూన్న దుప్పివంక చూస్తూ. వెళ్ళి, ఆ కొమ్ము పట్టుకుని వంచాడు. దుప్పి నాలుగాకులు అందుకుంది. మెడ వంచి ఆకులు నములడం ప్రారంభించింది; ఆకులు నముల్తూంటే ముగ్గోళ్ళై గిరెగిరి పడుతున్నై. "అవసరమైనప్పుడెళ్ళి సాయం చెయ్యలేకపోతున్నానే అని నా బాధ" అన్నాడు ఇవాన్ మళ్ళీ.

"ఏప్రిల్ నెలాఖరుకి ఉఛఖాన్ కొచ్చిన రోగులకి చికిత్స చెయ్యకుండా బయల్దేరితే, ఎప్పుడో వెళ్ళిపోయేవాళ్ళం కామెను ష్కాకి." అన్నాడు నికీతా; "నేనప్పుడే చెప్పాను........"

"చెప్పావు, నిజమే." అంటూ అడ్డొచ్చాడు ఇవాన్; "ఇప్పుడవన్నీ అనుకుంటే ప్రయోజనం? ఒక పని చేస్తే.... ? ఈ స్లెడ్జీలని లాక్కుంటూ పోవడం దేనికి? వెళ్ళినకొద్దీ కష్టమే గదా."

"మరి నదిమీద? బళ్ళుంటే తొందరగా వెళ్ళిపోవొచ్చు ఆ మంచుమీద."

"మన ప్రయాణం యిట్లాగే సాగితే, యింకొక పది హేనురోజులైనా పడుతుంది నది దగ్గరకెళ్ళేప్పటికి; ఇకప్పుడు నదిమీద మంచెందుకుంటుంది?"

"ఒక నిమిషం ఆలోచించి, కయూర్ల దగ్గరకెళ్ళాడు నికీతా, వాళ్ళనిగూడా సంప్రదించి రావడానికి. వాళ్ళందరూ కలిసి మాట్లాడుకుంటున్నారు. మధ్యమధ్య రెండు మూడు తనకు తెలిసిన మాటలుగూడా వినిపించినై ఇవాన్‌కి.

స్లెడ్జీలొదిలేసి, బరువులు దుప్పుల మీదేశి, బయల్దేరితే నాలుగురోజుల్లో పెద్దనది దగ్గరకెళ్ళిపోగలం అంటున్నారు వాళ్ళు" అని చెప్పాడు నికీతా వచ్చి.

"చాలా తేడావుంది ఐతే. నాలుగు రోజులెక్కడ, పదిహేనురోజులెక్కడ!" అన్నాడు ఇవాన్; "అదృష్టం సరిగ్గా వుంటే, అక్కడికెళ్ళింతర్వాత, ఏవైనా స్లెడ్జీలు దొరికినా దొరకొచ్చును. లేకుంటే, మంచుపగిలి కరిగిందంతా శుభ్రమయ్యేదాకా ఆగవలశొస్తుంది మనం. బల్లాడదియ్యమని చెప్పు కయూర్ లకి. సంచులున్నై్నలే సామానులు కట్టడానికి."

చీకటి పడడానికింకా చాలా సైపుంది. అందరూ పని జెయ్యడం ప్రారంభించారు. చక్కని ప్రశాంత వాతావరణం; దారి పాడుదారై పోయింది గాని!........

ఐదవరోజు. అందరూ వొక పెద్ద మంచుగుట్టమీద కొచ్చారు. కళ్ళజోడుతీసి చుట్టూకలయ జూశాడు ఇవాన్ ఆశ్చర్యపోతూ. మంచు యిదివరకటంత తెల్లగా లేదు. తైగా ప్రాంతమంతటా మబ్బుపట్టినట్టుంది. మంచు మెత్తబడి పోయింది. దూరాన నది కన్పించింది, సున్నగా.

"అదుగో! యికదే పునరోడ్డు!" అన్నాడు నికితా ఉత్సాహంగా; "ఇకినల్లకళ్ళజోళ్ళగుండా చూసేపనిలేదు ప్రపంచాన్ని. అక్కడికెళ్తే మళ్ళీ తడిచి ముప్పందుమౌతాం. ఐనా పర్వాలేదు. అక్కడికెళ్ళి కాస్సేపు విశ్రాంతి తీసుకోవచ్చు."

పెద్దనదిదగ్గర స్లెడ్జిబళ్ళు కొన్ని కన్పించినై. కాస్త బాగుచేస్తే ప్రయాణానికి పనికివస్తై. కాని యిప్పటికే నదిలో మంచు నల్లబడిపోయింది. ఉబ్బుతోందిగూడాను. ఒక్కోసారి, జూన్ నెలలోగాని కరగడం ప్రారంభించదు. మంచుకరగడం ప్రారంభించడంతో తైగాప్రాంతం అంతా మారిపోయింది. పైనుంచి నునువెచ్చని గాలులు. మంచులోంచి బయటికి

పొడుచుకొచ్చే చెట్లమోళ్లు. ఉన్నట్టుండి ఆ చెట్లమీద తెల్లని మొగ్గలు. చూస్తూ చూస్తూండగానే ఆ తెల్లనిమొగ్గలు బంగారు రంగుకు తిరిగిపోతై. అడవంతా నల్లబడుతుంది; రాత్రుళ్ళు వెలుగెక్కుతై.

ఆవేళ రాత్రి యీాదురుగాలి. నది తిరగబడింది. నదిలో మంచుచేసే శబ్దంవిని, బూట్లూ రెండూ తీసుకు తొడుక్కుని, ఉన్ని కోటేసుకుని, బయటికి బయల్దేరాడు ఇవాన్. గాలి ముహం మీద కొడుతోంది, వసంతం మత్తుమోసుకొచ్చి.

కాస్పేపలాగే నిలబడిపోయాడు, కరిగే మంచువాసన పీలుస్తూ, చెమ్మగిలిన కొమ్మలవాసన పీలుస్తూ. ముందునది బుసలు కొడుతోంది: ఎనిమిది మూసాలనుంచి మంచుఖైదులో పడున్నదేమో, ఒక్కసారి సంకెళ్లు తెంచుకున్నట్టుంది శక్తి అంతా వుపయోగించి. దగ్గరే మలుపుదగ్గర దారి అడ్డంతగిలింది నదికి. పెద్దపెద్ద మంచుముక్కలు పేరుకుపోయినై ఆ మలుపు దగ్గర. అప్పటికప్పుడే మూడు మీటర్లదాకా పొంగిపోయింది నది; ఉన్నకొద్దీ మలుపుదగ్గర మంచుగుట్టలు పెరిగిపోతున్నై. గుట్టల సందుల్లోంచి బుసలుగొడుతూ దూకుతోంది నీరు. చివరికి నీటివొత్తిడి ఎక్కువై గుట్టలకి గుట్టలు గుభేలుమంటూ కూలిపోయినై. నది ఒక్క వుదుటన ముందుకు దూకింది, బ్రిహ్మాండమైన శక్తిలా.

'ఏమిశక్తి! ఎంతబలం, 'యెంతబలం!' అనుకున్నాడు ఇవాన్ ఆదృశ్యంచూస్తూ; 'బ్రిహ్మాండమైన శక్తి!'

ఉచఖాన్‌కి వెళ్తూన్నప్పుడు గడ్డకట్టుకున్ననది జలస్తంభంలా ఎలాలేచి నిలబడిందీ గుర్తుకొచ్చింది ఇవాన్‌కి. అంతవరకూ మంచు అడుగున వొత్తిడి పడుతున్ననీరు, వున్నట్టుండి,

నిటారుగా లేచి నిలబడింది వొళ్ళు విరుచుకుని. మీటరూ, మీటరు న్నరపున్న మంచు జెతికెలు లేచి చుట్టుపక్కలపున్న చెట్లసన్ని టినీ చీకాకు పరచేశినై; ధ్వంసంచేశేసినై.

'ఓల్గాకీ నాకూపున్న అనుబంధమూ అంతే' అనుకున్నాడు ఇవాన్; 'ఒత్తిడి పేరుకుపోయింది.........ఉండుండి ఒక్కసారి పేలిపోయింది.'

# 58

అంతా గడచి, ముందుకొచ్చాడిప్పుడు ఇవాన్; ఆ తైగా ప్రాంతమూ, తైగాలో ఆ వసంతమూ, ఆ మంచూ, ఆ అనాది జాతులూ.........అంతా. జూన్ నెల. వేడిగాపుంది.

నికీతా, ఇవాన్ ఇవానొవిచ్, యిద్దరూ కలిసి లారీ ప్రయాణం చేస్తున్నారు బంగారు గనులు చేరుకోడానికి. రోడ్డంతా దుమ్ము. రోడ్డుకటూయిటూపున్న చెట్లూ, పొదలూ, పచ్చికా బూడిదరంగు పడిపోయినై ఆదుమ్ము మూలాన. లారీ చక్రాల క్రిందనుంచి పొగలాగ లేస్తోంది దుమ్ము. ఇవాన్ ఇవానొవిచ్ మనసంతా, ఆ దుమ్ములాగానే, చీకాకు చీకాకుగా వుంది. వేడి, విచారం, దుఃఖం. డ్రైవర్ పక్కనే సీట్లో కూర్చునున్నాడు ఇవాన్. అక్కణ్ణుంచి లేచి, లారీ వెనకున్న మూటలమీద, నికీతా కూర్చున్నచోట కూర్చుందామనిపించింది. కాని, సీటు మారిస్తే మనసు మారుతుందా. ఎందుకులెమ్మని కూర్చున్నచోటే కూర్చున్నాడు.

......తా మెనుష్కానదీ ముఖందగ్గర దొరికిందిలారీ. అక్కడి

డాకా చిన్ననావెక్కి వచ్చారు నదిలోపడి; ముందు ఛాజ్మా నదిపాయవెంటా, తర్వాత-ఛాజ్మానది వెంట.

రోడ్డుమలుపు తిరిగింది. ముందున్న దృశ్యాన్ని చూడ గానే, మనసు కెలికినట్లయ్యింది ఇవాన్‌కి. తనహృదయం యింతగా కలతచెందుతుందని అనుకోలేదతను. జరిగిందేదో జరిగిపోయిందికదా, నిబ్బరంగా వుండగలను లెమ్మనుకున్నాడు. కాని గుండె కొట్టుకుంటోంది; మొహం తెల్లబోయింది. ఏదో మాట్లాడదామని ప్రక్కకి తిరిగిన లారీడ్రైవర్, మాట్లాడ్డం మానేశి, లారీ ఆపేశాడు.

"ఈ మలుపులూ, కుదుపూ మీకు పడినట్టులేదు. వికా రంగా వుందా?" అనడిగి, తలుపు తీయబోయాడు.

"లేదు. లేదేం ఫర్వాలేదు" అన్నాడు ఇవాన్ తన బల హీనతని చూసుకుని సిగ్గుపడిపోతూ; "ఒక్కక్షణం సేపు తిప్పి నట్టుందిగాని యిప్పుడు పర్వాలేదు, బాగానేవుంది."

పాతయిళ్ళచుటూ కొత్తగానాటిన తోటలు, గనిపని వాళ్లుండే రెండంతస్తుల యిళ్లు, పెద్ద క్లబ్‌భవనం, ఉన్నతాధి కారులుండే యిళ్లు, మధ్యమధ్య పచ్చపచ్చని చెట్లు,........ అన్నీదాటుతూ ముందుకు పోతోంది లారీ. ఉన్నకొద్దీ ఇవాన్ గుండెదడ హెచ్చుతోంది; ఎప్పుడు పగిలినా పగలొచ్చు ననిపిస్తోంది.

నదిమీద వంతెనదగ్గర ఆగింది లారీ. అక్కడేవున్నది బావి. ఆవేళ శావ్‌రోవ్‌ని కలుసుకున్నప్పుడు, తానూ ఓల్గా ఆబావి దగ్గరేవున్నారు. అప్పుడే బొక్కెనజారి నూతిలో పడిపోయింది. అప్పుడు ఓల్గా ఆప్యాయంగా కళ్లెత్తి తనవంకచూచిన చూపింకా గుర్తుంది ఇవాన్‌కి; అప్పుడు గోముగా, పేృమగా ఓల్గాఅన్న

మాటలు గుర్తున్నై. అప్పుడావిడ నిజంగానే మనస్ఫూర్తిగా ప్రేమిస్తోంది తనని! ఆవిడొచ్చిననాడు, యిదిగో, యీచెట్ల క్రిందనే నిలబడి, ముద్దుపెట్టుకున్నారు యిద్దరూనూ. చనిపోయినవాళ్ళని జ్ఞప్తికి తెచ్చుకున్నట్టుంది, ఇప్పుడవన్నీ తలచుకుంటూంటే. అదే వ్యథ. అదే విచారం; అదే నిస్పృహా. ఔనౌను! ఇప్పుడావిడ ఇక్కడేవుంది. ఈయిళ్ళలోనే ఒకయింట్లో నివశిస్తోంది. ఇదేగాలిని పీలుస్తోంది. ఇదివరకటిలాగానే మాట్లాడుతోంది, నవ్వుతోంది. కాని........ తనకు సంబంధించినంతవరకావిడ చనిపోయినదానికిందే జమ. ప్రక్కనలారీ వున్నదన్న సంగతి మరచిపోయాడు ఇవాన్. లారీలోవున్న సామానుని మరచిపోయాడు. నికీతాని మరచిపోయాడు. డ్రైవర్ని మరచిపోయాడు. నెమ్మదిగా, నదిమీది వంతెనమీదుగా నడిచాడు; ప్రక్కప్రక్కనే గడచినదినాల స్మృతులూ నడుస్తున్నై. ఇక్కడే, యీబెంచీమీదనే కూర్చుని మాట్లాడాడు ఓల్గాతో. ఆసంభాషణ యింకా బాగాగుర్తుంది. నాజీవితం అంతా ఎడారి కావడానికి బాధ్యతంతా మీది అనన్నది ఓల్గా, ఇక్కడే. నిజమేనా? ఆ బాధ్యతంతా తనదేనా? ఆవిడంటే వున్న అనుబంధభావాన్ని పోగొట్టుకున్నది తనేనా? ఐతే, యింకా ఆవిణ్ణీ తననీ ఏకంచెయ్యగల బంధనం యింకేముంటుంది గనుక?

పచ్చనిచెట్ల సందుల్లోంచి తలెత్తిచూశాడు తానుండే యింటివంక. అక్కడే ఆ వాలుమీదనే, నిలబడుంది ఖాళీయిల్లు. ఇల్లంతా కన్పిస్తుందక్కణ్ణుంచిచూస్తే. కాని అతనిదృష్టి వున్నది ఆయింటిమీద కాదు. ఆయింటికున్న నల్లని కిటికీలవంక చూస్తున్నాడు. మళ్ళీ గుండెదడ హెచ్చింది. అక్కడే పడిపోతాడేమోననిపించింది. కాని నిబ్బరంగా నిలదొక్కుకున్నాడు. నెమ్మదిగా నడిచాడు యింటివైపుకి.

యింటి వరాండా ఎక్కాడు. తలుపులు మూసివున్నై. నటాషాతోసహా అందరూ పనులుచేసుకుంటున్నారు. కొత్తగా నాటినమొక్కల పక్కనేబడి, యింట్లో తన భాగంవైపుకు వెళ్లాడు. తనయింటి తలుపులూ మూశేవున్నై. అటూయిటూ చూచి, మెట్లమీద చతికిలబడ్డాడు. ఇంతలో యెవరో ఇంటిని చుట్టివున్న దారివెంట పరుగెత్తుకొస్తున్నట్టు వినిపించింది. వార్యా! అప్పటిలాగానేవుంది. కాని ఆకన్నుల్లో ఏదో వింత కాంతి; స్త్రీ కోరికని తెలియజేసే కాంతి. పరుగెత్తుకొచ్చింది రొప్పుకుంటూ. రెండుచేతులూ చాచింది ముందుకి. 'రెండు చేతులూ తీసుకుని, ముఖానికద్దుకున్నాడు ఇవాన్. అరచేతుల్లో వెచ్చని కన్నీరు పడినట్లనిపించింది వార్యాకి; ఇవాన్ బుజాలు ఎగిరెగిరి పడుతున్నై, వెక్కి వెక్కి ఏడుస్తున్నట్టు.

"ఇవాన్ ఇవానొవిచ్! మీరలా ఏడవగూడదు. ఇకిప్పుడు మనం చెయ్యగలిగిందేముంది చెప్పండి! నా ఇవాన్ ఇవానోవిచ్! ఊరుకోండి"

నెమ్మదిగా ఒకచేయి విడిపించుకుని, ఇవాన్ నెత్తిమీది టోపీ తీసింది వార్యా.

"ఇప్పుడేవెళ్ళి నీళ్ళు తీసికొస్తా ముహం కడుక్కుందురు గాని; తాళంచెవిగూడా తీసుకొస్తా. ఐనా, ముందు మీరు మా యింటికి రావడం మంచిది." ఆ ఖాళీయింటిలోకిప్పుడే వెళ్ళాలంటే ఆయనెంత బాధపడిపోతాడో తెలుసు వార్యాకి. "భోజనాల వేళగూడా అయ్యింది. డెనిస్, ఎలీనాలు వచ్చేస్తారిక."

"మంచిదే, వార్యా! కాని ముందునన్ను నాయింటికే వెళ్ళనీ."

# 59

ఒక బొక్కెనసిండా నీళ్లూ, సబ్బూ, పెద్దతుండుగుడ్డా తీసుకొచ్చింది వార్యా. అక్కడే, మెట్లమీదనిలబడి, ఒకచేత్తో లంగా పరికిక్కకిలాగి పట్టుకుని, రెండోచేత్తో ఇవాన్ చేతుల మీదా, తలమీదా పోశింద నీళ్లు. నికీతాని రమ్మని పిలవలేదు వార్యా. అతను డెనిస్ యింటిదగ్గరే వున్నాడు ఇవాన్ సామాను చూస్తూ. వాళ్ళిద్దరిమధ్యా తానెందుకులే అనుకుని, కావాలనే అతను రాలేదని తెలియదావిడకి.

ఇవాన్ ఇవానొవిచ్ చేతులనిండా మచ్చలు. తైగా ప్రాంతంతో కుస్తీపట్టి విజయవంతంగా గెలిచొచ్చినందు కతన్ని చూచి గర్వించిందివార్యా. ఇంతకుపూర్వమే పసిపిల్లాడిలా యేడ్చాడు. కాని అందువల్ల అతనంటే ప్రేమఎక్కువైందే తప్ప తక్కువకాలేదు. ఇంటితలుపు తెరచి, గదులన్నీ శుభ్రంగా వున్నవని సంతృప్తిపడి శుభ్రమైన బనీనూ, చొక్కా తెచ్చియిచ్చి బొక్కెన, సబ్బు, తడితుండూ తీసుకుని వెళ్ళిపోయింది చప్పుడు కాకుండా.

ఆయన ఒంటరిగా వెళ్ళడమే మంచిది యింట్లోకి.

నికీతా సామానంతా లోపలికి తీసుకొచ్చేప్పటికి, అఖాళీ యిల్లంతా కలయజూశాడు ఇవాన్ ఇవానొవిచ్. పడకగదిలో పక్క శవాన్ని మోసుకెళ్ళే పెట్టెలాగా వుంది. పక్కమీద ఒక్కటే దిండువుంది. ఆ దిండునుగూడా ముట్టుకోకుండా, పడకగదిలోంచి బయటికొచ్చి, తలుపుమూశి, చదువుల గదిలో సోఫామీద పండుకున్నాడు, తలకిందొక పాతజాకెట్ మడిచి పెట్టుకుని. ఒక్కనిమిషం సేపలాగే, అన్నీ మరచిపోయి, శవంలా పడుకున్నాడు. ఇంతలో డెనిస్ వచ్చి పడ్డాడు.

"మాదగ్గరికి రావడాని కసలేమీ ఆరాటపడినట్లే లేదే మీరు!" అన్నాడు లోపలికొచ్చి. "మీరక్కడ చేసిన వైద్యాన్ని గురించి విన్నాం; తెగవిన్నాం! ఆగండాగండి, లేవబోకండి. అలాగే పడుకోండి, పర్వాలేదు. కాస్సేపు విశ్రాంతి తీసుకోండి. ఎట్లావున్నారు? బావున్నారా? ఎంతకాలమైదెంతకాలమైంది మిమ్మల్ని చూచి!" అంటూ సర్జెన్‌ని కౌగలించుకుని ముద్దు పెట్టుకున్నాడు. డాక్టర్ విచారాన్ని గమనించీ గమనించనట్టూరుకున్నాడు. చాలాకాలం పట్టిందిక్కడికి రావడానికి. అసలు రారేమో అనుకున్నాం. మీరీ వేసవికాలంగూడా అక్కడే వుండిపోతారని పుట్టినై రూమార్లు. ఆశలన్నీ వదులుకుని కూర్చున్నాడు అలెగ్జి; ఇప్పుడు హాస్పిటల్లోనే వున్నాడు."

"కాలు తీసేశారా?" అనడిగాడు ఇవాన్.

"లేదు. ఇంకొక రెండురోజులు వాయిదా వెయ్యమని కోరాడతను. కాని, కాలివ్రేళ్ళు నల్లబడిపోయినై. ఇక వాపు సంగతి చెప్పేపనేలేదు!"

"ఆగడం మంచిదే అయ్యిందిలే." అన్నాడు ఇవాన్; "ఇప్పుడేవచ్చి చూస్తానతన్ని." అని కనులు మూసుకున్నాడు.

ఒక్కక్షణంపాటు గదంతా నిశ్శబ్దం.

"ఎప్పుడూ యిదిజరిగింది?" అనడిగాడు చివరికి.

తానే నేరంచేశినట్టు, సిగ్గుపడిపోయాడు డెనిస్.

"ఓల్గా వెళ్ళిపోయిందెప్పుడూ?" అని యింకా విశదంగా అడిగాడు ఇవాన్ ఈసారి.

డెనిస్ చాలా బాధపడిపోయాడు. ఏమీతోచక చొక్కా కాలరు సర్దుకున్నాడు. నుదురు తుడుచుకున్నాడు.

"అప్పుడే.... అంటే మరీ అంతవెంటనే కాదనుకోండి.... మీరు వెళ్ళింతర్వాత రెండుమూడు వారాలకి...."

"హుఁ. వెళ్ళగానే నన్నమాట." అన్నాడు ఇవాన్, విచారంగా నవ్వుకుంటూ; అలసటతో మళ్ళీ కళ్ళుమూసుకున్నాడు.

కనుబొమలు చిట్లించాడు.

అప్పటికిగాని ఇవాన్ ముహాన్ని శ్రద్ధగా పరిశీలించి చూడలేదు డెనిస్ : పలచగా, కంచులా ఉంది. గడ్డంగూడా పెరిగింది కొద్దిగా.

"ఎంతఅందమైన ముహం!" అనుకున్నాడు డెనిస్.

నెమ్మదిగాలేచి, మునిగాళ్ళమీద, చప్పుడుకాకుండా వెళ్ళిపోబోయాడు బయటికి.

"ఇవ్వాళరాత్రి కిక్కడ పండుకుంటారా?" అనడిగాడు ఇవాన్ అగస్మాత్తుగా, కళ్ళుతెరవకుండానే; "నికీతాకూడాను. తైగాప్రాంతంనుంచి వొచ్చాముా, మరీ వొంటరిగా వున్నట్టుంటుంది."

"తప్పకుండాను. అంతకంటేనా". అన్నాడు డెనిస్ వెంటనే; "వెంటనే భోజనాలుగూడా చేద్దాం. ఇంకో పదిహేను నిమిషాల్లో వచ్చి పిలుస్తాను మిమ్మల్ని. భోజనాలైపోగానే, సరాసరి హాస్పిటల్ కెళ్ళిపోదాం."

డెనిస్ వెళ్ళిపోయింతర్వాత, ఇకాగదిలో వుండడమే కష్టమైపోయింది ఇవాన్‌కి. అంతానిశ్శబ్దం. చెవులు దిబ్బళ్ళేసిపోయినట్టున్నై ఆ నిశ్శబ్దంతో! ఇకక్కడలా పండుకువుండడం అసాధ్యమైపోయింది. లేచి గదులన్నీ కలియతిరిగాడు. సామా

నూడదిసి సర్దుకుంటేనన్నా యీ ఆలోచనలు తగ్గుతాయేమో నని ప్రయత్నించాడు. ఒకచిన్న దంతపుపెట్టె కిందబడింది గుడ్డల్లోంచి. యాంత్రికంగా ఆపెట్టెని చేతిలోకి తీసికొని, పైకీ కిందికీ తిప్పిచూశాడు దానిమీది చెక్కడపుపని చూచి సంతోషిస్తూ.

ఉఛఖాన్‌లో గడిపిన చివరిఉదయం గుర్తుకొచ్చింది. డేరాల చూర్లకి వ్రేళ్ళాడే మంచుబంతులు, ....వసంతం చలి. డేరాలపైగా కన్పించిన లేతగులాబీ రంగు. ఉన్నివస్త్రాలు కప్పుకొచ్చిన జనం.

తిరస్కరించిన బహుమతుల సంగతి గుర్తుకొచ్చి, 'వార్యాకేదోవొక బహుమానమైనా తీసుకురావలసింది.' అనుకున్నాడు 'చాలా సంతోషించేది.'

ఆలోచనల్లో మునిగిపోయిలా టేబుల్ ప్రక్కనే నిలబడి, చేతిలో వున్న పెట్టెని టేబుల్ కేసి కొట్టాడు పరాకుగా. క్లిక్ మన్నశబ్దంవచ్చింది. ఏమిటా అని చూశాడు క్రిందికి. ఆ పెట్టె కొకవైపున ఒకచిన్నమీటవుంది. ఆ మీట నొక్కాడు. పెన్సిల్ పెట్టెలా, జారేమూత. మూతతీస్తే లోపలొక యకూత్ కత్తి బాగా పోలిష్‌చేసిన ఎముకపిడి. చక్కని చేతిపని. చాలా అందంగా వుంది.

ఇవాన్ ముహమంతా ఎర్రబారింది. కణతలదిరిపోయినై. ఆ మెరిసే కత్తిపదును వంక అలాగే చూస్తూ నిలబడిపోయాడొక్కక్షణం సేపు. ఇలాంటి సమయంలో, యిలాంటి బహుమానం యిచ్చిన ఆ దుష్టహస్తాన్నేమనాలి!

ఉఛఖాన్‌లో ఆ జనసమూహం గుర్తుకొచ్చింది మళ్ళీ. చెవులదాకా ఉన్నివస్త్రాలు దిగేసుకున్న యకూత్ యువ

కుడు గుర్తుకొచ్చాడు. అతనిచ్చిన బొచ్చుసక్కని తిరస్కరించే వ్పటికి, యీ పెన్సిల్ పెట్టెలాంటి దంతపు పెట్టెని బలవంతాన కుక్కాడు చేతిలో.

ఎంతో గౌరవాదరాలతో యిచ్చిన బహుమానం అది; సందేహంలేదు.

# 60

ఉచఖాన్‌లో వైద్యకేంద్రాన్ని చూచిన కళ్ళతో యీ హాస్పిటల్‌ని చూస్తే, యేదో స్వప్నజగత్తులో కొచ్చినట్లుంది. అలెగ్జీవున్న వార్డులోకెళ్ళేముందు, డాక్టర్ గదీ, ఆపరేషన్‌గదీ చూచి మరీ వెళ్ళాడు ఇవాన్.

"న్యుమోనియా వచ్చినావిడ ఎలావుంది?" అనడిగాడు దారిలో, డెనిస్‌ని.

"బ్రతికి బయటపడింది" అన్నాడు డెనిస్; "బాగాగడ్డు కేసే. సల్ఫాపైరిడైన్ యిస్తే తొందరగానే నయమయ్యేది కాని ఆవిడ లివర్ మంచిది కాదు. ఉరోట్రపైన్, గ్లూకోజ్ యివ్వవలశొచ్చింది. గుండెకు మంచిదని కాంఫర్, కాఫెయిన్ ఇంజెక్షన్లిచ్చాను. ఇంకొక పదిరోజులికి బాగుపడి పోతుందనగా నన్నెంత పీడించుకు తిన్నదనీ, ఆవిడ!" అంటూ నవ్వాడు; ఆ నవ్వులో గర్వపు ఛాయలుగూడా లేకపోలేదు. ఇంతలో ఏంగుర్తుకొచ్చిందో గబగబా నడచెళ్ళాడు ముందు; కళ్లు కాయలు గాసేట్టు చూచినందుకు ప్రతిఫలం దొరికింది లెమ్మని అలెగ్జీతో చెప్పడానికి.

ఇవాన్‌గూడా తొందరపడుతూనే వున్నాడు అలెగ్జీని

చూచేందుకు. డెనిస్ వెనకాలే ఇవానూ అడుగుపెట్టాడు వార్డ్‌లోకి.

అలెగ్జీ ముహం బాగా డోక్కుపోయివుంది; మొట్ట మొదట ఇవాన్ గుర్తించలేక పోయాడు గూడాను. ముహమంతా పాలిపోయి బూడిదరంగులోకి దిగింది, నిద్రలేక. ఒక సంవత్సరంక్రితం యీ యువకుడే చికిత్సకొచ్చాడు తనవద్దకి. అప్పటికీ యిప్పటికీ ఎంత తేడా !

"ఇంతకుముందే మోర్ఫియా ఇంజెక్షనిచ్చాం. అందుకని అట్లావున్నాడు." అని చెప్పాడు డెనిస్.

రోగి త్రుళ్లిపడ్డట్టు కనులు లేపిచూచాడు. ఇవాన్ ఇవానొవిచ్ ! చేతులమీద బలంఆన్చి, తల తలగడమీంచి లేపాలని ప్రయత్నించాడు.

"మీరొచ్చారన్నమాట !" అన్నాడు గొణుక్కుంటున్నట్టు; చిరునవ్వు నవ్వబోయాడు గాని ఎండిపోయిన పెదవులు కదలలేదు; ఆ చిరునవ్వు బయటికి కన్పించలేదు.

"పండుకునేవుండు; పండుకో" అన్నాడు ఇవాన్; "నీ పరిస్థితెలా వుందో యిప్పుడే చూస్తాను. ఏమిటీ విశేషాలు ?"

పరీక్షించడం పూర్తయ్యింతర్వాత, ఇవాన్ కాస్త ఉత్సాహంగానే వున్నాడు: "ఫర్వాలేదు. అనుకున్నదానికంటె మెరుగ్గానే వుంది. బహుశా కాలిత్రవేళ్లు తీసెయ్యాల్సొస్తుందనుకుంటా. చిటికెనవ్రేలూ, దాని ప్రక్కదీనీ. ఇష్టమేనా నీకు ?" అనడిగాడు.

"మీకంటే నాకెక్కువ తెలుసా, మీయిష్టం" అన్నాడు అలెగ్జీ, మనస్ఫూర్తిగానే.

"అసలేమీ తీసెయ్యకుండానే పనిజరిగేదనుకుంటా! సరే. అయ్యిందేదో అయ్యింది. రేపుదయం ఆపరేషన్ చేద్దాం; అన్నీ సిద్ధంచేయించండి" అని చెప్పాడు ఇవాన్ సెర్గుతోవ్‌కి.

క్రిందటేడు చేసిన ఆపరేషన్‌లాంటదే యిదీని. కాక పోతే, యీ సారి రోగికుడిచేతిమీద పండుకున్నాడు; ఆపరేష నేమో ఎడమవైపున చేశారు.

ఇంకొక భేదంగూడా వుంది: డాక్టర్ల సంభాషణని బట్టి, ఎప్పటికప్పుడు, ఏంజరుగుతోందో తెలుసుకోగలిగాడు అలెగ్జీ. అంచేత క్రిందటాపరేషన్ కంటె యిది ఎక్కువసేపు పట్టినట్లనిపించింది. బాధ ఎక్కువైనప్పుడల్లా, మనసంతా, ఇవాన్ ఇవానోవిచ్ గొంతుమీదా, కదలికలమీదా కేంద్రీక రించాడు. ఎంతో బాధపడుతూ గూడా, ఈయనవచ్చేదాకనూ ఆపరేషన్‌చేయించుకోనని పట్టుపట్టుకు కూర్చున్నాడు. కనుకనే తన శరీరాన్నంతా యీ వ్యక్తిచేతుల కప్పగించగలిగాడు నిశ్చింతగా. 'ఒకసారేదో తెలియక పొరపాటు చేశాను. ఇకె ప్పుడూ చెయ్యనలాంటి పొరపాటు. ఆ పొరపాటు దిద్దుకునేం దుకు నే చేయగలిగిందంతా చేశాను. ఆయనా శాయశక్తులన్నీ వుపయోగించి సాయం జేస్తాడునాకు తప్పకుండా' అను కున్నాడు అలెగ్జీ.

ఆపరేషన్ జరిగే సమయంలో ఒక్కవిషయం మాత్రం అలెగ్జీకి తెలియలేదు: ఇవాన్ ఆపరేషన్‌చేసి, నాడిముక్క బయటికితీసి పక్కమనిషికి చూపిస్తున్నాడు. ఇంతలో నికీతా మొహంవంక చూచాడు; ఆందోళన పడుతున్నట్టుంది.

"వాడి?" అనడిగాడు ఇవాన్.

"ఒక్కనిమిషంలో చెప్తా" అన్నాడు నికీతా; అంటే అంతా సవ్యంగా లేదన్నమాట.

"కాంఫర్ ఇంజెక్షన్."

టేబుల్ మీద సిద్ధంచేసి వుంచిన సిరింజ్ తీసుకున్నాడు నికీతా.

"అలెగ్జి! ఎలావుంది?"

"చెమట పడ్తోంది." అన్నాడు, కొద్దిగా ఆగి.

"తొందరగా" అన్నాడు ఇవాన్, గొంతు హెచ్చించకుండానూ, స్వరం మార్చకుండానూ; "నాడి మామూలుగానే వుందా అంతవరకు?"

రోగిచేతికి కాంఫర్ ఇంజెక్షనిస్తూ "ఆ" అన్నాడు నికీతా.

"ఇప్పుడెలావుంది?" అని అలెగ్జినడిగి, తర్వాత నికితాతో "కాఫెయ్న్, అడ్రెనాలిన్ లియ్యి" అని చెప్పాడు ఇవాన్.

"బాగానేవుంది," అనన్నాడు అలెగ్జి: "కొద్దిగా ఎడంకాలు నొప్పిగా వుంది."

ఆపరేషన్ ముగిశింది. అలెగ్జిని వార్డ్ లోకి తీసుకెళ్లారు.

చేతికి తొడుక్కున్న రబ్బర్ గ్లోవ్స్ తీస్తూ, "ఏంజరిగింది, నికీతా?" అనడిగాడు ఇవాన్.

"ఏముందీ, నెత్తురొత్తిడి వున్నట్టుండి పూర్తిగా పడిపోయింది: నాడేమో అందలేదు. శరీరమంతా చల్లబడింది. ఒళ్ళంతా చెమట పట్టింది. కాని, స్పృహ మట్టుకు పోలేదు."

"నేనూ భయపడుతూనేవున్నా. చాలకాలం బాధ పడ్డాడుకదూ, నిద్రగూడాలేక మనిషి బాగా తీసిపోయాడు." అన్నాడు ఇవాన్; "అలాంటి రోగులికి ఆపరేషన్ చేశేప్పుడు చాలా జాగ్రత్తగా వుండాలి."

# 61

తావ్రోవ్‌కి మెలకువ వచ్చేప్పటికి ఉదయం ఆరుగంట లైంది. చాలా సేపలాగే కదలకుండా పండుకున్నాడు; అతని భుజంమ్మీదుగా చెయ్యేశి నిద్రపోతోంది ఓల్గా. ఆచేయి తీయ డం అతనికిష్టంలేదు.

మిల్లుకు కొత్తయంత్రాలొచ్చాయన్న సంగతి గుర్తు కొచ్చింది తావ్రోవ్‌కి; వెంటనే వెళ్ళాలి. అప్పటిదాకా ఆనందగా నవ్వుకుంటున్న వాడలా, ఆందోళన పడ్డాడు. నెమ్మదిగా ఓల్గా చేతిని తప్పించుకుని, లేచి, ఓల్గా చెంపలమీదా తలగడమీదికి జారి పడిన కురుమల మీదా తనచెంప ఆన్చాడు. తన భార్య! ఔను, ఇప్పుడు ఓల్గా తనభార్యే! చప్పుడుగాకుండా దుస్తులు మార్చుకుని, బూట్లుచేత్తో పట్టుకుని కాళ్ళమేజోళ్లతోనే వంట యింట్లోకెళ్లాడు. వెళ్ళి కిరోసిన్ స్టౌవ్ వెలిగించాడోలేదో, ఓల్గా కూడా వచ్చేశింది. కాళ్ళకి స్లిప్పర్లేసుకుంది: రాత్రివేసుకున్న గౌను మార్చనుగూడా లేదు. ఆవులించుతూ, నవ్వుతూ వచ్చింది; నిద్రలో అలముకున్న గులాబీరంగు చెరగనుగూడా లేదుయింకా.

"నేను చేస్తాన్లే, ఆగండి" అంటూ, అతని చేతిలో ఖాళీ కెటిల్ తీసుకొని, ఉదయం ఫలహారం చెయ్యడాని కటూయిటూ

తిరగడం ప్రారంభించింది ఆసులో కండెలా. చూస్తూ చూస్తూండ గానే ముహం కడుక్కుంది; దుస్తులుగూడా మార్చేసుకుంది.

"ఎక్కువసేపు నిద్రపోతూ పండుకుంటే, లేచి మిమ్మల్ని సాగనంపకపోతే, యికావాళ్లా ఏమిటోగా వుంటుంది." అన్నది ఓల్గా, పాత్రలు సర్దుతూ.

ఇంకో అరగంట తర్వాత వరాండా మెట్లు దిగాడు తావ్‌రోవ్. లేతయెండ. ఒక్కమేఘమన్నాలేదు పైన. ఇవ్వాళగూడా బాగా వేడిగా వుంటుందన్నమాట.

గనులయిళ్ళన్నీదాటి కామెనుష్కా నదిలో కలిశే పాయవైపుకు దిగి, అక్కణ్ణుంచి మిల్లువెపుకు మళ్ళాడు. కొండలవాలుమీద వున్నై మిల్లు యిళ్ళన్నీ. ఆ కొండల్లోంచే తీస్తారు ముడిపదార్థం. కొండలనిండా అక్కడక్కడా యింకా అడవి అవశేషాలున్నై. ఈ అడవి పైభాగంలోనే ఓల్గా నతను కలుసుకుంది, క్రిందటేడు. ఆరోజింకా కళ్లకుకట్టినట్టు గుర్తుంది తావ్‌రోవ్‌కి. బాగా గాలి వీచిందారోజున. అప్పుడు ఓల్గా చాలా నిస్పృహగా వుంది, ఏంజెయ్యాలో తోచక. ఇప్పుడు సంతోషంతో వెలిగిపోతోంది మనిషి; తనజీవితానికి అర్థంపున్న దన్న ఆనందంతో హుషారుగా వుంటోంది. ఓల్గాలో వచ్చిన యీ మార్పుని తలచుకుని సంతోషించాడు తావ్‌రోవ్. ఆవిణ్ణి తలచుకుంటేనే ఆనందం అతనికి; ఆవిడన్నా, ఆవిడచేసే పని అన్నా అపరిమితమైన యిష్టం.

పట్టాలమీద, కేబుల్స్ సాయంతో, దడదడలాడుతూ పైకివెళ్తోందొక ఖాళీరైలుడబ్బా; ఇంకొక డబ్బా, నిండా ముడిపదార్థం వేసుకుని వోస్తోంది కిందికి. అలా పైకీ కిందికీ

ఒకదాన్నొకటి లాక్కుంటూనే వుంటాయవి, పగలల్లా. మిల్లు లోకెళ్లేముందు మళ్ళీ వొకసారి వెనక్కి తిరిగి క్రిందవున్న వూరంతా చూచి మరీ వెళ్ళాడు తావ్‌రోవ్ లోపలికి.

మిల్లులో కొత్తయంత్రాలూ, పాతయంత్రాలూ కలిసి పనిజేస్తున్నై. ఈ కొత్తయంత్రాల మూలాన పని సులువైంది; ఉత్పత్తి యెక్కువైంది. పరిణాళికని తొందరగా పూర్తిజేసే అవకాశం చిక్కింది.

ఒకచోట, రాళ్లుకొట్టే పాతయంత్రాన్ని తీసి, కొత్త యంత్రాన్ని పెట్టేందుకు కార్మికులు పనిజేస్తున్నారు.

ఆ కార్మికుల్లో ఇగోర్ కూడా వున్నాడు. ఈ కవి, ఈ మెకానికల్ ఎంజినీరు, మిగతావాళ్లందరికంటే ఎక్కువగా మాట్లాడేస్తూ వున్నట్టు కనిపించింది తావ్‌రోవ్‌కి. మొత్తం మీదతనికి యీయంత్రాల సంగతి బాగానే తెలుసుననీ, అతనికి తాను వ్రాసేపద్యాలకంటే, యీ యంత్రాలంటేనే ఎక్కువ యిష్టమనీ తావ్‌రోవ్‌కి తెలుసు.

ఇంతవరకూ వాళ్లుపయోగిస్తున్న రాళ్లుకొట్టేయంత్రాలు సంతృప్తికరంగా పనిజెయ్యడం లేదు. వాటిస్థానంలో కొత్తవాటిని పెట్టాలంటే, స్కొరొబొగతోవ్ వున్నప్పుడు సాధ్యంకాలేదు. అతను అంగీకరించలేదు. ఉన్నవాటితోనే సాగించండి పని అన్నాడు. అన్నిట్లోనూ వేలుపెట్టడం ఒక్కటే గాదు అతనుచేసినపని; తానన్నది కాదంటే చాలు, అందరూ తనకు వ్యతిరేకులే ననుకునే వాడు. ఇప్పుడతనిపేరు తలుచుకునేవారుగూడా లేరు. మిల్లుకవసరమైన కొత్తయంత్రాలన్నీ వచ్చేస్తున్నై.

తావ్‌రోవ్‌ని దూరంగా చూశాడు ఇగోర్; చూడగానే ఆందోళన పడ్డాడు. మకిలిచేతులు ప్రక్కనేవున్న పాతగుడ్డ ముక్కల్తో తుడుచుకుని, తావ్‌రోవ్ దగ్గరకొచ్చాడు. ప్రక్కకి పిలిచి,

"మీరూ వినేవుంటారు?" అన్నాడు నెమ్మదిగా.

"ఏమిటి?" అనడిగాడు తావ్‌రోవ్ విసుగ్గా.

"ఆయనొచ్చేశాడు. ఇవాన్ ఇవానొవిచ్."

డాక్టర్ ఇవాన్‌వస్తాడనీ, ఆయనతో ఏదోవకటి మాట్లాడక తప్పదనీ, ఆ సంభాషణ యెవరికీ మంచిదికాదనీ యిదివరకే అనుకున్నాడు తావ్‌రోవ్. ఐనా, సాధ్యమైనంత వరకూ అలాంటి సంభాషణని తప్పించుకోవాలనే కోరుకున్నాడు అంతరాంతరంలో. బహుశా, ఇవాన్ ఇవానొవిచ్ యిక్కడకి రాకుండా సరాసరి ఉకీముఛాన్‌కే వెళ్ళిపోవొచ్చు; ఆయన పరిస్థితే అలాంటిది. అలా చేసినా ఆశ్చర్యపోవాల్సిన పనిలేదు. లేకుంటే, అక్కడే, ఆ పైగా ప్రాంతంలోనే ఉండిపోవొచ్చు. ....కాని ఆ ఆశలకేమీ తావులేదు.

'ఇకాయన్ని కలుసుకోక తప్పదనుకుంటా' అనుకున్నాడు తావ్‌రోవ్; పైకిమట్టుకు, "ఓను ఆయనసలిదివరకే రావలసింది; మాట్లాడుకుని ఒకనిర్ణయానికి రావడం మంచిది." అన్నాడు.

"మీరు భయపడటంలా....ఆవిణ్ణి గురించి?"

"ఎందుకూ? ఆయన....ఆయన చాలా మంచివాడు." అన్నాడు తావ్‌రోవ్ వెంటనే; "మా యిద్దరి బదులూ నేనే మాటాడతాను."

కాని ఆరోజున, యింటికి మామూలుకంటే చాలా యెక్కువగా ఫోన్ చేశాడు. ఎంతవద్దనుకున్నా, వున్నకొద్దీ ఎక్కువై పోతోంది ఆందోళన: డాక్టర్ ఇవాన్ యేం జేస్తున్నాడో యిప్పుడు ? హాస్పిటల్ కెళ్తున్నాడా ?

"విన్నారా ?" అనడిగింది ఓల్గా, ఫాక్టరీకి ఫోన్ జేసి.

"ఆ విన్నాను. అనవసరంగా కంగారు పడొద్దు. నేను మాట్లాడ్తానుగా ఆయన్తో."

ఆవేళ మధ్యాహ్నానికి, గాలీవానా ముంచుకొచ్చింది. గడచిన రెండేళ్లలో ఎప్పుడూరాలేదు అంతటి గాలివాన. ఉరుములు. ఒకటేఉరుములు. పర్వతాలన్నీ ప్రతిధ్వనించి పోతున్నై. కిటికీ తలుపులమీద యీడ్చీడ్చి కొడుతోంది వర్షం. తాత్కాలికంగా టెలిఫోన్లన్నీ మూసేశారు. తావ్రోవ్ ఆందోళన మరీ ఎక్కువై పోయింది. మిల్లంతటా ,అదొక గమ్మత్తైన వేడి; ఏపనిచేశేందుకూ పాలుపోకుండా చేస్తోంది. మెడకీ, ముహానికీ పట్టిన చెమట తుడుచుకుని, రెండో అంతస్థుకెక్కి, కిటికీగుండా బయటికి చూశాడు తావ్రోవ్. మామూలుగా, అక్కణ్ణుంచి చూస్తే వూరు పై భాగమంతా కన్పించేది. ఇప్పుడు కిటికీబయట యిరవై అడుగులవతల యేమీ కన్పించడం లేదు; అంతా వాన తెర; గాలికూగిసలాడే వానతెర.

'ట్రాన్స్‌ఫార్మర్స్‌నా చెడిపోకుండా వుంటే.... అనుకున్నాడు తావ్రోవ్. అవి చెడిపోతే, ఎలెక్ట్రిసిటీవుండదు. ఈ మాత్రం పనిగూడా సాగదు.

ఏంచెయ్యాలో ఆలోచించుకోకుండానే, ఎవరిదో వాన కోటొకటి లాక్కుని పరుగెత్తాడు. కుండపోతగా కురుస్తోంది వర్షం. నదిలో కలిశేపాయనిండా ఒడ్డులొరుసుకుంటూ ప్రివహిస్తోంది నురుగునీరు. ఉత్తరప్రాంతంలో యింతటి వర్షాన్నిది వరకెప్పుడూ చూడలేదు తావ్‌రోవ్. వానకోటు గట్టిగా గడ్డం క్రిందపట్టుకుని, అలాగే, ముందుకు పరుగెత్తాడు వర్షంలోపడి, గనులపై వుకి; ఏదో పిచ్చికుక్క పట్టుకుని లాగినట్టు లాగుతోంది గాలి, దుస్తులు పట్టుకుని, వెనక్కి.

కార్మికుల యిళ్ళదగ్గర మలుపులో కాలుజారింది, బురదలోపడి; క్రిందపడిపోవలసిందే. తట్టుకుని, జారిపోయే వాన కోటు మళ్ళీ కూడదీసుకుని, తిట్టుకుంటూ, పైకిలేచాడు తావ్‌రోవ్; సరిగ్గా అదే సమయానికి, ఎదురుబడ్డాడు ఇవాన్ ఇవానొవిచ్.

బాగా కిందకొంగిన ఇంటిచూరుకింద నిలబడున్నాడు ఆయన; ఆ పెరిగిన గడ్డమూ, అదీ....చూచినవెంటనే సరిగా గుర్తించలేకపోయాడు తావ్‌రోవ్. సరిగా గుర్తించకుండానే ఆగిపోయాడు. ఇంతవర్షంలో, యిలా, లోపలికెవళ్ళొచ్చినా అభ్యంతరం లేనట్టాయింటి తలుపలా తెరచివుంటే, యీచూరు కింద నిలబడడం ఏమిటి? ఆచురుకు చూపులు చూచింతర్వాత గాని తెలియలేదు అక్కడనిలబడి వుంది ఎవరో. తావ్‌రోవ్ వొళ్ళంతా చల్లబడిపోయినట్లయ్యింది. ఐనా, తానుగూడా ఆ చూరుకిందికే వెళ్ళాడు.

ఒక్కక్షణం ఎవ్వరూ మాట్లాడలేదు.

"నాకోసం చూస్తున్నారా?" అనడిగాడు తావ్‌రోవ్

"లేదు లేదు. నీకోసం చూడ్డం లేదు, నీకోసం మట్టుకు కాదు. ఎవరో రోగిని చూడ్డానికొచ్చాను. కార్మికుడు. చైనా కార్మికుడు. చావుబ్రదుకుల మీదున్నాడు. గుండెజబ్బు. ఇంతలో వర్షం వొచ్చింది....." మధ్యలోనే ఆగిపోయాడు ఇవాన్. "నేనొస్తాననుకున్నారా మీరు ?"

బయటొక పెద్ద ఉరుమురిమింది. అడిగినమాట తావ్ రోవ్‌కి విన్పించలేదు. అతనిముహం చూస్తే వినిపించలేదని తెలుస్తూనేవుంది. ఇంకా ముందుకొంగి, నోరు చెవిదగ్గరపెట్టి, మళ్లీ అదేప్రశ్న వేశాడు ఇవాన్:

"నువ్వుగాని, ఓల్గాగాని.... ఓల్గా పావ్‌లోవ్నాగాని.... నన్నుగురించి ఒక్కసారైనా ఆలోచించారూ ?" తావ్‌రోవ్ ముహమూ, చెంపలూ, చివరికి చెవులుగూడా ఎర్రబారినై; ఇవాన్ చూశాడు. తావ్‌రోవ్ జుత్తుమీద నుంచి జారి కాలరు లోపలికి పడుతోంది వర్షపునీరు.

మళ్లీ ఉరుము. తావ్‌రోవ్ చెప్పిన జవాబు వినిపించ లేదు. మళ్లీ చెబుతాడని చూస్తున్నాడు ఇవాన్. ఈ లోపలే పిచ్చికోపం వచ్చేసింది. ఆ నిలుచున్న మనిషినలాగే నిలుచున్న పళాన చచ్చేట్టు కొట్టాలనిపించింది. అలాగే, నొప్పెట్టేట్టు పిడికిళ్ళు బిగించుకుంటూ నిలడ్డాడు. ముహం అంతా ఎర్ర బారింది.

"మాకింకో గత్యంతరం లేకపోయింది" అన్నాడు. తావ్‌రోవ్, ధైర్యంగా ఇవాన్ కళ్ళల్లోకి చూస్తూ.

"నిజం, నిజం ! నా స్నేహాన్ని ఉపయోగించుకున్నావ్. నా స్నేహాన్నుపయోగించుకుని, నన్ను మోసం చేశావ్. నే నుండగా, బయటబడడానికి ధైర్యంలేక, నేనెళ్ళింతర్వాత...."

"అదబద్ధం. మిమ్మల్ని మేమేమీ మోసగించలేదు." అన్నాడు తావ్‌రోవ్ వుద్రేకంగా; "అసలేం జరుగుతోందో మీరే గ్రహించి వుండవలశింది" అనన్నాడు తాపీగా. బయట ఉరుములు లేవు.... తావ్‌రోవన్న ప్రతిమాటా స్పష్టంగా వినిపించింది ఇవాన్‌కి.

"ఔనౌను. ఇప్పుడు నాకంతా తెలిశింది" అన్నాడు ఇవాన్ కఠోరంగా; "అంతకాలం కాపురం జేసినా తెలియని స్త్రీ స్వభావం తెలియజేశావు. ఎంతో మంచిదనుకున్నాను. ఉత్తమురాలనుకున్నాను. అదంతా నావూహ మట్టుకేననీ, నావూహ నిజం కాదనీ తేలిందిప్పుడు........ఐనా, మీరేమీ కంగారుపడాల్సిన పనిలేదు. అవిణ్ణి చూడాలని ఏకోశానా లేదు నాకు. మీరే ఆలోచించండి! ఇద్దరం ఎనిమిదేళ్లు కలిసి మెలిసి వున్నాం! ఇప్పుడు...."

అంతే. గిరుక్కున ప్రక్కకి తిరిగి, వీపు వాయగొడుతున్న వర్షాన్నిగూడా లెక్కజెయ్యకుండా, యిళ్ళ మలుపులో మాయమైపోయ్యాడు ఇవాన్ ఇవానొవిచ్.

# 63

దుస్తులన్నీ తడిసిపోయినై. శరీరమంతా చల్లగావుంది. ఐనా గుండెల్లో కుంపటి. వెళ్ళి యింటి మెట్లెక్కాడు. ఇంటిలోపలికెళ్ళాడో లేదో, వెంటనే బయటికెళ్ళి పోవాలనిపించింది. ....ఇకి యింట్లో అడుగుపెట్టగూడదు; యీ యింట్లోవున్న ఏ వస్తువునీ కన్నెత్తిగూడా చూడగూడదు.

"ఇలా వుంటేనే బావుందికదూ...చక్కగా ?" అని ఎవరో తనప్రక్కనే నిలబడి అన్నట్లనిపించింది. అట్టూ యిటూ

చూశాడు ఇవాన్. ఎవరూ లేరాగదిలో. ఎక్కడ పెట్టిన వస్తువు లక్కడే వున్నై. సామానుగూడా ఎవరూ కదిలించలేదు.

కాని, చదువుల గదిలోంచి, ఎవరో గురక కొడుతూన్న శబ్దం వినిపించింది. ఇంతలోనే ఎవరో క్షమాపణ చెప్పుకుంటున్న గొంతు వినిపించింది. పిరొగోవ్. కన్ను వైద్యుడు. తన గురక లకి తానే మేలుకున్నాడు.

"చాలాసేపైంది నేనొచ్చి. కూర్చునుంటే, అట్లాగే నిద్ర పట్టేశింది. కాస్త గురక గూడా పెట్టాననుకుంటా. దానంతటికీ యీ వాతావరణమే కారణం; వర్షం వొస్తేచాలు, నిద్రపట్టే స్తుంది నాకు."

"క్షమించండి మిమ్మల్ని చూళ్లేదు."

"సహజమేగా. ఏనుగు లెప్పుడంటబడతాయి గనక !"

"భలేవారే !" అన్నాడు ఇవాన్, కోటూ, చొక్కా తీశేస్తూ. "ఇలాంటి తుపానులోనే నిద్రపోగలిగారూ అంటే, యిక యుద్ధరంగం వొక లెఖ్కా మీకు ? అక్కడింతకంటె బాగా నిద్రపోతారు !"

"నిజవేఁ. నాకు నిద్రబాగానే పడ్తుంది. దాన్ని గురించేమీ విచారంలేదు. ఇక గురక సంగతన్నారూ, అదంతే. మొద ట్నుంచీ అంతే. వయసులో వుండగా మరీ బాధగా వుండేది. ఒకసారొక డాక్టర్ దగ్గరక్కూడా వెళ్ళాను. ఆయనేమన్నాడో తెలుసా ? 'హాయిగా కొట్టవయ్యా గురక' అన్నాడు. 'నేనూ గురక కొడ్తాను; మా ఆవిడా గురక పెడుతుంది. మహారాజు లాగా గురకకొస్తే దానికి, నా దగ్గరకొచ్చా వెందుకూ ?' అన్నాడు !"

పిరొకోవ్ మాటలు వింటూనే,దుస్తులు మార్చుకున్నాడు ఇవాన్. టీకెటిల్ ప్లగ్ పెట్టాడు. పిరొకోవ్ అంటే యిష్టమే ఇవాన్ కి. బాగా సంతోషం వొచ్చినా, విచారం వొచ్చినా వొంటరిగా వుండడం అంటే కష్టం ఇవాన్ కి. అలాంటప్పుడు ఎవరో వొకరు తోడుండాలి.

టీ త్రాగుతూ, యిద్దరూ మాట్లాడుకుంటూ కూర్చున్నారు. ఇవాన్ ని ఓదార్చాలనే ప్రయత్నం యేమీ చెయ్యలేదు పిరొకోవ్. అసలా సంగతే యెత్తలేదు. హాస్పిటల్లో తన పనిని గురించీ, నావికాసైన్యంలో పనిజేసే తన కొడుకుల్ని గురించీ మాట్లాడాడు.

"మా అబ్బాయిల్లో ఒకడు డాక్టర్; రెండోవాడు కాప్టెన్స్ మేట్. వాళ్ళిద్దరికీ వాళ్ళ తాత శాస్త్రీ వచ్చింది. ఆయన సముద్రప్రయాణంలో బాగా ఆరితేరిన ఘటం. ఎప్పుడూ ఆ కథలే చెబ్తూండేవాడు వాళ్ళని కూర్చోబెట్టి. వాళ్ళు లాగూ లేసుకోవడం మొదలు పెట్టక ముందే కథలు చెప్పడం మొదలెట్టాడాయన. నావికాసైన్యంలో చేర్తాం అన్నారు వాళ్ళు పెరిగిన తర్వాత. అలాగే అన్నాం నేనూ మా ఆవిడానూ. వొద్దనలేదు. కాకపోతే మనం కోళ్ళమాయె, యీ బాతులెలా పుట్టుకొచ్చినై మనికి అనుకున్నాం; అంతే. సముద్రంలో వుండడం కష్టమే కాని, అందులో కెళ్ళినాళ్ళంతా దిట్టమైన వాళ్ళుగా మట్టుకు తయారౌతారు. వాళ్ళప్పుడప్పుడూ శలవుల కొస్తారా, చూడ బుద్ధేస్తుంది. ఎప్పుడూ హుషారుగా వుంటారు; వాళ్ళని చూస్తే సిగ్గేస్తుంది నాలాగా నేలనొదలకుండా వుండే వాళ్ళకి. ఏదైనా పుస్తకం చదవాలని షేం అనుకుంటూనే వుంటాం; అప్పటికప్పుడే వాళ్ళా పుస్తకం చదివేశి, చర్చలు చేసి,

ఎవరి యిష్టం వొచ్చిన నిర్ణయం వాళ్ళు చేశేస్తారు. నాకు సాహిత్యం అంటే బాగా యిష్టం; మీకు తెలుసా....కొత్త పుస్తకం వచ్చిందంటేచాలు, చదివేదాకా నిద్రపట్టదు. ఇంకొద్దిరోజుల్లో మా ఆవిడొచ్చేస్తుందిక్కడికి; వొచ్చేప్పుడేవైనా కొత్త పుస్తకాలొస్తే పట్టుకొస్తుంది. మా ఆవిడ ఎమ్మేడిగ్రీ తీసుకుంది. ఇప్పుడు వివిధజాతుల్ని గురించి పరిశోధన చేస్తోంది. ఇక్కడి కొచ్చి, యీ ఉత్తర ప్రాంతంలో ప్రజల ఆచారవ్యవహారాల్ని గురించీ, సంస్కృతీ విశేషాల్ని గురించీ పరిశోధన చెయ్యాలనుకుంటోంది. ముందు నన్ను పంపింది స్కౌట్‌ని పంపినట్టు!"

సంభాషణ సాగుతూనే వుంది. కాని ఆ సంభాషణ కావాలని చేస్తున్న కృత్రిమసంభాషణలా వుందని యిద్దరికీ ఒక్కసారే తోచింది. వెంటనే మాటలు మార్చి, సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు పిరొకోవ్.

పిరొకోవ్ వెళ్ళిపోయింతర్వాత గూడా, అలాగే టేబుల్ దగ్గర కూర్చుని తన ఆలోచనల్లో తాను మునిగిపోయాడు ఇవ్వాన్.

"ఇకింతే నాపని....గోరుచుట్టు మీదరోకటి పోతేదో వొకటి పడుతూనే వుంటుంది. కావాలని గాయం మీద కారం జల్లుతోవడం...." లేచి, గదిలో అటూ యిటూ తిరగడం ప్రారంభించాడు. పిరొకోవ్ వదిలిపెట్టెళ్ళిన పత్రిక పడుంది అక్కడ. ఆ పత్రిక మీదింకొక చిన్న పుస్తకం వుంది. పుస్తకం, యాదాలాపంగా తీసుకుని, పేరు చదివాడు. 'సోవియెట్ భాషా' రచన : ఓల్గా స్త్రొగనోవా.

"స్ట్రాగనోవా" ఔను. వివాహం కాకపూర్వం ఓల్గా పేరదే. ప్రథమంగా పరిచయం చేసుకున్న దినం జ్ఞప్తికొచ్చింది. అప్పుడు ఓల్గా, ప్రొఫెసర్ స్ట్రాగనోవ్ కుమార్తె.

కాని యీ పుస్తకానికీ, ఆవిడకీ సంబంధం? తెరచి చూశాడు. పత్రికలకి ఓల్గా వ్రాసిన వ్యాసాల సంపుటం. ప్రత్యేకం ఒకపుస్తకంగా స్థానిక ప్రచురణల సంస్థ ప్రచురించింది. "ఐతే, తావ్‌రోవ్ పేరు పెట్టుకోవడం లేదన్నమాట ఓల్గా." అనే ఆలోచన మెరిసింది ఇవాన్ బుర్రలో.

'షిరొకోవ్ ఆ పుస్తకం తెరిచి పట్టుకునే నిద్రపోయాడంటే, యిక చెప్పేదేముంది, అంతగొప్ప పుస్తకమన్నమాట!' అనుకున్నాడు, పాతకోపం మరచిపోలేక. 'సరే, చూద్దాం.'

మొట్టమొదట కొద్ది పేజీలమీద మనసు కేంద్రీకరించలేకపోయాడు: ఓల్గాని గురించీ, ఆవిడతో కలిసి మెలిసి గడపిన రోజుల్ని గురించీ ఆలోచనలొచ్చిపడినై తొడతొక్కిడిగా. ఓల్గా స్ట్రాగనోవా, అందమైన చక్కని యువతి, మనసు విప్పి మాటాడే మంచియువతి, ఎప్పుడూ హుషారుగా వుండే యువతి! ఆ ప్రథమ సమాగమాల మధురస్మృతులు. వివాహమైంతర్వాత గడపిన ఆ మంచిరోజులు. ఆ పసిగుడ్డు పుట్టిననాటి పరమానందం. తిరిగి ఛాంజ్కా వచ్చి కలుసుకున్ననాటి సంతోషం. ఆ రెండో బిడ్డ గూడా చనిపోకుండా వుంటే! తప్పకుండా యిద్దరూ కలిసి వుండేవారే. ఐనా ఓల్గాకి సుఖంగా వుండేది కాదు. గత ఆకురాలు కాలంలో ఆ నిస్పృహ, ఆ నిరాశ, ఆ మౌనం, ఆ ఎడ్డమొగం, పెడమొగం..........

"లాభం లేదు. ఎవరమూ ఏమీ చెయ్యగలిగే వాళ్ళం కాదు!"

పేజీ తిప్పాడు. ఓల్గా తనతో మాట్లాడుతున్నట్టే వుంది; ఇదివరకటి ఓల్గా. మనసులోంచి మాటాడుతున్నట్టు, అనుకున్న దనుకున్నట్టు మాటాడుతున్నట్టు వుంది. విషయాలనంత చక్కగా, రుజువుగా యింకెవరు చూడగలరు? చదువుతూన్న కొద్దీ, హృదయభారం ఎక్కువైంది.

ఇంత చక్కని పుస్తకం, ఇంత గొప్పగా జీవితాన్ని ప్రతిబింబించుతూన్న పుస్తకం ముందేసుకుని ఎట్లా నిద్రపోగలిగాడో ఆ షిరొకోవ్? తన భార్యకోసం 'స్కాట్' లా, నేల చెరగుకొచ్చిన ఆనేత్రవైద్యుడు కావాలనే వదిలెళ్ళుంటాడీ పుస్తకం యిక్కడ అని అనుకున్నాడు ఇవాన్.

ఇంటి తలుపు తెరచిన చప్పుడు. ఇప్పుడా తలుపుకు లోపల గొళ్ళెం వెయ్యడం లేదు; (ఎప్పుడో ఎవరో వచ్చి ప్రవేశించాలనుకుంటే అభ్యంతరం లేకుండా వుండేందుకా అన్నట్టు) హాలులో మగవాడి అడుగుల చప్పుడు.

"సుస్వాగతం!" అంటూ చదువుల గదిలో కొచ్చాడు లొగునోవ్.

గట్టిగా కరచాలనం చేసి, సూటిగా కళ్ళల్లోకి చూస్తూ, చంకలో పెట్టుకొచ్చిన పార్సెల్ తీసి యిచ్చాడు:

"ప్రజలు మిమ్మల్నంత తేలిగ్గా వదలరు. పంచెయ్యగలం. డాక్టరంటే వాళ్ళకి 'బహు గౌరవం.' వాళ్ళిచ్చిన బహుమానాలన్నీ తిరస్కరించారు మీరు; వాళ్ళ మనసులు కష్టపెట్టారు."

ఆ పార్సెల్ మీద, 'డాక్టర్ ఇవాన్ ఇవానొవిచ్ కి కానుక' అని వుంది.

కొత్తకత్తితో పార్సెలుకు కట్టినదారం కోసి, విప్పి చూశాడు ఇవాన్. బొచ్చునక్క. వెండినక్క, ఎక్కడో చూచినట్లుంది. బ్రతికిన నక్కలా వుంది ఆ మడిచిపెట్టిన తోకా అదీచూస్తే. 'మీరంటే గౌరవం మాకు; బహుగౌరవం' అన్న మాటలు గుర్తుకొచ్చినై. 'చాలాబావుంది; కానిదంతా ఎవరి కోసం? ఇది వుపయోగించడాని కెరీ, ఎవరున్నారు?'

"జిల్లాకమిటీ ఆఫీసు కొచ్చాడితను అడవిలోబడి" అని చెప్పాడు లోగునోవ్ సాలోచనగా, " 'ఇది డాక్టర్ ఇవాన్ కివ్వండి' అన్నాడు. 'మేం యిస్తే తీసుకోరాయన. మా తరఫున మీరే యివ్వండి' అని గూడా చెప్పాడు."

ఏమనాలో పాలుపోలేదు ఇవాన్‌కి, "నేనేం చేసుకుంటాను యిది?"

జవాబివ్వడానికి ముందు కాస్సేపు తటపటాయించాడు లోగునోవ్.

"అంతేగాదు. ఆ యకూత్ యింకొక మాటగూడా అన్నాడు. 'డాక్టర్ ఇవాన్‌కి భార్య లేదంటే మేం నమ్మం; ఆయనకి భార్యవుండి తీరాల్సిందే!' అన్నాడు. నా ఉద్దేశం గూడా అదే. ఈరోజు ఇలాగే వుండవు." అంటూ ఆ వున్నిని చేతితో నిమిరి, నిట్టూర్చాడు లోగునోవ్. తర్వాతెళ్ళి, డెస్క్ మీద కూర్చున్నాడు. "ఏం జేస్తున్నారిప్పుడు? విశ్రాంతి తీసుకుంటున్నారా?

"ఆఁ. బావాను. విశ్రాంతి! విశ్రాంతే తీసుకుంటున్నా" అన్నాడు ఇవాన్, లేనినవ్వు తెచ్చుకుని; "నా మాజీ భార్య

రచనలు చదువుతున్నా" అంటూ పిరొకోవ్ వదలెళ్ళిన పుస్తకం చూపించాడు

"ఎందుకు చదవగూడదూ....చాలా మంచి పుస్తకం అది" అన్నాడు లొగునోవ్; "తేలిక భాషలో సూటిగా వ్రాసిన పుస్తకం."

"నేనెంత బాధపడుతోంది అర్థం కావడం లేదా, మీకెవరికీ?" అంటూ లేచాడు ఇవాన్; "ఆవిడ చేసిందంతా న్యాయమనేనా మీ ఉద్దేశం?"

"జరిగిన దానికి నాకంటే విచారపడే వాళ్ళుండరు" అన్నాడు లొగునోవ్; "నాకు తెలిస్తే, ముందే హెచ్చరించే వాణ్ణి మిమ్మల్ని."

"నన్నా? ఓల్గానా?"

"మిమ్మల్నే. ఓల్గా పావ్‌లోవ్నా మీతో ఎనిమిదేళ్ళుంది కలిసిమెలిసి. ఆవిడ ఇంకాస్త వయసున్న మనిషిగాని, ఇంకాస్త తక్కువ ఆకర్షణీయమైన వ్యక్తిగాని ఐతే, మీరెప్పుడో గుర్తించేవారు; ఆవిడ జీవితంతో సంబంధం తగ్గిపోతోందనీ, మీ యిద్దరికీ ఆసక్తి వున్నవిషయాల సంఖ్య క్రమక్రమంగా పూర్తిగా శూన్యమై పోయిందనీనీ. మీ బ్రహ్మాండమైన కార్యక్రమంలో మీరున్నారు, అదంతా బాగానేవుంది. కాని ఆ కార్యక్రమంలో పడి, మీరావిడసంగతే మరచిపోయారు. ఆవిడకు మీస్నేహమూ సహాయమూ అవసరమున్న సంగతే మరిచిపోయారు. అలాంటి పరిస్థితుల్లో, మీరివ్వలేని సహాయం యిచ్చేందుకు యీ ఎంజినీర్ వచ్చాడు. తటస్థపడ్డాడు. ఆవిడ కవసరమైన స్నేహాన్ని, సలహాల్ని, సహాయాన్ని, బలాన్ని యిచ్చాడు. ఇక తర్వాత,

సహజంగా ఆవిడ అప్యాయమూ, ప్రేమా అతనిమీద కేంద్రీకృతమైనై."

"ఐతే, యిప్పుడు నన్నేంచెయ్యమంటారు ? వెళ్ళి ఉరిపోసుకోమంటారా ?" అనడిగాడు డాక్టర్ కోపంగా.

"ఈ సంభాషణ ప్రారంభించింది మీరు." అన్నాడు లొగునోవ్ ప్రశాంతంగా, ముహం తెల్లబోయినా కనబడనీకుండా. "మిమ్మల్ని మరింత కష్టపెట్టటం సుతరామూ యిష్టం లేదునాకు. కాని ఆవిడ చేసిందాంట్లో తప్పేమీలేదు; మిమ్మల్ని వదలెళ్ళిపోవడం మంచిదే. మీతో జీవితం యింకొంతైనా సుఖప్రదంగా వుంటే, మిమ్మల్నొదిలెళ్ళగలిగేది కాదావిడ. అప్పుడు మిమ్మల్నొక కొత్తకాంతిలో దర్శించేది. ప్రపంచంలో మరెవ్వరినీ కోరుకునేదిగాదు మిమ్మల్నితప్ప. మిమ్మల్ని తప్పుపడుతున్నా ననుకోకండి. మనలో అందరికీ వున్నై ఆ లోపాలు. వేలాదిసంవత్సరాలనుంచీ మన బొమికల్ని తింటోంది ఆ ఆచారాల తుప్పు. భార్యకూ భర్తకూ మధ్య వుండవలసిన నూతన ఆదర్శ సంబంధాల్ని గురించి అందరమూ యిస్తాం మంచిమంచి ఉపన్యాసాలు. కాని ప్రయోజనం ? మన తాతముత్తాతలేసిన బాటలోనే గడుపుతూ వుంటాం వైవాహిక జీవితాల్ని. సాంఘిక సమానత్వం, ఇద్దరికీ అభిరుచీ, అసక్తీ వున్నవిషయాలు, పరస్పర గౌరవాదారాలు లేకుండా సరియైన సోవియెట్ కుటుంబం ఎలా మనగలుగుతుంది ? అది సాధ్యమా ? సామాన్యమైన ప్రేమ చిమ్ముడు గొట్టంలాంటిది. ఆ గొట్టం అందంగానే వుంటుంది చూడచక్కగా. అందులోంచి లేచే తుంపరల వంపులూ అందంగానే వుంటాయి చూడచక్కగా; కాని ఆ నీరు ప్రక్కనున్న ఇసుక

మీదపడగానే ఆరిపోతుంది; ఇసుక ఆ నీటిని అప్పటికప్పుడే పీల్చేస్తుంది. కాని నిజమైన ప్రేమలా కాదు. సజీవమైన నదీప్రవాహం లాంటిది. పుట్టినచోటనుంచి దూరం వెళ్లినకొద్దీ ఆ నది విశాలమౌతుంది; లోతు హెచ్చుతుంది; నీరు కలకలు చేరుతుంది. మనం పురోగమిస్తున్నాం. మన స్త్రీలలో ఏ ఒక్కరైనా సరే, వెనకబడితే మనం చూస్తూ వుండగలమా? ఉండొచ్చునా? వీల్లేదు! ఇప్పుడే గాదు, ఏప్పుడూ అంత వుదాసీనంగా వుండగూడదు మనం స్త్రీలంటే. ప్రతికుటుంబంలోనూ పిల్లలున్నారు; వుంటారు. ఆ పిల్లల్ని సరైన పద్ధతిలో పెంచి పెద్దవాళ్ళనిచేసే బాధ్యత స్త్రీలది. అంత ఉత్తమ కార్య నిర్వహణ చేయవలసిన స్త్రీలంటే మన ఔదాసీన్యం వుండ గూడదు."

మాట్లాడడం ఆపి, సాలోచనగా, నుదురూ, నెత్తీ తడుముకున్నాడు లోగునోవ్.

"చూశారా, ఒక పెద్ద ఉపన్యాసం దంచేశాను! నిన్న, మనగనుల్లో పనిచేసే ఒక కార్మికుడితో మాట్లాడాను; పార్టీ మెంబరు. అతని కెనిమిదిమంది పిల్లలు. అతనిభార్య గనుల్లో పనిజెయ్యడానికి రాదు. ఇంటిదగ్గరే రెండుచేతులనిండా పని వుంటుందావిడకి. 'ఏంఫర్వాలేదు, వాళ్ళందరికీ సరిపడా నేను సంపాదించగలన్లే' అన్నాడతను. నేనూరుకోలేదు: 'ఇక నీపని అంతే అనుకోబాకు; వాళ్ళ కడుపులకింత అన్నం, వంటికింత గుడ్డయిస్తే నీబాధ్యతంతా తీరిపోయిందనుకోకు. వాళ్ళు ఆదర్శవంతులైన పౌరులుగా పెరిగి పెద్దవాళ్లు కావాలి. నీభార్యకోసం నువ్వెంత సమయం వెచ్చించుతావ్? ఆవిడ

కేమంటే అభిలాషో, ఆసక్తో తెలుసా నీకు? పిల్లల పెంపకాన్ని గురించి ఆవిడ కెంత తెలుసు ? నూతన జీవితాన్ని నిర్మించ డానికొక దళానికి దళాన్ని పెంచుతోందే.... వాళ్ళందరూ భావిపౌరులు. కమ్యూనిజంలో బ్రదకబోతున్నారు. సామాన్య మైన విషయంకాదే అది! నీభార్యని నైతికంగానూ, మాన సికంగానూ, అభివృద్ధి చెయ్యవలసిన బాధ్యతుంది నీమీద. ఊరికే ఆవిణ్ణి యింటికంతటికీ బానిసగా వుపయోగించుకోవడం అంత చెరుఫింకొకటి లేదు' అని చెప్పాను."

తలవంచుకుని, భార్య వ్రాసినపుస్తకం చేత్తో బట్టుకుని కూర్చున్నాడు ఇవాన్. లోగునోవ్ మాట్లాడుతున్నంత సేపూ అలాగే వున్నాడు డాక్టర్ ఇవాన్ ఇవానొవిచ్.

# 65

అర్ధరాత్రప్పుడు మెలకువ వచ్చింది ఇవాన్ ఇవానొవిచ్ కి; బొమ్ముదగ్గర నొప్పిగా వుంది. గుండె ముడుచుకు పోతున్న దనిపించింది. ఆ చైనా కార్మికుడి కొచ్చిన జబ్బులాంటిదే తనకూ వచ్చిందేమోనని భయపడ్డాడు ముందు. ఐతే, ఇంతకు ముందెప్పుడూ గమనించనన్నా లేదే?' అనుకున్నాడు.

ఔనో కాదో తేల్చుకునేందుకు, కావాలని శరీరాన్ని కొద్దిగా కదిపిచూచాడు. ఏమీలేదు. ఆ బాధకి బదులు, ఏదో విచారం ఆవహించింది. తావ్‌రోవ్ ముఖం కన్పించడం ప్రారంభించింది కదిలినా, మెదిలినా. ఇకనిద్రపట్టలేదు.

రెండు చేతుల్తోను పట్టుకుని తలగడలో దూర్చాడు తల: "ఎంత పెద్దపెద్ద మాటలన్నాను! మీరు పిరికివాళ్ళని

అన్నాను! మరి నామాటేమిటి? కావాలని రోటీలో తల దూర్చానే, నేను. చివరికి ఓల్గాతో కూర్చుని మనసులో వున్న నాలుగుమాటలూ అనేయగల ధైర్యం గూడా లేకపోయిందే. ఆ మాటలు నాలుగూ ఎలా అనాలో గూడా అర్థం గాకుండా పోయిందే. ఐనా, చేతులు కాలింతర్వాత ఆకులు పట్టుకుని ప్రయోజనం మాత్రం ఏముంటుందిలే! లొగునోవ్ అన్నమాట నిజమే....జీవితం అంటే ఓల్గాకి ఆసక్తి తగ్గిపోతోందని గమనించలేక పోయాను; అందుకనే నాకు దూరమైపోయింది ఓల్గా." కప్పుకున్న దుప్పటి ప్రక్కకి నెట్టి లేచి కూర్చున్నాడు ఇవాన్. సిగరెట్ వెలిగించుకుని, లైట్ వెయ్యకుండానే, గదిలో అటూ యిటూ తిరగడడం మొదలెట్టాడు.

'ఇకిక్కణ్ణుంచి వెళ్ళిపోవడమే మంచిది' అనుకున్నాడు, 'ఇక్కణ్ణుంచి వెళ్ళిపోతేగాని యీ గొడవంతా మరచిపోవడం సాధ్యం కాదు. జ్ఞాపకశక్తిలోంచి అంతా శుభ్రంగా తుడిచి పారెయ్యాలి. రేప్పొద్దున్నే అందరికీ చెప్పేస్తాను, వెళ్ళిపోతానని.'

కాని, ఆ 'రేపు' అంతా ఆ చైనా కార్మికుడిమీద కేంద్రీకరించడంతోనే సరిపోయ్యింది. అతని పరిస్థితి మరీ విషమించింది. ఆవేళ సాయంత్రం అతన్నాపరేషన్ బల్లమీద కెందుకోబెట్టాడు ఇవాన్.

ఆ ఆపరేషన్‌వల్ల ప్రయోజనం వుంటుందని డెనిస్‌కి కూడా లేదు విశ్వాసం.

మరి బలహీనంగా వున్నాడుగదా, ఈ ఆపరేషన్ చెయ్యడం మంచిదా అని...." అన్నాడు ఆపరేషన్ చెయ్యబోయేముందు.

"మంచిది కాబట్టే...." అన్నాడు ఇవాన్, అమ్మోనియా ద్రవంతో చేతులు కడుక్కుంటూ; "చాలా కాలం నుంచి బాధపడుతున్నాడన్న మాటే కాని, జబ్బేమంత ముదర లేదు. ఈ రోజుల్లో యిలాంటి ఆపరేషన్లెక్కువగా చెయ్యడం లేదు, ఏమంత సత్ఫలితాలుండవనే వుద్దేశంతో. ఐనా యితన్నప్పుడే, ఆశలొదులుకుని, చావు చేతుల్లో పెట్టడం నాకిష్టం లేదు. కనీసం యింకొక ఆరునెలలకైనా, యితని పరిస్థితి బాగుంటుందని హామీ యివ్వగలను. తర్వాతేం జరుగుతుందో ఎవరికి తెలుస్తుందిప్పుడు ? జబ్బుతో పోట్లాడకుండా, యితన్నా జబ్బుచేతుల్లో కప్పగించడం యెందుకు ? చికిత్స చెయ్యకుండా ఒక్క ప్రాణిని గూడా మృత్యువు వాత బడనీయొద్దని అనుకోలా మనం ?"

రోగి మెడకెడమవైపున చేశారు ఆపరేషన్. రోగిని వార్డ్ లోకి తీసికెళ్ళింతర్వాతగాని, ఆ రోజు పనిపూర్తి కాలేదు. చేతులవీ కడుక్కుని, నెత్తురుమరకలైన గౌను తీసేశి, తన డెస్క్ ప్రక్కనే నిలబడ్డాడు; తిరిగి ఆలోచనల్లో మునిగిపోయి. వెళ్ళిపోతానని చెప్పి నోటీసిచ్చెయ్యాలని వుంది; కాని మరి యీ ఆపరేషనైన వ్యక్తులు ? వీళ్ళనొదిలేశి యెలా వెళ్ళడం ?

'ఇప్పుడప్పుడే వెళ్ళిపోవడానికి వీల్లేదు. నోటీసివ్వను. వెళ్ళనూ వెళ్ళను ! ఇక్కడుండడం కష్టమే కావచ్చు గాక; ఐనా, పిరికిపందలా పారిపోతానా ? చచ్చినా చెయ్యనాపని !'

హాస్పిటల్ వరాండాలో కెళ్ళాడు ఇవాన్. క్రిందటినాటి వర్షం తర్వాత, వాతావరణం హాయిగావుంది. చిన్నచిన్న

పురుగు లెగురుతున్నై ఆకాశంలో. దోమలు సంగీతం పాడుతున్నై. పశ్చిమాకాశం అంతా బంగారురంగు పూసుకునుంది. మేఘాలవెనుకనుంచి సూర్యుడి నీలికిరణాలు ఆ బంగారు రంగులో కలిసిపోతున్నై. మేఘాలలోంచి బంగారుబంతిలా దొర్లుతున్నాడు సూర్యుడు. దొర్లిదొర్లి పర్వతాల అంచుల వెనక పడిపోయాడు. క్షణక్షణానికీ ఆకాశంలో రంగులు ముదురెక్కుతున్నై; మారిపోతున్నై. ఆకాశంలో సగభాగమంతా ఆరంగులే అలముకున్నై. మళ్ళీ రేపుదయిస్తాడు సూర్యుడు; మళ్ళీ యింకొకరోజు ప్రారంభమౌతుంది: మానవుడి జీవితాన్ని ఆ 'రోజు'తోనే కొలుస్తున్నారు. తర్వాత ఒక దానివెనకొకటి వస్తుంది ఆ 'రోజు'. వందలు, వేలు, లక్షలు, కోట్లు....రోజులు. నిరంతరాయంగా సాగిపోతుందీ రోజుల ప్రవాహం. కాని, యీ రోజు .... గతించిపోయింది; కలకాలానికీ గతించిపోయింది.

సూర్యాస్తమయాన్ని చూస్తూ అలాగే నిలబడిపోయాడు ఇవాన్. హృదయమంతా బాధతో మెలికెలు తిరిగిపోతోంది. ప్రతిచిన్న ఆలోచనా ఒకచిన్న బాకులావుంది.

కొండలమీదినుంచి చల్లనిగాలి వీచింది; వికసించే తైగా ప్రాంతం సౌరభాన్ని మోసుకొచ్చింది. ఎంత చక్కని దేశమిది, ఎంతమంచి ప్రదేశమిది! తన అవసరం యీప్రాంతానికుంది అన్న ఆలోచన రాగానే, ఇవాన్ మనసు వుప్పొంగింది. నెమ్మదిగా వరాండామెట్లుదిగి బయల్దేరాడు వూళ్లోకి. ఎదురైన వాళ్ళందరూ పలకరించారు. తైగాప్రాంత విశేషాలేమిటని అడిగారు. వచ్చి టీ తాగి వెళ్ళమని ఆహ్వానించారు. కాని ఇవాన్ ధ్యాస అక్కడలేదు. ముందుకు చాచిన చేతులు అందు

కుని, యాంత్రికంగా కరచాలనం చేశాడు. అడిగిన ప్రశ్నలకి పరాకు సమాధానాలు చెప్పాడు. అతని మనసు మనసులో లేదు. ఎవరికోసమో వెదుక్కుంటూ వెళ్తూన్నట్టలాగే నడ చెళ్ళాడు ముందుకి. ఎవరికోసం ఆ అన్వేషణ? చివరికి, ఓల్గా గొంతు వినిపించింది. తనవైపే వస్తూన్నట్టుంది; ఐనా అతను తప్పుకోలేదు. ఎలాగూ కలుసుకోక తప్పదు యిద్దరూ.

ఓల్గా వొంటరిగాలేదు. వెంట పావాగూడవుంది, సెంటు వాసనలు వెదజల్లుతూ. ఇవాన్‌నిచూచి పావా వెనకాడింది. కాని అత నావిణ్ణిచూచినట్టేలేదు. అతనిచూపంతా ఓల్గామీదనే వుంది. పరీక్షగా చూశా డదేపనిగా. ఓల్గా ఆచూపులుచూచి బిడియపడలేదు, భయపడలేదు; అతనంటే ఒకవిధమైన జాలి, అవసరమైతే తనని తాను సమర్థించుకోగలనన్న ఆత్మవిశ్వాసం. ఈవిడ యిదివరకటి ఓల్గాకాదు; కొత్త ఓల్గా!

"నాతో మాట్లాడ్తారా ఏమైనా?" అనడిగింది. ఆ గొంతులో ఆందోళనవుంది, ఆ ఆందోళనని స్వాధీనంలో వుంచుకోవాలన్న కోరికావుంది.

మాట్లాడకుండా, తల ఊపాడు ఇవాన్.

"నేను వెళ్ళనా" అంది పావా.

పావావంక చూస్తూ "ఉన్నా పర్వాలేదు" అన్నాడు. అక్కడ నిలబడివున్నది పావా అని యిప్పటికీ గుర్తించినట్టులేదు. తర్వాత ఓల్గావైపుకు తిరిగాడు. "గతంతో నీకేమీ నిమిత్తం వున్నట్టు కన్పించడంలేదు. ఏది జరిగినా మనమేలుకే; అంతా మనమేలుకే. మనం అందరం యింకా మంచి కావాలని అన్వేషిస్తాం. అందరూ అన్వేషిస్తారు. అందుకే మనం మానవులం.... అన్వేషణ. అన్వేషణ మంచిదే. కాని....మన అన్వేషణవల

యితరులకి బాధకలగకూడదు. మన అన్వేషణతో యితరులకి బాధ కలిగించగూడదు." ఇవాన్ గొంతు గద్గదమైంది. మనసులో బాధ అతిశయించింది. "నన్నంత కాలం ఎలా మోసగించగలిగావో అర్థం కావడంలేదు నాకు. ఎందుకు మోసగించావు నన్నంత కాలం?" అనడిగాడు బొంగురుగొంతుతో, "నువ్విలా చేస్తావని కలలోగూడా అనుకోలేదు నేను." అని గిరుక్కున వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు.

అతని వెనక ఒకడుగు ముందుకేసింది ఓల్గా. కాని అప్పటికే అతను మలుపుతిరిగి యిళ్ళచాటున మాయమైపోయాడు.

# 66

ఇంట్లో చదువులగదిలో అటూయిటూ తిరుగుతూ, ఆలోచించు కుంటున్నాడు ఇవాన్. 'ఆవిడ తిరిగి మళ్ళీ నాదగ్గరకే రావాలని నాకోరిక. కాని కోరిక నెరవేరదు. అది నెరవేరే కోరిక కాదు. ఇకలాంటి విషయాలాలోచించడం మానెయ్యాలి.'

ఈ గదిలోనుంచాగదిలోకి, ఆగదిలోనుంచీగదిలోకీ తిరిగాడు. పూర్తిగా అలసిపోయేదాకా తిరుగుతూనేవున్నాడట్లా. అంతా సుస్పష్టంగావుంది. ప్రతిచిన్న విషయాన్నిగురించీ యిదివరకే దీర్ఘంగా ఆలోచించాడు. ఐనా హృదయంలో బాధ తగ్గలేదు; ఉపశమించడం లేదు.

'వాళ్లు నన్ను మోసగించారు నిజమే; అంత సిగ్గుచేటింకోకటిలేదు. కాని అంతకంటే సిగ్గుపడాలిసిందింకోకటుంది: ఓల్గా నన్నిప్పుడు ప్రేమించడం లేదని తెలిసికూడా, ఇక నా అవసరం ఆవిడకి లేదని అర్థమైన తర్వాతగూడా, నా ఆలోచన

లెప్పుడూ ఆవిడవైపుకే పోతాయేమిటి? ఎందుకని? నా ఆత్మ గౌరవం ఏమైనట్టు? నా గర్వం ఏమైనట్టు? ఐనా, యిప్పుడు నేను ఆ ఆత్మగౌరవాన్ని గురించీ, గర్వాన్ని గురించీ, అభి మానాన్ని గురించీ ఆలోచించడం దేనికి? అంతకంటే ముఖ్యమైన విషయం ఇంకొకటుంది. నా గౌరవం పోయిందనేదీ, నా కవమానం జరిగిందనేదీ కాదు ముఖ్యం. ఇంకా ఆపాత ఆచారాల తుప్పు నన్ను పట్టుకు తింటోంది. లొగునోవ్ చెప్పిందే నిజం. నేనుచేసిన మిగతా పనులన్నీ మంచివే; నాయంతట నేను, స్వచ్ఛందంగా వచ్చాను యీ తైగాప్రాంతానికి. నా శాయశక్తులా సేవచేద్దామని, ఒక సద్మానపుడిలా, ఒక మంచి కమ్యూనిస్టులా, వచ్చాను. కాని, భర్తగా నాధర్మాన్ని నేను పాలించలేక పోయాను; భర్తగా నా బాధ్యతని నిర్వహించలేక పోయాను. తావ్రోవ్ అపరిచితుడే; ఏమీ సంబంధంలేని వాడే; ఓల్గా తెలివితేటల్నీ, అభిలాషనీ, ఆసక్తినీఅతనుగుర్తించగలగడ మేమిటి? నేను, ఆవిడ భర్తని, ఆవిడతో ఎనిమిదేళ్ళు కలసిమెలసి వున్నవాడిని, నేను గుర్తించలేక పోవడమేమిటి? ఆవిడ ప్రయత్నాల్ని నేనెందుకని సమర్థించలేను? వార్తాపత్రికకి మొట్టమొదటిసారి వ్యాసంవ్రాసి నిరుత్సాహపడినప్పుడు నేనావిణ్ణి ఎందుకని ఉత్సాహపరచలేదు? తర్వాతావిడచేసే ప్రయత్నాలనెందుకని ప్రోత్సహించలేదు? తావ్రోవ్‌గూడా ఎప్పుడూ ఏదోవొక పనిలో మునిగుండే మనిషే గదా? అత నావిడకోసం కొంతకాలం వెచ్చించలా? నేనెందుకు చెయ్యలేను ఆపని? నిజంగా తీరికలేకనేనా? మరి, పేకాట ఆడడానికీ, గోరోద్కి ఆడడానికీ తీరికదొరికేదేంనాకు? అదికాదు అసలు సంగతి. నిరుత్సాహపడే మనిషికొక్కొక్కసారి ఒక్కమాట చాలును ప్రోత్సహించడానికి. జరిగిన సంగతులు కాదనడానికి

పిల్లేదు, కాదని ప్రయోజనంలేదు: ఆవిడ చదువుకంతరాయం కలగడానికి కారణం నేను. ఇన్‌స్టిట్యూట్‌లోంచి మూడోయేట బయటికి తీసుకొచ్చేశిందినేను. అప్పుడు నేనొక పెద్ద ఆదర్శ భర్తనని అనుకున్నాను. నాభార్య కిన్ని విధాల విద్యలో ప్రవేశం కలిగించుతున్నాను గదాఅని సంతోషించాను. అదే నా కూతురైతే, యూనివర్సిటీ వదిలొస్తే వూరుకునే వాణ్ణా? మళ్ళీ తిరిగి యూనివర్సిటీకి పంపేవాణ్ణికాదూ? ఎట్లాగోట్లా నచ్చచెప్పి మరీ పంపేవాణ్ణికదూ? మరి నా భార్యనిగురించి అంత బాధ్యతారహితంగా ఎందుకు ప్రవర్తించినట్టు?'

అటూయిటూతిరుగుతూంటే, అద్దంలో రూపు కనిపించింది; 'ఏమిరూపు, ఏమికథ! ఆగడ్డం యేమిటో?....ఇకీ తతంగంచాలు. ఎందుకొచ్చిన నటన! ఎందుకొచ్చిన సన్యాసి రూపు!'

వెంటనే గడ్డం గీసుకున్నాడు. చెంపలూ, గడ్డమూ యూ-డి-కలోన్‌తో తుడుచుకున్నాడు. మళ్ళీఅద్దంలో చూచుకున్నాడు. బ్రష్‌లాగా నిలబడిష్తుంది జుత్తు; కనుబొమలు చిందర వందరగా వున్నై. అవన్నీ సర్దుకుంటూ, నిట్టూర్చాడు ఇవాన్. ఇకిప్పుడేంచెయ్యాలి? ఈ సాయంత్రమంతా గడిపేదెట్లా? చదవాలంటే బుద్ధిపోలేదు. వ్రాద్దామని కలందీసుకుంటే చేతులోంచిజారి క్రిందపడింది. ఒంటరితనం. మనశ్శాంతిలేదు.

హాస్పిటల్ కెళ్ళి, అక్కడేంజరుగుతూందో చూచివద్దామని బయల్దేరాడు చివరికి. తలుపు దగ్గరకింకా వెళ్లనైనాలేదు, తలుపు తట్టిన చప్పుడు. పావావచ్చింది లోపలికి; గదంతా అత్తరు వాపులా గుబాళించింది.

వస్తూనే పలకరించింది.

జవాబివ్వకుండా, ఏమిటన్నట్టుచూశాడు ఇవాన్. ఇంటి కొచ్చిన అతిథంటే చూపవలసిన శ్రద్ధగూడా చూపలేదు.

"పనిమీదొచ్చాను." అంటూ, ఆయన వైముఖ్యాన్ని గమనించిగూడా గుర్తించనట్టు వెళ్ళి టేబుల్ దగ్గర కూర్చుంది.

"ఎప్పుడో ఏదో వొకటి మీదేసుకునే తిరుగుతుంటారు మీరు" అన్నాడు ఇవాన్, ముభావంగా.

"ఔనుమరి. నిమిషం తీరికుండదునాకు. ఈరోజుల్లో ఎవరిబ్రతుకు వాళ్ళు బ్రిదకాలనుకుంటే యెట్లా? కుదరదు. ఏదోవొక సంఘసేవ చేస్తుండాలి, చెయ్యగల ప్రతి స్త్రీనీ."

"ఐతే, యిప్పుడిక్కడ కొచ్చింది సంఘసేవ పని మీదనా?"

"అయ్యయ్యో. అదికాదు! వ్యక్తిగత విషయాల్ని గురించి మాట్లాడదామని...."

"గర్భస్రావాన్ని గురించే ఐతే, యిక మాట్లాడడంగూడా అనవసరమే" అని అడ్డుతగిలాడు ఇవాన్ నిర్మొగమాటంగా.

పాషా సిగ్గుపడిపోయింది; కాదన్నట్టు తలాడించింది. "భలే వారే మీరు!"

"నిజమే. నేను భలేవాణ్ణే."

"నేనంటే మీకంత కోపం యెందుకో అర్థంగావడంలేదు నాకు" అన్నది పాషా, రాజీ చేసుకుంటున్నట్టు; "మీరంటే మొదట్నుంచీ యిష్టమే నాకు; నిజంగానే; ఇప్పుడు మరీనీ. అంటే, అదగాదు. మీకునేనంటే కోపం రావలసిన అవసరం

యేమీలేదు. అదీ. సరేనా. త్వరలోనే వెళ్లిపోతున్నాంమేం. మావారిని మాస్కోకి రమ్మనమని పిలుపొచ్చింది. ఇక్కడపని చెయ్యడం కష్టంగా వుంటాదాయనకి. అదీగాక, ఆఫీసుమనిషాయె అయన." అని ఒక్కక్షణం ఆగింది పావా; వెళ్ళిపోతున్నాం అన్న విచారంగూడా వున్నట్టులేదు, "అదీ. యిక వెళ్లిపోతాం యిక్కడనుంచి. మాస్కోకి."

"ఎప్పుడో వెళ్లిపోవలసింది. అన్నట్టిప్పుడు నాకుపనుంది; నేనెళ్లిపోవాలి."

"ఎందుకంతతొందరపడతారు ? నన్నొదిలించుకోవాలనా" అంటూ చేతిసంచీ తెరచి, కవరొకటి బయటికి తీసింది పావా. "మీకీ కవరందించమని అడిగింది ఓల్గా పావ్లోవ్నా. నేను కాదనలేక పోయాను. ఇలాంటిపరిస్థితుల్లో ఆవిణ్ణి కంగారు పెట్టడం మంచిదికాదు చూడండి."

ఓల్గా కెదురుపడిననాడే తెలిసింది పావాకి, ఇవాన్ ఆత్మ సంయమం వున్న మనిషని. ఫర్వాలేదు, భయపడవలసిన అగత్యం యేమీలేదులే అనుకునే తీసుకొచ్చిందిప్పుడీకవరు. టేబుల్ మీద పెట్టిన కవరు ఆయనవైపుకుతోసి, యింకా స్తిమితంగా విశ్రాంతిగా కూర్చుంది కుర్చీలో. చేతితో తల సర్దుకుంటూ:

"చూశారుగా, నేనెంత సదుద్దేశంతో వచ్చానో, ఇకనైనా నన్ను మర్యాదగా చూడండి. ఇలాంటి పనులు చేసిపెట్టే ఆడవాళ్లు బహుఅరుదు, ఏమనుకున్నారో"

"ఔనౌను." అన్నాడు ఇవాన్ కోపంగా; "అరుదు కాబట్టే బ్రదికిపోయాం, లేకపోతే యిలాంటి రాయబారాలెవరు నడుపుతారు?"

"ఏమిటీ, వాళ్లిద్దరికీ గూడా నేనే రాయబారం నడిపా లనా మీ వుద్దేశం?" అని, నిజంగానే, ఆశ్చర్యపోతూ అడిగింది పావా; "నన్ను నమ్మకేం వాళ్ళు! నిజం చెబుతున్నాగామీకు; వాళ్లిద్దరికీ రాయబారాలు నడపమనడిగితే, మహారాజులాగా నడిపేదాన్నిలాగా కనబడతానేమోగాని నేను, నిజం చెబుతున్నా, ఎంతవొట్టుబడితేఅంతవొట్టు; అదంతా శుద్ధ అబద్ధం."

"ఒట్లు గూడానా!" అంటూనవ్వాడు ఇవాన్ కోపంగా; "ఎందుగ్గాని మీరిక మీదారిని వెళ్ళడం మంచిది. ఒక్కోసారి నాకు మరి పిచ్చికోపం వస్తుంది. కోపంవస్తే మనిషినిగాను నేను."

పావా వెళ్లిపోయింతర్వాత, కవరు చించాడు ఇవాన్; చేతులెక్కడ కాలిపోతాయో ఆకాగితం తగిలి అన్నంత భయంగా తీసి చూశాడా వుత్తరం.

"మన సంభాషణ అంత తొందరగా, అంత శాంతియుతంగా ముగిసినందుకు సంతోషించాలినేను" అని వ్రాసింది ఓల్గా; "కాని నాప్రవర్తనకి మీరు సత్యదూరమైన అర్థాన్ని కల్పించుతున్నందుకు చాలా వ్యధపడుతున్నాను. మీతో కలిసి వుంటూన్నప్పుడు మిమ్మల్ని నేనేమీ మోసగించలేదు. నిజమే, నేనుసంతోషంగాలేను; అంతవరకే. జీవితంలో నాస్థానాన్ని నేను పొందాలనీ, నిర్ణయించుకోవాలనీ నేననుకున్నప్పుడు, మీరు నా ప్రయత్నాల్ని హర్షించలేదు సరిగదా, ఉదాసీనంగా వున్నారు; పట్టీపట్టనట్టూగుకున్నారు. మీపనిలోనే నాకూం ఆసక్తి కలిగించాలని చూశారు. చివరికొకసారి సవ్వేశారు గూడాను, నేనొక చిన్నపిల్లనైనట్టు. నేను తావ్‌రోవ్‌ని కలుసుకున్నప్పుడు..."

నిజంగానే చేతిలో కాగితం కాలుతున్నట్లనిపించింది ఇవాన్‌కి; నలిపవతల పారేద్దామనుకున్నాడు.

"ఎంత సాహసం!" అని గొణుక్కున్నాడు.

"....అప్పుడతన్ని స్నేహితుడిగానే స్వీకరించాను." ఉత్తరం అవతల పారేద్దామనిపించింది, కాని పారెయ్యలేక పోయాడు. "తావ్‌రోవ్‌గూడా అంటే. నేను స్త్రీని గాబట్టే కాదతను నేనంటే అంత ఆసక్తి చూపించింది. స్నేహితుడిగా సలహాలిచ్చాడు. అందువల్లనే మాకు పరస్పరం అంత ప్రగాఢ విశ్వాసం కుదిరింది. ఐనా తర్వాతనాకు గర్భం వచ్చినప్పుడు, మీతోనే వుందామని నిర్ణయించుకున్నాను. మనకు పుట్టబోయే బిడ్డ మన పాతసంబంధాలకి పునర్జీవం పోస్తుందనుకున్నాను. చాలా వ్యథ పడ్డాను, బాధపడ్డాను; మీరూ చూశారు. కాని కాలం గడుస్తుందనీ, బిడ్డ పెద్దదౌతుందనీ, మళ్లీ మనంహాయిగా వుండగలమనీ ఆశించాను. కాని అంతా హాస్పిటల్లోనే ముగిసి నాక, నాఆశలు నిరాశలైనై; నేను మిమ్మల్ని వదలేశాను.

"మీరు నన్నుగురించి మరీ చెడ్డగా ఆలోచించరనే నమ్మకంతో వ్రాస్తున్నాను యీజాబు. జరిగినదానితో, పాషాకేమీ సంబంధంలేదు.

"మీరు సర్వదా సుఖంగానే వుండాలనే నాకోరిక.

—ఓల్గా స్త్రొగనోవా"

'అంతా "నేను, నేను, నేను," తప్ప. నన్ను గురించి ఆలోచనేలేదు. అదీ ఒకందుకు మంచిదేనేమోలే' అనుకున్నాడు ఇవాన్.

రెండు చేతులతోనూ ముహం కప్పుకుని, తలవంచుకు కూర్చున్నాడు కొంతసేపు. తర్వాత లేచి, దూరాన ఆకాశాని కేసిచూస్తూ,

'ఓగ్లామంచిది, చాలామంచిది; నేనావిణ్ణి ప్రేమించ డంలో తప్పేమీలేదు. నేనేమీ పొరపడలేదు.' అనుకున్నాడు ఇవాన్.

# 67

"నేనేం చెయ్యాలో చెప్పు, ఎలీనా!" అనడిగింది వార్యా.

ఎలీనా కాళ్ళమీద తలపెట్టుకుని, పచ్చగడ్డిమీద పండుకుసుంది వార్యా. అంతవరకూ కలుపుదీసి, ఆ కలుపుదీసిన పచ్చని మొక్కలప్రక్కనే, తోటలో, విశ్రాంతి తీసుకుంటున్నారు యిద్దరూ. కొండవాలులో ఎక్కడచూచినా, రంగు రంగుల దుస్తులు. వాళ్ళందరూ స్త్రీలు, మధ్యమధ్య తెల్ల చొక్కాలేసుకుని, తిరుగుతున్నవాళ్ళు మగవాళ్లు. నునువెచ్చని గాలి. పండుగదినంలా వుంది.

ఆవేళ ఆదివారం. కాని గనులకి దూరంగా నదిలో మట్టితీసేయంత్రం పనిజేస్తూనే వుంది. విద్యుత్కేంద్రం గొట్టాల్లోంచి పొగ పైకి లేస్తూనే వుంది. దూరాన, చుక్కల్లా కనబడుతున్న బళ్లు, అటూయిటూ తిరుగుతూ వాటిపని అవి చేస్తూనే వున్నై. బంగారుగనుల్లో పని ఆగకుండా సాగుతూనే వుంది. అక్కడుండే ప్రజల అవసరాలన్నీ - తిండి, గుడ్డ, ఇల్లు, చదువు.....ఆగనులమీదా ఆధారపడివున్నై. అక్కడ పని జేసే ప్రతిమనిషికీ తెలుసాసంగతి. పనిజేసేది హాస్పిటల్లోనే

ఐనా, తాను హాస్పిటల్లో చేసేపనికీ, యీ గనుల్లో జరిగే పనికీ సన్నిహిత సంబంధం వుందని తెలుసు వార్యాకి. కొద్దిరోజుల్లో యీ ఫెల్డ్ షెర్ కోర్సు పూర్తౌతుంది; తర్వాత వైద్యకళా శాలలో చేరేందుకు ప్రయత్నిస్తుంది. అంతాయిసుందే నిర్ణయమై పోయివుంది. వార్యా జీవితానికి చక్కని భవిష్యత్తుంది. కాని అప్పుడప్పుడూ, తనది వొంటరిజీవితమనీ, ప్రేమతో వెల్లివిరిసే జీవితమని అనిపిస్తుంటుంది.

"ఏంచెయ్యాలో అర్థం కావడంలేదు" అన్నది మళ్ళీ, గనులు వాల్చి. ఎలీనాచుట్టూ చేతులు పెనవేశి, సంబోధిస్తాం దామకుని:

"ఆయన అడుగుల చప్పుడైతే చాలు, వొళ్ళంతా వొణికి పోతుంది. అది మంచిదికాదు; కాదా? సిగ్గుచేటు కూడానేమో; కానేంచెయ్యను; నావల్ల గాపడం లేదు. ఆయనిదివరకెలా నవ్వేవారో, గుర్తుందా, ఎలీనా?"

"ఔనమ్మా! గుర్తుంది."

వార్యాలేచి, దుస్తులు సరిజేసుకుంది.

"డెనిస్ అంటే బాగా ప్రేమేనా నీకు?" అనసగింది మృదువుగా.

"ప్రేమేనమ్మా!" అంది ఎలీనా.

"ఆయనలేకుండా బ్రదగ్గలవా నువ్వు?"

"పిచ్చిపిల్లా! ఏంమాటలవి?"

"అదికాదు, బ్రదగ్గలవా?"

"బ్రిదుకుతానమ్మా. కాళ్లూ, చేతులూ లేనివాళ్ళు బ్రిదకడంలా. ఒక్కతలలేకుండా పోతే తప్ప...."

"కోపగించుకోకాకండీ; డెనిస్ అంటే యెంత ప్రేముందో తెలుసుకోడానికని అడిగాను."

"సామాన్యస్త్రీ తనభర్తనెంత ప్రేమిస్తుందో, అంత...."

"మొదట్నుంచి అంతేనా ?" అనడిగింది వార్యా, ఎలీనా కెదురుగా మోకాళ్ళమీద కూర్చుని, సూటిగా చూస్తూ.

"ఆహా. పుట్టిన మరునిమిషం నుంచీనీ !"

"హాస్యంగాదు, నిజంచెప్పు. ఐనా, నువ్వదృష్టవంతు రాలివి."

"నీకూ పడుతుందమ్మా ఆ అదృష్టం. ఇప్పుడుమాత్ర మేమమ్మా నీకు. అందమైన దానివి, తెలివి తేటలు గలదానివి. భవిష్యత్తంతా నీదే !"

"మరి ప్రేమ ?"

"అదీ వస్తుంది"

"ఏమిటా వచ్చేది ?" అంటూ, అప్పుడే పరిహారిపైన తలపెట్టి, అడిగాడు లొగునోవ్.

"ఓహో మీరా?" అంటూ తలలేపి చూచింది వార్యా; వార్యాలాగానే, లొగునోవూ బాధపడుతున్నాడు. "ఎక్కణ్ణుంచీ రాక ?"

"సమావేశం నుంచి."

"ఏం సమావేశం ?" అంటూ ఎగిరిలేచింది వార్యా; మోకాళ్ళకంటిన దుమ్ము దులుపుకుని, లొగునోవ్ దగ్గరకెళ్ళి, "మరి నాకు చెప్పలేదేం?" అనడిగింది.

"అనుకోకుండా జరిగింది"

ఎలీనా తెల్లబోయింది: "ఏమిటి విశేషం, లోగునోవ్!"

"ప్రభుత్వంనుంచి సమాచారం వచ్చింది. ఇవ్వాళ తెల్లవారుఝామున నాలుగింటికి, జెర్మన్లొచ్చి, మనపట్టణాలమీద బాంబులేశారు."

"తెల్లవారుఝామున నాలిగింటికా?" అని విస్తుపోయింది వార్యా; "అప్పుడు నేను హాస్పిటల్లో రోగుల్ని చూస్తున్నా. మనకిక్కడ ఏడుగంటలముందు తెల్లవార్తుంది."

"యుద్ధం!" అంటూ అరిచింది ఎలీనా; ఆ గొంతువిని వార్యా, లోగునోవ్ లిద్దరూ వులిక్కిపడ్డారు. "మళ్ళీయుద్ధమా! పాడుయుద్ధం!" ఆవిడ ముహమంతా భయంతో పాలిపోయింది. 1916 లో వొచ్చిన యుద్ధం ఆవిడ తండ్రినీ, యిద్దరు అన్నల్నీ పొట్టన బెట్టుకుంది, ఇప్పుడు మళ్ళీయుద్ధం. ఈయుద్ధంలోకి తనభర్తా, తన పెద్దకొడుకూ వెళ్తారు. వెళ్ళక తప్పదు.

# 68

పదినిమిషాల్లో కొండవాలంతాఖాళీ; ఇళ్ళన్నీ ఖాళీ. అందరూ నడిబజారులో సమావేశమయ్యారు.

"యుద్ధం!"

ఉత్తరప్రాంతానికి చేరేముందా అశుభవార్త వేలకొద్దీ కిలోమీటర్లదూరం ప్రయాణంచేశొచ్చింది.

రష్యన్ కార్మికుల్నీ, గనిలో పనివారినీ, యకూత్ సమిష్టిక్షేత్రం రైతుల్నీ, ఇవెంక్ వేటగాళ్ళనీ ఉత్తేజపరిచే కంచుగంటలా మ్రోగిందావార్త.

"మన మాతృభూమి !"

తైగా ప్రాంతంలో దారులవెంట, అడవుల్లోకీ, కొండల్లోకీ ప్రాకింది. తుపాకిమీద చేయివేశీ, కనులు తెరచి వున్నాడు వేటగాడు. అడవిపందుల్ని వేటాడడం ప్రమాదం; గాయపడిన జంతువులతో తలపడడం భయంకరం; కాని ప్రమాదమంటే వేటగాడికి లెక్కలేదు; చిన్నప్పటినుంచీ ప్రమాదం మధ్య పెరిగి పెద్దవాడైన మనిషి అతను. అంచేత అతనిగుండె ఉక్కుగుండె. అడుగడుగుకూ ప్రమాదం; అడుగడుగుకూ ప్రాణభయం. ఐనా, తనసాటిమానవుడి ప్రాణం దీయడమంటే.... అదెప్పుడో అత్యావసర పరిస్థితుల్లో జరిగేపని. మానవుణ్ణి చంపాలంటే భయం. సైనికుడిగా ఆ భయాన్ని జయించేదెలా ?

"ఫాసిస్టులు క్రూరమృగాలకంటే కనాకష్టం" అని చెప్పింది మార్ఫా, ఉచఖాన్‌లో జరిగిన మీటింగులో; "పిచ్చెక్కిన తోడేలుకంటే ప్రమాదం ఫాసిస్టు. మనల్ని, మన పిల్లల్ని బానిసలుగా చేసుకునేందు కొస్తున్నాడు. వాడికింకాస్త మంచితిండీ, యింకాస్త మెత్తటిపరుపూ దొరుకుతుందీ అనుకుంటే, మనందర్నీ యీ భూమ్మీదనుంచి వూడ్చెయ్యడానికి గూడా వెనుదియ్యడు. అలాంటి క్రూరుణ్ణి మనదేశంలో అడుగుపెట్టనిస్తామా ?"

"సోఖ్ ! సోఖ్ !" అని అరిచారు సమిష్టిక్షేత్రం రైతులు.

"గొప్పజాతిని గురించిన కట్టుకథకట్టిందా ఫాసిస్టులే" అని చెప్పాడు ఇవెంక్ మత్స్యసహకార కేంద్ర అధ్యక్షుడు. వాళ్ళమీటింగు, కొండల్లో, అడవులమధ్య పారే సెలయేటిగట్టున జరిగింది. "ఆకథ ప్రకారం రష్యన్లు [illegible]

జెర్మన్లూ, మన పొరుగునున్నుండే జపాను వాళ్లూ. ప్రపంచంలోకల్లా గొప్పవాళ్ళట. గొప్పజాతివాళ్లట. మిగతా జనం అంతా, మనం అంతా బరువులు మోయాల్సిన జంతువులం; అంటే మనం అంతా వాళ్ళకి మంచుదుప్పలకిందా, గొండగాడిదల కిందా లెక్కన్న మాట. కాడికిగట్టి తోల్తారు; కాదంటే చంపపతల పారేస్తారు. కాని రష్యన్లు, అంటే మనసోవియెట్ ప్రజలు 'మానవులంతా ఒకటే!' అంటారు; 'గొప్పజాతని చెప్పే కబుర్లన్నీ ఒట్టి పచ్చి అబద్ధాలు. దుర్మార్గులూ, దుష్టులూ చెప్పేకబుర్లు' అంటారు. మనమూ చూస్తున్నాంగా. సోవియెట్ ప్రభుత్వంలో ఇవెంక్లూ, రష్యన్లూ, చైనీయులూ, యకూత్లూ .... అందరూ సమానంగా వుండడంలేదూ ?"

"ఔనౌను. అందరం సమానమే." అన్నారందరూ ఒక్కుమ్మడిగా; "మనం అందరం మంచివాళ్ళమనే సోవియెట్ ప్రభుత్వం విశ్వాసం"

"మరలాంటి ప్రభుత్వాన్ని రక్షించడానికి సిద్ధమే నన్న మాటేగదా మనం ?"

"తప్పకుండానూ. మన ప్రాణాలొడ్డి కాపాడుకుంటాం సోవియెట్ ప్రభుత్వాన్ని !"

మనంగూడా ఒక సైనికదళం క్రిందనే లెఖ్ఖ" అన్నాడు లొగునోవ్, గనులదగ్గర జరిగిన మహాసభలో, "ఉక్కూ, ఇనుమూ లాగానే బంగారం గూడా యుద్ధంలో పాల్గొంటుంది. మనం వేసుకున్న పథకంలో కంటె ఎక్కువ బంగారాన్ని ఉత్పత్తిచెయ్యాలి మనం. అదే మనం శత్రువుమీద తీసే దెబ్బ.

ఏమాత్రం యేమరగూడదు! యుద్ధభూమి వెనకగూడా ఇనుపక్రమశిక్షణ వుండాలి!''

''మనం గెలుస్తాం; కాదూ? మనం తప్పకుండా జయించాలి" అన్నది వార్యా, ఇంటికెళ్తూ, దారిలో లొగునోవ్‌తో; "చరిత్రపుటల్ని వెనక్కి త్రిప్పడమంటూ వుండదు. శత్రువులు మనమీద అకస్మాత్తుగా పడ్డారు. ఐనా ఫర్వాలేదు. మనతడాఖా చూపిద్దాం. మన సర్వశక్తుల్నీ సమీకరిద్దాం....''

"ప్రస్తుతానికి సైనికసమీకరణని పశ్చిమప్రాంతాలకు మట్టుకే పరిమితం జేశారు; అంటే ఉరల్స్ వరకూ నన్నమాట" అన్నాడు లొగునోవ్ ఆలోచిస్తూ; "ఈ యుద్ధం యిలాగే యీడిస్తే, తర్వాత యకూతియాలో గూడా జరగొచ్చును సమీకరణ; బహుశా తర్వాత, దక్షిణ యకూతియా. బహుశా యీవుత్తరప్రాంతంలో అర్హులైనవాళ్ళనిగూడా సమీకరించరనే నా అభిప్రాయం. ఎందుకంటే ఇక్కడ జనసంఖ్య తక్కువ. వున్న పరిశ్రమలా ముఖ్యమైనవి: బంగారం, ఉన్ని! ఫిన్లండ్ యుద్ధం జరిగినప్పటిలాగానే, బాధ్యతాయుతమైన పదవులు నిర్వహించేవాళ్లని సమీకరణలోకి తీసుకోకుండా వదిలిపెడతారేమో గూడ; కాని నేనుమట్టుకు వ్యక్తిగతంగా అందుకంగీకరించను. యుద్ధరంగానికెళ్లడానికి అనుమతి నివ్వాలని కోర్తాను."

"నేనిదివరకే మిలిటరీ కమిస్సారియెట్‌కి దరఖాస్తు పెట్టుకున్నాను'' అంటూ వచ్చాడు డెనిస్ యింటివరండా మెట్లు ఎక్కుతూ. కుటుంబం అంతా అక్కడే కూర్చునున్నారు. యుద్ధరంగానికి గూడా ఫెల్డ్‌షెర్ గానే పంపుతు

న్నారు నన్ను" అని చెప్పాడేదో గొప్పవిజయం సాధించు కున్నట్టు.

అతనికి వేద్దామని తీసిన చాపలాగే చేత్తోపట్టుకుని, "నిజంగానా, డెనిస్! నన్నుగూడా ఆలోచించకుండానా? నాతో చెప్పనైనా చెప్పకుండానేనా?" అనడిగింది ఎలీనా.

"ఏం? నిన్నడిగితే వొద్దనేదానవా? వల్లగాదని వొప్పించేదానివా?"

ఎలీనా జవాబు చెప్పలేదు; ముహమంతా కన్నీటిలో కరిగిపోతున్నట్లయ్యింది. తల్లి యేడవడం జూచి, చిన్నపిల్ల నటాషా గావురుమంది; అంతకంటే యింకాస్త పెద్దపిల్లలు ముక్కులు చీదడం ప్రారంభించారు.

"బాగానేవుంది సంగీతకచ్చేరి!" అన్నాడు డెనిస్ అసంతృప్తిగా; "అది నాకర్తవ్యం...."

"మా కర్తవ్యమూనూ" అంది ఎలీనా కొంగుతో కన్నీరు తుడుచుకుంటూ; "బోరిస్ గూడా వస్తాడు మీతో పాటు."

"ఓ, తప్పకుండా వస్తాడు!" అన్నాడు అనవసరంగా గట్టిహామీనిస్తూ. తన పెద్దకొడుకు గూడా యుద్ధరంగానికి బయల్దేర్తాడనేప్పటికి కంగారు పుట్టింది డెనిస్ కి; ఆ కంగారు దాచుకునేందుకే అన్నాడు అంతగట్టిగానూ. ఇప్పుడు బోరిస్ విద్యార్థి; కామ్సొమోల్ సభ్యుడు.

ఇవాన్ ఇవానొవిచ్ కి వార్త హాస్పిటల్లో తెలిశింది. వార్త తెచ్చింది. గర్భంతాటని చెప్పి, గర్భస్రావానికి ఆపరేషన్

చేయించుకున్నావిడ. ఇప్పటికీ హాస్పిటల్లోనే పనిచేస్తోందావిడ; సర్జికల్ వార్డ్‌లో కాదు. ఆవిణ్ణి చూడడమంటేనే గిట్టదు ఇవాన్‌కి. 'నాపొడే పడదు' అనేదావిడ నిష్ఠూరంగా. ఆవిడే పరుగెత్తుకొచ్చింది, ఆ సంగతులన్నీ మరచిపోయి. వచ్చి,

"యుద్ధం ప్రారంభమైందట, ఇవాన్ ఇవానొవిచ్ ! పరిగెత్తండి రేడియో దగ్గరికి" అంటూ చెప్పింది ఏడుస్తూ.

ఇవాన్ పరుగెత్తాడు.

రేడియోలో మొలటొవ్ భాషణవిని, నెమ్మదిగా, విశ్రాంతిగది బయటి కొచ్చాడు. ఆ గదినిండా రోగులూ, డ్యూటీమీదున్న నర్సులూ వున్నారు.

అప్పుడే కోలుకుంటూన్న రోగుల మంచాల మధ్యనుంచి, అలాగే నెమ్మదిగా, నడుస్తూ బయలుదేరాడు. అలెగ్జీని పలకరించాడు; కాలుబాగానే వుంది, మూడువేళ్ళు తప్ప. దారిలో కనిపించిన డాక్టర్లతోనూ, నర్సులతోనూ ఒకటిరెండు మాటలాడాడు పరధ్యానంగా. అతని మనసక్కడున్నట్టు లేదు. ఆవేళ సాయంత్రమల్లా అలాగే వున్నాడు పరధ్యానంగా, ఏదో ఆలోచించుకుంటూ.

ఇంటిదగ్గర, డెనిస్ వచ్చేప్పటికి, సామానంతా సర్దుకుని మూటగడుతున్నాడు.

"చూశారా, ఏం జేస్తున్నానో .... బయల్దేర్తున్నా" అన్నాడు, మూటగట్టడంకోసం తాళ్లు పట్టుకుని.

"ఎక్కడికి ?"

"యుద్ధరంగానికి. నాదరఖాస్తిదివరకే పంపించేశాను. యుద్ధరంగంలో వుండే హాస్పిటల్లో చేస్తాను పని."

"యుద్ధరంగం యెందుకూ? మరీ ప్రమాదం గదూ? యుద్ధరంగానికి వెనకవుండే హాస్పిటల్‌కి పంపమని అడగండి; అక్కడ ఆపరేషన్లే గద్దు ఆపరేషన్లు. యుద్ధరంగంలో ఏముంటుంది? అప్పటికప్పుడు యేదో వొక అంగం కోసి పారెయ్యడం, గాయాలకి కట్లు గట్టడం, ప్రథమ చికిత్సలు చెయ్యడం, నెత్తురువరదలు, కొయ్యడం, కడగడం, తుడవడం, కట్లుగట్టడం .... ఒకదానితర్వాతొకటి, అదేవరస. అసలు ఆపరేషన్లు యుద్ధరంగం వెనకుండే హాస్పిటల్లోగాని జరగవు. యుద్ధరంగంలో మీలాంటి వాళ్లెందుకు? మాలాంటివాళ్ళం వెళ్తాం; ఒకరుపోతే యింకొకరు."

"మీరూ వెళ్ళాలనుకుంటున్నారా?"

"మరి?" అన్నాడు డెనిస్ సగర్వంగా; "నా కాగితాలుగూడా అన్నీ వచ్చేశాయి అప్పుడే!"

"నేనూ అక్కడికే, ఆ నెత్తురు వరదలుండే చోటికే, వెళ్తున్నాను. గాయాలనుంచి యెంతతక్కువ రక్తం కారితే అంతమంచిది; అంతతొందరగా కోలుకుంటారు. వేలాది ప్రాణాల్ని కాపాడే అవకాశం యుద్ధరంగంలోనే వుంటుంది. ప్రమాదం ఎక్కువైనా సరే, అక్కడికి వెళ్లడమే మంచిది.

## 69

పోర్చ్‌లో, ఒకబల్లమీద, కూర్చునున్నాడు ఇవాన్. ఉత్తరప్రాంతంలో ఎప్పుడూ విచిత్రంగా కన్పించే రాత్రి అది; తెల్లనిరాత్రి. నదివొడ్డునున్న చెట్లమీదుగా, ఎండిపోయిన [illegible]ంది; [illegible]గ పడేం దుకుగాను [illegible]

నదికవతలి గట్టున ఏదో పిట్టకూసింది; దగ్గరున్న పొద ల్లోంచి ఆ కూతకి జవాబొచ్చింది. దేశంమీద పడ్డ యుద్ధం యింకా చాలా దూరాన వుంది; కాని ఆ యినపపాదం చప్పు డిక్కడికీ వినిపిస్తోంది. ఇదివరకటిలా యిప్పుడు, రాత్రిళ్లు యువతీయువకుల ఆటపాటలేమీ వుండడం లేదు. పెద్దా, పిన్నా అందరూ ఒక్కసారి విచారగ్రస్తులై పోయారా అనిపిస్తోంది.

'సహజమే, ఈ ఆందోళన. జనం అంతా అంత ఆదుర్దా పడుతున్నారంటే .... సహజమే మరి' అనుకున్నాడు ఇవాన్; 'ప్రతివ్యక్తీ తన భవిష్యత్తుకూ, దేశభవిష్యత్తుకూ అవినాభావ సంబంధం వుందని భావిస్తున్నాడు. గనులలోనూ, సమిష్టి క్షేత్రాలలోనూ కనిపించే ఉత్సాహాన్ని గురించి చెబుతూ లొగునోవ్ యెంత స్పందించిపోయాడు ! మేమందరం - నేనూ, డెనిస్, లొగునోవ్, నికీతా.... - వెళ్ళిపోతాం యుద్ధరంగానికి. యుద్ధరంగానికి రానివాళ్లు యిక్కడేవుండి వాళ్లపనీ, మా పనీ గూడా చేస్తారు.'

పొదలచాటున దారిలో మాటలు విన్పించినై. వార్యా గొంతే అది.

"నిజమే, లొగునోవ్, మీరు చెప్పేది నిజమే. జీవితాని కది అర్థం కల్పిస్తుంది; జీవితం వృథా కాలేదనే విశ్వాసాన్ని కలిగిస్తుంది. ఔను, నిజమే; అవకాశం వచ్చినప్పుడు నీశక్తి సామర్థ్యాల్ని రుజూ చేసుకోవాలి. నీ ఆదర్శాలనుంచి ఆవేగం పొందే వీర కార్యం చెయ్యాలి." వార్యా గొంతు వణకుతు న్నట్టు స్పష్టంగా విన్పించింది; "మిమ్మల్ని చూచి నేను గర్వ పడుతున్నా, లొగునోవ్. నేనూ మీ అడుగుజాడల్లో నడిచేం దుకు ప్రయత్నిస్తా."

"మనం విడిపోయేముందు నువ్వనగల మాటలివేనా ?" అన్నాడు లొగునోవ్, విచారంగా.

తాను వినగూడని మాటలు వినిపిస్తాయేమోనని ఇవాన్ దగ్గాడు.

"ఇక్కడెవరో వున్నారు" అంది వార్యా, ఏదో పెద్ద బరువు దించుకున్నట్టు. యుద్ధరంగానికి వెళ్ళిపోయే స్నేహితుణ్ణి క్రామేడ్‌ని తాను మోసగించలేదు; అలా అని అతన్ని బాధ పెట్టనూ లేదు.

"డాక్టర్ ఇవాన్‌లా వుంది .... ఇవాన్ ఇవానొవిచ్ యేనా ?" అంది బల్లకు చాలా దగ్గరగా వచ్చింతర్వాత. పొదలలో మొక్కలటూ యిటూ వంచి చూచింది. "డాక్టరే !" అంది లొగునోవ్ వంక తిరిగి. "మేంవస్తే మీకేమీ అభ్యంతరం లేదుగదా" అనడిగింది, డాక్టర్ ఇవాన్‌ని.

"లేదు, లేదు. నేనే మీకు అభ్యంతరమేమో."

"లేదండీ, లేదు" అంటూ వెళ్ళి, ఇవాన్ ప్రక్కనే కూర్చుంది బల్లమీద. తన ఆవేగాన్ని దాచుకునేందుకు ముహం మీద పడుతున్న జుత్తు వెనక్కు సవరించుకుంది. "ఐతే, మీరుగూడా రేపే వెళ్ళిపోతారన్నమాట" అంది. ఆ గొంతులోని ఆప్యాయాన్నీ, విచారాన్నీ చూచి ఇవాన్ స్పందించిపోయాడు; అంతలోనే తేరుకుని లొగునోవ్ వంక చూచాడు.

"ఔనాను. వెళ్ళిపోతున్నాం" అంటూ గొణిగాడు మృదువుగా; "నదిలాగానే. మేమూ మామార్గం మళ్ళుతున్నాం. అదే, ఆ కామమష్కానదిలాగ .... కావాలనుకున్న దారిన, చాలా కాలం సంతోషంగా ప్రవహించింది అనది.

తర్వాత, ఆ నదిని మార్గంనుంచి మళ్ళించారు, బంగారాన్ని కడిగేందుకు; ఇసుకలోంచీ, వొండ్రుమట్టిలోంచీ ప్రవహించమన్నారు. అంతా మకిలి పని. ఇదివరకటి తళతళలేదా నీటికి, ఇదివరకులా పరిశుభ్రంగానూ లేదా నీరు. ఐనా, మళ్ళీ, కొంత దూరం పోయాక, తనపాత మార్గాన్నే ప్రవహిస్తోంది; మళ్ళీ ఎంతో పరిశుభ్రంగా .... తళతళలాడుతూ. మేమూ అంతే. మేమూ వస్తాం తిరిగి. మేము రాకపోతే, యింకొకరొస్తారు మా స్థానంలో."

"నేనూ బయల్దేరుతున్నా" అంది వార్యా నిశ్చయం చేసుకున్నట్టు; "ఇప్పుడే వదలమంటే, జిల్లాపార్టీ కమిటీ అంగీకరించడం లేదు. యకూత్ గ్రామాల్లోకి రాజకీయ ప్రచారం చేసేందుకు పంపుతున్నారు నన్ను. ఆ పనై పోగానే, యుద్ధరంగానికి పంపమని దరఖాస్తు పెట్టుకుంటాను మళ్ళీ. ఇకిప్పుడు వైద్య కళాశాలలో చేరే అవకాశం లేదు. ఇగోర్ లాంటి వాళ్ళుండి పోవాలిక్కడ: మంచిపనివాడు; శారీరకంగా బలమైన వాడు."

"మరి తావ్రోవ్ ?" అన్నాడు ఇవాన్ అకస్మాత్తుగా. ఎందుకన్నానా అని అతనే ఆశ్చర్యపోయాడు. భయపడుతూ చూచింది వార్యా, ఇవాన్‌ని.

"ప్రస్తుతాని కాయన యిక్కడే వుండి పోతున్నాడు" అని, వార్యాకిబదులు, లొగునోవ్ జవాబు చెప్పాడు.

లొగునోవ్ ఆమాటలన్న తర్వాత, కాస్సేపటిదాకా, ఎవ్వరూ మాట్లాడలేదు.

'ఎప్పుడూ ఆ భార్యని గురించే ఆలోచిస్తుంటాడెందుకు?' అనుకుంది వార్యా, కోపంవొచ్చి.

మళ్లీ ముహంమీద పడినజుత్తుని వెనక్కి సర్దుకుని, జడలు రెండూ రెండుచేతుల్తోను పట్టుకుని, వంగి చూచింది ఇవాన్ వంక.

వాళ్లు కూర్చునున్న బల్లని చేశిన వడ్రంగికి పార్కులో బల్లలెలా వుండాలో తెలిశినట్టులేదు; బాగా ఎత్తుపెట్టి చేశాడు. కూర్చుంటే కాళ్లు క్రింద ఆనవు; గాలిలో వ్రేళ్లాడుతుంటై. ఇప్పుడే గనక తనూ, ఇవాన్ ఇవానొవిచ్: ఒంటరిగా, యిద్దరే, యిక్కడ యీ బల్లమీద వుంటే .... కాని ఆయన వెళ్ళిపోతున్నాడు. యుద్ధరంగాని కెళ్ళిపోతున్నాడు. ఏం? ఐతే మాత్రమేం? తానూ వెళ్తుంది. అక్కడే వెదికి పట్టుకుంటుందాయన్ని. ఆయన్తో కలిసిమెలిసి చేస్తుంది పని; ఆయన కెదురయ్యే ప్రతి ప్రమాదాన్ని తానూ ఎదుర్కుంటుంది; తానూ పంచుకుంటుంది.

'ఎందుకు నన్నిలా తిరస్కరిస్తారు మీరు? నన్నిలా వేధించుకుతినడం ఎందుకు?' అని ఆక్రోశించిందావిడ ఆత్మ.'

లొగునోవ్ గూడా ఇక్కడే వున్నాడు. తాను ఇవాన్ ఇవానొవిచ్ కెంతో, తనకు లొగునోవ్ అంత. లొగునోవ్‌లో ఏ లోపమూ లేదు. ఆయన్నెందుకు ప్రేమించ గూడదు తను? తన ప్రేమతో అవసరంలేని వ్యక్తి వెనక పడడం దేనికి?

"ఛీ, ఛీ. పాడుదోమలు! మనమే వెంటబెట్టుకొచ్చినట్టున్నాం!" అంది వార్యా, విసుగ్గా, లొగునోవ్‌తో.

నిజంగానే, దోమలు బల్లచుట్టూ ముసురుతున్నై. మెడ [illegible] కొట్టుకున్నాడు లొగునోవ్, చేత్తో, దోమల్ని చంపడానికి. ఆ శబ్దానికి [illegible]

ముసిగి తేలుతున్న ఇవాన్ బహిర్ప్రపంచంలోకి వచ్చాడు. ప్రక్కనే కూర్చున్న స్నేహితుల్ని చూచాడు. చేంతీసి, వార్యా నుదటిమీదుంచాడు.

"దోమ !" అన్నాడు, అరచేతివంక చూసుకుంటూ; "కుట్టడంలా ? తినెయ్యడంలా ?"

"తినెయ్యనివ్వండి" అంది వార్యా, ఒక్కక్షణం ఆగి, తెల్లగా నవ్వుతూ.

"సరే, నేనెళ్లొస్తాను." అన్నాడు లొగునోవ్. దోమ కాటుకంటె బాధగా వున్నట్టుందా వాతావరణం అతనికి. "వెళ్తున్నా" అన్నాడు మళ్లీ. వార్యావంక తిరిగి, ఏమైనా అంటుందేమోనన్న ఆశతో.

"వెళ్ళిరండి" అంది, కరస్పర్శకోసమన్నట్టు, చేయి చాచి. ఇకప్పుడతను వెళ్లడమే మంచిదన్న భావం స్పష్టంగా కన్పించింది లొగునోవ్‌కి.

"రేపు మీరెళ్లబోయే ముందు వస్తానెండి" అని కేకేశింది, అతనెళ్లిపోతోంటే; ఏదో ఒకరకమైన అస్పష్టమైన జాలి కలిగి. తిరిగిగూడా చూడలేదు లొగునోవ్.

ఉన్నకొద్దీ, రాత్రి మరింత తెల్లనెక్కుతున్నట్టుంది; అందంగా వున్నట్లుంది. మంచారిన పచ్చిక మీదినుంచీ, పొదల మీదినుంచీ వచ్చే సువాసన మత్తెక్కిస్తోంది. నక్షత్రాలు మెరసిపోతున్నై. రేపు .... రేపు యింకేమీ వుండదు; మరేమీ మిగలదు.

ముందు ముందు తానెంత ఒంటరిగా వుండవలసి వస్తుందో ఆలోచించుకుని అల్లల్లాడి పోయింది వార్యా; [illegible] పోయింది.

"చలిగా వుందా ?" అనడిగాడు ఇవాన్. ఆ గొంతులో ఆప్యాయాన్ని చూచి, వార్యా మనసు కేరింతలు కొట్టింది. ఇకింటికెళ్ళిపోదాం" అన్నాడు ఇవాన్.

"అప్పుడే! ఇప్పుడప్పుడేనా! వొద్దు. మీరు రేపేగా వెళ్ళిపోతూంది ?"

"రేపెళ్ళిపోతున్నా కాబట్టే, యింటికెళ్దామంటున్నది. వెళ్ళి, సామానదీ సర్దుకోవాలి; ఉత్తరాలుగూడా వ్రాసుకోవాలి."

"ఇప్పుడెందుకూ ? ఇప్పుడే యెందుకూ, ఆ ఉత్తరాలు ?" అని గొణిగింది వార్యా.

ఆయనముందు తానిలా భయపడడం దేనికి ? ఎప్పుడూ సిగ్గుపడుతూన్న విద్యార్థినిలాగా మాట్లాడడ మేమిటి ఆయన్తో? ఆవిడలోని స్త్రీ అందుకెదురు తిరిగింది.

"మీరంటే పడిచచ్చేవాళ్ళంటే మీరుగూడా ఎంతో కొంత శ్రద్ధజూపడం మంచిది" అంది నవ్వుతూ అన్నట్లు; కాని అప్పటికే కళ్లు నిండారులైనై.

"ఐతే, నేనా వుత్తరాలు నేనంటే పడిచావని వాళ్ళకి వ్రాస్తున్నాననా నీ వుద్దేశం ?" ఇవాన్ నవ్వాడు;

"అదికాదు, మీరు వుత్తరాలు దారిలో రాసుకోవొచ్చు; బోటులో." అంటూ, యింకాస్త దగ్గరికి జరిగింది. కళ్ళంట నీళ్ళు ఏకధారగా కారుస్తూ, అతని భుజాలమీద దాచుకుంది ముహం. "వొద్దండీ! వొద్దొద్దు! నేనిట్లాగే గుండెపగిలి చస్తాననుకుంటా !"

ఇవాన్ ఇవానొవిచ్ కేమీ పాలుపోలేదు. కన్నీటితో తడిసిపోయిన ముహంవంక చూశాడు. వార్యా జుత్తుమీద

నుంచొచ్చే సువాసనా, శరీర సుగంధమూ, నునువెచ్చదనమూ,.... అన్నీ .... అంత సామీప్యంలో .... అంతదగ్గరగా.... కాని, స్త్రీఅంటే పురుషుడికి కలగవలసిన కోరిక కలగలేదు; ఆపిల్లంటే జాలివేశింది. హృదయం స్పందించింది. ఆవిడంటే తనకున్న బాధ్యత మరింత సుస్పష్టంగా గోచరించింది.

"వార్యా" అంటూ చేయి, మృదువుగా, ఆవిడ భుజాల మీదుగా పోనిచ్చి, పట్టుకుని లేపాడు. "నేనింకేమీ చెప్పలేను నీతో; ఒకటిమట్టుకు గుర్తుంచుకో: బహుశ ఇకెవ్వరినీ ప్రేమించను నేను; ప్రేమించలేను. ఇక్కడున్నదంతా ...." అంటూ హృదయాన్ని చూపాడు, "మాడిపోయింది. ఏడవ్వొద్దు. ఏడవకు. నాకుమాత్రం లేదూ వ్యథ? బాధ? అందుకని చనిపోయానా నేను? లేదు. చనిపోవాలని గూడా లేదు నాకు. నీకూ అదే సలహా యిస్తాన్నేను." అంటూ రెండు చేతుల్లోకి వార్యా ముహం తీసుకుని, చెంపలు ముద్దాడి, నడవడం ప్రారంభించాడు.

నదిపైపుకుదిగి, కొండవాలెక్కి యిళ్ళకెళ్ళి పోయారు. చిన్నపిల్లని చేయిపట్టుకుని నడిపించినట్లు, నడిపించి తీసికెళ్ళాడు ఇవాన్, వార్యాని.

# 70

నున్నటి రోడ్డుమీద పడి పరుగెత్తుతున్నై లారీలు. గాలి చల్లగా వీస్తోంది. కొండల మిట్టపల్లాలలో బడి, అక్కడక్కడా గుబురుగా పెరిగిన చెట్లమధ్యలోంచి ముందుకెళ్తోంది రోడ్డు. రెండుకొండల మధ్య యిరుక్కుని వొద్దులోరుసు.

కుంటూ ప్రవహిస్తోంది కామెనుష్కానది. ఆకాశంలోకి చొచ్చుకుపోతున్న పర్వత శిఖరాలు ఎర్రెర్రగా, పసుపుపచ్చగా, నీలినీలిగా కన్పిస్తున్నై.

“ఏడేళ్ళన్నా కాలేదు; ఎంత అభివృద్ధి సాధించామో, చూస్తే ఆశ్చర్యమేస్తోంది. ఏడేళ్ళ క్రితందాకా, సంచులు భుజాన వేసుకుని, కనబడిన కాలిదారెంటబడి వెళ్తుండేవారు జనం” అన్నాడు లొగునోవ్. పక్కనున్న కామ్రేడ్ భుజాలమీద చేతులేసి, పైకిలేచి నిలబడుతూ; “ఆరోజుల్లో, సముద్రానికి యీ బంగారు గనులకీ మధ్య పల్లెఅన్నమాట కన్పించేది కాదు. ఇప్పుడో....డజన్లకి డజన్లు. ఇదిగో చూడండి యిక్కడొకటుంది.”

చేయిచాచి చూపించాడు లొగునోవ్; లారీలో వాళ్ళందరూ లేచి నిలబడ్డారు లారీ పక్కల్నుంచీ, డ్రైవర్ నెత్తిమీది కప్పుమీదినుంచీ చూద్దామని. నేలలోంచి అప్పటికప్పుడు పుట్టుకొచ్చినట్టు కనిపించిదొక పట్టణం, కొండవాలుమీద. భవనాల కిటికీ అద్దాల్లోంచి సూర్యకాంతి ఎదురు తన్నుతోంది. బజార్ల నిండా మనుషులు, కార్లు, దూరాన్నుంచి వచ్చిన ఎడ్లబళ్ళు. పట్టణం అవతలవున్న కొండమీద చిన్నచిన్న చుక్కల్లా కన్పిస్తున్నై, గోళ్ళు. అక్కడొక పెద్ద గోళ్ళపెంపకం శాల వుంది. ప్రక్కనే వున్న పచ్చని పొలంలో ట్రాక్టర్‌ని నడుపుతూన్న దొక యువతి. ఆవిడ కనులు చూస్తూంటే, వార్యా గుర్తుకొచ్చింది లొగునోవ్‌కి. మనసులో బాధ నణచుకుని, వెనక్కి తిరిగి చూశాడావిడ వంక.

“ఆవిడ మా యకూతే!” అన్నాడు నికీతా, చేత్తో చూపుతూ, “ఇప్పుడైతే యువతులు ట్రాక్టర్లు నడుపుతూంటే చూచినప్పుడల్లా, వాళ్ళని నేనే నమ్మలేకపోతుంటా .... ఇక

ముందు ట్రాక్టర్ డ్రైవర్లంతా స్త్రీలే ఔతారనుకుంటూ" అంటూ కొండలవంకా, అడవులవంకా, నెత్తిమీద కప్పుతూన్న ఆకాశంవంకా ఆప్యాయంగా చూశాడు. ఔనుమరి; అదతని జన్మభూమి.

జూలై నెల వచ్చేశిందప్పుడే. తైగాప్రాంతమంతటా నీలినీలిరంగు పగళ్ళు. వెచ్చని రోజులు. వర్షపుజల్లుపడి, నది ప్రక్కనున్న మైదానాల్లోనూ, నదిమధ్య లేచిన నేలమీదా పచ్చని పచ్చిక పెరిగింది గుబురుగుబురుగా. ఇంతలో ఒక ఎలుగుబంటి కనిపించింది, తడియిసుకలో పడినడుస్తూ. ఏటి గట్టెక్కబోయి, కాలుజారి పడబోయి, వెనక్కి తిరిగి పచ్చిక లోంచి పోతోంది. నిలువెత్తున పెరిగివుంది పచ్చిగడ్డి; పీచేగాలికి గుఁయ్ఁ మంటూ వూగిసలాడుతోందటూ యిటూ. రాజ్యం కోల్పోయిన రాజులా వెళ్ళిపోతోందా ఎలుగుబంటి, దూరా నున్న కొండలమీది అడవుల్లోకి. జాలర్లొచ్చి, నీటి ఎలుగుబంట్లని పారదోలుతున్నారు. ఎప్పుడో ఒకప్పుడా పొదలో పడిపోయే మనిషికి, ఎలుగు బంటొకటి ఎదురౌతుంది. ఒకర్ని చూచొకరు జడుసుకుంటూరు; వెనక్కితిరిగి, ఎవరిదారినివాళ్ళు వెళ్ళిపోతారు.

"మన వేటగాళ్ళందరూ యుద్ధానికి బయల్దేరుతున్నారు మళ్ళీ అడవిజంతువులు పల్లెల్లోకి ప్రవేశించినా ప్రవేశించొచ్చు" అన్నాడు నికీతా విచారంగా.

•

ఉకమ్‌ఖాన్ నగరాన్ని చూచి ఆశ్చర్యపోయాడు ఇవాన్ ఇవానొవిచ్. ఇదివరకు తాను చూచినప్పటికంటే చాలా పెరిగింది; చాలా అందంగా వుంది. అతురాలా కేంద్రపట్టణంలా వుంది. ఎలా వుంటేనేఁ, యెక్కడా యుద్ధపు సూచిస్తూనే

యెక్కడవిన్నా. యేమివిన్నా. ఇవాన్ నిరుత్సాహ పడి పోయాడు.

"మిమ్మల్నిప్పుడెవరూ గుర్తుపట్టలేరు !" అన్నాడు లోగునోవ్. ఇద్దరూ దారులు చీలి, నగరంలో ఒకాఫీసు తర్వాతయింకొకాఫీసుచొప్పున అవసరమైనఆఫీసులన్నిటికీ వెళ్ళి, మళ్ళీహార్బరుదగ్గర కలుసుకున్నారు, స్టీము రెక్కబోయే ముందు.

వైద్యదళంలో లెఫ్టినెంట్ కలోనెల్ దుస్తులేసుకు న్నాడు ఇవాన్; సీనియొర్ బెటాలియొన్ కమిస్సార్ దుస్తుల్లో లోగునోవ్ వున్నాడు.

నికీతాతో కలిసి, సైనిక దుస్తులేసుకొచ్చిన డెనిస్ని, ఇవానూ గుర్తించలేక పోయాడు; లోగునోవూ గుర్తించలేక పోయాడు. పైకి తిరిగిన ఆ ముక్కూ, ఆ నీలికళ్లూ మట్టుకు మారలేదు; మిగతా మనిషంతా మారిపోయాడు.

"ఏమిటి కథ ! యిట్లా మారిపోయారు ?" అంటూ పరీక్షగా చూశాడు ఇవాన్; ఆ మార్పెక్కడున్నదో పట్టు కుందామని; "ఓహో ! నెత్తిమీదజుత్తు ! మరీ అంత శుభ్రం గానా ! ఆ వుంగరాలజుట్టు మరీ అంత యిదిగానా ?" అంటూ నవ్వాడు ఇవాన్.

"మొత్తం తీసేయించా" అంటూ తలమీదటోపీ తీసి చూపించాడు డెనిస్. నున్నగా చలిమిడి ముద్దలావుంది నెత్తి; వెంట్రుకన్నమాట లేదు. ముహాంకంటే యింకొక ఛాయ తెల్లగా పాలిపోయుంది. "ఏమిటనుకున్నారు మరి. సైన్యంలో పెళ్లి పెర్లకి ఉంగరాల జుట్టుండ గూడదు !" అన్నాడు.

[illegible] అక్కడే, మెట్లమీద, చతికిలబడ్డారు. [illegible] మూడువైపులా, గుర్రపునాడంలా వున్నై కొండలు.

మొండిరాళ్ళ కొండలు; శీతాకాలంలో దేశంమీంచి వొచ్చే గాలివిసురుకీ వేసవిలో సముద్రంమీంచి వచ్చే గాలివిసురుకీ తట్టుకుని నిలబడ్డకొండలు. రెక్కలు తెగిన పక్షుల్లా, అక్కడక్కడా, కొమ్మలులేని మొండిచెట్లు. సముద్రం చివర, ఇసుక పర్రపైన, కొండవాలుమీద యిళ్ళకప్పులు. ఆ యింటికప్పుల వెనక ఉకమ్‌ఛాన్ నగరం.

ఎంతచక్కని నగరం! ఎంతచక్కని దృశ్యం!

నీటిగ్రద్దలు చెవులు గింగురుమనేట్టు శబ్దం చేస్తున్నై. నీరు కదలకుండా, ముట్టెపైకెత్తి, అట్లాగే కదలకుండా తేలుతూ వుందొక సీల్ జంతువు. పైన గ్రద్దలుచేసే శబ్దాన్ని, నీటిలో 'నిలబడి' వింటోందది; ఒడ్డున నడిచే జనంవంక కళ్లు తిప్పి చూస్తోందీహడావుడి యేమిటా అని.

సంగీతం సంబరం. సీల్ జంతువు నీటిలోపలి కెళ్ళిపోయింది. మధ్యాహ్నమైపోయి చాలా సేపైంది. సూర్యకాంతి సముద్రంమీదపడి, కనుచూపుమేరవరకూ కాంతి రోద్దుపరచింది.

సముద్రం రేవులో ప్రక్కనే నిలబడి వుందొక పెద్ద స్టీమరు. సైనిక దుస్తుల్లోనూ, సామాన్య దుస్తుల్లోనూ, అనేక మందెక్కుతున్నారందులోకి. అప్తుల్ని సాగనంపేందుకని వొచ్చిన పిల్లలూ, స్త్రీలూ, పూలూ, పొట్లాలూ, కన్నీరూ తీసుకొచ్చారు తమతో.

పాటఒడరేవుమీదినుంచివిశాలాకాశంలోకిపయనం జేసింది:

ఆ రేయి ఆ రేవు
అతి శాంతముగ దోచె
అందాల కలవోలె
సందేశాలము గడిచె*

చక్కని సాయంకాలం. రేవునిండా, అప్పుడేవచ్చి లంగరేశిన ఓడలు. గాలిలో ఎగిరొచ్చి, నీటిమీద వాలిన నీటి విమానం. పోటుమీదున్న సముద్రం. సముద్రపు టలల సంగీతంతో మేళవించిన పాట :

ప్రియపురీ ! నీకిదే వీడ్కోలు వందనము
వేకువనే మనము ఎడబాటు నొందెదము
ఆ గట్టుపై మందహాసముఖి, ఆత్మసఖి
నిలిచి మెలమెల్లగా ఊగించు తనకరము.*

"చక్కనిపాట. బాగుంది. చాలాబాగుంది!" అన్నాడు డెనిస్. నీలిసముద్రంలా మెరసిపోతున్నై అతని నీలికనులు. పాటకు తగినట్టు పాడుతున్నారు. మా నటాషా గూడా పాడుతుంది ఆ పాట; దానికి వచ్చేశిందా పాట."

"అదృష్టవంతుడవయ్యా, డెనిస్!" అన్నాడు లొగునోవ్.

"నిజమే. నిజంగానే అదృష్టవంతుణ్ణి నేను. కాబట్టే వెళ్తున్నా యుద్ధానికి."

"మనం అందరం అదృష్టవంతులమే." అన్నాడు ఇవాన్ కాస్సేపాగి, మళ్ళీ "కనీసం మన జీవితాలకొక ఆశయమూ, అర్థమూ అంటూ వుంది. మనవి నిండు జీవితాలు." అన్నాడు.

ఇంకొక కొత్తపాట ప్రారంభమైంది; ఓడ రేవుమీది నుంచి విశాలాకాశం లోకి .... అందరూ నిశ్శబ్దంగా విన్నారా పాట.



తెలుగు విశ్వవిద్యాలయం

*మిత్రులు [illegible] మా [illegible] గారి [illegible]